ఓం శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః










శ్రీ యర్రా వెంకటస్వామి గారిచే

# వస్తుగుణదీపిక

శ్రీరస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణేనమః.

# వస్తుగుణదీపిక

అ

అంకుడు చెట్టు:—A species of Echites Antidysentericum సం॥కృష్ణకుటజ. దీనిని దిట్టి అంకుడు, తెల్లపాల, కొండజెము డనిన్ని అందురు. పాలకొడిసె కాయలవలె దీని కాయలును రెండేసి కాయలు గుత్తిగనుండి వానిచివరలు ఒకదానితోనొకటి గలసి యుండును. దీనిపువ్వులు తెల్లగ నుండును. దీని ఆకులు, పాలు మిక్కిలి వెగటుగ, కారముగనుండును; మిక్కిలి కాక జేయును. దీని ఆకులు కుష్ఠు, దద్దురు, కామెర, మొలగజ్జి మొదలగు చర్మరోగములు మానును. దీనిఆకులు 1 లేక 2 తో 3 లేక 5 మిరియములు కలిపి పొద్దుటపూటను పరగడుపున నమిలి మ్రింగవలెను. యిటుల వ్యాధి బలమునుబట్టి 10, 15, 20 లేక 40 దినములు పుచ్చుకొనిన వాతములు శ్వాసకాసలు హరించును.

అంగమర్దన:—Champooing or Rubbing హాసతను గలుగజేసి దేహమును పుష్టింప జేయును.

అంగారవల్లరీ:—కానుగచెట్టు చూడుడు.

అంగీ:—Long jacket or Gown దీనిని తొడుగుకొనుటవల్ల శ్లేష్మవాతముల క్షీణచును; రోమ పుష్టి జేయును. సర్వాంగములకు ఉష్ణమునిచ్చి కాపాడును. కాంతి, మృదుత్వము, బలము వీని నిచ్చును. దుమ్ము, గాలి, ఎండ వీనిబాధల నొందకుండ జేసి ఆరోగ్యము నిచ్చును.

అంజీరుపండు:—Ficus Carica. Eng. Figs fresh. సం* మంజుల అంజీర. హిం* అంజీర్. అనగా సీమమేడిపండు. దీనిని అంజూరుపండనియు నందురు. వేడిజేసి నీరుపెంచును; మృదువుపరచును; గుండెలకు, గొంతుకకు, ధాతువులకు, కార్జము (Liver) కు, గురదాల (kidney) కు, హృదయము (heart) కు బలమిచ్చును. క్షయ, దగ్గు, అజీర్ణము, కఫము, వికారము వీనిని పోగొట్టును. వీర్యవృద్ధి, దేహపుష్టి జేయును. బలమునిచ్చును; మంచి రక్తమును బుట్టించును; చెమటబుట్టించును. వీటిగుంజులో సిరకాను పంచదారను కలిపి యిచ్చిన బిడ్డల వగర్పుగల దగ్గు (bronchitis) నిమ్మళించును. పెద్దవారికి వగర్పు దగ్గులనున్ను పోగొట్టును. వీటిని పిసికి గడ్డలకు కట్టిన త్వరగా చీముపట్టి పగులును. దీని ఆకుల పసరును శ్వేతకుష్ఠును ప్రథమ దశలో పూసిన నయమగును. వీనిని అమితముగ దినిన పండ్లకు జబ్బుచేయును. దీనికి విరుగుడు షికంజిబీను.

అంజీరుపండు (ఎండినది):—(Figs dried) చలవజేసి ఆర్చును. దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి వీని నిచ్చును. అన్నమును జీర్ణముగావించును. గుండెలనార్చెడి రోగమును బోగొట్టును. కంఠమునకు, తెల్లదొబ్బ (lungs)కు మేలుజేయును; శుభ్రపరచును. ధాతువులకు, సమస్తేంద్రియములకు బలము జేయును. మూర్ఛ

పిత్తవాత రోగులకు మేలుచేయును. వేడిని, దాహమును అణచును; చెమట బుట్టించును; పొట్టను మృదువుపరచును; పొట్టలోని శ్లేష్మమును వెడలించును; విరేచనము గావించును. 40 దినములు వీనిని పెద్దజీలకర్ర (రూమీజీరా) తో తినిన హృదయమును చల్లబరచును; విచారమును పోగొట్టును; సంతోషమిచ్చును. వగర్పు, దగ్గు, గుండెలలోనొప్పి, గుండెలలో పుట్టెడు యితర వ్యాధులు వీనిని హరించును. కార్జము (liver) నకు బలము చేయును; సుద్దను తీసివేయును; నల్లదొబ్బ (Spleen) యొక్క వుబ్బును, మూలవ్యాధిని పోగొట్టును. గురదాల (Kidneys) నిస్సత్తువను, మూత్రబద్ధము వీనిని హరించును. బాదంపప్పు, పిస్తాపప్పు వీనితో తినిన నీరసపడ్డ దేహములకు బలముజేయును; బుద్ధిని హెచ్చించును; మెదడుకు సత్తువజేయును. అక్రోటుతో తినిన విషమును హరించును. అక్రోటుతో 40 దినములు తినిన పుంస్త్వమును హెచ్చించును; నడుమునొప్పిని పోగొట్టును. వట్టి అంజీరుపండ్లు తినినను పుంస్త్వమును హెచ్చించును. వీనిని పరగడుపున తినవలెను. తరుచు తినుచుండిన మలబద్ధప్రకృతి మారును. అమితముగ తినిన పండ్లకు జబ్బుచేయును. దీనికి విరుగుళ్ళు 1 అక్రోటు, 2 పెద్దజీలకర్ర, వీని మోతాదు 60 డ్రంలు.

అంజూరుపండు:—అంజీరుపండు చూడుడు.

అంతరతామర:— Pistia Stratiotes & Cassytha Filiformis (A water plant without any root to the ground swimming upon the surface of the lakes & c) సం॥ కుంభికా, వారిపర్ణి. హిం॥ జల్‌కుంభి. దీని యాకు రసము లేక కషాయము చప్పదనముగ కొద్ది తీపికలిగియుండును. వాతపైత్యమును, పైత్యమును, దగ్గును, తాకను, ఉబ్బసము నణచును. వీర్యవృద్ధిని,

ఆరోగ్యమునిచ్చును, మృదువుపరచును; పొట్టకు బలమిచ్చును; అతిసారము, పురాణ విరేచనములు, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము వీనిని నివృత్తించును. మేహశాంతియు చలవ జేయును. రసముయొక్క మోతాదు పూటకు 2, 3 తులములయెత్తు కషాయపు మోతాదు పూటకు 3, 4 తులములయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నివ్వవలెను. దీని యాకును నేతితో వెచ్చజేసి గుదస్థానమందు గట్టిన మూలవ్యాధిబాధ శమించును. దీనిని కాల్చి చేసిన బూడిదను నీళ్ళలో గలిపి పూసిన తామర నయమగును.

అంధలము:—Palanquin. అనగా పల్లకీ. దీని నెక్కిన నేత్రములకు చలవ జేయును. దేహపుష్టి, ఆప్యాయత, కాంతి వీని నిచ్చును; త్రిదోషముల శమింపజేయును. శ్రేయస్కరమైనది; కొద్దిగ బడలిక జేయును. యిందుకు పరిహారము అంగమర్దన.

అందుగ చెట్టు:—Boswellia Serrata. Eng. Indian olibanum సం॥ శల్లకీ. కుందరుకీ హిం॥ శలాయీ. దీనియొక్క జిగురును అందుగపిసును యనిన్ని ఫిరంగిసాంబ్రాణి యనిన్ని, కుందురుష్కమనిన్ని యందురు. దీనిచెక్క ఒగరుగ నుండును. చలవజేయును. కఫము, పైత్యప్రకోపము, జ్వరము, ఉన్మాదము, తాపము వీనిని హరించును. వీర్యవృద్ధిజేయును. దీని కాయ లేతది, చేదుగ స్వాదుగనుండును. శ్లేష్మమును హరించును. పైత్యముజేయును. చూర్ణపుమోతాదు అణా మొదలు బేడయెత్తువరకు, కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములవరకు.

అందుగ పిసును:—ఫిరంగిసాంబ్రాణి చూడుడు.

అంబరు:—Ambra Grsea Eng Amarsris Ambergris సం॥ అంబరు సుగంధ. హిం॥ అంబర్. యిది తిమింగలము (sherm-

whale) అను చేపకడుపులో బుట్టు ఒకవిధమైన పదార్థము. ఒక ముద్ద ఆకారముగ ఎర్రసముద్రము (red sea)లోను ఆఫ్రికా మొదలగు సముద్రముల వడ్డులకు కొట్టుకువచ్చును. ఇది నలుపు, ఎరుపు కలసినరంగు (darkish brown) గాను యితర రంగులు కలసినరంగులుగాను యుండును. అదొక విచిత్రమైన సువాసనగలిగి కస్తూరివాసనను బోలియుండును. ఏవిధమైన రుచి యుండదు. (tasteless) వేడినీళ్ళలోను క్రొవ్వనూనెలు వేడి సారాయి (Alcohol) లోను కరుగును. వేడిజేయును. వాతశ్లేష్మములను, మూర్ఛ అపస్మారము, యీడ్పులు, నరములబలహీనత, విషమజ్వరము, జ్వరాధిక్యమువలన స్మారకము లేకపోవు సన్నిపాతజ్వరములు, నిరాశ చేసిన కలరా, ప్లేగు మొదలగు అంటువ్యాధులయందును గొప్పగా పనిజేయును. హృదయమునకు బలము వీర్యవృద్ధి నిచ్చును. దీనిని కస్తూరివలె చిన్న మోతాదులుగా వాడవలయును. మోతాదు 1 మొదలు 4 గులిగింజలఎత్తువరకు. తిమింగలము, చేపమాయను అంబరని కొందరి అభిప్రాయము. మరియు ఒకజాతిచెట్టు జిగురునకు అంబరందురు. యిది చాలా సుగంధము గలిగియుండును. దీనితో అత్తరువులు, అగరవత్తులు మొదలగునవి చేయుదురు.

అంబలి:—Ragi gruel. చోడిపిండితో చేయబడినది. చిక్కగ, మృదువుగ నుండును. మేహపైత్యరోగముల నణచును. కఫము, చలవజేయును; పైత్యశూలలను పోగొట్టును; రుచిబుట్టించును; ఆకలిదప్పికల నణచును; విరేచనము జేయును; రక్తపైత్యమును పోగొట్టును. మూత్రము నెక్కువజేయును, మేహశాంతిజేయును; పలచగా జేయబడిన అంబలి మజ్జిగచేర్చిగాని, చేర్చకగాని ఉదయపుపూటలను కాఫీకి బదులుగా సేవించిన పైత్యముహరించిఆరోగ్యముగనుండును,

ఈ అంబలి పలచగా కాచి పాలుగాని, మజ్జిగగాని చేర్చిగాని చేర్చకగాని రోగులకు ఆహారముగ నివ్వనగును.

అంబాళపుచెట్టు:—Spondias Mangifera. Eng. Hogplum wild mango సం॥ ఆమ్రాతక, కపిమాత, తనుక్షీరి, హిం॥ అంబాడా. దీనిని పుల్లమామిడి అనియు, అమడమామిడి యనియు నందురు. ఇది పర్వతప్రాంతములయందు అడవులలో పెరుగును. దొడ్లలోగూడ వేసి పెంచుదురు. దీని కాయలు గుత్తులుగుత్తులుగా గుండ్రముగ కోలగానుండును. దీని చిగురుటాకు పుల్లగ మనోహరముగ నుండును. మలబద్ధము జేయును; రుచి బుట్టించును; వీర్యవృద్ధి జేయును. దీని ఆకురసము, చెక్కరసము, గ్రహణి, అతిసారములను కట్టును. పైన పట్టువేసిన చెవిపోటు నయమగును. దీనిపండ్లు సుమారు కోడిగ్రుడ్లంత వురవు, ఆకారము గలిగి యుండును. గిల్లిన పాలుగాగును. కొద్దిగతీపి, పులుపు, వగరు రుచులుగలిగి యుండును. చలవజేయును; రుచిబుట్టించును. జఠర దీప్తినిచ్చును; వీర్యవృద్ధి, రక్తవృద్ధి, బలముజేయును. వాతపైత్యములను శమింపజేయును. కండ్లమెరుపులను పోగొట్టును. పచ్చికాయగాని, ఎండుకాయగాని తినిన బాణము గ్రుచ్చుకొనిన విషము, గాయము మాన్పును. కఫము, గురుత్వము జేయును. దీనికి విరుగుడు శొంఠి చూర్ణము గలిపిన ప్రాచినీళ్ళు.

అకాలనిద్ర:—Untimely Sleep దీనివలన మేహము, జ్వరము, పీనస, శిరోరోగము, వాపు, ఎక్కిళ్ళు, చెవులు వినబడకపోవుట, అగ్నిమాంద్యము గలుగును.

అకాలస్నానాంతరధూపము:—Fumigation after untimely bathing అకాలమందు అనగా సాయంకాలము లేక రాత్రివేళ స్నానముచేసినప్పుడు కృష్ణాగరు లేక సాంబ్రాణిధూపము ఒంటికి,

శిరస్సుకు పట్టించినచో శిరోరోగము, పడిసెము మొదలగు వానిని రాకుండ జేయును; సౌఖ్యముగ నుండును.

అక్కలకఱ్ఱ:—Anacylus Pyrethrum - Pyrethrum Radise Eng. Pellitoryroot. సం॥ ఆకారకరభ, ఆకల్లక. హిం॥ అకర్ కరా. ఇదియొక చెట్టువేరు. కారముగ నుండును. నాలుకను చిమచిమలాడ జేయును; కాక జేయును. దీని చూర్ణము లేక కషాయము, అరుచి, శీతపైత్యము, త్రిదోషములు, ఉబ్బు, పాండురోగము, దగ్గు, పగర్బుగల దగ్గు (bronchtisi), విదాహము వీనిని బోగొట్టును. దీపనకారి (stimulant) నరములకు సత్తువ జేయును, చెమట బుట్టించును, గుండెలను శుభ్రపరచును; హృదయమునకు, బుద్ధికి బలమిచ్చును పక్షవాతము, మూతి వంకర పోవడము, తలనొప్పి, పార్శ్వపునొప్పి (hemicrania), మూర్ఛ, మరిడిజాడ్యము (Cholera), వాత మేహ వాతనొప్పులు, మలుగు నొప్పి (sciatica), ఉదరరోగము వీనిని హరించును. అజీర్ణముగల అగ్నిమాంద్యమును పోగొట్టును. కడుపులోని వాతమును వెడలించును. దేహములోని దుష్టద్రవకూటమిని కరగించును; మూత్రము గావించును, విరేచనము జేయును, వీర్యవృద్ధి జేయును; ఋతురక్తమును జారీచేయును. దీనిని నమలిన నోటివెంట నీరూర జేయును. తన్మూలమున పంటినొప్పి, తలనొప్పి, రుద్రవాతము (apoplexy), పురాణ శిరోవాతములు, నేత్రరోగములు, ముఖరోగములు, ముఖవాతములు, నొప్పులు వీనిని పోగొట్టును. అక్కలకఱ్ఱ, సన్నరాష్ట్రిము, శొంఠి వీని తేలిక కషాయమిచ్చిన పక్షవాతము. దోషజ్వరము (Typhus fever), సన్నిపాత జ్వరము, వీనిలో పుట్టెడుమాంద్యము, మమత, నీరసము వీనిని పోగొట్టును, ప్రాణమునకు సత్తువనిచ్చును, దీపనము గలిగించును.

గెడ్డలకు దీని గంధము వేసిన వాని నణగగొట్టును లేదా చీముపట్టి పగులజేయును. దీనిగంధము ఒంటిపైని బూసిన మంటబుట్టి చర్మమును యఱ్ఱబడ జేయును. దీనిగంధము నుదుటను లేక నొప్పిగల ప్రక్కను పూసిన తలనొప్పి, పార్శ్వపునొప్పి మానును. దీని కషాయము పుక్కిలించిన దంతరోగములు, గొంతుక రోగములు, నాలుక మొదటనుండు రెండు మాంసగ్రంధుల రోగము నివారణమగును. దీని చూర్ణము ఆలివు (Olive) నూనెతో కలిపి ఒంటికి పూసిన అధికమైన చెమటపుట్టించి జ్వరమునురాకుండ జేయును; లేదా తగ్గించును. నొప్పిపన్ను లేక పుప్పిపన్ను పైన దీనిని నూరిపెట్టిన లేక చూర్ణము పెట్టిన వెంటనే నొప్పి నయమగును. దీని కషాయమిచ్చిన పురాణ వగర్పు దగ్గులు (bronchitis) నిమ్మళించును. శ్లేష్మమును పలచన జేయును, వెడలించును. దీనిని చిలుకకు తినిపించిన త్వరగా మాటలాడును. చూర్ణపు మోతాదు 2 చిన్నెలు. విరేచనము అవుటకు యిచ్చే మోతాదు 90 గోధుమగింజలయెత్తు. తేలిక కషాయపు మోతాదు 2 మొదలు 4 తులముల యెత్తువరకు.

అక్కుళ్ళుధాన్యము:—A sort of paddy వీనియన్నము చలువను పోగొట్టును. పైత్యము, మేహమును వృద్ధిపరచును రుచిగానుండును. తేలికగ జీర్ణమగును. బలము తక్కువైన ధాన్యము. ధాన్యములు చూడుడు.

అక్రోటు:—Aleurites Moluccana, Juglans Regia. Eng. Indian Walnut-సం॥ అక్షోట. హిం॥ అక్రోట్, అఖరోట్. ఇదియొక కాయ గింజలోని పప్పుజాతి. వేడిజేసి ఒంటినీరు నార్చును. ధాతువులకు, ముంతగుండెకు, పొట్టకు బలమిచ్చును. వీర్యవృద్ధి జేయును; నులిపురుగులను చంపును; కడుపులో తిప్పడమును

కట్టును. మనోల్లాసము నిచ్చును, స్మృతి తెచ్చును, విరేచనము జేయును. బలము, ఆయుర్వృద్ధి నిచ్చును. పొట్టను మృదువు పరచును. కడుపులోని జిలుబును హరించును. పుంస్త్వమును హెచ్చించును. జీర్ణశక్తి నిచ్చును. హృదయమునకు, మెదడునకు, శిరస్సునందు యింద్రియశక్తులకు బలమిచ్చును. వృద్ధులకు సత్తువ జేయును. ద్రాక్ష, అంజూర పండ్లతో తినిన నీరస దేహులకు బలము జేయును. వాతరోగులకు మేలు జేయును. పాత కాయలలోని పప్పు, కాక తత్వముగలవారికి కొద్దిగ జబ్బుచేయును. అనగా కాకను హెచ్చించును. నాలుకపైన పొక్కులు పొక్కును. దీనికి విరుగుళ్ళు 1 పుల్ల దానిమ్మ పండు, 2 గసగసాలపిండి గలిపిననిమ్మపండ్ల రసము, 3 ఉప్పు.

అగరు; అగరుతైలము:—కృష్ణాగరు చూడుడు.

అగరుశొంఠి:—పాతతీగ చూడుడు.

అగ్ని కాపడము:—Fomentation కఫవాతములను, శీతలమును, శూలలను పోగొట్టును. ఆమము, నేత్రరోగము, పైత్యము వీనిని హెచ్చించును. విరేచనము చేయును; కడుపుకు ఆముదము చమిరి అరిచేతులను అగ్ని చేత, వెచ్చజేసి కాపడము పెట్టిన శీఘ్రముగ విరేచనము జేయును. శూలనొప్పు లణగును.

అగ్నివేంద్రపుచెట్టు:— Ammannia Vesiccatoria, A. Baccifera సం॥ దావాగ్ని, అగ్నిగర్భ, అల్పదహనా, హిం॥ డాడ్ మారి. దీనినే అజ్ఞానపాకమనియు, అగ్నిజ్వాల యనియు నందురు. దీని ఆకు వాతమును, శ్లేష్మమును హరించును. దీని వేరు చూర్ణము మేహమును హరించును. దీనిఆకు మిరియాలతో నూరియిచ్చిన చలి జ్వరమును హరించును. దీని ఆకును పులుసువేసి వండి అన్నముతో తినిన చలిజ్వరము, మన్యపుజ్వరములు, హరించును. దీని ఆకు రసముతో బియ్యపుపిండి వుడికించి గెడ్డలకు కట్టిన పక్వపరచి పగుల

గొట్టును. దీని ఆకు చూర్ణము 4 మొదలు 8 గురిగింజలవరకు వేనతో నిచ్చిన శ్లేష్మముతగ్గును. దీని చిగుళ్ళు 5, మిరియములు 3 కలిపి నూరి ఒక మాత్రగాజేసి ఉదయపుపూటల నిచ్చిన విషమజ్వరము కట్టును. దీని రసము చోళ్ళను నూని పట్టువేసిన వాతపునొప్పులు నయమగును. దీని ఆకు నూరి తీసని వాతనొప్పులకుగాని, జ్వరములకు వెన్నునగాని నొప్పియున్నచోటగాని పట్టువేసిన వానిని హరించును, పొక్కు పొక్కజేయును. చూర్ణపు మోతాదు 1, 2 చిన్నముల యెత్తు. నూరిన ఆకుముద్ద మోతాదు యింతుపకాయంత.

అజామోదచెట్టు:—Carum Roxburghianum, Apium Involucratum. సం॥ అజగంధా, విగంధిక, హిం॥ అజమోద్. దీని ఆకు లేక కషాయము,రసము ఊపిరిగొట్టునొప్పి, కడుపుఉబ్బు, అరుచి, క్రిమిరోగము, వాతము, గుల్మము, శూల, మూత్రకృచ్ఛము వీనిని హరించును. జఠరదీప్తి, వీర్యవృద్ధి నిచ్చును. రసపు మోతాదు పూటకు 2-3 తులములఎత్తు. కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు.

అజామోదవిత్తులు :— Carum Roxburghianum, Apium Involucratum-seeds of. సం॥ మోద, అజమోద, హిం॥ అజమోద్. వీనిరసము లేక చూర్ణము కషాయము అష్టగుల్మలు, కఫవాతము మలమూత్రబద్ధము, శూల, ఆమజ్వరము; శోష,చర్ది, ఎక్కిళ్ళు వీనిని జయించును. అగ్నిదీప్తినిచ్చును. హృదయమునకు మేలుజేయును. దీనిని ఉప్పుగలిపినమిల్రిమింగిన కడుపునొప్పి, ఊపిరిగొట్టునొప్పి, శూలతగ్గును అజామోదము. దుంపరాష్ట్రిము,శొంఠి గలిపి నీళ్ళతో నూరి రసముదీసి పొంగించిన రసముబోసిన చంటిబిడ్డల కఫము,కడుపుబ్బు నయమగును, రసముయొక్క మోతాదు

౨, ౩ తులములయెత్తు. చూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు పావలా యెత్తువరకు.

అటుకమామిడి:—Trianthema Monogyna Eng. Spreading Hogweed. సం॥ స్వనాడిక, రక్తపుష్ప, కుండలచ్ఛద. హిం॥ సాంఠ్. దీనినే అంబటిమాటికూర యందురు. ఇది గలిజేరులో యొక జాతి. ఇది తెలుపు, ఎఱుపు రెండుజాతు లుండును. దీని వేరు రసము, లేక కషాయము, లేక చూర్ణము చేదుగనుండును, విరేచనము జేయును, మూత్రము గావించును, క్రిమిని హరించును. శ్లేష్మమును వెడలించును, దగ్గు వగర్పుగల దగ్గు (Bronchitis) ఉబ్బసదగ్గు (asthma) దారుణమైన ఉబ్బురోగము, ఉదరము, సెగరోగము, ఈడ్పులు (Spasms) వీనిని హరించును. బలము జేయును. రసము యొక్క మోతాదు పూటకు తులమెత్తు, కషాయపు మోతాదు ౨, ౩ తులములయెత్తు, చూర్ణపు మోతాదు సుమారు బేడెత్తు (teaspoonful) పయిన చెప్పిన రసము మొదలయినవి మోతా దెక్కువ యయినను, కొన్నితత్వములకు మోతాదుగ నిచ్చినను వికారము పెట్టి వమనము జేయును. సుమారు 6 తులముల యెత్తు చింతపండు పులుసు త్రాగించిన వికారము, వాంతికట్టును, వేరు బల మగు వమనకారి. దీని సమూలరసముగాని కషాయముగాని సెగ రోగులకు మూత్రకారిగ నివ్వవచ్చును. ఉబ్బుగలచోట దీనిసమూల రసము పూసినను సమూలకషాయముతో గడిగినను, సమూల ముతో చేసిన తైలము పూసినను ఉబ్బుహరించును. ఆకు నూరి కట్టిన గెడ్డలు హరించును, పగులును. సమూలకషాయముతో నేలవేము, శొంఠి వీనిచూర్ణము గలిపి యిచ్చిన ఉబ్బురోగము (anasarca) కుదురును. మోతాదు 3, 4 తులముల యెత్తు, ఎండుసమూల తేలిక కషాయమిచ్చిన శ్లేష్మహరము ఈడ్పులు

కట్టును (antispasmodic), బలముచేయును. పైనచెప్పిన తేలిక కషాయములో (Nitr te of potash) వేసి యిచ్చిన ఉబ్బు వ్యాధి హరించును. తేలిక కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు. దీని పచ్చి సమూలమును ఉప్పువేసి వండి గోధుమ రొట్టెతో పెట్టిన సాధారణమైన ఉబ్బులు హరించును. వేరు నూరి నీళ్ళలో కలిపి ఆనీళ్ళతో పాదములుకడిగిన నీరసము ( generl debility ) మానును. దీనిని సేవించు దినములలో పొగత్రాగకూడదు.

అటుకులు:—Rice wetted & flattened. సం॥ చిపిట, చిపిటక. హిం॥ చేలా, చిఉరా. ఇవి గురుత్వము, కాక జేయును. ఆకలి నివారణ గావించును. కడుపునొప్పి, ఆమసూల, అంగశూలలను గలుగజేయును. పుంస్త్వమును, బలమును ఇచ్చును. మలబద్ధము, కఫము, అగ్నిమాంద్యము జేయును అపథ్యమాయినవి. విరుగుళ్ళు 1 ఓమము, 2 నీళ్ళు, 3 ఉప్పు, 4 సైంధవలవణము.

అటుకులుచద్దివి:—do. soaked in tamarind water and seasoned. అనగా పులుసులో వేసి పొగచినవి. వాతము, శీత పైత్యము జేయును. గురుత్వముగనుండును, విరేచనబద్ధము గావించును. దీనికి విరుగుళ్ళు అటుకులు చూడుడు.

అటుకులు నేతిలో వేయించినవి:—do. fried in ghee రుచిగనుండును, మనోవికాసతను, తృప్తిని, బలమును ఇచ్చును, గురుత్వము, విరేచనబద్ధము, కాక జేయును. దీనికి విరుగుళ్ళు అటుకులు చూడుడు.

అటుకులు పాలలో వేసినవి:—do. soaked in milk జిగటగనుండును. వాతమును హరించును, బలము, వీర్యపుష్టి జేయును, కాంతినిచ్చును, విరేచనబద్ధము జేయును, దీనికి విరుగుళ్ళు అటుకులు చూడుడు.

అట్లు (పెసరవి):—Roasted cakes made of green gram వీనిని పెసరట్లందురు. అల్లము, జీలకర్ర వగయరాలతో చేర్చి చేసినవి రుచిగానుండును. ఆకలిని శమింపజేయును. మేహశాంతి పైత్యశాంతిని జేయును. బలము, పుష్టినిచ్చును. నేతితో చేయబడినవి మిగుల ఆరోగ్యముగను పత్యకరముగ నుండును.

అట్లు (మినపవి):—Roasted cakes made of black gram వీనిని దోసెలని అందురు. ఇవి స్వాదుగ రుచిగాను డును. మేహము నణచును, మేహవాతమునకు మంచిది, విరేచనము గావించును, బలము, వీర్యపుష్టి, గురుత్వము జేయును, శ్లేష్మమును పెంచును. దీనికి విరుగుడు తేనె.

అట్లు (మెంతివి):—Roasted cakes made of fenugreek మిక్కిలి మేహశాంతి, దేహపుష్టి జేయును, గ్రహణిరోగులకు మంచిది, ఆరోగ్యకరమైనవి, విరేచనబద్ధము జేయును.

అడవి అరటిచెట్టు:—అరటిచెట్టు చూడుడు.

అడవి అల్లము:—Zingiber Casumunar & Purpureum సం॥ వవఆర్ద్రిక. హిం॥ వనఆదరక్. దీనిని కారు అల్లమందురు. యీ అల్లము అనేక విధమైన కర్పూరము జాజికాయ వాసన గలిగియుండును. దీనిని పుచ్చుకొనిన అజీర్ణము, అగ్నిమాంద్యము, వాతపైత్యము శూలవిరేచనములు వీనిని నివారణజేయును. మామూలు అల్లము గుణములు గలియుండును.

అడవివులవలు:—Dolichos unifloms wild horse gram wild సం॥ అరణ్యకులత్థికా, కులత్థాంజన, హిం॥ చాక్సు-వన్ కుర్థి-వీనిని కలుగోటిగింజలందురు. యీగింజలు నల్లఉలవలను బోలి మెరుగు గలిగియుండును. యీ గింజలచూర్ణము లేక గంధము-కండ్లకలకలు, ఎరుపులు, పొరలు మొదలగు నేత్రరోగములు హరించును. కంట్లో

నలక పడినప్పుడు యీగింజను శుభ్రపరచి నలకయున్న స్థలమున ఎక్కించిన నలకను కొలికిలోనికి తీసుకువచ్చును. యీగింజలుచూర్ణముగాని కషాయముగాని మలమూత్ర బద్ధము, మేదో రోగము, మొలకలుగల మూలవ్యాధి, వ్రణములు, దురదసర్పి, ఎక్కిళ్ళు, శ్వాస, కఫము, పైత్యము వీనిని బోగొట్టును. యీ విత్తులు నీళ్ళతో నూరినముద్ద రాత్రి పరుండబోవునపుడు కండ్లపైన వేసి కట్టిన కండ్ల ఎరుపులు, నీరుగారుట మొదలగునవి నయమగును.

అడవి కంద —Dracontium Polyphyllum. సం॥ సూరణ, అర్శోఘ్న. హిం॥ వనసూరేణ్, నీళ్ళలో వుడకబెట్టి ఆ నీళ్ళు పారబోసి కూర వండుకొనిన రుచిగ నుండును. దీని దుంపను నూరి కట్టుకట్టిన వాత, మేహావాతనొప్పులు, వాపు హరించును. దీని కూరగాని, పచ్చడిగాని శాక జేయును, పొట్టలోని వాతమును వెడలించును, మూలవ్యాధి నణచును. దీపనము గలుగును (Stimulant), శ్లేష్మమును వెడలించును. దుంపపైన మన్నుబూసి దానిని కుమ్ములో లేక నిప్పులపైన కాల్చి దుంపను దీసి దానిలో కొద్దిగ నూనె ఉప్పు గలిపితినిన రక్తముపడే మూలవ్యాధి నయమగును.దుంప పలుచని చక్రములుగ గోసి యెండించి చూర్ణము జేసి యిచ్చిన మూలవ్యాధి, గుల్మము, ఉదరము, కఫము, క్రిమి, దేహస్థౌల్యము, వాతము, శ్లేష్మము, ఉబ్బసదగ్గు, ఈడ్పులు (Spasms) వీనిని పోగొట్టును, అగ్నిదీప్తినిచ్చును; రుతురక్తమును జారీచేయును; జాడ్యముపడి లేచినవారికిచ్చిన త్వరగా బలముచేరును, పొట్టలోని వాతమును వెడలించును. దీనిదుంపయును చింతాకును ధాన్యపు ఉమకయును వేసి నీళ్ళతో ఉడికించి యాదుంపను పులుసువేసి కూర వండిపెట్టినను రక్తముపడెడు మూలవ్యాధి మానును. దుంప ఉడికించి కట్టిన విషపురుగులు (insects) తేలు మొదలగువాని విషము

హరించును. గెడ్డలకు కట్టిన త్వరగా పక్వమైపగులును. కండ్లకు కట్టిన నేత్రరోగములు మానును, రక్తమూలముగలవారు తినిన విరేచనము చేయును. చూర్ణపు మోతాదు పూటకు 2, 3 అణాల యెత్తువరకు దీనికూర గర్భిణీస్త్రీలు తినిన గర్భస్రావము గలుగును, దీనికూర కాక జేయును, గురుత్వముగనుండును. దీనికి విరుగుళ్ళు కంద చూడుడు. అడవికంద దొరకని యెడల కంద వాడవచ్చును. మామూలు కందకన్నా పై గుణములలో చాలావరకు కలిగి యుండును.

అడవికాకరకాయ:— Green fruit of Momordica Cherantia-wild variety of సం॥ వనకటిల్ల. ఇది మిక్కిలి కాక జేయును, త్రిదోషములను, విషములను హరించును. నోటియందు నీరూరడమును, కాస, శ్వాస, మూలవ్యాధి, క్రిములు, కుష్టువు, వ్రణములు వీనిని హరించును.

అడవికోడి:—కారుకోడి చూడుడు.

అడవిగగ్గెర:—Ocimum Ballatum-wild variety of. సం॥ కపిత్థార్జుక, సుముఖ, గరఘ్నిక. అనగా అడవి తులసి. దీని వేరు, ఆకు రసము కారముగనుండును. మిక్కిలి వేడిజేయును. తాపము బుట్టించును, శ్లేష్మము, వాతము, జ్వరము, విషము శ్వాసకాస, క్రిమి, దుర్గంధము, రక్తపైత్యము, పార్శ్వశూల, ఉబ్బు వీనిని బోగొట్టును, నిద్రదెచ్చును, బుద్ధివికాసతి కలుగజేయును. గగ్గెర నల్లగగ్గెరలకు ఇవే గుణములు, మోతాదు 2, 3 తులములఎత్తు.

అడవి గోధుమలు:—Coi . Barbata. Eng. wild wheat. సం॥ గవేధుకా. వెగటుగనుండును. వాతమును, కఫమును, ఉబ్బు, పాండువు హరించును. హృద్రోగము, మూత్రకృచ్ఛము నణచును.

అడవిచమ్మ:—A sort of wild been దీని ఆకురసము కర్ణరోగములను బోగొట్టును. దీనికాయ రుచిగానుండును గాని మిక్కిలి పైత్యము జేయును.

ఆడవిచెరుకు:—Saccharum Offcinarum-wild variety of- Eng. Sugarcane wild. సం* వేణునిస్వన. వనయిక్షు. మధురముగ నుండును. వీర్యవృద్ధి, బలము నిచ్చును. మేహాము, శ్లేష్మము, క్షయ వీనిని హరించును. ఆమవృద్ధిని జేయును. దీనికి విరుగుళ్ళు 1 సోపు 2 అల్లము.

అడవిజీలకర్ర:— Cuminum Cyminum. Eng. Wild Cummin Seeds. సం* వనజీరా, అరణ్యాజీరా. వీనిని విషకంటకాలనియు, చేదుజీలకర్రయనియు అందురు. ఇది జీలకర్రవలె కోలగనుండును, మిక్కిలి చేదుగనుండును. దీనిచూర్ణము లేక కషాయము పైత్యము, కాక జేయును, వీర్యవృద్ధి నిచ్చును, జఠరాగ్నిని హెచ్చించును, జలుబు, కాసశ్వాస, శ్లేష్మము, వాతము, సన్నిపాతము, అభిఘాత జ్వరము వీనిని హరించును, క్రిమిహరమైనది, సర్వవిషములను పోగొట్టును. దీని తేలిక కషాయము, దగ్గును, కడుపుబ్బును హరించును. కషాయపు మోతాదు 4 లేక 5 తులములు. చూర్ణపు మోతాదు వరహాయెత్తు చొప్పున రెండుపూటల నివ్వవలెను.

అడవితులసిచెట్టు:—అడవి గగ్గెర చూడుడు.

అడవిద్రాక్ష:—Vitis Indica. Eng. Indian wild wine. చలవజేసి ఆర్చును, రక్తమును శుభ్రపరచును; వేడిని, దాహమును అణచును, రోగము రాకుండ దేహమును కాపాడును; కాక ఉబ్బును తీసివేయును. దీనిని నీళ్ళతో గంధముతీసి తలకు పట్టువేసిన తలనొప్పి శమించును. దీనిపొగబట్టిన పడిశభారము మానును. దీనివేరు చూర్ణము 1 మిస్కాలు సారాయిలో కలుపుకొని త్రాగిన

మొడల మంచినిద్రవచ్చును. దీనిరసము పొంగించి చెవిలో బోసిన చెవినొప్పి నిమ్మళించును. దీని ఆకురసము కండ్లలోపిండిన కాంతి నిచ్చును. దీనిని నీళ్ళలోకాచి ఆనీళ్ళు పుక్కిలించిన గొంతుకలోను నోటిలోను అయ్యేపొక్కులు హరించును. దీనిని అధికముగ పుచ్చుకొనుటవల్ల మూత్రపుసంచికి నష్టముజేయును. దీనికి విరుగుడు పటికి పంచదార. చూర్ణపుమోతాదు 1 మిస్కాలు. కషాయపు మోతాదు ½ మిస్కాలులు.

అడవినాభి:—పొత్తిదుంపచూడుడు.

అడవినిమ్మ:— Atalantia Monophylla. Eng. wild lime సం॥ అటవిజంబీర. దీనిని కొండనిమ్మ అనిన్నీ అందురు. దీని కాయలు పుల్లగా దిరిచేదుగ రుచిగానుండును. వీని పచ్చడి జ్వరములయందు పథ్యకరము, రుచిని ఆకలిని బుట్టించును, వీనినుండి తీసిన తైలము మేహవాత నొప్పులను, పాతనొప్పులను హరించును.

అడవినీలి:—Indigofera Paucifolia. దీని ఆకురసము లేక సమూలకషాయము అన్నిజాతులు విషములను హరించును మరియు దీనికి నీలిచెట్టు గుణములు గలిగియుండును. నీలిచెట్టుచూడుడు.

అడవినువ్వులు:—Wild gingily seeds. మూత్రమును గావించును, అగ్నిదీప్తిని, బుద్ధిబలమును ఇచ్చును, ధాతు క్షీణము జేయును.

అడవిపంది:—Wild Hog. దీనిమాంసము ఊరపంది మాంసముకన్న త్వరగా జీర్ణమగును, చమురుగలిగి రుచిగా నుండును, గురుత్వము, అగ్నిమాంద్యముజేయును, బలము, కాంతి నిచ్చును, క్షయరోగము, పైత్యము వీనిని బోగొట్టును, వీర్యపుష్టి జేయును, చెమటబుట్టించును, మూత్రమును గావించును, దుష్టవ్రణములను బుట్టించును, మూర్ఛరోగులకు మిక్కిలి అపథ్యమయినది. దీనికి

విరుగుళ్ళు 1 యవక్షారము, 2 చల్ల, 3 తరవాణి. అడివిపంది వెంట్రుకలధూపమువలన పిశాచబాధ నివర్తించును.

అడవిపంది నెయ్యి:- Fat of wild Hog. అనగా అడివిపంది చమురు రుచిగా నుండును, లింగపుష్టి, వీర్యవృద్ధి, బలము జేయును. విరిగిన అవయవమును అతుకుకొన జేయును. చలవను, వాతమును పోగొట్టును మర్దనవలన నరములకు సత్తువ జేయును, వాతనొప్పులను హరించును. దీనిని లోపలికి ఆగాకరదుంప చూర్ణముతో నిచ్చిన మూత్రరోగము నివర్తించును. మోతాదు 1, 2 తులములయెత్తు.

అడవిపసుపు:—Curcuma; Aromatica - C Songa (wild) Eng. wild turmeric. సం॥ శోలి, వలహరిద్రా. హిం॥ జంగిలీహాలది. దీనిచూర్ణము లేక కషాయము కారముగ, చేదుగనుండును, కాక జేయును, అగ్నిదీప్తినిచ్చును. విషము, శ్వాసకాసలు, ఎక్కిళ్ళు వీనిని హరించును. కుష్ఠు, వాతరక్తము నణచును. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 చిన్నములయెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 5 తులముల యెత్తువరకు.

అడవిపావురము:—Wild Pigeon. దీని మాంసము కాక జేయును. పక్షవాతమునుబోగొట్టును. వీర్యపుష్టిని, బలమునుఇచ్చును, త్వరగా జీర్ణమగును, వాతరోగులకు, క్షయరోగులకు పథ్యముగ నుండును, కాక దేహులకు నష్టము జేయును. దీనికి విరుగడు సిరకా. వీనిపిల్లల మాంసముమిక్కిలి కాక జేయక దేహసౌఖ్యమిచ్చును, పుంస్త్వమును హెచ్చించును, వీర్యవద్ధి జేయును. దీనిరక్తము పక్షవాతము గలిగిన భాగములకు రాసిన త్వరలో వాతమును హరించి నరములకు సత్తువగలుగును. దీనిరెట్ట పక్షవాతమును పోగొట్టును, పావురమును పాడుదు.

అడవిపిచ్చుక:—Wild Sparrow. దీనిమాంసము చమురుగలిగి రుచిగానుండును. వాతము, రక్తపైత్యము వీనిని శమింపజేయును. శుక్రమును, శ్లేష్మమును పెంచును, గురుత్వముజేయును. దీనికి విరుగుడు సిరకా.

అడవిపొన్న:—Rhizophora Microbata. దీని మానుచెక్క శొంఠితోగాని పిప్పళ్ళతోగాని పన్నీరుతోగాని నూరియిచ్చిన అతిమూత్రము కట్టును. మోతాదు అరతులం మొదలు తులమెత్తువరకు.

అడవిపెసలు:—Phaseslus Mungo-wild variety of (wild green gram) సం॥ వనముద్గ, శాకముద్గ. రుచిగనుండును, చలవజేయును. వాతరక్తము, పైత్యము, తాపము, నులిపురుగులు వీనిని పోగొట్టును. కఫము, శుక్రము వీనిని వృద్ధిజేయును. మరియు వీనికిని ఊరపెసల గుణములు గలిగియుండును.

అడవిపొట్ల:—చేఁదిపొట్ల చూడుడు.

అడవిపోక:—Wild betel nut. స్వారస్యముగ నుండదు. అరుచి బుట్టించును, మిక్కిలిశ్లేష్మముజేయును, విరేచనము గావించును. వాతమును హరించును. ఇంద్రియములకు బలముజేయును.

అడవిబాతు:—Wild duck. బాతుమాంసము చూడుడు.

అడవిమల్లి:—Jasminum Angustifolium & Echites Dichotoma. Wild Jasmine. సం॥ వనమల్లికా. అస్ఫోట. దీనివేరు చేదుగనుండును. వీనిని నీళ్ళతోనూరి అందులో వసచూర్ణము నిమ్మకాయరసము కలిపి పట్టించిన తామర, గజ్జి, చిడుము మొదలగు చర్మరోగములు నివృత్తించును.దీనియాకుపసరు బొంగురులను, వగర్పు, ధ్వనిగలదగ్గును, శ్లేష్మమును హరించును. ఈ పసరులో పొంగించిన వెలిగారము 1 గోధుమగింజలయెత్తు, మిరియాల చూర్ణము 2 గోధుమగింజలమెత్తు, కొద్దిగ తేనెకలిపి దగ్గులకియ్య

వగును. పసరు మోతాదు పెద్దలకు 2 తులములమెత్తు, బిడ్డ అరతులమెత్తు.

అడవిమాదీఫలము:—Wild citron. స్వాదుగా, పుల్లగనుండును. చలవ జేయును, పైత్యము, ఛర్ది, కఫము, అరుచి వీనిని జయిం చును. జఠరదీప్తినిచ్చును, గుల్మము, మూలవ్యాధి, బోగొట్టును

అడవిమామిడి:— కొండమామిడి చూడుడు.

అడవిమునక్కాయ:—కారుమునక్కాయ చూడుడు.

అడవిమెంతులు:—Wild Fenugreek వీనికిని ఊరమెంతులయొక్క గుణములు కలిగియుండును. విశేషించి యివి గుర్రములకు అను కూలముగ నుండును.

అడవిమృగముల మాంసము:—Flesh of wild animals. గుహలు, కొండలు, అడవులు వీనియందు సంచరించెడు మృగముల మాంసము విరేచనబద్ధముగావించును, దేహపుష్టి వీర్యపుష్టినిచ్చును, మూత్ర మును తక్కువపరచును, కఫమును వృద్ధిచేయును. దీనికి విరుగుళ్లు 1 సిరకా, 2 ఆవాలపొడి, మరియు మాంసము చూడుడు.

అడవిమొల్ల:—Jasminum Auriculatum (wild jasmine) సం॥ యూథికా, గణికా, శిఖండినీ. హిం॥ యూథి, దీనివేరు విరేచన బద్ధము, చలవచేయును. సంగ్రహణిరోగము, కఫవాతము, దాహము, రక్తపైత్యము వీనిని శమింపజేయును. వేరురసము యొక్క మోతాదు పూటకు 2, 3 తులములమెత్తు.

అడవివాయింట:—Gynandropsis Pentaphylla - wild. సం॥ వనబర్బరా, సువాసనగలది. కారముగనుండును. కాక చేయును. పిశాచ బాధను, పైత్యమును బోగొట్టును. మరియు దీనికిని ఊర వాయింట చెట్టుగుణముగలిగియుండును. వాయింటచెట్టుచూడుడు.

అడవి ఓమము:— Seseli Indicum. Eng. Wild Bishopsweed. సం॥ వనయమాని. కారముగ నుండును, మిక్కిలి కాక చేయును, దీనిని నీళ్ళతో నూరిపోసిన గుర్రములకడుపునొప్పులు నిమ్మళించును.

అడవి వుల్లి:— Scilla Indica. Eng. Indian Squill. ఇది సీరుల్లి పాయవలె గుండ్రముగ నుండునుగాని పెద్దవిగనుండును వీనినినూరి, గడ్డలపైనివేసికట్టిన వానిని కరిగించును,నూరి తలకుపట్టువేసిన లేక మర్దనచేసిన మూర్ఛ, వికారపుపిచ్చి నిమ్మళించును. లోపలికిచ్చిన శ్లేష్మమును వెడలించును. మూత్రమును గావించును,ఉదరమును, ఉబ్బును పోగొట్టును. మోతాదు ఒకగోధుమగింజయెత్తు ప్రొద్దుట సాయింకాలము యిచ్చుచు వికారముపెట్టి శ్లేష్మము పడిపోవువరకు గాని మూత్రము జారీ అగువరకుగాని మోతాదును 5, 6 గోధుమ గింజలయెత్తువరకు వృద్ధిచేయవలెను. మోతా దెక్కువయిన వికారము, వాంతి,తలత్రిప్పు, దారుణమగు ఈడ్పులు(Convulsions)వీనిని కలిగించును. కొద్దిమోతాదులను కొంతకాలము పుచ్చుకొనిన ఆయుర్వృద్ధినిచ్చును. ఇది గుర్రపుమూత్రబద్ధమును, జ్వరమును పోగొట్టును.

అడవిశనగచెట్టు.— Cressa Cretica. Eng. Wilp Bengal gram plant. సం॥ సంజీవనీ, రుదంతి. హిం॥ రుద్రవంతి, లూణా. దీని ఆకుల చూర్ణములో మిరియాలచెట్టుఆకుల చూర్ణముగాని, మిరియాల చూర్ణములోగాని కలిపి వీనికి సమముగ పంచదార కలిపి యిచ్చిన దగ్గులు, వగర్పులు హరించును, శ్లేష్మము పడిపోవును, దీని చూర్ణముగాని, కషాయముగాని, క్షయ, క్రిమి, రక్తపిత్తము, శ్వాసకాసలు, ప్రమేహమును హరింపజేయును. ముదిమిని,వ్యాధిని తొలగించి రసాయనముగా నుండును. మోతాదు పూటకు

1 మొదలు 4 అణాలయెత్తువరకు. దీని ఆకుల చూర్ణము దుష్టవ్రణములు మాన్పును. దీని గింజలు తెల్లగ శనగగింజలవలెనుండును.

అడవి సదాప:—Peucedanum Sowa-wild Sue. సం॥ మిశ్రి, మైత్రేయ, శైలేయ, హిం॥ సోంఫ్. దీని ఆకురసము స్వాదుగనుండును. మేహశాంతి, వీర్యవృద్ధి, బలముచేయును, మూలవ్యాధి, క్షయ, వాతపైత్యము, త్రిదోషములు, కార్శ్యరోగము వీనిని జయించును, గాయముల మాన్పును. మోతాదు 1, 2 తులములయెత్తు.

అడ్డసరము:—Adhatoda Vasika & Justicia Adhatoda. Eng. Malabar nut. సం॥ వాసక, వైద్యమాత, అటరూష, హిం॥ అడూసా, విసోంటా. దీని వేరు, ఆకు చేదుగనుండును. వీని రసము లేక కషాయము, లేక చూర్ణము త్రిదోషహరమైనది. శీతపైత్యము, శ్లేష్మము. పైత్యము, దగ్గు, వగర్పు, మేహము, అరుచి, రక్తపైత్యము, క్షయ, కుష్ఠు, జ్వరము, దాహము, తాపము, చర్ది వీనిని పోగొట్టును. తేలికనిచ్చును. అన్నివిధముల దగ్గులకు, క్షయలకు దీనిఆకు, వేరు పనిచేయును, బిడ్డలకూకుడ పనిజేయును, ఆకురసముగాని, వేరుగాని 2 డ్రాములు, అల్లపురసము 1 డ్రాము (60 చుక్కలు) కలిపి యియ్యవగును. ఈ చొప్పున రేపుమాపు కొన్నిదినములు ఇచ్చిన శ్లేష్మము పడిపోవును. దగ్గు, ఉబ్బసము (asthma), వరుసజ్వరము నిర్మూలించును, పై వ్యాధులకు వేరుచెక్క చూర్ణముగాని, ఆకుల చూర్ణముగాని, తేనెతో గలిపి నియ్యవగును, చూర్ణపు మోతాదు పూటకు 10 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు, ఆకులరసముగాని, కషాయముగాని మిరియాల చూర్ణము కొద్దిగ కలిపి యిచ్చినను పనిచేయును. రసము లేక కషాయపు మోతాదు పూటకు ½ అవున్సు మొదలు 1 అవున్సు (2½ తులములయెత్తు) వరకు. ఆకుల తేలిక కషాయము లేక వీని చూర్ణముతో జేసిన లేహ్యము

దగ్గులు మొదలగు వానికియ్యనగును. తేలిక కషాయపు మోతాదు 1 అవున్సు మొదలు 2 అవున్సులవరకు. లేహ్యపు మోతాదు ½ తులము. దీని ఆకులు, పువ్వులు, వేరు ముఖ్యముగ పువ్వులు ఎగుపులను (spasms) కట్టును. ఉబ్బసపుదగ్గు (asthma), ఆహిక జ్వరము, జ్వరములేని పురాణపు వగర్పుగల దగ్గు (bronchitis), ఇతర దగ్గులు, క్షయ వీనిని పోగొట్టును. దీని ఆకుల రసము లోపలి కిచ్చిన వాతమేహ వాతనొప్పులు నయమగును. పశువులరోగములు నివర్తించును. ఆకుల కషాయము క్రిమిరోగమును పోగొట్టును. దీని కాయలు చేదుగ నుండును, ఎగుపులను (spasms) కట్టును. దీని పువ్వులు కండ్లకు కట్టిన నేత్రరోగములను పోగొట్టును. క్రొత్తగ యెండించిన దీని ఆకుల యొక్క లేక మాను చెక్కయొక్క పొగ బుచ్చుకొనిన ఉబ్బసపుదగ్గు (asthma) అణగును, దీని ఆకుల గాఢకషాయముతో ఒత్తడము (fomentation) ఇచ్చిన, వాత మేహ వాతనొప్పులు (rheumatic pains) నరముల నొప్పులు (neuralgia) ఉబ్బు (swellings) నిమ్మళించును. ఆకుల రసము శ్లేష్మహర ఔషధములకు అనుపానముగ నియ్యతగును. ఆకులకషాయము మూత్రమును జారీచేయును, ఉదరము, పాండువు, రక్తక్షీణము ( anaemia ), జ్వరములోని విదాహము వీనిని పోగొట్టును, ఆకులరసము, నీళ్ళవిరేచనములు, రక్తవిరేచనములు రక్తవమనము, రక్తముపడేగ్రహణి (bleeding in dysentry) వీనిని పోగొట్టును, దీని ఆకుల కషాయము జ్వరితుల కిచ్చిన బడలికను పోగొట్టును. దీని పువ్వులు శ్వాస, కాస, వమనము, శ్లేష్మము, క్రిమి, రక్తపైత్యము వీనిని పోగొట్టును. వీనిచూర్ణము, లేహ్యము, రసము, కషాయము, వాడ తగియుండును. మోతాదులు ఆకులవలెనే యియ్యవచ్చును,

అతి తాంబూలగుణము:— Chewing betel leves immoderately-effect of. పాండురోగము, దంతదౌర్బల్యము, బధిరత్వము, నేత్రరోగము, హృద్రోగము వీనిని బుట్టించును. వాతపైత్యప్రకోపమును, మిక్కిలి శాకను, బలక్షయమును జేయును, రోగము పుట్టించును.

అతిమధురము:—యష్టిమధుకము చూడుడు.

అతివస:— Aconitum Heterophyllum. Eng. root of Indian Atees సం॥ అతివిషా, అరుణా, ఉపవిష, హిం॥ అతిస్. దీని చూర్ణము లేక కషాయము వెగటు, కారము, చేదుగలిగియుండును, శ్లేష్మపైత్యము, అరుచి, చర్ది, దగ్గు,ఆమాతిసారము,వరుసజ్వరము, జ్వరము వీనిని పోగొట్టును. వ్రణములను, కురుపులను మాన్పును, దురదల నణచును; హృద్రోగము, కామిలరోగము, గ్రహణి వీనిని హరించును, పైత్యము జేయును, వేడిచేసి విదాహము బుట్టించును, జఠరదీప్తి నిచ్చును, జీర్ణముచేయును. దీనిని బిడ్డలజ్వరము విరేచనములు మొదలగువాని కియ్యవచ్చును. దీని గంధమును లేపనము జేయుటవలన వాపును పోగొట్టును. చూర్ణపు మోతాదు పెద్దలకు 60 గోధుమగింజలయెత్తు, బిడ్డలకు వయసునుబట్టి 10 మొదలు 20 గోధుమగింజలయెత్తువరకు. వరుస జ్వరమునకు దీని చూర్ణమును పై మోతాదుల ప్రకారము నీళ్ళలో గలిపి జ్వరము వదులుటకు ముందు చెమట పట్టినప్పుడు ఆరంభించి ప్రతి 4 లేక 6 గంటలకొకసారి జ్వరము లేనప్పుడు ఇయ్యవలెను. జ్వరము లేక ఇతరవ్యాధులు పడిలేచినవారికుండు నీరసమునకు (debility) దీని చూర్ణమును 5 మొదలు 10 గోధుమగింజలయెత్తు చొప్పున దినమునకు మూడు సార్లుచొప్పున కొన్నిదినములిచ్చిన నీరసముపోయి బలము జేయును.

కషాయపు మోతాదు వయసునుబట్టి పూటకు 2 మొదలు 5 తులములవెత్తు చొప్పున దినమునకు రెండుపూటలు ఇయ్యవగును.

అత్తిపత్తిచెట్టు:—నిద్రగన్నిక చూడుడు.

అత్తిచెట్టు:—మేడిచెట్టు చూడుడు.

అత్తెసరన్నము:—Rice boiled without straining of cunjee water. అనగా గంజివార్చకుండా వండిన అన్నము. బలమును, పుష్టిని ఇచ్చును, గురుత్వముగా నుండును. కాక, వీర్యపుష్టి, విరేచన బద్ధము జేయును.

అత్యుష్ణాన్నము :— Very hot boiled rice. రక్తపైత్యమును బుట్టించును, నీరసము దెచ్చును, మదము, దాహము, తాపము, శ్రమ వీనిని గలుగ జేయును.

అనపచిక్కుడుకాయ:—Pods of a sort of dean plant. రుచిగా నుండును, విషమును హరించును, పైత్యమును, శ్లేష్మమును హెచ్చించును, దీనికి విరుగుళ్ళు చిక్కుడుకాయ చూడుడు.

అనాసపండు:— Ananas Sativus, Illicum Veram. Eng. The pine-apple. సం* అనంనాస, హిం* అనారస్. అనంనాస్. పుల్లగా తియ్యగానుండును, దురదను, మదమును పుట్టించును. చలవజేసి నీరు పెంచును, మేహశాంతి నిచ్చును, దాహమును, పైత్యవికారమును, అరుచిని పోగొట్టును. పొట్టకు బలమిచ్చును. అజీర్ణమును వాతమును కలుగజేయును. దీనికివిరుగుళ్ళు 1 ఉప్పు, 2 సజ్జాకారము, 3 జీలకర్ర, 4 శొంఠి.

అనాసపువ్వు:— Illicium Aisatum. ఇది సువాసనగల గంధి దినుసు. దీనిని సువాసనకై కూరిలలో వేయుదురు. దీనికి కషాయము పొట్టకు బలమిచ్చును. జీర్ణము గావించును. కడుపులోని వాతమును హరించును.

అనుగుత ప్పటచెట్టు:—గ్రంథితగరము చూడుడు.

అనుములు:— Vigna Cateang & Dolichos Sinensis— Seeds of (A sort of Beans) సం* నిష్పావ, శ్వేతబిందుక, శింబి, హిం* లోబియా. దీనిపప్పు లేక కట్టు రుచిగానుండును, మూత్రపురీషములను గావించును. స్త్రీలకు పాలు బడజేయును. దేహపుష్టినిచ్చును. పేగులలో బుట్టిన పుండ్లనుమాన్పును. వాంతిని, నేత్రరోగములను, శోషను, విషమును అణచును, శుక్లనష్టమును గలిగించును. జ్వరముదెచ్చును, ఆలస్యముగ జీర్ణమగును. కడుపుబ్బరము, గుండెనొప్పిని, రక్తపైత్యమును, విదాహమును, కఫవాతములను కలుగజేయును దీనికి విరుగుళ్ళు 1 ఉడకపెట్టడము, 2 పంచదార, 3 వుడకబెట్టి పొంగించుట, 4 జనుము, 5 కలిసిళ్ళు. ఎఱ్ఱ అనుములకును యివే గుణములు.

అనూపజలము:—Water on marshy ground. అనగా తరుచు నీళ్ళునిలిచెడు ఊట ప్రదేశముల నీరు. ఇది మన్యపుజ్వరము maleria మొదలగు అనేక దోషములను కలుగజేయును. విరేచన బద్ధము గావించును, నింద్యమయినది. దీనికి విరుగుళ్ళు ఉదకము చూడుడు.

అనూరాధ వర్షోదకము:—Rain water that falls in Anuradha karti. సమస్తజంతువులకు అన్నిసస్యములకు మిక్కిలి ఆరోగ్యకరమైనదిగ నుండును.

అన్నభేది, దీని భస్మము, సింధూరము:— Sulphate of Iron. Its calx, its reddened calx. సం* కాసీస, సుశుభ్ర, హిం* కాషీస్. యిది కాసీసమని, పుష్పకాసీసమని రెండుజాతులు గలవు. కొంచ మెచ్చుతగ్గువ సమాన గుణములు గలిగియుండును. శుద్ధి చేసినది (నిమ్మకాయరసములో నాననిచ్చి వేడినీళ్ళతో గడిగిన శుద్ధి

యగును) ఉప్పు, పులుపు, వగరు, రుచులు గలిగియుండునను, అగ్ని దీప్తినిచ్చును. వాతము, కఫము, కుష్ఠు, జ్వరము, క్షయ, పాండువు వీనిని హరించును. మంచిరక్తమును బుట్టించును, వెంట్రుకలకు బలమిచ్చును, అన్న మరుగజేయును, రక్తమును శుభ్రపరచును, బలముజేయును, ఋతురక్తమును జారీ చేయును. క్రిమి, అతిమూత్రము,ఋతుబద్ధము,దగ్గు అగ్నిమాంద్యము(dyspepsia) వీనిని హరించును. మురికివ్రణములు, పుట్టవ్రణములు (అనగా సెలువేసే వ్రణములు), గండమాల, మాంసము కుళ్ళిపోయె లేక తినివేసే వ్రణములు వీనిపైన అన్నభేది గలిపిననీళ్ళు పోసిన మానును. దీనిని శేవల్చిన్నితోగాని, బాలింతబోలుతోగాని, ఏలకులు, లవంగాలు, దాల్చినచెక్క, నాగకేసరములు వీని చూర్ణములోగలిపినగాని, జన్షను అను ఇంగ్లీషువారు వాడే మూలికసారము (extract) లో కలిపిగాని, మాత్రలుచేసి ఇయ్యనగును. మోతాదు పూటకు 1 మొదలు 6 గోధుమగింజల యెత్తువరకు. అన్నభేది పొట్ట, పొత్తికడుపు,ప్రేగులు వీనిలో జనించిన రోగములు గల వారికిచ్చిన జబ్బుచేయును. అపరిశుద్ధ అన్నభేది సేవవలన గలిగిన వికారమునకు విరుగుడు గాడిదెలద్దెరసము. దీని మోతాదు పూటకు 3-4 తులముల యెత్తుచొప్పున 3-4 దినములు సేవించిన వికారమణగును. అన్నభేది భస్మమునకు, అన్నభేది సింధూరమునకు పైన చెప్పిన గుణములు గలిగియుండునుగాని అన్నభేదికంటె యెక్కువ సత్తువతో పనిచేయును.

అన్నములేని గుణము:—Starvation. రోగము లేకనే అన్నము దినకుండిన రక్తక్షీణము, దేహకార్శ్యము, ఆయుక్షీణము, నీరసము, హృదయబలహీనము, బుద్ధిమాంద్యము వీనిని కలుగజేయును. సమస్తదోషములను బుట్టించును.

అన్నము:—Cooked rice. (అనగా వరిబియ్యాపు అన్నము)
ముందుగా ధాన్యములు చదివిన వాని బేధములు గుణాగుణములు వివరింపబడినవి. దానినిబట్టి వాని వాని బియ్యములను వంటచేసి పుచ్చుకొనుట మంచిది. యీక్రింది వ్రాయబడినది అట్టి బియ్యము లను వండిన అన్నముయొక్క సామాన్యగుణము బియ్యముచక్కగ కడిగి వండిన యన్నము వేళకు భుజించిన ఆయువు, వీర్యపుష్టి, బలము, కాంతి వీని నిచ్చును. రుచి పుట్టించును. దాహము, తాపము, బడలిక, శ్రమ వీని నణచును. నేత్రములకు చలవ జేయును. సమస్తేంద్రియములకు బలమిచ్చును. తైల పానముచే జనించిన దోషమునుహరించును వ్రణములను మాన్పును, మరియు రేచనపాచన దీపనముల గలుగజేయును. వేడియన్నముతో తలకు కాపడము బెట్టిన శిరోభారము, సన్నిపాతములు హరించును. చిత్ర మూలము, శొంఠి వీని తేలిక కషాయముతో వండినయన్నము కాక చేయును, తేలికగ జీర్ణమగును, వాతరోగము, వాతజ్వరము గలవారికి మిక్కిలి అనుకూలముగ నుండును. కొద్దిగ వేయించిన బియ్యముతో వండిన అన్నము తేలికజీర్ణమగును, జ్వరము తగ్గి పోయినవారికి అజీర్ణరోగులకు అనుకూలముగనుండును. గాడిదెపాల తో బియ్యము వేసి వండినయన్నమును క్షయరోగమును పోగొట్టును. బియ్యమునుగొద్దిగ వెచ్చజేసి చల్లలో వేసివండినయన్నము కాక విరేచనములు గట్టును, క్షయజ్వరమును పోగొట్టును, సన్నబియ్యము వండి గంజివార్చి వేసి ఆయన్నములో సమముగ కాచిన ఆవుపాలు గలిపి పుచ్చుకొనిన మిక్కిలి యింద్రియవృద్ధి గలుగును. వేడియన్న ములో గేదెపెరుగు గలిపి భుజించిన గ్రహణి, రక్తగ్రహణికట్టును. అన్నము, గేదెపేడ, అరటిపండును సమపాళ్ళుగ గలిపి పిసికి కట్టిన మేహవ్రణములు, గెడ్డలు వీని మంటలు హరించును. పగులును,

మానును. నులి వేడియన్నము,అత్యుష్ణాన్నము, బిరుసైన అన్నము లను, నువ్వులపప్పునూనెనైన వుపయోగించవలెను. చిమిడిన అన్న ము చూడుడు. అన్నమువలన గలిగిన అజీర్ణమునకు విరుగుళ్ళు, 1 అవుచల్ల, 2 ఆనాసపిండి, 3 ఓమము, 4 శొంఠి. మిరియాల కషాయము. అన్నము భుజించునప్పుడు ముందుగ నెయ్యివేసికొని భుజించవలెను. అట్లుచేయుట ముఖ్యమైనది. ఇందువలన ఆయు రారోగ్యములనిచ్చును. లేనియడల (నువ్వులపప్పు చేసిన నూనె నైన) వుపయోగించవలెను. లేనియడల ఆరోగ్యమునకు భంగ కరము, బియ్యమునుబట్టి, అన్నమునకు గుణము, (ధాన్యములు అనేకరగములు వివరముగా వ్రాయబడియున్నది. ధాన్యములు చూడుడు) వివరములకు ధాన్యములు చూడుడు.

అపిని:—నల్లమందు చూడుడు.

అప్పడములు:— Thin dried cakes made of green gram or Dhal gram. వీనిని పెసరపప్పుతోను, మినపప్పుతోను, కంది పప్పుతోను చేయుదురు. ఇవి రుచిగా నుండును, వేడిజేయును, వాతమును పోగొట్టును, వీర్యవృద్ధి, బలము జేయునుగాని ఆమ మను హెచ్చించును, గురుత్వము జేయును. దీనికి విరుగుడు 1 శొంఠిచూర్ణము, 2 మునగవిత్తుల చూర్ణము. పెసర, కంది అప్పడములు పథ్యకారులు.

అప్పాలు:—A sort of cakes. రుచిగానుండును, దేహపుష్టి నిచ్చును, పైత్యము, శ్లేష్మము, గురుత్వము జేయును. దీనికి విరు గుళ్ళు 1 వేడినీళ్ళు, 2 చన్నీళ్ళు, 3 ఉప్పువేసినకలి, 4 నెయ్యి.

అభ్యంగనము:—Anointing and bathing. అనగా కొబ్బరి నూనెతోగాని, నువ్వులనూనెతోగాని, నేతితోగాని, ఆముదముతో గాని, యితర తైలములతోగాని శిరస్సు, శరీరము అంటటి వ్రాసి

కొని చెవులలోను, కండ్లలోను వేసికొని మర్దన చేయించుకొన్న, మరియు నలుగుపిండితో దేహమును నలిపించుకొని, శీకాయతో గాని, కుంకుడుకాయతోగాని తోముకొని స్నానము చేయుట, గజ్జి చిడుము, సర్పి, దద్దుర్లు మొదలగు చర్మరోగములను, దుస్వప్నములను, మలినములను, దుర్గంధమును పోగొట్టును, సుఖనిద్ర, తేలిక, దేహపుష్టి, కాంతి, మృదుత్వము నిచ్చును. కండ్లకు చలవ జేయును. అనుదినము తలంటుకొనిన ముదిమి, వాతము, అలసట వీనిని పోగొట్టును. నేతితో తల యంటుకొనిన చలవ జేయును, మూత్రకృచ్ఛ్రము, మేహము, పైత్యము వీనినణచును, కాంతి, ఆయుర్వృద్ధి బుద్ధిబలిమి, దేహపుష్టి, వీర్యవృద్ధి, జఠరదీప్తి వీనినిచ్చును, దేహము, కాళ్ళు, చేతులు, గోళ్ళు శిరస్సు వీనియందు పుట్టిన తాపమును, మంటలను పోగొట్టును. పాండువు, జ్వరము, కాక, దగ్గు, వగర్పు, కామిల, గళరోగము, గ్రహణులు వీనిని హరించును. మాడపట్టున చమురుంచి మర్దించుట చేత శ్రోత్రేంద్రియములకును తక్కిన అవయవములకును బలమును, సౌమ్యతను గలుగ జేయును. తలవెంట్రుకలకు వృద్ధి, మృదుత్వము, బలము వీని నిచ్చును. చెవిలో చమురు పోయుట చేత శిరఃకర్ణపార్శ్వశూలల పోగొట్టును, అరిపాదములకు చమురు మర్దించుటవలన మంటలు పోగొట్టును, నేత్రములకు చలవ జేయును. సుఖనిద్ర, దృష్టినైర్మల్యము, దంతపటుత్వము కలుగును. నిద్రలేని శ్రమ, పగుళ్ళు వీట్లను పోగొట్టును. కండ్లలో వేసి కొనుటవలన దంతరోగముల పోగొట్టును, దంతదార్ఢ్యత గలుగ జేయును. ఆముదముతో తలంటుకొనిన నేత్ర, శిరోరోగములు హరించును.

అభ్యంగనము వర్జించవలసిన కాలములు:—స్నానము వర్జించవలసిన కాలములు చూడుడు.

అభ్రకభస్మము:—Calx of black Talc or Mica. సం॥ అభ్రక, గగన, బహుపత్ర, హిం॥ అబరక్. క్రమముగ నూరు పుటములు వేసిన కృష్ణాభ్రకభస్మమును అనుపాన విశేషముగ నిచ్చిన త్రిదోషములనుహరించును. గ్రహణి. క్షయ. ప్రమేహము,మూలవ్యాధి, అతిమూత్రము, శ్వాస, కాస, విషము, కుష్ఠు, వాతరోగములు, పిత్తరోగములు, క్షీణత్వము, గాయములు, పాండువు, భ్రమ, కామిల, గుల్మము, మొదలగు ననేకరోగములను నివర్తిజేయును. మేహశాంతి, వీర్యవృద్ధి దేహపుష్టి, ఆయుర్వృద్ధి, అగ్నిదీప్తి, బలము, రక్తపుష్టి వీనిని గలుగజేయును.మిక్కిలి ఆరోగ్యకరమయినది. మరియు దీనికి సువర్ణభస్మముయొక్క గుణములు గలిగియుండును. మోతాదు పూటకు అరచిన్నమెత్తు మొదలు చిన్నమెత్తు వరకు రెండుపూటల నియ్యనగును. క్రమముగ శుద్ధి పుటములు పడనిది అనేకరోగములను పుట్టించును. దీనికి విరుగుడు ఉసిరిక వరుగు నీళ్ళుపోసి నూరి తీసినరసముగాని, పచ్చికాయల రసముగాని పూటకు 3, 4 తులములయెత్తు రసము చొప్పున ఉదయపు పూటలను 3, 4 దినములు పుచ్చుకొనిన అభ్రకదోషము నివర్తించును. దీనికి అనుపానములు—పిప్పలిచూర్ణము తేనెతో సేవించిన కాస,శ్వాస,విషము,భ్రమ, కామిల, గుల్మము,పాండువు, గ్రహణి, కఫము, క్షయ, ప్రమేహము, పైత్యము, వాతము, కుష్టువు, జీర్ణజ్వరము,అరుచి వీనిని హరించును. త్రికటుకచూర్ణముతో సేవించిన పాండువు, గ్రహణి, శూల, క్షయ, శ్వాస. అరుచి అగ్నిమాంద్యము, కుష్ఠు. కోష్ఠరోగము, కాస,ప్రమేహము,వీనిని హరించును. శుక్రవృద్ధి. బుద్ధిబలము కలుగును. శిలాజత్తు, పిప్పలి చూర్ణము,

తేనెతో సేవించిన ప్రమేహరోగము లన్నియు నివర్తించును. స్వ-
ర్ణభస్మముతో సేవించిన క్షయరోగములు నివర్తించును. ధాతు
పుష్టి కలుగును. కరక్కాయచూర్ణము, బెల్లం వీనితో సేవించిన
వాత రక్తము, ఏలకులు, శర్కర వీనితో సేవించిన రక్తపిత్తము
హరించును. నేలయుసిరిక, శర్కర, పల్లేరు, ఏలకులు వీనిచూర్ణము
ఆవు పాలతో సేవించిన మూత్రకృచ్ఛ్రము, ప్రమేహము హరిం-
చును. తిప్పసత్తు, ఖండశర్కర వీనితో సేవించిన ప్రమేహము
లన్నియు నివర్తించును. త్రిఫలచూర్ణము, తేనె,ఆవునెయ్యి వీనితో
సేవించిన వీర్యవృద్ధి కలుగును. నేత్రరోగములు హరించును. జీ-
గిఁజలతో నిచ్చిన అనేకవిధములైన మూలవ్యాధులు నివర్తిం
చును. గంజాయి ఆకుచూర్ణముతో నిచ్చిన వీర్యస్తంభన కలుగును,
గంటుభారంగి,పుష్కరమూలము,శొంఠి,పెన్నేరుగడ్డ వీని చూర్ణము
తేనెతో సేవించిన వాతరోగములు హరించును. ఉలిమిఆకుచూర్ణము,
పిప్పళ్ళచూర్ణము, తేనె వీనితో సేవించిన కఫరోగములు హరిం
చును.యవక్షారము మొదలగు క్షారములతో సేవించిన మూత్రకృ
చ్ఛ్రము, అగ్నిమాంద్యము, మూత్రఘాతము వీనిని హరించును.లవం
గాలు, తేనె వీనితో సేవించిన శుక్రవృద్ధికలుగును. ఆవుపాలు,
శర్కర వీనితో సేవించిన పిత్తరోగములన్నియు హరించును.

అమరశిలగంధకము:—గంధకము చూడుడు.

అమృతపాణిఅరటిపండ్లు:—A sort of plantains. బాగుగ పక్వ
మయినవి తియ్యగా రుచిగానుండును. పైత్య శాంతి, మేహశాంతి
జేయును. చలవజేయును; దేహపుష్టి నిచ్చును; ఆకలిదప్పికలను
శాంతింపజేయును. అరటిపండు చూడుడు.

అమృతఫలము:—Pyrus Malus. Eng. Apple fruit. సం* అమృ
తఫల. శుభఫల హిం* నాస్పాత్, దీనినే ఏపిలుపండందురు. పండు

ఎఱ్ఱగ, పచ్చగా, గుండ్రముగా, పైనఅడుగున చొట్టగలిగి పలుచని చర్మముగలిగి మృదువుగానుండును. ఈపండు లఘువుగజీర్ణమగును. దేహపుష్టి. రక్తవృద్ధి, వీర్యవృద్ధి గలిగించును. తియ్యగా రుచిగా నుండును వాతపిత్తశ్లేష్మములనుశాంతింపజేయును.హృదయమునకు బలమిచ్చును. రోగులును, బలహీనులును మితముగా సేవించిన అమృతతుల్యముగ నుండును. ఈపండ్లుతరుచు సేవించిన బంగారము చేయుగుణము నిచ్చునని చెప్పుదురు,

అమాౄదుపండు:—జామిపండు చూడుడు,

అయస్కాంత పాత్రలో భోజనము:— కాంతపుగిన్నెలో భోజనము చూడుడు.

అయస్కాంతి పాత్రలోని పాలు:-- Milk in a magnetic iron cup. పాలుంచెడు పాత్రవిశేషణములు చూడుడు.

అయస్కాంత భస్మము లేక సింధూరము:—Calx or reddened calx of magnetic iron. Eng. lead stone.సం* అయస్కాంత, కాంతలోహ,మహాలోహ. హిం* కాంతలోహ. అనగా సూదంటురాయి, కాంతము; ఇది గంధకదోషములను హరించును, వాతరోగములను, అనేక దీర్ఘరోగములను బోగొట్టును. మరియు లోహభస్మమునకు వ్రాయబడిన గుణములు దీనికిని గలిగియుండును గానిదానికంటె నిదిమిక్కిలిసౌమ్యముగ పనిచేయును,లోహభస్మము చూడుడు. అయస్కాంత భస్మము లేక సింధూరము యొక్క మోతాదు పూటకు 2 గురిగింజలయెత్తు మొదలు 4 గురిగింజలయెత్తు వరకు నియ్యవగును.

అయిలారము:—A medicinal root. ఇది యొక గ్రంధి దినుసు; దీని కషాయము లేక చూర్ణము చేదుగనుండును.క్షయ, ఉదరరోగ ములువీనిని హరించును; ఇది రేచనకారి;అత్యుష్ణము, మోహకారకము

వీనిని శమింపజేయును; దగ్గును, శ్లేష్మమును ఉబ్బురోగము పోగొట్టును. మూత్రముజారీచేయును సంతానేచ్ఛగలస్త్రీలకు ఈ ప్రత్యేకము నియ్యకూడదు. ఇచ్చిన సంతానము గలుగకపోవు. ఎండు వేళ్ళనీళ్ళతో నూరితీసినరసము 2డబ్బులయెత్తుగాని పచ్చివేళ్ళు నూరినముద్ద చిన్ననిమ్మకాయంతగాని చాలెడు చింతపండుపులుసుతో దారుణమగు ఉబ్బురోగము గలవారికిచ్చి అంఘుంట వెనుక చల్ది యన్నము పెరుగు తినిపించిన అధికముగ మూత్రము వెడలి ఉబ్బు శీఘ్రముగ తీసి, వగర్పున్నను నివారణమగును. అయిలారముయొక్క చెట్టు అటుక మామిడిచెట్టు లేక యెఱ్ఱగలిజేరుచెట్టువలె నుండును. కషాయము మోతాదు 2½ మొదలు 6 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాలు యెత్తువరకు.

అరటికాయ (లేతది):—Tender plantain. అనగా బొంతరటికాయ దీని చూర్ణము వగరుగ నుండును. జ్వరాతిసారము, గ్రహణి, సంగ్రహణి, ప్రమేహము, విదాహము, రక్తపైత్యము, కష్ట, స్త్రీరోగము, క్రిమిరోగము వీని నణచును; గుదరోగమును శమింపజేయును, విరేచనబద్ధము, వీర్యమునకు చలవజేయును. దీనికి విరుగుడు నెయ్యి. మరియు దీనికూర నోటివెంట రక్తము పడేవారికిని, దగ్గితే రక్తము పడేవారికిని, గ్రహణి, సంగ్రహణి, అతిమూత్రరోగులకును పథ్యమైనది. లేతఅరటికాయయొక్కగాని కొద్దిగ ముదిరినకాయయొక్కగానిచూర్ణము బిడ్డల అజీర్ణమును, పెద్దవారి సెగరోగమును కట్టును. బిడ్డలకు ఇచ్చే మోతాదు 1-2 చిన్నముల యెత్తు, పెద్దలకు ఇచ్చే మోతాదు 8 మొదలు 6 చిన్నముల యెత్తు(వరకు). బిడ్డలకు చనుబాలతోను, పెద్దలకు చీనా పంచదారతోను ఇయ్యవలెను.

అరటికాయ (ముదిరినది):-Raw plantain. దీని చూర్ణము వగరుగ నుండును, రక్తపైత్యము, ప్రదరమను యోనిరోగము అనగ

కుసుమరోగము, మేహము వీనిని శమింపజేయును. దీనికూర గ్రహ ణి, సంగ్రహణిరోగులకు మిక్కిలి పథ్యముగనుండును. వాతము, చలవ, విరేచనబద్ధము చేయును. దీనికి విరుగుడు నెయ్యి. ఎండు బొంత అరటికాయ (Scurvy) అనే పోడవాండ్రకు వచ్చేరోగ మును మాన్పును. పచ్చికాయ యెండించి కొట్టి పిండిచేసి దానిని బిళ్ళలుచేసి యెండించి ఉప్పుతోతినిన అజీర్ణము, పులితేనుపులు గల అగ్నిమాంద్యము (Dyspepsia) కుదురును. కూరలో బెల్లమువేసి వండిన శ్లేష్మము.

అరటికాయ పెద్దగింజలుండేది:— Plantain having big seeds. అంతరుచిగా నుండదు. చలవజేయును; క్రిమిని, పైత్యమును పోగొ ట్టును; విరేచనబద్ధము, గురుత్వము చేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 నువ్వుచెట్టు కాల్చి చేసిన క్షారము.

అరటిచెట్టు:— Musa Sapientum, M. Paradisiaca. Eng. The Plantain tree. సం॥ కదలీ, రంభా. హిం॥ కేలా. ఇవి అనేక జాతులుగలవు. అరటిదుంప, వేళ్ళు,దూట పొత్తి (bark) వీనిరసము తీపి, వగరు, రుచులుగలిగి యుండును. చలవ, వాతము, వీర్యపుష్టి జేయును;రక్తపైత్యము, మేహము,రక్తవిరేచనములు,కఫవాతము, రక్తస్రావము, పైత్యము, తాపము, నోటివెంట రక్తముపడడము. రక్తవమనము, విదాహము, మూత్రకృచ్ఛ్రము, అతిసారము, స్ఫోట కము, కుసుమరోగము, మూత్రాశ్మరి వీనిని హరించును; విరేచన బద్ధముజేయును; వేళ్ళకషాయము క్రిమిరోగమును హరించును. వేళ్ళరసము సెగరోగమును పోగొట్టును. వేళ్ళరసములో పొంగిం చిన వెలిగారము, సూరేకారము, కలిపియిచ్చిన మూత్రబద్ధమును నివారించును. ఆ రసములో నెయ్యి, పంచదార కలిపి పోసిన కుక్క మొదలగు జంతువులు తినిన పాషాణవిషమును విరుచును. లేతవేళ్ళ రసములో జిగటవస్తువులు (Mucilages) గలిపి యిచ్చిన యోని

వాట లేక నోటివెంట పడే, లేక స్రవించే రక్తమును కట్టును. అరటిచెట్టు రసమున్ను రక్తస్రావమును కట్టును పచ్చిపొత్తి(Bark) ఆకు వీని రసము బిడ్డలకు నల్లమందుయొక్క అధిక మోతాదువల్ల గలిగినమత్తును, విషమును విరుచును. వేళ్ళచూర్ణము పైత్యశాంతి జేయును; రక్తక్షీణమును, వ్రణమువలన, సవాయిరోగములవలన చెడిపోయినతత్వమును బాగుజేయును; ఎండిన ఆకులు, పొత్తులు వీనిభస్మములో (Potash salts) ఉండును. దీనిని లోపలికిచ్చిన పుల్లత్రేనుపులు, గుండెలోను, కడుపులోనుమంట, కడుపునొప్పి హరించును. ఈ భస్మమును బంగాళాదేశములో కూరలలో వేయుదురు పొత్తి (Bark) రసము 3 తులములయెత్తు 3 తులముల నెయ్యి కలిపి యిచ్చిన విరేచనములగును. రసముయొక్క మోతాదు 3-4 తులములయెత్తు. కషాయపుమోతాదు 4-5 తులములయెత్తు అడవి అరటి చెట్టుకున్ను సాధారణముగా పైగుణములై యుండును.

అరటిచెట్టునీడ:—Shade of plantain tree- మనోహరముగ నుండును; తాపము, పైత్యము, మేహము నణచును; ఇంటి పెరటిలో నొక చెట్టు సదా ఆరోగ్యముగ నుండును; రెండు మధ్యమము; మూడు వ్యాధిదెచ్చును; నాలుగుండిన నాశనముజేయును.

అరటిదూటపచ్చడి:—Pickle of tender part of do. చలవ జేయును. వాతపైత్యమును, తాపమును, శమింపజేయును, కఫమును హరించును.

అరటిపండ్లు సాధారణ గుణము:—Plantain generally - అరటి పండ్లలో తెల్లచక్రకేళీ, యర్రచక్రకేళీ, అమృతపాణీ, కర్పూరపు చక్రకేళీ, కొమ్మరటి, పచ్చరటి(పచ్చివాళం), వామనచక్రకేళీ, బొంతరటి, కొండరటి మొదలగు ననేక జాతులుగలవు. చక్రకేళీపండు, రాజుపండు సరిగాపండినవి మంచిసువాసన రుచి గలిగియుండును. అమృతపాణీ అరటిపండుపైన చర్మము కొంత నల్లబడిన తరువాత

తినిన అమృత తుల్యముగ నుండును. కర్పూరపు చక్రకేళీ దానంతటది నేలమీద పండినవి మంచి సువాసన రుచిగలిగియుండును. కొమ్మరటి ఎఱ్ఱగా పొడవుగా నుండునుగాని ఒక మోస్తరు రుచిగానుండును. పచ్చరటి పండు పచ్చగా పొడవుగా సువాసనగ మంచిరుచిగా నుండును. బొంతరటి కూరలకు వాడుదురు. పండినపండు అంతరుచిగా నుండదు. అరటిపండ్లు సాధారణముగా బాగా ముదిరి వానంతట అవి పండినవి తియ్యగా రుచిగాను మనోహరముగా నుండును. సంతోషము నిచ్చును, దేవతా ప్రీతికరమైనవి మేహశాంతి, పైత్యశాంతి, వీర్యపుష్టి, బలము జేయును, ఆలస్యముగ జీర్ణమగును; చిక్కనిరక్తమును బుట్టించును; గుండెలను, పొట్టను మృదువుపరచును; కాకను, పైత్యమును, పొడిదగ్గును, ఆకలి దప్పికలను అణచును; గొంతుకను శుభ్రపరచును. కాకతత్వముగలవారికి పుంస్త్వమును హెచ్చించును, గుర్దాలకు (Kidneys) సత్తువ జేయును; వాతశ్లేష్మతత్వములుగల వారికి, నేత్రరోగము, బుడ్డగలవారికి జబ్బుజేయును; అజీర్ణము, మూలవ్యాధి, దగ్గు పీనిని బుట్టించును, వాతశ్లేష్మములను హెచ్చించును; మూత్రములో సుద్దపుట్టించును; పరగడుపున దీనినీళ్ళు త్రావిన గ్రహణిరోగము పుట్టును. అమితముగ దినిన అజీర్ణవిరేచనములగును. దీనికి విరుగుళ్ళు 1 దీనిచర్మము, 2 పంచదార, 3 పటికెపంచదార, 4 తేనె, 5 ఏలకులు, 6 మిరియాలపొడి లేక కషాయము, 7 నెయ్యి, 8 పొగడపండు, 9 ఉప్పు, 10 అల్లము. మరియు బాగుగ పండినచక్రకేళి అమృతపాణి, రసదాడి లేక కర్పూరకేళి అరటిపండ్లు పురాణరక్తగ్రహణిని, అజీర్ణవిరేచనములను కట్టును. ఈ పండున్ను ప్రాతచింతపండున్ను, ప్రాతబెల్లపుపాకమునుగాని, ఉప్పుగాని కలిపి యిచ్చిన రక్తగ్రహణి కట్టును. మోతాదు: అరటిపండు 3 తులముల యెత్తు, చింతపండు 1½ తులముల యెత్తు, ఉప్పు మువ్వావలయెత్తు బెల్లపు

పాకము తులమెత్తుకలిపి దినమునకు రెండుమూడుమార్లు ఇయ్యనగును. ఆరంభమున బెల్లపుపాకము పురాణగ్రహణికి ఉప్పుగలిపి యిచ్చిన బాగుగ పనిజేయును మూడు లేక నాల్గు మోతాదులతో కట్టును.

అరటిపండ్ల పచ్చడి:—Pickle made of Plantains. చెక్కెరతోగాని, బెల్లముతోగాని చేసినది రుచిగా నుండును. పైత్యముహరించును; శ్లేష్మము జేయును.దీనికి విరుగుళ్ళు 1 మిరియాలపొడి 2 తేనె.

అరటిపువ్వు:— Plant in flower. దీనిరసముగాని, కూరగాని, చూర్ణముగాని వగరుగా, వెగటుగా, రుచిగా నుండును; మలబద్ధము జేయును; ఆలస్యముగా జీర్ణమగును; పైత్యము, వాతము,రక్తపైత్యము, జ్వరాతిసారము, గ్రహణి, రక్తాతిసారము, క్రిమిరోగము వీనిని బోగొట్టును; చలవజేయును; పువ్వులరసములో పెరుగుకలిపి యిచ్చిన రక్తగ్రహణి, ఋతురక్తస్రావముకట్టును. మోతాదు 4 లేక 5 తు॥ మెత్తు. రసములో 2 తు॥మెత్తు పెరుగు కలిపి ఇయ్యనగును; దినమునకు 2 లేక 3 మార్లు ఇయ్యనగును.

అరటిపువ్వు వడియములు:—Buns or cakes made of do.వగరుగ రుచిగ నుండును; కాస, శ్వాస, కార్శ్యము వీనిని హరించును;కఫరోగులకు, రక్తాతిసారరోగులకు హితకరముగ నుండును.

అరటిమొవ్వు పాన్పు:—Bed of tender plantain leaves.చలవజేయును; అహ్లాదకరముగ నుండును; తాపమణచును. అగ్నితప్తమయిన వారికి మిక్కిలి అనుకూలించును.

అరటియాకులో భోజనము:—Taking food in a plantain leaf. పరిశుభ్రముగ మనోహరముగ నుండును; జ్వరము, క్షయ, శ్లేష్మవాతము, శ్వాసకాసలు, శ్లేష్మపైత్యము వీని నణచును, జఠరదీప్తి, వీర్యపుష్టి, బలము, ఆయుర్వృద్ధి, కాంతి వీని నిచ్చును;విషమును గొట్టును; రుచి బుట్టించును; మిక్కిలి ప్రశస్తమైనది.

రఫూస: —Dammer. అనగా ధూపదవృక్షముయొక్క జిగురు ధూపదవృక్షము చూడుడు.

అరిసెలు:—A sort of cakes. వీనిని అతిరసములనియు నందురు. ఇవి రుచిగనుండును; గురుత్వముజేయును; శీతపైత్యమును, కడుపు నొప్పిని మేహావాతనొప్పులను బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 ఓమము, 2 ఉదకము, 3 మోడిచూర్ణము. మరియు పిండివంటలు చూడుడు.

అరోరూటుపిండి:—Maranta Arundinacea Eng. Arrowroot. ఇది యొక పసుపుచెట్టువంటి చెట్టుదుంపలోనుండి తీసినది. దీనిని నీళ్ళలోగాని, పాలలోగాని వేసిచేసిన జావ వ్యాధిగ్రస్తులయిన వారికి గాని, బిడ్డలకుగాని తేలికయిన ఆహారముగ నుండును; అన్ని విషములను విరుచును

అలచందకాయలు వీనిపప్పు:—Dolichos cylindricus D.Sinensis row grods & puls. సం* రాజమాష, మమత్సార. హిం*లోబియా యీ కాయలు బొబ్బరి కాయల ఆకారముగా నుండునుగాని వాటి కన్నా లావుగా 1-1½ అడుగుల పొడవుగా తెల్లగ మృదువుగా నుం డును. వగరు తీపి రుచులు గలిగియుండును. లేతకాయలు కూర వండుదురు, యితర కూరలలో వేయుదురు. రుచిగానుండును, స్థన్యమును వృద్ధిపరచును, ఆమ్లదోషమును, కఫవాతములను అగ్ని మాంద్యము గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు 1 శొంఠి, 2 కరక్కాయ పెచ్చులు ఉప్పు వీనితో చేసిన చూర్ణము, 3 నువ్వు చెట్టు కాల్చిన క్షారము. దీని ఎండిన గింజలు పప్పుతో గారెలు చేయుదురు రుచిగా నుండును. దీని వేయించినపప్పు, పప్పుగా వండిన లేక కట్టుగా చేసినను రుచిగానుండును. దేహపుష్టినిచ్చును, గురుత్వము శ్లేష్మము జేయును. దీనికి విరుగుళ్ళు 1 ఓమము, 2 పిప్పళ్లు 3 కలిన రజోదోషమును పోగొట్టును, వీర్యవృద్ధి జేయును.

అల్లనేరేడు పండు:— Rose apple. సం॥ రాజజంబూ. మిక్కిలి చల్ల చేయును; మేహాపైత్యములను కఫపైత్యమును జయించును. గ్రహణిని కట్టును. గురుత్వముగ నుండును. దీనికి విరుగుడు నేరేడు పండు చూడుము.

అల్లపుగడ్డి:— Ginger grass. ఈ గడ్డి నలిపిన అల్లపు వాసన వేయును. దీనితో తీసిన తైలము వాతపునొప్పులను హరించును. దీని తేట కషాయము పొట్టకు బలము చేయును; జ్వరమును హరించును, కా జేయును; నరములకు సత్తువ జేయును. మోతాదు పూటకు 8-4 తు. కొలత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును.

అల్లపుమురబ్బా:— Ginger soaked in honey. అల్లము చూడుము.

అల్లము:— Zingiber Officinali. Eng. Ginger. సం॥ ఆర్ద్రిక, శృంగిబేరం, మహౌషధం. హిం॥ అదరిక్. ఇది వేడిజేసి అర్చును. కారముగా నుండును. త్రిదోషములను, అన్ని పైత్యములను, సన్నిపాతములను హరించును. జఠరదీప్తి, బలము, వీర్యవృద్ధి, దేహ పుష్టి, కాంతి వీనినిచ్చును; రుచి బుట్టించును; మేహము, పాండువు, ఉబ్బు, గుల్మము, కడుపులో బల్ల, శూల, శోష, అరుచి, పీనస, కంఠము, నాసికము, వీనియందు బుట్టెడు రోగములు, శ్లీపదమును ఏనుగుకాలురోగము, అజీర్ణము, అగ్నిమాంద్యము, మూత్రకృచ్ఛ్రము, మలమూత్రబద్ధము, క్షయ, కాస, శ్వాస వీనినిబోగొట్టను; జ్ఞాపకశక్తిని బలపరచును, జీర్ణము గావించును; కార్జమునకు (Liver) బలము చేయును; దానిని శుభ్రపరచును, పొట్టలోని వాతమును హరించి మృదువుపరచును; కడుపులోని చెడుపదార్థములను తీసి వేయును; క్రిములను చంపును; కఫమువల్ల బుట్టిన విదాహము నణచును; అజీర్ణవిరేచనముల కట్టును; జలుబు (శీతలము) చేసెడు ఫల హారములవల్ల గలిగెడు జబ్బునూ తీసివేయును. సగము ఉడికిన కోడి

గ్రుడ్డుతో తినిన వీర్యవృద్ధిచేయును కొద్దిగ అల్లపురసములో కొద్దిగ కుంకంపువ్వు మిశ్రముజేసి దూదె ముంచి ఏ పార్శ్వమునందు తల నొప్పియుండు ఆముక్కులో 3-4 చుక్కలువేసి పీల్చిన పార్శ్వపు తల నొప్పి మానును. 3 రోజులు చేయవలెను. అల్లము, బెల్లము సమముగ కలిపి తినిన నాలుక, అరచేతులు, అరకాళ్లు వీనిపై పొరలు ఊడడము, కొద్దికొద్దిగా విరేచనములవడము ఈగుణములు కట్టును. అల్లముతినుటవలన గొంతుక బొంగురు బారజేయును, దీనికి విరుగుళ్ళు 1 చందనము, 2 వాతశరీరులకు పాలు, 3 కాకశరీరులకు బాదాంచముకు, 4 చక్కెర, 5 తేనె. అల్లపుమురబ్బాకున్ను పైన జెప్పిన సుగుణములలో చాలాగలిగియుండును; మిక్కిలి మంచిది.

అల్లముపచ్చడి:—**Ginger Pickle.** అరుచిని బోగొట్టును; జఠరదీప్తి నిచ్చును; పైత్యవాతములను శమింపజేయును; కఫమును వృద్ధి చేయును.

అల్లము ఊరవేసినది:—**Ginger soaked in lime Juice & rock salt.** అనగా నిమపళ్ళరసము, సైంధవలవణముతో ఊరవేయబడినది. శ్లేష్మమును గొట్టును; రుచిబుట్టించును; వాతము, అజీర్ణము హరించును. నానాముఖకంఠగతరోగములను, గుల్మము, ఉబ్బు, పాండురోగములను బోగొట్టును; మనోహరముగనుండును. మరియు ముప్పది ఫలములయెత్తు అల్లము, మూడుఫలములయెత్తు సైంధవ లవణము, ఇవి మాదీఫలరసముబోసి కలిపి ఊరనిచ్చి పుచ్చుకొనిన అగ్నిదీప్తిని, కాంతిని యిచ్చును; కాకజేయును; వాతశ్లేష్మములను హరించును. కాస, శ్వాస, కంఠరోగము వీనిని బోగొట్టును; వీర్య పుష్టినిచ్చును. అల్లము కుమ్ములో వుడికించి చర్మము గీసివేసి సన్నముగ ముక్కలుకోసి ఉప్పుమెత్తగానూరి తగినంతకలిపి నమిలిమ్రిం

గిన అజీర్ణము, పుల్లి తేనుపులు హరించును. మోతాదు ½ నుండి 1 తులమెత్తువరకు (అరతులమెత్తు మొదలు తులమెత్తువరకు)

అల్లి చెట్టు:—Memecylon Tinctorium, M. Edule. Eng. Iron wood tree. సం॥ జాలకం, అంజనీ. ఇదియొక అడవిచెట్టు; ఇది వర్ష కాలమందు చెట్టంతయు నీలవర్ణమైన పుష్పములను పూచి, పండ్లు పండును, ఈపండ్లు రుచిగనుండును; విస్తారముగ తినిన క్రిమిని పుట్టించును. దీనిఆకులు, వేరు వగరుగనుండును వీని కషాయము విరేచనము కట్టును; చలవ, మేహశాంతి జేయును; కుసుమరోగము, సెగరోగము, అతిబుతుర క్తస్రావము వీనిని కట్టును. మోతాదు పూటకు 3–6తు॥ మెత్తువరకు. దీని ఆకులను దంచి అందులో వేడినీళ్ళుపోసి పిసికి వడపోసి ఆనీళ్ళు కళ్ళలో పోసిన పొరలు, కూసలు, మొదలగు నేత్రరోగములను హరించును. ఆ నీళ్ళతో కండ్లు కడిగినను నేత్రరోగులకు మేలుజేయును.

అవగూద చెట్టుపండు:—కాకిదొండ చెట్టు చూడుడు.

అవిసె చెట్టు:— Agati Grandiflora Sesbania. G. Eng. Linseed plant. సం॥ ఉమా, అతసీ. హిం॥ అగస్తియా; మసినా. వీనిని అగిసె చెట్టనియునందురు. ఇవి తెలుపు, ఎరుపు, నలుపు, పసుపు. రంగుగల పువ్వులు పూయును. దీనిమానుపట్ట ఆకుపువ్వు చేదుగనుండును; వీనిరసము కాకజేయును; కఫము, క్రిమిరోగము, పైత్యము జ్వరము వీనినిహరించును; రక్తపైత్యము నణచును; విరేచనము జేయును; పురికొస సర్పము వీనివిషముల పోగొట్టును. అగ్నిదీప్తినిచ్చును; అరుచి పోగొట్టును. పట్టరసము లేక ఆకుపువ్వురసముయొక్క మోతాదు పూటకు 2–4 తు॥ మెత్తువరకు. చూర్ణపు మోతాదు పూటకు 2–4 చిణాల మెత్తువరకు. ఆకురసమునుగాని అందులో కొద్దిగ గుల్లసున్నము కలిపిగాని దట్ట

ముగ పట్టించి అందుపైన దూది అంటించిన గవదబిళ్ళలు హారిం
చును; ఆకురసము పైనపూసిన నవి మానును. పురికొస, సర్ప
విషములను పైనపూసి లోపలికియ్యవగును. దురదలకును పైన
పూయనగును. దీని ఆకు లేతకాయలు, పువ్వులకూర పుచ్చుకొనిన
విరేచనము జేయును, పైత్యము, ఉబ్బు క్రిమిని, కఫవాతములు
శూల, ప్లీహగుల్మము, పాండువు, విషము, హృద్రోగము, రేజీకటి
పోగొట్టును; ఆరోగ్యము నిచ్చును. ఆకురసము ముక్కులో పిండిన
జ్వరముయొక్క ఉద్రేక మణచును ఎండించిన దీని ఆకు రెండు
వరహాలయెత్తు 5-6 తు॥ సారాయిలోగాని, వేడినీళ్ళలోగాని
ఊరనిచ్చి అది పుచ్చుకొనిన సునాముఖికషాయమువలె విరేచన
ముల జేయును. దీని పువ్వుల రసమును కండ్లలోపిండిన మసకలు,
మందదృష్టి, రేజీకటి వీనిని హారించును. దీనిగింజలు అంతగా వుప
యోగ పడవు. గాని సీమఅవిసిగింజలు యెక్కువ వుపయోగకర
మైనవి. సీమఅవిసిగింజలు చూడుడు.

అవిశనూనె:—Linseed oil. అనగా సీమఅవిసిగింజల నూనె. ఇదియే
బజారులో అమ్మేది. సీమఅవిసిగింజలు చూడుడు. (enema)
చేయుట కనుకూలించును. వీని చూర్ణము వేడినీళ్ళలో గలిపి
కట్టిన వ్రణములు మానును.

అశోకవృక్షము—Saraca Indica & Jonesia Asoka-Eng.
Asoka tree. సం॥ అశోక, శోకనాశ, హేమపుష్ప. హిం॥
అశోక్. ఇది విస్తారముగా పువ్వులు పూయును; పరిమళముగ,
శీతలముగ నుండును; దీని చెక్క కషాయము లేక చూర్ణము వగరు
చేదుగనుండును. సర్వవ్రణములను, క్రిమిరోగము, కఫము, జంతు
విషములు, కుసుమరోగములు హరించును. కషాయపు మోతాదు
2-4 తు॥ వరకు. చూర్ణపు మోతాదు 2-4 అణాలయెత్తు

వరకు. దీని చెక్కదంచి వెచ్చచేసి కట్టిన వాత మేహవ్రా నొప్పులను (Rheumatic pains) హరించుచు. దీని చెక్క కషాయము అనగా సేరునీళ్ళలో 10 తులముల చెక్కవేసి అర్థపాడుగా కాచిదించి కొద్దిగ పంచదార చేర్చినది, రెండు మోతాదులు చేసి రెండుపూటలు పుచ్చుకొనుచుండిన కుసుమరోగము (Leucorrhoea), యోనిరోగములు (Uterus complaints) వీనిని హరించును ఋతురక్తమును క్రమపరచును. మరియు దీని చెక్క 8 తులములు, ఆవుపాలు 8 తులములు, నీళ్ళు 32 తులములు కలిపి నీళ్ళుమాత్రము ఇగురువరకు కాచి దింపుకున్న కషాయము మూడు మోతాదులుగ చేసి దినమునకు 3 మోతాదులు పుచ్చుకొనుచుండిన అమిత ఋతురక్తస్రావము (Menorrhagia) ను కట్టును. ఈమూలిక పైనచెప్పిన విధములలో నేవిధముగానైన 15 దినములకు తక్కువగాకుండ పుచ్చుకొనవలెను.

అశ్వమూత్రము:—Horse urine. కారముగా, వెగటుగా నుండును. కాకజేయును; కండ్లవాతము, కఫము, ఛర్ది, కాసము, క్రిమి, కుష్ఠము, దద్దుర్లు, వాతము, శ్లీపదము, వ్రణములు, గుల్మము వీనిని నణచును.

అశ్వారోహణము:—Horse riding. సౌకర్యమైనది, చెమట, అలసటను బుట్టించును, శౌర్యమును గలుగజేయుచు; కాకజేయును; జఠరందీప్తి, బలము, పుష్టినిచ్చును; వయస్సును నిలుపును; మేదోరోగ, కఫరోగములనణచును; మూలవ్యాధి, భగందరము, రక్తపైత్యము. ఈరోగులను బాధించును; అభిఘాతజ్వరముబుట్టించును.

అష్టగుణమండము:—A sort of Cunjee prepared with rice, green gram dhall & c. బియ్యము 1 పాలు. పెసలు అరపాలు జేర్చి కొద్దిగ వేయించి తగుమాత్రము నీళ్ళుపోసి వండుచు అందులో

కొద్దిగ ఇంగువ, సైంధవలవణము, ధనియాలు, ఆకుపత్రికము శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు వీని సమభాగచూర్ణము తగుమాత్రముగా కలిపి పలచగనుండునటుల పచనముచేసిన అష్టగుణమండ మనబడును. ఇది జ్వరమును, త్రిదోషములను హరించును, రక్తవృద్ధిచేయును. జఠరదీప్తినిచ్చును. సమశీతోష్ణముగ, చలవనుండును.

అష్టదిక్కుల గాలులు: —Winds from 8 directions.

1. తూర్పునుండి వచ్చెడుగాలి, Eastern wind. ఉష్ణగా మధురముగా నుండును, విదాహము బుట్టించును; కఫపైత్యములను, ఉబ్బరోగమును, వాతరోగమును నెక్కువచేయును.

2. ఆగ్నేయదిక్కుగాలి:—South Eastern wind. జిగటగా, వేడిగానుండి నేత్రములకు హితవుగా నుండును.

3. దక్షిణదిక్కుగాలి:—Southern wind. త్రిదోషహరమయినది; మిక్కిలి ఆరోగ్యమిచ్చును.

4 నైరుతిదిక్కుగాలి:—South western wind. మోహమును, తాపమును బుట్టించును; సర్వరోగములను గలుగజేయును.

5. పశ్చిమదిక్కుగాలి:—Western wind. జిగటుగా నుండును; మిక్కిలి శాక జేయును.

6. వాయువ్యదిక్కుగాలి:—North-western wind. కారముగా, చేదుగా నుండును, ఒంటినీరు ఆర్చును; తాపము, దాహము బుట్టించును; కఫమును, పైత్యమును శమింపజేయును.

7. ఉత్తరదిక్కుగాలి:—Northern wind. స్వాదుగా జిగటగా, చల్లగానుండును; ధాతువులకు బలముజేయును; గాని శీతసైగ్యమును బుట్టించును.

8. ఈశాన్యదిక్కుగాలి:—North Eastern wind. మధురముగా, మనోహరముగనుండును; సమధాతువుజేయును; శీతపైత్యమును,

కఫవాతమును, స్తంభవాతమును, కంపవాతమునుగొట్టును; స్త్రీ రోగమును, రక్తపైత్యమునుగలుగజేయును; జఠరదీప్తి నిచ్చును.

అష్టవర్గు :— Compound powder or decoction of 8 drugs. అనగా ఋద్ధి, వృద్ధి, కాకోళి, క్షీరకాకోళి, మేద, మహామేద, జీవకము, ఋషభకము వీనికి అష్టవర్గని పేరు. వీనిచూర్ణము, లేక కషాయము మేహశాంతి, బలము, కాంతి, స్త్రీలకు గర్భదోషములను పోగొట్టి సంతానమును నిలుపును. వీర్యవృద్ధిజేయును; పైత్య వాతమును హరించును. చూర్ణపు మోతాదు పూటకు 2-4 చిన్నముల యెత్తు వరకు. కషాయపు మోతాదు పూటకు 4, 5 తులముల యెత్తు.

—o—

## ఆ

ఆకాశగరుడ:—Bryonia Epigoea. దీనిని నాగదొండయని, మురుదొండయని, రాకాసిగెడ్డయని అందురు. తీగెప్రాకును; దీని పండ్లు యెర్రగ, జంటగనుండును. గబ్బువాసన గలిగియుండును;ఆకు చేదుగనుండును. దుంప చేదు, పులుపు, రుచులు గలిగి, జిగటగనుండును. దీనిని వ్రేలాడగట్టిన దీనిలోనుండి మొక్కలు లేచును; విరేచనము జేయును; క్రిమినిహరించును, తత్వమును మంచికిమార్చును; దేహములోని మలముల వెడలించును; పురాణ సుఖవ్యాధులు అనగా సవాయివ్యాధులు, రక్తగ్రహణి, సర్పవిషము వీనిని హరించును.వ్యాధులకు దీనిచూర్ణము లోపలికిచ్చెడు మోతాదు వరహా యెత్తు (40 గురిగింజ పూసలయెత్తు) 24 గంటలలో కొద్దికొద్దిగ నియ్యతగియుండును. ఈవరుసను వారము లేక పదిదినము లియ్యవలెను;1-2వి రేచనముల జేయును.సర్పవిషములకుదీనిదుంప నీళ్ళతో గంధముతీసి అరతులము యెత్తుకు లోపుగ లోపలికిచ్చి కొంత

కరచినచోట పూసిన విషమువిరుగును. తేలువిషమునకు కట్టినచోట దీనిగంధము పూసి నిప్పుతో కాచిన విషము హరించును. పచ్చి దుంపను జీలకర్ర, సీకల్లిపాయలు వేసి నూరి ఆముదములో కలిపి మర్దనచేసినపురాణవాత మేహవాతనొప్పులు ముడుచుకొని పోయిన కీళ్ళు(Contracted joints ) ఇవి బాగగును. మంచి తిథివారనక్షత్రములయందుతీసిన దీనిదుంప పిశాచబాధను తొలగించును.

ఆకుచెముడు చెట్టు:—Euphorbi Nerifolia సం * స్నూసజపత్ర, సుఖరేచన, దళస్నుహీ. హిం*తోహర్ దీనిఆకురసము కారముగ వెగటుగ నుండును; మిక్కిలి వేడిజేయును; కఫవాతము, ప్లీహ, గుల్మము, మూలవ్యాధి, రక్తవాతము బాలపాపచిన్నెలనెడు రోగము వీనిని హరించును; మూత్రమును జారీచేయును; గాఢవిరేచనకారి; ఉదరము, కఫము, శ్లేష్మము వీనిని హరించును; పురాణ ఆహికజ్వరమువలన గలిగిన ఉబ్బు, ఉదరము,కడుపు, పొత్తికడుపు, వీనిలోకూడియుండి వెడలని దుష్ట ద్రవ్యములను లేక మలములను వెడలించును. మోతాదు అరవరహాయెత్తు మొదలు తులమెత్తు వరకు వట్టిదిగాని, సమముగ తేనె గలిపిగాని యియ్యనగును. దీని ఆకు రసములో వేపనూనె గలిపి దానితో మర్దనచేసిన వాతముచేత కాళ్ళు, చేతులు, కీళ్లు బిగదీసికొనుట (contracted limbs or joints) నయమగును. దీని వేరుచెక్కను బియ్యపుకడుగు, అరాకు ( arrack )సారాయున్ని కలిపి అందులో వేసి కాచి దానిని లోపలి కిచ్చిన ఉబ్బు, ఉదరరోగములు నివృత్తించును. మోతాదు పూటకు 1-2 తులములయెత్తు దీని మానుపోలు 1-2 చుక్కలు పేడు లేక యెనిమిది తులములయెత్తు చల్లలోవేసి కాచి వడియకట్టి యిచ్చిన విరేచనములగును. దీని ఆకురసము, వేరురసము, లేక పాలు మోతాదెక్కువైన, ప్రేగులకు నష్టము, అతికాక, పైత్యము

జేయును. దారుణ విరేచనములు జేయును; వికారము పుట్టును. దీనికి విరుగుళ్ళు చెముడుచెట్టు చూడుడు. దీని ఆకురసము మొద లగునవి, చెముడుచెట్టు పాలు మొదలగు వానివలెనే జాగ్రత్తగ వాడతగియుండును.

ఆకుపత్రికము:— Cassia Lignea & Cinnamomum Tamala leaves of సం* తేజపత్ర, పాకరంజన, పత్ర, హిం* తేజపాత్, యిది ముద్దదాల్చినిచెట్టుఆకు వీని చూర్ణము లేక కషాయము వగరుగ, తీపిగ, సువాసనగ నుండును; వేడిజేసి ఆర్చును, త్రిదోషములు, ద్వంద్వరోగములు, మలమూత్రబద్ధము. శూల, విషూచి, ఎక్కిళ్ళు, అతిసారము, జ్వరములు, పైత్యపుమంటలు, దురద, శ్వాసకాసలు, పొత్తికడుపు, శిరస్సు, నోరు వీనియందు జనించెడు రోగములు వీని నన్నిటిని హరించును; తేలికను, జఠరదీప్తిని యిచ్చును; ప్రాణమును, శరీరములో నుండురక్తము, ఇంద్రియము మొదలగు ధాతువులను కాపాడును; అధికసంతోషమును,బలమును యిచ్చును; కడుపులోని వాతమును వెడలించును; పొట్టను శుభ్రపరచును; మూత్రము గావించును; ఋతురక్తమును జారీచేయును; స్త్రీలకు పాలుబడజేయును; చెమట బుట్టించును; భయము, పిరికితనము, నపుంసకత్వము వీనిని పోగొట్టును; శరీరములోనుండు అన్ని అవయవములకును సత్తువజేయును; నోటివెంట అధికముగ నీరూరడము కట్టును; వాయువు (గాలి) లో నుండు దుర్గంధమును, విష వాయువువల్ల గలిగెడు రోగములను తీసివేయును; హృదయము, కార్జము, పొట్ట, ప్రేగులు వీనిలో బుట్టు నొప్పులను హరించును; ఉబ్బురోగమును పోగొట్టును; మూత్రపుసంచిలోని రాళ్ళను తీసివేయును; శీఘ్రప్రసవము గావించును; మేహమును, కడుపులోను, పొత్తికడుపులోను అయ్యెడు వ్రణములను మాన్పును; దీనిని

మెల్లప్పుడు నోటిలోనుంచుకొనిన నత్తియూనును; టోపీలలోను, బట్టలలోను వీని నుంచిన పురుగులు వానిని కొట్టవు; నల్లదబ్బకు, నష్టముజేయును. ఇందుకు విరుగుడు హామీరామస్తకి. మూత్రపు సంచికి నష్టము జేయును; దీనికి విరుగుడు బేదనాగింజల పానకము. మాత్రపుమోతాదు పూటకు 2-5 చిన్నములమెత్తువరకు; కషాయపుమోతాదు పూటకు 3-6 తులములమెత్తువరకు యీచెక్కను ముద్దదాల్చిన చెక్కయందురు. సంతజ్; దాల్చినచెక్క గుణములు గలిగియుండును. దానికన్న కొంచము తక్కువ గుణముజేయును.

ఆకుకూరల సామాన్యగుణము:—శాకసామాన్యగుణముచూడుడు.

ఆకుకూరలు, కాయకూరలు, దుంపలు తినగూడనివారు:— Those who should avoid vegetable curries. శూల, గుల్మము, ఉదరము, ప్లీహా (కడుపులోబల్ల), క్రిమి, కుష్ఠు, అతిసారము. మూలవ్యాధి, గ్రహణి, ఉబ్బు, మేహవాతము, నేత్రరోగము, జ్వరము, అగ్నిమాంద్యము, ఈరోగములు గలవారు సామాన్యముగ శాకజాతములను వర్జించవలయును.

ఆగాకర:—Momordica Dioca. సం॥ మహాజాలి, విషఘ్ని, కర్కోటకీ. హిం॥ తోరయీా. దీని ఆకుకూర కఫపైత్యములను, మూలవ్యాధిని హరించును. జఠరదీప్తి, కాంతిని యిచ్చును; సర్వ విషములను హరించును. దీని పువ్వులు కిలాసకుష్ఠువు (అనగా మచ్చుమచ్చలుగావుండే కుష్ఠువు) అరుచి వీనిని పోగొట్టును.

ఆగాకరకాయలు:—Fruits of do-curry of. వీని కూర కొంచెము చిరిచేదుగా నుండును; త్రిదోషహరమైనది; ఎక్కిలి అగ్నిదీప్తి నిచ్చును; నేత్రములకు మంచిది; మూలవ్యాధి, ఎక్కిళ్ళు, గుల్మము, కాసశ్వాసలు, క్రిమి, కుష్ఠు, ప్రమేహము వీని నణచును; దేహపుష్టి నిచ్చును; తేలికగ జీర్ణమగును; క్షయ, గుల్మ, వ్రణ, గళ రోగులకును,

సమస్తరోగులకును మిక్కిలి పథ్యమైనది. ఈ కాయలను కొ
ముక్కలుగ కోసి నువ్వులనూనెలో వేసి కొన్నిదినములవరకు న
మెత్రబడునరకు యెండలోనుంచి తీసి ఆనూనెలో దూది త
గాయములపైన వేసిన శీఘ్రముగ మానును.

అగాకరదుంప, ఆకు:— Root & Leaves. వీని చూర్ణము
కషాయము లేక వీనిరసము చేదుగనుండును; కఫము, ద
వగర్పు, గుల్మము, హృద్రోగము, జ్వరము, క్రిమి, కష్టు,
నొప్పి వీనిని హరించును; వ్రణములను, గాయములను మాన్పు
పైత్యమును, శాక జేయును; దీనిదుంపతో చేసిన లేహ్యము రక్త
పడు మూలవ్యాధి, రక్తవిరేచనములు, అతిసారము వీనిని కట్టును.
చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 చిన్నముల యెత్తు
వరకు. కషాయపు మోతాదు 3-4 తులముల యెత్తు. రసపు
మోతాదు 2-3 తులములయెత్తు. లేహ్యపు మోతాదు పూటకు
½ మొదలు తులమెత్తువరకు. దీని సమూలపు కషాయము 4-5
తులములయెత్తుగాని దీని ఆకు ఉడికించినది 1-2 తులముల యెత్తు
గాని ప్రసవ స్త్రీలకిచ్చిన మైలరక్తము వెడలించును.

ఆగ్నేయదిక్కుగాలి:—అష్టదిక్కుల గాలి చూడుడు.

ఆట్రగడా, సన్నాట్రగడా ధాన్యములు:—A sort of paddy. యీ
రెండు ధాన్యములు బియ్యము చాలమంచివి. మంచి బలమైనవి.
జీర్ణకారి ఆరోగ్యకరమైనవి. మరియు ధాన్యములు చూడుడు.

ఆడాలు లేక అణ్యాలు:—Lepidium Sativum. Eng. Common
Cress. సం॥ చంద్రశూర, చర్మహంత్రి, హిం॥ హాలీమ్. ఇవి పెద్ద
ఆవాలంత ఉరవుగ, గుండ్రముగ, ఎర్రగనుండును; పొట్టకు బలము
జేయును; జీర్ణశక్తినిచ్చును; సౌమ్యమైన శాక జేయును; గర్భిణీస్త్రీల
కధికముగ నిచ్చిన గర్భస్రావము గలిగించును. వీనిని నిమ్మపండ్ల

రసముతోగాని పాలతోగాని నూరి కవుకు దెబ్బ తగిలినచోట పట్టువేసిన నొప్పిని హరించును; నిమ్మపండ్లరసముతోగాని, నీళ్లతో గాని నూరి శరీరమునకు నలుగుపెట్టిన చర్మరోగములునశించి శరీర కాంతి కలుగును. వీనిచూర్ణము, బెల్లము పాకముబట్టి అందులో బోసి కలిపిదించి గుండెలు మొదలగుచోట దెబ్బతగిలినవారికిచ్చిన నొప్పులు నివృత్తించును; లోపలరక్తము గడ్డకట్టి యుండినదానిని కరగగొట్టును. మోతాదు పూటకు తులమెత్తుచొప్పున రెండు పూటలను 3-4 దినము లియ్యవలెను.

అదిపచ్చపూనా:—జున్ను చూడుడు.

అదొండకాయ కూర:— Curry of raw fruits of Capparis Zeilanica. వాతశ్లేష్మము, విషము, గళరోగము. వ్రణరోగము నేత్రరోగము వీనిని బోగొట్టును, దేహకాంతినిచ్చును; పైత్యము, మలబద్ధము, అగ్నిమాంద్యముజేయును; దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పులుసు, 3 నువ్వుచెట్టు కాల్చి చేసినక్షారము.

అదొండకాయ వరుగు:— Dried fruit of do. దీని నూనెలో వేయించి పుచ్చుకొనిన క్రిములను హరించును; రుచి బుట్టించును; అగ్నిదీప్తి నిచ్చును, హృదయమునకు బలమిచ్చును.

అదొండచెట్టు:— Capparis Zeilanica. సం॥ అర్జట, ఆర్తగళ, దీనిని అరుదొండ అనియు నందురు. దీని వేరుచెక్క దారుణమయిన వాతములను హరించును; విరేచనము జేయును. దీనిని నాభికి వేసి కట్టుదురు. దీని చిగురు, మిరియాలు సమముగకలిపి నూరి కుంకుడు కాయంత మాత్రలుగట్టి ఉదయ సాయంకాలముల సేవించిన అతి మూత్రము గట్టును.

అనబఆకులు:—Leaves of Bottle gourd. దీని ఆకులరసము కాలిన చోట వెంటనే వ్రాయుచుండిన మంట, బాధ తగ్గి చీముపట్టకుండ జేయును.

**ఆనబకాయ:—Lagenaria Vulgaris, Cucurbita Lagenaria, Curry of Bottle gourd.** సం॥ రాజలాబు, తుంబి, అలాబు. హిం॥ కద్దు. మరాఠీ తోంబి. దీనిని సొరకాయయనియు, అందురు. వీనితో ఆకుపచ్చ, (నల్ల) తెలుపు, (తెలుపువాటు) పసపు, (పసపువాటు) 3 జాతులు. ఇందులో ఆకుపచ్చది శ్రేష్ఠము. దీనికూర శుక్రవృద్ధిజేయును కఫపిత్తములనుహరించును, మధురముగనుండును, చలవ జేయును; దాహాముణచును, మూత్రము గావించును; శీతపైత్యమునుగొట్టును; రుచిబుట్టించును; దేహాతత్వమును సౌమ్యపరచును; మేహాపైత్య వ్యాధులకు, పథ్యమైనది, కొలదివాతము, గురుత్వముజేయును. తెలుపు, పసపురంగువి చలవ జేయును. పైత్యము నణచును, కొద్దిగ శ్లేష్మవాత మలబద్ధము, అగ్నిమాంద్యములు చేయును. వాతశ్లేష్మరోగులకు అపథ్యమైనవి, వీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 పులుసుపెట్టుట, 3 శొంఠి, 4 పప్పు గలిపిననీళ్లు, 5 జీలకర్ర ఆనబఆకులు కషాయము పాండురోగమును హరించును. ఆనబ కొనలకూర అగ్నిదీప్తినిచ్చును. కఫపైత్యములను, ఆమదోషమును, శూల వీనిని హరించును. వీనిగింజలలోని పప్పు పంచదారలో గలిపి తినిన మేహశాంతి, వీర్యవృద్ధినిచ్చును. ఆనబచిప్పలో భోజనము అనారోగ్యమును దారిద్ర్యమును దెచ్చును. నిషేధమైనది.

**ఆబువ్వచెట్టు:—A creeping medicinal plant.** ఇది తీగెబ్రాకెడు చెట్టు. దీనివేరు, ఆకులరసము, లేక కషాయము, లేక మార్ణము, చేదుగనుండును, గ్రహణి, అతిసారము, త్రిదోషములు, కుష్ఠ, దురద మొదలగు చర్మరోగములు, కుసుమరోగములు, ప్రమేహము ఆమపైత్యము వీనిని బోగొట్టును. దీనివేరు గ్రహబాధను, తొలగించును, రసము మోతాదు పూటకు 2-3 తులములవెత్తు

కషాయపు మోతాదు పూటకు 2 - 5 తులముల యెత్తువరకు.
చూర్ణపు మోతాదు పూటకు 2-4 చిన్నములయెత్తువరకు.

ఆముదపుకాయలు:— curry of young fruits of castor oil plant. లేతకాయలకూర వాతమును గొట్టును; వీర్యమునకు వేడి జేయును; గుల్మము,కడుపులోబల్ల.మూలవ్యాధి వీనిని బోగొట్టును. రక్తగ్రహిణి, జిగటవిరేచనములు కట్టును.

ఆముదపుచెట్టు:— Ricinis Communis - castor oil plant సం॥ఏరండ, పంచాంగుళ, వర్ధమాన హిం॥ ఏరెండ్. దీనిఆకులో భోజనము మిక్కిలి పైత్యముచేయును. వాతమును, శ్లేష్మమును హరించును. వాతముచేతను, మేహముచేతను పుట్టిన తలపోటునకు దీని ఆకులు మూడువాల్లు వేసి కట్టిన నివారణమగును. ఆముదపు వేరు రసము,చూర్ణము, లేక కషాయము. శూల, కఫవాతము, ఆమవాతము, వాతరక్తము వీనిని హరించును. దీనిపువ్వులకూర వేడిజేయును; వాతమునుగొట్టును; జిగటగనుండును; దేహపుష్టిని, అగ్నిదీప్తిని యిచ్చును.

ఆముదము:—Ricinis Communis. oil of (Castor oil). వేడిజేసి ఆర్చును; వెగటుగ, చిరిచేదుగ, జిగురుగనుండును; పైత్యము, శాకజేయును; జఠరమును బాగుపరచును; సమస్తవాతములు, శ్లేష్మము, గుల్మము, మూలవ్యాధి, బల్ల, ఉదరరోగము, గ్రహణి, సంగ్రహణి, విషమజ్వరము, కుష్ఠు, దురద, వాపు, నులిపురుగులు, సమస్తశూలలు, హృద్రోగము వీనిని హరించును; విరేచనము జేయును; ఊపిరిగొట్టు నొప్పి నణచును; మలమూత్రబంధమును విప్పును; పొత్తికడుపును శుభ్రపరచి అందు బుట్టెడు రోగములను, వాతగ్రంథులను, అండవృద్ధిని, అంతర్వృద్ధిని బోగొట్టును; దుష్టజలము, లేక రక్తముకూడి ఘట్టిపడిన దానిని కరగించును;

ఉత్తపరచును; నరములను శుభ్రపరచును; దుష్టజలమును వెడలించును; శిరోవాతమునుగొట్టును; దేహమునకు సత్తువనిచ్చును; జలుబుచేత పుట్టిన దగ్గును మేలుచేయును; నడుమునొప్పిని, మూత్రపుసంచిలోని నొప్పిని అణచును, స్త్రీల ఋతురక్తమును శుభ్రపరచును; ఆకలిని కొంచెము మందగింపచేయును;కడుపునొప్పిని బుట్టించును; దీనికి విరుగుడు పుదీనా. మోతాదు 1-8 తులములమొత్తు వరకు. దీనితో పైనమర్దనచేసిన వాత, మహావాతపునొప్పులు, ఇరుకు నొప్పులు హరించును.ఆముదములో సున్నముగాని కుంకుమ గాని కలిపి గజ్జకురుపులపైన పూసిన అవి శీఘ్రముగ చితికి మానును. చితికిన యెముక చూర్ణించి ఆముదములో గలిపి పగులని గడ్డలపైన దట్టముగ పూసిన నవి పగులును. మరియు ఆముదము వైద్యమున కనేకవిధముల నుపయోగించును. ఆముదముతో వెలిగింపబడినదీపము లక్ష్మీకరమైనది. నేత్రములకు చలువచేయును. ఆరోగ్యకరమైనది. ఆముదము తలకు మర్దనచేసుకుని శిరస్నానము చేయుచుండిన శిరోరోగములు శిరస్సునందు వేడితగ్గించి నేత్రరోగములుహరించును. 1 లేక 2½ ఔన్సుల ఆముదము దానిలోసగము అల్లపురసము దీనితో సమముగ తేనెయున్నూ గలిపి నిప్పులమీద ఒకపొంగు వచ్చునట్లు కాచి దింపుకుని గోరువెచ్చగనున్నప్పుడు పుచ్చుకొనిన విరేచనములు బాగుగ యగును. అమము,పైత్యము శ్లేష్మము, గుల్మమును తీసివేయును. ఆరోగ్యమిచ్చును. ఆపూట పలచని మిరియాలచారు అన్నము తినవలెను.

ఆముదము పుచ్చుకొనకూడనివారు:—Those who should not take castor oil. అరుచి,అతిసారము, ప్రమేహము, అపస్మారము, చర్ది, మూర్ఛ, విషదోషము, తీవ్రమయినజ్వరము, ఉన్మాదము, విషూచి, రక్తపైత్యము, ఈరోగములు గలవారు ఆముదము పుచ్చుకొనగూడదు.

అమ్లవేతసము:— Acido Zeyfolia. Eng. Common Sorrel. సం॥ అమ్లవేతస, చుక్ర, శతవేధి.హిం॥ అమల్ బేల్. దీనిని పుల్ల ప్రబ్బలియందురు. యిది తీగవలె ప్రాకును. దీనిపువ్వులు తెల్లగా నుండును. దీనికాయలు గుండ్రముగా నుండును. పచ్చివి ఆకుపచ్చ గాను, పండిన పసుపుపచ్చగాను, ఎండిన నల్లగానుండును. దీనితీగె జడవలె అల్లి బొంబాయి ప్రాంతములనుండి వచ్చును.దీనికాయలు ముక్కలు క్రిందకోసి ఎండించిన మామిడిచిన్నవలెనుండును. యిది, చాలా పుల్లగాను, రుచిగాను, లఘువుగానుండును; అగ్నిదీప్తి నిచ్చును; మలమూత్రములను గావించును; పైత్యము జేయును; వెంట్రుకలను నిగుర్పడునట్లుజేయును, మేకమాంసమును ద్రవింప జేసి సులభముగా జీర్ణింపజేయును. హృద్రోగము, శూల, గుల్మము, ప్లీహరోగము, ఉదావర్తము, ఎక్కిళ్ళు, అనాహము, శ్వాస, కాస, అజీర్ణము వీనిని నివారణజేయును యినుపసూదిని ద్రవింపజేయును; శనగపులుసు గుణమును పోలియుండును.

అమ్లవిశేషము:— A preparation of honey, jaggery & congeca or Rice washings. సం॥ శుక్త, రసామ్ల. ఇది చేయు విధము. ఒక మట్టికుండలో తేనె, బెల్లం, కలి, యీ మూడును సమభాగములుగ గూర్చి మూతపైచి ధాన్యపు రాసియందు 3 దినములుంచి తీసుకునేది. మేహశాంతిజేయును; విరేచనము గావించును. రక్తపైత్యము, శ్లేష్మము, మేదోరోగము,(అనగా దేహము స్థూలించే రోగము) వీనిని హరించును, అగ్నిదీప్తినిచ్చును; మోతాదు పూటకు 2 లేక 3 తులములవరకు.

అరికలు:— అళ్ళు చూడుడు.

అరుకణుపుల గానుగు:—A sort of Pongamia Glabra. సం॥ కురంటి. దీనివేరు, చెక్క, ఆకురసము,లేక కషాయము శ్లేష్మము, మూలవ్యాధి, క్రిములు, కుష్టువు, ప్రమేహము వీని నణచును.

ఆకుగంట్లు చోరము:—A sort zedoary. సం॥ పలాశీ, షడ్గ్రంథా. ఇది శీతలముగ నుండును; జ్వరము, ఆమరోగము రక్తదోషము, దగ్గు వీనిని హరించును; మలబద్ధము జేయును; శేలికనిచ్చును. ప్రి: చూర్ణపు మోతాదు పూటకు 1 మొదలు 2 అణాలయెత్తువరకు, కషాయపు మోతాదు పూటకు 4-5 తులములయెత్తువరకు.

ఆరుద్రపురుగులు:—Mutella Occidentalis. Eng. Maybug. సం॥ ఇంద్రగోప. ఇవి ఆరుద్రకార్తిలో భూమిలోనుంచి బయలుదేరును; ఎర్రగను ముఖమలుబట్టవలె మిక్కిలి మృదువుగ నుండును. వీనిని ఇంద్రభోగపు పురుగులనియు సూర్యపుటపు పురుగులనియు నందురు. వీని చూర్ణము లోపలికిచ్చిన వీర్యపుష్టి, బలము జేయును; పుంస్త్వమునిచ్చును; వీర్యస్తంభన జేయును. వీని చూర్ణము లేహ్యములలో గలుపుదురు. సర్పవిషమునుకూడ నివారణ చేయును. 6 వరహాల యెత్తు ఆకాశగరుడ దుంపచూర్ణములో 6 పురుగుల చూర్ణము గలిపి అందులోది 12-18 గోధుమగింజల యెత్తు చూర్ణమిచ్చిన సర్ప విషము హరించును. ఒకమారు మాత్రమియ్య తగియుండును.

ఆరెచెట్టు, పెద్ద ఆరెచెట్టు:—Woodfordia Floribunda, Grisles Tomentosa. సం॥ ధాతకీ, అశ్మంతక, వాలుకాపర్ణ. హిం॥ ధాయ్. ఇవి అడవులయందును, పర్వతప్రాంతములయందును లేచెడు ఒక చెట్టు. దీని ఆకులు దేవకాంచనం ఆకులవలె రెండాకులు జంటగా యుండును గాని చిన్నవిగానుండును. దీని చెక్కరసము లేక కషాయము చేదుగ వగరుగ నుండును. శ్లేష్మము, కాస, అతిపైత్యము కుసుమరోగము, వ్రణములు, శూలలు, కర్ణవ్రణములు, నాడీవ్రణములు వీనిని హరించును. వి రేచనబద్ధము, చలవ జేయును; కఫమును రక్తపైత్యమును, జయించును. రసముయొక్క మోతాదు 2-3 తులముల యెత్తు; కషాయపు మోతాదు 2½ - 5 తులముల యెత్తువరకు.

ఆరెపువ్వు:—Flowers of do. సం॥ ధాతకీ, వహ్నిపుష్పా. హిం॥ ధాయి. దీనిని ధాతకీపుష్పమందురు. వీని కషాయముతో కురుపులను, పుండ్లను కడిగినను వీనిచూర్ణము పుండ్లమీద జల్లినను శీఘ్రముగా మానును. వీనిచూర్ణము, లేక కషాయము వగరు, చేదుగనుండును; కఫము, పైత్యము, విసర్పి, అతిసారము, గ్రహణి, ఉబ్బులు, కుసుమరోగము, పాండువు వీనిని హరించును. చూర్ణపు మోతాదు 3 మొదలు 6 చిన్నముల, యెత్తువరకు, కషాయపు మోతాదు 4-6 తులములయెత్తు.

ఆలిచిప్పల మాంసము:—చిప్పల మాంసము చూడుడు.

ఆలుగు మాంసము:—Armadillo-flesh of. బలముజేయును; క్రిమి, కుష్ఠు, క్షయ, వాతపైత్యము వీనిని బోగొట్టును; అగ్నిమాంద్యము, గురుత్వము జేయును; దీనికి విరుగుడు సిరకా.

ఆలుదుంపలు:—Solanum Tuberosum Eng. Potatoes. సం॥ ఆలు, ఆలుక, హి ॥ ఆలు. వీనిని బంగాళాదుంపలనియు, ఉర్లగెడ్డలనియు నందురు. యీ దుంపలను ఉడకబెట్టి చర్మముతీసి అనేక విధములుగా వంటచేయుదురు. యీ దుంపలు సాధారణముగా బలమైన ఆహారములలో నొకటి. అనేక విధములుగా వంటచేయుదురు. జీర్ణశక్తిగలవారికి బలము, పుష్టి, వీర్యవృద్ధి నిచ్చును. అమితముగ తినిన సుద్దను పుట్టించును; వాతముజేయును, కడుపుబ్బు, అజీర్ణము కలుగజేయును దీనికి విరుగుడు బియ్యపుకడుగు. యీ దుంపలతో పిండి తయారుచేసి వాడుదురు.

ఆలుబఖారా:—Prunus Communis. P. Insititia Eng. The Bokhara Plum or Alu Bokhara or prunes. సం॥ ఆరుకా, వీరసేన.హిం ఆలుబుఖారా. ఈపండ్లు పుల్లగ కొద్దితీపి, వగరు,రుచిగనుండును, రుచి బుట్టించును, చలవ, మేహశాంతి, పైత్యశాంతి,

దాహశాంతి జేయును, పరగడుపున బుచ్చుకొనిన విరేచనము జేయు ను;జీర్ణశక్తిని బుట్టించును;వీనికషాయము పైత్యజ్వరము, తాపము, దాహము వీని నణచును. యీపండ్లతో కాచిన చారు రోగులకివ్వ వచ్చును, పథ్యకరమైనది రుచిబుట్టించును.యీపండ్లు రోగులకు భోజనమైన తరువాత పుచ్చుకొనిన జిహ్వాకు రుచిగలిగి ఆరోగ్య మిచ్చును. దీనివేరు వగరుగ నుండును; విరేచనములను కట్టును.

ఆలుబాలు అనే పండ్లు:—Fruits called Alubalu. ఇవి పులుపు, తీపి రెండు విధములుగనుండును. పుల్లనివి వేడిజేయును. తియ్యనివి పొట్టకు బలమిచ్చును. విశేషముగాపచ్చు తుమ్ములనుహరించును; చలవ, విరేచనబద్ధముజేయును.

ఆవకాయ:—Mango pickle prepared with mustard, chillies and oil.ఆవబెట్టినమామిడికాయ రుచిగానుండును;పైత్యము, కాక చేయును. వాతము నణచును; జీర్ణముగావించును; మేహవాత మును,కఫమును,దగ్గును హెచ్చించులు;వీర్యముకు వేడిబుట్టించును, అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 మజ్జిగ, 3 కలిసిళ్ళు.

ఆవఆకు కూర:—Curry of Mustard leaves. వెగటుగా, తేలికగా నుండును త్రిదోషములను హరించును. గ్రహణి, మూలవ్యాధి, వీనినిశమింప జేయును,మలమూత్రబద్ధముగావించును.దీనికి విరుగుడు చంద్రచెక్కపొడి.

ఆవనూనె:—Mustard oil. వెగటు, పొగరు గలిగియుండును. వేడి జేయును. కఫవాతదోషముల నణచును. అన్ని కుష్టులు, క్రిమి రోగము, మూలవ్యాధి, గండమాలలు, వ్రణములు, శుక్లవాతము, శూలలు, కర్ణరోగము వీనిని హరించును. తేలికగ నుండును. వాపు నరములపట్టు, నొప్పులు వీనిని నివర్తింప జేయును.నరములకు సత్తువ జేయును.పైత్యము, రక్తపైత్యమును బుట్టించును. దీనికి విరుగుడు

కలిసీళ్ళు. కొన్ని దేశములలో దీనిని నేతిలో, నూనెకు ప్రతిగా కూరలలో పోగుపులకు (for seasoning) వాడుదురు. అందువలన దేహాపు శాక హెచ్చును. బలము, సౌఖ్యము గలుగును. భుజించిన ఆహార మును జీర్ణము జేయును. వాతతత్వము గలవారికి మిక్కిలి అనుకూల ముగనుండును. ఇది పుచ్చుకొనుటకును, పైన పూయుటకును ఉప యోగించ తగినది.

ఆవపిండి:— Mustard oil cake. అనగా గానుగనాడిన ఆవపిండి. వేడిజేయును. వాతము, దురదలు, క్రిమిరోగము వీనినిబోగొట్టును. దీనిని శరీరమునకు నలుగు పెట్టుటవలన మిక్కిలి వేడిచేయును. సమస్తచర్మరోగములను, కుష్టులను హరించును.

ఆవాలపిండి:—Mustard powder. లోనికి పుచ్చుకొనిన జఠరదీప్తి నిచ్చును, వాతమును హరించును. జీర్ణముగావించును. నీళ్ళలో కలిపి పట్టువేసిన మంటబుట్టి పొక్కును. గ్రంధులు వాతము, విషపు నీరు, శ్లేష్మము వీనిని హరించును.

ఆవాలు:— Brassica Campestris, B. Juncea & Dinnapis Dichotoma. Eng. Indian Mustard. సం॥ సర్షప, కటుస్నేహా, తీక్ష్ణగంధ. హిం॥ సరసో, రాయి. ఇందు ఎరుపు, నలుపు, తెలుపు రంగులుగల మూడుజాతులుండును. కారముగ, పొగరుగనుండును. శాకజేయును. కఫము, వాతము, గ్రంధివాతము, రేజీకటి, అజీర్ణము, శుక్లవాతము, శ్వాస, శూల, పీనస, అగ్నిమాంద్యము, దురదలు, దద్దుర్లు, విసర్పి వీనిని బోగొట్టును. ధాతువులకు బలమిచ్చును. తల లోని క్రిములను జంపును. మెదడులోని చెడునీరు నార్చును, కుష్టు, క్రిమి, పక్షవాతము, ఉదరరోగము, నీరసము వీనిని పోగొట్టును, జీర్ణశక్తిని, ఆకలినిబుట్టించును, కడుపులోనివాతమును వెడలించును, విరేచనము, వాంతిజేయును, పైత్యముజేయును, రక్తపైత్యమును

పుట్టించును; ఉష్ణదేహులకు విదాహము, కడుపులో వికారము బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 కాసినివిత్తుల రసము, 3 కలినీళ్ళు, 4 పెరుగు, 5 చంద్రచెక్క కషాయము. మోతాదు: నలగ గొట్టబడినవి 30 గోధుమగింజలయెత్తు (అరడ్రాం) మొదలుకొని రెండు డ్రాముల వరకు చన్నీళ్ళతో పుచ్చుకొనవలెను. వమనము చేయించుటకిచ్చు మోతాదు 1 మొదలు 4 డ్రాముల వరకుగాని నలగగొట్టబడినవి. 2 డ్రాములుగాని వేడి నీళ్ళతో నియ్యనగును. అమితపానముచే పడియున్నప్పుడుగాని, విషప్రయోగమైనప్పుడు గాని, గురుత్వ పదార్థములతో గాని, కఠిన పదార్థములతోగాని, కడుపు అమితముగ నిండియున్నప్పుడు (When the stomach is over loaded) గాని, మనిషిని నీరసపెట్టకుండ వమనము చేయించి కడుపును శుభ్రపరచుటకు పైన జెప్పిన రీతిని ఆవాలతో వమనము చేయించనగును. మరియు వీని చూర్ణములో నీళ్ళుగాని, సిరకాగానిపోసి కలిపి వాతపునొప్పి గలచోట లేక పడిపోయిన భాగము(paralised or effected part) పైన పట్టువేసిన లేక నీచూర్ణములో సిరకాపోసి పలచగ గలిపి మర్దన జేసిన వాతపునొప్పులు, పక్షవాతము నివృత్తించును. వీనిని నలియ కొట్టి వేడినీళ్ళతో చేసిన తేలికకషాయము (infusion) పూటకు 4-5 తులములచొప్పున రెండుపూటలను కొన్నిదినములిచ్చిన పక్షవాతము హరించును. వీని చూర్ణమును రొట్టె (bread) యొక్క చూర్ణమును నీళ్ళతో గలిపి జ్వరము మొదలగు వ్యాధులచే క్షీణస్థితికి వచ్చినపుడు (in sinking stages) కాలిమడమలకు పట్టువేసిన దేహపుకాకను నిలుపును; మేలుజేయును; నలియగొట్టకుండ ఆవాలు పూటకు సుమారు 4 డ్రాముల యెత్తు (table spoonful) చొప్పున ప్రొద్దుట,సాయంకాలము ఉదరరోగములకు

చన్నీటితో క్రిమింగించిన అధికముగ మూత్రము వెడలును; విరేచన మగును; పొట్టకు బలముజేయును; ఆకలిపుట్టును. వీనిధూపము వలన పిశాచబాధ తొలగును; సన్నావాలు చూడుడు.

ఆవుచల్ల:—Cow butter-milk. కొద్దిగ వగరుగలిగి కమ్మగ,స్వాదుగనుండును; చలువ, మేహశాంతి, పైత్యశాంతిజేయును; జీర్ణము గావించును; రుచిబుట్టించును; అగ్నిదీప్తినిచ్చును; ఆమాతిసారము ఉబ్బు, గ్రహణి, పాండువు, మేహము, గుల్మము, ఉదరము, మూలవ్యాధి, కామిల, పైత్యము, పురాణజ్వరము, అరుచి, శోష,కాస, క్షయ, శీతపైత్యము ఈరోగులకు మిక్కిలి పథ్యమయి లఘువుగనుండును; సర్వరోగులకు సర్వకాలములయందు త్రిదోషహరమై పథ్యముగ నుండును.

ఆవునెయ్యి:—Cow ghee. త్రిదోషహరమైనది; ధాతుపుష్టి, రక్తపుష్టి, వీర్యవృద్ధిజేయును; వాతపైత్యము నణచును; మిక్కిలి పైత్యహరమైనది. జఠరదీప్తి నిచ్చును; బాలురకు, వృద్ధులకు మిక్కిలి అనుకూలముగ నుండును; విరేచనము గావించును;ఉన్మాదము, పాండువు, విషము, శూల, సర్పి, చిత్తభ్రమ వీనిచేత పీడనొందు వారికిని, అగ్నితప్తమయిన వారికిని, గాయము తగిలినవారికిని మిక్కిలి పథ్యముగ నుండును; ఆయుర్వృద్ధి నిచ్చును; అప్పుడు వెన్నగాచిన నెయ్యి మిక్కిలి పథ్యముగా మనోహరముగా నుండి సర్వ దోషములను, విషములను బోగొట్టును. ఈ నేతితో తలంటుకుని శిరస్నానముజేసిన శిరస్సుకు, నేత్రములకు మేహశాంతి జేయుటయే గాక మిక్కిలి ఆరోగ్యమును కలుగజేయును.

ఆవుపాలు:—Cow milk. సమశీతోష్ణమయినవి;మధురముగనుండును; వీర్యపుష్టి, దేహపుష్టి, బలముజేయును;శ్వాసకాసలు, శ్రమ,భ్రమ,

మదము, ఆకలిదప్పులు, మూత్రకృచ్ఛ్రము, ఉబ్బు, వాతము, తీయ, రక్తపైత్యము, వాతపైత్యము, జీర్ణజ్వరము వీనిని బోగొట్టును. జఠరదీప్తినిచ్చును. ప్రాణాధారమయి యుండును దీర్ఘాయువు నిచ్చును. గాయము తగిలినవారికిని, ధాతుక్షీణమయిన వారికిని అనుకూలముగ నుండును బుద్ధి బలమునిచ్చును. స్త్రీల పిండోత్పత్తి స్థానమునకు బలముజేయును. పాలు గలుగజేయును శ్లేష్మము, పైత్యము, గురుత్వము జేయును. మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ్రము గల రోగులయొక్క నల్లదబ్బును నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార, 3 వేడిమీగడ, 4 మజ్జిగ, 5 నిమ్మపండ్ల రసము, 6 పెసలువేసి మరగబెట్టిన నీళ్ళు, 7 వేపిన చేపమాంసము. పాలు అన్నము, పాలు కాచినవి, పచ్చివి, కూడనివి, పాలు పుచ్చుకొనెడు కాలవిశేషగుణములు, పాలు పుచ్చుకొన గూడని వారు, పాలు పుచ్చుకొనవలసినవారు, పాలుపుచ్చుకొనవలసిన కాలములు, పాలుంచెడుపాత్ర విశేషగుణములు, క్షీరవిరుద్ధములు, క్షీరమిత్రాదులు మొదలగునవి చూడుడు. ఆవుపాలు, ఆవు ఈనిన 40 దినముల వెనుక శ్రేష్టముగ నుండును. ఆవు యౌవనములోను, దేహపుష్టిగను, నిరోగముగను యుండవలెను. ఉష్ణశత్వము గల వారు విస్తరించి పాలుపుచ్చుకొనిన జ్వరమువచ్చును. గెడ్డలు, గజ్జి మొదలగు చర్మరోగములు, ఉబ్బురోగము గలుగును.

ఆవుపాలు రంగులను, ఈతలను, మేతలను బట్టి గుణములు:— Properties of milk of a Cow according to her colour, fodder & number of bearings.

తెల్లావుపాలు—: వాతమును హరించును.

నల్లావుపాలు:— పైత్యమును బోగొట్టును.

ఎఱ్ఱావుపాలు:— కఫమును హరించును.

ధారావుపాలు:—వాతమును పైత్యమును గొట్టును. వీర్యవృద్ధి, కఫము జేయును; ఉదరరోగుల కనుకూలించును. చలవజేయును. త్రిదోషహారమయినది.

కపిలావుపాలు:—వీర్యపుష్టి, కండ్లకు చలవజేయును. త్రిదోషములను, హరించును.

నిడుపుకొమ్ములావుపాలు:—వృద్ధులకు, ధాతుక్షీణము గలవారికి అనుకూలముగ నుండును. హృదయమునకు బలమిచ్చును.

బోడిఆవుపాలు:—పీనసదెచ్చును. వాతపైత్యమును హరించును. వీర్యపుష్టి, బలముచేయును.

తెలకపిండి మేసిన ఆవుపాలు:—గురుత్వము, కఫము జేయును. శూల బుట్టించును.

ప్రత్తిగింజలు మేసిన ఆవుపాలు:—వాతము జేయును. అపథ్యమైనవి.

ఎండుగడ్డి మేసిన ఆవుపాలు:—త్రిదోషహరమై యుండును.

పచ్చగడ్డి మేసిన ఆవుపాలు:—దోషరహితముగ నుండును.

కుడితిత్రాగిన ఆవుపాలు:—పడిసెమును, అరుచిని బుట్టించును, దోషము జేయును.

తొలి యీతావుపాలు:—బలము జేయును. పైత్యమును పోగొట్టును.

రెండవ యీతపాలు:—వాతమును గొట్టును.

మూడవ యీతపాలు:—శ్లేష్మవాతముల నణచును.

నాల్గవ యీతపాలు:—త్రిదోషములను హరించును.

అంతకంటె యెక్కువ ఈతలీనిన ఆవుపాలు:—త్రిదోషములను జేయును.

తేగడి ఆవుపాలు:—శీతలము, వాతము జేయును.

తరిపి ఆవుపాలు:—శాకజేసి వాతమును హరించును. గురుత్వముగ నుండును.

ఆవు పెరుగు:— Cow curd. తియ్యగ కమ్మగ రుచిగ నుండును; ప్రాణప్రదమయినది; మేహశాంతి, పైత్యశాంతి జేయును; శోషము నణచును; కొద్దిగ వేడిజేయును; దేహపుష్టి, బలము, కాంతి, జఠరదీప్తి వీని నిచ్చును; వాతపైత్యముల నణచును; కఫము జేయును. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

ఆవు పేడ:—Cow dung. మలినమును, దుర్గంధమును బోగొట్టును, ఉన్మాదరోగమును జయించును; విషవాయు దోషములను హరించును. యీ పేడతో అలకుకొనిన మిక్కిలి పరిశుభ్రముగా నుండును. లక్ష్మీకరమైనది.

ఆవుమాంసము:— Beef. పొడిదగ్గు, శ్రమ, అతిక్షుత్తుగల జఠరరోగము, విషమజ్వరము, యెండురోగము, కేవలవాతము యీ రోగములకు అనుకూలించును; మిక్కిలి దేహపుష్టి, బలమునిచ్చును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు మాంసము చూడుము.

ఆవుమూత్రము:—Cow urine. దీనిని ఉదయపు పూటలను లోపలికి బుచ్చుకొనిన వెగటుగా, ఉప్పుగానుండును; పైత్యముజేయును. కఫము నణచును; ఆకలి బుట్టించును. జీర్ణముజేయును. కుష్ఠు, ఉబ్బు, పాండురోగము, గుల్మము, శూల, కాస, శ్వాస, మూత్రకృచ్ఛ్రము, మూలవ్యాధి, జ్వరము, జఠరరోగము, వాతము, క్రిమి యీరోగములను నివారించును. విరేచనము గావించును. దేహపు శాకను నిలుపును. మలమూత్ర బద్ధములను విప్పును. ఆయుర్వృద్ధి నిచ్చును. దీర్ఘరోగముల నివారించును. మోతాదు పురిసెడు మొదలు దోసెడువరకును క్రమముగ వృద్ధిచేయనగును.

ఆవురుగడ్డి:—Nanal grass. సం* పీరణార్జున, నదీవీరణ. దీని సమూల కషాయము కఫము, వాతము, విదాహము, రక్తదోషము, కాస,

అరుచి వీనిని హరించును. మోతాదు పూటకు 2 మొదలు 4 తు॥ల వరకు నియ్యనగును.

ఆవువెన్న:—Cow butter. తెల్లగ కొద్దిగ పసుపువర్ణము గలిగి యుండును; ఆయుర్వృద్ధిని, వీర్యవృద్ధిని ధాతుపుష్టిని యిచ్చును; చలవ జేయును; త్రిదోషముల శమింప జేయును; మేహాపైత్యములను, నేత్రరోగములను జయించును; బాలురకు, వృద్ధులకు, అనుకూలముగనుండును; క్షయ, గ్రహణి, తాపము, కాకదగ్గు వీనిని బోగొట్టును; అగ్నిదీప్తిని, కాంతిని యిచ్చును. సుమారు నిమ్మకాయంత ఆవువెన్న సుమారు తవ్వెడు మరుగునీళ్ళలో వేసి త్రాగించిన మలమూత్రబద్ధము మానును.

ఆళ్ళు:— Paspalum Frumentaceum & Paspalum Scrobiculatum (A species of food grain.) సం॥ కోద్రవ, కోరదూష. హిం॥కోదో, వీనిని ఆరికలనియు నందురు. వీనిఅన్నము, తీపి, చిరుచేదుగ నుండును; విరేచనబద్ధము జేయును; విషమును గొట్టును, కుష్ఠు, రక్తపైత్యము, సంగ్రహణి, పైత్యము, కఫము వీనిని బోగొట్టును; మూర్ఛను తెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 తెల్ల చిరగడదుంపలు, 2 అప్పుడు పితికిన ఆవుపాలు, 3 బెల్లము గలిపిన బూడిదగుమ్మడికాయ రసము. వీనిని కోళ్ళకు, బాతులకు తినిపించిన అధికముగ గ్రుడ్లు పెట్టును.

అక్షికమద్యము:—A sort of liquor. అనగా తాడికాయ బెరడు, వరిబియ్యము వీనితో చేయబడిన సారాయి. పాండువు, ఉబ్బు, మూలవ్యాధి, రక్తపైత్యము, కఫము, కుష్ఠువు, వాతము వీనిని హరించును; అగ్నిదీప్తినిచ్చును; విరేచనముగావించును, చులకన పరచును.

# ఇ

ఇంగిలాల నెడు చేపలు :—Thorni Eels. వీని మాంసము చమురు గలిగి రుచిగా నుండును; బలమును వీర్యపుష్టిని యిచ్చును; మూత్రరోగమును, క్రిమిరోగమును పోగొట్టును; విరేచనము గావించును; పైత్యము నణచును; కఫవాతములను హెచ్చించును; గురుత్వము, మందాగ్ని జేయును. దీనికి విరుగుళ్ళు చేపలు చూడుడు.

ఇంగిలీకము, దీని భస్మము:— Hydragyri Sulphurettum Eng. Mercuric Sulphide or Cinnabar & its calx. సం* హింగుళ, దరద. హిం* సింగరఫ్. క్రమముగ శుద్ధిజేసిన ఇంగిలీకము లేక క్రమముగ జేసిన ఇంగిలీకభస్మము క్రమమయిన మోతాదులుగ నిచ్చిన సమస్తరోగములపోగొట్టును; జఠరదీప్తిని, ఆయుర్వృద్ధిని యిచ్చును; కఫమును వాతమును హరించును;మిక్కిలి వీర్యవృద్ధి చేయును; సమస్తదోషజ్వరములు,గుల్మము, అతిసారము, వాతపైత్యములు,సూతికవాతములు, విషదోషములు, ఈడ్పురోగములు, సవాయిరోగములు, చర్మరోగములు, కుష్ఠురోగము వీనిని జయించును. ఇంగిలీకపు పొగబట్టిన సవాయి రోగము మానును. క్రమముగ శుద్ధిగాని ఇంగిలీకము దినిన కీళ్ళలో నొప్పులు మొదలగు ననేక రోగములు బుట్టును. దీనికి విరుగుళ్ళు 1 చనుబాలు, 2 పాల సుగంధికషాయము, 3 ఫిరంగిచెక్క, 4 మిరియపుచూర్ణము గలిపిన నెయ్యి 10-12 దినములు పుచ్చుకొనవలెను. ఇంగిలీకముగాని దీని భస్మముగాని సేవించునపుడు జాగ్రత్తగ పథ్యముచేయనియెడల కాళ్లు చేతుల కీళ్ళలో నొప్పులు, వాపులు గలుగును, లేదా పడిపోవును,అనగా పట్లుతప్పును.ఇంగిలీకముగాని ఇంగిలీక భస్మముగాని లోపలికిచ్చు మోతాదు 1 మొదలు 4 గుంజల యెత్తువరకు.

ఇంగువ:—Ferula Assafoetida & F. Foetida Alliacea. Eng. Assafoetida సం॥ హింగు, బాహ్లీకం, రామఠం. హిం॥ హింగ్. ఇదియొక గుట్టుజిగురు. మిక్కిలి వేడిజేసి ఆర్చును; కారు వాసన, వెగటు, కారము గలది, మలమూత్ర ద్వారములయందు బుట్టెడు శూల, పడిసెము, వాతము, సూతికావాతము, గుల్మము, శూల, క్రిమిరోగము, హృద్రోగము, మెదడున బుట్టెడురోగము, ఉదరము, కఫరోగము, పార్శ్వవాతము, విషవాయువు వీనిని హరించును; జఠరదీప్తి, వీర్యపుష్టి, బలము జేయును; శ్వాస నణచును; విరేచనము జేయును; జీర్ణము జేయును; ప్రసవస్త్రీల దుష్టరక్తమును వెడలించును; అజీర్ణము, ఈడ్పురోగము, కన్ను, ముక్కు, చెవి, నోరు, గొంతుక, గుండెలు, పొట్ట, కార్జము (Liver) వీనిలో బుట్టెడు జలుబురోగము, వాతపుసజ్జు. పాండురోగము వీనిని హరించును. మూలవ్యాధి సంబంధమగు రక్తమును ఆపుచేయును; ప్రసవానంతరము స్త్రీలకు పిండోత్పత్తిస్థానమునకు మేలుజేయును; ఆగి యాగి వచ్చుకడుపునొప్పిని, అజీర్ణపుకడుపునొప్పిని, అజీర్ణముతో కూడిన అగ్నిమాంద్యమును (Dyspepsia), స్మృతి తప్పడమును (fainting), అపస్మారమును (Hysteria), బిడ్డల ఈడ్పులను (convulsions), బిడ్డల దగ్గులు, ఉక్కిసదగ్గు (Hooping cough) ను, పెద్దవాండ్ర పురాణ వగర్పుదగ్గు (bronchitis) ను, ఉబ్బసము (asthma) ను పోగొట్టను; కడుపులోని ఏలికపాములను చంపును. వారికురుపులోని పురుగులనుచంపును; పైనపూసిన నుదురు నొప్పి నిమ్మళించును; నరముల అదురునుపోగొట్టును; నల్లమందు మొదలగు విషవస్తువులను తినినప్పుడు వానిని కక్కించుటకు దీని లోపలి కియ్యనగును. దీనిని నీళ్ళలో గలిపి పార్శ్వపునొప్పిగల పార్శ్వపు ముక్కులో బోసిన ఆనొప్పి నిమ్మళించును. నల్లమందులో నలిపి పుప్పి

పంటిలో బెట్టినను లేక రెంటిని నీళ్ళలో గలిపి ఆపంటి రంధ్రములో బోసినను నొప్పి నివ్మళించును. ఇంగువ, నల్లమందు, అతికర్పూరము, మిరియాలునూరి మాత్రలుకట్టి మరిదిజాడ్యమునకు అరంఘ మందు యిచ్చిన నివ్మళించును; పప్పుజాతుల అజీర్ణమును పోగొట్టును. దీని అరఖును (tincture) అప్పుడు తగిలిన గాయములపైన వేసిన రక్తప్రవాహము కట్టును. శ్లేష్మము, పైత్యము కాక జేయును; గర్భిణీస్త్రీలు దినిన గర్భస్రావము గలిగించును. పిండమును జంపును. దీనికి విరుగుళ్ళు 1 మంచిగంధము, 2 దానిమ్మకాయ, 3 బాదాం జిగురు. దీనిని మాత్రలుచేసిగాని, నీళ్ళతో గలిపిగాని, అరఖు (tincture) చేసిగాని వాడనగును ప్రసవ స్త్రీలకు తప్ప తక్కినవారికి యిచ్చే మోతాదు 5 మొదలు 15 గోధుమగింజల యెత్తువరకు. ఇంగువ నీళ్ళు (mixture) చేయు విధము, 3 తులములయెత్తు వేడినీళ్ళలో 5 డ్రాములు (అనగా 1-2/3 తులములయెత్తు) ఇంగువగలిపిన నగును. దీనిమోతాదు 120 చుక్కలు (tea-spoonful), ఈ చొప్పున దగ్గు వగర్పులకు, అపస్మారము మొదలగు వానికి దినమునకు 4-5 సార్లు ఇయ్యనగును. ప్రసవ స్త్రీలకు ఇంగువ పూటకు 30 గోధుమగింజల యెత్తువరకు ఇయ్యనగును. అరఖు (tincture) మోతాదు 30 మొదలు 120 చుక్కలవరకు.

ఇండుపకాయలకూర:— Clearing nuts-curry of. లేతకాయల కూర చేదుగ నుండును; కఫపైత్యములను హరించును; తీయని రక్తపైత్యమును, శమింపజేయును; విరేచనబద్ధము. వాతముజేయును మేహము, ప్రమేహము, విషము, దాహము, నేత్రరోగము వీనిని జయించును, దీనితో ఊరగాయ చేయుదురు. ముదిరిన కాయల చూర్ణము సుమారు 1 అణాయెత్తు తినిన వమనము జేయును.

ఇండుప గింజలు:— Strychnos Potatorum. Eng. Clearing nuts. సం॥ కతక, అంబుప్రసాద. హిం॥ నిర్మలి. అనగా చిల్లగింజలు. తీగటగనుండును. మేహశాంతి,వీర్యపుష్టి జేయును; గ్రహణీరోగము, మూత్రకృచ్ఛ్రము, అగ్నిమాంద్యము, కఫము, పైత్యము, విషము వీనిని జయించును; కండ్లమెరుపును మాన్పును,నీళ్ళలోని బురదను విరుచును. ఈగింజలు సన్నముగముక్కలు చేసినవి అరతులము, గిద్దెడు ఆవుపాలలో రాత్రి నానవేసి ఉదయమునవే దానిని తిన వలెను; ఈచొప్పున 11.దినములు తినిన ఇంద్రియనష్టము కట్టును. మేహశాంతి పదార్థములు దీనికి పథ్యముగ నుండును.

ఇండుప్పు:—సైంధవలవణము చూడుడు.

ఇంద్రభోగపురుగు:—అరుద్ర పురుగులు చూడుడు.

ఇడ్డెనుకుడుములు:—A sort of cakes. మినపప్పుతో మిరియాలు, జీలకర్ర వేసి వాసెనమీద వండినవి మృదువుగా రుచిగా నుండును; మేహశాంతి, దేహపుష్టి జేయును; వీర్యవృద్ధి నిచ్చును; మనోహర ముగ నుండును; కఫ పైత్యములను జేయును.దీనికి విరుగుడు తేనె.

ఇత్తడి పాత్రలో వండిన అన్నము:— Rice cooked in a brass vessel. ఇత్తడిపాత్రతో వండినయన్నము వివర్ణతనొంది, మృదు త్వము లేక రుచి తక్కువగును; మిక్కిలి గురుత్వముగ నుండును; పైత్యము. శాక జేయును. ప్రమేహము, అతిమూత్రము, వ్రణ ములు, మూలవ్యాధి, మూర్ఛ, గుదరోగము, శుక్రక్షయము, బలహీనము, తలత్రిప్పు మొదలగు ననేక మేహపైత్యరోగముల బుట్టించును; అనారోగ్యకరముగ నుండును.

ఇత్తడి పాత్రలో భోజనము:— Taking food in a brass dish. మనోవికాసత నిచ్చును. పాండువు, చర్మరోగము, క్రిమి, వాతము వీనిని గొట్టును. విరేచనము గావించును. శాక, పైత్యము జేయును,

ఇత్తడి భస్మము:—Calx of brass. సం॥ రీతి, సువర్ణక. హిం॥పీతల్. దోషరహితమైన ఇత్తడిభస్మము సమస్తవాత జనితరోగములు, జంతువాతము, క్రిమివాతము, గుదరోగము, సంగ్రహణి, పాండువు, శ్వాస, కామిల, విదాహము, పైత్యము, బల్లలు, జ్వరము, కఫము, రక్తపైత్యము వీనిని బోగొట్టును. మోతాదు పూటకు 2 మొదలు 4 గు॥ గింజలయెత్తువరకు. జబ్బు ఇత్తడిభస్మసేవ వలన భ్రమ, గుదరోగము, ప్రమేహము, జ్వరము మొదలగు వనేక రోగములు, మృత్యువు వీనిని గలుగజేయును.

ఇనుపచిట్టము, దీనిభస్మము సింధూరము:—మాండూరము చూడుడు.

ఇనుపత్రుప్పు:—Rust of iron. దీనిని మొదట గోమూత్రతోను, రెండు త్రిఫలకషాయముతోను, కి నిమ్మపండ్లరసముతో మట్టిమూకుడులో వండి ఆ మూకుడుపైన మరియొకమూకుతో మూససీల మన్ను యిచ్చి తగుమాత్రము పిడకలతో పుటములు వేసిన భస్మము గాని శుద్ధిచేసిన దీనిచూర్ణముగాని చాతుర్జాతముయొక్క చూర్ణములోగలిపి దానిలో తేనెగలిపి యిచ్చిన మేహపాండురోగములు, కామిల వీనిని హరించును. బలముజేయును;నీరసమును పోగొట్టును. ఋతురక్తమును జారీచేయును.పుట్టవ్రణములకు (cancers) లోపలి కిచ్చి, దీనిని పైనకూడా వేయుచుండిన మానును. మోతాదు పూటకు 3 మొదలు 6 గోధుమగింజలయెత్తు చొప్పన దినమునకు రెండుపూటల నియ్యనగును. అనుపానచూర్ణము వంతుకు వంతు గలుపవలెను. ఇనుపత్రుప్పు గోమూత్రములోపోసి యెండలో 15 లేక 20 దినములు ఉంచి ఆవెనుక దానిని వాడిన పైగుణముల జేయును. దీనిని సేవించుకాలములో లోహభస్మసేవయందు జెప్పబడిన పథ్యములు గమనించవలయును. లోహభస్మము చూడుడు.

ఇనుము, లేక ఉక్కు రాపొడి:—Ferrum (Iron & steel filings)
సం॥ లోహ, కృష్ణలోహాః. వీనిలో దేని రాపొడినైనను వగరు, చేదు, పులుపు రుచులు గలిగి స్వాదుగ నుండును. కొద్దిగ చలువ చేయును; బుద్ధివికాసత నిచ్చును; క్రిమి, కఫపైత్యము, పాండురోగమును హరించును; రక్తపుష్టి, ఆయుర్వృద్ధి, బలము చేయును; అంతర్గత వ్రణములను పోగొట్టును; మంచిరక్తమును బుట్టించును; కాక చేయును; అగ్నిమాంద్యమును, ఉబ్బురోగమును నివర్తించును. మోతాదు పూటకు 1 మొదలు 6 గోధుమగింజల యెత్తువరకు ఇయ్యవచ్చును. వీనిని శొంఠి, లవంగాలు, దాల్చినచెక్క, మిరియాలు వీనిలో దేని చూర్ణముతో నైనను తేనెగలిపి నియ్యవలెను. అనుపానచూర్ణము వంతుకు 2 వంతు లధికముగ నుండవలెను. ఇనుములో ప్రాత గుర్రపునాడా శ్రేష్టము; గుర్రపునాడు రాపడి చేసి మెత్తు ప్రొద్దుటి భోజనకాలమందు మొదటికబళముతో పుచ్చుకొని తరువాత అన్నము తినేది. పథ్యము కందిపప్పు, మేకమాంసము, ఆవునెయ్యి; మరియేమియు తినకూడదు. ఈప్రకారము పదిదినములు సేవించిన ఉబ్బులు హరించును; జఠరదీప్తి గలుగును; మిక్కిలి వీర్యవృద్ధి, ధాతుపుష్టి గలుగును. పై పథ్యము 10 దినములు చేయవలెను.

ఇనుపభస్మము, సింధూరము.—Calx & Reddened calx of Iron.
సం॥ మండూరం, కృషిలోహం. హిం॥ ముండలోహం. క్రమముగ శుద్ధి చేయబడిన పాతది యగు ఇనుప భస్మము లేక దీని సింధూరము వగరుగ, కారముగ నుండును; రక్తమును శుభ్రపరచును; క్రొత్త రక్తము బుట్టించును; ఆకలి బుట్టించును; కామిల, పాండువు, ఉబ్బు, కఫము, వాతము, శూల, మూలవ్యాధి, ప్రమేహము, గుల్మము, కుష్ఠు మొదలగు అనేకరోగముల పోగొట్టును; నేత్రములకు మేలు చేయును; మరియు దీనికి లోహభస్మము యొక్క గుణములు గలిగి

యుండును. మోతాదు పూటకు 2 మొదలు 4 గురిగింజల యెత్తు వరకు తాళీశచూర్ణము లేక చాతుర్జాతచూర్ణము అనుపానముగా నుంచుకొనవచ్చును. లోహభస్మసేవయందు విద్యుక్తమగు పథ్యములువీని సేవయందునుగమనించవలయునులోహభస్మముచూడుడు.

ఇప్పచెట్టు :— Bassia Longifolia, B. Latifolia. Eng. Indian butter tree, Mahwash tree. సం॥ మధూక, మధుపుష్ప, హిం॥ మహుఆ. దీనిమ్రాను చెక్కరసము మేహావాతపునొప్పులను, పైత్యమును రక్తపైత్యమును,వాతమును హరించును. మోతాదు పూటకు 2 తులములయెత్తు చొప్పున రోజుకు రెండుపూటల నియ్యవలెను. దీనికాయలు మెత్తగానూరి శరీరమునకు నలుగుపెట్టుకొని కొంతసేపుండి బాగాతోముకొని స్నానము చేయుచుండిన గజ్జి, చిడుము, చర్మపురోగములు, కుష్ఠు మొదలగునవి హరించును.

ఇప్పఆకువిస్తరి :— Platter of leaves of do. దీనిలో భోజనము మనోహరముగ నుండును, వాతమును, పైత్యమును రక్తపైత్యమును హరించును; రుచి బుట్టించును.

ఇప్పకాయకూర :— Curry of the fruits of do. చేదు, వగరు, గలిగియుండును; పైత్యమును, కఫమును, ప్రమేహమును, వాతమును గొట్టును; విరేచనబద్ధముజేయును; రుచిగానుండును; వీర్యమునకు చలవజేయును; ఆమమును బెంచును.

ఇప్పనూనె :— Oil of the seeds of do. పైత్యవాతముల నణచును; వెంట్రుకలకు బలము,పుష్టి నిచ్చును; గురుత్వము, శ్లేష్మము, చలవజేయును; క్రిమిరోగమును వ్రణములను, బోగొట్టును; కండ్లకు మేలుచేయును; పైన పూసిన దురద, వాపు వీనినణచును; బిడ్డలకు కడుపులో క్రిమియుండుటచేత గలిగెడు చేతుల (arms) మీది దురద నివృత్తించును.

ఇప్పపండు:—Fruit of do. వగరుగనుండును; వాతపైత్యములను శమింపజేయును; దేహపుష్టినిచ్చును; గురుత్వము, చలవజేయును. దీనికి విరుగుళ్ళు 1 వేపవిత్తులు, 2 నెయ్యి.

ఇప్పపువ్వు:—Flower of do. రుచిగా, మనోహరముగా నుండును. విషము, రక్తపైత్యము, శ్వాస, క్షయ వీనిని హరించును; వీర్యపుష్టి నిచ్చును; వాతపైత్యము, చలవ, తలనొప్పి, విదాహము వీనిని కలుగఁజేయును. దీనికి విరుగుళ్ళు 1 వేడినీళ్ళు, 2 వేపవిత్తులు. పావుశేరు (20 తులముల యెత్తు) ఆవుపాలలో 8 తులముల యెత్తు ఇప్పపువ్వు గలిపి యిచ్చిన నీరసము (General debility) వలన గలిగిన నపుంసకత్వము మానును. వీనిని తినిన దేహమునకు వీని వాసన యెక్కును. ఎండిన పువ్వులు వెచ్చజేసి కాపడము(Fomen tation) పెట్టిన వృషణముల వాపు, నొప్పి అణగును.

ఇప్పపువ్వుసారాయి:—Liquor made of do. వేడిజేసి అర్చును; స్వాదుగనుండును; బలముజేయును; వాతము నణచును; పైత్యము తలనొప్పి వీనిని బుట్టించును; మెదడుకు (బుద్ధికి) హానిజేయును; దీనికి విరుగుళ్ళు 1 ధనియాలు, 2 వేపగింజలు.

ఇరుగుడుచెట్టు:—Dalbergia Sissoo (the tawny-leaved sisu) సం॥ శింశుప, కృష్ణసార. హిం॥ శీసమ్. దీనిని యిరుగుడు చేవ చెట్టందురు. దీనిమ్రాను చెక్కరసము, లేక కషాయము శాక జేయును. మేహము, కుష్ఠు, మచ్చలు, వాంతి క్రిములు, హొత్తి కడుపులోని రోగములు. వ్రణములు, తాపము వీనిని హరించును. గర్భస్రావము గలుగజేయును. మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల చొ॥న రెండు పూటల నియ్యవలెను. ఇరుగుడుచేవ నుండి భూపుట యంత్రముచేత తీసిన తైలము రాసిన తామర, మచ్చలు, చర్మరోగములు హరించును.

ఇరుగుడు తైలము:—Oil prepared with bark of do. ఇరుగుడు అగరు, బొంతచెముకు, మామిడి, దేవదారు వీని చెక్కరసములో నూనెబోసి కాచిన తైలము పూయుచుండిన దుష్టవ్రణములు వాతరక్తము, దురద, కుష్టువు, చర్మరోగములు వీనిని హరించును.

ఇర్రిమాంసము:—Flesh of a female deer. రుచిగా నుండును; శీఘ్రముగ జీర్ణమగును; మేహశాంతిజేయును; త్రిదోషములను హరించును; దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి, జఠరదీప్తి వీని నిచ్చును; మేదస్సు, క్షయ, మూలవ్యాధి, గుల్మము, అహిక, పురాణజ్వరములు వీనిని బోగొట్టును; కొద్దిగ మలమూత్రబద్ధము జేయును; దీనికి విరుగుడు సిరకా.

ఇలివిందపండు:—Fruit of a certain tree. కొద్దిగ రుచిగానుండును; శ్లేష్మము, ఊపిరిగొట్టునొప్పి, వాతము వీనిని హరించును; మలమూత్ర బద్ధముల జేయును. క్రిమిరోగములను బుట్టించును. దీనికి విరుగుడు సజ్జాక్షారము.

ఇసనాబుపిట్ట:—Snipe. ఉర్లకోడి చూడుడు.

ఇసుక:—Sand. సం॥ వాలుక, బహువర్ణ. హిం॥ వాలు. దీనిని బాగుగ వెచ్చచేసి గుడ్డను మూటకట్టి కాచిన వ్రణము,రొమ్మునొప్పి మేహవాతనొప్పులు హరించును.దీనిపైన పరుండిన చలవజేయును

ఇసుకదారికూర:—Gisekia Pharnaceoides. సం॥వాలుకా హిం॥ వాలుకాశాక్. దీనిని ఇసుకరాసి కూరయనియు, ఇసుకదాసరికూర అనియు నందురు. దీని రసము లేక కషాయము మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి,మూలవ్యాధి వీనినణచును. తేలికనిచ్చును.అనులోమ వాతమును దెచ్చును.చలవజేయును.దీనిసమూలము నాడాపామును చంపును. ఇందులకు దీని సమూలమును 2½ తులములు తెచ్చి నూరి తగుమాత్రము(పలచగ నుండునటుల)నీళ్ళుగలిపి త్రాగించవలెను.

తిరిగి అయిదవ దినమున త్రాగించవలెను. ఉదయపు పూటలను పరగడుపున 10-11 గంటలవేళ త్రాగించవలెను. రసముయొక్క మోతాదు పూటకు 3-4 తులములయెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులములయెత్తు. దీనికూర రుచిగా నుండును.

ఇసుకదొందులు:—Dragonet or whiting. ఇవియొక విధమయిన చేపలు,వీనిమాంసము మృదువుగా, చమురుగలిగి రుచిగానుండును, బలము, జఠరదీప్తి నిచ్చును. త్వరగా జీర్ణమగును. నీరసులకు. సుకుమారులకు అనుకూలముగ నుండును. పథ్యకారి.దీనికి విరుగుల్లి చేపలు చూడుడు.

ఇసుకలోపుట్టిన బుగ్గనీరు:— Water of a natural spring in a sandy bed. రుచిగా తియ్యగా నుండును. చలువ, వాతము జేయును. ఆప్యాయత నిచ్చును. సౌఖ్యముగ నుండును.

ఇసుపగోలు గింజలు :— Plantago Ovata. P. Ispaghla. Eng· Spogal seeds. సం॥ ఈషద్గోల, సిగ్ధబీజ, శ్లక్ష్ణజీర. హిం॥ ఇసాబ్ గూల్, ఇవి జిగట గల గింజలు. చలవజేయును. వీని తేలిక కషాయముగాని చలికషాయము(చన్నీళ్ళలో దీనిగింజలనూర బెట్టిన నీరు)గాని జిగటగలిగియుండును. మృదువు పరచును. మూత్రము గావించును. కాకదగ్గు, సెగరోగము, మూత్రకోశపు రోగము, మూత్రబద్ధము, పురాణరక్తగ్రహణి, గ్రహణి, పురాణనీళ్ళవిరేచనములు, ప్రేగులలో పుండయి యుండడము వీనిని శమించును. మూడర్ధపావు శేర్ల వేడినీళ్ళలో 2 డ్రాంల గింజలువేసి ఊరించినది తేలిక కషాయము, మూడు పావు శేర్ల నీళ్ళలో 4 డ్రాంల గింజలు వేసి సగ మిగరగాచినది కషాయము. తేలిక కషాయమువలె చలి కషాయము చేయనగును. వీని మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు ఒకసారి పుచ్చుకొనవచ్చును. విత్తనములు వెచ్చజేసి

చేయబడిన చూర్ణముగాని యట్టిగింజలుగాని తినవచ్చును. మోతాదు 1-2 గ్రాంలు. విత్తులు దంచి నీళ్ళుపోసి గుజ్జుగ నూరి కించి కట్టిన మురికి వ్రణములు, సెలలుగల వ్రణములు నయమగును. దీని చెట్టువేరు ఆకుతో కాచిన కషాయము యిచ్చిన క్షయ, జ్వరము అహిక జ్వరము నివర్తించును. దీని వేరుగంధము సర్పవిషమును హరించును.

ఇసుళ్ళు:—Winged white ants- ఇవి రెక్కలుగల పెద్ద చెదపురుగులు. వీనిని నేతిలో వేయించి పుచ్చుకొందురు; కాక, వీర్యపుష్టి, జేయును; కఫవాతములను వృద్ధి బొందించును. దీనికి విరుగుళ్ళు 1 ఆవాల చూర్ణము, 2 సిరకా.

—:—

## ఈ

ఈడపండు:—A sort of Kamala orange- సం* పారేవత, తిందుక. ఇది కమలాఫలపుచెట్టులో భేదము. కాయచిన్నది, చెట్టంతయు కమలాఫలపుచెట్టును బోలియుండును. దీనినే కచ్చడి పండని యందురు. దీనిపండు కొంచెము పుల్లగా, తియ్యగా నుండును; రుచి బుట్టించును; చలవ జేయును; పైత్యశాంతి, మేహశాంతి, వీర్యపుష్టి జేయును; రక్తపైత్య మణచును; అగ్నిమాంద్యము, మలబద్ధము, శ్లేష్మము వీనిని గలుగజేయును. దీనికి విరుగుళ్ళు నారింజపండు చూడుడు.

ఈతకల్లు:—Wild Date Toddy. మధురముగా, చిరుచేదుగా, పలచగా, కొంచము చిక్కగానుండును, మత్తు, చలవ జేయును; మేహవాతపు నొప్పులు, కాకదగ్గులు, పైత్యము, కఫము వీనిని హరించును. వీర్యవృద్ధి, బలము, పుష్టినిచ్చును, మూత్రమును జారీచేయును; క్రొత్తగ వనగా గీత ప్రారంభమందు దీసిన కల్లు మిక్కిలి వాతము

జేసి యనేక రోగములు పుట్టించును. దీనికి విరుగుళ్ళు కల్లుచూడుడు ఈతకల్లుకు తాటికల్లు గుణములన్నియూ కలిగియుండును, తాటికల్లు కంటెయెక్కువ జీర్ణశక్తిని మేహశాంతిని యిచ్చును. మూత్రములో పంచదార (Sugar) పోయెడి రోగమునకు మిక్కిలి మేలు చేయును.

ఈతచెట్టు, దీని పళ్ళు:—Phoenix Sylvestris, Eng. Wild-date fruits. వగరుగలిగి, మధురముగా, స్వాదుగా నుండును. కొద్దిగ మేహశాంతి, చలవ. వీర్యపుష్టి జేయును; మదమును బుట్టించును. పైత్యము, వాతము, రక్తపైత్యము, గాయములు, క్షయ, దాహము తాపము, జ్వరము వీనిని హరించును; గురుత్వముగ నుండును; దీని పైపొర పొట్టకు నష్టము జేయును; కడుపులో వాయువును బంధించును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 జీలకర్ర.

ఈతపువ్వు:—Wild Date flower. ఖర్జూరపుపువ్వు చూడుడు.

ఈతమొవ్వు:—Tender or the white & smooth part of wild date. అనగా యీ చెట్టుయొక్క మొవ్వులోపలి తెల్లని దవ్వ. తియ్యగా, వగరుగనుండును. వాతముజేయును. కీళ్ళలోని పట్టువిడ గొట్టును; కొందరికి మోర్లుకట్టును. దీనిని నలుగగొట్టి వరిబీజమునకు కట్టిన తగ్గిపోవును. నమిలి పుక్కిటబట్టిన నోటిపూత మానును.

ఈతసారాయి:—Liquor made of wild date toddy. కారముగ ఘాటుగనుండును. మత్తును నిషాను గలుగజేయును. కఫరోగము నణచును. జ్వరము, మూలవ్యాధి అజీర్ణము మొదలగు రోగములను బోగొట్టును. పైత్యముజేయును. దీనికి విరుగుళ్ళు 1 నీళ్ళుకలిపిన తేనె, 2 వః కషాయము.

ఈలకూర:—Cer' in spreacing plant of saltish taste. ఇది సముద్రతీరమం ప లేచును. ఉప్పగనుండును; ఇది అపథ్యకరమైన దిన్ని, దోషము చు బుట్టించునది గనుక వుపయోగార్హమైనదికాదు

ఈశాన్యదిక్కుగాలి:—అష్టదిక్కులగాలి చూడుడు.

ఈశ్వరపతులు:—A sort of paddy. ఇవి ఒకజాతి ధాన్యము. వీని యన్నము రుచిగానుండును;వీర్యవృద్ధి జేయును; లఘువుగానుండును; అగ్నిదీప్తి, కాంతి నిచ్చును; కఫవాతముల నణచును; సమస్త ధాతువులకు బలముజేయును. మరియు ధాన్యములు చూడుడు.

ఈశ్వరి చెట్టు:— Aristolochia Indica Eng.Indian Birth wort. సం॥ నాగదమని, విసర్పిణి, గంధనాకులి. హిం॥ ఈశ్వరమూల్. దీనిని ఈసరచెట్టనియు నందురు. తెల్ల ఈశ్వరి, నల్ల ఈశ్వరి అని రెండు విధములు. తెల్లనిది శ్రేష్ఠము; వీనివేరు, కాడలు, ఆకులు, చేదుగ వెగటుగ నుండును; కాక జేయును; వాతము, సర్పవృశ్చికవిషములు, శ్వేతకుష్ఠు, గ్రహణి, కుష్ఠు, విసర్పి, జ్వరము, దద్దుర్లు, వ్రణములు వీనిని హరించును;విరేచనము జేయును; వీని కషాయము దేహము లోని మలముల వెడలించును; గట్టిపడిన దుష్టపదార్థకూటమును విప్పును;బిడ్డలకయ్యెడు అజీర్ణవిరేచనములు కట్టును. వేరుకషాయము ఋతురక్తమును జారీచేయును; ఆమవాతపు నొప్పులు (Gout), కీళ్ళనొప్పులు, ప్రేగుల లోపల పుట్టెడు వ్యాధి, జ్వరము, ఆహిక జ్వరము, ఇతరరోగములు వీనిని పోగొట్టును;బలము జేయును; గర్భ స్రావమును గలిగించును; వేరు గంధము కంటికొలికియొద్ద నయ్యెడు లూతి మను వ్రణమును మాన్పును. వేరు చూర్ణముగాని, గంధము గాని లోపలికిచ్చి కాటుపైన లేక కుట్టినచోట నంటించిన సర్ప. వృశ్చికవిషములను హరించును; ఆకురసము పాము, తేలు విషముల విరుచును;ఋతురక్తమునుజారీచేయును;గర్భస్రావము గలిగించును. కషాయపు మోతాదు 2 మొదలు 5 తులములయెత్తు చూర్ణపు మోతాదు 2 మొదలు 4 చిన్నములయెత్తువరకు.గంధపు మోతాదు పావలాయెత్తు మొదలు తులమెత్తువరకు. ఆకు రసపు మోతాదు

6 అణాలయెత్తు మొదలు 12 అణాలయెత్తువరకు. ఉదరమునకు, ఉబ్బరోగములకు దీని వేరు లేక సమూలకషాయమిచ్చి విరేచనము శేయించిన బాగుగపనిచేయును. వేరుచూర్ణము తేనెతో నిచ్చిన శ్వేతకుష్ఠు నివారణమగును. ఆకు లోపలికిచ్చిన జ్వరములు హరించును. మోతాదు పూటకు 1-2 ఆకులు చొప్పున నియ్యనగును.

—:—

## ఉ

ఉండ్రములు, ఉండ్రాళ్లు:— Balls of rice flour boild in water. నీళ్ళ ఆవిరివలన వండిన వరిపిండి ఉండలు (కుడుములు) రుచిగా నుండును; శరీర పుష్టి, బలముజేయును; ఆకలి నణచును, శ్లేష్మవాతముల బెంచును. అగ్నిమాంద్యముజేయును; దీనికి విరుగుళ్ళు 1 జీలకఱ్ఱ, 2 పుదీనా, 3 ఉప్పువేసినకలి.

ఉండ్రాళ్లు పాలలోవేసినవి:— do. boiled in milk. మధురముగ నుండును; ఆకలినిదీర్చును. బలము,వీర్యవృద్ధి, దేహపుష్టిచేయును; దాహమును బుట్టించును; పైత్యము నణచును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 పెసలు వేసి మరగించిననీళ్ళు, 2 మజ్జిగ.

ఉండ్రాళ్ళు పూర్ణము బెట్టినవి:— Balls of rice flour with dhell or jaggery. వుడకబెట్టిన శనగపప్పు బెల్లముగాని, కొబ్బరిబెల్లముగాని పూర్ణముగాబెట్టి వండినవి. రుచిగా నుండును. ఆలశ్యముగ జీర్ణమగును. బలము, పుష్టినిచ్చును. అమితముగ దినిన అజీర్ణముచేయును. దీనికి విరుగుడు పిండివంటలు చూడుడు.

ఉక్కు-భస్మము, సింధూరము:—Calx and reddened calx of steel. అనగా తీక్ష్ణలోహము. క్రమముగ శుద్ధిచేసి చేయబడినవి

రక్తమును శుభ్రపరచును; శ్రోత్రరక్తమును బుట్టించును; పొట్టకు బలమిచ్చును; జఠరదీప్తినిచ్చును; కాకజేయును, జంతువికారము, పాండువు, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము, కఫము, దగ్గు, శ్వాస, ఉబ్బు, ప్రమేహము, గుల్మము, ప్లీహ, విషము, క్షీణత్వము, శరీరస్థౌల్యము, ముదిమి, నేత్రరోగము, ఆమవాతము, కుష్ఠువులు, శ్వేతకుష్ఠువు, రక్తవికారము, వలీపలితములు మొదలగు ననేక రోగములను హరించి ఆయుర్వృద్ధి, బలము, వీర్యము, కాంతి వీనిని గలుగజేయుటయేగాక సంభోగశక్తిని గలుగజేయును. మోతాదు పూటకు గుంజెత్తు మొదలు 2-కి గుంజలయెత్తువరకు. దీనిని సేవించు దినములలో స్త్రీ సాంగత్యము, అతివ్యాయామము, ఎండను తిరగడము, చింత, అమితబుద్ధి ప్రయాస ( mental work ), పులుసు వీనిని వర్జింపవలయును.

ఉక్కెర:—Maccaroons sugar cake. పాలు పొయిమీద పెట్టి కాగుచున్నప్పుడు, గోధుమపిండిగాని, బియ్యపుపిండిగాని కొద్దికొద్దిగా చేర్చుచూ కలిపిన తరువాత బెల్లముగాని పంచదారగాని చేర్చి తగుమాత్రము నెయ్యివేసి కలియబెట్టి దింపినది వుక్కెర అందురు. ఇందు కొద్దిగా యాలుక్కాయల చూర్ణమున్నూ, కిసిమిసి పండ్లున్నూ చేర్చుకొనవచ్చును రుచిగా నుండును. దేహపుష్టి, బలము వీర్యవృద్ధి జేయును. చక్కని ఆహారముగా నుండును.

ఉంచితతీగె:—ఉస్తి, ఉస్తితీగెచూడుడు.

ఉడుతమాంసము:—Squirrel-flesh of- మలమూత్రముల గావించును; కార్శ్యరోగమును, శ్లేష్మహరముగ నుండును.

ఉడుము మాంసము:—Guana-flesh of- రుచిగానుండి తేలికగ జీర్ణమగును. రుచిబుట్టించును; శ్రమను, పైత్యవాతమును, కాసలను, కఫమును హరించును; మిక్కిలి దేహపుష్టిని, వీర్యవృద్ధిని,

యిచ్చును;నడుమును సత్తువ జేయును; జఠరదీప్తినిచ్చును;రక్తమును శుభ్రపరచును, సుఖవ్యాధులను హరించును. యెండించినమాంసముతో కొన్ని ఔషధవస్తువులను చేర్చి చేయబడిన లేహ్యము క్షయ నివారణమగునందురు. దీని అజీర్ణముకు విరుగుడు నువ్వులనూనె.

ఉత్తరదిక్కుగాలి:—అష్టదిక్కులగాలి చూడుడు.

ఉత్తరేణిచెట్టు:—**Achyranthes Aspera & A. Bidentata. Eng. Prickly chaff-flower** సం॥ అపామార్గా, ఖరమంజరీ. హిం॥ చిర్ చిరా, ఓంగా. దీనిని దుచ్చినచెట్టందురు. దీనిసమూల రసము లేక కషాయము, వెగటుగ, చేదుగనుండును;గురదాల (kidneys) పైని పనిజేయును; త్రిదోషములను, జిహ్వాదోషము, పైత్యము, కఫము, ఉబ్బు, ఉదరము, రక్తమూలము, శూల, పొక్కులు, గజ్జి, కుష్టు వీనిని జయించును; విరేచనము జేయును; మూత్రమును గావించును; కాయసిద్ధి గలుగజేయును. దీని విత్తుల బియ్యము పాలతో వండి పుచ్చుకొనిన పరిణామశూలను పోగొట్టును; దేహపుష్టి జేయును; పుంస్త్వమును పోగొట్టును. దీని సమూలమును కాల్చి చేసినభస్మము అజీర్ణమును శూలను బోగొట్టును. ఈభస్మమును గంజి (rice cunjee)తో గాని శొంఠికషాయముతోగాని యిచ్చిన ఉబ్బు, ఉదరరోగము నివర్తించును. దీని విత్తులను నీళ్ళతోనూరి గాని చూర్ణముచేసి నీళ్ళతోగాని యిచ్చిన వెర్రికుక్క విషసంధి (Hydrophobia), సర్పవిషము, నేత్రరోగములు, చర్మరోగములు మానును. దీని పూతవెన్నులను కొద్దిగ పంచదారవేసి నూరి మాత్రలుగ జేసి వెర్రికుక్క కరచినవారికిచ్చిన దాని విషము హరించును. పూటకు గచ్చకాయంత మాత్రచొప్పున దినమునకు రెండుపూటలను 3–4 దినము లియ్యవలెను. దీని ఆకులుగాని పూతవెన్నులుగాని నూరి తేలు, జెర్రి కుట్టినచోట పాము కరచిన

చోట దళసరిగ పట్టించిన, బాధ మంట విషము హరించును సమూల భస్మమును తేనెతో కలిపియిచ్చిన, దగ్గులు, ఉబ్బసము హరించును. మోతాదు 2 మొదలు 6 గింజలఎత్తువరకు. సమూల భస్మములో హరిదళము వేసి నూరి నూనెగలిపి పూసిన వ్రణములు, పులిపిరి కాయలు హరించును; నూనెలో అభస్మము గలిపి చెవిలోబోసిన కర్ణరోగములు నివర్తించును. సమూలరసములో దూదితడిపి పుప్పి పంటిలోబెట్టిన నొప్పి మానును; దీని విత్తులుగాని ఆకుగాని నూరి కట్టిన గెడ్డలమంట, ప్రక్కనొప్పి (pleuritic) నివారణ మగును; దీని ఆకురసము లోపలికిచ్చిన సర్పవిషము హరించును; దీని యెండిన ఆకులపొగ బుచ్చుకొనిన ఉబ్బసదగ్గు శమించును; దీని చూర్ణము పుచ్చుకొనిన ఉబ్బురోగము మానును; రక్తగ్రహణి కట్టును. ఆకు చూర్ణము మూత్రమును జారీచేయునట్టియు, బలముచేయునట్టియు, ఇతరమందు దినుసులలో విశేషముగ చేర్చవచ్చును. దీని పచ్చి ఆకు లలో కొద్దిగ మిరియములు, కొద్దిగ వెల్లుల్లిపాయలు చేర్చి నూరి గచ్చకాయలంతేసి మాత్రలు చేసి చలిజ్వరము రాకపూర్వము ఇచ్చుచుండిన చలిజ్వరము, వరుసజ్వరము నివర్తించును. సమూల కషాయము యిచ్చిన ఉబ్బు, ఉదరరోగములు నివారణ మగును; ఆకునుసీళ్ళతో పలచగనూరి వంటికి పూసిన కందిరీగలు, తేనెటీగలు మొదలయినపురుగులుకుట్టిన దుసకలిగెడు మంట మొదలగు బాధలు నివర్తించును; చాపుగలచోటపూసిన నదిహరించును; దీని లేతఆకులు నూరి అందులో పటికి పంచదార, వెన్నకలిపి యిచ్చిన రక్తగ్రహణి కట్టును. పై మూడును కలిపినది పూటకు గచ్చకాయంత ముద్ద పుచ్చుకొననగును. దీనిసారము ఉబ్బురోగమును, సవాయి రోగ మును మాన్పును; దీనివిత్తుల కాచినగంజి యిచ్చిన అమితముగ నుండు ఆకలి అణగును. దీని వేరు 1 గోధుమగింజలయెత్తు, మిరి

యాలు 5 గోధుమగింజలయెత్తు కలిపి మాత్రజేసి యిచ్చిన వరుస జ్వరము, చలిజ్వరముకట్టును. దీనిఆకురసములో కొద్దిగసల్లమందు గలిపి యెండలో గొంతసేపు ఇగరనిచ్చి పూసిన సవాయి పుండ్లు మానును. దీనికషాయమునుఉబ్బు, సెగరోగులకిచ్చిన మూత్రమును వెడలించి మేలుచేయును. చూర్ణపు మోతాదు పూటకు 4 మొదలు 12 గోధుమగింజలయెత్తువరకు. సమూలకషాయము చేయు విధము. దీని వేరు, కాడలు, ఆకులు, పువ్వు వెన్నులు, రెండున్నరతులముల యెత్తు 25 తులముల యెత్తు నీళ్ళలో వేసి ఆకుండ పైనమూత వేసి పావుగంట వరకు కాచి దించేది. మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు చొప్పున దినమునకు 2-3 సార్లు ఇచ్చేది; ఉబ్బు, ఉదర వ్యాధులకు పైన జెప్పిన నీరు మూడోవంతుగాని సగముగాని యిగరగాచి పైనచెప్పిన మోతాదు హెచ్చించి నియ్యవలెను.

ఉదకము:—Water సం॥ జలం, సలిలం. హిం॥ పానీ. పారుచు శుభ్రముగ తేలికగనుండి యెండ, గాలి తగులుచు విస్తారముగ నున్న నీళ్ళు శ్రేష్టమైనవి; చలవ జేయును; మధురమయి చల్లగా మనోహారముగా నుండును; రుచిబుట్టించును; ప్రాణాధారమైనది; తృప్తి నిచ్చును; దప్పికను, భ్రాంతిని బోగొట్టును; అన్నము జీర్ణము గావించును; నిద్రబడలిక, విషము, అగ్ని వీనివల్ల గలిగిన పీడ నణచును; శ్రమనొందినవారిని సేదదేర్చును; బుద్ధికి బలమిచ్చును; వీర్యవృద్ధి, బలము జేయును; శోషించిన ధాతువులకుపుష్టినిచ్చును; అమృత సమానమైనది. ఉదకముపుచ్చుకొనెడి క్రమము, ఉదకము దోషయుక్తమగునపుడు పుచ్చుకొనెడి క్రమము, పానయోగముగాని నీళ్ళు, నీళ్ళుకొద్దిగ బుచ్చుకొనదగినవారు, ఋతుభేదములనుబట్టి పుచ్చుకొనదగిన నీళ్ళు, ఉదకము (ఎండను కాగినది) చూడుడు.

ఉదకము పుచ్చుకొనెడి క్రమము:—Mode of, or rules to be observed in drinking water. భోజనకాలమందు మధ్య మధ్య కొద్దికొద్దిగ దాహము పుచ్చుకొనుటవలన వాతపిత్తశ్లేష్మములను సమత్వమును బొందించును; సమస్తధాతువులకు సౌమ్యతను, సౌఖ్యమును, జఠరదీప్తిని గలుగజేయును. అన్నము జీర్ణముగావించును. భోజన కాలమందధికముగ నుదకపానము జేసినను, చాలినంత దాహము పుచ్చుకొనక యుండినను, అన్నము క్రమముగ నరుగదు. భోజనాదియందుదకపాన మధికముగజేసిన జఠరాగ్నిని మందగింపజేసి దేహమును కృశింపజేయును. భోజనానంతమందధికముగ నీళ్ళుపుచ్చుకొనిన కఫమును బెంచును. మరియు మిక్కిలి దాహముగొనియున్నప్పుడు భోజనముచేసిన గుల్మరోగమును, మిక్కిలిఆకలిగొనియున్నప్పుడు దాహము బుచ్చుకొనిన భగందరరోగమును బుట్టించును. మరియు కడుపు నిండియున్నపుడును, దాహము శాకిందునపుడును, తినినయన్నము గుండెలుదిగిపోకముందును, దేహప్రయాసపడి మానిన తత్క్షణము, మిక్కిలి దూరము నడచి వచ్చిన తత్క్షణము, నిద్రపోయి లేచిన తత్క్షణమును, స్నానము చేసిన, స్త్రీసంభోగము చేసిన వెంటను, నిద్రకాలము మధ్యయందును, పరగడుపునను, నిలువబడియు, నడుము కట్టుకొనియుండియు, పరుండియుండియు నీళ్ళు పుచ్చుకొనడము అనేకరోగములు పుట్టుటకు కారణమగును. అమిత యుదకపానమువలన పొట్టకు నష్టము జేయును; నరములకు జబ్బుగలుగును; కార్జము (Liver) కు చెరుపుజేయును; బుద్ధిమాంద్యము దెచ్చును; పడిసెము పట్టును; స్థూల దేహమగును; కాళ్ళుచేతులుబ్బును; కండ్లక్రింద తెల్లబారును; ముఖము వివర్ణతెందును; వర్చస్సు చెడును; అతిమూత్రము మొదలగు అనేకరోగములు పుట్టును. వేసవికాలమందును; శాకతత్వము, మేహతత్వము

గలవారును, దేహమున కాక అధికముగనున్నపుడును, ఉష్ణపదార్థములు భుజించినపుడును, సారాయము మొదలగునవి అధికముగ త్రాగినపుడును పైనజెప్పిన నిషేధములను గమనించకపోయినను బాధకరముగ నుండదు. ఎవరయినను అధికముగ దాహమైనప్పుడయినను ఒకమారుపుచ్చుకొనదగిన నీరును రెండుమూడు మార్లుగ ఆపి ఆపి పుచ్చుకొనుట మేలు ఒక్కమారు దాహముతీరునటుల ఉదకము పుచ్చుకొనకూడదు. చలవజేసెడుఫలములు, నీరుగలఫలములు, అనగా నారింజపండు, కమలాఫలము, బత్తాయినారింజపండు, పంపరపీనాసపండు, అరటిపండ్లు, నేరేడుపండ్లు, దోసపండు, అనాసపండు, కర్బూజాపండు మొదలగు ఫలములును, మిఠాయి మొదలగు తీపి వస్తువులును, బెల్లము పరిపిండితో చేయబడినవస్తువులును, సెనగపప్పు మొదలగు పప్పుజాతులును, చేపలును, మామిడిపండ్లను తినిన వెంటను, పాలుద్రావిన వెంటను, తాంబూలముచేసిన వెంటను, ఉదకపానము జేసిన మలినమైన ఆహారసరము పుట్టును; పొట్టను జెరచును; కడుపులో వాతము బుట్టును; అజీర్ణ విరేచనములగును; అనేకరోగములు పుట్టును; ఎల్లప్పుడును వాడుకొనుచుండెడి కుండలోగాని బిందెలోగాని ఉంచినటువంటియు సహజమైనచల్లదనముగలిగినటువంటియు నీరు పానయోగ్యమయినది. సాధనమువలన అధిక చల్లదనము వచ్చునటుల జేయబడిననీరుగాని, వడగండ్లనీరుగాని యే కాలమందైనను దాహము పుచ్చుకొనగూడదు. పుచ్చుకొనిన కాలక్రమముగ ఉబ్బసదగ్గు, క్షయ మొదలగు ఉచ్ఛ్వాసనిశ్వాసకోశ (Lungs) సంబంధ రోగములు దప్పక గలుగును. అమితముగను, అక్రమముగను, చేసిన యుదకపానమువలన గలిగెడు వికారమునకు విరుగుళ్ళు 1 ఉసిరికాయ, 2 త్రిఫలకషాయము, 8 త్రికటుక కషాయము, 4 వేడియౌషధములు, ప్రాతఃకాల వుదకపానము చూడుడు,

ఉదకము దోషయుక్తమయినప్పుడు పుచ్చుకొనెడు క్రమము:--Rules to be observed when impure water is to be drunk. దోషయుక్తమగు నీరుద్రావవలసి వచ్చినపుడు దాహము పుచ్చుకొనుటకు పూర్వము నీరుల్లిపాయగాని, వెల్లుల్లిపాయగాని, సిరకాగాని, కొద్దిగ బుచ్చుకొని పిమ్మట దాహము పుచ్చుకొనడము, లేదా ముందుకొన్ని సెనగగింజలునమలి తరువాత దాహముపుచ్చుకొనడము, లేదా ఒక బియ్యపుగింజగాని, కొంచెము సముద్రపు కొబ్బరిగాని పన్నీరుతో నమలినపిమ్మటదాహము పుచ్చుకొనడము లేదా పటికిపంచదార పానకము కొద్దిగా పుచ్చుకొని అటువెనుక దాహము పుచ్చుకొనడము,నీళ్ళుసగమిగరగాచి వడియగట్టిఆనీళ్ళు పుచ్చుకొనడము, నీళ్ళఅరఖు దీసి (distilled) అవి పుచ్చుకొనడము, లేదా నీరును ఏడుమార్లు వడియకట్టి పుచ్చుకొనడము, ఇటుల జేయుటవలన నీళ్ళు దోషరహితమై బాధించకయుండును.

ఉదకము ఎండనుకాగినది:—Water heated in the sun. రాతిచిప్ప, లేక వెండి, బంగారము, మన్ను వీనిచేత చేయబడిన పాత్రలయందుంచబడి ఎండనుకాగి చల్లారిన నీరు త్రిదోషములను హరించును; దప్పికనుబోగొట్టును; శ్లేష్మవాతములనుహరించును; పాండురోగమును బోగొట్టును; విరేచనము గావించును. చిన్న గుంటలలో నుండి ఎండను కాగి వెచ్చగానున్న నీళ్ళు బుచ్చుకొనిన మిక్కిలి పైత్యమునుజేయును; శుక్లమును నష్టపరచును; విదాహమును, రోగమును బుట్టించును; నింద్యమయినది.

ఉదశ్వితమను చల్ల:—చల్లచూడుడు.

ఉప్పిచెట్టు:— Azima tetracantha, monetia Barlerlodes. సం॥ లవనీ, కుండలీ, హిం॥కంటాగుర్కామై. ఇదియొక ముండ్లు గలిగి పొదవలె యుండెడుచెట్టు, సుమారు 2-8 గజముల ఎత్తు

పెరుగును. ఇది తెల్లఉప్పి, నల్లఉప్పిఅను రెండుజాతులు. నల్లఉప్పి ఆకులు కొంచము నలుపువాటుగాను, ముండ్లు వంకరగాను వుంకును. నల్లఉప్పి శ్లేష్మము. దీనిచిగుళ్ళు, ఆకు, వేరు ఉపయోగింతురు. చేదుగా ఘాటుగానుండును. దీనివేరు రసము. కషాయము, లేక చూర్ణము, వేడిజేయును. జ్వరము, సన్నిపాతజ్వరము, దగ్గు, శ్లేష్మము, ఉబ్బసము, క్షయ, వాతము, సూతికావాతము, క్రిమి వీనిని హరించును. దీనివేరు తేనెతోగంధముతీసిగాని చూర్ణముజేసి తేనెలో గలిపిగాని యియ్యవచ్చును. మూత్రమును జారీ చేయును. వాత మహావాత నొప్పులు ( Rheumatism ) అగ్ని మాంద్యము, అజీర్ణ విరేచనములను కట్టును.బలముజేయును. గండ మాల సుఖరోగములు నివారణమగును. నల్లఉప్పి ఆకురసములో యవాక్షారముగాని, త్రిఫలచూర్ణముగాని కలిపి యిచ్చిన ఉబ్బు వ్యాధి నివారణమగును. నల్లఉప్పి చిగుళ్లు 5, మిరియాలు 5 కలిపి నూరి 6 మాత్రలు కట్టియిచ్చిన బాలింతల మైలరక్తమును వెడ లించును. కస్తూరి, జున్ను, రొయ్యిపీత, పాపుదార, గోరోజనం, యివి చిన్నంచొప్పునగాని,అరచిన్నం చొప్పునగాని వాతరాక్షసం, వాతవిధ్వంశి, సన్నిపాతభైరవి యివి 2 డేసి చిన్నముల చొప్పునగాని ఒక్కొక్కచిన్నం చొప్పునగాని కలిపి నల్ల ఉప్పిచిగుళ్లు వేసి నూరి కందిగింజలవలె మాత్రలుగట్టి యిచ్చుచుండిన పైనజెప్పిన సూతికా వాతము మొదలగు రోగములమీాద. శీఘ్రముగా పనిజేయును. వేరు చూర్ణపుమోతాదు1-2 అణాలయెత్తు; కషాయపుమోతాదు 2 మొదలు 4 తులములయెత్తువరకు. ఆకు రసం మోతాదు 1-2 తులములయెత్తు.

ఉప్పుచేప:—Salt fish. ఉప్పువేసి యెండించిన చేప రుచిగానుండును; వేడిజేసి అరుచును; పైత్యము కాకజేయును; వీర్యమునకు వేడి

బుట్టించును; విరేచనము గావించును; కఫమును హరించును; ఆకలి బుట్టించును; వాతతత్వము గలవారి కనుకూలముగ నుండును; చర్మరోగమును, మేహమును, మేహవాతమును, గ్రహణిని, ఉబ్బువ్యాధిని హెచ్చించును. ఉప్పు వేసిన 5 దినములలోగా దీనిని పుచ్చుకొనిన కొంచెము మంచిది. మెట్టున అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు చేపలు చూడుడు.

ఉప్పుద్రావకము:— Salt or Muriatic acid. దీనిని లవంగాలు మొదలగు పొట్టకు బలముజేసెడు మందు దినుసులలో దేనియొక్క తేలికకషాయములో నయినను లోపలికిచ్చిన పొట్టకుబలము జేయును; ఆకలి బుట్టించును; దేహమునకు సత్తువజేయును. నీళ్ళు మొదలగు రసద్రవ్యము 6 ఔన్సులలో 80 మొదలు 120 చుక్కల వరకు ఈ ద్రావకము కలిపినది పుక్కిలించిన గొంతుకపుండురోగము నివర్తించును. దీనిని నీళ్ళతోగాని, తత్వమును మంచికి మార్చే లేక సౌమ్యపరచే వస్తువులయొక్క లేక వేప సిన్కోనా, నేలవేము మొదలగు వస్తువులయొక్క తేలిక కషాయము లేక రసములోగాని యిచ్చిన దోషజ్వరము ( Typhus fever ), చర్మవ్యాధులు హరించును; సత్తువజేయును; కుళ్ళునాపును మోతాదు 10 మొదలు 20 చుక్కల వరకు. చక్కగ విరేచనములు చేయించి దీని నిచ్చిన క్రిములు పుట్టకుండజేయును. దీనిపొగ గాలిలోని విషమును హరించును.

ఉప్పునూతినీళ్ళు:— Brackish well water. వెగటుగా నుప్పుగా నుండును; శ్లేష్మవాతములను గొట్టును; జఠరదీప్తి నిచ్చును; మిక్కిలి పైత్యము, కాకజేయును; మేహకారక దేహములకు సరిపడదు,

ఉప్పు (సముద్రపునీటితో పండించునది):—Soodii Chloridum. Eng. Salt common. సం॥ సముద్రలవణ,అత్రి,బం.హిం॥నిమ్మక్. శాకచేసి అర్చును; ఉప్పగనుండును; అన్నిపదార్థములకంటె నెక్కువ బలమునిచ్చును; వీర్యపుష్టిని, జఠరదీప్తిని, యిచ్చును; జీర్ణముగావించును; రుచిబుట్టించును;విరేచనము చేయును; వాతము నణచును; కఫవాతము, గుల్మము, విషము, శ్వాసకాసలు, వీనిని హరించును. నీటిలో ఉప్పువేసికాచి పుచ్చుకొనిన శూలలు వణచును. ప్రథమ కబళములో కొద్దిగా ఉప్పు బుచ్చుకొని భోజనము చేసిన పరిణామ శూల లణగును. 2-3 తులములయెత్తు ఉప్పు చల్లని నీళ్ళలో గలిపి పుచ్చుకొనిన రక్తవమనము కట్టును; ¼ తులం ఉప్పు నీళ్ళలో కలిపి శుభ్రముగా కరిగించి యిచ్చిన తేలవిషము వెంటనే తగ్గిపోవును. వేడినీళ్ళతో పుచ్చుకొనిన వమనము చేయును. ఉప్పు విస్తారముగ బుచ్చుకొను అభ్యాసముంచుకొనిన ఎముకల యొక్క, వీర్యము (శుక్లము)యొక్క బలమును అనగా పటుత్వ మును తగ్గించును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 చలవ వస్తువులు, 3 బియ్యము కడిగిన నీళ్ళు,4 కలినీళ్ళు, 5 మొగలి చన్నులరసము, 6 నిమ్మపండ్లు, 7 మజ్జిగ,మరియు ఉప్పు మంగలములో లేక కళా యిలో వేయించి గుడ్డను మూటకట్టి సహించకూడిన వేడియుండగ కాపడము పెట్టిన కడుపునొప్పి, శూల, గుండెలనొప్పి నివ్మరిం చును. వాతము,శ్లేష్మమును హరించి శరీరమునకు వేడిబుట్టించును.

ఉమ్మెత్తచెట్టు, తెల్లపువ్వులది, పసుపుపచ్చ పువ్వులది:— Datura Metel & Datura Alba. Eng. Datura. Thorn-apple white and yellow flowered సం॥ దత్తూర, ఉన్మత్త.హిం॥ధతోరా. దీని ఆకు కాయ మొదలగునవి వగరు, చేదు తీపి రుచులుగ నుండును; మత్తుచేయును; పైత్యము, కాక చేయును; కుష్టరోగము,

వ్రణము, దురద వీనిని పోగొట్టును; కాళ్ళమీద నయ్యెడు కురుపులు అనగా ఉసిరికలు, విషకురుపులు వీనిని హరించును; అన్ని వ్రణములకు ఉమ్మెత్తకాయ కుమ్ముగ నుడికించి నూరికట్టిన వింతగ మానును; సమూలముయొక్క రసము ఒంటికిపూసిన వాతమును, రసవాతమును, చర్మరోగములను హరించును. దీని ఆకుపసరులో నూనెపోసి కాచి పూసిన తలమీది చర్మరోగములు, ఇతర చర్మరోగములు నివర్తించును. దీని విత్తులు పూటకు 3 గింజలచొప్పున యిచ్చిన జ్వరము కట్టును. దీని ఆకులకు ఆముదము చరిచి వెచ్చజేసి కట్టిన వాత, మేహవాత నొప్పులు, వాపులు, ఇతరవాపులు హరించును. దీని సమూలమును ఎండించి ముక్కలు ముక్కలుగ కొట్టి పొగపుచ్చుకొనిన ఉబ్బసదగ్గు (asthma) అణగును. వీని యాకులను కాచిన ఆముదములో వేసి వడలించి వానిని రెండు మూడు పొరలుగ క్రొత్తగా లేచిన గెడ్డలపై వేసిన అవి శీఘ్రముగ హరించిపోవును; నొప్పి అణగును; లేదా వానినిపక్వపరచి చితుకజేయును. వీని యాకురసము త్రావిన, లేక కాయలనుగాని, లేక విత్తనములుగాని, తినిన మిక్కిలి మత్తుజేసి మతిభ్రమ బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నిమ్మపండ్ల పులుసు, 2 నేరేడుచెక్కరసము, 3 పచ్చికడుగు, 4 పుల్లపావిలాకు రసము, 5 తామరవిత్తుల చూర్ణము, 6 జీలకర్ర, 7 తామరాకురసము, 8 శర్కర గలిపిన ఆవుపాలు, 9 నీళ్ళతో నూరి తీసిన వాకుడువిత్తుల రసము (సుమారు 4 తులములయెత్తు), 10 పయిడిప్రత్తి పువ్వులు కలకండ కలిపి నీళ్ళతోనూరి తీసినరసము, 11 నీళ్ళలో కలిపిన ఉప్పు, 12 పాలు, పంచదార (4 కచ్చాశేర్ల పాలలో 4 తులముల పంచదార) పుచ్చుకొనడము. వీనిలో కడపటి మూడు విరుగుళ్ళు విత్తులు విషము మీద యెక్కువగ పనిజేయును. వీనికిని నల్ల

యుమ్మెత్తగుణములు గలవుగాని నల్లయుమ్మెత్త అధికబలముతో పనిజేయును. నల్ల ఉమ్మెత్త చూడుడు.

ఉమ్మెత్త నల్లనిది:—నల్లఉమ్మెత్త చూడుడు.

ఉయ్యాల:—Cradle ఉయ్యాలలో నూగడమువలన శ్రమను బోగొట్టును; పైత్యముజేయును; నిద్రదెచ్చును; సుఖము నిచ్చును;బుద్ధికి ప్రకాశత గలుగును.

ఉరిసిపాల:—Cissus Acida. దీని దుంపను పలచగ బిళ్ళవలెకోసి దానిని అడ్డగర్రలకు (Buboces) పైన వేసికట్టిన నవి హరించును. దానిని మెత్తగనూరి పంచదార గలిపి లోపలికిచ్చిన మూలవ్యాధి మానును. మోతాదు పూటకు ½ తు॥ మొదలు 1 తు॥మెత్తువరకు

ఉర్లకోడిమాంసము:—Snipe-flesh of దీనిని తుంగకోడి, ఇసనాబు పిట్ట అనియు నందురు. దీనిమాంసము చమురుగలిగి రుచిగానుండును; వీర్యవృద్ధి, బలముజేయును; బొట్టబొట్టుగాపడే మూత్రమును కట్టును. అమితముగా దినిన గురుత్వముజేయును; దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 అల్లము.

ఉర్లగడ్డలు:—ఆలుదుంపలు చూడుడు.

ఉలవకట్టు:—Boilings of horse gram.వగరుగా, రుచిగానుండును; వాతము, తూనివాతము, ప్రతూనివాతము, అనులోమవాతము, గుల్మము, ఉదరరోగము, మధుమేహము, మూత్రాశ్మరి, శ్లేష్మము, శూల, క్షయ, శ్వాస, కాస, గుదరోగము వీనిని బోగొట్టును.వీర్య బలము తగ్గించును. నల్లఉలవకట్టు, ఉలవలు చూడుడు.

ఉలవగండి :— Gunjee made of split horse gram & rice. ఉలవలు బియ్యములు వేసి కాచినగంజి,వాతము,అనులోమ వాతము రాజయక్ష్మ, జ్వరము మొదలగు రోగములను హరించును.

ఉలవపప్పు నీళ్ళను వండినది:— Dhall of horse-gram boiled in water. మూత్రకృచ్ఛ్రము, గుల్మరోగము, ఉదరము, మూలము, క్రిమి, దగ్గు వీనిని పోగొట్టును; కఫము, వాతము జేయును; దీనికి విరుగుళ్ళు ఉలవలు చూడుడు. ఉలవపప్పు వండినది తరుచు బుచ్చుకొనిన స్థూలత్వమును పోగొట్టును.

ఉలవపులగము:— Rice boiled with horse gram dhall. బియ్యము, ఉలవపప్పుతో వండినపులగమున కఫవాతముల నణచును; శూలలు, మూత్రకృచ్ఛ్రము వీనిని పోగొట్టును. మూత్రము గావించును. తేలికను, కాంతిని యిచ్చును.

ఉలవలు:— Dolichos Uniflorus, Dolichos Biflorus. Eng. Horse gram. సం॥ కుళుత్థ, తామ్రబీజ, హిం॥ కుల్థీ. ఇవి తెలుపు ఎరుపు, నలుపు రంగులుగల మూడు జాతులుగ నుండును. వీనిలో నలుపురంగు ఉలవలు ఎక్కువపనిజేయును. పై మూడు జాతులలో, ఏజాతిఉలవరొక్క కషాయముగాని లేక చూర్ణముగాని, వగరుగ; తీపిగ స్వాదుగనుండును. వేడిజేసి యార్చును; మిక్కిలి కాక, పైత్యము జేయును. వాతము, పీనస, శ్వాస, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, ఊపిరిగొట్టునొప్పి,మలబద్ధము వీనిని హరించును; కఫమును లేక శ్లేష్మమును కరగించును అనగా నీరుజేయును;స్త్రీలు బహిష్టకావడములోని లోపములను (menstural disorders) పోగొట్టును; ప్రసవస్త్రీల మైలరక్తమును వెడలించును; గురదాల (kidneys) లోనిరాతిని కరిగించును;ఆకలి బుట్టించును; ఎక్కిళ్లు, నేత్రరోగములు వీని నణచును; మూత్రముగావించును; బుతురక్తమును జారీచేయును; నల్లదబ్బతో(spleen) పుట్టెడు కంతులను హరించును;కడుపునొప్పిని పోగొట్టును; ముల్లంగియాకు రసముతో నిచ్చిన మూత్రపుసంచిలోని (bladder) రాయి పడిపోవును. ఉలవ

కషాయముతో కాచినచారు (ఉలవచారు) పైనచెప్పిన రోగులకు పథ్యముగనుండును. కషాయపు మోతాదు 6 మొదలు 10 తులముల మెత్తువరకు. చూర్ణపుమోతాదు 6 అణాలమెత్తు. విదాహమును, రక్తపైత్యమును బుట్టించును; నల్లదబ్బ (spleen) కు నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 నూనె, 2 నెయ్యి, 3 కలిసీళ్ళు, 4 తేనె. అడవి ఉలవలు, తెల్లఉలవలు, నల్లఉలవలు చూడుడు.

ఉలిమిచెట్టు:— Capparis Trifoliata, Crataeva Religiosa & C. Nurvale. సం॥ వరుణ, అశ్మరిఘ్న. హిం॥ వరున్. దీనిని ఉరుముడిచెట్టని యందురు. దీనికాయలు గుండ్రముగ నిమ్మకాయలంతేసి యుండును; పండిన ఎర్రగనుండును; దీలి యాకుల రసము లేక కషాయము తీపి, చేదు రుచులు గలిగియుండును; వేడిచేయును; కఫము, మేదోరోగము, వాతము, జిహ్వాదోషము, అగ్నిమాంద్యము, ఉదావర్తశూల, గుదరోగము, గుల్మరోగము, వీనిని హరించును; ఆకలి బుట్టించును; మంచి పైత్యమును బుట్టించును; విరేచనము జేయును; మూత్రము పుట్టే అవయవము (kidneys) న బుట్టెడు రోగమును నివర్తించును; నాభియందు బుట్టెడు విద్రధియను వ్రణమును మాన్పును. ఆహికజ్వరము, దోషజ్వరము (Typhus fever), హృద్రోగము వీనిని పోగొట్టును. దీని యాకును ఆముదము వెచ్చజేసికట్టిన మీగాళ్ల (feet) వాపును, మడమలమంటను హరించును. ఆకురసము లోపలికిచ్చిన వాత, మేహవాతనొప్పులు (Rheumatism) హరించును. ఇందుకు అరతులమెత్తు మొదలు 3 తులములమెత్తువరకు రసములో కొద్దిగ కొబ్బరిపాలు, నెయ్యిగలిపి నియ్యవగును. ముక్కుయెముక పుప్పికి, పుండుకు దీనియాకుపొగ పుచ్చుకొని ఆపొగను ముక్కురంధ్రముల వెంట వదలిన కుదురును. దీనియాకును మ్రాను చెక్కయును

దంచి ఆముదముతో వెచ్చచేసి కాపడముపెట్టి కట్టుకట్టినను, దీని పండ్లు ద్రమానుచెక్క పీనితోచేసిన తైలముతో మర్దనచేసినను, వాత మేహవాతనొప్పులు హరించును; దీనిద్రమానుచెక్క కషాయ మిచ్చిన నిద్రదెచ్చును; జ్వరమును హరించును; శరీరతత్వమును మంచికి మార్చును;మూత్రరోగములను మూత్రకృచ్ఛ్రమును,కొన్ని చర్మవ్యాధులను పోగొట్టును; వమనమును కట్టును; అతిరేచనపుల నణచును. కషాయము కాచువిధము. 4 ఔన్సుల ద్రమానుచెక్క చిదుకగొట్టి ఒకటిన్నర పైంటు నీళ్ళలోవేసి ఒక పైంటు నీళ్ళమిగు లునటులకాచి వడపోసి యుపయోగించవలెను. దీని యాకునుగాని వేరుచెక్కనుగాని నూరి పైనపట్టు ( poultice ) వేసిన నెరబ డును; పొక్కుపొక్కును. పైనజెప్పిన పట్టు లేక కట్టు 5 మొదలు 15 నిమిషములు ఉంచిన పనిచేయును; అనగా ఆవాలపట్టు ( poultice ) కంటె మంచిపని చేయును; అంత కంటె ఎక్కువ కాలము ఆ పట్టు ఉంచిన పొక్కుపొక్కి పుండగును. గాని అందు వలన వాతనొప్పులు మొదలగునవి హరించును. దీని యాకుకూర వండి తినిన పై రోగులకు పథ్యముగనుండును; దీని యాకురసము చెవిలో బోసిన చెవినొప్పి నయమగును. ఆకురసము లోపలికిచ్చు మోతాదు పూటకు అరతుల మెత్తు మొదలు 2½ తులముల యెత్తు వరకు. కషాయపు మోతాదు పూటకు 1½ మొదలు 3 ఔన్సుల చొప్పున దినమునకు రెండుపూటల నియ్యవలెను. దీని యాకులు గుదస్థానమందు గట్టిన అక్కడి పొక్కులు, పుండు (Inflamation) మానును.

ఉల్లంచేప:—A sort of fish అనగా ఉల్లింకచేప. దీనిమాంసము చమురు గలిగి రుచిగానుండును; జఠరదీప్తిని,వీర్యపుష్టినియిచ్చును; వాతము, గురుత్వముచేయును. దీనికి విరుగుళ్ళు చేపలు చూడుడు.

ఉల్లిపాయలు:—నీరుల్లిపాయలు చూడుడు.

ఉల్లియాకు కూర:—నీరుల్లియాకుకూర చూడుడు..

ఉవ్వకాయ:—Dillenia Speciosa, D. Indica-fruit of. సం॥ భవ్య, లోమఫల, వక్త్రశోధన. హిం॥ చల్‌టారో మఫల్. ఇది పెద్ద వృక్షము. వర్ష ఋతువునందు తెలుపు పసుపురంగుపువ్వులు పూయు రెండురకములుగలవు. దీనికాయలు తాటిచెట్టు కాయల వలె నుండును. తాటికాయ డిప్పలువలె ఒకదానిమీద మరియొకటి గలిగి ఆకుపచ్చగ నుండును. యివి విస్తారము కలకత్తాయందును శ్రీ జగన్నాథమునందును దొరకును. వీనిని పప్పులోను, పులుసులోను వేసి వండుకుందురు. స్వాదుగా, పుల్లగా, మనోహరముగా నుండును; నోటిని శుభ్రపరచును; పైత్యశ్లేష్మములను హరించును; శ్లేష్మము, వాతము, శూల వీనిని హరించును; దీనిపండు చలవజేయును; వీర్యవృద్ధి నిచ్చును, రుచిబుట్టించును; వాతపైత్యశ్లేష్మ రోగముల నణచును; సదా పథ్యముగ నుండును.

ఉష్ణోదక పానము:—Drinking hot water. జఠరాగ్నిని వృద్ధి బొందించును; అన్నమరుగ జేయును; కంఠమందుండెడు శ్లేష్మమునణచి చులకనపరచును; దేహమునకు వేడినిచ్చును; జలమల విసర్జనగావించును, ఎక్కిళ్ళను, కడుపుబ్బును పోగొట్టును; వాతము, శ్లేష్మము, జ్వరము, దగ్గు, వగర్పు, పీనస, పడిసెము, పార్శ్వశూల, తలనొప్పి, గుల్మము, ఆమము, మూలవ్యాధి, గ్రహణి, క్షయ, ఉదరరోగము, పాండువు, ఉబ్బు, గళరోగము, వ్రణము, మేహము, నేత్రరోగము, వాతము, అరుచి, అతిసారము, కుష్ఠు ఈరోగములుగలవారికి మిక్కిలి యనుకూలించి సౌఖ్యమిచ్చును; భోజనాత్పరమందు బుచ్చుకొనిన దేహాతత్వమును సౌమ్యపరచును. అనుదిన ముష్ణోదకము బుచ్చుకొనిన కొన్ని కాళ రుగ్మతల బుట్టిం

చును. దీనికి విరుగుళ్ళు 1 సోపు, 2 సికింజబీను. వేడినీళ్ళలో మజ్జిగ వేసి పుచ్చుకొనినయెండపెట్టువలనగలిగిన విదాహము,ఆయాసము, వడ నివృత్తించును. రాత్రి పరుండబోవునపుడు వేడినీళ్ళు పుచ్చుకొనిన వాతము, కఫము, ఆమదోషము, అరుచిని పోగొట్టును; అన్నము జీర్ణము గావించును. జఠరాగ్ని వృద్ధి బొందించును.

ఉష్ణోదకపానము వర్జించవలసినవారు:—వేడి నీళ్ళు పుచ్చుకొనకూడని వారు చూడుడు.

ఉష్ణోదకము కాపు విశేషమునుబట్టి గుణములు:—Properties of hot water according to the extent to which it is boiled. నాల్గవంతు ఇగరగాచిననీరు వాతమును, సగమిగరగాచిన నీరు వాతపైత్యమును, మూడువంతు లిగరగాచిననీరు వాత పైత్య శ్లేష్మములను నణచును. మతాంతరమున, నాల్గవంతు ఇగరగాచిన నీరు వాతమును, సగమిగరగాచిననీరు పైత్యమును, మూడువంతు లిగరగాచిననీరు శ్లేష్మమును హరించును. కాగి చల్లారిన ఉదకమును తిరిగికాచి పుచ్చుకొనిన విషతుల్యముగ నుండును. మరియు కాచిన నీళ్ళు మిక్కిలి వేడిగానుండునపుడు దానిలో చల్లని (కాచని) నీళ్ళు బోసి వేడినితగ్గించి యానీళ్ళు పుచ్చుకొనిన శ్లేష్మవాతముల ప్రకోపింప జేయును; అనారోగ్యకరముగ నుండును.

ఉష్ణోదక స్నానము:—వేడినీళ్ళస్నానము చూడుడు.

ఉసిరిక చెట్టు:—Phyllanthus Emblica, Emblica Officinalis. Eng. Emblic Myrabolan tree. సం* ఆమలకీ, ధాత్రి. హిం* ఆంవలా. దీని చెక్క లేక యాకురసము లేక కషాయము వెగటు, కారము, చేదు,పులుపు రుచులు గలిగి స్వాదుగనుండును; చలవ జేయును; త్రిదోషములను శమింప జేయును;జ్వరమును హరించును; నీళ్ళవిరేచనములను, అతిసారమును కట్టును. పచ్చిమ్రాను చెక్క, పసపు సమముగ నూరి తేనెతో కరక్కాయంత చొప్పున

7-8 పూటలనిచ్చిన సెగరోగము మానును. ఈచెక్కరసము కల్పిన వ్రణముల మాన్పును. వేళ్ళచెక్క తేలిక కషాయము దాహము నణచును; మ్రానుచెక్క ఎండు ఉసిరికాయలకు మారుగ వాడ నగును; వేళ్ళకషాయ మిగరగాచి యొండించినది కవిరి (కాచు) వలె పనిచేయును. చీనియాకుల తేలిక కషాయముతో బేడయెత్తు మొదలు పావలా యెత్తువరకు మెంతులు తినిన పురాణరక్తగ్రహణి కట్టును; బలముచేయును; రసముయొక్క మోతాదు పూటకు 2½ - 4 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 6 తులముల యెత్తువరకు.

ఉసిరికపచ్చడి:— Pickle of Myrobalans. పండిన ఉసిరికాయల పచ్చడి మేహశాంతి, పైత్యశాంతి జేయును; రుచిబుట్టించును; విరేచనబద్ధముజేయును. ప్రాతది పథ్యముగ నుండును; వాతరోగుల కనుకూలించదు; వీర్యమునకు చలవజేయును.

ఉసిరికవడియాలు:— Dried cakes of do. పండిన ఉసిరికాయలు దంచి మినపపప్పులో వేసి ఉప్పు, కారము వేసి రుబ్బి చేసినవి మూల వ్యాధిని, తాపము నణచును, తేలికగనుండును; మేహశాంతిజేయును; శూల, పైత్యము నణచును; రుచిబుట్టించును; పథ్యమైనవి.

ఉసిరికాయ:— Phyllanthus Emblica fruit of. Eng. Emblica Myrobalan. ఉసిరికాయ ముదిరినది లేక పండినది దీనివరుగు అనగా ఎండినవి చలవచేసి ఆర్చును; ఇగరదీయును; వగరు, తీపి, పులుపు రుచులు గలిగియుండును; నేత్రములకు చలవ జేయును; త్రిదోషములను శమింపజేయును, కొద్దిగవీర్యమునకు చలవజేయును. పైత్యభ్రమ, సమస్తమేహములు, కఫము, పైత్యము, మూలవ్యాధి వీనిని హరించును; పొట్టకు, ముంతగుండెకు బలమును జీర్ణశక్తిని, బుద్ధిబలమును ఇచ్చును; కడుపులో త్రిప్పును కట్టును; మేదస్సును

వృద్ధిబొందించును; దాహము నణచును; వీర్యపుష్టి, బలము జేయును; విరేచనము గావించును; ఆయుర్వృద్ధి నిచ్చును; వయస్సును నిలుపును; ముదిమిని పోగొట్టును; అమృత తుల్యముగ నుండును; మెదడులో పుట్టెడు చెడునీరును దేహములోనికి దిగ నియ్యదు; సంతోషమును బుట్టించును; బుద్ధిని చెరిపెడు వస్తువులదోషమును విరుచును; వాంతి, నోటివెంట ఊరు నీళ్ళను కట్టును; శ్లేష్మమును, జలుబు నీరును హరించును; రక్తములోని అతివేడిని తగ్గించును; పచ్చికాయలరసము చలవజేయును; శ్రమనుపోగొట్టును; మూత్రము గావించును; అగ్నిదీప్తినిచ్చును, విరేచనము జేయును; మూత్రము జారీచేయుటకు ఆరసములో తేనెగలిపి యియ్యవగును; కాయలునూరి పొత్తికడుపు క్రిందిభాగము పైన పట్టించిన లేక కట్టిన మూత్రకోశము (bladder) లోని నొప్పిని లేక మంటను మాన్పును. పండ్ల రసముతో సారాయమువలె తీసిన అరకు పాండురోగము, అగ్నిమాంద్యము, దగ్గు నణచును. హృదయమునకు బలమిచ్చును. దేహములోని ద్రవపదార్థములను శుభ్రపరచును. పండ్లరసములో పంచదారగాని తేనెగాని కలిపి చేసిన పానకము చలవజేయును; దాహము నణచును; మూత్రము గావించును. పండ్ల రసము చిక్కగా కాచి దానిని పూసిన పల్లికలు, పొక్కులు మొదలగు చర్మరోగములు నివర్తించును. పండ్లమురబ్బా పైత్యశాంతి, మేహశాంతి చేయును. ఆవనూనెలో ఉసిరిపండ్లను కొన్ని దినములు ఊరనిచ్చి ఆవనూనె మాడపట్టున రుద్దిన మెదడులోని రక్తము క్రమముగ పారకుండుటవలన గలిగిన తలమంట, బుద్ధి చపలత, తలలోవికారము ఇవి యణగును. పండు లేక యెండు కాయలకషాయము పురాణరక్తగ్రహణిని, నీళ్ళ విరేచనములను కట్టును; శ్లేష్మమును వెడలించును. దగ్గును, గొంతుకలో గురగురలాడడమును

కట్టును. పైత్యమును విరుచును. ఉసిరికాయలు పచ్చివి (పండనివి) విస్తారముదినిన పురాణరక్తగ్రహణికట్టును; ఎండుకాయలు విరేచన బద్ధముజేయును. రక్తముపడు మూలవ్యాధి నణచును. వీనిచూర్ణముతో లోహభస్మము కలిపియిచ్చిన రక్తక్షీణము, పాండురోగము అగ్నిమాంద్యమును నివర్తించును. వీనిచూర్ణము అతిసార విరేచనములను, రక్తవిరేచనములను, రక్తగ్రహణినికట్టును. ఎండుఉసిరికాయ, తాడికాయల కషాయమిచ్చిన స్త్రీలరక్తస్రావమును, రక్తకుసుమనుకట్టును; కరక్కాయ, ఉసిరికాయల చూర్ణము విరేచనము చేయును. ఎండు ఉసిరికాయల వరుగుచూర్ణము విరేచనమును కట్టును. మృదువు పరచును; బలముజేయును. నీళ్ళవిరేచనములను, రక్తవమనమును, గుండెలోనుండి అనగా తెల్లదబ్బ ( lungs ) లోనుండి కఫమిశ్రమమైపగు రక్తమును కట్టును. ఎండు ఉసిరికపప్పు అనగా లోపలిగింజలు తీసివేసినవి కలిలో నానబెట్టి మెత్తగానూరి మాడపట్టుకు వేసి, ఘుంటపుంచి సీకాయతో రుద్దుకొనుచుండిన మెదడులోని వేడిని శాంతిపరచును, నేత్రములకు చలువజేసి కొన్ని నేత్రరోగములు నయమగును. తలకు మాడపట్టున ఆముదము మర్దనాచేసి పైన వ్రాసిన ప్రకారం చేయవలెను. ఎండుకాయలు క్రొత్తకుండలోవేసి అందులో నీళ్ళుపోసి ఒకరాత్రి ఊరనిచ్చి ఆ నీళ్ళను కండ్లలోవేసిన నేత్రరోగముల హరించును; ఆనీళ్ళు నులివెచ్చజేసియైనను పోయవచ్చు. ఉసిరికాయ తెల్లదబ్బకు నష్టము జేయును. కడుపు నొప్పి బుట్టించును. శీతతత్వము గలవారి నల్లదబ్బ (spleen) కు నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు1 తేనె, 2 పొగడపండ్లు. 3 ఆవాలు, 4 బాదమునూనె. పచ్చికాయల రసపు మోతాదు పూటకు 4 – 5 తులముల యెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు. అరఖు మోతాదు

2½ తులములయెత్తు: చూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు అరతులమెత్తువరకు. ఉసిరికాయలవిత్తుల తేలిక కషాయము నేత్ర రోగముల హరించును. విత్తులలోని పప్పు (pulp) దగ్గును కట్టును.

ఉస్తికాయలు·— Solanum trilobatum, green fruit of వీనిని ఉచ్చింతకాయలనియు నందురు. పచ్చివి చేదుగ, వేడిజేయును, మిక్కిలి జఠరదీప్తి నిచ్చును, త్రిదోషహారమయినది. వీర్యవృద్ధి జేయును. రుచి బుట్టించును అగ్నిమాంద్యమును హరించును. క్రిమి, దగ్గు, వగర్పు, తుయ, ఎక్కిళ్ళు, అరుచి, :దురదలు, ఆమము, పైత్యము, కఫము, మూలవ్యాధి, మేదోరోగము, నీరసము వీని నణచును; విరేచనము జేయును. ఎండుకాయలు అనగా వరుగు, శ్లేష్మహారము. మేహమును వృద్ధిబొందించును. తరుచు పుచ్చుకొనిన గుండెభారమును, విదాహమును గలిగించును. దీనికి విరుగుడు తేనె గలిపిననీళ్ళు. దీనికాయలు చితుకగొట్టి గింజలుకడిగి తీసివేసి పులుసు బెట్టి కూరగా వండుకుని తినిన వాతపిత్తశ్లేష్మములను హరింప జేయును. రుచి బుట్టించును. దీని కాయలను మినపపప్పుతోగాని, పెసరపప్పుతోగాని రసవర్గములువేసి రుబ్బిన వడియములు చిరుచేదుగ,రుచిగానుండును. శ్లేష్మము, పైత్యమునణచును. వాతము, గుల్మము, క్రిమి నేత్రరోగములను బోగొట్టును. దాహమును అధికపరచును.

ఉస్తికూర:—Curry of tender leaves of do. లేతఆకు కూర కొంచెము చేదుగా. స్వాదుగానుండును. మూలవ్యాధి నణచును; నులిపురుగుల జంపును; దగ్గు, వగర్పు, మేహము, కఫము, ఎక్కిళ్ళు, కఫవాతము, వీనిని హరించును; విరేచనము జేయును; నీరసమును, అరుచిని పోగొట్టును. దీని ఆకుకూర తరుచు పుచ్చుకొనుచుండిన జ్ఞానాభివృద్ధి గలుగును.

ఉస్తితీగ:—Solanum Trilobatum. సం॥ అలర్క—. ఇదితీగె ప్రాకును; నీలవర్ణమైన పువ్వులు పూయును; చిన్నకాయలు గుత్తులు గుత్తులుగ కాయును; చెట్టంతయుముండ్లుగలిగియుండును. దీనిని ఉచ్చింత చెట్టని, ముళ్ళముష్టి చెట్టనియు నందురు. దీనివేరు,ఆకులు,చిగుళ్ళు, పువ్వులు, కాయలుచేదుగనుండును; త్రిదోషహరమైనవి; క్రిమి, దగ్గు, వగర్పు, క్షయ, ఎక్కిళ్లు, అరుచి, నీరసము, మూలవ్యాధి, శ్వాస, కాసలు, మేహము, చర్మరోగములు, ఆమము వీనిని హరించును. జఠరదీప్తి నిచ్చును; బలముజేయును; విరేచనము గావించును. దీని కషాయము, చూర్ణము, సారము (extract) చేసి వాడనగును. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు అణా మొదలు పావలాయెత్తువరకు. సారము (extract) మోతాదు అణాయెత్తు మొదలు 2 అణాలయెత్తువరకు. ఉస్తివేరు గాని పండుగాని నేతిలోగాని,ఆముదములోగాని వేసి కాచి చంటిబిడ్డలకుబెట్టిన దగ్గు, పడిశము, శ్లేష్మము తగ్గును. విరేచనము జేయును. దీనిపండ్లను ఆవునేతిలో వేసికాచి యానేతిని, బిడ్డలకు ఉగ్గు పెట్టిన దగ్గు, కఫము హరించును; అగ్నిదీప్తి నిచ్చును; వీనిలోని విత్తులను ఎండించి చూర్ణించి తేనెలో గలిపి నాకించిన బిడ్డల దగ్గులు హరించును. మోతాదు పూటకు 3-4 గుంజలయెత్తు.

ఉస్తివేరు:—Root of do. దీనిని నేతిలోవేసి కాచి బిడ్డలకు ఉగ్గుపెట్టిన లేక దీనిని నీళ్ళతో నూరి పొంగించి ఆ రసమిచ్చినను వాతశ్లేష్మములను, దగ్గును హరించును; విరేచనము జేయును. రసముయొక్క మోతాదు 1-2 తులములయెత్తు.

ఉస్తిపువ్వు:—Flowers of do. వీని రసము లేక చూర్ణము క్రిమి, గుల్మము, మూలవ్యాధి, దగ్గు, శూల, వీని నణచును; అగ్నిదీప్తి

నిచ్చును. రసము మోతాదు 1-2 తులములయెత్తు. చూర్ణపు మోతాదు 3 చిన్నముల యెత్తువరకు.

—౧—

## ఊ

ఊడికూర:—A pot herb. దీని కూర లేక ఆకురసము గ్రహణి, గుల్మము, విద్రధి, కఫరోగము వీని నణచును; అగ్నిదీప్తినిచ్చును; రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు.

ఊడుగచెట్టు :—Alangium Decapetalum, A. Hexapetalum A. Lamarckii. Eng. Sage leaved Alangium. సం* అంకోల, నికోచక. హిం* కేరా, ఢెరా. దీని వేరు చెక్క నూరినదిగాని చూర్ణముగాని, మిక్కిలి చేదుగ, వెగటుగ, కారముగ నుండును; వేడిచేయును; రక్తాతిసారము, క్రిమిరోగము, కుష్ఠు, వ్రణములు, సవాయి, యితరచర్మరోగములు, జ్వరము, విడువనిజ్వరము, ఉబ్బు, ఉదరరోగము, సర్పవిషము, వెర్రికుక్క, వెర్రినక్క, ఎలుక మొదలగు విషజంతువులయొక్క విషము, కడుపునొప్పి వీనినిపోగొట్టును; విరేచనముగూడ పెట్టును; చెమటబుట్టించును; వమనము, విరేచనముగూడ చేయును; శరీరతత్వమును మార్చును; బలము చేయును. కురుపులు, కుష్ఠు, సవాయి మొదలగు మొండి చర్మవ్యాధులకు దీని చూర్ణమును ఇచ్చునపుడు రోగి యొక్క బలమునుబట్టి చాలినన్ని యెక్కువ దినములు నియ్యవలెను. ఏ వ్యాధులకు ఇపికాకునా (Ipecacuna) ఉపయోగించునో యావ్యాధులలో రక్తగ్రహణి తప్ప తక్కిన అన్ని వ్యాధులకు ఇపికాకునాకు మారుగ దీనిని వాడతగి యుండును. వాంతులు కావడమునకు ఇచ్చేడు మోతాదు 40 మొదలు 50

గోధుమ గింజలయెత్తువరకు, త్రాచుపాము విషమునకు ఇచ్చెడు మోతాదు 40 గోధుమ గింజల యెత్తు మాత్రగ చేసి యియ్య వగును. తత్వమును మార్చి బలమిచ్చుటకిచ్చు మోతాదు 2 మొదలు 5 గోధుమ గింజల యెత్తువరకు. తక్కిన వ్యాధులకిచ్చు మోతాదు 5 మొదలు 10 గోధుమ గింజల యెత్తువరకు. కుష్టురోగమునకు జాజికాయ, జాపత్రి, లవంగములు దీనివేరు చూర్ణము సమపాళ్ళుగ గలిపి యియ్యవగును. ఊడుగ చెట్టు నలుపు, ఎరుపు, తెలుపు రంగుల పువ్వులు పూసెడు మూడుజాతుల చెట్లుండును. ఇందులో ఎరుపు పువ్వులు చెట్టు వేరుచెక్క సర్పవిషమునకు ఎక్కువ పని చేయును. దీని యాకులు దంచి ఆముదముతో వెచ్చచేసి కట్టుకట్టిన వాత మేహవాతపు నొప్పులు హరించును. దీని వేరుచెక్క చూర్ణము వలన గలిగిన అధికవమనమునకు విరుగుడు కరక్కాయ చూర్ణము. ఊడుగనూనె అనగా విత్తుల తైలము వంటికి బూసిన చర్మరోగము లను, లోపలికిచ్చిన కఫవాతములను, కుష్టును బోగొట్టును, వేరు చెక్కతో చేసిన తైలము మర్దనచేసిన వాత మేహవాతపు నొప్పు లను పోగొట్టును. ఊడుగపండు వెగటుగ నుండును. జఠరదీప్తి నిచ్చును; దేహపుష్టి,బలము జేయును; చలవ జేయును; రక్తవాతము దేహపు మంటలు, క్షయ, రక్తముపడు మూలవ్యాధి వీనిని జయిం చును. విరేచనము కట్టును. శ్లేష్మమును బెంచును. దీనికి విరుగుడు తేనె, లేక సజ్జాక్షారము.

ఊరపిచ్చుక మాంసము:—Sparrow flesh of. పైత్యమును, క్షయ, జ్వరమునుబోగొట్టును;వీర్యవృద్ధి జేయును; జఠరదీప్తినిచ్చును; మొగ పిచ్చుక మాంసము రక్తపైత్యము, వాత పైత్యమును బోగొ ట్టును; శుక్లవృద్ధిని, పుంస్త్వమును ఇచ్చును; వాతమును, బోగొ ట్టును. పథ్యమైనది.

ఊరపిచ్చుక గ్రుడ్లు:—Eggs of sparrow. వేడి జేయును; నరముల యొక్క జబ్బును హరించును; ఉబ్బును, పార్శ్వవాతమును పోగొట్టును; శాకలిత్వముగలవారికి జబ్బు జేయును; దీనికి విరుగుడు పులుపు.

ఊరపంది మాంసము:—Country hog-flesh of. చమురు గలిగి రుచిగా నుండును; విరేచనము గావించును; బలము జేయును; పైత్యమూ మూలవ్యాధిని అణచును. గురుత్వము, అగ్నిమాంద్యము, కఫము జేయును. అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు 1 కలి, 2 తుమ్మచెక్క రసము లేక కషాయము, 3 యవక్షారము, 4 చల్ల, 5 తరువాణి. దీని చమురు (క్రొవ్వు) ఆగాకరదుంప చూర్ణముతో నిచ్చిన మూలవ్యాధి నివారణమగును. మోతాదు పూటకు చమురు అరతులమెత్తు మొదలు తులమెత్తువరకు. దుంపచూర్ణము 2 చిన్నముల యెత్తు మొదలు 4 చిన్నముల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటలను 8 - 10 దినము లియ్యవలెను. దీని క్రొవ్వుతో పలాస్త్రి జేసి వేసిన వ్రణములు మానును.

ఊరుబిండి:—Pickle made of oil cake. తెలగపిండి చూడుడు.

ఊసరవెల్లి, తొండ :— Chameleon & Blood sucker flesh of. వీని మాంసము కఫవాతములను హరించును. పైనవేసి కట్టిన దుష్ట వ్రణములను, భగంధరమును బోగొట్టును. వీని మెదడు నూరి లింగముపైని వేసి కట్టిన దాని నరములలో పుట్టిన దోషమును హరించును. ముదిరిన తొండను నూనెలోవేసి కాచి ఆనూనె లింగమునకు లేపనముచేసిన లింగదోషము హరించును.

—ఎ—

# ఋ

ఋద్ధి:—రుద్ధి చూడుడు.

ఋషభకము:—రుషభకము చూడుడు.

—ఎ—

# ఎ

ఎండ:—Sun-shine. అనగా యెండ విస్తారముగ తగులుట వలన దాహమును బుట్టించును; పైత్యమును ప్రకోపింప జేయును; మూర్ఛ, శ్రమ, చెమట వీనిని గలుగజేయును; దేహకాంతిని, బలమును బోగొట్టును.

ఎండినపోక:—Unboiled dried betel nut. అనగా వండనిది వగరుగా, స్వాదుగా నుండును; కంఠరోగమునుగొట్టును; రుచి బుట్టించును; జీర్ణము జేయును; విరేచనము గావించును; పైత్యమును, ఉబ్బును, పాండురోగమును బుట్టించును.

ఎండుగడ్డి మేసిన ఆవుపాలు:—Milk of a cow feed on hay. ఆవుపాలు చూడుడు.

ఎండుచేపలు:—Dried fish. ఉప్పువేసిన, వేయక యెండినచేపలు, శాకజేయును; వాతమును గొట్టును; మేదస్సు, మేహము, మూత్రకృఛ్రము, అతిమూత్రము నణచును; అగ్నిదీప్తినిచ్చును; వీర్యమునకు హానిజేయును; స్థూలదేహమును శుష్కింపజేయును; ఒంటినీరు దీయును; విరేచనము గావించును; రుచిబుట్టించును; శ్వాసకాసల నణచును.

ఎండుమాంసము:—మాంసము యెండించినది చూడుడు.

ఎండ్రకాయలు:—పీతలు చూడుడు.

ఎద్దునాలుకచెట్టు:—అనగా గాజబాన్, గాజబాన్ చూడుడు.

ఎద్దుమాంసము:-Beef. అనగాగొడ్డుమాంసము. చమురుగలిగిరుచిగా నుండును. గురుత్వము జేయును. దేహపుష్టి, బలమును జేయును. వాత పైత్యముల నణచును. ఆవు, దూడ వీనిమాంసముల కివేగుణములు.

ఎరడాపుధాన్యము:—Black paddy. ఇవి నల్లగ నుండు ఒకజాతి ధాన్యము. దీని యన్నము ఎర్రగా రుచిగానుండును. త్రిదోషహార మైనది; పథ్యమైనది; పాండు, మేహరోగములను, జ్వరమును పోగొట్టును; బలమునిచ్చును; వీర్యమునకు చలవజేయును; గురుత్వ ముగనుండును; మదమును బుట్టించును; మలమూత్రబద్ధము జేయును. దీనికి విరుగుళ్ళు అన్నము చూడుడు. మరియు ధాన్యములు చూడుడు.

ఎర్ర అనుములు:—అనుములు చూడుడు.

ఎర్రకలువ,కింజల్కములు, కర్ణిక, నాళములు:—తెల్లకలువచూడుడు.

ఎర్రకలువదుంప:— Nymphoea Rubra - tuber of - Eng. Red water lily-tuber of. సం॥ రక్తోత్పల, కోకనద, దీనిరసము, లేక చూర్ణము, లేక కషాయము, స్వాదుగా వెగటుగా నుండును. గురు త్వము జేయును. పైత్యశ్లేష్మ జ్వరములను గొట్టును. గర్భము నిలు పును; మిక్కిలి మేహశాంతి జేయును. పైత్యము, విసర్పి, చర్ది, విదాహము, రక్తగ్రహణి, అతిసారము, రక్తకుసుమ, కుసుమరోగములు, ఋతురక్తస్రావము, విషము వీనిని జయించును, వాతము జేయును. రసముయొక్క మోతాదు పూటకు 3 - 4 తుల ముల యెత్తు. చూర్ణపుమోతాదు పూటకు 3 మొదలు 10 చిన్న ములయెత్తువరకు. కషాయపు మోతాదు 3 మొదలు 5 తుల ముల యెత్తువరకు.

ఎఱ్ఱకలువపువ్వు:— Flowers of do. సం* రక్తోత్పల, రాజీవ. దీని పువ్వులు మనోహారముగా నుండును. వీనిరసము లేక కషాయము పైత్యవికారము హరించును. కండ్లకు చలవ జేయును. దాహము, తాపము, కాస వీనిని శమింపచేయును. మిక్కిలి చలవచేయును. తెల్లకలువకున్నూ యివే గుణములు. ఎఱ్ఱకలువ శ్రేష్ఠము. తెల్ల కలువ తెల్లకుసుమలకు పనిచేయును, పై మోతాదులె.

ఎఱ్ఱగన్నేరు:— తెల్లగన్నేరు చూడుడు.

ఎఱ్ఱగజ్జేరు:— తెల్లగజ్జేరు చూడుడు.

ఎఱ్ఱగుమ్మడికాయ:— Red pumpkin, a gourd. దీనిని సూర్య గుమ్మడికాయ అనియు నందురు. శీతపైత్యము, వాతము జేయును, అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు 1 బెల్లము, 2 పులుసు. దీనిని చక్ర ములుగకోసి అరికాళ్ళకు, అరిచేతులకు కట్టిన జ్వరములో కాళ్ళు చేతులు మంటలు నిమ్మళించును; దీనిగుంజు (pulp)పిసికి లేక దంచి కట్టిన గెడ్డలు, రాచపుండు పక్వమై పగిలి మానును.

ఎఱ్ఱగోంగూర:— గోంగూర చూడుడు.

ఎఱ్ఱచిరతలిచెట్టు:— A medicinal plant. దీనిచెక్క వెగటుగా, కార ముగా నుండును, వాతమును, శూలలను హరించును. రసపు మోతాదు 1–2 తులములయెత్తు.

ఎఱ్ఱచిత్రమూలము:— చిత్రమూలము చూడుడు.

ఎఱ్ఱజొన్నలు:— Cholum Red. జొన్నలు చూడుడు.

ఎఱ్ఱతుమ్మికూర:— తుమ్మికూర చూడుడు.

ఎఱ్ఱతెగడ:— తెల్లతెగడ చూడుడు.

ఎఱ్ఱతోటకూరచెట్టు:— Amaranthus Tristis. Red variety. ఇది యెఱ్ఱని ఆకుగలది. దీనికూర స్వాదుగా రుచిగా నుండును; వాతము, చలవ జేయును; అపథ్యమైనది.

ఎర్రనివస్త్రము:—Wearing Red, or Crimson coloured cloth దీనిని ధరించుటవలన కాంతిను, శైత్యమును వృద్ధి చేయును; వాతము, శ్లేష్మల నణచును; వీర్యమునకు వేడిని, పుష్టినియిచ్చును. దేహకాంతి నిలుపును. వర్ష, శీతకాలములయందు అనుకూలముగ నుండును. దేహసౌఖ్యము నిచ్చును.

ఎర్ర నేలములక్కాయ:—నేలములక చూడుడు.

ఎర్రపల్లేరు:—చిన్నపల్లేరు చూడుడు.

ఎర్ర పెండలము:—పెండలము చూడుడు.

ఎర్రబచ్చలి:—బచ్చలి చూడుడు.

ఎర్రబనాతుపచ్చడము:—Red woollen blanket. దీని ధారణ కాంతినిచ్చును, కఫవాతముల నణచును; జఠరాగ్ని వృద్ధిబొందించును; చలిని బోగొట్టును.

ఎర్రరాజనాలను ధాన్యము:—A sort of paddy. వీని యన్నము చమురుగలిగి రుచిగానుండును. మిక్కిలి వీర్యవృద్ధి, చలవజేయును; తేలికగనుండును; త్రిదోషహరమైనది; పాండువు, మేహము, తాపము, విదాహము, మేదోరోగము, విషము వీని నణచును; మూత్రము గావించును, బుద్ధికి బలమిచ్చును. అన్ని ధాన్యములలో శ్రేష్ఠమైనవి. పథ్యమైనవి. మరియు ధాన్యములు చూడుడు.

ఎర్రలొద్దుగ:—లొద్దుగ చూడుడు.

ఎర్రసుగుడు:—సుగుడు చూడుడు.

ఎర్రావడచెట్టు:—A medicinal plant. దీని వేరు, ఆకురసము, కషాయము, లేక చూర్ణము జ్వరము, శ్వాస, కాస, ఊపిరిగొట్టునొప్పి, అరుచి, ఉబ్బు పాండువు, విషము, శోష, సర్పవిషము, ఎలుకవిషము, వమనము వీనిని హరించును. రసముమోతాదు 2-8

తులములయెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 5 తులముల యెత్తు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 చిన్నములయెత్తువరకు.

ఎఱ్ఱావుపాలు:—Milk of brown cow. ఆవుపాలు చూడుడు.

ఎలుకచెవి కూర:—Salvinia Cucullata. సం॥ ద్రవంతీ, మూషికాపర్ణి, హిం॥ మూసాకానీ. దీని సమూలములయొక్క రసము, లేక సమూలమును నూరిన ముద్ద చేదుగ, వగరుగ నుండును, చలవజేయును; పైత్యము, పాండువు, క్రిమి, భగంధరము, రసదోషము, శ్వాస, కఫము, ఎలుకవిషము, బహుమూత్రము, ఉదరము, వాతము, వీనిని హరించును, కడుపుబ్బు, శూల, జ్వరము సుఖవ్యాధి, ప్రమేహము, సెగరోగము వీనిని బోగొట్టును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. నూరినముద్ద మోతాదు ½ మొదలు 1 తు॥ యెత్తువరకు. దీని ఆకుకూర పై వ్యాధులకు పథ్యముగ నుండును.

ఎలుకమాంసము:—Rat-flesh of. మలవిసర్జన, వీర్యపుష్టి, బలము జేయును; గుదరోగమును కఫపైత్యములను హరించును; పథ్యమయినది.

ఎలుగుబంటి మాంసము:—Bear-flesh of. వీర్యపుష్టి జేయును, రుచిబుట్టించును; దేహపుష్టి, బలమునిచ్చును, నేత్రరోగము, ఉబ్బు, మలమూత్రబద్ధము, గ్రహణి వీనిని బోగొట్టును. దీని శిశ్నమును యెండించి కొన్ని వీర్యస్తంభన వీర్యవృద్ధికి నుపయోగపడు లేహ్యములు మొదలగువానిలో కలిపి వాడుదురు. గొప్ప వీర్యస్తంభన వీర్యవృద్ధులనుచేయు గొప్ప వస్తువు.

---

# ఏ

ఏకభుక్తము:— Taking meals once a day. అనగా రోజునకు ఒక్కేసారి భోజనముచేయుట, ఈపద్ధతి శరీరకష్టపడువారికి వుపయోగపడదు. గాని జ్ఞానాభివృద్ధి, భగవత్ భక్తి, వైరాగ్యదృష్టిలో నుండువారికి మిక్కిలి అనుకూలించును. మంచి ఆరోగ్యము, బుద్ధిబలములు గలుగచేయును. ఆయురారోగ్యములను వృద్ధిపరచును.

ఏగిశచెట్టు:—వేగిసచెట్టు చూడుడు.

ఏటినీళ్ళు, యీకాలువనీళ్ళు :— Water of a river-let or canal. చలవజేయును; అగ్నిదీప్తిని, జీర్ణశక్తిని యిచ్చును. మేహము, కుష్ఠు, దాహము, తాపము, జ్వరము, శ్వాస, దురద, నేత్రరోగములు వీని నణచును.

ఏటిచేపలు:—River fish. క్రొవ్వి, రుచిగా యుండును; వాతము, శ్లేష్మము, రక్తపైత్యము నణచును. మిక్కిలి వీర్యవృద్ధి, బలము, కాంతి నిచ్చును; కండ్లకు మంచిది. పథ్యమైనది.

ఏట్రింతమాంసము:— King crow-flesh of. చమురు గలిగియుండును; వాతము జేయును; కఫమును హెచ్చించును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 ఆవాలచూర్ణము, 3 పులుసు.

ఏడాకులపొన్న:— Aistonia scholaris-Echites. S. Eng. Deta bark. సం॥ సప్తపర్ణ, సప్తచ్ఛద, విశాలత్వక్. హిం॥ దత్యూని, సతవన్. ఇది పెద్ద వృక్షము. బూరుగాకులనుపోలి ఏడేసి ఆకులు కలసియుండును. చెట్టును గీసినను ఆకు తుంపినను విస్తారము పాలు గారును; దీనిపువ్వులు. తెల్లగా చిన్నవిగా గుత్తులుగుత్తులుగా కొద్ది సువాసన గలిగియుండును. దీనిపాలు విరేచనము జేయును. దీనిచెక్క, ఆకురసము, కషాయము లేక చూర్ణము వగరుగ చేదుగా నుండును;

ఉష్ణవీర్యముగలవి. విరేచనము జేయును. శరీరమందుగల మలములను కరగించి వెడలించును. అగ్నిదీప్తినిచ్చును. కాస, శ్వాస, శ్లేష్మము, గుల్మము, క్రిములు, వ్రణములు, కుష్టు, రక్తదోషమును, త్రిదోషములను హరించును. వాతమేహవాత నొప్పులు అండవృద్ధి, శూల, వాతరక్తము, జ్వరము, చలిజ్వరము, జీర్ణజ్వరము, గ్రహణి, అతిసారము, చెముడు వీనిని హరించును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. చూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు పావలాయెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. దీనివేరు, ప్రత్తిగింజలనూనెలో కాచిపోసిన చెముడు హరించును.

ఏదుపంది:—Porcupine-flesh of. దీనిమాంసము కాక జేయును; జ్వరము, ఆమరోగమును, శ్వాస కాసలను హరించును. దీని పొట్టలో పొట్టు మిక్కిలి వేడిజేయును; వాతమును, సూతికా వాతమును, అజీర్ణమును జయించును.

ఏనుగుకాలాకుచెట్టు :—A medicinal plant. దీని సమూలము యొక్క కషాయము. మూత్రబద్ధము, మూత్రకృచ్ఛ్రము వీనిని నివారించును. మోతాదు 4-5 తులములయెత్తు. దీని ఆకు నూరి వేసిన గాయములు మానును.

ఏనుగుచల్ల:—Butter-milk of an Elephant. పుల్లగా, స్వాదుగా నుండును; కఫవాతములను, రక్తపైత్యమును జయించును.

ఏనుగుచెవి చేమచెట్టు:—Arum Macrorhizon. సం॥ హస్తికర్ణి. దీనిని బలురక్కసి చెట్టందురు. అరవములో వెర్రుంగు అనిపేరు. దీని ఆకులు ఏనుగుచెవులవలె పెద్దవిగ దళసరిగ చేమాకులవలె నుండును. యిది తెలుపు, నలుపు రెండుజాతులు. దీని దుంపను నూనెలో వేసి కాచి ఆనూనెను తలకు రుద్దినవరుసజ్వరములు నివృత్తిం

చును. దీని దుంపలు పొడవుగ నుండును. బీదలు కఱవులలో వీనిని తిందురు. దీని ఆకును ఆముదముపూసి వెచ్చ జేసి ప్రసవస్త్రీల పొత్తికడుపున కట్టిన మైలరక్తము వెడలును. ఆకట్టు రెండుగంటల కంటె అధికకాల ముంచకూడదు. దీని దుంపను మెత్తగానూరి వుడికించి గెడ్డలకు కట్టిన హరించును. లేక పగులగొట్టును.

ఏనుగుతుమ్మి:—తుమ్మికూర చూడుడు.

ఏనుగు నెక్కుడము:—Elephant riding. వేడిజేయును. బలము, పుష్టి, దేహదార్ఢ్యము, ఆయువు, జఠరదీప్తి వీనినిచ్చును; మేదో రోగమును, కఫమును అణచును; దేహమునకు నొప్పులు జేయును.

ఏనుగునెయ్యి:—Elephant ghee. చేదుగ, వగరుగ, లఘువుగ నుండును, దేహమునకు పుష్టినియిచ్చును. వాతపైత్యముల నణచును, శ్లేష్మము జేయును; విషమును గొట్టును. కుష్ఠు, క్రిమిని హరించును. మలమూత్రబద్ధము జేయును.

ఏనుగుచర్మము:—Elephant skin. దీనిపొగ వేయుచుండిన మూల వ్యాధి బాధ శమింపజేయును. దీనిని కాల్చి మసిజేసి నువ్వుల నూనెలో గలిపి లేపనముచేసిన శ్వేత, కుష్ఠు నివారణమగును.

ఏనుగుదంతము:—Elephant bone. దీని పొట్టును మసిచేసి దానితో సమానము రసాజనము కలిపినూరి నీళ్ళలోకలిపి రాయుచుండిన ఇంద్రలుప్తము పోవును. వెంట్రుకలు వచ్చును.

ఏనుగుపల్లేరు:—పెద్దపల్లేరు చూడుడు.

ఏనుగుపాలు:— Elephant milk. వెగటుగా, ఉప్పగా, గురుత్వ ముగా నుండును; వీర్యపుష్టిని ఇచ్చును. మేహవాతమును, కఫ మును అణచును; కండ్లకు చలవజేయును; కాళ్ళకు చేతులకు వ్యాపించెడు వాతమును హరించును.

ఏనుగుపెరుగు:—Elephant curd. వగరుగనుండును; పుష్టినిచ్చును; వాతపిత్తలను హరించును; శ్లేష్మము పెంచును; గురుత్వముగ నుండును.

ఏనుగు పిసలు:—లంకలు చూడుడు.

ఏనుగుబీర:—A medicinal plant. దీని వేరురసము, ఆకులరసము జిగటగానుండును; కడుపుబ్బరము, వాతము వీనిని హరించును; వీర్య వృద్ధి జేయును; వ్రణములనార్చును. మోతాదు 2-3 తులములయెత్తు.

ఏనుగుమాంసము:—Elephant flesh of. వీర్యమునకు వేడిని, దేహ మునకు స్థిరత్వమును యిచ్చును; గురుత్వము జేయును. దీనికి విరు గుళ్ళు 1 సిరకా, 2 అవాలచూర్ణము, 3 సూక్తము; దీనిని ఆవ మూనెలో వేసి కాచి అనూనె మర్దన జేసిన యేనుగుకాలిరోగము మానును.

ఏనుగుమూత్రము:—Urine of Elephant. చేదుగ, ఉప్పగానుం డును. విరేచనము జేయును. బలమును ఇచ్చును. కుష్ఠు, ఉబ్బు, వాతపు పట్లు వీనిని హరించును. ఏనుగుమూత్రక్షారము మండల కుష్ఠు హరించును.

ఏనుగులద్దె:—Elephant dung. దీనిని పాదములయందు నలపు కొనిన ముండ్లును, ఆనికాయలును హరించును. అరికాళ్ళకు కట్టిన కాళ్ళ తిమ్మెరలు మంటలు హరించును.

ఏనుగువెన్న:—Elephant butter. చేదుగ, వగరుగ, గురుత్వముగ నుండును. వీర్యవృద్ధిని, బలమును ఇచ్చును. శీతపైత్యమును, వాత మును గొట్టును. శ్లేష్మము జేయును.

ఏసిచెట్టు:—Shorea Robusta-Eng. the Sal-tree. సం॥ సాల, సర్జ, అశ్వకర్ణిక. హిం॥ సాల్, సాలవ. ఇది పెద్దవృక్షము. దీని చెక్క ఆకురసము లేక కషాయము వగరుగనుండును;ఆమపైత్యము,

మేహము, ప్రదరమనెడు యోనిరోగము, కుష్ఠు, దురద, క్రిమి, శ్లేష్మము, వాతము, రక్తపైత్యము వీనిని జయించును. రసపు మోతాదు 3 - 8 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులములయెత్తువరకు యీ చెక్క కషాయముకాచి, వడియవోసి మరల దగ్గరగా చిక్కపడువరకు కాచిన కవిరిలాగున యగును. దీనిని కవిరికి బదులుగా వాడుదురు. కవిరియొక్క గుణము దీనియందు గలదు. వగరుగానుండును. యీ చెట్లకు నాట్లువేసిన జిగురువచ్చును. దానిని సర్జరసమందురు. సర్జరసము చూడుడు.

వేపిజిగురు అనగా సర్జరసము:—సర్జరసము చూడుడు.

వేపిపండ్లు:—Fruits of do. తియ్యగానుండును; శీతవీర్యము గలది. దప్పి, తాపము, పైత్యము, రక్తదోషము, శూల, క్షతక్షయము వీనిని హరించును; మలబద్ధము జేయును.

వేపిలుపండు:—అమృత ఫలము చూడుడు.

వేరుపిపిని చెట్టు:—A medicinal tree. యిది సముద్రపు ప్రాంతముల యందు దొరకును. దీని ఆకు నూరిపోసిన పశువుల వాతరోగములు నయమగును.

ఏలకుల అరకు:—Tincture of Cardamoms. చలవ, మేహశాంతి, పైత్యశాంతి జేయును; మనోల్లాసము నిచ్చును; మేహపైత్యము, మేహశూల, అజీర్ణము, అరుచి, వమనము, రక్తపైత్యము వీనిని హరించును. జీర్ణముజేయును. ఆకలి బుట్టించును. మోతాదు 30 మొదలు 60 చుక్కలవరకు.

ఏలకులు పెద్దవి, చిన్నవి:— Alpina Cardmomum & Elettraria C. Eng. Cardamoms large & small. సం॥ ఏలా, హిమా, గాంధారీగర్భ. హిం॥ యిలాయిచి. కొద్ది తీపి, కారము, చిరిచేదు, సువాసన గలిగియుండును; మేహశాంతి జేయును; అరుచి,

చర్ది, పైత్యమువలన బుట్టెడు ఎక్కిళ్ళు, మేహము, పైత్యము, వ్రణము, పొత్తికడుపున బుట్టెడు రోగములు, దాహము, ముఖ రోగము, శిరోరోగము, శూల, రక్తాతిసారము, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహము, ప్రదరమనెడు యోనిరోగము (కుసుమ) జ్వరము, శోష, కఫము, దురద, శ్వాసకాసలు, మూలవ్యాధి, నేత్రరోగము వీనిని హరించును; బలము, వీర్యవృద్ధి జేయును; మూత్రము గావించును; మనసునకుల్లాసము గలుగజేయును; వికారము నణచును; కడుపులోని వాతమును హరించును; పొట్టకు బలము జేయును; ఆహారమును జీర్ణింప జేయును; త్రేనుపు దెచ్చును; రొమ్మును, గొంతుకను, పొట్టను శుభ్రపరచును; హృదయమునకు బలమిచ్చును; కడుపునొప్పి నణచును; విరేచనబద్ధము జేయును; ప్రేగులకు నష్టము జేయును; వీర్యమునకు చలవజేసి పుంస్త్వమును తగ్గించును. దీనికి విరుగుళ్ళు 1 పంచదార లేక పటికపంచదార, 2 బాదము జిగురు. పెద్దఏలకులకంటె చిన్నవానియందు గుణమధికము. మోతాదు 8 మొదలు 30 గోధుమ గింజలయెత్తువరకు.

—:o:—

## ఒ

ఒంటెచల్ల:—Camel butter-milk. ఉబ్బు, ఉదరరోగము, మూల వ్యాధి, క్రిమిరోగము వీని నణచును. అగ్నిదీప్తినిచ్చును.

ఒంటెనెక్కుటవగుణము:—Camel riding. శ్లేష్మము నణచును, కాంతి నిచ్చును. మూలవ్యాధి మొదలగు రోగములను పైత్యమును ప్రకోపింపజేయును. సమస్త అవయవములకు వేదనగలిగించును. అసౌఖ్యమైనది.

ఒంటెనెయ్యి:—Camel ghee. అగ్నిదీప్తినిచ్చును; వాతము, ఉబ్బు, విషము, క్రిమి, కుష్టు, గుల్మము, ఉదరము వీనిని పోగొట్టును.

ఒంటెపాలు:—Camel milk. కొద్దిగ కారముగా, ఉప్పుగా, తేలికగా నుండును; కాక జేయును, జఠరదీప్తినిచ్చును; వాతము, కఫము, క్రిమి ఉబ్బు, మలమూత్రబద్ధము, ఉదరము, మూలవ్యాధి, వీని నణచును.

ఒంటెపెరుగు:—Camel curd. జఠరదీప్తినిచ్చును; కఫమును, వాతమును గొట్టును; కాక జేయును; పైత్యమును పెంచును. దీనికి వివ గుళ్ళ పెరుగు చూడుడు.

ఒంటెమాంసము:—Camel flesh. కాక జేయును; కఫమును, వాతమును, అతిమూత్రరోగమును. పోగొట్టును.

ఒంటెమూత్రము:—Camel urine. కారముగ నుండును; వేడిజేయును; దద్రు, మండలకుష్టు వీనిని పోగొట్టును.

ఒంటెలద్దె:—Camel dung. దీనిని పిండిన రసము, శ్వాసను, శాఖావాతమనగా కాళ్ళుచేతులకు వ్యాపించెడు వాతమును పోగొట్టును.

ఒంటెవెన్న:—Camel butter. ఉబ్బు, వాతము, కఫము, క్రిమిరోగము, దురద, మలమూత్రబద్ధము, కాస, ఊపిరిగొట్టునొప్పి, మూలవ్యాధి వీనినణచును.

ఒద్దిచెట్టు:—Gymnema sylvestre asclepias gemenata. సం॥ మేషశృంగి; చతురణహాల మేషవిషాణికా. హిం॥ మేండాశింగి. మేడాశింగి యిది పెద్దవృక్షము. దీనిచెక్కరసము లేక కషాయము స్వాదుగానుండును, శీతజ్వరము, విషము, ఉబ్బురోగము, వమనము, విదాహము, మధుమేహము వీనినణచును. దీనిపచ్చిచెక్క రసము కండ్లకు పట్టువేసిన కండ్లకలకలు నయమగును. దీనిచూర్ణమును నూనెలోగాని వేపనూనెలోగాని గలిపి పూసిన మానని వ్రణములు మానును. రసపుమోతాదు 2-3 తులములయెత్తు. కషాయపు

మోతాదు 3-4 తులములయెత్తు. దీని జిగురు కొబ్బరిపాలతో నూరి పట్టువేసిన యిసుకనొప్పులు, కవుకుదెబ్బలు నయమగును. దీనికాయలు చేదుగానుండును. జఠరాగ్నిని వృద్ధిబొందించును. మేహము, కుష్ఠు, క్రిమిరోగము కఫము, మేదోరోగము వీనిని పోగొట్టును. విరేచనము గావించును. దీనిపండు చేదుగానుండును.

—ఒ—

## ఓ

ఓకచెట్టు:—వాకచెట్టు, వాకపండు, వాకకాయ చూడుడు.

ఓమము:—Ptychotis Ajowan, Carum Copticum. Eng. Omum seeds, Bishop's seeds of. సం॥ దీప్యక, యవానీ, హిం॥ అజవాన్. దీనిని వామము, వాము అనియు నందురు. ఇది వేడిజేసి అర్చును; కారముగ నుండును; జఠరదీప్తిని హెచ్చించును; జీర్ణముగావించును; తేలికనిచ్చును; క్రిమిరోగము, కఫము, వాతము, కుష్ఠు, గుల్మము, ఉబ్బు, వ్రణములు, ధాతుగతరోగములు, బిడ్డల అజీర్ణము, అష్టశూలలు, గ్రహణి, ఆమరోగము, అతిసారము వీనిని జయించును; విరేచనము గావించును, మూత్రమును జారీచేయును; శాంతినిచ్చును; బలము, వీర్యపుష్టి నిచ్చును; దీనిపొగ బుచ్చుకొనిన పడిసెపుభారము నణచును; శ్లేష్మము, కఫము పడిపోవును. దీని రసము కొద్దిగ వెచ్చజేసి చెవిలో బోసిన చెముడు, కర్ణశూల నివారించును; నేత్రరోగములకు మేలుజేయును. దీని రసము బుచ్చుకొనిన గుండెశూల హరించును; రొమ్మును శుభ్రపరచును; దుష్ట ద్రవకూటమును విప్పును; విషమును హరించును; కడుపు బిగబట్టడమును, కడుపులోని వికారమును, అగ్నిసేనుపులను, వామ్మగాని,

వాము లవంగాలుగాని, వామువిరియాలుగాని గరిటెలో బాగా మాడ్చి, అందులో 8 తులముల నీళ్ళుపోసి వడియపోసి యిచ్చిన అజీర్ణమును, అజీర్ణ విరేచనములను, బిడ్డలకును కడుపుబ్బును మల దోషమును పోగొట్టును. ఆకలిపుట్టించును. కడుపులోని జలుబును హరించును. అపస్మారము( Hysteria ),విస్త్రాణ,శోష,(faintness) మురిడీజాడ్యము (Cholera) వీనిని పోగొట్టును, బిడ్డల అజీర్ణము కట్టును; మూత్రపుసంచిలో పుట్టెడు రాతిని కరగించును; పుంస్త్వమును హెచ్చించును; ఉలవకాయలు ( Kidneys ), మూత్రపు సంచి (bladder ), కార్జము ( liver ), పొట్ట ( stomach ) వీనికి వేడి పుట్టించును; స్త్రీల ఋతురక్తమును జారీచేయును; స్త్రీలకు పాలు పుట్టించును; ఉదయమున పుచ్చుకొనిన వాత ఉబ్బును హరించును. తేనెతోగాని, సారాయితోగాని దీనిరసమును పుచ్చుకొనిన వాతముచేత బుట్టిన మూత్రబద్ధమును విప్పును. సికింజబీనుతో పుచ్చుకొనిన వాతతత్వము గలవారికిని, పొట్టలోరోగము గలవారికిని మేలుచేయును. పరగడుపున బుచ్చుకొనిన గుర్దాల (kidneys) లోను, మూత్రపుసంచిలోను పుట్టెడిరాతిని వెలికితీయును. ఏడు మార్లు నిమ్మపండ్లపులుసుతో భావనచేసి, అనగా ఒక్కొక్కమారు వామము మునిగేటట్టు నిమ్మపండ్లరసముపోయుచు ఆరబెట్టుచూ (పింగాణీ గిన్నెలో) ఈలాగున భావనచేసిన ఓమమును, పరగడుపున బుచ్చుకొనిన పోయిన పుంస్త్వము తిరిగి వచ్చును. దీనిని అనుదినము పుచ్చుకొనిన రక్తము విస్తరించును. ఓమము, మిరియాలు, ఉప్పు సమపాళ్ళుగ గలిపి పరగడుపున తినిన అజీర్ణము, కడుపునొప్పి మానును; జీర్ణశక్తి వృద్ధియగును. దీని దుర్గుణములు వాతతత్వముగలవారు విస్తారముగ దినిన తలనొప్పి బుట్టించును; కండ్లకాంతిని తగ్గించును; పైత్యమును జేయును; ఇందుకు విరుగుళ్ళు

1 మనిషి పాలు, 8 గో త్రిమిరి, మోతాదు పావలయెత్తు మొదలు తులమెత్తువరకు. సారాయివలె బట్టిలో కాచి తీసిన ఓమపు నీళ్ళను పై వ్యాధులకు వాడదగియుండును. మోతాదు 1 మొదలు 8 ఔన్సులవరకు. అవసరము కొలది అప్పుడప్పు డియ్యనగును. మోతాదు తగ్గించి చిన్నబిడ్డలకును ఇయ్యవచ్చును. చిన్నబిడ్డలకు తులమెత్తు లేక తులమున్నరయెత్తు నీళ్ళు ఇయ్యవచ్చును.

ఓమపుమాని:—Oil of do. కారముగ నుండును; కాక జేయును; వీర్యమునకు వేడిపుట్టించును; జీర్ణము జేయును; జఠరదీప్తినిచ్చును; శూల,కడుపునొప్పి, నీళ్ళవిరేచనములు, అజీర్ణము,అగ్నిమాంద్యము, ఉదరరోగము, కడుపుబ్బు,అమితభోజనమువల్ల గలిగిన ఆయాసము, కడుపునొప్పి వీనిని పోగొట్టును. పైనపూసిన చిగురువాపు, నొప్పి హరించును లోపలికిచ్చు మోతాదు 1 మొదలు 8 చుక్కలవరకు నీళ్ళమీద, లేక పంచదారమీద లేక తమలపాకుమీద వేసి యియ్యనగును.

ఓమపు ఆకుకూర:—Curry of the leaves of do. కాక, పైత్యము జేయును. వాతశ్లేష్మములను హరించును; జఠరదీప్తినిచ్చును; దీనికి ఓమముయొక్క సుగుణములు గలిగియుండును.

ఓమపుపువ్వు:—Eng. Thymal. ఇది పచ్చకర్పూరపు బిళ్లలువలె నుండును. దీనిని వామ్మపువ్వు అందురు. తమలపాకులోపెట్టి నమిలి మ్రింగిన పడిశభారము, వంటినొప్పులు, అజీర్ణము, కడుపుబ్బుట, అగ్నిమాంద్యము, కడుపునొప్పి, అజీర్ణవిరేచనములు మొదలగు రోగములను హరించుటయేగాక వామ్మ గుణములున్నూ గలిగి యుండును. మోతాదు 1 మొదలు 4 గింజలయెత్తువరకు.

—క—

# క

కంకుష్ఠము:—Cleome Felena, Polonisia F. సం॥ కంకుష్ఠ. హిం॥ చోక్. కంకుష్టము మూడువిధములు 1 జంతూద్భవము, 2 ఖనిజము 3 మూలిక. ఏనుగకు పిల్లపుట్టినవెంటనే వేసిన రేణమునకును, గుర్రమునకు పిల్లపుట్టినవెంటనే వేసినరేణమునకును కంకుష్ఠమందురు, 2 మురదారశింగు ఖనిజ కంకుష్టము, 3 బలురక్కిసచెట్టు లేక రక్కిసచెట్టు మూలికా కంకుష్టము. యీక్రింద వ్రాసినది జంతూద్భవ కంకుష్టమునకు గుణము, ఖనిజము, మూలికా కంకుష్టములయొక్క గుణములుచూకుడు. జంతూద్భవ కంకుష్టము చేదుగ, కారముగ, వగరుగ నుండును; విరేచనము గావించును, కాక జేయును; శరీరమునకు కాంతినిచ్చును; నులిపురుగులు, వాపు, ఉదరరోగము, కడుపుబ్బరము, గుల్మము, ప్లీహారోగము, మూలవ్యాధి, శూల, అనాహము, కఫము వీనిని బోగొట్టును. వీర్యవృద్ధి జేయును; శూలను హరించును.

కంచిమేకపాలు:—Milk of a kind a goat. దేహపుష్టిని, వీర్యవృద్ధిని యిచ్చును; పైత్యము నణచును; క్షయాదిరోగములకు పథ్యముగనుండును. చంటిబిడ్డలకు ఆహారముగ నివ్వదగును.

కంచిమేక మాంసము:—Flesh of do. రుచిగానుండును; పైత్యమును శమింపజేయును; బలము, వీర్యవృద్ధి, దేహపుష్టి నిచ్చును. మిక్కిలి పథ్యకరమైనది.

కంచుపాత్రలో భోజనము:—Taking food in a bell metal vessel. కొద్ది వేడినిచ్చును; తేలికగ నుండును; కఫపైత్యములను గొట్టును; దేహపుష్టి, దేహదార్ఢ్యమును, ఆయుర్వృద్ధిని యిచ్చును.

కంచు దీనిభస్మము:—Bell metal and its calx. సం॥ కాంశ్య: హిం॥ కాంసీ. క్రమముగ శుద్ధిజేసి భస్మముచేసినది చేదుగ, వగరుగ

నుండును; వాత పైత్యశ్లేష్మరోగములను బోగొట్టును వేడినిచ్చును. కండ్లకు చలువ జేయును. అల్లు శుద్ధి మొదలగునవి క్రమముగ గాకుండె నేని పైత్యము, శ్లేష్మము, చర్ది, దాహాధిక్యము, కఫము,దగ్గు వీనిని బుట్టించును. దీనికి విరుగుడు చింతపండును ఉదకమునవైచి పిసికి యిచ్చిన దోషము హరించును. మోతాదు 1 మొదలు 4 గుంజల ఎత్తువరకు.

కంద:—**Amorphophallus Campanulatum & Arum Campanulatus.** సం॥ సూరణ, అర్శోఘ్న. ఓల్ల. హిం॥ జిమాకంద్. దీని కూర రుచిబుట్టించును; జఠరదీప్తి నిచ్చును, ఇది నీటికందయని పాటి కందయని రెండు రకములు. కొత్తవి దురదగలిగియుండును. వీనిని ముందుగ నీళ్ళతో నుడకబెట్టి పారవంచి వండవలెను. వాతము, కఫము, మేదోరోగము, మూలవ్యాధి, క్రిమి, శ్లేష్మవాతము, క్షయ వీనిని అణచును; బలము, దేహపుష్టి, వీర్యపుష్టి, దేహపుకాక వీని నిచ్చును; విరేచనము జేయును; కడుపులోబల్ల, గుల్మము,కడుపుబ్బు, క్రిమిరోగము వీనిని హరించును; గురుత్వముగ నుండును, కాక జేయును; మేహరోగమును బలపరచును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పులుపు, 3 బెల్లము. దీనిని కుమ్ములో వుడికించి పై చర్మముతీసి వేసి దానిలో పంచదార ఆవునెయ్యి కలిపిగాని దీనిచూర్ణములో పంచదారకలిపి పుచ్చుకొనిన పైన చెప్పినగుణములు గలిగియుండును. వుడికించిన దుంప సుమారు 1 తు॥ చొప్పునను చూర్ణము 4 అ. మొ॥ 8 అ. ఎత్తువరకు.

కందకాడలపులుసు:—**Curry of stalks of do.** రుచిగా నుండును; మూలవ్యాధిని, కఫరోగమును బోగొట్టును; జఠరాగ్నిని వృద్ధిజేయును; శూల, గుల్మము, గుదరోగము, వీనిని బోగొట్టును. పాకనియమమును గూర్చి కసివిందపులుసు చూడుడు.

కందికట్టు:—Boilings of Dhall gram. రుచిగా నుండును; వేడి చేయును; రక్తమును శుభ్రపరచును; పాండువు, మేహము, కఫము, వాతమును హరించును; వీర్యపుష్టినిచ్చును; పథ్యమైనది కొద్ది గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు కందిపప్పు చూడుడు.

కందిపప్పుచారు:—Dhall gram soup. ఉడికినపప్పులో పులుసువేసి కాచినది తేలికగ రుచిగనుండును; పురాణ చలవ, మేహశాంతి జేయును; గురుత్వము శ్లేష్మమును జేయును; దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పిప్పళ్ళు, 3 ఓమము.

కందిపప్పు:—Split dhall gram. కొద్ది వగరుగలిగి రుచిగానుండును; దేహపుష్టి బలము జేయును; పొట్టకు బలమిచ్చును; అన్నము జీర్ణము జేయును; రక్తమును శుభ్రపరచును; దేహతత్వమును సౌమ్యపరచును; పైత్యము కాక, స్వల్పగురుత్వము జేయును; కందులు పాతవి వేయించి పప్పుచేసినది వండుకొని అన్నముతో భుజించిన సమస్త రోగములయందు పథ్యముగ నుండును. యెట్టి ఔషధసేవయందును పథ్యమైనది. నిత్యమును భోజనములో నుపయోగింపదగినది. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పులుసు, 3 ఓమము, 4 శొంఠి, 5 కారకాయ పిందెలు, 6 ఉప్పు, 7 ఈ మూటి చూర్ణము.

కందిపప్పు పులగము:—Rice boiled with split Dhall gram. కాక, పైత్యము జేయును; వాతము నణచును; నీరసమును, విదాహమును గలుగజేయును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 మజ్జిగ, 3 పచ్చిపులుసు.

కందులు:—Cajanus Indicus. Eng. Pigeon pea or red gram. సం॥ ఆఢకీ, తువరీ. హిం॥ అర్ హర్ డాల్, రహర్. పెద్దవి, చిన్నవి రెండురకములు. యీ చిన్నకందులను చిరికందులందురు. తెల్లకందులని, నల్లకందులనిజాతులుగలవు. వగరుగా రుచిగానుండును.

కందులు మంగలమున వేయించి వానితో కాపడముబెట్టిన వాత శూలలు, వాతపునొప్పులు, వాతపుపట్లు, శీతలము వీనిని హరించును. దీని పప్పుగుణములు పైన వ్రాయబడియున్నవి.

కంపిల్లము:—A Red earth of Sowrashtra Desa. సం* కంపిల్లక రేచనక. ఇదిసౌరాష్ట్రదేశమందు గనులలో బుట్టుచున్న. ఇటుకపొడివలె నెర్రనై అచ్చటచ్చట తళుకులు గలిగియుండును.దీనిని నిమ్మపండ్లరసముతో భావనజేసిన శుద్ధియగును. వాంతి, ఎక్కిళ్ళు, పైత్యరోగములు, కడుపుబ్బరము, కడుపునొప్పి, శూల, మలబద్ధము, గుల్మము, ఉదరరోగము, ఆమదోషము, కఫరోగము, వాతము, వ్రణములు, క్రిమిరోగము, మూలవ్యాధి వీనిని నివారణ జేయును. విరేచనము గావించును. మోతాదు 1 మొదలు 3 అణాలయెత్తు వరకు సేవింపవచ్చును. దీనిని వుసిరిక పళ్ళరసముతోగాని కాయల రసముతోగాని మెత్తగానూరి కణికలుచేసి నీళ్ళతో అరగదీసి కండ్లలో పెట్టుకొనుచుండిన నేత్రరోగములు హరించును.

కంపిల్లకము:—Mallotus Philippiennsis, Rottlera Tinctoria. Eng. Kamela dye. సం* రక్తచూర్ణక. హిం*కమీలా. ఇది యొకచెట్టుకాయనూగు. దీనిని వసంతగుండ యందురు. ఈ చెట్టు ఆకు నూరి రాత్రి నాభికి వేసికట్టి వుదయమున పెరుగు బెల్లముకలిపి త్రాగిన గర్భమందుండె క్రిములు విరేచనముద్వారా పడిపోవును. ఈ కంపిల్లకముతో పట్టుబట్టలకు రంగువేయుదురు. దీనిని లోపలికిచ్చిన క్రిమిరోగము, పైత్యములు నయమగును. మోతాదు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు.

కంబలి:—Blanket or Cumbly. దీనిని గప్పుకొనిన వీర్యమునకు వేడిజేయును; శీతవాత బాధల నివారించును,వాతరోగము నణచును;

జఠరదీప్తినిచ్చును; పైత్యము జేయును; చలి కాలమందును, శ్లేష్మ రోగులకును, పురటాంధ్రసను అనుకూలముగ నుండును.

కక్కరపిట్ట మాంసము:—Numidian crane—flesh of. రుచిగా నుండును; కొద్దిగ కాక జేయును; వాతపైత్యమును హరించును; బలము నిచ్చును: బుద్ధిబలము, జఠరదీప్తి వీని నిచ్చును.

కక్కుపాల:—Zizyphus Trinervius. దీనిని కక్కుపాల యందురు. యిది ఒక పాలుగలతీగ దీనియాకు లేక సమూలకషాయము పొక్కు, సవాయి, సెగరోగము ఇవి ఒంటజీర్ణించిన వారియొక్క రక్తమును, వ్రణములు గలవారియొక్క రక్తమును శుభ్రపరచి వారి శరీరతత్వ మును మార్చి పైనజెప్పిన వ్యాధులను హరించును; యీకషాయ ములో మహిసాక్షీ గుగ్గిలమును 1-2 అణాలయెత్తు గలిపి సేవించిన పై రోగములకు శీఘ్రముగా పనిజేయును. యీవేళ్ళను మెత్తగా నూరి పాలలో గలిపి యిచ్చిన వాంతులై పెట్టుమందు పడిపోవును. కషాయపు మోతాదు పూటకు 2-3 ఔన్సుల చొప్పున దినమునకు రెండు పూటల నియ్యనగును.

కచోరము, పెద్దకచోరము:— Curcuma Zedorea. C Zerumbet. Eng. The round zedoary. సం॥ శటీ, కచ్చూర, హిం॥ కచూర్, దీనిని కచ్చూరమనియు, చంద్రమూలిక యనియు నందురు. ఇవి తెల్లని దుంపలు; సువాసనగలవి; మృదువుపరచును; చేదుగా, వెగటుగా, సుగంధముగా నుండును; కాకజేయును; శ్లేష్మమును వెడలించును, మేహశాంతి, పైత్యశాంతిజేయును, సన్నిపాతజ్వరములు, కఫవాతములు, వ్రణములు,దగ్గు, ఉబ్బు, పాండురోగము, పార్శ్వపు నొప్పి, తలనొప్పి వీనిని పోగొట్టును; పొట్టకు బలము జేయును; పొట్టలోని వాతమును వెడలించును, బలము, వీర్యవృద్ధిజేయును; దేహములోని మలముల వెడలించును; ఉలవకాయల (Kidneys)

రోగమును పోగొట్టును; జ్వరమును, జలుబును హరించును;గొంతుక నసను స్వరభంగమును పోగొట్టును.వీనిచూర్ణము తేనెతో బుచ్చు కొనిన దగ్గు హరించును. మోతాదు 2 మొ॥ 4 అణాలయెత్తు. కచ్చూరములు, అతిమధురము, మిరియాలు కషాయముకాచి తగు మాత్రము పటికిపంచదార (sugar candy) కలిపి పుచ్చుకొనిన దగ్గులు, శ్వాసగల దగ్గులు హరించును. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తువరకు. దీని ముక్క పాట కలుగ నోటిలో నుంచుకొని ద్రవము మ్రింగుచుండిన కంఠధ్వనిని బాగుపరచును. దగ్గుగలవా రటుల జేసిన దగ్గు శమించును.వీని గంధ ములో పటికి కలిపిపూసిన స్వల్పగాయములు (bruises), బొక్కులు మానును. పటికితోనూరి పట్టువేసిన రక్తము శమిలి నల్లబడినది మానును. తలకు వ్రాసికొను నూనెలలో చితకకొట్టి వేసియుంచిన సువాసనగ నుండుటయే గాక శిరస్సునకు మేలుచేయును.

కచ్చుడికాయ:— ఈడపండు చూడుడు—

కటుకరోహిణి,నల్లనిది:—**Picrorrhiza Kurroa. Helleborus Niger Eng. Hellebore-black.** స॥ కటుకా, కటుకరోహిణి. హిం॥ కాలాకటకీ, కుటకీ, ఇది యొక చెట్టువేరు. చేదుగ, వెగటుగ, నాలుక తిమ్మిరెత్తజేయును, శిశువులజ్వరము, శీతజ్వరము, గుల్మము, ఎలుక తేలు వీనివిషములు, వాతము, కాస, శ్వాస, ఉదరరోగము వీనిని హరించును, గాఢవిరేచనము జేయును, పక్షవాతము,పిచ్చి మొదలగు మెదడుసంబంధమైన(brein ) రోగముల నివృత్తించును; ఋతురక్త మును జారీచేయును, దీనిని చూర్ణముచేసిగాని, కషాయము కాచి గాని, సారము తీసిగాని, అరఖు చేసిగాని వాడుకచేయవచ్చును. చూర్ణపు మోతాదు 3 మొదలు 6 గోధుమగింజల యెత్తువరకు. కషాయపు మోతాదు 2-3 తులముల యెత్తువరకు. సారము

(extract) 3 మొదలు 6 గోధుమగింజల యెత్తువరకు. అరకు (Tincture) 30 మొదలు 60 చుక్కలవరకు. మరియు దీనిని నీళ్ళతో గాని, సారాయితోగాని అరగదీసి గుండెలమీఁద పట్టువేసిన గుండెలు నొక్కుట, పీకడము వీనిని అణచును దీనివలన కలిగిన వికారమునకు విరుగుళ్ళు 1 కతేరా (బాదము జిగురు), 2 బాదమునూనె. విరేచన ములగుటకు చూర్ణము లేక సారముయొక్క మోతాదు అనగా 3 అణాలయెత్తు. దీని గాఢకషాయము దినమునకు 2-3 మార్లు ఇచ్చిన జాడించి విరేచనములయి ఉబ్బు, ఉదరరోగములు నివృత్తించును. పైన చెప్పిన రీతిని 3-4 దినములుగాని కొన్ని తత్వములకు వారము వరకుగాని విడువక అనుదిన మియ్యవలెను.

కటుకరోహిణి, తెల్లనిది:—Picrorrhiza Kurroa. Eng. Hellebore white. సం॥ కటుకా, కటుకరోహిణి. హిం॥ సఫేద్ కటకీ.ఇదియును ఆకృతియందు రుచులయందు, నల్లకటుకరోహిణివలె నుండునుగాని తెల్లగా నుండును. నల్లరోహిణికంటె నిది యెక్కువ దారుణ విరేచినకారి. వమనముచేయును; తుమ్ములు తెచ్చును; దీనిని సాధారణముగ వాడరు. తెలిసిన వైద్యులు దీనిని జాగ్రత్తగా నడిపించిన యెడల ఉదరరోగము, పిచ్చి (Insanty), మూర్ఛ, తలత్రిప్పు, విచారము, చర్మరోగములు, కుష్టు వీనిని పోగొట్టును. వీని అరకు (Tincture) మోతాదు 10 మొదలు 20 చుక్కలవరకు. దీని వికారమునకు విరుగుళ్లు 1 బాదము జిగురు, 2 బాదమునూనె. దీనిని పైన పట్టువేసిన పొక్కును అనగా చర్మము ఎర్రబడును.

కట్టచేప:—A sort of fish. యీచేపలు సముద్రమునందు దొరకును. చమురు కలిగి రుచిగానుండును. సులభముగ జీర్ణమగును. వేడిజేయును; వాతమును హరించును. బాలింతలకుగూడ పెట్టుదురు. పథ్యమైనది.

గ్లాత్రీగ:— Andropogon Aciculatus. Chrysopogon Aciculeris సం॥ దధిపుష్ప, కట్వ. నీలపుష్పి. యిదితీగెగా ప్రాకును. కీనిగింజలే కటుకగింజలందురు. దీని తీగెయు కణుపున్న గుండ్రము గానుండును. తెల్లనినూగు గలిగియుండును. వీని ఆకులు ప్రత్తిఆకు లవలెనె 8 చిల్లలుగలిగియుండును. దీని పువ్వు తెలుపు నలుపు రంగుగల పుష్కొత్తపువ్వులను బోలియుండును. దీనికాయలు పొట్ల తూటికూర కాయలను బోలియుండును. అందు నల్లని గింజలుండును. దీనికాయలకూర వెగటుగా, రుచిగానుండును; చలవజేయును; కఫ వాతము, గుల్మము మూలవ్యాధి వీని నణచును; విరేచనము గావిం చును. దీనిచెక్క, ఆకురసము వెగటు, చేదు, కారము గలిగి యుండును. వాతపిత్తశ్లేష్మములను శమింపజేయును; కష్టం, ఉబ్బు, ఉదరరోగము, విషదోషము వీనిని జయించును మోతాదు పూటకు 2 మొదలు 8 తులముల యెత్తువరకు.

కడిమిచెట్లు:— Nauclea Cadamba. Anthocephalus C. Eng. wild cinchona. సం॥. నీప, హాలిప్రియ, కదంబ. హిం॥ కదంబ్, అనగా కదంబవృక్షము దీనిలో కదంబము ధారాకదంబము భూమికదంబము, రాజకదంబము, ధూళికదంబమని అనేక జాతులు గలవు. దీనిలో రాజకదంబమనునది పెద్దవృక్షము. దీనిని కనికెచెట్టని యందురు. దీనిపువ్వులు బంతులు బంతులులాగున యుండును. దీని కాయలు యీతకాయలవలె నుండును. దీని నీడ చల్లగనుండును. దీనిచెక్కరసము లేక ఆకురసము శ్లేష్మము, పైత్యము, రక్త దోషము, జ్వరము, రక్తస్రావము వీనిని హరించును. మోతాదు పూటకు 2 మొదలు 8 తులముల యెత్తువరకు. దీనిపువ్వులు మిక్కిలి సువాసనగలిగి గుండ్రముగా నుండును. దీనిచెక్కరసము ఆమ్లముతప్ప తక్కిన అయిదురసములు, గురుగుణము శీతవీర్యము,

మధుర విపాకముగలది. శుక్లవృద్ధి, మలబద్ధము, కాంతి గలిగించును. స్తన్యము (చనుబాలు) వృద్ధిపరచును. యోనిదోషము, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, వాత, పిత్తకఫములు, వ్రణము, దాహము, విషదోషము వీనిని హరించును. దీనిపండు మధురముగా నుండును. శీతవీర్యము, గురుగుణము, మధురవిపాకముగలది. పైత్యమును రక్తదోషమును హరించును.

కడుగు:—బియ్యపుకడుగు చూడుడు.

కణపచెట్టు:— మొక్కపుచెట్టు చూడుడు.

కణపకసువు:—A sort of grass. దీనివేళ్ళరసము. లేక కషాయము మధురముగ ముగనుండును; వీర్యమునకు వేడి పుట్టించును, రక్తవాతము, కఫము, పైత్యము, విదాహము వీనిని హరించును.రసము యొక్క మోతాదు పూటకు 3–4 తులములయెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు.

కత్తిమందుచెట్టు:—Euphorbia Antiquorum. Eng. Triangular Spurge. సం* వజ్రకంటకా, వజ్రక్షీరి, సమంతదుగ్ధా. హిం* త్రిధార. బొమ్మజెముడని, అందురు. ఇది 2–3–4 పలకలతోగాని గుండ్రముగాగాని బొమ్మలవలె చెట్టులేచును. పలకలందునను లేక చుట్టును ముండ్లుండును. దీనిపాలు లేక రసము, చేదుగ కారముగ నుండును; దారుణమైన కాక జేయును; వాతము, ప్రమేహము, కుష్ఠు, ప్లీహ, గుల్మరోగము, ఉదరరోగము, ఆమము, శూల, కఫము, జ్వరము, పక్షవాతము, అపస్మారము, మేదోరోగము వీనిని హరించును; గాఢవిరేచనకారి. దీనిపాలు పైనపూయుట వలన అనగా పట్టు వేయుటవలన, వాతములు, ప్రాత నొప్పులు, రాచపుండ్లు, గడ్డలు, వ్రణములు గ్రంధులు, అండవాతము వీనిని హరించును. దీనిపాలతో చేసిన కత్తిమందు ఔషధము

లో వేసి కాచి, లోనికిచ్చిన వాతములు హరించును; విరేచనము చేయును దీని పచ్చిపాలలో నూనెబోసి కాచి వాతపునొప్పులకు, పక్షవాతమునకు పైన మర్దనచేసిన నయమగును. ఆ నూనెలో మరికొంత నూనెకలిపి, కొద్దిమోతాదుగా లోపలికిచ్చిన నల్లదబ్బ (spleen), కార్జము (liver) యివి గట్టిపడుట లేక పెద్దవియగుట వలన గలిగిన దారుణ మలబద్ధమును బోగొట్టును. దీనిపాలు యెండించి లోపలికిచ్చిన ఉదరరోగము నివారణమగును. మోతాదు 5 మొదలు 10 గోధుమగింజల యెత్తువరకు. ఎండించిన పాలచూర్ణమును, వరిపిండి, బలపపు రాతిపిండి మొదలగు మాదవస్తువులలో మేళనచేసి నస్యము చేయించిన, సన్నిపాతసంబంధ మాంద్యము, మమత, అంధత్వము, పక్షవాతము, రుద్రవాతము, అపస్మారము, మూర్ఛ మొదలగు దారుణరోగములు నివృత్తించును. దీని వేళ్ళ చూర్ణము వమనము జేయును. దీనిపాలు మొదలయినవి అతిజాగ్రతతో రోగిదార్ఢ్యము మొదలగునవి యోగి కొద్ది మోతాదులుగ నారంభించి క్రిమక్రిమముగ వృద్ధిచేయ తగియుండును. మోతాదెక్కువయిన అమితి దారుణ విరేచనములను, వమనములనుచేసి చంపును. దీనికి విరుగుళ్ళు 1 పెరుగు అన్నము, 2 చల్లనీళ్ళతో చేసిన ఖండశర్కర పానకము, 3 వస్త్రముయొక్కగాలి, 4 చల్లని నీడ, 5 పెసరపప్పు బియ్యమువేసి కాచినజావ.

కతీరా:— Astragalas virus. Eng. Gum Tragacanth. హిం॥ కతీరా. ఇది బాదముచెట్టు జిగురని వాడుకగాని, అన్యదేశములలో నుండెడు కొన్నిచెట్ల జిగురు. నిజమయిన కతీరా అనే జిగురు కొంచెము తెల్లగ పెళుచుగా వాసన లేక కొంచెము చేదుగ నుండును. నీళ్ళలో కొంతవరకు కరుగును, లోపలికిచ్చిన రక్తమును శుభ్రపరచును; వీర్యవృద్ధి జేయును; తత్వమును సౌమ్యపరచును; గాయములను

మాన్పును; కొన్ని దుష్టపదార్థములవలన గలిగిన వికారమును అణచును; నుస దగ్గులను పోగొట్టును. మోతాదు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు. గాయములకు దీని చూర్ణముపైన జల్లిన వానిని మాన్పును.

కదంబ వృక్షము:— కడిమిచెట్టు చూడుడు.

కనిమిసిరిచెట్టు:—A medicinal wild tree. దీని చెక్కచూర్ణము సర్వవ్రణములను, గాయములను, పుండ్లనుమాన్పును యీచూర్ణము పుండ్లమీద జల్లుచుండిన మానిపోవును. మాంసము తినివేసినను మరల పూడిపోవును. దీనికాయలు చెక్క మెత్తగా చితుకగొట్టి చెరువులలో గలిపిన చేపలకు తిక్కెత్తి పైకితేలును.

కనిష్టపంచమూలములు:— Compound of five drugs. అనగా ముయ్యాకుపొన్న, కోలపొన్న, ములక, వాకుడు, పల్లేరు వీని సముదాయ కషాయము సన్నిపాతజ్వరము, భ్రమ, దాహము, మలమూత్రబద్ధము, వాతము, క్రిములు వీనిని హరించును. మోతాదు పూటకు 2 మొదలు 3 తులములయెత్తువరకు.

కన్నెకోమలి:—A medicinal plant. దీనిని కన్యాకోమలియందురు. దీనిదుంప జిగటగ, చేదుగ, వగరుగనుండును; త్రిదోషహారమయినది. తాపము, దాహము, పైత్యము, వాతము, శుక్లదోషము వీనిని బోగొట్టును; వీర్యవృద్ధిజేయును. దీనిదుంప మేకపాలుబోసి తొక్కి రసముదీసి 4-6 తులములు ప్రతి వుదయపుపూట 9 దినములు యిచ్చిన యింద్రియనష్టము కట్టును; బలముజేయును; వీర్యము ఘట్టిపరచును లేక స్థంభనజేయును. దీని యాకుపసరులో నూనెకలిపి కాలినచోట పూసిన మంట శమించును; దీనిచూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 అణాల యెత్తువరకు.

కన్నె లేడిపిట్ట:—Bastard Florikin. సం॥ కారండవః. దీని మాంసము చమురుగలిగి రుచిగా నుండును; వేడిజేయును; వాతము నణచును; శేలిక, వీర్యపుష్టి. బలము వీనినిచ్చును; కామిలరోగమును బోగొట్టును.

కపింజలము:—(పిట్ట) వెలిశపిట్ట మాంసము చూడుడు.

కపిల అవుపాలు:— Milk of black cow. అవుపాలు చూడుడు.

కప్పచిప్పలు:—A sort of shells flesh. ఇవి ఒక విధమయిన నత్త గుల్లలు. వీని మాంసము వీర్యవృద్ధినిచ్చును. గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా 2 ఆవాలచూర్ణము.

కప్ప:—Frog మామూలుగాని కప్ప వుడకబెట్టితీసిన చమురు మేఢ్రమునకు పూయుటవలన లేపనమును, దృఢత్వమును, నరములకు సత్తువను గలుగజేయును. ఈకప్పలలో వీపుమీాద 8 చారలుగల కప్పను దాని పొట్టను తీసివేసి యెండించి చూర్ణముచేసి అందులో పిప్పలిచూర్ణము గలిపి తేనెతో యిచ్చుచుండిన క్షయరోగమునకు మిక్కిలి పనిచేయును. శ్వాసకాసలును హరించును. మోతాదు పూటకు 1 లేక 1½ అణాలయెత్తు వాడవలెను.

కప్పతీగ:— తీగముష్టిని చూడుడు.

కఫరిశుద్ధము:— Zenei Carbanas Eng. Carbonate of zinc. సం॥ ఖర్పర, రసక. హిం॥ ఖాపరియా.ఇది 2 విధములు. రసకమని, కారవేల్లకమని యందురు. రసకము గనిసంభవము. మాసినతెలుపు రంగుగలిగి బిళ్ళలవలె పలచని కొబ్బరి ముక్కలవలెవుండి, పగుల గొట్టిన లోపల మెరుగుగానుండును. దీనిలో సత్తుభాగము హెచ్చుగావుండుటవలననూ, పాదరసమును జీర్ణింప శక్తిగలిగి యుండుట వలననూ, రసకమని పేరువచ్చినది. ఇది అసలైన కఫరి. దీనినే కల్ కఫరియందురు. రెండవది కారవేల్లకము. ఇది సత్తుదొరుకు

గనులో మట్టితీసి నూరి సుమారు 4 అం. పొడవు, 2 అం. లావుగా చుట్టగాచుట్టి కాల్చెదరు. ఇది పెంకురంగుగ నుండును. దీనిలో సత్తు భాగము తక్కువగానుండును. గావున రసము (కఫరి) కంటె తక్కువ గుణము గలదిగ నుండును. పైన వివరించబడిన రెండువిధములయిన కఫరులనున్నూ పంచగవ్యము (అనగా ఆవు యొక్క పాలు, పెరుగు, నెయ్యి, మూత్రముఎడ) నిమ్మపండ్లరసము, నరమూత్రము (చంటిపిల్లవాని మూత్రము) వీనితో డోలాయంత్రమున వండిన శుద్ధియగును. వీనిని ఔషధములో కలిపిగాని, ప్రత్యేకముగాగాని వాడవచ్చును. ఈపైన వివరించిన రెండువిధములైన (కఫరాలు) తేగాక మఱియొక తిపటనగ గోడబెత్తికలవలె నుండునదిన్నీ కఫరియని బజారులో విక్రయింతురు. దీనిలో యేవిధమైన సత్తుగాని యేలోహముగాని లేనికారణమున అనుపయోగము, మరిన్నీ చేదు ఆనబకాయ రసముతో వుడికించినమా శుద్ధియగును. దీనిని పైన బూసిన వ్రణములు, నేత్రరోగములు, విషము, వీనిని హరించును. శుద్ధిచేయుబడినది పుచ్చుకొనిన జీర్ణజ్వరములు, జ్వరములు, వాతము, కఫము, కఫపైత్యము, మేహము, క్షయ, నేత్రరోగములు హరించును. అపరిశుద్ధ కఫరిసేవవలన చర్ది, వమనము, అరుచి మొదలగు కొన్నిదుర్గుణములను బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నిమ్మపండ్లరసము మూడు దినములు సేవించవలెను, 2 వంపేలాలు నీళ్ళలోవేసి బాగుగ పిసికి 2-3 దినములు ప్రొద్దుటను సాయంకాలమును పుచ్చుకొనవలెను.

కమలాఫలము:—Orange kamala సం* కమలా. హిం* కమలా ఫల్. ఆరోగ్యకరమైనది; చలవజేయును; మేహమును, పైత్యమును శాంతిజేయును; ముంతిగుండె (heart) కు బలమిచ్చును; ఆకలి వగొమను. దాహమును, వాంతిని కట్టును. దగ్గును బుట్టించును.

దీనికి విరుగుళ్ళు 1 దూలగొంగివిత్తుల చూర్ణము, 3 సజ్జాక్షారము నారింజపండు చూడుడు.

కమరక్ కాయలు:—బిళంబికాయలు చూడుడు.

కమ్మరేగుకాయ, పండు:—Atrocarpus Lakoocha. సం॥ లకుచ. హిం॥ దహూ. దోరకాయ కాసను హరించును; రుచి బుట్టించును; వీర్యమును వృద్ధిజేయును; వాతమును, శ్లేష్మమును హరించును; పుల్లతేనుపులను బుట్టించును. పండు పైత్యము, కఫము జేయును. దీనికి విరుగుళ్ళు రేగుపండు చూడుడు.

కరక్కాయ:—Terminalia Chebula. Eng. Chebulic Myrobalan. సం॥హారీతకీ, అభయ. హిం॥ హారీతకీ. వగరు, తీపి, చేదు రుచులుగలిగియుండును; చలవజేసిఆర్చును; త్రిదోషహారమైనది. జఠర దీప్తినిచ్చును. జీర్ణముచేయును. వయస్సును నిలుపును. ఆయుర్వృద్ధి నిచ్చును బుద్ధి, ఇంద్రియములకు బలము నిచ్చును; కుష్ఠు, విసర్పి, మూలశంక, పురాణ, విషమజ్వరములు, శిరోరోగములు, నేత్రరోగములు, పాండురోగము, హృద్రోగము, కామిల, గ్రహణి, శోష, ఉబ్బు, శూల, అతిసారములు, మేహములు, దగ్గు, వగర్పులు, కంఠమందు బుట్టెడు రోగములు, పీనస, క్రిమిరోగములు, మలమూత్రబద్ధము, ఉదరము, గుల్మము. ప్లీహ, ఊరుస్తంభవాతము. అరుచి, విషదోషములు, చర్ది, పైత్యశ్లేష్మవాతములు, మూర్ఛ, పిచ్చి, ద్వంద్వరోగములు వీనిని హరించును. పొట్టకు బలముజేయును, మూత్రమువెడలపడుసుద్దను కట్టును; పొట్టలోని వాతమును శిరస్సునకెక్కనియ్యదు; పలుచని శ్లేష్మమును హరించును. కరక్కాయ పిప్పళ్ళు చూర్ణముగాని కరక్కాయ శొంఠి చూర్ణముగాని తేనెతో సేవించుచుండిన స్వరభేదము నయమగును. కరక్కాయ, లోహభస్మము, శొంఠి వీని సమభాగచూర్ణము తేనె, నెయ్యి అను

పానములో సేవించుచుండిన వాతపిత్త శ్లేష్మ పరిణామ శూలలు హరించును. కరక్కాయ పెచ్చును నోటిలో వుంచుకుని వూట మింగుచుండిన కొండనాలుక, దగ్గు, కంఠం వరుపు. (ఎర్రబడుట) పొడిదగ్గు నయమగును. దీనిచూర్ణములో పండ్లులోమిన, పండ్లను ఘట్టిపరచును. కరక్కాయను బెల్లము, నూనెతో సేవించిన వాత ప్రకోపమును, నెయ్యి, శర్కరతో సేవించిన పిత్తప్రకోపమును, తేనె పిప్పళ్ళతో సేవించిన కఫప్రకోపమును అణచును. మరియు కరక్కాయను గ్రీష్మఋతువున బెల్లముతోడను, వర్షఋతువున సైంధవలవణముతోడను, శరదృతువున ; తెల్లశర్కరతోడను, హేమంతఋతువున శొంఠితోడను, శిశిరఋతువున పిప్పళ్ళతోడను, వసంతఋతువున తేనెతోడను చేర్చి పుచ్చుకొనిన సర్వరోగములను హరించును. కరక్కాయ, కవిరి సమభాగములను నీళ్ళతోనూరి, కండ్లకు పట్టువేసిన నేత్రరోగములు హరించును. శుద్ధిచేయక పట్టిరి దినిన వీర్యమును జెరపును. పుచ్చినది, కాలినది, నీటిలో, బురద లోనున్నది, విడిపోయినది, చవిటిభూమిని పుండినది, వర్జనీయములు. కరక్కాయ దోషములకు విరుగుళ్ళు 1 కరక్కాయను కొద్దిగా నిప్పులపైన కాల్చుడము, 2 బాదంపప్పు, 3 నెయ్యి మొదలగు చమురు పదార్థములు. మోతాదు 2 చిన్నములయెత్తు మొదలు 4 చిన్నముల యెత్తువరకు.

కరక్కాయ తైలము:— Oil prepared with do. కరక్కాయలతో చేసిన నూనె వగరుగ, నుండును; హరించును.

కరక్కాయ పిందెలు:— Young Myrobalans. వీనిని జంగీహర్ల అందురు. ఇవి నల్లగ, వగరుగనుండును. విరేచనము జేయును. విచారపుపిచ్చను పోగొట్టును. ఇవి నోటిలో నుంచుకొని ద్రవము మ్రింగుచుండిన పొడిదగ్గు గొంతుక నుస పోగొట్టును, శ్లేష్మమును

హరించును. మొదటియుండలి శీతలమును, గొంతుక వారుపు (Irritation) పోగొట్టును. మోతాదు 1 మొదలు 2 డ్రాముల మెత్తకషాయముగాచి కొద్దిగా తేనెగలిపి యియ్యవలెను. మోతాదు 2 మొదలు 4 తు॥ వరకు.

కరక్కాయ పుచ్చుకొనగూడనివారు:—Those who should not eat myrobalans. దాహము, గొంతుకఆరియుండడము, హను స్తంభము, గళగ్రహము, నవజ్వరము, కార్శ్యము (దేహముక్షీణించియుండుట), మార్గాయాసము, హీనరేతస్సు, లంఘనము, పైత్యరోగము, ఇవిగలవారును, గర్భిణీస్త్రీలును, రక్తస్రావము కలిగినవారును కరక్కాయను పుచ్చుకొనగూడదు.

కరక్కాయపువ్వు:— Flower of do. గ్రహణివిరేచనము రక్త విరేచనములు కట్టును; పొట్టకు బలముచేయును. మోతాదు కరక్కాయ పిందెలవలెనె.

కరజకాయ:—A sort of sweet cakes. చిమ్మిలిగాని, శర్కరగాని, బెల్లముగాని కలిపిన గసగసాలు, కొబ్బరి, జీడిపప్పుగాని, బాదముపప్పుగాని యాలక్కాయలు మొదలగునవిగాని, కలిపి పూర్ణముగనుంచి గోధుమపిండిలో మూతవేసి నేతిలోగాని, నూనెలోగాని వేసినవి భక్ష్యవిశేషము; రుచిగానుండును; బలము, వీర్యపుష్టి నిచ్చును.

కరమథితమనుచల్ల:—Hand made butter-milk చల్లమాదుడు.

కరివేపాకు చెట్టు:— Bergera Koenigh. Eng. curry leaf tree. సం॥ కైడార్యా, కృష్ణనింబ. హిం॥ వర్సంగ్. దీనియాకు, వేరుచెక్క, మాను చెక్క వీనిరసము లేక కషాయము చలవజేసి అర్చును; చేదుగ, వగరుగ, కారముగ, సువాసనగ నుండును; దేహమునకు, పొట్టకు బలముచేయును; రుచిబుట్టించును; జఠరదీప్తి,

దేహపుకాక, కాంతి వీనినిచ్చును. కఫము, గ్రహణి, గుల్మము, మూలవ్యాధి, రక్తగ్రహణి, దారుణమగు అతిసారము వీనిని జయించును; విషవాయువు దోషమును హరించును, వీర్యమునకు, వేడిజేయును. దీనివేరు విరేచనకారి. దీనివేరు, మ్రానుచెక్క దీపనకారులు (stimulants), వీనిగంధము పైనపూసిన పొక్కులు నయమగును. విషజంతు విషము హరించును. లేత ఆకులు పాలతో ఉడికించి నూరికట్టినను విషజంతు విషము హరించును; దీనినిపూసిన పొక్కులు మానును. ఆకును లేక మ్రానుచెక్క లేక వేరుచెక్కల యొక్క తేలికకషాయము మరిడీజాడ్యము (cholera) లోని వాంతిని, యితరవాంతిని కట్టును. ఆకులు పచ్చిదిగాని నేతిలో వేయించినవిగాని తినిన రక్తగ్రహణికట్టును; ఆకు కాక జేయును; పొట్టలోని వాతమును వెడలించును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపుమోతాదు 3 మొదలు 6 తులములయెత్తువరకు. దీనిపండ్లు నల్లగ, రుచిగ తేలికగనుండును. దాహము, రక్తపైత్యము నణచును.

కర్కాటకశృంగి:- Rhus Succedanea & Pistacia Integerrima. Eng. galls. సం॥ కర్కాటకశృంగి, కాసనాశనీ. హిం॥ కక్కర్‌శింగి. ఇవి చెట్టుకొమ్మలలో కొన్ని పురుగులవలన చిన్నకొమ్ములవలె లోపల బోలుగలిగి దళసరిలేకుండాయుండి తెలుపు ఆకుపచ్చగలిపిన మట్టిరంగుగలిగి, లోపలిరంగు కొంచెము ఎరుపుగలిగియుండును. వీనిచూర్ణము లేక కషాయము అగ్నిమాంద్యము, దగ్గు వగర్పు(కాసశ్వాస), క్షయ, ఉబ్బసము, జ్వరము, వాతము, పైత్యము, శ్లేష్మపైత్యము, ఎక్కిళ్ళు, వాంతి, అరుచి, అతిసారము, రక్తదోషము విషము వీనిని హరించును. శ్లేష్మమును (expectorent), వెడలించును. ఆమాశయము లేక పొట్టయందలి వరుపు

( Irritability of Stomach )ను మాన్పును. చూర్ణపు మోతాదు 1 మొదలు 8 చిన్నములయెత్తువరకు; కషాయపు మోతాదు 2½ - 4 తులములయెత్తు. చూర్ణము తేనెతో పుచ్చుకొనవలెను.

కర్పూరపుతైలము:—Camphor oil. ఇది ఆర్తికర్పూరమునుండి తీయబడినది. మనోహరముగ నుండును; జఠరదీప్తిని, కాంతినిచ్చును; విరేచనములు, అజీర్ణవిరేచనములు, కలరావిరేచనములు, గ్రహణిని కట్టును. చెవిలో పోసిన చెవిపోటు నయమగును. కురుపుమానును. చీము, రసిగారుట నయమగును. వాతములు, పైత్యము, మేహము, శ్లేష్మము, క్రిమిరోగము, మేదోరోగము, అరుచి, చర్ది, కుష్టు, ముఖదంతరోగములు వీనిని పోగొట్టును; పండ్లు గట్టిపడజేయును; ఇరుకునొప్పులు, వాత మేహవాతపునొప్పులు హరించును.

కర్పూర చక్ర కేళీ అరటిపండ్లు:—A sort of plantain. వీనిని ముఖరీ అందురు. యివి విస్తారముగ పండును. దానంతట అవి గెలమీద పండినవి మంచిరుచిగా సువాసనగ మనోహరముగ నుండును. మేహశాంతి, పైత్యశాంతి చేయును. ఆకలిదప్పికలను శాంతింపజేయును. అమితముగ తినిన అజీర్ణవిరేచనములగును. మరియు అరటిపండు సామాన్యగుణము చూడుడు.

కర్పూరపుబెండ:—తక్కోలములు చూడుడు.

కర్పూరము (హారతి) :— Camphora Officinarum. Eng. Camphor. సం* కర్పూర, శీతాంశు. హిం* కపూర్. దీనిని హారతి కర్పూరమందురు. చేదుగ, వెగటుగ, సువాసనగ నుండును, కాంతినిచ్చును; కండ్లకు చలవజేయును; చర్ది, విదాహము, మేదోరోగము, దురదలు, క్రిమిరోగము, అతిసారము, ముక్కుదిబ్బడ, గళరోగము, జిహ్వాబంధదోషము, దుర్గంధము కుళ్ళు, మూత్రకృచ్ఛ్రము, మాంద్యము, జ్వరము, తాపము, విషము, రక్తపైత్యము,

రక్తకాస, మూత్రపు మంటలు వీనిని హరించును దోషజ్వరము (Typhus fever)ను పోగొట్టును; నరములకు సత్తువజేయును; హృదయమునకు మేలుజేయును; ఆమవాతపునొప్పులు (gout), వాతి, మేహవాతపునొప్పులు, అపస్మారము (Hysteria), రసదోష వికారము వీనిని నివారణచేయును. రసము తినిన మనిషికి యిచ్చిన రసము బాగుగ పనిచేయును మోతాదు 3 మొదలు 10 గోధుమ గింజల యెత్తువరకు. 5 వడ్లగింజలయెత్తు ఆర్తికర్పూరమును 1 వడ్ల గింజ యెత్తు నల్లమందును ఒక మాత్రజేసి, పరుండబోవునపుడు ఇచ్చుచు నొప్పిగలచోట కర్పూరతైలము (Camphor liniment) మర్దనజేసిన పురాణవాత మేహవాతపు నొప్పులు హరించును; పైన చెప్పినమాత్ర యిచ్చినందున విస్తారము చెమటపట్టును; దానిని వృద్ధిచేయుటకు, శొంఠియొక్క వెచ్చని తేలికకషాయమిచ్చి, బట్టలు పైన కప్పవలెను. ఈరోగులకు నీళ్ళ ఆవిరికిమారుగ 1 తులము కర్పూరము పొడిచేసి, నిప్పులమీదగాని కాలిన యినుపరేకుమీద గాని, కాలిన గరిటెలోగాని వేసి ఆపొగ ఒంటికి పట్టవలెను; కాని యీపొగ రోగిముక్కు వెంటను,నోటివెంటనుపీల్చకూడదు. ఉబ్బసపు దగ్గుకు 3 గోధుమగింజలయెత్తు కర్పూరమును, ఇందుకు సమము ఇంగువయును కలిపి 1 మాత్రచేసి ప్రతి 2-3 గంటలకు ఇచ్చిన, దగ్గు వగర్పుయొక్క యుద్రేక మణచును; రొమ్ముపైన టర్పెన్టయిను పూయుచుండవలెను. ఈచికిత్సవలన కొన్ని యితర వగర్పులుకట్టును. పైన చెప్పిన మాత్రలుగుండె అదురు ( palpitation of the heart) కట్టును; బిడ్డల దగ్గులకు రాత్రివేళ కర్పూరతైలము వెచ్చజేసి రొమ్ముకుపూసిన శమించును. 1 ఔన్సు ఆర్తికర్పూరము 1 పయింటు ( piant ) సిరకాలో కలిపి అందులో ఒకవంతు లేక రెండువంతులు నీళ్ళుపోసి అందులో బట్టతడిపి, ఆబట్టను నొప్పిగల

చోట వేసియుంచిన వాత మేహవాతపునొప్పులు, నరములతో సంబంధించిన శిలనొప్పి నిమ్మళించును. ఇంద్రియనష్టమునకు దానంతట అది పడిపోయెకు అన్నివిధముల ఇంద్రియపతనమునకు ఇది ఘనమైన మందు. ఇచ్చువిధము 5 వడ్లగింజలయెత్తు కర్పూరమును, 1 వడ్ల గింజయెత్తు నల్లమందును 1 మాత్రచేసి పరుండబోవునపుడు ఇయ్యవలెను. ఈవిధముగ కొన్నిదినములియ్యవలెను పైచికిత్స సెగరోగమునకును ఉపచరించును; కాని దీనికి నల్లమందు 1 వడ్లగింజయెత్తు చేర్చవలెను; మరియు లింగమునకు అడుగు భాగమున గుదస్థానము వరకు కర్పూరతైలమును పూయవలెను; లింగమున కలిగెడు బాధ నివారణమగును స్త్రీలయోనినొప్పికి 5-6 వడ్లగింజలయెత్తు కర్పూరము ఒకమాత్రచేసి యీలాటిమాత్రలు దినమునకు 2-3 సార్లు ఇచ్చిన నొప్పి నివారణమగును. పైరోగులకు అనుదినము 2-3 సార్లు ఇచ్చిన నొప్పి నివారణమగును. పైరోగులకు అనుదినము విరేచనమయ్యెడు సాధనము చేయవలెను. స్త్రీలగర్భాశయము (uterus) నందు పుట్టెడు నొప్పికి 5-6 వడ్లగింజలయెత్తు కర్పూరమిచ్చిన నిమ్మళించును. కర్పూరతైలము నడుముకు మర్దనచేయవలెను. జ్వరము, స్ఫోటకము, వేపపువ్వు (measles) ఈరోగులు, నీరసముగను, బలక్షీణముగను, సొక్కిపోయియున్నప్పుడును, సంధిగుణము కనిపించినపుడును, 3 వడ్లగింజలయెత్తు కర్పూరమును, ఇందుకు సమముగ ఇంగువయును కలిపి మాత్రచేసి ప్రతి 3 గంటల కొకమారియ్యవలెను. టర్పెంటయిను తడిపిన గుడ్డలుగాని ఆవాలపట్టుగాని, అరిపాదముల మీదగాని ముంతగుండె (heart) మీదగాని వేయవలెను; తలనొప్పిగాని, నడినెత్తి నొప్పిగాని పుట్టినప్పుడు తీసివేయవలెను. దీని ప్రయోజనమునందు మిక్కిలి జాగరూకతయును, ఆలోచనయును అవశ్యకములు. పుప్పిపంటి నొప్పికిని, పన్ను నొప్పికిని, పంటి రంధ్రములో ఆర్ద్రికర్పూరము

పట్టిన నొప్పితీయును; మాంసపు కండలలో లేక కీళ్ళలో నుండు పురాణవాత మేహావాత నొప్పులకు ఆవాలనూనెలో అద్రికర్పూరమును నల్లమందును కలిపి మర్దన జేసిన నయమగును. మరిషి జాడ్యము (cholera) కు ప్రతి 4 గంటలకొకసారి 10 వడ్లగింజల యెత్తు కర్పూరము ఇచ్చుచుండిన నయమగును. 2-8 తులముల యెత్తు కర్పూరము నూనెలో కలిపి తినిన విషమెక్కి చంపును. దీనికి ముందుగ వాంతులకు ఆవెనుక విరేచనములకు సాధనముజేసి కాఫీ త్రాగించిన విషము హరించును. తక్కువ మోతాదులుగ పుచ్చుకొనినను మిక్కిలి కాక జేయును; పైత్యము, మలబద్ధము జేయును; ఆకలిని పోగొట్టును. దీనికి విరుగుళ్ళు 1 కస్తూరి, 2 సముద్రపు నురుగు.

కర్పూరసిలాజిత్తు:—Bitumen or foliated crystallized gypsum. ఇది ఒక జాతి రాయి. తెల్లగనుండునదియు, కొద్ది పసుపు తెలుపు మిశ్రవర్ణముగలదియు రెండుజాతులు గలవు. ఇంచుమించుగ నీ రెంటిగుణములు ఒకటిగ నుండును. వీని భస్మము మిక్కిలి మేహశాంతి, చలవజేయును; మూత్రముగావించును; ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, మూత్రమువెంట సుద్ధపడే రోగము, ఇంద్రియనష్టము, అత్యుష్ణము, వీనిని హరించును; క్షయ, పాండువు, వేడివలన వచ్చినదగ్గు, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, రక్తగ్రంథులు అనగా నెత్తుకు గడ్డలు వీనిని పోగొట్టును; దృష్టి, బలము, దేహపుష్టి, ఆయుర్వృద్ధి వీని నిచ్చును. మోతాదు పూటకు 1 మొదలు 8 చిన్నములయెత్తు చొప్పున దినమునకు రెండు మూడు పూటల నియ్యవలెను. ఈరాతిచూర్ణమును దురదగల పుండ్లకు వేసిన అవి మానును.

కర్బూజాపండు:-Cucumis Melo. Eng. Musk or sweet melon. సం॥ కర్బూజా, మధ్బుజా, మధుఫలా. హిం॥ ఖర్బూజా. ఇది ఒక జాతి దోసపండు; కొద్దిగ తెలుపు, పసుపు పచ్చరంగులు కలిగి గరుకుగనుండును; కొద్దిగ కోలగ గుండ్రముగ నుండును; ఈపండ్లు విస్తారముగా కర్నూలు జిల్లాలలో పండును. సువాసనగల తీపి రుచిగలిగియుండును; సమశీతోష్ణమైనది; మేహశాంతి, చలవ జేయును; దేహపుష్టి, బలము జేయును; రక్తమును శుభ్రపరచును; శీఘ్రముగ జీర్ణమగును; ఆహారమును జీర్ణింపజేయును; దేహమును, బుద్ధిని స్వస్థపరచును; దేహములోని దుష్టపదార్థకూటమిని ఓడ గొట్టును. వాతపిత్త శ్లేష్మములను సమపరచును; గురదాలను సత్తువజేయును; మేహపాండువును అణచును; మూత్రము సంచి లోని రాతిని హరించును; శీసివేయును; మూత్రమును జారీజేయును; స్త్రీలకు పాలుపడజేయును; దీనివిత్తులును మేహశాంతి, వీర్యవృద్ధి జేయును; మూత్రమును అధికపరచును; మూత్రపుసంచిలోని రాతిని హరించును; విత్తులచూర్ణమును గాని వీని కషాయముగాని యిచ్చిన దోషజ్వరము (Typus fever) ను పోగొట్టును; ఆజ్వరము తగిలిన వారి కడుపులో అయ్యేడు పుండును పుట్టకుండ జేయును. అనగా పుండుకాకుండ ఆపును; పురాణ, నవీనవిషపురసి కారెడు పొక్కులు (Eczema) గలవారు దినమునకు ఒక చిన్న పండు చొప్పున కొన్నిదినములు తినిన ఆవ్యాధి నివారణమగును. పండు దొరకనయెడల దీనివిత్తులచూర్ణము పుచ్చుకొననగును. ఈపండు పరగడుపునదినిన ఆకలిమందగించును; భోజనముజేసినవెంటనే దినిన అన్నమరుగకుండును; అన్నము జీర్ణమయ్యే మధ్యను దినిన మేలు జేయును. పైత్యతత్వము గలవారికి, అధికరక్తమున్నవారికి జబ్బు చేయును; అమితముగ దినిన విరేచనములగును; తెల్లదబ్బకు నష్టము

చేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 ఇరియాలపొడి, 3 పంచదార లేక పటికిపంచదార, 4 పుల్లదానిమ్మపండ్లు, 5 పాలు, 6 గులకండు.

కర్రనూనె:—Curjum balsam (wood oil). ఇది నీటికంటె తేలిక, గోధుమరంగుగ నుండును; సెగరోగమును, కుసుమరోగమును, కుష్టును, చర్మవ్యాధిని పోగొట్టును; మోతాదు పూటకు 2 మొదలు 4 అణాలయెత్తు చొప్పున సున్నపు నీళ్ళమీద వేసి పుచ్చుకొనునది.

కలకండ:—Sugar candy. ఫటికి పంచదార చూడుడు.

కలబంద:— Aloe Indica, A. vera Barbadensis. Eng. Indian aloes. సం* ఘృతకుమారీ, కన్యా. హిం* ఘీకుమారీ, ఘీకవార్. దీని మట్టల రసము జిగురుగలిగి వెగటుగనుండును; చలువ, మేహశాంతి, వీర్యపుష్టి జేయును; వ్రణమును, కుష్టును, పోగొట్టును. కలబంద మట్టలపైతొక్క కోసివేసి లోపలిపలుకులు నీళ్ళతో శుభ్రముగ గడిగి వానిని పటికిపంచదార పొడితో తినిన చలవజేయును; సెగరోగము శమించును; అలాగు కడిగిన పలుకులపైన, క్రింద, పొంగించిన పటికిపొడుము ఒత్తుగ జల్లి సన్నపాటి గుడ్డలో కట్టి దానితో కండ్లపైన అద్దుచుండిన కండ్ల యెరుపులు, నీరు, పుసి కారడము, నొప్పులు మానును. కలబందరసముతో పసుపుగుండ గలిపి యిచ్చిన ప్లీహరోగము (enlargement of spleen) నివారణమగును; కలబందరసములోపాలు నీళ్ళుగలిపి యిచ్చిన సెగరోగము, గర్భాశయములోనిపుండు (inflamation of the womb) నివారణమగును. ఇది మృదువుగ విరేచనముజేయును; మృదువుపరచును. లేతమట్టల గుంజు (పలుకులు) తినిన మేహవాతపు నొప్పులు హరించును. రెండంగుళముల చతురముగల పలుకను 4 గోధుమగింజల యెత్తు పసుపు గుండయును 10 గోధుమగింజలయెత్తు పొంగించిన

వెలిగారమును పుచ్చుకొనిన విరేచనబద్ధముతో కూడిన ప్లీహరోగము ( enlargement of spleen ) హరించును; కొన్ని దినములు ఉదయపుపూటలను పుచ్చుకొనవలెను. కలబందమట్ట పలుకులు నీళ్ళను శుభ్రముగ గడిగి పులుసుతో వండి తినిన మేహశాంతి,పైత్య శాంతి జేయును; కలబందమట్ట పసుపుతో నూరి కట్టిన కవుకుదెబ్బ నొప్పి హరించును. దీనిపువ్వులు క్రిమిరోగమును, శ్లేష్మమును గొట్టును; మేహశాంతి, చలవ జేయును.

కలింగరాష్ట్రము:—సం॥ కులంజ, గంధ, మూల. హిం॥ కులింజన్. అనగా నల్లకుంపరాష్ట్రము చూడుడు.

కలిగొట్టుచెట్టు:—Bignonia Stereoshermum. Suaveolens S. సం॥ పాటలా, తాలవృంతా. హిం॥ పాథల్, పాడర్. దీని పుష్ప ములు పెద్దవిగను ముదురుగులాబీరంగు ( Crimson colour )గలిగి మిక్కిలి సువాసనగ నుండును. దీని వేరు, చెక్కరసము, దీనివిత్తులు ఆకురసము చేదుగనుండును; దీనివేరు లేక మానుచక్కను దశ మూలములలో నొకటిగవాడుదురు. వేడిజేయును; రక్తవాతము, పైత్యము, ఎక్కిళ్ళు, వమనము, ఉబ్బు, కఫము, అరుచి, జ్వర ములు, సన్నిపాతజ్వరములు వీనిని బోగొట్టును; మూత్రము జారీ చేయును. దీని ఆకు రసములో నిమ్మపండ్లరసము పోసియిచ్చిన పిచ్చి కుదురును. రసముయొక్క మోతాదు పూటకు 3–4 తులముల యెత్తు. విత్తులచూర్ణపు మోతాదు 3 మొదలు 5 చిన్నములయెత్తు వరకు. ఈ చెట్టునీడ దాహము, తాపము, రక్తపైత్యము వీని నణచును; చలవజేయును, వీర్యపుష్టినిచ్చును. ఈ పుష్పముల రసమును తేనెలోగలిపి యిచ్చిన ఎక్కిళ్ళుకట్టును. దీనిచూర్ణము లేక కషాయము తియ్యగ వగరుగనుండును. చలవజేయును; నీటి దోషమును పోగొట్టును; దాహము, తాపము, రక్తపైత్యము

వీనిని శమింపజేయును; బుద్ధికి బలమును, వీర్యపుష్టిని, కాంతిని యిచ్చును; నిత్యము సేవించిన పైతోస్త్రదేకము నణచును, చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 చిన్నములయెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులములయెత్తువరకు.

కలినీళ్ళు:—Acid washings of raw rice. సం* కాంజిక, ఆరనాళ. కొంచెము పుల్లగా, స్వాదుగానుండును; ప్రాణపదమయినది, జఠరదీప్తి నిచ్చును; శ్రమ; బడలిక వీనిని హరించును; రుచి బుట్టించును; చలవజేయును; కండ్లకు మంచిది; విరేచనబద్ధము జేయును; దగ్గును బుట్టించును. దీనికి విరుగుళ్ళు, 1 చమురుగల పదార్థములు, 2 గుంకండు, 3 ఉప్పుగలిపిన మజ్జిగ.

కలుత్రానుగచెట్టు:—Ficus Heterophylla. సం* త్రాయమాణ, బలభద్రా. హిం* త్రాయమాన్. దీనిచెక్క— ఆకురసము లేక చూర్ణము, కఫపైత్యములను, జ్వరమును, ఉన్మాదమును జయించును, గుల్మము, శూల, భ్రమ, ఆయాసము దప్పి, రక్తపిత్తము, హృద్రోగము వీనిని జయించును. త్రిదోషహారమైనది. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. చూర్ణపు మోతాదు పూటకు 2-3 చిన్నములయెత్తు.

కలుగోటివిత్తులు—అడవి ఉలవలు చూడుడు.

కలువదుంప:—తెల్లకలువ, ఎర్రకలువదుంపలు చూడుడు.

కలువ పువ్వు:—Sweet Smelling water Sily. సం* ఉత్పల, ఇందీవర. సుగంధముగలది; చలవ, మేహశాంతిజేయును; తాపమును శమింపజేయును; రక్తపైత్యమును హరించును. దీని రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు. చూర్ణపు మోతాదు 3 మొదలు 6 చిన్నములయెత్తు. దీనితో సమముగ చీనాపంచదార గలిపి పుచ్చుకొనవగును.

కలువాకు పానుపు:—Bed of the leaves of do. మనోహరముగ నుండును; విరహవేదన నణచును; రక్తపైత్యమును బోగొట్టును.

కలువాకు విస్తరి భోజనము:—Taking food in the leaf of do. దీనిలో భోజనము అసౌఖ్యముగ నుండును, రోగమును దెచ్చును, నిషేధమైనది.

కల్లుపులుసు:—Vinegar. దీనిని సిరకా అని యందురు. దీనిని ముఖ్యముగ తాటి యీతకల్లులతో చేయుదురు దీనిని పైపూసిన రక్తము కూడుకొని పుండుగాకుండ, కళ్ళకుండ నాపును. దీనిని నూనెలో గలిపి తలయంటుకొనిన చలవజేయును; శిరస్సుపోటు నొప్పి నివృత్తించును, పుచ్చుకొనిన చలవజేయును; ఆలసటను, ఆయాసమును పోగొట్టును. చిట్టుడుకు నీళ్ళలోగాని వెచ్చని. జావలోగాని కలిపి యియ్యవగును. పైత్యము నణచును; బలముజేయును, కఫమును హరించును; అన్నమును జీర్ణముజేయును, వేడి నణచును; సెనగపులుసుకును ఇంచుమించుగా నివే గుణములు, ద్రాక్షపండ్ల సిరకా చూడుడు.

కల్లుసామాన్యగుణము:—Toddy generally. పుల్లగా, తియ్యగా చిరుచేదుగా నుండును; మత్తుజేయును; మలమూత్రములగావించును; చలవ, కాంతి, బలము, వీర్యవృద్ధి జఠరదీప్తి, దేహపుష్టి వీనినిచ్చును; శ్రోత్రనేత్రేంద్రియములకు బలముజేయును; గుల్మము, ఉదరము, మూలవ్యాధి, మేహపు ఉబ్బు, గ్రహణి, వాతము, మూత్రబద్ధము దీనిని శమింపజేయును; మేహశాంతినిచ్చును; నిద్రాక నణచును; విరేచనబద్ధము పోగొట్టును; సంతోషమిచ్చును; క్షయ, దేహము ఎండిపోవడము వీనిని పోగొట్టును. అన్ని కల్లులలో కొబ్బరికల్లు శ్రేష్ఠము. ఏకల్లయినను సూర్యోదయాత్పూర్వము తగుమాత్రము పుచ్చుకొనిన పైనజెప్పిన సుగుణములు గలిగి మేలుజేయును; పొద్దె

కిన తరువాత కల్లుపొంగును, మత్తుజేయును; విరేచనము జేయు, శ్లేష్మపైత్యములను హెచ్చించును. దీనికి విరుగుళ్ళు 1 కలి, 2నిమ్మ కాయలరసము. క్రొత్తగ కల్లు తీయనారంభించిన చెట్టుకల్లు శ్లేష్మ వాతముల ప్రకోపింపజేయును; కొబ్బరికల్లు, తాటికల్లు, ఈతకల్లు చూడుడు.

కవిరి :— Mimosa Catechu, Acacia Catechu, Eng. catechu extract dried of. సం॥ ఖాదిర, ఖైరసార. హిం॥ ఖైర్‌సార్. అనగా చంద్రచక్కను చిక్కని కషాయముగాచి ఎండించినది. దీనిని ఖదిరసారమని, కాచుయని యందురు. చలవజేసి అర్చును; బిగదీయును; వెగటుగా, వగరుగానుండును, కర్ణరోగములు, నేత్రరోగములు, కుష్ఠ, సమస్తమేహములు, వాతములు, శ్వేతకుష్టు, శూలలు, కాస, అగ్నిమాంద్యము, క్రిమిరోగము, ధాతురోగము వీనిని హరించును; శ్లేష్మోద్రేకము నణచును; విరేచనబద్ధము జేయును; ఆమవిరేచనములు, నీళ్ళవిరేచనములు, రక్తవిరేచనములు, సెగరోగము వీనిని పోగొట్టును; వయస్సును నిలుపును; దంత పటుత్వము, మిక్కిలి వీర్యపుష్టి జేయును; నాలుకపూతను, నోటిలోని గాయములను పోగొట్టును; దీనితో పట్టువేసిన కాకవలన పుట్టిన ఉబ్బును హరించును; దీనిచూర్ణము పండ్లకు రుద్దుటచేత, పండ్లవెంట పడు రక్తము కట్టును, దీని చూర్ణమును పైన వేసిన గడ్డలు, వ్రణములు మానును; అధికసేవ వలన నరములకు జబ్బుజేయును; గురదాలలోను (kidneys), మూత్రపుసంచిలోను (bladder) రాళ్ళు పుట్టను. దీనికి విరుగుళ్ళు 1 లవంగాలు, 2 తమలపాకులు, 3 అంజరు, 4 కలకండ కలిపిన ఆవుపాలు. కవిరి రాత్రి తాంబూలములో వేసుకొన గూడదు. కవిరి చూర్ణపు మోతాదు 10 మొదలు 40 గోధుమగింజల యెత్తువరకు.

కసివింద చెట్టు:—Cassia Occidentalis-Eng. Negro Coffee. సం॥ కాసారి, కాసమర్ద. హిం॥ కసౌందీ. దీనిని కసింద చెట్టని యందురు. ఆకురసము చేదుగనుండును; కాక జేయును; వాతములను, విషములను హరించును; నరుకులను, గాయములను, చర్మ రోగములను, నేత్రరోగములను మాన్పును; విరేచనము జేయును. దీని రసమును వెన్నతో గలిపి మర్దన చేయుటవలన పక్షవాతము నణచును; నరములకు బలము జేయును; దీని వేరు నూరి లోపలకిచ్చిన పొట్టలోని రోగమును, ఉబ్బురోగమును, వాతములను; సన్నిపాతములను, దోష గుణమును హరించును; మూత్రము గావించును; చర్మరోగములను హరించును. దీనిఆకలు, వేరు, తొక్క చిదుక కొట్టి యెండించిన చూర్ణములో తేనె గలిపి పూసిన తామర, గజ్జి, వ్రణములు మానును. దీని ఆకును కండ్లకుకట్టిన యెరుపులు మొదలగు నేత్రరోగములు మానును ఆకు నూరి కట్టిన గాయములు, వ్రణములు మానును. దీని విత్తులచూర్ణము తేనెతో నిచ్చిన అతిమూత్రము కట్టును. మోతాదు పూటకు 2 మొదలు 5 చిన్నముల యెత్తువరకు. ఆకు తిని పైనబూసిన చర్మరోగములు మానును. లేత కసివింద ఆకుకూర చేదుగా వెగటుగా నుండును. కాక, పైత్యము చేయును. వాతము, కఫము, జ్వరము, నులిపురుగులు, దగ్గు, ఒగర్పు, చర్మరోగములు వీనిని పోగొట్టును. జఠరదీప్తి నిచ్చును. దీని లేతకాయలకూర కాక జేయును. కాస, శ్వాసలను, వాతమును, జ్వరమును హరించును.

కసివింద పులప:—Soured curry of the tender leaves of do. అనగా కసివింద లేతఆకులు చల్లలో నూరబెట్టి ఉడికించి తీసిన ఆకులో ఆవువెన్న, పాలు, తేనెపోసి తిరుగవండి దానిని జీలకర్ర, ఇంగువ, మిరియాలు, మొదలగు సంబారద్రవ్యములతో పోగిచినది కసింద

పులపయని చెప్పబడును. ఇది కాసను, శ్లేష్మమును పోగొట్టును, పైత్యము జేయును; దేహపుకాకను వృద్ధిబొందించును; గుల్మము, కడుపులోబల్ల, భగందరము, ఉదరము, వాతము, మూలము, అరుచి, అతిసారము వీనిని బోగొట్టును.

కస్తూరి:—**Moschus Moschiferus. Eng. Musk.** సం* మృగనాభి, మృగమద. హిం* కస్తూరి, ముషక్. వెగటుగా, చేదుగా, కారముగనుండును; వేడిజేసి ఆర్చును;సువాసనగలది; త్రిదోషహరమైనది; వీర్యపుష్టి, దేహదార్ఢ్యము, కాంతి, మదము వీనిని గలుగజేయును; సర్వాంగములకు వేడి బుట్టించును; సౌఖ్యకరమయినది; కఫము, వాతము, శ్లేష్మరక్తము, వాతరక్తము, రాజయక్ష్మ, క్రిమిరోగము, విషము, కాస, చర్మరోగము, క్షీణేంద్రియము, సర్వాంగవాతము,సూతికావాతము,ఉబ్బు,దవడతీపు, శిరోరోగము వీనినిహరించును; పొట్టకు, ముంతగుండె (heart) కు, కార్జము (liver) కు, బుద్ధికి బలమిచ్చును; వణకు, పార్శ్వవాతము వీని నణచును; క్షీణించిన నాడిని పుష్టిజేయును; ఈడ్పువాతము, జ్వరములు,సన్నిపాతము వీనిని హరించును. అజీర్ణమును, అగ్నిమాంద్యమును పోగొట్టును; శుభ్రపరచును, దుష్టద్రవ కూటమిని విప్పును; సహజమైన దేహపుకాకను బలపరచును; దీనిని ఔషధములకు అనుపానముగా నిచ్చిన వానిని దేహమునకు త్వరగా యెక్కేటట్టుచేయును. నస్యముచేసిన జలుబు, తలనొప్పి, పార్శ్వపునొప్పి వీనిని హరించును. దీనిని పచ్చకర్పూరము, కుంకుమపువ్వుతో చేర్చి తలకుపూసిన తలనొప్పి హరించును. నీళ్ళలో గలిపి ముక్కులో బోసిన శిరస్సునయుండు జలుబును, వాతరోగములను హరించును. దీనిని పుచ్చుకొనిన భయము, విచారము నివృత్తించును. నల్లమందుతో గలిపి యిచ్చిన గ్రహణికట్టును; కీసువాతము (Gout), గాయపుసంధి (Tetanus), మూర్ఛ

మరిడీజాడ్యము (cholera). ఉక్కసదగ్గు (Hooping cough), వెర్రికుక్కజన్ని (Hydrophobia), కడుపులోపుండు అయ్యేడు జ్వరము (Typus fever) వీనిని హరించును. ఒంటినొప్పులున్నపుడును, భారముగ, మాంద్యముగ నున్నప్పుడును, సూర్యరశ్మి లేక మసురు పట్టిన దినమందును, కస్తూరి సేవవలన సౌఖ్యమిచ్చును. మిక్కిలి కాక జేయును, పైత్యము, రక్తపైత్యము, మలబద్ధము, నేత్రరోగములను గలుగ జేయును రక్తమును జెరుపును దేహము పచ్చబడ జేయును; దీనికి విరుగుళ్ళు 1 పచ్చకర్పూరము లేక హారతి కర్పూరము, 2 తవాక్షీరి, 3 మంచిగంధము, 4 బనఫ్‌షాపువ్వుల నూనె, 5 పన్నీరు, 6 శర్కరతో గలిపిన ఆవునెయ్యి, 7 ఉసిరికాయల రసము. మోతాదు 1 మొదలు 4 గురిగింజలయెత్తువరకు తమలపాకులోనుంచి మ్రింగింతురు.

కస్తూరి పసుపు:—A Curcuma a romatica. సం॥ అమ్రగంధ, కర్పూరహారిద్రా. హిం॥ కపూర్ హల్దీ, అంబియాహల్ది.సువాసనగల ఒకజాతిపసపు, సువాసనగ చేదుగనుండును.వీర్యపుష్టి, కాక జేయును. క్రిమిరోగము, విషమును, సర్పవిషమును, వాతమును హరించును. ఒంటికిపూసిన గజ్జిపొక్కులు, స్ఫోటకపు పొక్కులు నయమగును. కొద్దికొద్ది మోతాదుగా చంగల్వకోష్టు, హేమాక్షికము, ఓమము వీనితో నిచ్చిన సర్పవిషమును హరించును. దీనిని నీళ్ళతో గంధము దీసి అందులో సాంబ్రాణిగలిపి నుదుటను, కణతలకు పూసిన తలనొప్పి నివ్మళించును. ముఖమునకు దీనిని పూసుకొనిన అందము దెచ్చును.

కస్తూరి బెండ:—తక్కోలములు చూడుడు.

కళాయిపాత్ర:—Rice & etc. cooKed in tinned metal pot. తగరపు పూతపూసిన పాత్రలో వండిన అన్నము లేక యితర పదార్థ

ములు వండిన కిలముపట్టక పరిశుభ్రముగనుండును. శ్లేష్మరోగము, వ్రణములు, పైత్యవికారము, ప్రమేహము, క్రిమిరోగము వీన్ని హరించును.

కళింగరాష్ట్రము:— సన్నరాష్ట్రము చూడుడు.

కాంచన వృక్షము తెల్లపువ్వులది, ఎర్రపువ్వులది, పచ్చపువ్వులది:— Bauhinia Acuminata, B. Variegata. సం॥ కోవిదార, కాంచన. హిం॥ కచనార్. అనగా దేవకాంచనవృక్షము.దీనిచెక్క రసము, కషాయము లేక చూర్ణము వగరుగ నుండును. సంగ్రహణి, వ్రణములు, గండమాల, గుదభ్రంశము అనగా ఆ అవయవము బయలు వెడలెడు రోగము, మూలవ్యాధి, పైత్యరోగములు, శ్వాస కాసలు, రక్తపిత్తము, ప్రదరము వీనిని జయించును. వీని పువ్వులు చలవజేయును; మలబద్ధముచేయును. రక్తపైత్యము,కుసుమరోగము, గాయము, దగ్గు వీనిని బోగొట్టును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మో॥ 2½ మొ॥ 5, చూర్ణపు మోతాదు 1 మొదలు 4 అణాల యెత్తువరకు,

కాంచనక్షీరి:— పిన్నపాలచెట్టు చూడుడు.

కాండేగుచెట్టు, పండు:— కానరేగుచెట్టు చూడుడు.

కాంతపుగిన్నెలో భోజనము:— Taking food in amagnetic iron cup. అయస్కాంత పాత్రలో భోజనము ఆయుర్వృద్ధి, ఆరోగ్యము, జఠరదీప్తి, వీర్యవృద్ధి,కాంతి వీనినిగలుగజేయును. పైత్యము, ఛర్ది, ఉబ్బు, కామిల, పాండురోగములు, వాతశ్లేష్మములు,గుల్మాలు, శతృయలు, ఉదావర్తమను పొత్తికడుపున బుట్టెడువ్యాధి, హృద్రోగము, శ్వాస, కాసలు, వుదరము, పీనస, ముఖరోగము, ప్లీహ, వ్రణములు, క్రిమిరోగము, మందాగ్ని, వాతపు తిమ్మెర్లు విషము, శూల, కఫము, గ్రహణిరోగము, మూలవ్యా

ధులు, మలమూత్రబద్ధము, బహుమూత్రము మొదలగు వన్నిరోగములను శమింపజేయును.

కాంతభస్మము:— అయస్కాంతభస్మము చూడుడు.

కాక్మారీవిత్తులు:—కాకిచంపువిత్తులు చూడుడు.

కాకరకాయలు పెద్దవి:—Momordica Charantia-fruit of. సం॥ కర్కోటకీ, కారవేల్ల, కటిల్ల. హిం॥ కరేలి.ఇవి ఆకుపచ్చగను తెల్లగను రెండు జాతులుండును. వీనిలో తెల్లనివి శ్రేష్ఠము. చిరిచేదుగా రుచిగా నుండును. కండ్లకు చలవజేయును. మేహము, వాతము, జ్వరము, కాస, శ్వాసలు, కుష్ఠు వీనిని హరించును. కొద్ది కాక, పైత్యము జేయును. జఠరదీప్తిని, తేలికను ఇచ్చును. వీర్యస్తంభన జేయును అతిసారమును, శ్లేష్మమును, క్రిమిరోగమును అణచును. చల్లలో నుడికించి పారవంచి వేగించి పుచ్చుకొనిన ఆరోగ్యముగ నుండును. లేతకాయ త్రిదోషహరమయినది. సర్వరోగములను జయించును. ముదురుకాయ విరేచనము జేయును. అగ్నిదీప్తినిచ్చును. పైత్యము జేయును. పండు కఫమును గొట్టును. రుచి బుట్టించును. పైత్యము, వాతము, గురుత్వము జేయును. కాకరకాయ ఉష్ణశరీరులకు నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పులుసు, 3 ఆవాలచూర్ణము, 4 మోదుగక్షారము లేక మోదుగ మాడల కషాయము, 5 దోసకాయలు.

దీని పచ్చడి చేదుగనుండును. పైత్యము క్రిమిరోగమును పోగొట్టును. రుచి బుట్టించును. మూలవ్యాధిని శాంతిపరచును.

కాకరకాయలు పొట్టివి:— పొట్టికాకరకాయ చూడుడు.

కాకరవరుగ:—Dried pieces of do. ఎండించిన కాకరకాయ ముక్కలు నేతిలోవేయించినను, కూరవండినను చిరిచేదుగా, రుచి బుట్టించును. త్రిదోషహరమై ఆరోగ్యముగనుండును.

కాకరాకు:—Leaves curry of do. దీనిరసము వెగటుగ, చేదుగ నుండును. కాకజేయును, శీతవాతజ్వరములను, చర్మరోగము, క్రిమి

రోగము, శ్లేష్మము, కుక్క, నక్క వీని విషము, పాండువును హరించును. రుచి బుట్టించును. జఠరదీప్తినిచ్చును. విరేచనము జేయును, మోతాదు 1 మొదలు 2 తులముల యెత్తువరకు. దీనికూర వండినది చేదుగ నుండును. క్షయరోగము, పైత్యము, కడుపుబ్బు, జ్వరము, మేహము, క్రిమిరోగము, విషము వీనిని హరించును. వీర్యమునకు వేడినిచ్చును. రుచి బుట్టించును.

కాకిచంపు విత్తులు:—**Cocculus Indicus, C. Suberosus. Eng, Indian Berry.** సం* కాకనాసికా. హిం* కాక్‌మారీ, జువాకీ బీజ్. వీనిని కాక్‌మారీ విత్తులందురు. దీని చెట్టు ఆకులు మునగాకువలె నుండును. యీ విత్తులు పచ్చివిగ నున్నపుడు చిన్న ద్రాక్షకాయలవలెనుండి పండిన కుంకుడుగింజలవలెనుండి కొద్దిగ ఎరుపుగలసిన నల్లరంగు గలిగి మిక్కిలి చేదుగను నూనెవాసనగలిగి యుండును. యీ విత్తులను మెత్తగనూరి మజ్జిగలోగాని, కొబ్బరి నూనెలోగాని వెచ్చని ఆముదములోగాని కలిపిరాసిన గజ్జి, చిడుము, తామర, కురుపులు మొదలగు దురదగలిగిన చర్మరోగముల పురుగులను చంపి నయముజేయును. యీచూర్ణమును వరిపిండిలో గలిపి పక్షులకు వేసిన మత్తెక్కి దొరకును. యీచెట్టు కొమ్మలుకొట్టి చెరువులు మొదలగు వానిలో వేసిన దానిలో నుండెడి చేపలు చచ్చి తేలును. యీవిత్తులను మెత్తగానూరి అన్నములో గలిపి కాకులకు వేసిన నవి చచ్చును.

కాకిదొండ చెట్టు :— **Trichosanthes Palmata- which yields poisonous round red berries.** సం* మహాకాలా, కాకమర్ద, కాకబింబ. హిం* లాల్‌ఇందార్యిన్. యీ కాయలను అవగూడదకాయలందురు. దీనికాయలు గుండ్రముగా చిన్న వెలక్కాయలంత ఉరవగను, పండిన ఎర్రగ లక్కపండ్లవలె నుండును. దీని

పండ్లు మెత్తగనూరి కొబ్బరినూనెలోగలిపి కాచి చెవిలో బోసిన మానని చెవిలోని కురుపులు మానును. ముక్కులో బోసిన దుర్గంధపుపీనస, ముక్కులోని పుండ్లు మానును. యీపండుగాని వేరుగాని మెత్తగనూరినూనెలోగానికొబ్బరినూనెలోగాని వేసి కాచిన తైలము తోతలంటుకొనుచుండిన అనేకరోజులనుండి వదలని తలపోట్లు, శిరోవాతము నయమగును. దీని విత్తులలోనిపప్పు యితర పైత్యహారమైన వస్తువులతోగలిపి సేవించిన సర్వపైత్యములు నివారణమగును. యీకాయల ధూమపానమువలన శ్వాసకాసలు నయమగును. దీని ఆకురసము వెగటుగ నుండును; అభిఘాత వాంజ్వరములు, అగ్నిమాంద్యము, మూలవ్యాధి, పైత్యము, అపస్మారము, రక్త చర్ది, సర్పవిషము వీనిని హరించును. మోతాదు పూటకు 2 మొదలు 4 తులములయెత్తు చొప్పున ఉదయపుపూటలను పుచ్చుకొనవలెను. దీనిని సర్పవిషయమునకు 20 తులములయెత్తు చొప్పున ౫ లేక ౬ మార్లు ఇయ్యనగును. దీనిదుంపచూర్ణము సుమారు పావుతులమెత్తు 10, 12 తులములయెత్తు పచ్చిఆవుపాలతో గలిపి యీ ప్రకారము స్త్రీలు ఋతుమతులయియున్న నాలుగు దినములు ఉదయపు పూటలను పరగడుపున పుచ్చుకొని, పప్పు, నెయ్యి, ఆవుపాలు పథ్యముగ అన్నము దినుచుండిన గర్భవతు లగుదురు.

కాకిమాంసము:—Crow's flesh. కాకజేయును; కఫము, శ్వాస, కాస, రాజయక్ష్మ, జ్వరము వీనిని బోగొట్టును, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, జఠరదీప్తి వీనినిచ్చును. దీని వెంట్రుకల ధూపమువలన గ్రహబాధ, కాకిచెమ్మ లను రోగము నివర్తించును.

కాకోలి:— Gymneoma Balsamicum. సం॥ జీవనీయ, వయస్థ; హిం॥ కాకోలి. దీనిదుంపలు చిన్నపిల్లి తేగలను పోలియుండును. దీని చూర్ణము లేక కషాయము రుచిగా స్వాదుగా నుండును; త్రిదోష

ములు, జ్వరము, తాపము, క్షయ, మేహవ్రణము వీనినిఁబోగొట్టును; గర్భదోషమును బోగొట్టి నిలుపును. దేహపుష్టి, వీర్యవృద్ధి జేయును, చూర్ణపు మోతాదు పూటకు 2-3 చిన్నములయెత్తు. కషాయపు మోతాదు 2½ తులములయెత్తు.

కాగిచల్లారిన నీళ్ళు:—Boiled water-Cooled. కొద్ది కాకజే యును, క్షయరోగము, రక్తపైత్యము, పైత్యము, శ్లేష్మము. ప్రమే హము, విషదోషము, మూర్ఛ, భ్రమ, వాంతి, జ్వరము, పురాణ జ్వరము, క్రిమిరోగము, సన్నిపాతము. దాహము, అతిసారము, క్షీణ ధాతువు, రక్తదోషము, చర్ది వీనిని శమింపజేయును.

కాచలవణము:—The salt of which glasses or bracelets are made. సం* కాచం, కాచసంభవ. హిం* కాచియానోన్. దీనిని గాజుప్పు అందురు ఇది తెల్లగా దళసరి కొబ్బరిముక్కవలె నుండును. పగులగొట్టిన మెరుగు గలిగియుండును. వాసన యేమియు నుండదు. వెగటుగా, చేదుగా నుండును; ఉబ్బు, గుల్మము, ఉదరరోగము, విషవ్రణములు, కఫము వీనిని బోగొట్టును; శీఘ్రముగ జఠరదీప్తి నిచ్చును. మోతాదు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు.

కాచిచెట్టు:—కామంచిచెట్టుచూడుడు.

కాచిననీళ్ళు:—ఉష్ణోదకము చూడుడు.

కాజపుట్ తైలము:—Melaleuca Leucadendron Eng. Cajput oil. దీనిని కాయాపుట్టి తైలమనియు నందురు. యిది అంబాయినా మొదలగు ద్వీపములలో నుండు ఒక జాతిచెట్ల ఆకులతో చేయబడి నది; కాకజేయును; మండును; దీనిని కొబ్బరినూనెలోగాని, నువ్వుల నూనెలోగాని, బాదము నూనెలోగాని, సమపాళ్ళుగ గలిపి మర్దనచేసిన పురాణవాతనొప్పులు, మేహవాతనొప్పులు, నరముల నొప్పులు, (neuralgia) మొదలగు దారుణనొప్పులు, మూర్ఛ,

పక్షవాతము మొదలగు వాతములు హరించును. కణతలకు పూసిన తలనొప్పి నయమగును. దీనిని లోపలికిచ్చిన దేహమునకు వెటనే వ్యాపించి కాకజేయును; నాడిని స్ఫుటముగ వేగముగ నడుచునటుల జేయును; క్షీణించుచున్న ప్రాణశక్తులకు బలముచేసి మేలుజేయును; విస్తారముగ చెమట బుట్టించును; ఎక్కుపులు, ఈడ్పులు (spasms) వీనిని కట్టును; ఉదరరోగము, ఉబ్బురోగము, అపస్మారము (hysteria), అజీర్ణశూల, గర్భములోని వాతము, తలనొప్పి, వీనిని హరించును. ఋతురక్తమును జారీచేయును. మోతాదు వట్టిది తగుమాత్రము పంచదారమీద 2 మొదలు 7 చుక్కలవరకు వేసి యియ్యవచ్చును.

కాటుకగింజలు:— Ipomaea Hederacea. Eng. Pharbitis-suds సం॥ కృష్ణబీజ, శ్యామబీజ. హిం॥ కాలాదాన. వీనిని జిరికివిత్తులని కొల్లివిత్తులని కట్లవిత్తులని యందురు; ఎండబెట్టిగాని, కొద్దిగ వేయించి గాని చేసిన వీనిచూర్ణము విరేచనములుచేయు ఔషధముగా వాడతగియుండును. విరేచనములతో శ్లేష్మమును, పైత్యమును, చక్కగ వెడలించును; క్రిమిని, మలబద్ధము, శిరోరోగము, కఫము, ఉదావర్తము, శోభ, అనాహము, ఉదరరోగము వీనిని హరింప జేయును. మోతాదు 4 మొదలు 6 అణాలయెత్తువరకు. ఇందులో కొద్దిగ శొంఠిచూర్ణము సమముగ చీనాపంచదార కలిపి పుచ్చు కొనవచ్చును. దీనివలన వికారము, కడుపునొప్పి లేకుండ సుఖ విరేచములగును. ఈచెట్టుజిగురు విరేచనకారి. మోతాదు 4 మొదలు 8 గోధుమగింజలయెత్తు.

కాటుకపిట్ట:—The Wagtail. దీని మాంసము రుచిగ నుండును, బలమునిచ్చును. పైత్యము నణచును.

కానరేగు చెట్టు. వ డు: — Flecourtia Sapida F. Ramonchin
స॥ వికంకత, స్వాదువృక్ష. హిం॥ కంటాయి. దీనిని కాండ్రేగు చెట్టందురు. దీనిఆకులు వేళ్ళకషాయ మిచ్చిన సర్పవిషము హరిం చును. దీని మానుచెక్క నూనెలోనూరి పట్టించిన ఆమవాత (gout)నొప్పులు హరించును. దీనిమాను చెక్క నూరి నూనెలో వేసి కాచి ఆనూనె మర్దనచేసిన వాత మేహవాతనొప్పులు హరించును. నూనెకు బదులుగా ఆముదముకూడ నుపయోగించవచ్చును. దీని పండ్లు పుల్లపుల్లగా రుచిగానుండును. ఆకలి బుట్టించును. జీర్ణము జేయును.

కానుగచెట్టు:— Pongamia Glabra & Galedupa Indica. Eng. Indian Beech. సం॥ కరంజక, నక్తమాల హిం॥ కరంజ. నిప్పువన్నె పువ్వులుగల యొక జాతి కానుగచెట్టుకలదు. దానికి సం॥ అంగారవల్లరీ. దీనికిని యించుమించు యివే గుణములు. దీని చెక్క, ఆకురసము, చేదుగనుండును; వేడిజేయును. వాతము, కఫము, రక్తపైత్యము, వ్రణములు, బల్లలు, క్రిమిరోగములు, యోనిరోగములు, ప్రమేహము వీనిని పోగొట్టును; దీని కాయల లోని పప్పు నీళ్ళతో నూరి పూసిన చర్మరోగములు నివృత్తించును. ఆకులు నూరికట్టిన పురుగులుపడిన వ్రణములు మానును; ఒంటికి పూసిన చిడుము, గజ్జి మొదలగు చర్మరోగములు మానును; ఆకు లేక వేరురసములో నూనెగలిపి పూసిన కుళ్ళునాపును, దీని ఆకులు చిత్రమూలపు ఆకులు, మిరియాలు, ఉప్పు వీనిని నూరి పెరుగులో నిచ్చిన కుష్టురోగము నిర్మూలించును. వేరురసము, కొబ్బరిపాలు, సున్నపునీళ్ళు సమభాగములుగ గలిపి యిచ్చిన సెగరోగము మానును. ఆకులరసము లోపలికిచ్చిన కడుపుబ్బు, అగ్నిమాంద్యము, నీళ్ళవిరేచనములు వీనిని కట్టును. ఆకుల రసములో ఆవనూనె గలిపి

సేవించుచుండిన శ్లీపదము నివారణమగును.పథ్యముగ నుండవలెను. పువ్వులుతినిన అతిమూత్రమును కట్టును. కాయలు మెడలో వేరుగా కట్టినను, వీనిలోని పప్పు తినిపించినను, కాయపెచ్చుల చూర్ణము తినినను ఉక్కసదగ్గు (hooping cough) నిమ్మళించును. కాయల లోని పప్పుతినిన కుష్ఠురోగము నిమ్మళించును. చిగురుటాకులు వెచ్చ జేసి కట్టినను లేక నూరికట్టినను రక్తముపడు మూలవ్యాధినివా రణమగును. వేరు రసము పిచికారీ (injection )చేసిన భగందరము పూడి మానును. ఈరసము, మంచినూనె సమపాళ్ళుగలిపి అందులో ఒక అవున్సుకు 8 గోధుమగింజల యెత్తు మయిలతుత్తము గలిపి పూసిన సెలలు, పుట్టవ్రణములు వీనిలోని చీము వెడలి నయమగును. వేరు లేక మ్రానుచెక్క ఆముదములో వేసి కాచి మర్దనచేసిన పడి పోయిన కాళ్ళుచేతులు బాగగును. దీని పుడకతో పండ్లుతోమిన దంతరోగములు, నోటిపూత నయమగును. వేరు లేక మ్రానుచెక్క రసము 3, 4 తులములచొప్పున 5, 6, 9 దినములవరకూ రెండు పూటలా నిచ్చిన వెర్రికుక్క, నక్కల విషము హరించును. పథ్యము కందిపప్పు, కందికట్టు, బీరకాయ, పొట్లకాయ, నేతిపోపు మాత్రము పాతబియ్యపుఅన్నముతో తినవలెను. దీనిపచ్చివేరు రసము లేక గంధము పూసిన మురికివ్రణములు, భగందరము మానును. దీని చెక్క భస్మము తాంబూలముతో సేవించుచుండిన కఫరోగము, వుబ్బు, వాతమును హరించును.

కానుగనూనె:—Oil of the seeds of do. చేదుగ నుండును.కాక చేయును; క్రిమిరోగమును బోగొట్టును; దేహమునకు పూయుటవలన వివర్ణతను పోగొట్టును. పొక్కులు, దురద, పల్లికలు, గజ్జి, ఓడుము, సర్పి, కురుపులు, వ్రణములు వీనినిమాన్పును. దీనితో మర్దన చేసిన, వాత, మేహవాతపు నొప్పులు నివారణమగును. యీనూనె కొబ్బరి

నూనె ఆకుచెముడాకు రసము సమభాగముగ కలిపి రెండుపొంగుల్ వచ్చేటట్లు కాచివుంచి. నిత్యము మర్దనచేసిన మహావాతమువల్లను, శుక్లనష్టమువల్లను కాళ్ళు చేతులు పట్లు లేకపోవుట, సలుపు, వాపులు వీనిని తప్పక నివర్తింపజేయును. దీనిని లోపలికియ్య వచ్చును. కష్టరోగమును బోగొట్టును. మోతాదు 10 మొదలు 30 చుక్కలవరకు.

కాఫీగింజలు:— Coffee Arabica, C. Tetranda Eng. Coffee seeds. సం॥అతంద్రి, మ్లేచ్ఛఫల. హిం॥కాఫీ. దీనిగి జలపప్పుమాడ వేయించిచేసిన చూర్ణపు తేలికకషాయము వేడిజేసి ఆర్చును. ఇదిఒంటి నొప్పులను, బద్ధకమును, నిద్రను పోగొట్టును. రక్తములోని వేడిని, పైత్యమువలనగాని, సన్నిపాతమువలనగాని, పుట్టిన వేడిని అణచును, నెత్తురు గడ్డలకు, స్ఫోటకమునకు మేలుచేయును; పొట్టను మృదువు పరచును. దీపనకారి (stimulant) బలకారి(tonic); కునికిపాట్లను పోగొట్టును, మూత్రమును జారీచేయును. కడుపులోని జలుబును తీసి వేయును. శ్లేష్మపుదగ్గులకు, అన్ని తలనొప్పులకు, మూలవ్యాధికి మంచిది. పొట్టకు బలమిచ్చును. కండ్లకు మేలుజేయును. కడుపులోని వాతమును శిరస్సున కెక్కనియ్యదు. ఆయాసమును, బడలికను తీర్చును. కడుపు, పొత్తికడుపు వ్యాధుల నణచును. కలరాలోని వాంతిని కట్టును. నరముల వికృతిని (nervous irritation) అణచును. చలవచేత వచ్చిన రొంపను అణచును. గాఢమయినకషాయములో(strong decoction ) పంచదార కలిపిగాని, కలుపకగాని యిచ్చిన నల్లమందు మొదలగు విషములు (norcotic poisons) తినినవారికి మేలుజేయును.అనగా బలమైన దీపనకారిగ( stimulant) పనిజేయును. అమిత మద్యపానమువలన గలిగిన నీరసమును పోగొట్టును. దీని గాఢకషాయమిచ్చిననీళ్ళ విరేచనములుకట్టును.ఉబ్బసపు

దగ్గరొక్క ఉద్రేకమును కట్టును. దీని దుర్గుణములు, అనగా అమితముగా కాఫీపుచ్చుకొనుచుండిన విరేచనబద్ధము, పైత్యము, కాక జేయును. దేహమును అర్చివేయును. పసుపురంగు దెచ్చును. వీర్యనష్టము జేయును. హృదయమునకు జబ్బుజేయును. అతిమూత్రమును, మనోదుర్బలతను దెచ్చును. రొమ్మునార్చును. కలవరింతలు పుట్టించును. పుంస్త్వమును తగ్గించును. పుంస్త్వమును తగ్గించదని కొందరి మతము. రొట్టె మొదలగు ఆహారము పుచ్చుకొనిన తరువాత దీనిని పుచ్చుకొనవలెనేకాని, పరగడుపున పుచ్చుకొనగూడదు. దీనికి విరుగుళ్ళు 1 శికి జబీను, 2 పాలు, పంచదార, పచ్చిగింజ చూర్ణపుకషాయము మూత్రమును జారీచేయును. బలకరమైనవి. మొత్తమున కాఫీ పుచ్చుకొనెడు అభ్యాసము చల్లప్రదేశములలో ఉండువారికి మేలుజేయును; ఉష్ణప్రదేశములలో నివసించినవారికి కాల్రకమమున జబ్బుచేయును; ఈ కాఫీకషాయము (Coffee decoction)లో పంచదారగాని బెల్లముగాని కలిపి అందులో పాలు కలిపి పుచ్చుకొనవలెను. పురటాల్రకు వుపయోగించునప్పుడు పాతబెల్లము కలిపి యిచ్చుట మంచిది.

కాబేజీకూర:—Brassica olerecca B.Sativa Eng. Cabbage.
సం॥ కేముకా, దళమాలిని. హిం; కోబీ. దీనిని కేబేజీ యందురు. చలవజేయును. నిద్రదెచ్చును. రక్తమును వృద్ధిజేయును. మెదడులో నుండెడి వేడిని హరించును. దేహపుష్టి. ఆయుర్వృద్ధినిచ్చును. అధిక మద్యపానమువలన గలిగిన బుద్ధిమాంద్యమును పోగొట్టును. క్షయ, కఫము, పిత్తము హరించును. చులకనగ జీర్ణమగును. శ్వాస, ప్రమేహము, రక్తదోషము, జ్వరము వీనిని హరింపజేయును. అనగాపైన వుదహరించిన రోగములయందు పథ్యకారిగా నుండును. గడ్డలకు

నూరి కట్టినగాని, నొచ్చుకేసి కట్టినగాని శ్వాగా పక్వపరచును బాధ తగ్గించును.

కామంచికాయలు:—Fruits of Solanum Nigrum. వీనిని కాసు కాయలనియు నందురు. వీనికూర త్రిదోషహరమైనది జఠరదీప్తి నిచ్చును. ఉబ్బు, పాండువు, మూలవ్యాధి, నేత్రరోగములు, గుల్మము మేహము వీనినణచును. వీర్యమునకు వేడి బుట్టించును, పైత్త్యమును, కఫమును హరించును. ఈపండ్లు, శిసువులదగ్గును పోగొట్టును. దీని వరుగు అగ్నిదీప్తి నిచ్చును. రుచి బుట్టించును. పైత్యము శాక చేయును.

కామంచిచెట్టు:—Solanum Nigrum, Eng. Garden night shade. సం॥ కాకమాచిక, కాకమిస్లుక. హిం॥ మకోమ్. దీనిని కావిచెట్టని కాసుచెట్టని, కామాక్షిచెట్టని అందురు. ప్రతిసంవత్సరము లేచెడు చిన్న చెట్టు. దీనిపండ్లు నల్లగ పసుపుపచ్చగ లేక యెర్రగ నుండను. దీని ఆకుకూర లేక రసము త్రిదోషహరమైనది. వీర్యమునకు వేడి పుట్టించును. కుష్టు, సంగ్రహణి, మూలవ్యాధి, వాపు, మేహము, జ్వరము, పాండురోగము వీనిని పోగొట్టును. శుక్లవృద్ధి కేయును. జఠరదీప్తినిచ్చును. జంతువిషమును హరించును. క్రిమిహరమైనది. విరేచనముచేయును. హృదయమునకు బలమిచ్చును. కంఠమును శుభ్రపరచును. ఆయురారోగ్యముల నిచ్చును. గర్భోత్పత్తిని కలుగ జేయును, రసముయొక్క మోతాదు పూటకు 2 మొదలు 5 తుల ముల యెత్తువరకు.

కామంచిపూరి:—Andropogon Schoenanthus. A. Citratus Eng. Lemon grass. సం॥ కతృణ, రోహిషతృణ, ధ్యామకం. హిం॥ రోహిస్, గంధేజఘాస్, దీనిని కామాక్షిపూరి అనియు, నిమ్మగడ్డియనియు నందురు. ఇది సువాసనగల ఒకగడ్డి. దీని సమో

లముయొక్క లేక ఆకుయొక్క కషాయము లేక తేలిక కషాయము పొట్టకు బలముజేయును. దగ్గు, వగర్పు, హృద్రోగము, విదాహము వీని నణచును. చెమట బుట్టించును. విశూచి (cholera), అజీర్ణ శూల, కడుపులో బల్ల, రక్తవాతము, జ్వరము పైత్యము, దోష జ్వరము, (Typhoid fever) చలిజ్వరము, వరుసజ్వరము, నీర సము వీనిని పోగొట్టును. జ్వరములో దీని కషాయమిచ్చిన చెమట పట్టించి జ్వరమును ఆపును లేదా ఆగివచ్చునటుల జేయును; జ్వరితు లకు నిద్రదెచ్చును. ఆకును చల్లతో నూరి పూసిన శాామరమానును. దీని వేళ్ళలో, లేతఆకులలో కొద్దిగ మిరియాలువేసినూరి యిచ్చిన ఋతుబద్ధము (dysmenorhoea) మానును. దీని ఆకులు తేయాకువలెకాచి అందులో పాలు గలిపి పుచ్చుకొనిన మనోహర ముగ నుండును; చెమట పుట్టించును. బడలికను తీర్చును. దీనితో చేసిన నూనె లోపలికిచ్చిన పొట్టలోని వాతమును వెడలించును. ఈడ్పుల కట్టును. చెమట బుట్టించును. అజీర్ణము, ఆగియాగివచ్చెకు కడుపునొప్పి, అమితమగు త్రేనుపులు, గుండెలలోమంట, మరిడి జాడ్యము (cholera) అందువలన గలుగువాంతి వీనిని కట్టును, దీపనకారి; ప్రేగులకు, పొట్టకు బలముజేయును. వాంతిని, నీళ్ళవిరేచ నములను కట్టును. పైనపూసిన లేక మర్దనచేసిన, వాత మేహవాతపు నొప్పులు, ఇరుకునొప్పులు, నరముల నొప్పులు, నడుమునొప్పి మొదలైన నొప్పులు నయమగును కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 4 తులముల యెత్తువరకు. తేలికకషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు నూనె లోపలికిచ్చు మోతాదు 12 మొదలు 20 చుక్కలవరకు. మరిడిజాడ్యమునకు దీనిని పంచదార గడ్డమీదవేసి జాడ్యపుగుణములు కట్టువరకు అప్పుడప్పుడు ఇచ్చుచు పెదవులు, వెన్ను, పొట్ట వీనిమీద పూయుచుండవలెను. కలరాకు

ఇచ్చు తేలిక కషాయము 30 తులముల మరుగునీటిలో 10 తులముల ఆకు వేసి చేయవలెను. ఇతరవ్యాధుల కిచ్చు తేలిక కషాయము 30 తులముల మరుగునీటిలో 4, 5 తులముల ఆకు వేసి చేయనగును. కషాయము చేయుటకు 30 తులముల నీళ్ళలో 3, 4 తులముల ఆకు వేసి 15 తులముల నీళ్ళు మిగులువరకు కాచి వడియకట్టి వాడ నగును.

కామాక్షీ చెట్టు:—కామంచి చెట్టు చూడుడు.

కాయపెండలము:—The yam plant yields fruits. అనగా పెద్ద లపుతీగెకు కాయలుమాత్రము కాయును. దీని కాయలు సుమారు పెద్దవుసిరికాయలంతేసి యుండి చామదుంప రంగు గలిగియుండును. దీనికూర రుచిగానుండును. విరేచనము జేయును. వాతమును హరిం చును. వీర్యవృద్ధి, బలము జేయును.

కాయఫలచెక్క:—Myrica Sapida & M. Nagi. Eng. The box Myrtle. సం॥ కల్ఫల, కుంభికా. హిం॥ కాయఫల్. ఇది పెద్దవృక్షము. దీని ఆకులు తమలపాకులను బోలి యుండును. ఎర్రని పువ్వులు గలిగి జాజికాయవంటి కాయయు దానిపైని జాపత్రివంటి పత్రియు గలిగియుండును. యీపత్రిని రామపత్రి యందురు. దీనిని బాజారులో రెండవరకము జాపత్రిగా వాడుదురు. చెక్క దళసరిగా నుండును. చెక్కపైని తెల్లగనుండును కారముగల వస్తువు. శాక జేయును. దీనిని దేహముపైన పూసిన యెరుపెక్క జేయును; పొక్క జేయును. దీని చూర్ణము పీల్చిన తుమ్ములు వచ్చునట్లు చేయును. శొంఠితోనూరి విశూచి జాడ్యగ్రస్తునికి పూసిన దేహమునకు వేడి తెచ్చును. లోపలికిచ్చిన పొట్టకు బలముజేయును వాతమును పొట్ట లోనుండి వెడలించును. దీని చూర్ణము లేక కషాయము కఫవాత ములు, గుల్మము, మేహము, అమశూల, విషమజ్వరము. మూల

వ్యాధి, గ్రహణి, పాండువు, ఉబ్బు యీ రోగములను హరించును. చూర్ణపు మోతాదు 3 మొదలు 5 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 6 తులముల యెత్తువరకు.

కాయము:— Confection of Bishop's weed seeds & c, prepared for women in child birth. ఓమము సోలెడు, పిప్పళ్ళు, మిరియాలు, చలవమిరియాలు, కురంజివామ్ము, శొంఠి, దుంపరాష్ట్రం, కళింగరాష్ట్రం, వాయువిళంగములు, రేవలిచిన్ని, అక్కలకర్ర, పిప్పలికట్టి, ఒక్కొక్కటి ¼ అణాల యెత్తుచొప్పున, 2 కరక్కాయల పెచ్చులు, సీమకరక్కాయలు 4, మోదుగమాడలు 3, చిన్న వసకొమ్ము, కటుకరోహిణి 2 అణాలయెత్తు. దుంపపసుపు కొమ్ములు 2, నల్లజీలకర్ర ½ తులం, తెల్లజిలకర్ర ½ తులం యివన్ని మెత్తగా కొట్టి జల్లించి రుబ్బురోట్లో వేసి నీళ్ళుపోయుచూ మెత్తగా కాటుకవలె నూరి మూకుడులో వేసి దానిలో పాతబెల్లం ½ వీశను మెత్తగా కొట్టి కలిపి ఆవునెయ్యి సోలెడు వేసి కలుపుచూ లేహ్యాము లాగున వచ్చిన తరువాత దింపి చల్లారిన తరువాత గాజుపాత్రలో జాగ్రత్తపెట్టి పూటకు ½ తులం మొదలు తులమెత్తువరకు బాలింతలు పథ్యం పెట్టినప్పటినుండి ఉదయపుపూటలను పుచ్చుకొని వెంటనే కొంచెం పాతబెల్లం ముక్కకూడ తినవలెను. యిటుల తినిన శరీరమునకు బలము జేయును. సూతిక సంబంధమైన దోషములను రాకుండ చేయును ఆరోగ్యమిచ్చును.

కారండవపిట్ట:—కన్నెలేడిపిట్ట చూడుడు.

కారటుదుంపలు:—గాజుగడ్డలు చూడుడు.

కారము:— Properties of things, which are pungent to the taste generally. అనగా కారముగ నుండెడి వస్తువుల సామాన్యగుణము. కారముగల పదార్థములను మితముగ బుచ్చు

కొనిన కంఠరోగము, శోష, ఉబ్బు, అగ్నిమాంద్యము, నేత్రరోగమ్ము వీనిని హరించును. అమితముగ బుచ్చుకొనిన ముందుచెప్పిన రోగమ్ములను గలుగ జేయును. వేడిజేయును. శుక్లమును, బలమును పో గొట్టును.

కారింగువ :—Gardinia Lucida, Eng. Dikamalley gum gummy gardinia. స * నాడీహింగు. హిం* డికామాలీ. మలబద్ధమును పోగొట్టును; గుల్మరోగము, నాభిలోబుట్టెడు విద్రధియనెడు వ్రణము, శూల, క్రిమిరోగము, కఫరోగము, బల్లలు, మూలవ్యాధి, ఉబ్బు వీనిని హరించును. దీని ధూపము గ్రహదోషములు, ఉన్మాదము వీనిని బోగొట్టును.

కారుఅల్లము:—Zengiber Zerumbet Eng. Wild ginger. కారముగా నుండును. రుచిబుట్టించును. బలము నిచ్చును. పైత్యము నణచును. జఠరదీప్తి నిచ్చును. దగ్గు, వగర్పుగల దగ్గు, క్రిమి వీనిని హరించును. పైకిరాసిన చర్మరోగములు మానును.

కారుకోడి మాంసము:—Wild fowl-flesh of. అనగా అడవి కోడి. దీనిమాంసము రుచిగా లఘువుగా నుండును. పైత్యమును, వాతమును శమింప జేయును. ఎండు మాంసము బలము, పుష్టి జేయును. వీర్యపుష్టి, బలము నిచ్చును. దీని గుడ్లు ఊరకోడిగుడ్ల గుణము కంటె శ్రేష్ఠముగ పనిచేయును.

కారుగచెట్టు:—Vernonia Anthelmintica & Psoralea Corylifolia. సం* సోమరాజీ, అవల్గుజ, వాకుచి, హిం* బావచీ, సోమరాజ్. దీనిని క్రాలు గచ్చయని యందురు. అనగా బావంచాల చెట్టు. దీనివేరు లేక ఆకురసము లేక కషాయము లేక లేహ్యము

కూర, కఫము, పైత్యము, వాతము, శ్లేష్మము, క్రిమిరోగము, కుష్ఠు, దురద, దద్దుర్లు, మేదోరోగము వీనిని హరించును; ఆయు ర్వృద్ధిని, బలమును ఇచ్చును. రసముయొక్క మోతాదు పూటకు 1-2 తులములయెత్తు; కషాయపు మోతాదు 3-4 తులములయెత్తు. దీనివిత్తులే బావంచాలు. బావ చాలు చూడుడు. దీని ఆకులకూర వేడిచేయును, క్రిమిని హరించును. అగ్నిదీప్తినిచ్చును; వివహార మైనది. బలముచేయును.

కారుపెసలు:—అడవిపెసలు చూడుడు.

కారూబా:—Caruba. ఇది భూమిలో బుట్టును; సముద్రతీరములందు దొరకును; పచ్చనైనపురంగు గలిగి ఘట్టిగనుండును; దీనిని పన్నీ రుతోగాని, చనుబాలతోగాని మెత్తగనూరి, నీడను యెండించి వాసవలెను. హృదయమునకు బలము చేయును; గుండె దడ (palpitation of the heart)ను పోగొట్టును; కుసుమరోగమును, గ్రహణిని కట్టును. బలముచేయును. మోతాదు పూటకు 1-2 చిన్న ముల యెత్తువరకు లోపలికి అవుపాలతో యియ్యవచ్చును. మరియు దీని ధృతి తీయుదురు. దీనితో తైలమున్ను చేయుదురు. ఈ తైలము మూర్ఛ (epilepsy). అపస్మారము (hysteria) వీనిని నివృత్తిచేయును. తైలపుమోతాదు 10 మొదలు 15 చుక్కలవరకు. జిగటగల పదార్థములు గలిపి మాత్రలుగాచేసియు వాడనగును.

కారుబోగి విత్తులు:—బావంచాలు చూడుడు.

కారుమినుము:— Glycine Debilis Eng. Wild black - gram. సం॥ మాషపర్ణి, కాంభోజి. హిం॥ మషవన్, వన్‌వుడద్. శీత వీర్యముగలది. స్వాదుగా నుండును; బలముచేయును, కఫమును, శుక్లమును, వృద్ధిచేయును, క్షయ, జ్వరము, తాపజ్వరము, రక్త పైత్యము వీనిని శమింపజేయును. శోష, దాహము వీనిని శాంతిపర చును.

కారుమునగకాయ:—Fruit of wild Radish. చేదుగా వెగటుగా నుండును. వాతము, ప్రమేహము, శ్వాస వీనిని హరించును; శోషను నీరసమును అణచును; పుంస్త్వమును గలుగజేయును; మూలవ్యాధిని పోగొట్టును; వీర్యమునకు వేడిని ఇచ్చును.

కారుమునగచెట్టు:—Moringa Pterygosperma - wild variety Eng. Wild Horse Radish. సం॥ మురంగీ, వనశిగ్రు. హిం॥ వనసహింజన్. దీని చెక్క, ఆకురసము కారముగనుండును; కాక జేయును; బల్లలు, గుల్మలు, అష్టశూలలు, శ్వాస, కాస, వాతము, పీనస, పాండువు, ఉబ్బులు వీనిని హరించును. దీని వేరు కషాయము పూటకు 2-3 డబ్బులయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నిచ్చిన జ్వరము హరించును; నీరసము నణచును; కాక జేయును; దీని వేరుచెక్క మెత్తగా నూరి నూనెలో గలిపిపూసిన పక్షవాతము, నడుమునొప్పి మానును. దీని పువ్వులు వెగటుగనుండును; పైత్యము జేయును; కఫమును, వాతమును గొట్టును.

కార్జము:—Liver of goat Etc. మేక మొదలైన జంతువుల కార్జము (liver) వేడిజేసి చలవజేయును; శ్లేష్మము, వాతము జేయును; గురుత్వముగనుండును; దుష్టరక్తమును బుట్టించును; మెదడులో నొప్పి బుట్టించును. దీనికి విరుగుడు త్రిఫలచూర్ణము లేక కషాయము. ఇది అపథ్యమయినది. ఆరోగ్యము గోరువారు దీనిని తినకూడదు. తినగోరిన, కోడి మొదలగు పక్షులయొక్కగాని, లేక మేకయొక్కగాని కార్జమును మితముగ బుచ్చుకొనవచ్చును.

కాల్చినచేప:—Roasted fish. స్వాదుగా, లఘువుగా, రుచిగా నుండును. శేలికగా జీర్ణమగును. పైత్యము జేయును; పొత్తికడుపును శుభ్రపరచును; మేహమును, అగ్నిమాంద్యమును పోగొట్టును;

వీర్యవృద్ధి జేయును; పథ్యముగ నుండును. చేపల సామాన్యగుణము చూడుము

కావిరాయి:—గైరికము చూడుము.

కావివస్త్రము:—Light red coloured cloth. పైత్యమునుగొట్టును, బుద్ధివికాసత నిచ్చును; వేసవికాలమందును, శరత్కాలమందును అనుకూలముగ నుండును.

కావేరీ జలము:— Water of the Cavery. రుచిగా, తేలికగా నుండును; శ్రమను పోగొట్టును; ఆకలిపుట్టించును; దద్దురు, కుష్టు మొదలగు చర్మరోగములను, వాతమును, కడుపులోజల్ల వీనిని హరించును; రుచి బుట్టించును; బుద్ధికి బలమిచ్చును; వీర్యవృద్ధి జేయును. మిక్కిలి ఆరోగ్యమైనది.

కాసరచెట్టు:—కామంచిచెట్టు చూడుము.

కాసిని విత్తులు :—Chicorium Intybus Endivia Eng. endivia wild chikaraj. హిం॥ కాస్ని. వేసిశేసిఆర్చును; వీనిని నీళ్ళలో కడిగి పిసకడమువలన దీనిలో వేడి తగ్గును; గుండెలకు బలమిచ్చును; తాపమును.జ్వరమును, కాక వలనబుట్టిన ఉబ్బునుపోగొట్టును; దుష్టపదార్థ కూటమిని విప్పును; పైత్యముయొక్క రక్తముయొక్క దుష్టతీవ్రము నణచును. దీనికషాయముగాని, నీళ్ళతోనూరితీసిన రసముగాని పుక్కిలించినపండ్లనొప్పి గొంతునొప్పి శమించును. దీనియాకును గోధుమపిండి తోదంచి గుండెలమీదకట్టిన ముంగగుండె (Heart) యొక్క వికారమును, వేడిని అణచును. దీనిరసము, ఉప్పువేసి వెచ్చజేసి వడకట్టి పుచ్చుకొనిన ముంతగుండెను, వల్లదబ్బ (spleen) ను, నరములను, కడుపులోని అవయవములయందు పుట్టిన దుష్టపదార్థ కూటమిని తీసివేయును. కార్జము (liver) నకు సత్తువజేయును; కడుపులోని మంటను, దాహమును అణచును; మూత్రమును, స్త్రీల రజోరక్త

యును, గురదాలను (kidneys) శుభ్రపరచును. సికింజబీనుతో తినిన వాంతి, విరేచనములు స్ఫోటకము, సన్నిపాత జ్వరము, పైత్యజ్వరము గలవారికి మేలుజేయును. దీనిరసము పుచ్చుకొనిన మూర్ఛ, డొక్కనొప్పి, పొట్టలోనొప్పి వీనిని బోగొట్టును; పొట్టకు బలమిచ్చును. అజీర్ణమును, వాతమును హరించును; మూత్రపుసంచి (bladder)లోని వాతమును, అతిమూత్రమును పోగొట్టును; స్త్రీలకుపాలు పడజేయును; దీనిరసము ముక్కులోపిండిన మూర్ఛను, పిచ్చితనమును పోగొట్టును; దీనికూకు నీళ్ళలో వేసికాచి అందులో కూర్చుండబెట్టిన నడువలేని బిడ్డలు త్వరగా నడిచెదరు. దీనినూనె మర్దనచేసిన పార్శ్వపునొప్పి కుదురును; ఉష్ణతత్వముగలవారికి దగ్గు, తలనొప్పి దెచ్చును; దీనికి విరుగుళ్ళు 1 పంచదార లేక పటిక పంచదార, 2 బాదముజిగురు, 3 కొత్తిమీరి మొదలగు చలవ వస్తువులు.

కాసీపుస్తి:—బిడ్డుపుస్తి చూడుడు.

కాసీసము:—అన్నభేది చూడుడు.

కాళ్ళుపిసికించుకొనడము:— Having legs shampooed. మితముగ కాళ్ళు పిసికించుకొనుటవలన మాంసము, రక్తము, చర్మము ఇవి నిర్మలత్వమును పొందును; ప్రీతిని, నిద్రను, ధాతువృద్ధిని గలిగించును; కఫము, వాతము, శ్రమ, మార్గాయాసము వీనినిబోగొట్టును.

కిక్కసగడ్డి:—Phragmites karka & Arundo karka. Eng. Bur grass. సం॥ నడ, నళ, రంధ్రీ. హిం॥ నర్ కుల్. దీనిరసము లేక కషాయము, మూత్రరోగము, తాపము, రక్తదోషము, కఫము, పిత్తము, విసర్పి వీనిని బోగొట్టును; రసపుమోతాదు పూటకు 2కి తులములమెత్తు, కషాయపు మోతాదు 2కి మొదలు 5 తులముల మెత్తువరకు,

కిచిడి లేక కిసిమిసాంబా యను ధాన్యము:— A sort of paddy. ధాన్యములలో శ్రేష్ఠమైనవి. దీని యన్నము పురవయగును. మృదువుగా నుండును. బలము, పుష్టి, వీర్యవృద్ధి, కాంతి, ఆరోగ్యము నిచ్చును. సర్వరోగములయం దనుకూలముగ నుండును. బలమైన భూములలో పండించు ధాన్యము. మరియు ధాన్యములు చూడుడు.

కిచ్చిలిపండు:—నారింజపండు చూడుడు.

కిసిమిసిపండు:—Vitis Vinifera. Eng. Raisins. సం॥ శాకలీద్రాక్షా, లఘుద్రాక్షా, నిర్బీజ. హిం॥ కిస్ మిస్. వీనిలో గింజలుండవు. మధురముగ నుండును. తత్వమును మృదువు పరచును. త్రిదోషహరమైనది. మేహశాంతి, వీర్యవృద్ధి, రక్తవృద్ధి జేయును శోషనణచును. బలమిచ్చును. హృదయమునకు బలమునిచ్చును. దగ్గును, మూలవ్యాధిని శమింపజేయును. కంఠమును శుభ్రపరచును. ద్రాక్షపండ్ల గుణము గలిగియుండును. విరేచనకారి. అగ్నిమాంద్యము జేయును. పచ్చిపండ్లను మేహశాంతి జేయును. రుచి బుట్టించును క్షయరోగమును హరించును.

కుంకుచామంతులు:—A sort of chamomile flowers. ఈ పువ్వులు పైత్యశ్లేష్మములను హరించును. చలవజేయును. విరేచనమును బంధించును. అగ్నిదీప్తిని, తేలికను ఇచ్చును.

కుంకుడుచెట్టు:—Sapindus Emarginatus & S. Trifoliatus. Eng. soap nut tree. సం॥ అరిష్టక, ఫేనిల, కృష్ణబీజ, హిం॥ రీఠా. దీని యాకు తలకుకట్టిన శిరోవాతమును, దారుణమగు తలనొప్పిని పోగొట్టును. దీనికాయపై గుంజు చేదుగ నుండును. దీనిని లోపలికిచ్చిన వాంతిజేయును. శ్లేష్మమును వెడలించును. ఉబ్బసదగ్గు నణచును. మోతాదు పూటకు రెండు చిన్నములయెత్తు. ఈకాయలు ముక్కులోపిండిన మూర్ఛరోగికి తెలివివచ్చును. ఈకాయనునీళ్ళతో

వం౦గదీసిన గంధము పాముకరచినచోట లేక తేలు, జెర్రి, పురుగొన కుట్టినచోట దట్టముగా పట్టువేసి కాచిన విషము విరుగును. పాము విషముకు ఆగంధము సుమారు తులమెత్తు లోపలికియ్యవలెను. కండ్లకు కలికమును వేయవలెను. ఈకాయలను నీళ్ళలోవేసి పిసికిన పులుసుతో తలరుద్దుకొనిన శాకచేయును. కొన్ని తత్వములవారికి తలనొప్పులను పోగొట్టును ఈపులుసును పశువులకు వచ్చెడి దొమ్మ రోగమునకు పోసిన మానును.

కుంకుమపువ్వు:—Corcus Sativus. Eng. Saffron. సం* కుంకుమ, కాశ్మీరంజ, బాహ్లీక. హిం* కేసర్. చేదుగా, వెగటుగా, స్వాదుగా, మనోహరముగా, జిగటగా నుండును. వేడిచేసి అర్చును. విరేచన కారి. వీర్యవృద్ధి నిచ్చును. ధాతుపుష్టి, దేహకాంతి, బలము, ఆయు ర్వృద్ధి బుద్ధిసూక్ష్మత, బుద్ధిబలము వీనినిచ్చును. త్రిదోషములను శమింపజేయును. సంతోషము నిచ్చును. విషము, మదము, శోష, నాసికము, కండ్లు, శిరస్సు వీనియందు బుట్టెడు రోగములు, పిక్కల నరములపట్లు, వీనిని బుట్టినపోట్లు, రక్తపైత్యము, కాస, వాతము, పురాణజ్వరము, కఫము, కంఠరోగము, తెల్లనిమచ్చలు, దురద, కుష్టు, వ్రణములు, పొక్కులు, మొదలగు చర్మరోగములు వీనిని హరించును. గంగసింధూరము, రసము వీనివలన గలిగిన దోషము లను, బొట్టు పెట్టుకొనెడుచోట బుట్టెడు మచ్చను పోగొట్టును. ముంతగుండె (heart) కు బలమిచ్చును. నిద్రదెచ్చును. గడ్డలు మొదలగు వానిని కరగించును. పక్వముజేయును. మంచిరక్తమును బుట్టించును. దీనితో ఏఔషధమిచ్చినను, దేహమునకు చక్కగ వ్యాపింపజేయును. హృదయము, మెదడు, గురదాలు (kidneys), నల్లవబ్బ (spleen), కార్జము (liver), మూత్రపుసంచి (bladder) వీనిని శుభ్రపరచును. నరముల (Nervous affection) ను, విచా

కపు పిచ్చి, అపస్మార నీరసమును (Hysteria depression) దోషజ్వరము (Typhus fever) ను పోగొట్టును. దీనిని నీళ్ళలో గలిపి, ప్రసవమైన స్త్రీకి వెంటనే యిచ్చిన జ్వరమును రానియ్యదు. ప్రాణమునకు సత్తువచేయును. మైలరక్తమును, నీరును వెకలించును. దీనిని, కరక్కాయను, నిమ్మపండ్లరసముతో నూరి, కంటిచుట్టు పట్టు వేసిన నేత్రరోగములు, ఎరుపులు, నీరుకారడము, పోటు మొదలగు నవి నివారణమగును. దేహములోని మలముల వెడలించును. స్ఫోటకపు పొక్కులను బాగుగ వృద్ధిబొందించును. సముద్రరోగము (Sea sickness) ను ఆపును. గుండె అదుపును (palpitation of the heart) నివారించును. ఈడ్పుల (spasms) ను కట్టును. గుండె, తెల్లదబ్బ (Lungs) వీనిలోని రోగములను హరించును. నొప్పిని మాన్పును. నుదుటనుపూసిన మతిచాంచల్యమును పోగొట్టును. దీనిని అమితముగ దినిన బుద్ధిని చెరుచును. రక్తమును పలచనచేయును. కాకజేయును. నీరసము దెచ్చును; మెదడు నరములకు హానిజేయును; పిండోత్పత్తి అవయవములకు వికృతి కలుగజేయును; పొట్టకు వేడి యెక్కువజేసి నష్టముచేయును; తలనొప్పి బుట్టించును; ఆకలిని జెరపును; గుర్దాలకు నష్టముచేయును; దీనికి విరుగుళ్ళు 1 ఉష్ణశరీరులకు సికింజబీను, 2 శైత్యశరీరులకు నల్లమందు, 3 సముద్రపు నురుగు, 4 సిరకాలో పంచదార గలిపి పుచ్చుకొనడము. మోతాదు 3 మొదలు 10 గోధుమగింజలయెత్తువరకు. దీనితోచేసిన పాకము (syrup) బాలపాపచిన్నెలను పోగొట్టును. ఈపాకమును మితముగ ఆహారముతోగాని, ఔషధములోగాని పుచ్చుకొనిన పొట్టకు బలముచేయును, రక్తప్రవాహమును బలపరచును. ఈపాకముయొక్క మోతాదు 2 మొదలు 4 డ్రాములు దాల్చిన నీళ్ళతో పుచ్చుకొనవలెను.

కుందురుమ్మ్కము:—పిరంగిసాంబ్రాణి చూడుడు.

కుందేలు:—Hare. అనగా చెవులపిల్లి మాంసము మృదువుగా రుచి గానుండును. కాక జేయును. వీర్యవృద్ధి. దేహపుష్టి, బలము, కాంతి వీని నిచ్చును. వయస్సును నిలుపును. మిక్కిలి జఠరదీప్తి నిచ్చును జ్వరము, కఫము, పైత్యము, మేహము, బొట్లుబొట్లుగా పడు మూత్రవ్యాధి. రక్తము పడెడు మూలవ్యాధి వీనిని బోగొట్టును. కండ్లకు చలవ జేయును వ్రణములు, లూతమును నేత్రవ్రణము, నారివ్రణములు వీనిని మాన్పును. దీని చెవిరక్తమువలన మూర్ఛ రోగము నివారణమగును. దీని పెండ్రుకల ధూపమువలన గ్రహపీడ నివర్తించును. ఉష్ణశరీరులకు నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 కాసరాకు, 3 గంజి. దీని మాంసమును వ్రణములకు పైనవేసి కట్టనగును.

కుంపటి:—Chafing dish. దీనిసెగ వాతయుక్తమయిన ఆమజ్వరము, వాతరోగము, శూల, కఫము, శీతము, వణకు, మూలవ్యాధి వీని నణచును. కాళ్ళు, చేతులు వీని చలవను పోగొట్టును.

కుక్కగులాబిచెట్టు:—Dog Rose. దీని వేరు, చెక్కరసము, వెర్రి కుక్క విషజన్ని (Hydrophobia) ను పోగొట్టును. మోతాదు 2–3 తులములయెత్తు.

కుక్కపొగాకు:— Blumia Densiflora. B. Lacera. Eng. dog bush or wild tobacco. సం* కుకున్దర, కుకున్ద, కుకురద్రుమ. హిం* కుకరోంధా. ఇది ఏటా లేచెడు చిన్నమొక్క. సువాసనగ నుండును. దీని పచ్చిఆకురసము కండ్లలోవేసిన కండ్లనుండి చీము కారెరోగమును హరించును. దీని సమూలకషాయము గ్రహణి. కుసుమరోగములు, చలిజ్వరము, శరీరమంతటను నొప్పులుగల తీవ్రమైన జ్వరము, క్రిములను, కఫమును హరించును. కాక జేయును; విరేచనబద్ధముజేయును; మోతాదు పూటకు 2 మొదలు 5 తుల

మలల యెత్తువరకు; దీని సమూలమును నూరికట్టిన వ్రణములలోని క్రిములు చచ్చును. దీని ఆకున్ను గాడిదగడపాకున్ను కలిపి మెత్తగ నూరి కట్టుచుండిన మూలవ్యాధిబాధ తగ్గి నయమగును.

కుక్కవావింట చెట్టు:— Ocimum Pilosum & Polonisia Icosa- variety of. సం॥ బర్బరీ. దీనివిత్తులు వీర్యమునకు వేడి పుట్టించును; వాతపిత్తశ్లేష్మములు, క్రిమివ్యాధి, కడుపులోని వాతము వీనిని హరించును. మోతాదు పూటకు ½ మొదలు 6 చిన్నములల యెత్తువరకు. దీని ఆకు పసరు నూనెలోగలిపి పోసిన చెవిలోనుండి చీము, రక్తము స్రవించెడు కురుపులు, దుర్గంధము, నొప్పి, పోటు మానును. ఆకు నూరికట్టిన వ్రణములు మానును. దీనిసమూలము నీళ్ళలోవేసి కషాయముగాచి యిచ్చిన ఆకలిని పుట్టించును; పొట్టను మంచిస్థితిలో నుంచును; కడుపు ఉబ్బును పోగొట్టును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. దీని ఆకు చేతితో నలిపి బిళ్ళవలెచేసి తలమాడపట్టున వేసి కట్టిన శిరోవాతము, దారుణమైన తలనొప్పి, శిరోభారము నివారణమగును. పైనజెప్పిన కట్టు కట్టినవెనుక తలలో అధిక వేడిమి, మంటపుట్టినపుడు కట్టువిప్పి ఆబిళ్ళ తీసివేయవలెను.

కుడుములు:—ఉండ్రములు చూడుడు.

కుప్పింట చెట్టు:—మూర్కొండ చెట్టు చూడుడు.

కురంజి ఓమము:— Henbane seeds. అజీర్ణములు, కుష్టువు, వాతము, జంతువాతము, ఆమదోషము, క్రిమిరోగము, శూల వీనిని హరించును; పైత్యముజేయును.

కురమగొర్రెపాలు:— Milk of Cumbly sheep. అనగా కంబళ్లు నేయు ఉన్ని (wool) గల గొంగళిగొర్రె అను గొర్రెపాలు చలవ జేయును. శ్లేష్మమును పెంచును. పైత్యముల నణచును.

ఖురమృగ్గారి మాంసము:—Flesh of do. మృదువుగా రుచిగా నుండును, మిక్కిలి క్రొవ్వియుండును; వాతము, శ్లేష్మము జేయును. దీనికి ఖురుగుఖ్ఖ మాంసము చూడుడు.

ఖురాసాని ఓమము:—Hyoscyamus Niger. Eng. Black Henbane seeds. సం* పారశీకయమానీ. హిం* ఖురాసానీ అజవాన్. ఇవి పలచగనుండు చిన్నగింజలు. వీనిని లోపలికిచ్చిన నిద్రదెచ్చును, నొప్పినణచును; ఎగుపుల (Spasms) ను కట్టును. రసముల రోగములను, (Nervous affections) అణచును; విచారపుపిచ్చి పిచ్చి, వెర్రిలో ఉద్రేకము, నిద్రపట్టకపోవడము వీనిని నరముల బలక్షీణత్వమును (Nervous depression) పోగొట్టును; మనస్సును నెమ్మదిపరచును; విరేచనముజేయును; గర్భములోని వాతమును వెడలించును. కడుపునొప్పిని అణచును. దగ్గును, వగర్పుగల దగ్గు (bronchitis) ను, ఉబ్బసపుదగ్గు (asthma) ను గొంతుకలో శ్లేష్మముగల దగ్గును, సంధిని (delirium) పోగొట్టును; ఉబ్బురోగమును నివృత్తించును; శిశ్నము, మూత్రముసంచి (bladder), గుదము, మూత్రద్వారము, యోని వీనిలో నొప్పి, మంట తాపము వీనిని శమింపజేయును; నరముల నొప్పులు (Neuralgia), వాతమే హావాతపునొప్పులు, మిక్కిలి బాధతోకూడిన గవదలవాపు (Glandular swelling) మిక్కిలి పోటుగల వ్రణములు వీనికి పట్టువేసిన నొప్పి శమించును; నేత్రరోగములకు వీనిరసము కండ్లలో వేసిన నయమగును. వీనిని నూరి కండ్లచుట్టూ పట్టువేసిన నొప్పి నణచును. నిద్రదెచ్చుటకు, ఈవిత్తులచూర్ణము, లేక నీళ్ళతోనూరి తీసినరసము (Extract) అరకు (Tincture) వాడుదురు. విత్తుల మోతాదు చిన్నమెత్తు మొదలు 3 చిన్నముల యెత్తువరకు. సారముయొక్క మోతాదు 5 మొదలు 10 గోధుమగింజల యెత్తువరకు. అరకుయొక్క మోతాదు 5 మొదలు 20 చుక్కలవరకు. వీనిని స్త్రీలకు,

బిడ్డలకు కూడ నియ్యవచ్చును. మోతాదెక్కువైన విషతుల్య మగును. దీనిని అమితపు మోతాదుగ పుచ్చుకొనడము సంభవించు నట్లు కనుపించినయెడల ముందు వాంతులగుటకు ఆవెనుక విరేచనము లగుటకు సాధనములుచేసి కాఫీ త్రాగించిన విషము నివృత్తించును.

కరింజ చెట్టు:— Asclepias Vomitoria, A. Asthmatica. Eng. Vomiting Swallow wort. సం॥ మూలినీ. హిం॥ జంగ్లిపిక్వాన్. దీని వేరు చేదుగా, వెగటుగా నుండును; శ్లేష్మమును వెడలించును; బిడ్డల గొంతుకలో కఫముపట్టినప్పుడు దీని తేలిక కషాయ మిచ్చిన, వమనమై కఫము పడిపోవును. మోతాదు 2 మొదలు 4 తులములవరకు.

కురివింజ చెట్టు:— Ehretia Buxifolia. దీనిని కురువింద చెట్టనియు వాడుదురు దీని వేరు తియ్యగను, కారముగ నుండును; వ్రణములు, సుఖవ్యాధులు గలవారికి దేహతత్వమును మార్చి క్షేమపరచును. దీని కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములవరకు. కొన్నిదినములు పుచ్చుకొనవలెను. దీని పుష్పములు వాతమును, రక్తపైత్యమును పోనణచును.

కురు వేరు:—Lavendula Carnasa. సం॥ హ్రీబేర, బాలకం. హిం॥ వాల్యగంధవాల. యీ వేళ్ళు సన్నగా నల్లగా తలవెంట్రుకవలె, సువాసన గలిగియుండును. దీని చూర్ణము లేక కషాయము చేదుగ, కొద్దితీపిగ నుండును; చలవజేయును; పైత్యశ్లేష్మములు, విసర్పి, కఫము, రక్తస్రావము, రక్తపైత్యము, దురద, కుష్ఠు మొదలగు చర్మరోగములు, జ్వరము, తాపజ్వరము, తాపము, భ్రమ, వాతము, మేహము, ప్రమేహము, అతిసారము, హృద్రోగము, అరుచి, చర్ది, దప్పి వీనిని జయించును. వీర్యపుష్టిజేయును. దీని యీకురసములో పటికిపంచదార గలిపి చప్పరించుచుండిన, పూత, పిరుపులను గొంతుకలో నివృత్తించును చూర్ణపుమోతాదు పూటకు

8 మొదలు 5 చిన్న మెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 6 తులములమెత్తువరకు.

కుసువేరువిసనకఱ్ఱ:— Fan of do. దీనిగాలి చల్లగ, హితవుగ, సుగంధముగ నుండును. పైత్యమును గొట్టును. వీర్యవృద్ధిని, కాంతిని యిచ్చును.

కుశదర్భగడ్డి:— Poa Cynosuraides, Andropogon Nurdaides (sacrificial grass.) సం* కుశ, దర్భ, యజ్ఞభూషణ. హిం* కుస్, ఢాభ్: దీని కషాయము, లేక చూర్ణము, మూత్రకృచ్ఛ్రము, అశ్మరి, విదాహము, పైత్యము, పొత్తికడుపులోని రోగము, కఫరోగములు వీనిని హరించును. కషాయపు మోతాదు పూటకు 8 మొదలు 6 తులములు మెత్తువరకు. చూర్ణపు మోతాదు పూటకు 8 మొదలు 6 చిన్నముల మెత్తువరకు.

కుసుంబా చెట్టు:— Carthamus Tinctorius. Eng. Bastard Saffron. సం* కుసుంభ, గ్రామ్య కుంకుమ, వహ్నిశిఖ. హిం* కసూమ్, కుసుమ. ఇదియు పెద్దవృక్షము. దీనిని కుసుమచెట్టని యందురు. దీని విత్తులనుండి తీసిన తైలము మర్దనచేసిన, పక్షవాతము, వాతనొప్పులు, పక్షవాతము నివారణమగును; దుష్టవ్రణములకు పూసిన నవి మానును; మేఢ్రమునకు పూసిన వీర్యస్తంభన జేయును; దీనిని లోపలికి పుచ్చుకొనిన వేడిజేయును; అగ్నిమాంద్యము, కఫపైత్యములు వీనిని కలుగజేయును. దీనికి విరుగుడు కలిసీళ్ళు. దీని విత్తనములను నీళ్ళతో నూరికట్టిన గడ్డలు హరించును. నీళ్ళుగలిపిన తేనెతోనూరి తీసినరసము ఇచ్చిన విరేచనములగును; ఋతురక్తమును జారీచేయును; దీని యెండించిన పువ్వులు వరహాయెత్తు తినిన త్రిదోషములను హరించును. విరేచనము జేయును. దీని పువ్వునూరి తలకు పట్టించిన, లేక నూనెలో

వేసి కాచి ఆనూనె తలకు రాచుకొనుచుండిన వెంట్రుకల్ల నల్లబడ జేయును. కామిల నివృత్తించును. దీని పువ్వులతో బట్టలకు రంగు వేయుదురు.

కుక్కతులసి :—Ocimum Album. Eng. White basil. సం॥ విశ్వతులసి. దీని ఆకు సువాసనగ నుండును. దీని ఆకు రసము బిడ్డల కిచ్చిన దగ్గులు, వగర్పు, శ్లేష్మమును హరించును. మోతాదు పూటకు 60 మొదలు 120 చుక్కలవరకు. దీని సమూల కషాయము శీత పైత్యజ్వరమును, పైత్యజ్వరమును, క్రిమిని పోగొట్టును. పొట్టకు బలముజేయును. మోతాదు పూటకు 3-4 తులముల మొత్తు. దీని పచ్చిఆకు నూరి దేహమునకు పూసిన చిడుము, గజ్జి మొదలగు చర్మరోగములు నివృత్తించును. దీని ఆకు ఎండించి తేయాకు బదులుగ నుపయోగించవచ్చును.

కూటిసారాయి :— Liquor prepared from boiled rice. అనగా వండిన అన్నమును పులవబెట్టి తీసిన సారాయి. ఇది వేడి, పైత్యము చేయును. శ్రమను అలసటను పోగొట్టును. రుచి బుట్టించును. జఠర దీప్తినిచ్చును. కడుపునొప్పి, శూల, అజీర్ణమును పోగొట్టును. ఆకలి బుట్టించును.

కూటివడియములు :— Dried cakes made of boiled rice. అన్నములో నువ్వులు మొదలగు సంబారములను చేర్చి చేసిన వడియములు రుచిగా నుండును; దేహపుష్టి నిచ్చును; వాతమును హరించును.

కూడనినీరు:—పానయోగ్యము కాని నీరు చూడుడు.

కూతురు బుడమ:—Bryonia Scabra. సం॥ క్షారివాలుక, ఏలావాలుక. హిం॥ ఏలువ, ఏలావాలుక. దీనిని నూగుదోసయనియు ముసి ముసి చెట్టనియందురు. దీని సమూలరసము మేహశాంతి

జేయును; రక్తపైత్యము, రక్తవమనము, భ్రమ, కుష్ఠు, ప్రమేహము, విష్రవణము, పాము విషమువలన పుట్టెడు పుండ్లు, సర్పవిషము, దురద, దాహము, హృద్రోగము, కార్శ్యము, అగ్నిమాంద్యము, క్షయ, శ్లేష్మకాసలు, క్రిములు, మూత్రరోగము, జ్వరము, పైత్య రోగములు, అరుచి వీనిని జయించును; వీర్యపుష్టి జేయును; పొట్టకు బలమిచ్చును; విరేచనకారి. ఈరసము సుమారు 5 తులములు, మేక పాలు 5 తు। కలిపి వుదయపుపూటలను పుచ్చుకొనిన క్షయను పోగొట్టును; దేహపుష్టినిచ్చును. దీని పచ్చియాకును కూరవండి పుచ్చుకొనినను, చారులోవేసి కాచి ఆ చారు పుచ్చుకొనినను, పైత్యశాంతి, మేహశాంతి చేసి సౌఖ్యమిచ్చును. విరేచనము గావించును. రసముయొక్క మోతాదు 2కు మొదలు 5 తులముల యెత్తువరకు.

కూరతోవండిన అన్నము :—**Rice boield with garden herbs.** ఆకు కూరతో వండినది రుచిగా, ఆకు యేగుణముగలదో అన్నమదే గుణము గలదిగా నుండును. బలము, ఆరోగ్యము నిచ్చును.

కూరాటి మేడిద:—పులిగడుగు చూడుడు.

కెంపు భస్మము:—**Calx of Rubies.** పైత్యము జేయును; మేహము, వాతము, శ్వాస, కఫము, వాతక్షయ వీనిని హరించును; వీర్యపుష్టి జేయును.

కెరసనాయిలు:—**Kerosine oil.** ఈ నూనె, నువ్వులనూనెతో సమ భాగముగ కలిపి పూసిన, చర్మరోగములు, గజ్జి, సురుగుడు, తల మీది పొక్కులు, బొబ్బలు మానును. దినమునకు రెండుమార్లు రాయవలెను. ఈనూనెను మర్దనచేసిన వాతమేహవాతనొప్పులు, ఇరుసునొప్పులు హరించును.

కేబేజికూర:—కాబేజికూర చూడుడు.

కేరటుదుంప:—(Carrot) గాదరగడ్డలు చూడుడు.

ఖైరసారము:—కవిరి చూడుడు.

కొంకిపిసినిచెట్టు:—A thorny creeper. ఇది డొంకగా తీగె ప్రాకెడు ముళ్ళచెట్టు. దీని ఆకురసము లేక కషాయము కాక జేయును; శ్లేష్మవాతము, ఉబ్బు, గుల్మము, పాండురోగము వీనిని హరించును. మోతాదు పూటకు 2-3 తులములయెత్తు దీని ఆకు కూరకు పైసుగుణములు గలిగియుండును.

కొంగ:—Crane. దీని మాంసము చలవజేయును, క్రిమిని గొట్టును; దేహకాంతినిచ్చును. పొత్తికడుపును శుభ్రపరచును. తెల్లకొంగ రెట్ట చనుపాలతో గలిపి చెవిలో వేసిన చెముడు మానును; దిబ్బళ్ళు మానును.

కొండఅరటిపండు:—అడవి అరటి చూడుడు.

కొండకాంచనపు పిట్ట:—A small bird-flesh of. దీని మాంసము అగ్నిదీప్తినిచ్చును. జీర్ణము గావించును. సుస్వరమిచ్చును. తేలికగా నుండును. కంఠమును శుభ్రపరచును.

కొండకసివింద:—Toddalia Aculeata. T. Asiatica. సం॥ మూలహం. హిం॥ జఙ్గ్లీకాలీమిర్చి. ఇది చిన్న ఆకులు ముండ్లుగల చెట్టు. దీనిని ములు కసివిందయందురు. దీని వేరు పసుపుపచ్చగా నుండును. దీనిని మానుపసుపని కొందరందురుగాని కాదు. దీనినిజిట్టవరగోగని తూర్పు దేశస్థులందురు. దీని వేరు ఆకు వీనిరసము లేక కషాయము వాతమును, జ్వరమును; దోషజ్వరము, సన్నిపాతము సూతికావాతము హరించును. పైత్యము, కాక జేయును. పొట్టకు బలముజేయును. దీని అన్ని భాగములు జ్వరమును హరించును. దీని వేరుచెక్క కషాయము మన్యపుజ్వరము, విడువని జ్వరమును పోగొట్టును; దీని వేరు కారముగ నుండును, దీపనము (Stimulant) గలిగించును,

బలముచేయును. పొట్టలోని వాతమును వెడలించును. విరేచనము జేయును. దీనివేరు పాలతోనూరిన ముద్ద ½ తు॥ ఆవుపాలతో 3 వుదయపుపూటలు పుచ్చుకొనిన ఋతుశూల నివారణమై సంతోషము కలుగును. దీనివేరు. పచ్చికాయలు వేసి కాచిన నూనెతో మర్దనచేసిన వాతపునొప్పులు హరించును. దీని ఆకు నిజరసముదీసి ఆవువెన్న, గోరోజనము కొద్దిగా గలిపి రాగిపాత్రలో రాగిచెంబుతో మర్దనచేసి పక్షవాతమువలన మూతి వంకరపోయి కాలుచెయ్యి పట్టు లేకపోయినదానికి మర్దనచేసిన నరములకు బలమును కలుగజేసి నయమగును. దీనిరసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు; కషాయపు మోతాదు 2½ మొదలు 4 తులములయెత్తువరకు నియ్యనగును.

కొండకాలువనీరు:—సెలయేటి నీరు చూడుడు.

కొండగొర్రె :— Hill sheep-flesh of. దీని మాంసము కాకజేయును; వాతము, రక్తపైత్యము, జ్వరము, శ్వాస, కాస, పీనస, విషజ్వరము, ఎక్కిళ్ళు, అరుచి వీనిని హరించును.

కొండగోగు :— Barleria Ciliata, Hibiscus Cannabinus. సం॥ కింకిరాత, పీతభద్రక, హిం॥ పీలు. కింకిరాట్. దీని వేరు లేక ఆకు రసము, లేక కషాయము వాపు, శ్లేష్మము, రక్తదోషము, వ్రణము, కుష్ఠు వీనిని హరించును; విరేచనకారి. ఉబ్బు రోగములకు పైత్యకారి. కషాయముయొక్క మోతాదు పూటకు 3-4 తులములయెత్తు, రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు.

కొండచీపురుగడ్డి:—Hill broom grass. దీని వేళ్ళరసము లేక కషాయము కాసరోగము, హృద్రోగము, వీనిని శమింప జేయును, విషూచి, అజీర్ణము, శూల, మేహవాతము వీనిని హరించును; రసపు మోతాదు 2-3 తు॥యెత్తు, కషాయపు మోతాదు 3-4 తు॥యెత్తు.

కొండమామిడికాయ:—Mangifera Sylvatica. Eng. Hill mango green fruit. సం॥ కోశామ్రము. చేదు, వగరు, పులుపు రుచులుగలది. వీర్యమునకు వేడిజేయును. కుష్ఠు. విసర్పి,అతిసారము,ఉబ్బు. వాతము వీనిని హరించును. కఫపైత్యములను జేయును. రుచి బుట్టించును.

కొండవంకాయ:—Hill brinjal. రుచిగ నుండును. చలవజేయును. తాపము, రక్తపైత్యము, త్రిదోషములు, శోష, రసదోషము వీనిని హరించును. మాంద్యము జేయును. మూత్రమును అడ్డగించును; లేతకాయలయం దింత దోషముండదు. దేహపుష్టి, బలము నిచ్చును. దీనికి విరుగుళ్ళు వంకాయ చూడుడు.

కొండయూటనీరు:—Water standing in a valley. అనగా కొండ లోయలలో నుండెడి నీరు. చిక్కగను, దుర్గంధము గలిగియుండును. అజీర్ణము జేయును. బద్ధకమును, దేహభారమును, జ్వరమును దెచ్చును. కడుపులో బల్లలు పెరుగును. అనారోగ్యకరమైనది. గాని అవసరమైనయెడల పసుపువేసి కాచి వడపోసి యుపయోగించుట మంచిది. దీనికి విరుగుళ్ళు ఉదకము చూడుడు.

కొడిశచెట్టు:—A large tree used for rafters. దీని ఆకుకూర శాక జేయును. విరేచనకారి వాతమును హరించును. దీని ఆకును పులుసు పెట్టి వండుదురు. దీనిపువ్వు త్రిదోషహరమైనది. జఠరదీప్తినిచ్చును.

కొడిశ పాలచెట్టు, దీని విత్తులు:—Echites Antidysentricum A. Holarrhena. Eng. Kurchi. సం॥ ఇంద్రయవ, కుటజ, హిం॥ కుర్చి, శాకేయా. దీనిని పాలకొడిశచెట్టనియు, పెద్ద అంకుడుచెట్ట నియు నందురు. దీనిలో తీపికొడిపాలకూడా గలదు. దీని మ్రాను చెక్క చేదుగ, వగరుగ నుండును. దీని కషాయము త్రిదోషహార మైనది. అగ్నిదీప్తి నిచ్చును. బలముజేయును. దీని విత్తులు అతిసా రము,గ్రహణి,పురాణరక్తగ్రహణి, నీళ్ళవిరేచనములు, రక్తముపడు లేక రక్తముపడని మూలవ్యాధులు, శూల, కఫము, వాత మేహ

వాతపు నొప్పులు,ఆమశూల, జ్వరము వీనిని హరించును.కషాయపు సాధారణపు మోయదు 2½ మొదలు 5 తులములయెత్తు. రక్తవిరే చనములకు కొద్దిగ నల్లమందుతో నీకషాయమును 5 తులములయెత్తు మోతాదులను ప్రతి 2-3 గంటలకొకసారి యిచ్చిన కట్టును. గాని ప్రేగులలో పుండయిన రక్తగ్రహణికి ప్రారంభమున దీని నియ్యకూడదు. రక్తముపడు మూలవ్యాధికి కషాయము 3 తులములయెత్తు చొప్పునగాని దీని సారము (fluid extract) 10 మొదలు 20 చుక్కలచొప్పునగాని దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని పాలు గాయముల మాన్పును. దీని విత్తులు కోలగ, చేదుగ, వగరుగనుండును. రక్తగ్రహణి, మూలవ్యాధి మొదలగు పైనస్రావిత వ్యాధులను పోగొట్టును. వీని చూర్ణముగాని, కషాయముగాని, ప్రయోగింపనగును. వీనికషాయము దారుణజ్వరమును, ఆమవాతమును, (gout) ను హరించును. వీనిని వెచ్చజేచేసిసిన తేలిక కషాయము మరిడిజాడ్యము (cholera) లో కనుపించెడు కడుపు నొప్పి, వికారములను, ఇతర విరేచన జాడ్యములను పోగొట్టును. చూర్ణపు మోతాదు పెద్దవారికి 10 మొదలు 20 గోధుమగింజల యెత్తుచొప్పున, బిడ్డలకు 1 మొదలు 2 గోధుమ గింజల యెత్తుచొప్పున దినమునకు మూడుసార్లు ఇయ్యవలెను. దేహము శుష్కించడము, అతినీరసము గలవారికి పూటకు 4-5 గోధుమగింజల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. కషాయము, తేలిక కషాయము వీనిమోతాదులను, చెక్కకషాయపు మోతాదులవలెనే యియ్యనగును. చెక్క (పట్ట) కషాయముచేయుటకు పచ్చి(fresh) చెక్కలో కషాయముగాచి యిచ్చిన బలముగ పనిచేయును. దీని ఆకు నమలిన పన్నునొప్పి మానును. దీనియాకులలో భేదనము:— అగ్నిదీప్తినిచ్చును, పైత్యము, మలబద్ధము చేయును. కుష్ఠు, గుద

రోగము, గళరోగము, వాతము, క్రిమి వీనిని హరించును. దీనికాయ కూర:— లేతకాయకూర వేడిచేయును. లఘువుగ నుండును. మల బద్ధముగావించును. శ్లేష్మము, వాతము, క్రిమి, గుల్మము, గ్రహణి, మూలవ్యాధి, శూల వీనిని హరించును. పథ్యమైనది.

కోణామణియను ధాన్యము:— (A sort of paddy) భోజనమునకు అనుకూలమైన ధాన్యము. జబ్బుచేయనిది, బలము, పుష్టి నిచ్చును. బలమైన పనులు చేయువారికి అనుకూలముగ నుండును. మరియు ధాన్యములు చూడుడు.

కొత్తిమిరి:— Coriandrum Sativum. Eng. Coriander plants. సం* ధన్యాకశాఖ హిం* కొథిమీరి. అనగా ధనియాల మొక్కల ఆకు. సువాసనగ, స్వాదుగ నుండును. రుచి బుట్టించును. త్రిదోష హరమైనది. విదాహము, భ్రమ, శ్రమ, రక్తపైత్యము వీనిని పోగొట్టును. జీర్ణముచేయును. మేహశాంతి, పైత్యశాంతిచేయును. శ్లేష్మమును, వాతమును అణచును. విరేచనముచేయును. మిక్కిలి జఠరపుష్టినిచ్చును. మూత్రముగావించును. జ్వరము నణచును. నిద్ర దెచ్చును. మెదడులోనుండెడి వేడి నణచును. వ్రణములను, గడ్డలను మాన్పును. దీని ఆకు నూరినముద్ద 6 అణాలు మొదలు 8 అణాల వరకూ లోపలికి పుచ్చుకొనిన నిద్రవచ్చును, పొట్టలోనుండు వాతము శిరస్సున కెక్కనియ్యదు. సిరకాతో తినిన యెక్కువ గుణమిచ్చును. దీనిరసము చనుబాలలోగలిపి కండ్లలో వేసినను లేదా దీని ఆకు వెచ్చజేసి కండ్లకువేసి కట్టినను అనేక నేత్రరోగములు మానును. దీనికషాయము పుక్కిలించిన నోటిపూత, పంటినొప్పి నిమ్మళించును. 6 మొ॥ 8 అణాలయెత్తు కషాయములో కొద్దిగ శర్కరవేసి కలుపుకొని త్రాగిన ఆకలిపుట్టును. పచ్చి యాకు తినిన పైత్యమును, కడుపులో మంటను, దాహమును, వికారము నణచును. దీనిని కూరలలోను,

చారులోను, పులుసులోను వేసుకొనిన సువాసనగా ఆరోగ్యముగా నుండును. దీనిని చింతపండు వేసి పచ్చడి చేసుకతినిన, అన్నములో కలుపుకుని తినిన చాలా రుచిగా, ఆరోగ్యముగా నుండును.

కొబ్బరికల్లు:- Cocos Nucifera-toddy of. Eng. Cocoanut-Toddy. ఇది చిక్కగా రుచిగా నుండును; చలువ, మేహశాంతి జేయును. జఠరదీప్తి, వీర్యపుష్టి, బలము వీనినిచ్చును. గ్రహణిరోగ మును పోగొట్టును. మూత్రము గావించును విరేచనము జేయును. తియ్యని కొబ్బరికల్లు మిక్కిలి తాజాపరచును. ( refreshing ) స్త్రీలు గర్భవతులుగా నున్నప్పుడు వారమునకు 2-3 మార్లు పుచ్చు కొనుచుండిన తల్లిదండ్రులు నల్లనివారయినను కలిగెడు బిడ్డలు తెల్ల రంగుగల వారుగ పుట్టుదురు.

కొబ్బరికాయ:— Cocos Nucifera-fruit of. Eng. Cocoanut-fresh kernel of. సం॥ నారికేళ. హిం॥ నారియల్. పచ్చి కొబ్బరి కాకజేసి అర్చును. చమురుగలిగి రుచిగానుండును. వాత మును హరించును. వీర్యవృద్ధి జేయును; శ్రమను బోగొట్టును; శోష వణచును. ఎండదెబ్బవలన గలిగిన త్రిప్పును హరించును పచ్చి కొబ్బరి, ఎండుకొబ్బరికంటె మంచిది. సహజమయిన దేహపుకాకకు బలమిచ్చును. దేహపుష్టి జేయును; శరీరమున మంచి ద్రవముల బుట్టించును; నోటికి సుగంధము దెచ్చును; ముంతిగుండె (heart ) యొక్క నీరసమును; మూలవ్యాధిని పోగొట్టును; కడుపులోనయ్యేడు వ్రణమును మాన్పును, గురదాలకు (kidneys) వేడిజేయును; నర ములకు సత్తువజేయును; మూత్రము గావించును; మూత్రపుసంచి (bladder) లోని వాతమును; నొప్పిని హరించును; పంచదారతో తినిన మంచి రక్తమును బుట్టించును; కొబ్బరికోరు (scrapings) కట్టిన గుదస్థానమందయ్యేడు రసికారుపొక్కులు నయమగును.

కొబ్బరికోరులో పసుపుగుండ గలిపి బుడ్డకు కట్టుకట్టిన దానివాపును, నొప్పిని హరించును. పచ్చికొబ్బరి అధికముగ తినిన సుద్దపుట్టును. ఆలశ్యముగ జీర్ణమగును. గుండెలకు జబ్బుచేయును. గుర్వాతము, పైత్యము, శ్లేష్మము జేయును. దగ్గుదెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 బియ్యము, 2 కడుగు, 3 పంచదార, 4 సముద్రపు నురుగు, 5 నిమ్మకాయ, 6 తర్బూజాపండు.

కొబ్బరికాయలేతది:—Tender Cocoanut. రుచిగా నుండును. వీర్య పుష్టి, మేహశాంతి జేయును. పైత్యము నణచును. శ్లేష్మము జేయును. దీనికి విరుగుళ్ళు కొబ్బరికాయ చూడుడు.

కొబ్బరికాయనీళ్ళు:-Cocoanut water. స్వాదుగా మనోహరముగా నుండును. చలవజేయును; తేలికగనుండును; దాహమణచును; జఠర దీప్తి నిచ్చును, పొత్తికడుపును శుభ్రపరచును. వీర్యవృద్ధి, బలము జేయును. మూత్రముగావించును. తరుణజ్వరము, పైత్యము, క్రిమి రోగము వీనిని హరించును. స్త్రీ సంభోగమువలన గలిగిన ఆయాస మును బోగొట్టును. స్త్రీలకు ఋతువును బుట్టించును. అనేకరోగము లను శాంతింపజేయును. మరియు క్షయరోగులకును, ఉపవాసమున్న ప్పుడును, మార్గాయాసమందును, ప్రసంగము మొదలగువానియం దమితసంభాషణ చేసినప్పుడును, ఎండకాక చేత స్మాక్కియున్నప్పుడును, దేహాయాసమునొంది యున్నప్పుడును, వ్యాయామముచేత నలసి యున్నప్పుడును, పొలమారినప్పుడును, నారికేళోదకము మిక్కిలి అనుకూలముగ నుండును. లేతకాయనీళ్ళు వాంతిని కట్టును; పైత్య ముల నణచును. విరేచనము జేయును. క్రిమిని బోగొట్టును. కొంచెము ముదిరినకాయనీళ్ళు కఫము జేయును. వీర్యవృద్ధి జేయును. క్రిమిని జంపును. బలముజేయును. మేహము నణచును. మిక్కిలి ముదిరిన కాయనీళ్ళు శ్లేష్మమును, దగ్గును దెచ్చును. జలుబుజేయును. దీనికి

విరుగుళ్ళు 1 బెల్లం, 2 తేనెగలిపిన పిప్పళ్ళచూర్ణము, 3 వేడిచేయు ఔషధములు.

కొబ్బరికాయనీళ్ళు పుచ్చుకొనకూడనివారు:—Those who should not drink Cocoanut water. అతిసారము, గ్రహణి, అగ్నిమాంద్యము, పాండువు, ఉబ్బురోగము, వాతము, జ్వరము, కడుపుబ్బు, అజీర్ణము, శ్వాసకాసలు ఈరోగములు గలవారు కొబ్బరికాయనీళ్ళు పుచ్చుకొనగూడదు. మరియు ఉదయమున,పరగడుపున, రాత్రివేళ, కడుపు నిండియుండునపుడు, అమితముగను కొబ్బరికాయ నీళ్ళు పుచ్చుకొనగూడదు.

కొబ్బరికురిడీ:—Dried kernel of a cocoanut. ఎండు కొబ్బరి చమురుగలిగి రుచిగానుండును. పొత్తికడుపును శుభ్రపరచును.వాతమును గొట్టును. దేహపుష్టినిచ్చును, శరీరతత్వమును మార్చును. వీర్యపుష్టినిచ్చును. నాలుకపూతను బోగొట్టును. క్షయరోగమును హరించును. పైత్యము, గురుత్వము జేయును. దీని కొద్దిముక్కను తాంబూలముతో వేసికొనిన ఆరోగ్యముగ నుండుటయేగాక గారపట్టనివ్వదు. దీనికి విరుగుడు బియ్యము.

కొబ్బరిచెట్టు:— Cocos Nucifera. Eng. Cocoanut tree. సం॥ నారికేళ, నీలతరు, విశ్వామిత్రప్రియ. హిం॥ నారియాల్. దీనికాయ డొక్క అనగా పెచ్చులేక పీచుయొక్క పొట్టు (husk of the fruit) లోపలికిచ్చిన నాడాపాము (tape worm) ను చంపును. పచ్చికాయ డొక్కరసము ఇచ్చిన పుల్లత్రేనుపులు (acidity) అతిత్రేనుపులు (gastric irritation) కట్టును. కొబ్బరిచిప్పలు కాల్చి తీసిన చమురుపూసిన తామర, దద్దురు, పల్లికలు, గజ్జి, చిడుము, దంతరోగములు నివృత్తించును. పేలు చచ్చును. దీనినీడ త్రిదోషశమనమయినది. తేలికనిచ్చును. చల్లగ, మనోహరముగ నుండును.

దీనియాకు విసనకఱ్ఱ మహోపకారముగ నుండును. శ్రమ, చెమట వీనినణచును. దీనియాకులో భోజనము సౌఖ్యముగ నుండును. అనేక దోషములను పోగొట్టును.

కొబ్బరిచెట్టు పువ్వు:—ఖర్జూరపుపువ్వు చూడుడు.

కొబ్బరిదూది:—Cocoanut cotton. ఇది లేతఆకు అనగా మొవ్వ లోని ఆకును అంటియుండును, దీనిని గాయములకు, జలగకాటుకు అంటించిన వెంటనే రక్తముకారకుండ కట్టును; గాయమును వేగ ముగ మాన్పును.

కొబ్బరినూనె:—Cocoanut Oil. దీనిని కొబ్బరినెయ్యి అనియు నం దురు. రుచిగానుండును. పైత్యవాతముల హరించును. దేహపుష్టిని బలమును ఇచ్చును. దంతరోగమును, క్షయరోగమును పోగొట్టును. మెదడుకు మేలుచేయును. ఒంటికిపూసిన కంతుకంతులుగా లేచెడి చర్మరోగమును నివృత్తించును. తలకుబూసిన వెంట్రుకలకుబలము జేయును. మృదుత్వమిచ్చును. వెంట్రుకల నెదుగజేయును, నలు పెక్కజేయును; పుండును మాన్పును. మేహకారక శరీరులు దీనితో తల యంటుకొనిన చాల మేలుజేయును. పచ్చికొబ్బరిలోనుండి తీసిన నూనె లోపలికిచ్చిన దేహస్థితిని బాగుజేయును. దేహకార్శ్యము, క్షయరోగము మొదలగు వానికి చేపనూనెకు (Codliver Oil.)బదు లుగ వాడతగియుండును. మోతాదు 20 మొదలు 30 చుక్కలచొ ప్పున ప్రారంభించి 60 చుక్కలవరకు హెచ్చించి ఆ ప్రకారము దినమునకు 3 సార్లు ఇయ్యవలెను.

కొబ్బరిపాలు:—Cocoanut Milk. పైత్యముశీఘ్రజేయును.రుచిగా, గురు త్వముగా నుండును. ఎక్కిళ్ళు, కఫశూలలు, వాతగుల్మలు, కాస, శ్వాసలు, దంతరోగములు, నోటిదుర్గంధము వీనిని పోగొట్టును. విదాహము పుట్టించును. వీర్యపుష్టి జేయును. తాపాపరచును.అలసట

తీర్చును (refrigerant). దేహపుష్టి, బలము జేయును. విషూ చికా జాడ్యము (cholera) లోని వాంతిని కట్టును. పైత్యజ్వరములోని వాంతినికూడ కట్టును. లేతకొబ్బరికాయపాలు వృద్ధులకిచ్చిన మూత్రమును పలచనచేయును.

కొబ్బరి పిట్టు:— Rice flour & scraping of cocoanut boiled in steam. అనగా కొబ్బరికోరును వరిపిండిలో కలిపి వాసెనమీద వండినది రుచిగా, మనోహరముగా నుండును. దేహపుష్టిని, వీర్యపుష్టిని యిచ్చును. వాతము, గురుత్వము జేయును. దీనికి విరుగుడు కడుగు.

కొబ్బరి పువ్వు:— Excrescence in a sprouting Cocoanut. అనగా మొక్క మొలచిన కొబ్బరికాయలోనిగుంజు. రుచిగ, మధురముగానుండును. చలువ జేయును. రక్తపైత్యము, మేహము వీని నణచును. శ్లేష్మము జేయును. దీనికి విరుగుళ్ళు 1. తేనె, 2 శర్కర.

కొబ్బరిసారాయి:—Calombo or cocoanut liquor. మత్తుజేయును. ద్వంద్వరోగములను, శిరోరోగములను, పిచ్చిని మాన్పును. పుంస్త్వమును హెచ్చించును. హృదయమునకు బలమిచ్చును.

కొబ్బరిసిరకా:—Cocoanut vinegar. కొబ్బరికల్లుతో చేసినది కడుపులో పురుగులను జంపును. కడుపును శుభ్రపరచును. జీర్ణశక్తి నిచ్చును కల్లుపులుసు గుణములు అన్నియు దీనికి గలిగియుండును. కల్లుపులుసు చూడుడు.

కొమ్మరటిపండ్లు:—యివి ఎర్రగా పొడవుగానుండును. అరటిపండు సామాన్యగుణము చూడుడు.

కొమ్ముపెసలు :— A sort of green gram. రుచిగ నుండును. పైత్యమును గొట్టును. బలము, వీర్యవృద్ధి జేయును.

కొయ్యంగచేప:—A sort of fish. చమురు గలిగి రుచిగ నుండును.

శాక, పైత్యము జేయును. బలమిచ్చును. వాతము నణచును. పథ్యమైనది.

కొయ్యతోటకూర:—Amaranthus Tristis. సం॥ రక్తనాళ. దీని కూర శాక జేయును; వాతరోగులకు మిక్కిలి పథ్యముగ నుండును; దీనిని మెంతికూరతో కలిపి మాంసాదులలోగాని కంది, శనగ పెసర యరా పప్పు వేసి వండిగాని పుచ్చుకొనిన మిక్కిలి రుచిగ, ఆరోగ్యముగ త్రిదోషహరముగ పథ్యకరముగ నుండును. పైత్యమును హెచ్చించును. హృదయమునకు జబ్బు జేయును. కొంచము గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 పులుసు, 2 ఆవ, 3 పచ్చిమిరప కాయలు.

కొర్రఅన్నము దీని జావ:— Italian millet-boiled rice of- and gruel. వగరుగ, గరుకుగ నుండును. శాక జేయును. జఠర పుష్టి, దేహపాపు శాక నిచ్చును. కఫమును హరించును. ధాతువులను శోషింపజేయును. పైత్యము జేయును. దీనికి విరుగుడు మజ్జిగ. సన్నిపాతాది రోగములయందును, లంకణములు చేసిన వాళ్ళకును మొదట పథ్యము 1-2 దినములు యీ యన్నముగాని జావగాని నిచ్చిన చాలా మేలు జేయును. దీనిజావ త్రిదోషహరమైనది; వాత పైత్యమును, కఫమును అణచును; తేలిక జేయును; ప్రాణప్రద మైనది; పథ్యమైనది.

కొర్రమీను చేప:—A sort of fish. రుచిగనుండును; త్రిదోషములను శమింప జేయును; లఘువుగ నుండును; వీర్యమునకు వేడి జేయును; జఠరదీప్తినిచ్చును; ఈచేప పథ్యకరమైన చేపలలోనొకటి.

కొర్రలు :— Setaria Italica & Painicum Italicum; Eng. Italian millet. సం॥ కంగుధాన్య, పీతతండుల. హిం॥ కంగ్ని. యివి పసపు, తెలుపు, ఎరుపు, నలుపు రంగులుగల నాల్గుజాతులు

గలవు. దేహపుకాక నిచ్చును; పైత్యము జేయును; విరిగిన అవయవములను అతుకుకొన జేయును; జ్వరమును, కఫము హరించును; జఠరదీప్తి నిచ్చును; రక్తమును వృద్ధిజేయును; శరీరమునకు నడుమునకు బలము జేయును; గురుత్వముగ నుండును, వాతమును బుట్టించును; దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పంచదార, 3 సికంజిబీను.

కొలంబువేరు:—Culumba root. దీనిని దక్షిణదేశమున వాడుదురు. ఇది మిక్కిలి చేదుగనుండును. దీనిని లోపలకు నిచ్చిన బలము జేయును; నీళ్ళవిరేచనముల కట్టును; నీరసమును, మరిడిజాడ్యమును (Cholera), తేయును బోగొట్టును. నరముల వికృతి (Irritability) ని అణచును; జీర్ణశక్తినిచ్చును. చూర్ణపు మోతాదు 15 మొదలు 30 గోధుమగింజల యెత్తువరకు. తేలిక కషాయపు మోతాదు 5-6 తులముల యెత్తు.

కొలను, చెరువు వీనిలో నుండెడు చేపలు:—Fish in ponds or tanks. ఇవి చమురు గలిగి రుచిగా, గురుత్వముగ నుండును. వీర్యవృద్ధిని, బలమునుయిచ్చును. రుచిబుట్టించును. మూత్రము గావించును; శ్లేష్మమును, వాతమును జేయును. దీనికి విరుగుళ్ళు చేపలు చూడుడు.

కొలను నీళ్ళు:—Water of a lake or tank. ఇవి కొంచెము రుచిగా, తేలికగానుండును; దప్పికను బోగొట్టును; బలమునిచ్చును.

కొల్లిగుత్తులు:—కాటుకగింజలు చూడుడు.

కోడిగుడ్లు:—Fowl eggs. కొద్ది దినముల క్రిందట పెట్టినవియు మంచివి. రుచిగనుండును; పైత్యము నణచును; వీర్యపుష్టి, దేహపుష్టి, బలము జేయును; గురుత్వముగ నుండును. కాకరోంపల కనుకూలముగ నుండును; రక్తమును వృద్ధిజేయును. తెల్లసొన బలము, మేహశాంతి, శరీరపుష్టినిచ్చును. ఆరోగ్యకరమైనది. కోడి

గ్రుడ్డుకొట్టి పుచ్చుకొనిన దేహపుష్టి జేయును; హృదయమునకు, బుద్ధికి బలమిచ్చును; క్రొత్తరక్తమును పట్టును. పుంస్త్వమును కలుగ జేయును. అల్లపు రసముతోడను, నీరుల్లిపాయతోడను వండినది శ్లేష్మము. కాగుచుండు నేతిలో గ్రుడ్డులోని చందమామను వైచి సగము ఉడకనిచ్చి దింపి దానిపైన తగుమాత్రము మిరియపు పొడిని, ఉప్పును వేసి పుచ్చుకొనిన, ఇతర విధములుగ పక్వము చేయబడిన దానికంటె శీఘ్రముగ జీర్ణమగును. కాకచేత ముక్కు వెంట నీరు కారడమును కట్టును. ఒంటినుండి రక్తము తీయడము, గాయములవలన రక్తనష్టముకావడము, రక్తస్రావము మొదలగు పురాణస్రావములు ( Chronic discharges ) మొదలగు వాని వలన కలిగిన రక్తహీనత( Anaemia ) గలవారికి, కాయలాపడి లేచిన వారికి, నీరసులకు ఇచ్చిన బలము, రక్తపుష్టిచేయును. రొమ్మునుండి పడెడు రక్తమును కట్టును, పొట్టను మృదువుపరచును; ప్రేగులను, రొమ్మును, మూత్రపుసంచి (Bladder) ని శుభ్రపరచును; ఉలవ కాయల (Kidneys) లోను, మూత్రపుసంచి (Bladder, లోను పుట్టెడు వ్రణములమాన్పును. కంఠధ్వనిని శుభ్రపరచును; మూత్రపు సంచిలోని కంతులను, సుద్దనుతీసి వేయును; పుంస్త్వమును హెచ్చించును; బలము జేయును. పచ్చిచందమామను తినిపించి కరచినచోట కూడ చందమామను వేసిన పాము విషము విరుగును; చందమామ (పచ్చిచొన) ను ఫిరంగిసాంబ్రాణితో నిచ్చిన పురాణపు ఒగర్పుగల దగ్గు (bronchitis) నివారణమగును; కహరూబా, తివాక్షీరితో నిచ్చిన రక్తమూలము, పురాణపు నీళ్ళవిరేచనములుకట్టును మైనపు అరఖు లేక తైలములో పచ్చచొనవేసి అందులో షాజీరాపొడుము గలిపి కాగితముపైనవేసి కొద్దిగ ఆరనిచ్చి దానిని నడుముపైన వేసిన నడుమునొప్పితీయును నిప్పుకాలుపు, వేడినీళ్ళకాలుపుపైన

కోడిగ్రుడ్డుసొన వేసిన మంట నయమగును; పుండు మానును. గుల్లకలను భస్మముచేసి అందులో తేనె గలిపి కంటిలో కాటుకవలె పెట్టిన మసకలు, మబ్బు నివారణమగును. సగముడికిన గ్రుడ్డులోని చంద్రమూమను బిడ్డలకు కామిలావచ్చినప్పుడు పాలకు బదులుగ నియ్య తగియుండును; త్వరగా జీర్ణమగును. అధికముగ ఉడికినది ఆలస్యముగ జీర్ణమగును. అమితముగగాని, ప్రతిదినమునగాని యెల్లప్పుడుగాని కోడిగ్రుడ్లు తినిన గుర్దాల (Kidneys) లో రాళ్లు పుట్టును; శరీరకాంతిని జెరుచును; తెల్లని శోభమచ్చలు పుట్టును. కోడిగ్రుడ్లు సామాన్యముగ వాతము, శ్లేష్మము జేయును; పొట్టకు నష్టము జేయును; ప్రేగులలో వాతమును గ్రహణిని బుట్టించును; కఫమును పెంచును; కడుపునొప్పి తెచ్చును; కడుపులో నీరు అధికముగ నుండువారికి జబ్బుజేయును. దీనికి విరుగుళ్ళు 1 మిరపకాయలు, 2 దాల్చినచెక్క, 3 ఉష్ణశరీరులకు పుల్లకలి, 4 వాతశరీరులకు కలకండ, 5 సిరకా, 6 వేడిఔషధములు. మోతాదు 1 మొదలు 3 గ్రుడ్ల వరకు. అడవికోడిగ్రుడ్లకు ఊరకోడిగ్రుడ్ల గుణములు గలిగియుండును గాని నూరకోడిగ్రుడ్లకంటె అడవికోడిగ్రుడ్లు శ్రేష్ఠము.

**కోడిజెల్ల అనుచేప:—A sort of fish.** వాతపైత్యములను గొట్టును; రుచిబుట్టించును; శరీరమునకు వేడిజేసి జఠరదీప్తినిచ్చును; పథ్యమైనది.

**కోడిజుట్టుచెట్టు:**—చించలము చూడుడు.

**కోడిపుంజుమాంసము:—Flesh of a cock.** కూతపట్టకుండ నుండెడు ఈడుగల పుంజుమాంసము మంచియాహారము. శుభ్రమైనరక్తమును బుట్టించును; వాతరోగమును; కడుపునొప్పిని బోగొట్టును; సమశీతోష్ణముగానుండును. నీరసకులకును, జబ్బుపడి లేచినవారికి అనుకూలముగ నుండును. యౌవనములోనుండు కోడిపుంజు మాంసము అధిక సత్తువ, వీర్యవృద్ధి, దేహకాంతి, బుద్ధిబలము వీని నిచ్చును, తెలివిని విస్తరింప జేయును; ఇంద్రియమును బుట్టించును; పిచ్చి

యూహలను అణచివేయును దీని ఎండుమాంసముగాని, కాల్చిన మాంసముగాని దగ్గుగలవారికి మేలుజేయును; మట్టినితిను వాంఛను పోగొట్టును; వాతతత్వము గలవారికి అనుకూలముగ నుండును. ముదురుపుంజు మాంసము మిక్కిలి కాకజేయును; పైత్యమును హెచ్చించును. కాకతత్వముగలవారికి పార్శ్వపునొప్పిని దెచ్చును; అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు 1 పులుసు, 2 సికింజబీను, 3 సిరకా.

కోడి మాంసము:— Flesh of fowl. బాగుగా వండిన ఆడుకోడి మాంసము చమురుగలిగి రుచిగా, గురుత్వముగా నుండును; వాతశ్లేష్మములను గొట్టును; చెమట బుట్టించును; వీర్యపుష్టి, బలము జేయును, కండ్లకు మంచిది; ఇంద్రియమును బుట్టించును. దేహపుష్టి జేయును; మంచి రక్తమును బుట్టించును; బాగుగ నుడుక కుండిన, ఇందుకు వ్యతిరేకములగు పనులుజేయును; మిక్కిలి ముసలికోడిమాంసము, కడుపును మృదువు పరచును. కడుపు నొప్పి, శూలను పోగొట్టును. దీనిని చాల నీళ్ళలో ఎక్కువ కాల ముడకనిచ్చి ఆ నీళ్ళు తీసుకొని ఆనీళ్ళలో రసవర్గములు గలిపి, పోగిచి పుచ్చుకొనవలెను. కోడి పొరగొట్టని పిల్లలమాంసము, కాయలాపడి నిరసపడ్డవారికిని, విశేషపైత్యమున్న వారికిని, జ్వరమున్న వారికిని మేలుజేయును. సంతాన యోగ్యతను కలుగజేయును. కోడిపిల్ల మాంసము విరేచనముజేయును; ముసలికోడి మాంసము విరేచనబద్ధము జేయును; లేతకోడి అనగా గ్రుడ్లుపెట్టు ఈడురాని కోడి మాంసము మిక్కిలి కాకజేయక దేహపుష్టిని, బలమును ఇచ్చును. నీరసపడినవారికిని, గాయములు తగిలినవారికిని మిక్కిలి పథ్యముగనుండును. ముదురుకోడిమాంసము కాకజేయును. దగ్గును, శ్వాసను హెచ్చించును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 పులుసు, 3 సికింజబీను.

కోతిపాలు:— Milk of monkey. కోతులకు నుండును; కొ చెమ్మలను రోగమును, తాపమును, కాస, శ్వాసలను, ఉన్మాద మును, సన్యాసిరోగ మనగా స్మారకముతప్పి కొయ్యవలె పడి యుండెడి ఒక తరహా మూర్ఛరోగము వీనిని పోగొట్టును.

కోతిమాంసము:—Flesh of do. ఉబ్బు, మూలవ్యాధి, మలమూత్ర బద్ధము, గ్రహణి వీనిని హరించును.

కోదాడికాయ:— Barringtonia Acutangula Engenia A. సం॥ హిజ్జల. హిం॥ సముందర్ ఫల్. హిజ్జల్. యీ కాయలు జాజికాయలను బోలియుండును. గింజలు ఘట్టిగానుండును. మొదట తియ్యగను తరువాత చేదుగనుండును. దీని అరుగదీసిన గంధము చంటిపిల్లల పడిశభారము దగ్గు, వగర్పులను హరించును. గంధము లోపలికిని పైనపట్టువేయుటకును వుపయోగించవచ్చును. బిడ్డలకు కడుపు పెరిగిన వారికి 2-3 గోధుమగింజలయెత్తు పాలతో యిచ్చు చుండిన తగ్గిపోవును. శ్లేష్మము హెచ్చుగుటవలన శ్వాస బంధించిన యెడల దీనివిత్తుల చూర్ణము కొద్దిగ కొన్ని గోధుమగింజలయెత్తు అల్లపురసముతో కలిపి యిచ్చిన తప్పక శ్లేష్మము పడిపోయి శ్వాస ఆడేటట్టు చేయును.

కోపము:—Anger. పైత్యమును హెచ్చించును; వాతము నణచును; రక్తమునకు వేడి బుట్టించును; శిరస్సునకు విస్తారముగ రక్తమును ప్రవహింపజేయును; క్షయ, కాస, శ్వాస, మొదలగు ననేకరోగ ములను బుట్టించును; అన్నిరోగములను బలపరచును; బుద్ధినిదాన మును తగ్గించును; ఆయుఃక్షీణము జేయును.

కోరింతచెట్టు:—ములుగోరింట చూడుడు.

కోలచెముడు:—కత్తిమందుచెట్టు చూడుడు.

కోలపాలకూర :—Cleome Pentaphylla, Holostema Rhdedii- Curry of the leaves of. సం* పోటగళా, అర్కపుష్పికా. హిం* అర్కహులీ, అంధాహులీ, దధియార్. రుచిగా గురుత్వముగా నుండును. చలవ, వీర్యపుష్టి జేయును. వాత శ్లేష్మములను వృద్ధి బొందించును. వంధ్యాదోషము, నేత్రరోగము. మేహము, రక్త దోషము, దురద, క్రిమి, కుష్టు, కఫము, పైత్యము, వ్రణములు వీనిని హరించును. దేహపుష్టి, ఆయుర్వృద్ధి వీని నిచ్చును. దేహము ముడతలు పడుట, వెండ్రుకలు నెరయుట వీనిని బోగొట్టును; స్త్రీలకు పాలుపడ జేయును.

కోలపొన్న చెట్టు :- Doodia Lagopodioides, Uraria Lago- podioides. సం* పృశ్నిపర్ణీ.శృగాలవిన్నా. హిం* పటవన్. దీనినే నక్కతోకపొన్న యందురు. ఇది దశమూలములలో నొకటి. దీని సమూల కషాయము లేక రసము తీపిగ, స్వాదుగ నుండును; కొద్దిగ వేడి జేయును; త్రిదోషములను, శ్వాస కాసలను, జ్వరము, జ్వరము వలన గలిగిన దాహమును, తాపమును, మేహవాతముల నొప్పులు రక్తములవ్యాధి వీనిని అణచును. కషాయపు మోతాదు పూటకు 3-4 తులములయెత్తు, రసపు మోతాదు 2-3 తులములయెత్తు.

కోవిలదుంప :— Trapa Bispinosa. Eng. water chestnut. సం* శృంగాటరి, జలకంద, త్రికోణఫల, హిం* సింఘాడ, దీనిని పరికెగెడ్డలని, నామదుంపలని యందురు. ఇవి చెరువులలో లేచును. నీటిమీద తేలుచుండును. యీదుంపలు పిండివలె నుండును. పచ్చివి గాని, ఎండినవిగాని ఆహారముగా నుపయోగింతురు. చలువ మేహ శాంతి జేయును. బలము గలిగించును. పైత్యమును శమింపజేయును. వేడివలన వచ్చిన విరేచనములను కట్టును. దీని పిండిపాలతో గలిపి పుచ్చుకొనుచుండిన నరముల బలహీనతను, కుసుమ రోగములు,

ఇంద్రియనష్టము వీనిమీద పనిజేయుచు, వీర్యవృద్ధి నిచ్చును. దీని పైభాగములయొక్క ఆకును నూరి కట్టిన వాపులు తగ్గును. ఆకు రసము కండ్లలోవేసిన నేత్రరోగములు మానును. మలబద్ధము జేయును. వాతము, శ్లేష్మము వీనిని గలుగజేయును. స్త్రీలకు పాలను వృద్ధిపరచును.

కోవిలపిట్టమాంసము:—The flesh of a cuckoo. కఫపైత్యము, కుష్ఠు, రక్తపైత్యము, వాతము, శ్లేష్మము వీనిని బోగొట్టును; జఠరదీప్తి నిచ్చును; బలముజేయును; కాంతినిచ్చును; దేహము ముడతలుపడడము, వెంట్రుకలు నెరయడము వీనిని బోగొట్టును.

కోష్టు :— Aplotaxis Auriculata, Saussurea Lappa. Eng. The Costus. సం॥ కుష్ఠ, పాకల. హిం॥ కూట్, అనగా చంగల్వకోష్టు. ఇదిఒకచెట్టువేరు. దీనిచూర్ణము లేక కషాయముచేదుగా, వెగటుగా, సుగంధము గలిగియుండును; వేడిజేయును; త్రిదోషము లను హరించును; మూలవ్యాధి, విసర్పి, విషము, దురదలు, కుష్ఠు, సర్వజ్వరములు వీనిని హరించును; వీర్యపుష్టి, దేహపుష్టి, పొట్టకు బలముజేయును; సన్నిపాతిజ్వరము, దోషజ్వరము(Typhus fever) పురాణజ్వరములను హరించును. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు. కషాయపుమోతాదు పూటకు 8 మొదలు 5 తులముల యెత్తువరకు. దీనిని నీళ్ళతో తీసిన గంధము నాలుకకు రాయుచుండినను లేక చంగల్వకోష్టువస, సైంధవలవణము, మిరియాలు, పిప్పళ్లు, అగరు, శొంఠి, తుంగముస్తలు నీళ్ళతో గంధముతీసి నాలుకకు రాయుచుండిన నాలుకయందు, కంఠమునందు గల రోగముల నివారణమగును.

క్రౌంచపిట్ట మాంసము:—Partridge - flesh of. యింపుగా రుచిగా నుండును. రక్తపైత్యమును గొట్టును. కఫరోగము, అగ్నిమాం

ద్యము, వాతరోగముగల బలహీనులకు మిక్కిలి పథ్యముగనుండును. శుభ్రమైన రక్తమును బుట్టించును. దేహమునకు, మెదడునకు బలమిచ్చును. ఆడుపిట్ట మాంసము మిక్కిలి బలము జేయును. దీనిగ్రుడ్లు మిక్కిలి ఇంద్రియపుష్టి జేయును మొగపిట్టమాంసము కాక జేయును.

క్రాలుగచ్చచెట్టు:—కారుగచ్చ చూడుడు.

కృష్ణకాటుకలు, శీతకాటుకలు:—(A sort of paddy.) వీనిలో చెరువులక్రింద పండినవి శ్రేష్ఠము వీనిబియ్యముమంచిరుచి, ఆరోగ్యమైనవి. బలము, పుష్టి. వీర్యవృద్ధి నిచ్చును. అందరికిని, అన్నితత్వములకును అనుగుణ్యముగా నుండును. మరియు ధాన్యములు చూడుడు.

కృష్ణతామర:—Canna Indica. Eng. Indian shot. సం॥ సర్వజయా. హిం॥ సబ్జయ. దీనిని మెట్టతామరనికూడా అందురు. ఇవి అనేక రంగులుగల పువ్వులుపూయును. దీనికుంప ముక్కలుగాకొట్టి బియ్యపుకడుగులోవేసి కొద్దిగ మిరియాలుచేర్చి కాచి వడియపోసి ఆనీళ్ళు త్రాగించిన పశువులు విషపుగడ్డి తినినందున పుట్టిన కడుపు ఉబ్బు నివారణమగును. యీతామరపూసలను జపమునకు నుపయోగించును.

కృష్ణతులసి:— Ocimum Sanctum. Eng. The purple stalked Basil. సం॥ కృష్ణతులసి, విష్ణువల్లభ, హిం॥ కాలాతులసి, తులసి. దీని ఆకులు కాడలు నలుపు మెరుపు కలిపినరంగుగానుండును; కొద్దిగ చేదు కారపురుచులు గలిగియుండును. కాక జేయును. శ్లేష్మమును, కఫమును, వాతమును హరించును. జఠరదీప్తినిచ్చును. రసదోషమును పోగొట్టును. దీని ఆకురసము దగ్గు, వగర్పు, గొంతుకలో ధ్వనిగల దగ్గు (bronchitis) ను హరించును. పొట్టలోని వాతమును వెడలించును. ఆప్యాయత నిచ్చును. జ్వరమును కట్టును. పైత్యమును విరేచనముగుండ వెడలించును. విరేచనము జేయును,

పడిసెభారమును అణచును. ఆకురసములో అల్లపురసము లేక శొంఠి రసము గలిపియిచ్చిన బిడ్డల కడుపునొప్పి నయమగును. ఆరసములో తేనె గలిపియిచ్చిన బిడ్డలకు గొంతుకలో ధ్వని, వగర్పుగల దగ్గు నిమ్మళించును. దీని ఆకుల తేలికకషాయము బిడ్డలపొట్టకు బలము జేయును. కడుపులోని రోగముల నణచును. పొట్టలోని వాతము హరించును, విరేచనము జేయును. కార్జములోని రోగములను హరించును. ఆకును నిమ్మకాయ రసములోనూరి పూసిన తామర మొదలగు చర్మరోగముల హరించును. ఆకు నూరి కట్టిన వ్రణములలోని క్రిములు పడిపోవును. దీని పువ్వు వెన్నులు శొంఠి నూరి అందులో తేనె, నీరుల్లిపాయల రసము గలిపి యిచ్చిన దగ్గులు హరించును. ఆకులు, పువ్వు వెన్నులు, సన్నపాటి వేళ్లు నూరి యిచ్చిన పాము విషము విరుగును. ఆకుల చూర్ణము పీల్చిన ముక్కులోని పుండు, పీనస మానును. దీని వేరుకషాయము వరుసజ్వరము, మన్యపు జ్వరము, ఇతర జ్వరములు హరించును. చెమట బుట్టించును. విత్తులు జిగురు గలిగియుండును. మృదువు పరచును. మూత్రరోగముల నణచును. రసముయొక్క మోతాదు 2 మొదలు 3 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తు వరకు నియ్యనగును. ఇది మంచి సువాసనగలది. మనస్సునకు ఆనందము కలుగ జేయును. తులసిచెట్లలోగాని వనములోగాని తరచు తిరుగుచుండిన శరీరఆరోగ్యము నిచ్చుటయేగాక అనేక రోగములను రాకుండ చేయుటయేగాక శమింప చేయును. అంటు వ్యాధులను (disinfectant) రాకుండ జేయును. కృష్ణతులసి దొరకని యెడల లక్ష్మీతులసి వాడతగియుండును.

కృష్ణాగరు :— Aquilaria Agallocha. A. Ovata Eng. Eagle wood. సం॥ అగరు, రాజార్హ్హ. హిం॥ కాలీఅగర్. సుగంధముగ,

మనోహరముగ, చేదుగనుండును. తీవ్రమైన శ్లేష్మము, వాతము, విషము, మేహము, శోష, చెమట, దుర్గంధము, కర్ణనేత్రరోగములు, కుష్టు, విసర్పి. వ్రణములు, నీరసము, క్రిమి వీనిని హరించును ఆరోగ్యమిచ్చును. గుండె (heart) కు మేలుజేయును. అమవాత మేహ వాతనొప్పులను, విరేచనములు, అతిసారము, వాంతులు, తినిన ఆహారమరుగక విరేచనము వెంట పడిపోయెవ్యాధి, తలదిమ్ము, పక్షవాతము వీనిని హరించును. దేహమునకు, నరములకు సత్తువజేయును దీని చూర్ణము తేనెతోనిచ్చిన ఎక్కిళ్ళనుకట్టును. మోతాదు 1 మొదలు 4 చిన్నములయెత్తువరకు.

కృష్ణాగరుతైలము:— Oil of do. సువాసనగ, మనోహరముగ నుండును. వేడిచేయును. శ్లేష్మము, మెదటిరోగములను, వాతము, క్రిమి, కుష్టు, వ్రణములు వీటిని పోగొట్టును; రక్తపైత్యము నణచును; దీని తైలమును కొద్దిగ బ్రాందిలోకలిపి ఊపిరితిత్తులు (lungs) గుండెలకు వ్రాసిన శ్వాస, శ్లేష్మోద్రేకమును తగ్గించును. దీని తైలమును తలకువ్రాసిన తలనొప్పి, శిరోరోగములను హరించును; వెండ్రుకలను పెంచును. నల్లబడజేయును. ఇంద్రలుప్తము (పేనుకొరుకుట)ను, చుండ్రును, కేశదోషములను హరించును. లోపలికి పుచ్చుకొను మోతాదు 3 మొదలు 5 చుక్కలవరకు.

కృష్ణాజినము:—Hide of a black Antelope. దీనిని శయనాసనములకయి వాడుకజేసిన పైత్యమును వృద్ధిజేయును. కఫమును హరించును. శిశిరఋతువునందు హితవుగ నుండును. జడత్వమును పోగొట్టును. జపముచేయువారికి అనుకూలముగ నుండును.

కృష్ణోదకము:—Water of the Krishna river. కృష్ణానది జలము రుచిగానుండును, శాక, పైత్యముజేయును, మిక్కిలి జఠరదీప్తి

నిచ్చును. వాతమును, జడత్వమును, కడుపులో బల్లను బోగొట్టును, వీర్యపుష్టి, బలము, ఆరోగ్యము నిచ్చును.

—౯—

# ఖ

ఖండశర్కర:—పటికిపంచదార చూడుడు.

ఖజ్జము:—A sort of sweet meet. బెల్లము, నువ్వుపప్పు, నెయ్యి, శేసె, శర్కర వీనితో జేసెడు భక్ష్యము. వీర్యవృద్ధి జేయును. బలమునిచ్చును. మిక్కిలి గురుత్వముగ నుండును.

ఖడ్గమృగమాంసము:—Rhinoceros-flesh of. వెగటుగనుండును. కఫమును, వాతమును హరించును. శరీరతత్వమును మంచికి మార్చును. పైత్యముజేయును. ఆయుర్వృద్ధి నిచ్చును. బలముజేయును. మూత్రబద్ధమును విప్పును దీనిని నేతిలో ఉడికించి ఆనేతిని ఒంటికి బూసిన దోషజ్వరము (Typhus fever) నివృత్తించును. దీని కొమ్ముతోచేసిన గిన్నెలో విషమిశ్రాన్నము దినిన విషమెక్కదు. ఆగిన్నెలో నీళ్ళుత్రాగిన మూలవ్యాధిని, యింకను అనేకవ్యాధులను హరించును. దీనికొమ్ముపొగ గుదస్థానమునకు పట్టిన మూలవ్యాధి నయమగును. దీని అన్ని అవయవములు అనేక రుగ్మతలను పోగొట్టును.

ఖడ్గమృగరక్తము:—Dragons blood. ఇది పై జంతు. రక్తముకాదు. ఇదియొక చెట్టుజిగురు. దీనిని హిందీలో దముల్లక్వైన్ అని దమల్ ఖూన్ అని అందురు. ఎరుపులో కొంచెము నలుపుగా నుండును. చూర్ణముజేసిన ఎర్రగా నుండును. చప్పగ నుండును. విరేచనము కట్టును. సారాయిలో కలిపి తలకు, కణతలకు, మర్దనచేసిన మూర్ఛ నివృత్తించును.దీనిచూర్ణము చల్లారినఆవుపాలు పంచదారతోనిచ్చిన

స్త్రీల కుసుమరోగములు సున్నిత దేహుల రక్తగ్రహణిని కట్టును. మోతాదు పూటకు 1 అణాయెత్తు.

ఖదిరసారము:—కవిరి చూడుడు.

ఖర్జూరపుకాయ:—Phoenix Dactylifera. Eng. Date fruit or the Edible Date. సం* ఖర్జూర. హిం* ఖజూర్. వేడిజేసి, మేహశాంతి జేయును. గురుత్వముగ నుండును. బలము,వీర్యపుష్టినిచ్చును రక్తపైత్యము, పైత్యము, మూలవ్యాధి, అతిసారము, జ్వరము తాపము, దాహము, వాతము, పాండురోగము, మూత్రాఘాతము, శ్లేష్మము, ఉబ్బసము, దగ్గు, క్షయ వీనిని పోగొట్టును. గుండెలకు, గురదాలకు (kidneys), బలముజేయును. పక్షవాత, పక్షఘాత రోగులకు మేలుజేయును. ధాతువులకు పుష్టినిచ్చును.నడుమునొప్పిని, ఎముకలనొప్పిని పోగొట్టును. పుంస్త్వము నిచ్చును. వాతశరీరుల రొమ్మునకు, తెల్లదబ్బకు (Lungs) మేలుజేయును. ఉష్ణశరీరులకు నష్టముజేయును. కార్జము (liver) లోను, నల్లదబ్బ (spleen) లోను కంతులబుట్టించును. రక్తమువార్చును. అరుచి బుట్టించును, కండ్లకు, దంతములకు నష్టముజేయును, శ్లేష్మముజేయును; వికారమును బుట్టించును; దీనికి విరుగుళ్ళు 1 గసగసాల చమురు, 2 బాదముపప్పు, 3 ఎండుమిరపకాయలు, 4 సికింజబీను, 5 దానిమ్మకాయల రసము, 6 సిరకా, 7 తేనె.

ఖర్జూరపుచెట్టునీడ:—Shade of a Date tree. మనోహరముగ నుండును. త్రిదోషములను శమింపజేయును. వీర్యపుష్టిని, బలమును, కాంతిని యిచ్చును.

ఖర్జూరపుపండు:—Phoenix Dactylifera. Eng. Ripe edible date. సం* ఖర్జూర, నిశ్రేణి. హిం* ఖజూర్. వేడిజేసి ఆర్చును. వేడిజేసి నీరుపెట్టునని కొందరందురు. కాకజేయును; శైత్యశరీరులకు

వనుకూలముగ నుండును. రక్తములోనుండెడు దోషమును, వాతమును, పైత్యమును హరించును. బలముచేయును; కండ్లకు, గుండెలకు నష్టముచేయును. దీనికి విరుగుళ్ళు 1 గసగసాల చమురు, 2 నెయ్యి, 3 ఉష్ణోదకము, 4 తుంగముస్తల చూర్ణము, 5 బాదము పప్పు, 2 సికింజబీను. మూడునాలుగుపండ్లను మధ్యాహ్నము నీళ్ళలో నానబెట్టి రాత్రి పరుండబోవునపుడు చింతపండువలె గుజ్జుగాపిసికి పుచ్చుకొనిన మిక్కిలి వీర్యపుష్టి చేయును.

ఖర్జూరపుపువ్వు, కొబ్బరిపువ్వు, ఈతపువ్వు:—Flowers of date, cocoanut, wild date tree. వీనిలో నేచెట్టుపువ్వుల రసమైనను లోపలికిచ్చిన రక్తపైత్యము, రక్తసారము, మేహపైత్యము వీనిని హరించును. రక్తవిరేచనములు, నీళ్ళవిరేచనములు, ఋతురక్తస్రావము, కుసుమరోగములు వీనిని కట్టును; మోతాదు 3–4 తులములయెత్తు. వీనిరసమును పుక్కిలించిన నోటిపూత, పుండు మానును. వీనిలో దేనిపువ్వుల రసమయినను తీసి అందులో పటికిపంచదార, మంచిగంధముగలిపి యిచ్చిన పైత్యజ్వరము, వాంతికట్టును. మేహశాంతి, చలవచేయును. రసము తీయునపుడు నీళ్ళు కొద్దిగబోసి తీయవచ్చును.

ఖర్జూరాసవము:—Date wine or liquor. మేహశాంతి, చలవచేయును. నిదాహమును కట్టును. బలము, వీర్యపుష్టి చేయును.

ఖర్బూజాపండు:— కర్బూజాపండు చూడుడు.

—౦—

# గ

గంగపాయిలకూర:— పెద్దపాయలకూర చూడుడు.

గంగరావి చెట్టు:— Thespesia Populnea, Hibiscus P. సం॥ బ్రహ్మదారు, పారీష, హిం॥ పరాస్‌పీపల్. దీని చెక్కరసము తీసి

వగరు రుచులుగలిగి యుండును. వేడిజేయును. సర్వవిషములు, మేహము, కుష్టు, వ్రణములనుబోగొట్టును. దీని కాయపాలుపూయుట వలన కపాలమాద, దద్దుర్లు, తామర మొదలగు చర్మరోగములను బోగొట్టును. దీని కషాయముతో కపాలమాద మొదలగు దుష్టవ్రణముల కడిగిన నవి మానును. దీని చక్కకషాయము లోపలికిచ్చిన రక్తమును శుభ్రపరచును. శరీరతత్వమును మార్చి బాగుపరచును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తువరకు. దీని ఆకులను కొద్దిగ ఆముదముచిమ్మి వెచ్చజేసి తలకుకట్టిన వాతదోషమువలన వచ్చిన తలపోట్లు నిమ్మళించును. వాతమేహ, వాతనొప్పులకు, వాపులకు బాధయున్నచోట శొంఠిగంధము అరుగదీసి పట్టించి దానిని పైన యీ ఆకులు వేసి కట్టిన, కొంతసేపటికి ఒకవిధమైన వేడి పుట్టును. అప్పుడు యీ ఆకులు తీసివేయవలెను. ఇట్లు చేయుచుండిన పైనచెప్పిన నొప్పులు, వాపులు నివారణమగును.

౫౦౫ రేగుపండ్లు:—Zizyphus Jujuba-fruit of. తియ్యగా పుల్లగా స్వాదుగా నుండును. వాతమును గొట్టును. శ్లేష్మమునువృద్ధిజేయును. దీనికి విరుగుళ్ళు రేగుపండ్లు చూడుడు.

౫౦౬ సింధూరము:—Plumbi osidam Rubram Eng. Red oxide of lead. సం॥ నాగసంభవ, రక్తవాలుక. హిం॥ సిదూర్. ఇది సీసముతో తయారుచేయుదురు. యఱ్ఱగా, బరువుగా, పొడవుగా నుండును. దీనితో లేపనములును, పాలస్త్రీయుచేసి వాడుదురు. కొన్ని మందుదినుసులతో కలపి వాడిన చర్మరోగములు అనగా గజ్జి, చిడుము, సర్పికురుపులు మొదలగువానిని మాన్పును. పాలస్త్రీగా తయారుచేసి వాడిననూ, కురుపులు, వ్రణములనూ మాన్పును. కొందరు బొట్టు పెట్టుకుందురు.

౫౦౭ బొండము:—A fine sort of cocoanut. ఇది యొక జాతి

కొబ్బరికాయ. దీనిలోనీళ్ళు విస్తారముగ నుండును. తియ్యగా, రుచిగా నుండును. వీర్యవృద్ధి, చలవజేయును. పైత్యమును, తాపమును, దాహమును శమింపజేయును. అరుచిని పోగొట్టును. లేతకాయలలో కొబ్బరి (పాకుడు) లో కొద్దిగ పంచదారగాని, బెల్లముగాని కలిపి పుచ్చుకొనిన మిక్కిలి రుచిగా నుండును. చలవజేయును. తేలికగా జీర్ణమగును. ఈనీళ్లు (ఒక కాయలోని నీళ్ళు) పుచ్చుకొనిన సుఖవిరేచనమగును.

గంగోదకము:—Water of the Ganges. గంగానది జలము స్వచ్ఛముగ నుండును. చలవజేయును. దాహమును, మేహమును హరించును. అగ్నిదీప్తినిచ్చును. జీర్ణముగావించును. బుద్ధికి మిక్కిలి బలమిచ్చును. పథ్యముగ నుండును. మిక్కిలి ఆరోగ్యకరమైనవి, పవిత్రమైనవి.

గంజాయి:—గెంజాయి చూడుడు.

గంజి అన్నము:—Boiled rice soaked in cunjee. రాత్రి ఉడుకు గంజిలో వేసిన అన్నము. ఉదయమున బుచ్చుకొనిన అమృతతుల్యముగ నుండును. మిక్కిలి చలవజేయును. మేహము, పైత్యము, దాహము, తాపము, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము వీనిని జయించును. బలము, పుష్టిజేయును.

గంజి, అన్నమువార్చినది:—వార్చిన గంజి చూడుడు.

గంటుభారంగి:—Clerodendron Siphonanthus, Siphonanthus Indica & Premna Herbacea. సం॥ భార్గీ; బ్రాహ్మణయష్టిక. హిం॥ భారంగి. దీనిని భారంగియందురు. దీని ఆకులు, వేరు, కాడలు చేదుగనుండును. దీనివేరు గంధముగాని, నీళ్ళతోనూరి తీసిన రసముగాని, వీని కషాయముగాని కాకజేయును. వాతపైత్య శ్లేష్మములను, శుక్లదోషమును, యోనిదోషమును, గుల్మజ్వరము,

శ్వాస, క్షయ, పీనస వీనిని బోగొట్టును. చెమట బుట్టించును. దుష్ట ద్రవకూటమిని కరగించును. బిడ్డలకు కూడ పైరోగములకు నియ్య నగును. దగ్గు, జ్వరము వీనిని పోగొట్టును గంధపు మోతాదు అర తులమెత్తు మొదలు తులమెత్తువరకు. రసపు మోతాదు 2-3 తుల ములమెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల మెత్తు వరకు. దీని ఆకులను నూనె, వెన్న వీనిలో వేసి కాచి ఆతైలము పూసిన తలనొప్పి, నేత్రరోగములు హరించును దీని విత్తులు చిదుగ గొట్టి చల్లలో ఉడికించి యిచ్చిన కొద్దిగా విరేచనము జేయును. ఉబ్బురోగమును పోగొట్టును. విత్తుల మోతాదు పూటకు 3 మొదలు 6 చిన్నముల మెత్తువరకు.

గంటెలు:—Holchus Spicatus. వీనిఅన్నము రుచిగనుండును; దేహ పుష్టి, బలము నిచ్చును; వేడిచేయును; గురుత్వమైనది; పైత్యము నణచును; దీనిజావకుకూడ యివేగుణములు; వ్యవసాయాది వ్యాయా మములు చేయువారికి మిక్కిలి అనుకూలముగ నుండును; గంటెలు వండి పసువులకు వేయుదురు.

గండఫెరోజా:—గంధఫెరోజా చూడుడు.

గండుమీను అనుచేప:— A sort of river fish. సం॥ రోహిత, మత్స్యరాజ. హిం॥ రహుమఛలీ. ఈచేప గోదావరి మొదలగు పెద్ద నదులలో దొరకును. దీనిమాంసము చమురుగలిగి రుచిగానుండును. పుష్టి, వీర్యవృద్ధి, బలమును యిచ్చును. వాతాతిసారమును, పైత్య, వాతములను పోగొట్టును సులభముగ జీర్ణమగును. పథ్యమైనది. దీని చేదుకట్టను రొయిపీతయని చెప్పుదురు. రొయ్యిపీత చూడుడు.

గంధకచోరము:—A sort of Zedoary. సం॥ కచోర, గంధమూల, వేదముఖ్య. హిం॥ నర్ కచూర్. దీని చూర్ణము లేక కషాయము, వెగటుగా, చేదుగా నుండును. రుచి బుట్టించును. వాతము, మం

దాగ్ని, బల్లలు, గుల్మము, మూలవ్యాధి, కుష్ఠరోగము వీనిని జయించును. నీరసమును బోగొట్టును. చూర్ణపుమోతాదు 3 మొదలు 5 చిన్నములయెత్తువరకు. కషాయపుమోతాదు 3 మొదలు 6 తులములయెత్తువరకు.

గంధకధృతి:—Sulphuric acid. పుల్లగానుండును. దీని లోపలికిచ్చిన జిహ్వాదోషమును, రసదోషములను, అన్ని పైత్యములను, ఎనిమిది ఉదరములను, ఎనిమిది శూలలను హరించును. ఆకలిని, జీర్ణశక్తిని హెచ్చించును. వాతము హరించును. నీరసము పోగొట్టును. గండమాల, కుష్ఠు, కుళ్ళిన వ్రణములు వీనిని హరించును; మరియు తెల్లదబ్బ (Lungs), యోని (uterus), పొట్ట (stomach), ప్రేగులు (intestines) వీనినుండి వెడలెడి రక్తమును కట్టును. క్షయలలో రాత్రి కలుగు చెమటను పైన బూసిన అణుగును. దీనిని 1 టికి 11 పాళ్లు నీళ్ళు గలిపినది లోపలికి యియ్యనగును. అదియైనను, నీళ్ళలోగాని, లవంగాలు, నేలవేము మొదలగువానిలో దేనియొక్కయైన తేలిక కషాయములోగాని గలిపి యియ్యనగును. నీళ్ళు బొత్తిగా కలపనిది దేహముపైన బడిన పొక్కును; లోపలికి బుచ్చుకొనిన చంపును. పైపరికారము నీళ్ళుగలిపినది (diluted) యైనను అధికముగ బుచ్చుకొనిన చంపును. దీనికి విరుగుళ్ళు 1 Carbonate of Magnesia, 2. Bicarbonate of Soda, 3. Ammonia or Potash. దేహముపైన గంధకధృతిపడి కాలినదానికి నీళ్ళలో సబ్బు (soap) గలిపి ఆనీళ్ళు కాలినచోట తడుపుచు అనగా పోయుచునుండవలెను. నీళ్ళు పైన చెప్పిన పాళ్ళవరుసను గలిపిన (diluted) ధృతిని లవంగముల కషాయముతో నిచ్చిన నీళ్ళ విరేచనములు కట్టును. మోతాదు 5 చుక్కలు మొదలు 20 చుక్కలవరకు క్రమక్రమ

ముగా వృద్ధిచేయవలయును. ఈగంధకధృతి లోపలికి పుచ్చుకొను నపుడు దానిని పండ్లకు తగులనియ్యగూడదు; తగిలిన వానిరంగు భేదించును. నీళ్ళు గలిపిన (diluted) గంధక ధృతిని పుల్లకు దూది చుట్టి దానితో తీసి నాలుకకు రాసిన నాలుకపూత, పొక్కులు, జిహ్వాదోషము నయమగును.

గంధకపుతైలము:—Oily liquid of Sulphur. ఇది రసదోషమును హరించును. గాని దాహము, చర్ది, శీతము, అరుచి వీనిని బుట్టించును.

గంధకము:—Sulphur. సం* గంధక, బలి, హిం* గంధక్. ఇది పసుపు, తెలుపు, ఎరుపు, నలుపు రంగులు గలదియై యుండును, గాని యెరుపు, నలుపు రంగులుగలది దొరకుటలేదు. పసుపుపచ్చగ నుండును; చిలకరెక్కలగంధకము శ్రేష్టము; దీనిని కరిగించి పూసల వలెచేసిన దానిని అమరశిలగంధకమందురు.మరియు సోలగంధమును బాణాసంచా (Fire works ) చేయుటకు వుపయోగింతురు; క్రమముగ అష్టశుద్ధులు చేయబడిన గంధకము అనుపాన చూర్ణములతో గలిపి యిచ్చిన భ్రమ, దాహము, శోష, పైత్యము వీనిని హరించును; నేత్రములకు బలమిచ్చును; దేహపుష్టి, బలము అగ్నిదీప్తి వీని నిచ్చును; సర్వకుష్టులు, శూలలు, సర్వ క్రిమి రోగములు, వాతపిత్తము, సవాయి, చిడుము, యితర చర్మరోగ ములు;క్షయ,శ్లేష్మము వీనిని నివృత్తిజేయును;బుద్ధిబలము,వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి వీనిని గలుగజేయును; మోర్లుదిగడము (Contraction of limbs.) ను పోగొట్టును; కాకజేసి చమురును బుట్టించును; ఆమవాతము (Gout) ను పోగొట్టును. అనుపాన విశేషములచే సమస్త రోగములను జయించును; క్రమముగ శుద్ధి జేయని

యభ్రకము, రసభస్మము వీనివలన గలిగెడు రోగములను నిశ్చి తము నివారించును. గంధకము క్రమముగ శుద్ధిగానియెడల నష్ట రోగములను బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి గలిపిన ఆవుపాలు, 2 లవంగములు, వస, వీని చూర్ణము, 3 గరికవేళ్ళరసము లేక కషాయము. గంధకమును అధికముగ దినిన నీరసపెట్టును, గనుక గంధక సేవకాలమున అప్పుడప్పుడు బలకరౌషధములు బుచ్చుకొనుచుండవలయును. మోతాదు 2 మొదలు 10 గురివింద గింజలయెత్తువరకు. విరేచనమునకు ఇచ్చు మోతాదు పావలా యెత్తు మొదలు అరతులమెత్తు బెల్లపు పాకములో కలిపి వుండ జేసిగాని ఆవుపాలలో గలిపిగాని పుచ్చుకొనవగును. దీనిని, నల్లజీలకర్రను సమభాగములుగా చూర్ణముజేసి మంచినూనెలో గాని, కొబ్బరినూనెలోగాని గలిపి దేహమునకు బూసిన గజ్జి, చిడుము, సవాయి పొక్కులు మొదలగు చర్మరోగములను పోగొట్టును.

అనుపానములు;— త్రిఫల చూర్ణముతో నిచ్చిన నేత్ర రోగములు, ఆవునేతితో నిచ్చిన వ్రణములు, ఆవునెయ్యి; తేనె వీనిలో కలిపి కండ్లకు బెట్టిన శుక్రమను నేత్రరోగము, మిరియాల చూర్ణము ఆవునేతితోగాని, పిప్పళ్ళచూర్ణము ఆవునేతితోగాని యిచ్చిన కాస రోగము, నేలములగవిత్తులు ఆవునెయ్యితోనిచ్చిన శ్వాస, పిప్పళ్ళ చూర్ణము తేనెతో నిచ్చిన స్వరభంగము, (గొంతుక వెలుగు రాయుట ) తమలపాకురసముతో నిచ్చిన పార్శ్వపునొప్పి, నిమ్మ పండ్లరసము నిచ్చిన విశూచి, బెల్లముతో నిచ్చిన ప్రమేహము. ఉసిరికపప్పు చూర్ణముతో నిచ్చిన అజీర్ణము, నువ్వులనూనెతో నిచ్చిన దద్దురు రోగము, శొంఠి తేనెతో నిచ్చిన గ్రహణి, నింబ పంచాంగము (వేపచెట్టుయొక్క చెక్క, ఆకు, పువ్వు, కాయ,

వేరు, వీనిచూర్ణము) తో నిచ్చిన కుష్ఠరోగము, తులసిఆకు రసము, నెయ్యితో నిచ్చిన వాతరోగము, ఆవునేతితో నిచ్చిన పైత్యరోగము, శొంఠి, బెల్లములతో నిచ్చిన కఫరోగము హరించును; వావి లాకు రసముతో శుద్ధగంధకము, శుద్ధపాదరసమునూరి లేపనము జేసిన కుష్ఠు, విషరోగము హరించును. శుద్ధగంధకము 10 పలములు, గుంటకలగర రసము 5 పలములతో నూరి యెండించి, దానికి అర్ధభాగము కరక్కాయ చూర్ణము గలిపి తేనె, ఆవునెయ్యితో రెండు మాసములు సేవించిన, ముసలితనముపోవును. విశేష వీర్యవృద్ధి గలుగును. మోతాదు 2 మొదలు 6 గుంజల యెత్తువరకు.

గంధఫేరోజా :— Pinus Longifolia-regin of Eng. Gandha Bi:oza or Galbonum. సం* సరళస్రావ. శ్రీవాస, శ్రీవేష్టక. హిం* గంధఫిరోజా ఇది సరళ దేవదారు జిగురు. దీనినే శ్రీవేష్టక మందురు. క్రొత్తది తెల్లగ పూసగట్టిన నెయ్యివలె నుండును. గాలి బారిసతకువాత గోధుమరంగుగామారును. దీనినుండి టర్పెంటయిను (Turpentine )అను తైలమును తీయుదురు. దీనిగుణము టర్పెంటయిను చూడుడు. ఈజిగురు ఇంచుమించు ఇంగువ గుణము గలది. వట్టిది గుడ్డపయిన పూసినగాని, కొబ్బరినూనె లేక గ్లిసరయినులో కలిపిగాని పైనపట్టించిన కరుగని కంతులను, అడ్డగర్రలను కరగించును; పగులని గడ్డలను పగులగొట్టును; ప్రాతదెబ్బవాపును అణగగొట్టును; గడ్డలను త్వరగపక్వపరచును; లోపలికిచ్చిన దేహములోని దుష్టమలజలమును వెడలించును; ఈడ్పులను కట్టును; సెగరోగమును పోగొట్టును; శ్లేష్మమును వెడలించును; విరేచనకారి; స్త్రీల ఋతురక్తమును జారీచేయును. సుఖప్రసవము గావించును. అపస్మారము (Hysteria) అణగిన వెనుక గలుగు నరముల వికృతిని

(Nervous irritation) ను అణచును. వాతము, శిరోనేత్ర రోగములు, దురద, వ్రణములు, యోనిరోగము, అజీర్ణము హరించును. కంఠస్వరమును బాగుచేయును. లోపలికిచ్చెడి మోతాదు 5 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు.

గంధమాంసి:—Nardostachys Jatamansi - a variety of. సం॥ గంధమాంశీ, పూతన. ఇది జటామాంశిలో భేదము. దీని చూర్ణము లేక కషాయము చేదుగా, కారముగా నుండును, వీర్యమునకు వేడిజేయును, ప్రమేహము, చర్మదోషము, విషవేగము, వాతము వీని నణచును. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులముల యెత్తువరకు.

గంధము:—మంచిగంధము చూడుడు.

గగ్గెర:—Ocimum Ballatum. సం॥ ఫణిర్జక, బిల్వగంధా. అనగా తులసిభేదము. దీనిగుణముకొరకు అడవిగగ్గెర చూడుడు.

గచ్చకాయ:—Caesalpinia Bondue, C. Bonducella. Eng. Molucca Bean or Bondue Seed. Fever nut. సం॥ కుబేరాక్షి, క్రకచికా. హిం॥ కరంజువా, కట్‌కరంజ్. వీనిలోని పప్పు వెగటుగ చేదుగానుండును. గుండెలనొప్పి, శూలనొప్పి, జ్వరము, వరుసజ్వరము, చలిజ్వరము, మన్యపుజ్వరము, దీనివలన గలిగిన కడుపులోబల్ల మొదలయిన రోగములు, క్రిమిరోగము వీనిని హరించును. ఈడ్పులు (Convulsions), ఉబ్బుసదగ్గు, నీరసము, అన్నభేది, పాషాణము, లోహము, ఇత్తడి, రాగి మొదలగువాని విషదోషములను హరించును. బలముజేయును. గచ్చకాయలోని పప్పు చూర్ణము ఒకపాలు, మిరియాల చూర్ణము ఒకపాలు కలిపి గజుకార్కుగల సీసాలో భద్రపరచి దీనిని వాడతగియుండును.

మోతాదు 5 మొదలు 20 గోధుమగింజలయెత్తు చొప్పున రోగి వయస్సు, బలము, రోగబలము యోచించి దినమునకు రెండు పూటలను లేక మూడుపూటల నియ్యనగును; జ్వరము మొదలగు వానిచేత నీరసపడినవారికి ఆ చూర్ణము పైన చెప్పిన మోతాదులుగ నిచ్చిన బలముజేయును; నీరసము పోగొట్టును. అన్నభేది, పాషాణాదుల విషమును విరుచుట కిచ్చెడు మోతాదు 30 మొదలు 90 గోధుమగింజలయెత్తువరకు ఇయ్యనగును. గచ్చకాయ పప్పు చూర్ణమునకు సమముగ శొంఠి, పిప్పలి, మిరియాల చూర్ణము జయినను కలిపి వాడవచ్చును. గచ్చపప్పులో వాంతిచేయు గుణ మున్నది. గచ్చపప్పు ప్రత్యేకముగ లోపలికిచ్చునెడల ఒక కాయ పప్పులో సగమునుగాని కొంచె మధికముగా గాని 24 గంటల కాలములో అప్పుడప్పుడు కొద్దికొద్దిగ నియ్యనగును. గచ్చకాయలోని పప్పు గంధము తీసి తేలుకుట్టినచోట అంటించి నిప్పుతో కాచిన తేలు విషము హరించును. మరియు ఆగంధమును, గవదబిళ్ళలు (Glandular swellings) అడ్డగర్రలు, వృషణములవాపు వీని ప్రథమదశలో పైన పట్టువేసిన నవి హరించును. దీని చూర్ణము ఆముదములో గలిపి క్రొత్తగా లేచిన బుడ్డకు పట్టువేసిన నది హరించును. గచ్చపప్పులోనుండి తీసిన తైలము పూసిన ఈడ్పువ్యాధి (Convulsions), పక్షవాతము మొదలగునవి నివృత్తించును. గచ్చకాయపప్పు ముక్కలు హుక్కాలో పెట్టి పొగపీల్చిన కడుపునొప్పి నయమగును; గచ్చకాయలు కాల్చిన బొగ్గు, పటిక, పోకచెక్కల బొగ్గు ఇవి సమభాగములుగ గలిపి పండ్లుతోమిన చిగుళ్ళ పుండ్లు, చిగుళ్ళవెంట చీము నెత్తుకుకారుట, చిగుళ్ళ ఉబ్బు, నొప్పి మొదలగునవి నివారణమగును. ఒక కోడిగ్రుడ్డులో సుందుసొనలో 3 గోధుమగింజలయెత్తు గచ్చపప్పు చూర్ణము గలిపి వానిని నేతిలో

అట్టుగపోసి వేసి తినిన క్రొత్తగ గనుపించిన వృషణముల వాపు నొప్పి (Orchitis), గర్భకోశములముల (Ovaries) నొప్పి నయము గును. పైనజెప్పిన రీతిని అట్టగ జేసి దినమునకు రెండుపూటల చొప్పున 2-3 దినములు తినవలెను.

గచ్చచెట్టు :—Caesalpinia Bonducella, C. Bondue; Eng. Molucca Bean Tree. Bondue Tree, or Fever Nut Tree. సం* కుబేరాక్షీ, యతుద్రుక్. హిం* కరంజువా, కట్కరంజ్. దీని వేరు రసము వగరుగా, కారముగా నుండును. వాతమును, వాత శూలలను, కష్టవ్యాధులను, అగ్నిమాంద్యమును పోగొట్టును. దేహములోని దుష్టజలమును వెడలించును. ఋతురక్తమును జారీ చేయును. మోతాదు ఒకటిమొదలు రెండుతులముల యెత్తువరకు. దీని లేతఆకులు లేక చిగుళ్ళు వెగటుగ చేదుగ నుండును. వీనికషాయము లేక రసము ఫేదిజేయును; శ్లేష్మరోగము, వాతము, జ్వరము, శూల, అండవాతము వీనిని హరించును. ఋతురక్తమును జారీచేయును; దేహములోని మలముల వెడలించును. చిగురుటాకులను ఆముదముతో వెచ్చజేసి కట్టిన బుడ్డ, అండవాతము హరించును. కషాయము లేక రసముయొక్క మోతాదు 2-3 తులముల యెత్తు.

గజనిమ్మకాయ:—Citrus Lemonum-fruit of. సం* బృహజ్జంబీర. హిం* బడాజంబీర్. చేదు, పులుపు, వగరు రుచులు గలిగి యుండును. చలవజేయును; పైత్యము, క్రిమిరోగము, కఫపైత్యము, చర్ది, దాహము, శూల, వీనిని హరించును; నోటిని శుభ్రపరచును; జఠరదీప్తి నిచ్చును; మలబద్ధమును విప్పును.

గజపిప్పళ్ళు:—Pothos Officinalis, Scindapsus Officinalis. సం* గజకణా, గజపిప్పలి. హిం* గజపీపల్. దీనిని ఏనుగుపిప్పలి

యందురు. ఇది కారముగ నుండును. అగ్నిదీప్తి నిచ్చును; కాక జేయును; వాతము, శ్లేష్మము, అతిసారము, శ్వాస, కంఠరోగము, క్రిములు వీనిని హరించును. వీని కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు; చూర్ణపు మోతాదు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు.

గడ్డిదవనము:—Wild Indian Southern Wood. సం* చోరక, దుష్పుత్రి. దీనికషాయము లేక చూర్ణము లేక రసము చలవ జేయును; పైత్యకుష్ఠులు, విషము, రక్తదోషము వీనిని గొట్టును. బలమును, పుష్టిని, కాంతిని యిచ్చును. కషాయపు మోతాదు 3-5 తులములయెత్తు. చూర్ణపు మోతాదు 3 మొదలు 5 చిన్నములయెత్తు. రసపుమోతాదు 2 తులములయెత్తు.

గడ్డిపిట్టమాంసము:—A small bird-flesh of. కాకజేయును. వాతమును హరించును. బలముజేయును. పథ్యమయినది.

గన్నేరుచెట్టు:— Plumieria Alba. Eng. Sweet scented olernder. సం* చండాతక, అశ్వఘాతుక. హిం* సఫేద్ కనేర్. దీనిని పెద్దగన్నేరు చెట్టని యందురు. ఇది పెద్దఆకులును లోపల పచ్చరంగునుగల తెల్లని పుష్పములుపూయు పెద్దచెట్టు. దీనివేరు లేక మ్రానుచెక్క నూరి కట్టిన గడ్డలు, కంతులు హరించును. దీని మ్రానుచెక్క లేక వేరు చెక్క లేక ఆకులునూరి నూనెలో లేక చేతిలోవేసి కాచి పూసిన కుష్ఠు, దద్దుర్లు, దురదలు, జంతువిషము హరించును. దీనిపాలు గాఢవిరేచనములు చేయును; మోతాదు ఎక్కువయైనను చంపును, దీనివేరును విషమే. వీనికి విరుగుళ్ళు 1 కలకండ (పటికిపంచదార) చూర్ణము గలిపిన పెరుగు, 2 జిల్లేడు వేరుచెక్క చూర్ణము కలిపిన గేదెపాలు, 3 కరక్కాయలు నీళ్ళతో నూరి తీసిన రసము లేక కషాయము లేక కరక్కాయల చూర్ణము,

గన్నేరుపుష్పములు:— తెల్లగన్నేరు చూడుడు.

గబ్బిలము:—Bat. దీని మాంసము అతిమూత్రమును కట్టును. కుష్ఠురోగమును, వాతమును గొట్టును; మాంసపుకండలకు బలమిచ్చును. నేత్రములను శుభ్రపరచును. దీనిరక్తము నేత్రములకు కాటుకవలె బెట్టిన నేత్రరోగములు మానును. దీని మాంసము వండితీసిన చమురుతో మర్దనచేసిన కీళ్ళలోని వాతపునొప్పులు, నడుము నొప్పులు హరించును.

గబ్బునెల్లి చెట్టు:—దీనిగుణము నెల్లి, చిరునెల్లి చూడుడు.

గరళము:—Snake poison. అనగా సర్పవిషము. దీనిని లోపలికిచ్చిన దారుణమగు కాకజేయును. కండ్లకు వేడిజేయును. దారుణమగు సన్నిపాతము, జ్వరము, వాతము, సర్వాంగశీతలము సర్వదోషములు వీనిని హరించును. సర్వాంగములకు వేడినిచ్చును. స్మృతి దెచ్చును. అజీర్ణవిరేచనముల రంగు పసుపుపచ్చగ మార్చును. దీనిని సాధారణముగ నితర మందుదినుసులతో గలిపి నూరి సన్నముగ మాత్రలు చేసి ప్రయోగింతురు. దారుణ సన్నిపాతము మొదలగు అపాయకరములగు వ్యాధులుగల రోగి జీవించుట దుర్లభమని యెంచినప్పుడు మాత్రము గరళమును ప్రత్యేకము వాడనగును. మోతాదు అరగుంజెత్తు మొదలు 4 గుంజలయెత్తువరకు ఒక్కమారు చనుబాలలో గలిపి ప్రయోగించనగును; వెంటనే మజ్జిగ అన్నము పెట్టవలసియుండును. గ్రహణి, రక్తగ్రహణి, కడుపులో పుండుగల రోగులకు పూపిరితిత్తులు పుండయ్యెరోగము (Phenonia) గరళముగాని గరళమిశ్రమమైన ఔషధములుగాని యియ్యకూడదు; ప్రాణహాని దెచ్చును. మరియు. గాయమునకు, వ్రణములకు గరళ స్పర్శతగిలిన సర్పదష్టమువలె చంపును.

గరిక:— Cynodon Dactylon, Agrostis Linearis - Eng. Huriallee grass, couch grass & creeping panic grass. సం॥ దూర్వా, శతపర్వ. హిం॥ దూర్వా, దూబ్. ఇందు తెలుపు రంగు గలదియు నున్నది. వీని వేళ్ళరసము లేక కషాయము చలవ జేయును, విసర్పి రక్తదోషము, విదాహము, క్రిమిరోగము, మూత్రదోషమును, పైత్యము, కఫము, శ్వాస, తాపము వీనిని పోగొట్టును. గంధక దోషమును, విషమును విరుచును. తెల్లగరిక కిని యివే గుణములు, గాని తెల్లగరిక శ్రేష్ఠము. రసము మోతాదు 2-8 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తుల ములయెత్తువరకు.

గలిజేరుచెట్టు:— తెల్లగలిజేరు చూడుడు.

గవ్వలు, దీనిభస్మము:—Cypraea Moneta - Eng. Porcelaneous shells. సం॥ వరాటిక, కరాట. హిం॥ కౌరీ. యిది 3 జాతులు. తెలుపు, ఎరుపు, పసుపు రంగులు గలిగియుండును. దీనిని శుద్ధిచేసి, భస్మముచేసి వాడుదురు. కారముగ చేదుగనుం డును. దగ్గు, వగర్పు, కఫము, కామిల, యకృత్ ప్లీహరోగములు (Enlargement of liver & spleen) ఉబ్బసము, అగ్నిమాంద్యము, శూలలు వీనిని హరించును. మోతాదు ½ మొదలు 1½ అణాలు యెత్తువరకు.

గసగసాలు:— Papaver Somniferum. Eng. poppy seeds. సం॥ ఖసఖస. హిం॥ ఖసతిల. ఇవి నల్లమందు చెట్టుగింజలు. చలవ జేసి నీరుపెట్టును; ఉష్ణ దేహముగలవారిపొట్టకు బలమిచ్చును; శాకనణ చును; మలబద్ధము జేయును; గ్రహణిని కట్టును; కొంచెము మత్తు గలి గించును. వీర్యపుష్టి జేయును; నీళ్ళవి రేచనములుకట్టును; నిద్రదెచ్చును; బలము జేయును; పైత్యమును పక్వపరచును. కడుపు బిగబట్టును; పంచ

దారతో 10 గ్రాములు తినిన గుండెలను శుభ్రపరచును; పొడిదగ్గు లకు, క్షయలకు మేలుజేయును. మెదడుకు ( Brain) గురదాలకు (Kidneys) సత్తువజేయును. బాదముపప్పుతో తినిన మంచిరక్త మును బుట్టించును. దేహపుష్టి నిచ్చును. వీనిని కొంచెము వెచ్చజేసి చూపించి తేనెతో బుచ్చుకొనిన ధాతుపుష్టి జేయును. ఎల్లప్పుడు దినుచుండిన ఇంద్రియమును జెరుపును.వీనిని కొద్దిగ వెచ్చజేసి గుడ్డను మూటగట్టి వాసనజూచిన నిద్రదెచ్చును. మోతాదు 4 అణాలు మొదలు 8 అణాల యెత్తువరకు.

గాజరగడ్డలు:—Dancus Carota. Eng. The Carrot. సం॥ గర్జర, పిండమూల, పీతకంద. హిం॥ గాజర్, ఇవి ముల్లంగిదుంపలవలె ఎర్రగాను, పచ్చగాను, రెండువిధములుగా నుండును. దీనిని కేరటు దుంప లందురు. పైత్యము, కఫము, వాతము, కాకదగ్గు వీనిని హరించును. ముంతగుండె (Heart) ను శుభ్రపరచును. బలము జేయును. పొట్టకు బలమిచ్చును. మృదువుపరచును. పుంస్త్వమును హెచ్చించును. వీర్యమును పుట్టించును. లింగమునకు బలమిచ్చును. కఫమును తీసివేయును. దగ్గువణచును. రొమ్ము, పొట్ట, ముంతగుండె వీనిలోని నొప్పులను పోగొట్టును. గురదాల ( Kidneys ) లోను, మూత్రపుసంచి (Bladder) లోను, పుట్టెడు రాళ్ళను తీసివేయును; మూత్రము గావించును. త్వరగ జీర్ణమగును. ప్రాతదగ్గులను, ఉబ్బు లను పోగొట్టును. దీనియాకు మూత్రమును జారీచేయును. దీనివిత్త నములు నూరికట్టుచుండిన లింగమునకు సత్తువనిచ్చును. కొద్దిగ వాత ములు శీఘ్రప్రసవము గావించును.దీనిపుష్పములలోని కింజల్కములు పూటకు తులము చొప్పున యిచ్చిన మూర్ఛను హరించును. తేనెతో చేసిన దీనిదుంపల మురబ్బా విత్తనములకంటె మంచిది. దుంపగాని ఆకుగాని కంచిమేకపాలతో వండి తినిన మంచిరక్తమును

బుట్టించుచు. ఈదుంపలకూర అనుదినముపుచ్చుకొను చుండిన ఒక్కిలి స్త్రీసంభోగ శక్తి కలుగును. దీని కషాయముయొక్క మోతాదు 5 తులములు విత్తనముల మోతాదు 2 అణాల యెత్తు మురబ్బా మోతాదు ½ తులము మొనలు 1 తులము.

గాజుగిన్నె :—Taking food in porcelain dish or cup. దీనిలో ఏపదార్థము వేసినను కిలమూరకుండును పరిశుభ్రముగాను, సంతోషముగా నుండును. దీనిలో భోజనము త్రిదోషహారమైనది. ఆరోగ్యముగ నుండును.

గాజుప్పు:—కాచలవణము చూడుడు.

గాడిదగడపాకు:—Aristolchia Bracteata. సం॥బస్త్రాంద్రీ, విమగంధికా,కీట హారీ.హిం॥కీడామారీ దీని వేరు,కాడ,ఆకువికారమైన చేదుగ వెగటుగ నుండును. విరేచనము జేయును. వాతము, సర్పవిషము, క్రిమిరోగము, తామర, గడ్డలు, పొక్కులు, చిడుము మొదలగు చర్మరోగములు, కడుపునొప్పి, ముట్టుశూల వీనినివారించును. ఋతురక్తమును జారీచేయును. కడుపునొప్పిగల విరేచనములకట్టును. పచ్చిఆకునకు ఆముదముపూసి వెచ్చజేసి బొడ్డునకు కట్టిన బిడ్డలకు విరేచనము జేయును. క్రిములు చచ్చిపడును. పచ్చిఆకు నూరి ఆముదము కలిపిపూసిన బిడ్డల కరపాణి, పెద్దల తామర మొదలగు చర్మరోగములు నివారణమగును పచ్చిఆకులు ఆముదములో వేసి కాచియిచ్చిన బిడ్డల కడుపునొప్పి నిమ్మళించును. గాయములలో, వ్రణములలో ఆకురసము పోసినను, ఆకునూరి కట్టినను, వానిలోని పురుగులు చచ్చును. దీని ఆకు పసరులో మాల్కంకిణి విత్తులు, సముద్రపాల విత్తులు, మిరియాలు వేసి నూరి ఒంటికి పూసిన ఆహిక జ్వరము (వరుస జ్వరము) నివృత్తించును. ప్రసవ వేదనలో స్త్రీలకు ఆకు రసము 90 చుక్కలుగాని, వేరుచూర్ణము 90 గోధుమగింజల యెత్తుగాని,

సమూలపు తేలిక కషాయము 5-6 తులములయెత్తుగాని యిచ్చిన సుఖప్రసవమగుదురు. పైజెప్పిన వాతము మొదలగువానికి పచ్చి ఆకులు, వేరుచూర్ణము, సమూలకషాయము, లోపలి కియ్యనగును. పచ్చిఆకులు దినమునకు 2-3 ఆకులియ్యవలెను. వీనిని నూరి నీళ్ళలో గలిపి యియ్యవచ్చును. వేరుచూర్ణము 2 మొదలు 4 అణాలయెత్తు చొప్పునను తేలికకషాయము (సమూలముతో చేయబడినది) 2½ మొదలు 5 తులములయెత్తు చొప్పునను దినమునకు రెండుపూటల నియ్యనగును. తేలికకషాయము జేయువిధము. తులమున్నర సమూలమును 30 తులముల మరుగు నీళ్ళలో వేసి దింపి మూతవేసి అరగంటయుంచి వడియకట్టి వాడనగును. పువ్వుకాయతోనున్న చెట్టు కషాయమునకు అనుకూలించును. ఎండినఆకుల తేలిక కషాయమిచ్చినను క్రిమివ్యాధి, జంతువాతము నివారణమగును; నెత్తురుగడ్డలు, పొక్కులు, పుండ్లు మొదలైన చర్మరోగములును నివారణమగును. ఆకులు ఆముదములోవేయించి నూరినముద్ద సుమారు నారింజకాయంత తినిపించిన గుఱ్ఱములవాతము, పశువులవాతము, కడుపునొప్పి నివారణమగును; విరేచనముచేయును. చూలుతోనున్న పశువులకు, గుఱ్ఱములకుఇచ్చిన గర్భస్రావము గలుగును. దీని ఆకులు 5 మిరియములు 11 కలిపినూరి శనగలవలె మాత్రలుగట్టి వుదయము సాయంకాలము మంచినీళ్ళతో వారం దినములు యిచ్చిన కడుపులోని పాములు నులిపురుగులు పడిపోవును. చిన్నబిడ్డలకు అరమోతాదు.

గాడిదపాలు:—Ass milk. ఇవి మనిషి పాలవలె పలచగ నుండును, తేలికగ జీర్ణమగును, మిక్కిలి కాకజేసి వాతమును హరించును. శిశువులకు వచ్చెడు దగ్గులు, ఉబ్బసదగ్గు, పొడిదగ్గు, నీరుచురుకును బోగొట్టును; ప్రేగులకు; మూత్రపుసంచికి బలమిచ్చును; విడిచివిడిచి వచ్చు జ్వరమును కట్టును. యీపాలు శిశువు పుట్టిన రోజుమొదలు

8 దినములు పోసిన యడల శ్లేష్మ వాత దోషములు రాకుండ జేయును.

గాడిదమాంసము:—Flesh of an ass. దీని మాంసము వేడిజేయును. జఠరదీప్తి నిచ్చును. మూత్రరోగము, శుక్లదోషము, మలబద్ధము, క్రిమిరోగము వీనిని హరించును.

గాడిదమూత్రము:—Ass urine. కొంచెము ఉప్పుగ వెగటుగ నుండును. మిక్కిలి వేడిజేయును. ఉన్మాదము, అపస్మారము, పైత్యరోగము, కుష్ఠురోగము, క్రిమిరోగము వీనిని బోగొట్టును. లోపలికిచ్చెడు మోతాదు 2 మొదలు 4 తులముల యెత్తువరకు.

గాడిద లద్దె:—Ass dung. దీనిరసము లోపలికిచ్చిన ప్రసవస్త్రీల గర్భమందుండెడు దుష్టరక్తమును స్రవింపజేసి సూతికలను హరించును. దీనిని వెచ్చజేసి పొత్తికడుపునకు కట్టినను ప్రసవస్త్రీల మైల రక్తమును వెడలజేయును. పొత్తికడుపులోని శూలను బోగొట్టును; లోపలికిచ్చెడు మోతాదు 2-3 తులముల యెత్తు.

గాదరదుంప:—అడవియుల్లి చూడుము.

గానము:—Singing or Music. ఆనందకరముగ నుండును, విచారమును, మనోవ్యాకులతను పోగొట్టును. ఆయుర్వృద్ధి నిచ్చును. మనశ్శాంతి నిచ్చును.

గాయపాకుచెట్టు:—బీజపత్రము చూడుడు.

గాయిజుబాన్:— గాజుబాన్ చూడుడు.

గారచెట్టు:— Balanites Roxburghii, Ximenia Aegyptiaca. సం॥ ఇంగుదీ, అంగారవృక్షః. హిం॥ హింగోట్, గోన్ది. దీనిచెక్క లేక వేళ్ళరసము లేక కషాయము కారముగ, చేదుగను, లఘుగుణము ఉష్ణవీర్యము, కటువిపాకముగలది. క్రిమి, విషము, శూల, బొల్లి, కుష్ఠు, వ్రణము, కఫము పోగొట్టును. దీనివిత్తుల చూర్ణము జల

మును, వీర్యవృద్ధి నిచ్చును. రసపుమోతాదు 2-3 తులముల యెత్తు కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు.

గారనూనె:—Oil of the seeds of do. విరేచనము గావించును. శీఘ్రముగ దేహమున వ్యాపించును. పైత్యమును హరించును. చలవజేయును. దేహపుష్టి, బలము, కాంతి వీనినిచ్చును.

గారపండు:—Fruit of do. చేదుగ, తియ్యగనుండును. ఉష్ణవీర్యము కటువిపాకముగలది. వేడిజేయును. కఫవాతములను, క్రిమిరోగమును పోగొట్టును. తేనెతోగాని, చనుబాలతోగాని నరుగదీసి యిచ్చిన బిడ్డలదగ్గు, శ్లేష్మము హరించును.

గారెలు:—A kind of round cakes. వీర్యవృద్ధి నిచ్చును. వాత మణచును. తేలికగ నుండును. విరేచనము జేయును. నేతితో వండి నవి మేహ వాతమును హరించును. గ్రహణిరోగమును పోగొట్టును. నూనెతో జేసినవి శీతపైత్యము జేయును. కఫమును దగ్గును పుట్టించును. గురుత్వముగ నుండును. గారెలకు విరుగుళ్ళు 1 ఖండశర్కర, 2 బిడాలవణము, 3 ఇంగువ, 4 అల్లము.

గాలిలో పరుండుట:—Sleeping in open air. చల్లనిగాలి అమితముగ వీచెడుచోట పడుకొనుటవలన బద్ధకము, దేహమునందు నొప్పులు గలుగును. వాతము ప్రకోపించును. జ్వరమున్న యెడల దోషించును. అసౌఖ్యమైనదిగను, అనారోగ్యమైనదిగ నుండును.

గిలగిచ్చ:—Crotolaria Verrucosa, C. Seuicea. సం॥ ఘంటారవ, బృహత్పుష్పి, హిం॥ శణహులీ, ఝున్ఝునిరియా, గిలిగింతి యనియు నందురు. దీని వేరు లేక ఆకురసము లేక కషాయము వెగటుగ నుండును. ప్లీహ (enlargement of spleen), గుల్మము, జ్వరము వీనిని హరించును. దీని ఆకు రసపుపట్టువలన నోటవచ్చెడు చొల్లును కట్టును. ఆకును కాడలను నూరి పైనబూసిన కుష్ఠు, సగ్పి,

చిడుము మొదలగు చర్మరోగములు నివృత్తించును. రసపు మోతాదు 2-3 తులములమెత్తు. కషాయపు మోతాదు 2 మొదలు 5 తుల ములమెత్తువరకు.

గుంటకలగర :— Eclipta Prostrata, E. Erecta & Verbesina Calendulacea. (white-yellow-Blue varieties) సం* భృంగ రాజ, కేశరాజ, కుంతలవర్ధన. పచ్చపువ్వుల జాతికి సం॥స్వర్ణభృంగ హరివాస. దీనిలో తెలుపు, పసుపు, నలుపు అను మూడు జాతులు గలవు. ఇందులో నల్లపువ్వులది శ్రేష్టమైనది. నల్లగుంటకలగరకు యీదిగువ గుణములుగాక యెక్కువ గుణములకు నల్లగుంటకలగర చూడుడు. హిం* భాన్‌గ్రా, భంగరియా. దీనిఆకురసము లేక కషా యము చేదుగనుండును. పైత్యము, వేడిజేయును. దేహములోని మలముల వెడలించును. పాండువు, కుష్టు, దురద, దగ్గు, జ్వరము, ఉబ్బు, ఉదరము, కఫము వీనిని కూరించును. కండ్లకు చలువజేయును. వెంద్రుకలకు నలుపుదెచ్చును. బలమిచ్చును. బుద్ధిని, ఆయుర్వృద్ధిని యిచ్చును. దీనిని కూరజేసి పుచ్చుకోవచ్చును. రుచిగనుండును. రక్త మును శుభ్రపరచును. పైనజెప్పిన గుణములు గలిగియుండును. దీని సమూలము పచ్చిది, నూరి నూనెలోగలిపి పూయుచుండిన ఏనుగు కాలిరోగము (Elephantiasis) నివృత్తించును. ఆకురసము నొప్పిని తీయును. ఈరసములో నూనెగలిపి వ్రాసుకొనిన తలనొప్పి హరిం చును. దీని వేళ్ళను నూరి కొద్దిగఉప్పుగలిపి తినిన మూత్రపు మంట నివృత్తించును. మోతాదు అరతులముమెత్తు. దీని సమూల రస ములో కాళ్ళు చేతులు గంటకాలముంచిన దేహములోని పాదరసము దిగిపోవును అనుదినము ఉదయపుపూటలను 3 చిగుళ్ళు (దళములు) 3 మిరియపుగింజలు చొప్పున 15 లేక 20 దినములుతినిన, అస్థిగత, పురాణ, ఆహికజ్వరములు, పాండువు మొదలగు రోగములు నివృ

త్తించును. ఆకరసము పుక్కిలించిన నోటిరసపుపట్టు నివృత్తించును. పుచ్చుకొను రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులముల మెత్తు. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములమెత్తువరకు. దీని వేరు విరేచనకారి. వమనకారి. కార్జము (liver), ప్లీహ (spleen) వీని రోగములను పోగొట్టును. దీని వేరురసము లేక కషాయము వాడనగును.

గుగ్గిలము:—Balsamodendron Pubescens - resin of. Eng. Bdellium. సం॥ గుగ్గులు, దేవధూప. హిం॥గుగుల్. ఇది గుగ్గిలపు చెట్టు జిగురు. గుగ్గిలములు నాలుగు విధములు. 1 రత్నపురి గుగ్గిలము, 2 తెల్లగుగ్గిలము, 3 పుట్టగుగ్గిలము, 4 మహిసాక్షి గుగ్గిలము, అని. ఇందు రత్నపురి గుగ్గిలము, తెల్లగుగ్గిలము, మహిసాక్షిగుగ్గిలము ఔషధోపయోగములు. పుట్టగుగ్గిలము ధూపములకు, రంగులకు నుపయోగింతురు. మహిసాక్షిగుగ్గిలముయొక్క గుణములు వేరుగ వ్రాయబడినవి. మృదువుగ, జిగటగ, సువాసనగ, చేదుగనుండును. వేడిజేసి ఆర్పును. లోపలికిచ్చిన రక్తము శుభ్రపరచును. చెమట పుట్టించును. మూత్రమును జారీచేయును. పొట్టకు బలముజేయును. మృదువు పరచును. శరీరమునకు కాంతిదెచ్చును. రక్తపైత్యము, కఫము, మేదోరోగము, శ్లేష్మము, క్రిమి, ఉన్మాదము, మూల వ్యాధి, దుష్టవ్రణములు, గ్రంధులు, గండమాలలు, వాతము, దుష్ట రక్తము, ప్రాతనొప్పులు, విషము వీనిని హరించును. గడ్డలను, కంతులను, కరగించును. నరములరోగములు, గొంతుకనొప్పి, గుండె లలోని దోషములు, అమిత నడకవలన గలిగిన కాళ్ళవాపు వీనిని పోగొట్టును. బుద్ధికి బలమిచ్చును. కడుపులోను, గుండెలలోను కూడి యున్న చెడురక్తమును శుభ్రపరచును. శీఘ్రప్రసవము గావించును. స్త్రీల ఋతుబద్ధమును విప్పును. నడుమునొప్పి, కాళ్ళనొప్పి, కీళ్ళ నొప్పి వీనిని హరించును; స్త్రీలకు పాలు పడజేయును. మూత్రపు

సంచి (bladder), ఫులవకాయల (kidneys) వీనిలో పుట్టు రాళ్ళను, నరముల మార్గములలో పుట్టు గట్టిపదార్థములను దీసి వేయును. విరేచనముల కట్టును. వేడిగేసెడు విరేచనౌషధములలో గలిపిన వాని వేడిని తగ్గించును.ఎర్రగుగ్గిలము తేనెతోగలిపి గొంతుక వాపుకు పట్టువేసిన నయమగును. ఆవుపాలలో గుగ్గిలము గలుపుకొని పుచ్చుకొనిన పుంస్త్వమునకు బలముజేయును. ఇతర రుగ్మతలకు దీని చూర్ణము వేడినీళ్ళలో గలిపి పుచ్చుకొనవచ్చును. దీనిసత్తువ 20 సంవత్సరములవరకు దేహమందు నిలచియుండును. ఉదయమున నోటవచ్చు ఉమ్మిలో దీనిని అరగదీసి పైనపూసిన లేక పట్టువేసిన గడ్డలు హరించును. బుడ్డకుపూసిన నది కరగిపోవును. దీనిని సురంజాను అను దుంప (Its Latin name is Hermodactylus) తో పుచ్చుకొనిన మూలవ్యాధి మొలకలు ఊడిపడును. దీనిని మూలవ్యాధికి పట్టువేసినను మేలుజేయును. దీనిపొగపుచ్చుకొనినను. దీనిపొగ బట్టినను మూలవ్యాధి నయమగును. దీనిపొగ దుర్గంధపుగాలికి, అంటు విషపు గాలియొక్క దోషమును పోగొట్టును. తేలు కుట్టినచోట దీనిని పూసిన విషము హరించును. దెబ్బతగిలిన చోట పూసిన వాపు హరించును. పట్టువేసిన గాయములో కూడియుండు దుష్టరక్తమును శుభ్రపరచును. గండమాలలను, కంఠముపైన నయ్యెడు గడ్డలు మానును, దీనిని నూనెవేసినూరుచూ నీళ్ళతో 4-5 పర్యాయములు కడుగుచుండిన జిగురువచ్చును. దానిని దళసరిగుడ్డకు వేసి పట్టువేయవలెను. దీనిని తినిన కడుపులోని వాపుల తీసివేయును. నల్లదబ్బ (spleen)కు జబ్బుచేయును. దీనికి విరుగుడు జాపత్రి. మోతాదు పూటకు 3 మొదలు 10 చిన్నములమెత్తువరకు.

గుడ్లగూబ మాంసము:—**Owl-flesh of.** భీతిని పోగొట్టును. జ్వరమును, పైత్యమును హరించును.

గుమ్మడికాయపండినది:— Cucurbita Maxima. Eng Squash gourd. Pumpkin-ripe. సం* కూష్మాండ, గ్రామకర్కారు. హిం* లాల్ పేఠా, ఖిలయాకద్దూ. బాగుగా ముదిరిన పండిన గుమ్మడికాయ పండిన మధురముగ నుండును రుచిబుట్టించును. దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి, మేహశాంతి జేయును. మల మూత్రముల గావించును. పైత్యరోగము, మూలవ్యాధి, దాహము, తాపము, కడుపుబ్బు వీని నణచును. దుష్టరక్తమును బుట్టించును. ఆలస్యముగ జీర్ణమగును; వాతము జేయును; దీనికి విరుగుళ్ళు 1 శొంఠి, 2 కాకఔషధములు, 3 కానుగవేరు రసము. ఔషధసేవలో పథ్యమైన వస్తువు.

గుమ్మడికాయ లేతది :— Pumpkin-tender. దీని కూర మిక్కిలి వాతము, రక్తపైత్యము, అగ్నిమాంద్యము జేయును; దుర్బలదేహులు; రోగులు దీనిని పుచ్చుకొనగూడదు; మిక్కిలి అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు గుమ్మడికాయ ముదిరినది చూడుడు.

గుమ్మడిపువ్వులు:—Flowers of pumpkin plant. పైత్యమును, సన్నిపాతములను హరించును; వీనిని కూరవండుదురు.

గుమ్మపాలు:—ధారోష్ణాలు చూడుడు.

గుమ్మడికొనలకూర:—Curry of the tender leaves of pumpkin plant. తియ్యగుమ్మడి తీగెకొనల అనగా లేత ఆకులకూర ఆమదోషము, వాతము, గుల్మము, జ్వరము, ఉబ్బు, విదాహము వీని నణచును; జఠరదీప్తి నిచ్చును.

గుమ్ముడు చెట్టు :— Gmelina Arborea & G. Parviflora. సం* గంభారీ, కాశ్మరి, శ్రీపర్ణి. హిం* కుంభేర్, కంభడా. దీనిని పెగ్గుమ్ముడని, గుమ్మడిటేకని, టేకగుమ్ముడనియు అందురు. ఇది పెద్ద వృక్షము, మ్రాను తెల్లగనుండును. ఆకులు రావాకులను బోలి పెద్ద

గా దళసరిగనుండును. కాయలు చిన్ననిమ్మకాయలవలెను అతియ పాత్ర ఆకారముగనుండి బూడిదసరసి యుండును. చెట్టునరికిన పాలు వచ్చును. యిది దశమూలములలో నొకటి. దీని లేతఆకుల తేలిక కషాయము, సెగరోగము, మూత్రపుసంచినుండి దుష్టజలము కారు రోగములు మాన్పును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తుల ములు వేరు చెక్క, చెట్టుచెక్క కషాయము, చూర్ణము, సమస్త జ్వరములు, కఫము, వాతము, గుల్మము, మేహము, గ్రహణి, క్షయ, పాండువు, శోభ, ప్రదరము, రక్తపైత్యము, రసదోషము, సవాయిరోగము, వాత, మేహవాతనొప్పులు వీనిని హరించును. శరీరతిత్యమును మాన్పును. చూర్ణపుమోతాదు పూటకు 8 మొదలు 6 చిన్నముల యెత్తువంతు. కషాయపుమోతాదు 8 మొదలు 5 తుల ములయెత్తు చొప్పున సేవించవలెను. దీనివేరుచూర్ణము యష్టిమధుక చూర్ణము కలిపి తేనె పంచదారతో నిచ్చిన స్త్రీలకు పాలు వృద్ధి జేయును.

గురజకాయ:- Green fruit of certain plant. వెగటుగా, చేదుగా, స్వాదుగా నుండును. జఠరదీప్తినిచ్చును. తేలికగ నుండును. రుచి బుట్టించును. కఫవాతము, గ్రహణి, పాండువు, ఉబ్బు, క్రిమి, మేహము, కుష్ఠు, స్త్రీల రజోశూల వీనిని పోగొట్టును. విరేచనబద్ధము, వాత పైత్యమును జేయును.

గురజకూర:— Curry of the leaves of do. సం॥ ఉత్తుండిగా, కాకతుండి. చేదుగా, వెగటుగా నుండును. వేడిజేయును. అగ్నిదీప్తి నిచ్చును. జ్వరము, కఫము, పాండువు, ఉబ్బు, మేహకుష్ఠు, క్రిమి రోగము, శ్వాస, కాస, వీనిని హరించును. వాత పైత్యము జేయును.

గురుగింజచెట్టు:— గులివింద చెట్టు చూడుడు.

గురుగుకాయ:—Green fruit of certain pot herb. వీని కూర పుల్లగా, వెగటుగానుండును. రుచి బుట్టించును. కాకను అగ్నిమాంద్యమును నణచును మలమూత్రబద్ధము, శూలలు వీనికి పథ్యముగ నుండును. మిక్కిలి శ్లేష్మము బెంచును. వాతపైత్యము జేయును.

గురుగుచెట్టు:—A certain pot herb. దీనియాకు కూర వండి తిందురు. రుచిగానుండును. మేహశాంతి, పైత్యశాంతి జేయును. అగ్నిదీప్తి నిచ్చును.

గుర్రపుపాలు:—Milk of mare. ఉప్పగా పుల్లగా నుండును. జఠరాగ్నిని వృద్ధిబొందించును శ్వాసను, వాతమును హరించును. తేలికగ నుండును. వీర్యవృద్ధి జేయును. కొద్దిగ మత్తుజేయును. క్రిమిని హరించును 12 సంవత్సరములలోపు వయస్సుగల బిడ్డలకు 5-6 దినములు విడవకుండ నీపాలు త్రాగించిన స్ఫోటకము రాకుండ జేయును.

గుర్రపుమాంసము, నురుగు, డెక్కలు :—Flesh, forth & hoof of a horse. దీని మాంసము రుచిగా నుండును. గురుత్వము జేయును. బలము నిచ్చును. వాతపైత్యరోగుల కనుకూలముగ నుండును. వీర్యవృద్ధి, దేహపుష్టి జేయును. గుర్రపుతొడలలోని నురుగు ఆడుపిల్లల చంకలకు బూసిన నక్కడ వెంద్రుకలు లేవకుండును. ఆడగుర్రపు డెక్కలపొట్టు (scrapings) స్త్రీయోనికి పొగబట్టిన చచ్చిన పిండము పడిపోవును.

గుర్రపులద్దె:—Horse dung. దీని రసముదీసి తేనెతో బుచ్చుకొనిన శ్వాసకాసలను, శూలలను హరించును. దీని రసము ముక్కులో పిండిన, ముక్కువెంట రక్తముపడుట మానును. నరుకునకు, గాయమునకు వేసిన ఆనవాలు కనపడకుండ మానును. దీనిని ప్రసవమయిన స్త్రీలకు త్రాగించిన మైలరక్తము జారీఅగును. మోతాదు 2-4 తులములయెత్తు.

గురిము నెక్కడము:—అశ్వారోహణము చూడుము.

గుల్ఖందు:— Confection of roses. గులాబి పుష్పములతోను, పంచదారతోను జేయుదురు. ఇది మిక్కిలి మేహశాంతి, పైత్య శాంతి, చలవ జేయును. ధాతువులకు సౌమ్యత నిచ్చును. గుండెలకు బలమును, జీర్ణశక్తిని, మనోల్లాసము గలుగజేయును.

గులాబిపువ్వు :— Rosa Damascena, R. Glandulifera. Eng. Rose flower. సం* శతపత్రి, సౌమ్యగంధా. హిం* గులాబ్ కే ఫూల్. ఇవి గులాబీరంగు, తెలుపు, మిక్కిలి యెఱ్ఱగ చిన్నవిగ వుం డును. ముద్దపువ్వులు మొదలగు అనేకరకములు గలవు. వీని ధారణ వలన సువాసనగలిగి మనోహరముగ, ఆరోగ్యముగ నుండును. ఈ పువ్వుల కషాయము సమధాతువు జేయును. బలము నిచ్చును. మన స్సుకు సంతోషము, ముఖ్యతగుండె (heart)కు బలముజేయును. పొట్ట లోని వాతమును, పైత్యమును, కఫమును హరించును. దీని రేకులు సుమారు 4 అణాలయెత్తు తినిన విరేచనమగును. దీని రసమును ముక్కులో పిడిన తలనొప్పిని, శిరోరోగములను పోగొట్టును. గులా బివిత్తులు మూత్రకృచ్ఛ్రమును పోగొట్టును. ఎండుగులాబిపువ్వులు గాని, మొగ్గలుగాని నేతిలో దోరగావేయించి భోజనకాలమందు ప్రథమ కబళముతో తినిన శీఘ్రముగ సుఖవిరేచన మౌను. మరియు వీనిని నీళ్ళలోవేసి కాచిపుచ్చుకున్నను సుఖవిరేచనమగును. విరే చనబద్ధమును బోగొట్టును. ఈ పుష్పములతో షరబత్తులు చేయు దురు. ఇవి మిక్కిలి రుచిగనుండి చలవ, మేహశాంతి, పైత్యశాంతి చేయును.

గుల్ మచ్ పువ్వుల చముురు:—Oil of lilies. ఇది అత్తరువలె చేయ బడును. దీనితో మర్దనచేయడముచేత నడుమునొప్పులు నిమ్మళిం చును. లింగమునకు లేపనముచేసిన సత్తువచేయును. పుంస్త్వమును హెచ్చించును.

గురివిందచెట్టు :—**Abrus Precatorius. Eng. Indian liquorice.** సం॥ గుంజ, శిఖండి, చూడామణి. హిం॥ గుమ్‌చి. దీనిని గురివింద అనిన్ని అందురు. అనగా పూసగురివింద. ఇది యెరుపు, తెలుపు, నలుపు రంగుల పూసలు (గింజలు) గల 3 జాతుల చెట్లుండును. తెల్లజాతి శ్రేష్ఠము. దీని వేరు,తీగె, ఆకురసము మధురముగ నుండును, శోష చేయుచు, దురద, కుష్ఠు, వ్రణము, క్రిమి,రక్తముపడెడు మూల వ్యాధి, వాతము విషము, వాతరక్తము, ప్రమేహము వీనిని హరించును. కాంతి, బలము నిచ్చును; దీనిగింజలలోని పప్పు వీర్యపుష్టి, స్తంభన జేయును; దీని వేరు ఎండినది అతిమధురమువలె నుండును; తల్వామును మృదువుపరచును; గింజల గంధము కంటికిచుట్టు, కణతలను పట్టువేసి వాతసంబంధమైన కండ్లయెరుపు, పోటు, తలనొప్పి నయమగును; గింజనుండి తీసిన తైలముగాని, గింజల గంధముగాని రాయుచుండిన ఇంద్రలుప్తము (పేనుకొరుకు రోగము) నశించును. యీ తైలము శిశ్నమునకు రాసి మర్దనచేసిన దానికి బలముకలుగును, ప్రత్యేకము మూడుగురిగింజల చూర్ణము మనుష్యుని చంపదగిన విషముగా నుండును. దీనికి విరుగుళ్ళు 1 శర్కర గలిపిన చిర్రికూర రసము, 2 ఆవుపాలు, 3 తేనె, ఖర్జూరపుకాయ, ద్రాక్షపండు, పుల్లప్రబ్బలి, చింతపండు, దానిమ్మపండు, పెద్దయీతపండ్లు, ఉసిరికాయల రసము వీనిని సమముగ నేకముచేసి పుచ్చుకొనడమువలన గురిగింజల విషము హరించును. ఆకు రసములో తేనె గలిపి పూసిన వాపు హరించును. ఆకు చూర్ణమునకు సమముగ పంచదార గలిపి తినిన దగ్గులు హరించును. రసపు మోతాదు 2-3 తులముల యెత్తు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు.

గుల్లచిప్పలు:—**Cockle Shells-flesh of.** చిప్పల మాంసము చూడుడు.

గుల్లసున్నము:— సున్నము చూడుడు,

గువ్వ:—Dove-flesh of. దీని మాంసము రుచిగా నుండును. శాక జేసి అర్చును. త్రిదోష హరమైనది. పావురపుపిట్ట మాంసముకంటె ప్రశస్తమైనది; మంచి ఆహారపదార్థము. శుభ్రమైన రక్తమును బుట్టించును. వాతరోగమును, కడుపునొప్పి, కామిల, పాండురోగములను హరించును. దేహతత్వమునకు సౌమ్యత నిచ్చును. రాతి గువ్వయను దానికిని యివే గుణములు.

గువ్వగుత్తిచెట్టు:—సగడపుతీగెచెట్టు చూడుడు.

గంజాయి :— Cannabis Sativa, C. Indica, Eng. Indian Hempa, Ganja. స॥ విజయ, సిద్ధపత్రి, మదన. హిం॥ గేంజా. దీనిని గంజాయి అనియందురు. లేహ్యము మొదలగువానిలో గలిపి గాని, భంగుచేసిగాని మితముగ బుచ్చుకొనిన మత్తుజేయును; ఉత్సాహము, మనోవికాసము, మనోభ్రమిధిరం, దేహపుష్టి, బలము, వాచాలత్వము, వీర్యపుష్టి, వీర్యస్తంభన, బుద్ధిస లత, కామవికారము వీనిని గలుగజేయును; జఠరదీప్తి నిచ్చు ·. మూలవ్యాధి, అగ్నిమాంద్యము, మహాతిసారములు, కుష్ఠిరోగములు, వాతశ్లేష్మములు, క్షయ, కాస, శ్వాస, ఎక్కిళ్ళు, ఉ , కఫరోగము వీనిని హరించును కాయశుద్ధి జేయును. ఆరోగ్యమిచ్చును. అమిత సేవవలన పైత్యమును హెచ్చించి మతిభ్రమ మొదలగు ననేక రోగములను దెచ్చును. మలమూత్రబద్ధము జేయును. దీనికి విరుగుళ్ళు 1 అప్పుడు కాచిన ఆవునెయ్యి. 2 పచ్చిజామిఆకు. దీని పొగ మితముగ బుచ్చుకొనిన మత్తుజేయును. మనోవికాసత, నిబ్బరము వీని నిచ్చును. వాతము, శ్లేష్మము, దగ్గు, శ్వాస, ఆకలిని అణచును. రక్తమును క్షీణింపజేయును. అమితముగ బుచ్చుకొనిన బుద్ధిని జెరచి యనేక దుర్గుణములను బుట్టించును. మరియు దీని యాకుచూర్ణము ముక్కుపొడిగా పీల్చిన మెదడును శుభ్రపరచును. దీని ఆకురసము

తలకు పూసిన చుండ్రు హరించును. పేలు చచ్చును. రసము చెవిలో పోసిన చెవిపోటు, నొప్పి నిమ్మళించును. పురుగులు చచ్చును. ఆ రసము లోపలికిచ్చిన నీళ్ళవిరేచనములు కట్టును. సెగరోగము, మానును. మూత్రమును జారీచేయును. ఆకులచూర్ణమును క్రొత్త గాయములకు వేసినను పుండ్లకు వేసినను నవి మానును. వ్రణము లకు వేసిన నవి అచుకట్టిమానును. సమూలము త్రొక్కి, కట్టు (Poultice) కట్టిన యెఱ్ఱబడి పుండగుట, దద్దుర్లు, పొక్కులు, నరముల సంబంధమైన నొప్పి (Neuralgia) మొదలయినవి నివృత్తించును.. ఆకు లోపలికిచ్చెడు మోతాదు 1 అణాయెత్తు. దీని ఆకునూరి పాలుగలిపి కట్టిన రక్తముపడు మూలవ్యాధి నిమ్మ ళించును. దీని ఆకు, పసుపు, నీరుల్లిపాయలు నూనెలో వేసి కాచి ఆనూనెను మూలవ్యాధి మొలకలకు పట్టించిన నొప్పి శమించును. పచ్చియాకును నేతితో వెచ్చచేసి బిళ్ళగాచేసి అందుపైన వెన్నగాని వడకట్టిన పెరుగుగాని దళసరిగా వేసి ఆబిళ్ళను గుదస్థానమందు కట్టిన మూలశంక బాధ నిమ్మళించును. పచ్చిఆకు చిదుకగొట్టి కొద్దిగ వెచ్చజేసి కండ్లకుకట్టిన కండ్లయెదుట బొమ్మలు చక్రములు కనుపడు ( Photophobea ) అను నేత్రరోగము నివృత్తించును. దీని యొండు ఆకు లోపలికిచ్చిన ఉబ్బసదగ్గు, గాయపుసంధి (Tetanus) నిమ్మ ళించును. మోతాదు పావు (1/4) మొదలు 2 గోధుమగింజల యెత్తు వరకు నియ్యనగును. గంజాయి నేతిలోవేసి వేరియాల చూర్ణము పంచదారతో నిచ్చిన పురాణ నీళ్ళవిరేచనములు కట్టును. గసగసా లతో నిచ్చిన రక్తగ్రహణికట్టును. ఇంగువతో నిచ్చిన అపస్మారము (Hysteria) కట్టును దీనిసారము (Extract) 1 గోధుమగింజ యెత్తు ఇపికాక్యున (Ipecacuna) ½ గోధుమగింజయెత్తు కలపి యిచ్చిన పురాణ కడుపునొప్పులు అద్భుతముగ మానును; దీని

విత్తులను కోళ్ళకు తినిపించిన విస్తారముగ గ్రుడ్లు పెట్టును. కొన్ని పక్షులకు తినిపించిన వానిరంగుమారును. దీనిని భంగుగా చేయువిధము; గంజాయిని ముందుగ నీళ్ళలోవేసి కొద్దిగ పిసికి కసతీసివేసి యెండించవలెను. 1 తు॥ గంజాయి, 1 తు॥ మిరియాలు, యాలకాయ 1 తు॥ యెండుగులాబి పువ్వులు, గసగసాలు, బాదంపప్పు దోస విత్తులు, జాజికాయ, లవంగాలు, మరాటీమొగ్గలు యివి 1 తులం చొప్పున సమభాగములుగా మెత్తగ చూర్ణించి, అందు కొద్దిగ కుంకుమపువ్వుకూడా నూరి కలిపి, ఈచూర్ణమును 1 శేరు పాలు 1 శేరు నీళ్లు కలిపి బాగుగా కాచి వడియగట్టి అందుకు సరిపడునంత పంచదార కలుపుకొని శరీరబలమును, అలవాటునుబట్టి 1 మొదలు 3 ఔన్సులవరకూ పుచ్చుకొనేది. మత్తుజేయును. ఆహ్లాదకరముగను, సంతోషముగను వుండును ధాతువులకు బలమిచ్చును. వుత్సాహము, మనోవికాసము, వాచాళత్వము, దేహపుష్టి, వీర్యపుష్టి. వీర్యస్తంభన బుద్ధికుశలత, కామవికారములనుగలుగ జేయును. జఠరదీప్తినిచ్చును. నిద్రదెచ్చును. గ్రహణిని, రక్తగ్రహణిని కట్టును. అమితముగ బుచ్చుకొనిన వాంతి, వికారము, తలదిమ్ము మొదలగు దుర్గుణముల దెచ్చును. విరుగుళ్ళపైన చప్పబడినవి. దీనితో మాజమునుకూడా చేయుదురు. అదియు మత్తుచేయును.

గెంటెన:—దంతెన చూడుడు.

గెచ్చచెట్టు—గచ్చచెట్టు చూడుడు.

గెద్దమాంసము:—Kite - flesh of. త్రిదోషములను, నీరసమును గొట్టును. దేహపుష్టి, ఆయుర్వృద్ధి, బలము వీనినిచ్చును. వయస్సును నిలుపును. నేత్రరోగుల కనుకూలముగ నుండును. కాస, క్షయను గొట్టును. గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 నెయ్యి.

గనుసుగడ్డలు:—చిరగడము చూడుడు.

గేదంగిపువ్వు:—మొగలిపువ్వు చూడుడు.

గేదెచల్ల :— Buffalo butter-milk. కామిల, పాండురోగము, జ్వరము, కఫరోగము, రక్తముస్రవించు మూలవ్యాధి వీనిని శమింపజేయును. ఈరోగులకు మిక్కిలి పథ్యముగా నుండును. దేహపుష్టి నిచ్చును. అగ్నిమాంద్యము చలవజేయును. వాతరోగమును బెంచును. దీనికి విరుగుళ్ళు చల్ల చూడుడు.

గేదెనెయ్యి:—Buffalo ghee. రుచిగా నుండును. బలము, దేహపుష్టి జేయును. పైత్యము, పాండురోగము, మూలవ్యాధి, కామిల, రక్తపైత్యము వీని నణచును. చలవజేయును. శ్లేష్మమును, దగ్గును బుట్టించును. ఆకలి మందగింపజేయును. దీనికి విరుగుళ్ళు నెయ్యి చూడుడు.

గేదెపాలు:—Buffalo milk. చిక్కగా, రుచిగానుండును. బలము, దేహపుష్టి, వీర్యవృద్ధి. వీర్యమునకు చలవ జేయును. పైత్యము, మూర్ఛ, రక్తపైత్యము నణచును. నిప్పువేడి తగిలిన వారికిని, అతి నిద్రాసక్తులకును, సంగమదోషము నొందినవారికిని, క్షీణదేహులకును గేదెపాలు మంచివి. అగ్నిమాంద్యము, బుద్ధిమాంద్యము, అజీర్ణము, శీతపైత్యము, శ్లేష్మము జేయును. నిద్రదెచ్చును. స్వప్నముల గలుగజేయును. శూలలను బుట్టించును. మూత్రముసంచియందును, గురదాలయందును రాళ్ళను పుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార, 3 సైంధవలవణము, 4 భస్మము, 5 నిమ్మపండ్లరసము.

గేదెపెరుగు:—Buffalo curd. జిడ్డుగా, రుచిగా నుండును. దేహపుష్టి, వీర్యపుష్టి నిచ్చును. కామిలరోగము, గ్రహణి ప్రదరమనెడు యోనిరోగము (కుసుమ) వీనిని శమింపజేయును. వాతపైత్యములను

హెచ్చించును. అగ్నిమాంద్యమును గలుగజేయును. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

గేదెపేడ:—Buffalo dung. చలవజేయును. కామిలరోగము నణచును. కాలుపు మంటను శమింపజేయును. మేహావ్రణమును, గజ్జి వీనిని బోగొట్టును. మంటలను అణచును. కామిలరోగమునకు దీని రసము తేనెతో గలిపి లోపలి కియ్య నగును. మోతాదు 1-2 తులములయెత్తు రసముతో కొద్దిగ తేనె గలిపి యీచొప్పున ఉదయపూటలను 5 – 6 దినము లియ్యనగును. మంటలు గల గడ్డలకు గేదెపేడగాని; గేదెపేడ, అన్నము, అరటిపండు గలిపిగాని కట్టిన నయమగును. ఈపేడను మడమశూల (పుండు)కు కట్టిన బాగవును.

గేదెమాంసము:— Buffalo - flesh. వేడిజేయును. గురుత్వముగ నుండును, స్వప్నములను గలుగజేయును; బలమిచ్చును

గేదెమూత్రము :—Buffalo urine. కాక, పైత్యముజేయును; మొలకలు గలమూలవ్యాధి, ఉదరరోగములు, శూలలు, కామిల, గుల్మము, పాండువు, క్రిమి, ఉబ్బురోగములను బోగొట్టును. దీనిని లోపలికి పుచ్చుకొను మోతాదు 4 మొదలు 12 తులములయెత్తు చొప్పున ఉదయపు పూటలను మాత్రము పుచ్చుకొననగును.

గేదెవెన్న — Buffalo-butter. బలము జేయును; పైత్యమువలన గలిగిన తాపము, శ్రమ వీని నణచును; శుక్లమును, మేదస్సును, వాతశ్లేష్మములను వృద్ధిజేయును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు వెన్న చూడుడు.

గేదెసుగంధి :— Ichuocarpus Frutescens. Eng. Country Sarsaparilla సం॥ అనంతా, ఉత్పలశారిబా. హిం॥ అనంత మూల్. దీని వేళ్ళరసము, కషాయము, లేక చూర్ణము తీసి, చేదు

రుచులు గలిగియుండును. జఠరదీప్తిని, బలమును ఇచ్చును. గ్రహణి, వాతరోగము, పురాణజ్వరము, కఫపైత్యము, విదాహము, అరుచి, రక్తపైత్యము, శూలలు వీనిని పోగొట్టును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 3 మొదలు 5 చిన్నముల యెత్తువరకు.

గేరు:—గైరికము చూడుడు.

గైరికము:—Bole Armenic, Redochre. సం॥ గైరిక. హిం॥ గేరు. ఇవి పాషాణగైరికమని, స్వర్ణగైరికమని రెండు విధములు. అనగా, 1 జేగురురాళ్ళు, 2 వంటజేగురు. వీనిని గేరు అనియు అందురు. జేగురురాళ్ళతో గోడలకు స్థంభములకు రంగు వేయుదురు గాని, లోపలికి తినరు. వంటజేగురు తీపి, వగరు రుచులు గలవి; ఆవు పాలతో సేవించిన చలవజేయును. రక్తపైత్యము, చర్ది, ప్రదర రోగము, (కుసుమ), ఎక్కిళ్ళు, ప్రమేహము, సర్పి, పొక్కులు, పామువిషము, శ్వాస, కాస వీనిని హరించును; కండ్లకు చలవజేయును. అతిసారము, వీనిని పోగొట్టును; ఆకలి నణచును. మోతాదు 1 అణా మొదలు 2 అణాలయెత్తువరకు. దీని అమిత సేవవలన అగ్నిమాంద్యము గలుగును. దీనికి విరుగుడు గాడిద లద్దెరసము. ఈరసము యొక్క మోతాదు పూటకు రెండుతులములయెత్తు మొదలు 4 తులములయెత్తువరకు. మరియు వంటజేగురు పై రోగములకు బలముగ పనిజేయును.

గొంగలిగోరెపాలు:—కురమగోరెపాలు చూడుడు.

గొంతిమగోరుతీగ:—Paederia Foetida. సం॥ ప్రసారిణి, చారుపర్ణీ, సుప్రసార. హిం॥ ప్రసారిణీ. దీనిని సవరపుకాడనియు, లంజ సవరమనియు నందురు. ఇది తీగెగా ప్రాకును; జిగటగా నుండును.

వీర్యవృద్ధిని, పుంస్త్వమును ఇచ్చును. విసర్పి, శ్వాస, కాస, ఉబ్బు, వాతము, విషము, జ్వరము వీనిని జయించును. దీని సమూలము గాని, కషాయముగాని, వాడుక చేయనగును. రసపు మోతాదు పూటకు 3-4 తులములయెత్తు. కషాయపు మోతాదు 5-6 తులములయెత్తు. దీని ఆకుకూర వండితిందురు. గాని ఉత్తర దేశములో ప్రసారిణియను చెట్టుగా దీనిని వాడరు. మరియొక తీగను వాడుదురు. దానికి శాస్త్రములయందు చెప్పిన గుణములు గలిగియుండును.

గొడుగు:—Umbrella. దీనిని ఉపయోగించుటవలన మిక్కిలి సౌఖ్యము నిచ్చును. నేత్రములకు చలవజేయును, గాలి, వర్షము, ఎండ వీని బాధను పొందకుండ జేయును. కాంతినిచ్చును.

గొడ్డుగాకర:—Dioca Momordica which does not bear fruit. సం॥ వంధ్యాకర్కోటకీ, యోగీశ్వరీ, నాగమధనీ. హిం॥ బాంజ్ కకోడా. దీనిని పోతు కాకర అనియందురు. దీనిదుంప, ఆకు రసము, సర్పవిషమును, గ్రహపీడను నివారణజేయును. ఎలుక విషము, కఫవాతము, వ్రణములు, కంటియందు బుట్టెడుపులూతచును వ్రణము, భగందర రోగము వీనిని హరించును. దీని దుంప చూర్ణములో కొంచము కర్పూరము ఒకటి రెండు లవంగముల చూర్ణము కలిపి నస్యము చేయడమువలన శిరోరోగములు పీనసరోగము పోవును. రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు. దీనిదుంప చూర్ణమును పూటకు సుమారు బేడయెత్తు చొప్పున సుమారు 10 తులములయెత్తు పచ్చి ఆవుపాలలోగలిపి స్త్రీలు బహిష్ఠ అయియున్న 3-4 దినములలో ఉదయపు పూటలను పుచ్చుకొని పాలు, నెయ్యి, పంచదార వీనితో పథ్యముగ అన్నము దినుచుండిన వంధ్యాదోషము నివృత్తించును.

గొడ్డుమాంసము:—ఎద్దు మాంసము చూడుడు.

గొబ్బిగింజలు :— Asteracantha Longifolia-Seeds of. సం* కోకిలాక్ష, హిం* తాల్‌మఖానా, అనగా నీరుగొబ్బివిత్తులు. మేహశాంతి, వీర్యవృద్ధి, చలవజేయును; వీనిని నీళ్ళలోనానవేసి వడియకట్టిన జిగటగ, గుజ్జుగవచ్చును. దీనిలో శర్కర కలిపి పుచ్చుకొనినను, పానకములో వీని చూర్ణము కలిపి పుచ్చుకొనినను వెంటనే మేహశాంతి చలవజేయును; సంతోషము నిచ్చును; బలముజేయును; పుంస్త్వమును హెచ్చించును; ఇంద్రియమును ఘట్టిపడజేయును; రక్తములోని దుర్గుణము నణచును. మెత్తగా నూరిన వీని చూర్ణము 2 మొదలు 4 అణాలయెత్తువరకు. చూర్ణములో సమభాగముగ శర్కర గలిపి ఆవు గుమ్మపాలలో వేసి యుదయపు పూటలను 15 లేక 20 లేక 30 దినములు పుచ్చుకొనిన వీర్యవృద్ధి జేయును, వీర్యమును ఘట్టిపడజేయును, ఇంద్రియస్ఖలనము. మూత్రము వెంట ఇంద్రియము పడడము వీనిని గట్టును. సీమగొబ్బి విత్తులను మరి రెంటకజాతిగింజలు గలవు. వానికిన్ని యివే గుణములు.

గొబ్బిచెట్టు:—నీరుగొబ్బి చూడుడు.

గొర్రెచల్ల:— Sheep butter-milk. వాసనగ నుండును. త్రిదోషములను బుట్టించును. నీరసము దెచ్చును. ఉప్పుగలిపి పుచ్చుకొనిన జఠరదీప్తినిచ్చును. అపథ్యమయినది. దీనికి విరుగుళ్ళు చల్ల చూడుడు.

గొర్రెనెయ్యి:—Sheep ghee. వాతము, ఉబ్బు, చేతులు కాళ్ళు వణకెడు రోగము వీనిని హరించును. కఫవాతము, యోనిదోషము, విషదోషము ఈరోగములు గలవారికి పథ్యముగనుండును. పైత్యము, శ్లేష్మము జేయును. దీనికి విరుగుళ్ళు నెయ్యి చూడుడు.

గొర్రెపాలు:—Sheep milk. వీనిని కాచి పుచ్చుకొనిన దేహపుష్టి నిచ్చును. ఎక్కిళ్ళు, వాతము, శ్వాస వీని నణచును. వీర్యమునకు వేడినిచ్చును. కేవల వాతరోగులకును, మిక్కిలి రక్తపూరితమైన దేహములకును, మదోద్రేకముగల వారికిని అనుకూలముగ నుండును;

మెదడునకు, గుండెలకు, ప్రేగులకు మేలుజేయును. ఈపాలు బాగుగా కాయకగాని, పచ్చివిగాని పుచ్చుకొనిన పైత్యము, కాకజేయును; గురుత్వముగనుండును. ఊపిరిగొట్టునొప్పి, కాస, శ్వాస, కఫము, నీరసము, వీనిని గలుగజేయును; అగ్నిమాంద్యము జేయును; తల యొక్క నరములకు నష్టముజేయును; మూత్రకృచ్ఛ్రమును బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార, 3 మజ్జిగ, 4 నిమ్మ పండ్లరసము, 5 పెసలలో నీళ్ళుపోసి మరగపెట్టిననీళ్ళు. దీనిపాలు గొర్రెపొక్కుల (అనగా తెల్లగా బయలుదేరే పొక్కులు) కు రాసి ఆ పైన పసుపు అంటించిన చిదికిపోయి నయమగును.

గొర్రెపెరుగు:—Sheep curd. కఫవాతములను, మూలవ్యాధిని వృద్ధిజేయును; నేత్రరోగములను, అనేకదోషములను బుట్టించును; అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

గొర్రెపేడ:—Sheep dung. అనగా గొర్రె పెంటికలు. దీనిపొగ చెమట నణచును; వాతరోగుల కనుకూలించును.

గొర్రెమాంసము:—Sheep flesh. దీని మాంసము రుచిగానుండును. మేధస్సును పెంచును. వీర్యవృద్ధి, బలముచేయును గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు మాంసము; పొట్టేలుమాంసము చూడుడు.

గొర్రెవెన్న:—Sheep butter. వాతమును గొట్టును; శరీరపుష్టి నిచ్చును; గురుత్వముగనుండును; అగ్నిమాంద్యము గలుగజేయును. దీనికి విరుగుళ్ళు వెన్న చూడుడు.

గొర్రెమూత్రము:—Sheep urine. శ్లేష్మపైత్యముల నణచును; కాకపైత్యము జేయును; కఫవాతము, శూల,ఉదరము, మలమూత్ర బద్ధము, క్రిమి, దురద, పొక్కులు వీనిని బోగొట్టును.

గొలకొవకోడి:—నీరుకోడి చూడుడు.

గొలకొరగడ్డ:—A sort of edible root, రుచిగా నుండును. కఫ వాతమును, క్రిమిరోగమును బుట్టించును. పైత్యమును హరించును.

రుచిబుట్టించును. మూత్రబద్ధము జేయును. బలమిచ్చును. జీర్ణము జేయును.

గొలిమిడిచెట్టు:—నీరుగొబ్బి చెట్టు చూడుడు.

గొలుగుచెట్టు:—A medicinal plant. దీని ఆకురసము లేక కషాయము, బల్లి, మూలవ్యాధి, వాతము, గుల్మము, కఫము వీనిని పోగొట్టును. దీని పండ్లు రుచిగ నుండును. దీని వేరురసము క్రిమిని జంపును. పామువిషమును హరించును. రసపు మోతాదు ౩-౪ తులములయెత్తు. కషాయపు మోతాదు ౩ మొదలు 6 తులములయెత్తు వరకు.

గోంగూర :— Hibiscus Sabdariffa-Red sorrel and Thorny and red varieties. సం* పీలు, అమ్లపీలు, కంటకపీలు. హిం* పీలు, లాల్ బారి. ఇది దేశవాళీగోంగూర, పుల్లగోంగూర, ధనాసారి గోంగూర యను మూడు రకములు. ఇందు ధనాసారి గోంగూరకు ముండ్లుండును. గోంగూరను నీళ్ళలో వుడికించి పారవంచి రసవర్గములు చేర్చి వండినకూర, పచ్చడి రుచిగా నుండును. జఠరదీప్తి నిచ్చును. మంచి పిత్తమును బుట్టించును. కార్జము (liver) కు బలము చేయును. రేజీకటి, మలబద్ధముల బోగొట్టును. వీర్యవృద్ధి బలముజేయును. దీనిలో యినుము (Iron) గలదు. దీని ఆకును వాసినపైసగాని, వుడికించిగాని ఆముదము కొద్దిగచేర్చి గడ్డలపైన వేసి కట్టుచుండిన వానిని శీఘ్రముగ పక్వపరచి పగులచేయును. దీనినే కొంకుదెబ్బలపైననూ, వాపులమీదను వేసి కట్టిన పేరుకున్న రక్తము విరిగి వాపు, నొప్పిని హరించును. (ఇందుకు పుల్లగోంగూర శ్రేష్ఠము) వీని పువ్వులను పప్పులోగాని, కూరలలోగాని వేసి వండుకు తినిన రుచిగానుండును. దీనిఆకుకూర వరుసగా వారం-పది దినములు వండుకుతినిన రేజీకటిమానును. వీనిపువ్వుల రసములో పంచదార,

మిరియపుచూర్ణము గలిపి పుచ్చుకొనిన పైత్యము హరించును. ఈగోంగూరలలో కృష్ణా, గుంటూరు జిల్లాలది శ్రేష్టము. దీనిని పచ్చడిక్రింద తయారుచేసి నిలవయుంచుకొని యప్పటికప్పుడు పచ్చడి క్రింద చేసి వాడుదురు. దీనిని కొన్ని రోగములలో పథ్యముగా వాడుదురు.

గోదావరి నీళ్ళు:—The Godavari water. రుచిగా, మనోహరముగా నుండును; పైత్యవికారము, మేహము, రక్తపైత్యము వీనిని పోగొట్టును; ఆకలి బుట్టించును; దాహమునణచును; దుష్టవ్యాధుల నణచును; శ్లేష్మము, వాతము, శిరోరోగము, పాండువు, ఉబ్బ వీనిని హరించును; యీపవిత్రమైన నదిలో స్నానము చేయుచుండిన మేహపైత్య రోగములు హరించుటయేగాక దేహపుష్టి, బలము, కాంతి, బుద్ధిబలము, ఆయుర్వృద్ధి ఆరోగ్యము నిచ్చును.

గోధుమఅన్నము:—Boiled wheat rice. వేడిచేయును; దేహపుష్టిని, వీర్యవృద్ధి, బలముయిచ్చును; అతిమూత్రమును కట్టును; అరిపోయిన గుండెలు గలవారికిని, దగ్గుగలవారికిని మేలుజేయును;ఆలస్యముగ జీర్ణమగును; దీనికి విరుగుడు సికింజబీను; అతిమూత్రరోగులు నిత్యము పుచ్చుకొనుచుండిన చాలమేలుచేయును. మూత్రములో పంచదార (Sugar) పోవువారికి పథ్యకరమైన ఆహారము.

గోధుమ జావ:—Gruel of wheat grits. గోధుమ నూకల జావ పథ్యమైనది; చర్దిదోషమును, శీతపైత్యమును హరించును; తేలికగ నుండును; బలము నిచ్చును; జ్వరాదిరోగములకు పలచని గోధుమ జావ నివ్వతగియుండును; ప్రేగులకు నష్టము జేయును. దీనికివిరుగుడు గలదు.

గోధుమజావ బాదముపప్పుతో చేసినది:—Do. Prepared with pealed almonds. కాకజేసి చలవజేయును. దగ్గును, గురదాల

నొప్పిని శమింపజేయును. గుండెలకు బలము జేయును. దీనిలో తేనె గలిపి పుచ్చుకొనగూడదు.

గోధుమనూక పాయసము:—Wheat grits boiled with milk. రుచిగా మనోహరముగ నుండును; బలముజేయును; వాతపైత్యముల నణచును.

గోధుమపిండి రొట్టెకూర:—Curry of Wheat flour cakes. అనగా గోధుమపిండి నీటితో కలిపి అరబెట్టి, చిన్నచిన్న ముక్కలు చేసిగాని రొట్టెగా కాల్చి ముక్కలుచేసిగాని, రసవర్గములు వేసి చేసిన కూర మిక్కిలి వీర్యవృద్ధి జేయును. రుచి బుట్టించును. వాతపైత్యములను హరించును.

గోధుమపిండి నేతితో చేసిన పిండివంట:—Cakes made of wheat flour with Ghee. వాతపైత్య రోగమును, హృద్రోగమును బోగొట్టును; వీర్యవృద్ధిని, బలమును ఇచ్చును. రుచిబుట్టించును; కండ్లకు చలవజేయును.

గోధుమపిండి సత్తు:—Flour of fried wheat. వేపివిసిరిన గోధుమపిండి సమధాతువ నిచ్చును; అనుకూలముగ జీర్ణమగును; తాపము నణచును. దీనిలో బెల్లముగాని, శర్కరగాని గలిపిన అనుకూలముగ నుండును. గోధుమపిండి తెల్లమద్దిపట్ట చూర్ణము, మేకపాలు, ఆవునెయ్యి,పంచదారల కలిపి వండి చల్లారినతరువాత తేనెచేర్చి బలానుసారముగ సేవించుచుండిన దారుణమగు హృద్రోగమును మానును.

గోధుమరొట్టె:—Wheat Bread. కాకజేసి అర్చును; దేహపుష్టినిచ్చును; ఆకలి బుట్టించును; బలము, వీర్యపుష్టి జేయును, దాహ మెక్కువజేయును; ఉబ్బురోగులకు మంచిది, ఒంటినీరు దీయును; రక్తమును వృద్ధిజేయును; పిండినానబెట్టకుండ కాల్చినరొట్టె కడుపులో వాయువును బంధించును; గ్రహణి బుట్టించును; రాత్రి పిండి

నానబెట్టి ప్రొద్దుటచేసిన రొట్టె మిక్కిలి ఆరోగ్యముగ నుండును. నేతితో మెదిపి కలిపి కాల్చినరొట్టె ఆలస్యముగ జీర్ణమగును; దీనికి విరుగుళ్ళు 1 జీలకర్ర, 2 పుదీనా, 3 సికింజబీను, 4 దోసకాయి.

గోధుమరొట్టె:—Bread prepared in shops. అనగా గోధుమ మైదాపిండిని నీళ్ళతో నానబెట్టి అందులో కొద్ది కల్లుమడ్డిగాని, సోడా గానివేసి బాగా మర్దించి రొట్టెలపొయ్యిలలో కాల్చిన రొట్టెలు, బన్నులు, బిస్కత్తులు వగయిరాలు రుచిగా నుండును. తేలికగా జీర్ణమగును. సమస్త జనులకు, రోగులకు మంచి ఆహారము. ప్రపంచములో అనేక దేశములలో దీనిని ముఖ్యమైన ఆహారముగా వాడుదురు. దేహపుష్టి, బలము, రక్తవృద్ధి మొదలగు మంచి గుణములు గలుగ జేయును. పథ్యకరమైనది.

గోధుమలు:— Triticum Sativum, T. Vulgare. Eng. Wheat. సం॥ గోధుమా. హిం॥ గేహూ. ఇవి వేడిజేసి అర్చును; అన్నిధాన్యము లకంటె మిక్కిలి బలముచేయును; రక్తమును వృద్ధిబొందించును. అగ్నిదీప్తి, వీర్యపుష్టి, ఆయుర్వృద్ధి, దేహకాంతి వీని నిచ్చును; వాతపైత్యములను, ఉబ్బురోగమును హరించును; నేత్రములకు చలువ జేయును; ఒంటిచెడ్డనీరును దీయును; విరేచనము గావించును; ఉబ్బురోగము గలవారికిని, వాతరోగులకును, గాయములు తగిలినవారికిని. అగ్నితప్తమైనవారికిని మిక్కిలి పథ్యముగ నుండును; గురుత్వముగ నుండును; కాకతత్వము గలవారికిని, అజీర్ణరోగులకును, గ్రహణి, కడుపుబ్బు, అగ్నిమాంద్యము, అజీర్ణము గలవారికి అపథ్యముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 దోసకాయ లేక ములుదోసకాయ, 2 తెల్లయుత్తరేణిక్షారము, 3 బెల్లము, 4 పంచదార, 5 గులకందు.

గోపీచందనము:— Yellow ochre or clay. ఇది పసుపుపచ్చని మన్ను. దీనిని గోడలకు సున్నమువలె వేయుదురు. ఔషధమునకు ఉపయో

గించదు. పేరునకు దీనిని గోపీచందనమందురు గాని నిజమయిన గోపీ చందనము తువరిమన్ను గనుక తువరిమన్ను చూడుడు.

గోమూత్ర శిలాజిత్తు:—శిలాజిత్తు చూడుడు.

గోమేధిక భస్మము:—**Calx of agate.** జఠరదీప్తినిచ్చును. వాతము, పైత్యము, క్షయ, దగ్గు, వగర్పు, జ్వరము, పాండువు, కామిల వీనిని హరించును; కాంతిని, ఆయురారోగ్యముల నిచ్చును.

గోరపిట్ట:—**Maina-flesh of.** దీని మాంసము రక్తపైత్యమును పోగొట్టును. బలము జేయును.

గోరింకపిట్ట:—**Gracula Indica** సం* శారికా, దూతికా. దీని మాంసము రుచిగనుండి చలవజేయును. తేలికగ నుండును.

గోరింతచెట్టు:— **Lawsonia Alba. L. Inermis. Eng. Henna plant.** సం* నఖరంజన, మేధికా. హిం* మెహదీ. దీనిని గోరింట చెట్టు అనియునందురు. దీని మ్రాను చెక్క రసము లేక కషాయము లేక చూర్ణము శరీరతత్వమును మంచికి మార్చును; పాండురోగము ప్లీహరోగము (enlargement of spleen), మూత్రకృఛ్రము, కుష్ఠు మొదలగు కఠిన చర్మవ్యాధులను పోగొట్టును. విరేచనబద్ధము జేయును; దీని కషాయమును పైనబోసిన కాలినపుండ్లు, వేడినీళ్ళవలన గలిగినపుండ్లు మానును. దీనియాకు నూరికట్టిన వ్రణములుమానును. ఆకులకషాయము పైనపోసిన పుండవడము (inflamation), కాలిన పుండ్లు (burns), పీనిమంట, పోటు నివృత్తించును; ఆకషాయము పుక్కిలించిన నోటిపుండు పూత నయమగును. ఆకునూరి కణతలకు పట్టువేసిన తలనొప్పి నిమ్మళించును; ఆకు నూరినముద్దలో కొద్దిగ నూనెయును తుమ్మజిగురును గలిపి యుపయోగించవచ్చును; దీని ఆకు నూరి స్ఫోటకము వచ్చినవాండ్ర అరిపాదములకు కట్టినకండ్లలో స్ఫోటకము తగులదు. ఆకునూరికట్టిన గ్రంథులు హరించును; గాయ

ములు మానును; ఒంటికి బూసిన చిడుము మొదలగు చర్మరోగ
ములు నివృత్తించును తలవెండ్రుకలకు,గోళ్ళకు కట్టిన నవి ఆరోగ్య
ముగ, బలముగ పెరుగును. ఆకురసములో చేసిన తైలము పుండును,
వ్రణమును మాన్పును; ఆకుపసరులో కొద్దిగ నీళ్ళుగలిపి యిచ్చిన
ఇంద్రియనష్టము కట్టును; పాలలో నిచ్చిన చలిజ్వరము కట్టును. ఆకు
నూరి సిరకా కలిపి అరిపాదములకు కట్టిన పాదముల మంటలు నయ
మగును. ఆకుచూర్ణములో సమముగ నీళ్ళుగలిపి యుడికించి కట్టిన
(poultice) వాత మేహ వాతపు నొప్పులు నివర్తించును; ఈకట్టు
రాత్రికట్టి ఉదయమున తీసివేయవలెను. ఆకునూరి వాపు నొప్పిగల
చోట కట్టిన లేక పట్టించిన నవి హరించును. శ్రోత్రగమానినపుండు
పైన వేసిన చర్మము దళసరిబారి బాగగును; ఆకుల లేతకషాయ
ముతో గడిగిన ఓడవాండ్రకువచ్చెడు Scurvy అనురోగము, అన్ని
వ్రణములు నయమగును;పువ్వులతో నింపిన తలగడ తలక్రింద నుంచు
కొనిన నిద్రవచ్చును.పువ్వులతో చేసిన తైలమును స్వల్పగాయముల
(bruises) మాన్పును; వీనిగాఢకషాయముగాని, పువ్వులు, ఆకులు,
చిగురుటాకులు వీనితో చేసినసారము (liquid extract) గాని
పుచ్చుకొనిన కుష్ఠు మొదలగు చర్మరోగములు నివృత్తించును. దీని
విత్తులుతినిన సంధి (delirium) మానును. పచ్చిఆకులు,ఎండు ఆకులు
నూరి ఒంటికి బూయవలెను చెక్కరసము లేక ఆకురసముయొక్క
మోతాదు పూటకు 2-8 తులములయెత్తు చొప్పున, గాఢ
కషాయపు మోతాదు 2 తులములయెత్తుచొప్పున, కషాయపు
మోతాదు 2½ మొదలు 6 తులముల యెత్తుచొప్పున, చూర్ణపు
మోతాదు వేడెత్తు మొ। పావలాయెత్తు చొప్పున,సారపుమోతాదు
60 చుక్కలు చొప్పున, దినమునకు రెండుపూటల నియ్యవలెను.

గోరుచిక్కుడుకాయకూర: — Curry of Dolichos Faboeformis. సం॥ గోరాణీ. హిం॥ గ్వారకీఫలీ. చలవజేసి అర్చును; రుచిగా నుండును; మిక్కిలి పైత్యముజేయును; అజీర్ణము, కడుపుబ్బు వీనిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 గులకందు, 2 జీర్ణపుష్టౌషధములు.

గోరోజనము : — Bezoar. Eng. Gall stone (a corcretion found in the stomach in the gall - bladder of an Ox or Cow) సం॥ రోచనా, గోపిత్తసంభూత. హిం॥ గోరోచన. ఇది ఆవు లేక యెద్దు పిత్తకోశములో పచ్చనిగడ్డలుగ కట్టియుండును. పైత్యము, కాక జేయును. శైత్యతాపము, మదనజ్వరము, విషదోషము, పైత్యమూర్ఛ, క్రిమి, వాతము, కఫపైత్యము, భూతజ్వరము వీనిని హరించును. వీర్యవృద్ధి జేయును; కాంతినిచ్చును; శిశువుల అజీర్ణము, వాతము హరించును;జ్వరమును మాంద్యమును బోగొట్టును; గుండెలకు సత్తువజేయును; అగ్నిమాంద్యమును బోగొట్టును; నరములకు సత్తువజేయును; చెమట బుట్టించును;బిడ్డలకు చనుబాలతో లేక జీలకర్ర నేలిక కషాయములో నిచ్చిన దోషజ్వరము నివృత్తించును; పాము కరచినచోట, తేలుకుట్టినచోట నీళ్ళతో గంధముతీసి పూసిన విషము విరుగును; మిరియాల కషాయముతో నిచ్చిన మరిడిబాడ్యము (cholera) నిమ్మళించును. లోపలికిచ్చెడు మోతాదు గోధుమ గింజయెత్తు మొదలు 4 గోధుమగింజలయెత్తువరకు. దీనిని నేతిలో వేసి కాచి ఆనేతిని నస్యముచేసిన తలనొప్పి నిమ్మళించును; ఆవునేతిలోగాని ఆవు వెన్నలోగాని గోరోజనము నూరి కలిపి దానితో మర్దన చేసిన పట్లుదప్పిన కాళ్ళనరములకు సత్తువజేసి నడువశక్తి గలుగును.

గోడము:—రమ్మునారాయి చూడుడు.

గోజబాక్ : — Cacalia Kleinia, Elephantopus Scaber. Eng. Prickly Leaued Elephants Foot. సం॥ గోజిహ్వా,

గోభీ. హిం॰ గోభీ. దీనినే ఎద్దునాలుక చెట్టందురు. దీని యాకులు సుమారు 1-2 అంగుళముల వెడల్పు 4-5 అంగుళముల పొడవును కంగోరాగలిగి గరుకుగా గబ్బువాసన గలిగి యుండును. వగరుగ చిరుచేదుగ నుండును. దీని సమూలముగా నుపయోగించవలెను. దీనియాకు కషాయము, సారము( Extract ), చూర్ణము పాకము (Syrup) వాడతగి యుండును. ఇది ముంతగుండె (Heart) కు మిక్కిలి బలముజేయును. గుండె లదురు Palpitation of the heart)నణచును. మెదడు (Brain), హృదయము, కండ్లు. చెవులు మొదలగు ముఖ్యావయవములకు మిక్కిలి బలము జేయును. మనస్సుకు సంతోషము గలిగించును. వాతము, పైత్యము, కఫము, ప్రమేహము, జ్వరము, సన్నిపాతము, కామిల, గుండెలమంట, దగ్గు, ఊపిరిగొట్టునొప్పి, మూత్రాశ్మరి ( అంగములో రాయి ) మేహవాత నొప్పులు వీనిని నివారణ జేయును. కుష్ఠరోగము శాంతించును. మూత్రమును జారీచేయును; కాంతి నిచ్చును. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములయెత్తువరకు. సారము 10 మొదలు 20 చుక్కలవరకు. చూర్ణము అణాయెత్తుమొదలు 3 అణాలయెత్తువరకు దినమునకు రెండు పూటలు కొన్నిదినము లియ్యదగును. మరియు దీని ఆకులు 1 పాలు వేడినీళ్ళుగాని, చన్నీళ్ళుగాని 10 పాళ్ళు వేసి చేసిన తేలికకషాయమిచ్చిన జ్వరములోని విదాహము, ఆయాసము, కుదురులేకయుండుట, కడుపులో వికారము, ఓకిరింత, మూత్రకోశములోని మంట, నొప్పి, బొట్టుబొట్లుగాపడుట వీని నణచును. మోతాదు 1 - 2 ఔన్సుల చొప్పున తరుచుగా నియ్యనగును. దీని సమూల కషాయములో కొద్దిగ జీలకర్ర చూర్ణమున్నూ, మజ్జిగ (Butter milk ) యున్నూ కలిపి యిచ్చిన స్త్రీల కుసుమరోగములు, అజీర్ణవిరేచనములు, గ్రహణి విరేచన

ములు కట్టును. మరియు యిది అగ్నిపొట్టకు నష్టముజేయును; దీనికి విరుగుడు శ్రీగంధము.

గ్రద్దమాంసము:—గెద్దమాంసము చూడుడు.

గ్రంథితగరము:—Valeriana Wallichii, & Menyanthes Cristata. Eng. Indian Valerian. సం॥ తగర, కాలానుసార్య, బర్హిష్టం. హిం॥ తగర్ మూల్. దీనిని నేలతప్పిట యని అనుగుత పిట్టయని యందురు. యిది వీటా లేచెడు చిన్నమొక్క, భూమిని అంటి దీనియాకులు ఒకదాని నొకటి ఎదురుగా నుండును. దీని వేరు కొద్ది తీపిగ, చేదుగ నుండును. దీనిరసము లేక కషాయము కఫ వాతములు, తాపము, జ్వరము, సన్నిపాతము, దోషజ్వరములు, సూతికవాతము, ఉన్మాదము, రక్తపైత్యము, అతిసారము వీనిని జయించును, మూత్రము గావించును; పచ్చియాకు నూరి ఆముదములో గలిపి బిడ్డలకు దంతములు వచ్చునపుడు లేచెడు పొక్కులకు పూసిన అవి మానును. రసపు మోతాదు పూటకు 2-3 తులములు; కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

—గ—

# ఘ

ఘృతమరీచి:—Eating ghee and pepper just before taking meals. భోజనకాలమందు ముందుగా నేతితో మిరియపు పొడుము కలిపి పుచ్చుకొనిన జఠరదీప్తి నిచ్చును. రుచిబుట్టించును; ముఖము, కంఠము వీనిని బుట్టినరోగములు, క్రిమి, కుష్ఠు, దురదలు వీనిని హరించును; బుద్ధిబలము, దేహపుష్టి, బలము వీనినిచ్చును.

ఘృతాపోశనము:-Sipping of ghee just before taking meals. భోజనకాలమందు ముందుగ కొద్దిగ నెయ్యిపుచ్చుకొని ఆ వెనుక భోజనము జేసిన మూలవ్యాధి, మూత్రబద్ధము, విషదోషము, వాతాదిదోషములు. గుల్మరోగము, మొలకలుగల మూలవ్యాధి, పైత్యోన్మాదము వీనిని హరించును; రుచి బుట్టించును; బలము, ధాతుపుష్టి, కాంతి, బుద్ధిబలిమి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి వీనిని గలుగజేయును; నేత్రములకు చలవజేయును.

—గ—

# చ

చంగలువ:—ఎఱ్ఱగలువ చూడుడు.

చంగల్వకోష్టు:—కోష్టు చూడుడు.

చంగలువ పువ్వు:—ఎఱ్ఱకలువపువ్వు చూడుడు.

చంచలికూర:—Marsilea Quadrifolia. సం* సునిషణ్ణక, శిరివారా. హిం* శిరియారి, చౌపతియా. దీనికూర వండుకు తిందురు. రుచిబుట్టించును. అగ్నిదీప్తి నిచ్చును. బలముజేయును. జ్వరము, శ్వాస, మేహము, కుష్ఠు వీనిని హరించును. వీర్యవృద్ధిచేయును. త్రిదోషహరమైనది. దీని పసరు తేలువిషమును హరించును. విరేచన బద్ధముజేయును. గ్రహణినికట్టును.

చండ్రచెట్టు:— Mimosa Catechu & Acacia Catechu. Eng. Catechu. సం* ఖదిర, తిక్తసార. హిం* ఖైర్. ఈచండ్రలో నల్లచండ్ర తెల్లచండ్రయను రెండుజాతులు. యీ తెల్లచండ్రనే దేవచండ్ర యందురు. దీని సారమె కవిరి దీనిని సండ్రచెట్టు అనియందురు. దీని చెక్కరసము. కషాయము, చూర్ణము, వగరుగ చేదుగ, నుండును. శీతపైత్యము రక్తపైత్యము వీనిని జయించును. అగ్ని

దీప్తి నిచ్చును. కుష్ఠు, ఆమవికారము, కఫము, దగ్గు, రక్తదోషము, శ్వేతకుష్ఠు, దురద, వాపు, ఆమవాతము, క్రిమి, ఉబ్బురోగము, ఉదరరోగము, విసర్పి. పైత్యము, వున్మాదము, మేహము, జ్వరము, పాండువు, దంతవాతము, అజీర్ణము వీనిని పోగొట్టును. వ్రణముల మాన్పును. దీని పుడకలతో దంతధావనము చేసిన దంతరోగములు హరించును. దంతములు ఘట్టిపడును. గర్భస్రావము నాపును. రసపు మోతాదు 2-3 తులములు కషాయపు మోతాదు 2½ మొదలు 5 తు॥ చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాలయెత్తు. భూత బాధలను పోగొట్టును.

చంద్రజిగురు:—Gum of do. రుచిగా నుండును. బలమిచ్చును. వీర్య వృద్ధిజేయును. దంతములు ఘట్టిపడజేయును.

చంద్రనీళ్ళు:—Juice extracted from the root of do. వేరు నుండి మేడిచెట్టునీళ్ళు తీసినట్లుతీసిన చంద్రచెట్టు నీళ్ళు సర్వదోషము లను, క్రిమిరోగమును, కుష్ఠు, గుల్మము, అగ్నిమాంద్యము, స్థౌల్యము, మేదోరోగము వీనిని హరించును.

చందినీ అత్తరు:—Santalum Album-oil of. ఇది మంచి గంధము చెక్కనుండి తీయబడు నూనె. సువాసనగ మనోహరముగ నుండును. ప్రశస్తమైన చందినీ అత్తరు 3 - 4 చుక్కలు చక్కరకేళీ అరటిపండులోవేసి పుచ్చుకొనిన, సెగరోగము నివృత్తించును. దీనిని కురుపులకును, గజ్జికిని, చిడుము, దురదలు మొదలైన చర్మరోగము లకు వట్టిదిగాని కొద్దిగ కొబ్బరినూనెలో కలిపివ్రాసిన నయమగును.

చంద్రము:—గంగసింధూరము చూడుడు.

చంద్రకాంత చెట్టు:—Mirabilis Jalapa. Eng. Four-o-clock flower. A plant bearing flowers of different colour in the evenings only. సం॥ సంధ్యారాగ, సంధ్యాకాలి. ఇది

సాధారణముగ దొడ్లలో వేటాలేచెడు పూలమొక్క; ఇది అనేక రంగుల పువ్వులు పూయును; దీని పుష్పములు సాయంకాలము మాత్రము వికసించును; దీనిఆకులకుఆముదముచిమిర్చి వెచ్చచేసిగడ్డల మీదవేసికట్టిన తర్వాగాపగిలి నయముగును. దీనిదుంపనూరి, ఆముదంతో వెచ్చజేసి కట్టిన, గడ్డలు పగులును లేక హరించును; దీనిదుంప ఒక తులమును, పావుతులము మిరియములు కలిపి నూరి 3-4 మాత్రల క్రింద చేసుకొని ఒకపూటకె తినవలెను. ఈవిధముగా ఎప్పడు కప్పుడు నూరుకొని 10 దినములు ఉదయము సాయంకాలము సేవించిన ఎరుపు, పసుపు, తెలుపు సెగలు నివృత్తించును. ఏరంగు సెగకు ఆరంగు పువ్వులు పూయుచెట్టు దుంప సేవించవలెను.

చందనము:—మంచిగంధము చూడుడు.

చంపకపుష్పము:—అనగా సంపెంగపుష్పము చూడుడు.

చంపలు అనేచేపలు·—**A sort of fish.** ఇవి గుండ్రముగా, పలచగా నుండును. అగ్నిదీప్తి నిచ్చును. కఫవాతముల నణచును. పథ్యమైనవి.

చకోరపక్షి:—**Greek partridge --flesh of.** దీని మాంసమురుచిగ నుండును. శరీరపుష్టి, బలము, ఉష్ణము జేయును. వాతమును హరించును.

చక్కిలములు జంతికలు నూనెతో జేసినవి:—**Twist rings of paste fried in gingily oil.** రుచిగా నుండును; విరేచనబద్ధము జేయును; ఆకలిని పోగొట్టును. కఫవాతముల బెంచును. గురుత్వము జేయును.

చక్రకేళీఅరటిపండు:—**A sort of plantain.** దీనిని తెల్లచక్రకేళీ యందురు. అరటిపండ్లలో రాజుపండు. అందముగా, సువాసనగ, మంచి రుచిగా, మనోహరముగ నుండును. పండు తొక్కలోని గుంజులో **Vitamins** హెచ్చుగా నుండును. మంచి మేహశాంతి

చేయును. చలువచేయును. ఆకలిదప్పికలను శాంతింప చేయును, మరియు అరటిపండు సామాన్యగుణము చూడుడు.

చక్రవర్తికూర:— Chenopodium Album. Eng. White goose foot. సం॥ వాస్తుక, చక్రవాస్తుక. హిం॥ బధూవఛిల్లీ. అరుచిని అగ్నిమాంద్యమును, ఆమవికారమును, విషమును పోగొట్టును, నులిపురుగులను చంపును; జఠరదీప్తినిచ్చును; తేలికగనుండును; మిక్కిలి బలముచేయును; గ్రహణి, కుష్టు, త్రిదోషములు, మూల వ్యాధులు మొదలగు రోగముల నణచును. మిక్కిలి యుష్ణమును, మలబద్ధమును జేయును. దీనికి విరుగుడు చంద్రచెక్క చూర్ణము.

చక్రవాకపక్షి:–The brahminy duck-flesh of. సం॥ చక్రాహ్వా, చక్రరథ, కామీ. దీనిమాంసము మిక్కిలి వేడిచేయును; వాతమును హరించును; రుచిగనుండును; జఠరదీప్తినిచ్చును.

చతుర్విధక్షీరములు:— Milk of cow buffalo, goat & sheep. గుమ్మ చల్లారకముందు ఆవుపాలును, గుమ్మచల్లారినవి గేదెపాలును, కాగి వేడిగానున్నవి మేకపాలును, కాచినవి గొర్రెపాలును, అమృత సమానముగ నుండును; కాచిన వెనుక నీ నాలుగింటపాలును పుచ్చు కొనదగి యుండును.

చతుర్విధ క్షీర విశేషగుణములు :— Special qualities of do. శిశువులకు మేకపాలును, వృద్ధులకు ఆవుపాలను, గాయములు తగిలిన వారికి గేదెపాలును, శ్వాసరోగముగలవారికి గొర్రెపాలును మిక్కిలి పథ్యముగ నుండును.

చనుబాలు:— Human milk. కొంచెము చిక్కగా మధురముగా నుండును. మేహశాంతి, శరీరపుష్టి, జఠరదీప్తి నిచ్చును. త్రిదోషము లను, త్రిదోషప్రకోపమువలన గలిగిన జ్వరములను, వాతపైత్య మును హరించును. వీర్యవృద్ధి జేయును. నేత్రరోగము, సన్నిపాతము

అభిఘాతము, ఆకలి, దప్పిక, తాపము, రక్తపైత్యము, రక్తకాస, మూత్రబద్ధము వీనినణచును,రక్తపైత్యమునకు వశ్యము చేయుకురు; మరియు అగ్నిమాంద్యము, పీనస, క్రిమిరోగము, శీతజ్వరము, అతిసారము, ఆమవికారము, గ్రహణి, పాండువు, శూల, ఉబ్బు, అరుచి, బల్ల, విశూచి, ప్రమేహము, ఉదావర్తము అనగా పొత్తికడుపున బుట్టెడు శూల ఈరోగము గలవారికి మిక్కిలి అనుకూలించును. కేవలము చనుబాలనుగాని, అందు రుద్రాక్ష అరగదీసిగాని, శర్కర గలిపిగాని ఇయ్యవచ్చును. మొగశిశువు త్రాగెడిచనుబాలు లఘువుగా పథ్యముగా నుండును; ఆడుపిల్ల త్రాగెడుపాలు గురుత్వము జేయును; మరియు వాతరోగికి తెల్లని దేహకాంతిగల స్త్రీపాలును పైత్యరోగికి మెరుపువన్నె స్త్రీపాలును,శ్లేష్మరోగికి చముపుకాంతిగల స్త్రీపాలును ద్వంద్వరోగులకు చామనచాయగల స్త్రీపాలును, సన్నిపాతరోగికి నల్లని స్త్రీ పాలును శ్రేష్ఠమైనవి; జ్వరములకు, సన్నిపాతజ్వరములకు మాటిమాటికి నియ్యతగి యుండును.

చనుపాల విత్తులు:—Cassia Absus seeds of. హిం॥ చక్సు, బనార్, చకూర్. వీనిని నీళ్ళతో నూరి పూసిన తామర నయమగును;విరేచనబద్ధ ప్రకృతిగలవారికిని, గర్భిణీస్త్రీల విరేచనబద్ధమునకును వీనిని యిచ్చిన విరేచనము చేయును. మోతాదు బేడయెత్తు మొదలు పావలాయెత్తువరకు. గర్భిణీస్త్రీలకు గులకందుతోడను, అతిమధురముతోడను ఇయ్యనగును. అగ్నిమాంద్యము (dyspepsia); అజీర్ణము, కడుపుబ్బు పైత్యపుతలనొప్పి వీనికి యీవిత్తులచూర్ణము, దీనికి సమము శొంఠి, ఇందుప్పు, త్రిఫలము వీనిచూర్ణము కలిపి యిచ్చిన నయమగును.

చిన్నచెర్లగడ్డ:—అనగా పొత్తిదుంప. పొత్తిదుంప చూడుడు.

చన్నీళ్ళస్నానము:—Cold bath. దేహమలినమును, అలసటను బోగొట్టును; ఆరోగ్యమును, బలమునుఇచ్చును. వాతము, కఫము జేయును; చన్నీళ్ళస్నానము ప్రాతఃకాలమందే చేయతగియుండును. ఆయురారోగ్యములను వృద్ధిపరచును. స్నానవర్జ్యములు చూడుడు.

చపల భస్మము:—Calx of a sort of medicinal stone. క్రమముగ జేయబడిన ఈభస్మము అనుపాన విశేషములతో నిచ్చిన మేహశాంతి జేయును. పైత్యరోగమును, మేహరోగమును పోగొట్టును. వీర్యవృద్ధి జేయును. అగ్నిదీప్తిని, ఆరోగ్యమును ఇచ్చును. మోతాదు 2 మొదలు 4 గింజలయెత్తు.

చప్పరము:—Pendal or canopy formed of green leaves, boughs & c. పచ్చియాకులు మొదలయిన వానితో నిర్మింపబడిన గృహము చల్లగా మనోహరముగ నుండును; కండ్లకు చలవ నిచ్చును; విసర్పిని బోగొట్టును; ఆహ్లాదకరముగ నుండును; ప్రమేహము, తాపము బోనణచును.

చమ్మకాయకూర:— Curry of a sort of bean. సం* ఖడ్గశింబ, స్థూలశింబో. రుచిగానుండును; శుక్లవృద్ధి నిచ్చును, వాతము, పైత్యము, శ్లేష్మము, మూలవ్యాధి వీనిని బుట్టించును; అగ్నిమాంద్యము, మలబద్ధము జేయును. అపథ్యమైనది. దీనికివిరుగుళ్ళు 1నువ్వుచెట్టు కాల్చి చేసిన క్షారము, 2 చంద్రచెక్క చూర్ణము.

చలవమిరియాలు:— Cubeba officinalis. Eng. Cubebs. సం* కంకోల, సుగంధమరీచ. హిం* కబాబ్ చీనీ, శీతల్ చీనీ. వీనిని తోకమిరియాలని యందురు. కొద్దిగ కారము, చిరిచేదుగ యుండును. కొద్ది పరిమితము, మనోహరముగ నుండును. బలము నిచ్చును; జీర్ణము జేయును; సెగరోగము, నీరుచురుకు, మూత్రబద్ధము మొదలగు వ్యాధులను శమింప జేయును; ప్రేగులకు, పొట్టకు బలమిచ్చును; సౌమ్యపరచును, పొట్టలోను, ప్రేగులలోను వయ్యేడు పుండ్లను మాన్పును; అగ్నిమాంద్యము(dyspepsia)ను, గ్రహణినిపోగొట్టును;

పొట్టలోని వాతమును వెడలించును; నరములకు సత్తువ జేయును; మేహము నణచును; పుండగుటను అపును; హృద్రోగము, కఫము, నోటియందలి దోషములను నణచును. మూత్రపుసంచికి నష్టము జేయును. దీనికి విరుగుడు రూమీమస్తుకి. దీనిచూర్ణపు మోతాదు 1 మొదలు 3 గాని యెక్కువద్రాములుగాని నీళ్ళలోవేసి యియ్యవచ్చును. దీని అరకు మోతాదు అరద్రాము మొదలు 3 ద్రాము లవరకు. దీని చమురు మోతాదు 5 మొదలు 10 చుక్కలవరకు.

చలిదిఅన్నము:—Cold rice. రుచిగానుండును; పైత్యము నణచును; బలమిచ్చును; నిద్ర, బుద్ధిమాంద్యము, అజీర్ణము గలుగజేయును; వాతము, శ్లేష్మము, గురుత్వముజేయును. దీనికి విరుగుళ్ళు అన్నము చూడుడు. నీళ్ళలోవేసిన అన్నమునుకూడ చూడుడు.

చలిపందిరి:—Water Shed. అనగా చలివేంద్ర. దాహమును, తాపమును, మార్గస్థుల ఆయాసమును పోగొట్టును; నిద్రదెచ్చును; దేహకాంతి నిచ్చును; చల్లగ నుండును.

చలిమిడి:—Sweet meat made of rice flour. వరిపిండి బెల్లములో నీళ్ళుగాని, పాలుగాని పోసికలిపి చేసినది; ఆకలిని, దాహము నివారింపజేయును; బలమును, కాంతిని యిచ్చును; నీరసదేహులకు జబ్బుచేయును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్లు 1 ఉప్పు వేసిన కలి, 2 వేడినీళ్లు, 3 పెరుగు.

చలిమిడి, పాకముతో చేసినది:—Sweet meat made of rice flour in boiled syrup molasses. వరిపిండిని బెల్లము పాకముబట్టి అందులో వేసికలిపి చేసినది రుచిగనుండును.ఆకలిని శమింపజేయును. శ్లేష్మమును, దగ్గును దెచ్చును; అజీర్ణము, గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు అతిరసములు, పిండివంటలు చూడుడు.

చల్లిమిడిచెట్టు:—A medicinal plant. దీనివేరు, ఆకురసము, చలవ జేయును; వీర్యవృద్ధి నిచ్చును; రక్తముపడెడు మూలవ్యాధిని, వాత మును, శ్వాసను, స్థావరజంగమ విషములను బోగొట్టును. మోతాదు 3-4 తులముల యెత్తు.

చల్ల:—Butter-milk. సం॥ తక్రః, చలవచేసి నీరుపెట్టును; తేలికగ శ్లేష్మగ నుండును; వగరు పులుపు రుచులు గలిగియుండును; జఠర పుష్టి నిచ్చును; కఫవాతముల నణచును; త్రిదోష హరమైనది; ఉబ్బు, ఉదరరోగము, మూలవ్యాధి, గ్రహణి, మూత్రబద్ధము, అరుచి, గుల్మము, కడుపులోని బల్ల, కామిల, పాండురోగము, హృద్రోగము మొదలగు రోగములను శమింపజేయును; మార్గా యాసమును బోగొట్టును. అప్పుడు చేసినది, వెన్న శుభ్రముగ తీసివేయబడినది, అవుది శ్రేష్టము; రక్తములోని వేడినితీసివేయును; మేహ శాక శరీరులకు బలము జేయును; దేహపుష్టినిచ్చును; క్షయ, జ్వరమును నిర్మూలింప జేయును; విషముయొక్క బలమును విరు చును; పొట్టలోను, కార్జము (Liver) లోను ఉండు వేడిని చల్లా ర్చును. ఇనుపగుండ్లుగాని మేకుగాని కాల్చి చల్లలోవేసి ఆచల్ల బుచ్చుకొనిన పొట్టకు వేడిజేసి జీర్ణశక్తిని హెచ్చించును. లోహము కాల్చి వేసినచల్ల బుచ్చుకొనిన పైత్యమువలన నయ్యెడు రక్త విరేచనముల గట్టును. బియ్యమును కొద్దిగ వెచ్చజేసి చల్లలోవేసి వండిన అన్నము దినిన శాకవిరేచనములకట్టును; దేహపుష్టినిచ్చును. అన్నముతోగాని రొట్టెతోగాని చల్లబుచ్చుకొను అభ్యాసముంచిన శల్యగత జ్వరమును పోగొట్టును. అగ్నిమాంద్య రోగము (Dyspepsia) గలవారి పొట్టను సౌమ్యపరచును; తేయాకు (Tea) అమితముగ బుచ్చుకొనుటవలన గలిగిననరముల వికలత్వము (Nervous irritation) ను పోగొట్టును; క్షయరోగముయొక్క

ప్రారంభమున ఉదయకాలముననే చల్లబుచ్చుకొనిన మేలుజేయును. మొదట కొద్దికొద్దిగా పుచ్చుకొనుచు క్రమక్రమముగ వృద్ధిజేసి పుచ్చుకొనవలయును. తియ్యనిచల్ల పైత్యమును, పుల్లనిచల్ల వాతమును, మరియు పులిచల్ల ఉదరము, కఫరోగము, కాస, శ్వాస, వాతము, ఈరోగములను శమింపజేయును; కొంచెము పులిసినది వీర్యవృద్ధిని జేయును; మిక్కిలిపులుపు గలిగినది తేలికయి ఆకలి బుట్టించును; త్రిదోషములను హరించును. వాతమునకు పులిసిన చల్ల సైంధవ లవణముతోడను, పైత్యమునకు తియ్యనిచల్ల శర్కరతోడను, శ్లేష్మమునకు వగరుగానున్న చల్ల, శొంఠి, పిప్పలి, మిరియాలు, ఏలకులు, ఆకుపత్రికము, లవంగములు వీని చూర్ణముతోడను; గ్రహణి రోగమునకు, అగ్నిదీప్తికి ఉప్పుతోడను, మూత్రకృఛ్రమునకు బెల్లముతోడను, పాండురోగమునకు శొంఠి చూర్ణముతోడను, మూలవ్యాధికి కొడిశచెక్క చూర్ణముతోడను, ప్రమేహమునకు తేనెతోడను ఇచ్చిన నయమగును. కొన్ని తత్వములవారును కొందరురోగులును బుచ్చుకొనిన శ్లేష్మము, వాతము, అగ్నిమాంద్యము, అజీర్ణము, తలత్రిప్పు, జ్వరము మొదలగు వ్యాధులు జనించును. దీనికి విరుగుళ్ళు 1 శాకఔషధములు, 2 అల్లపుమురబ్బా, 3 శొంఠి, 4 సైంధవలవణము, 5 శంఖభస్మము, 6 ఉప్పు. చల్ల బుచ్చుకొనకూడనివారు చూడుడు.

## దశవిధ తక్ర గుణములు.

1. మధితమనుచల్ల:—నీళ్ళు గలపకుండ జేసినచల్ల మధితమనబడును. ఇదిజిడ్డుగా, చిక్కగానుండును; శోష, ఉదరరోగము, పైత్యవాతమును అరుచి వీనిని బోగొట్టును; బలము జేయును; మూత్రఘాతమును శమింప జేయును; గ్రహణి రోగమును హరించును; ఇది గ్రీష్మశర

దృతువులయందును, హేమంత శిశిరఋతువులయందును పుచ్చుకొన దగియుండును.

2. మిళితమను చల్ల:—1 పాలు పెరుగు, 8 పాళ్ళు నీళ్ళుపోసి చేసిన మజ్జిగ మిళిత మనబడును, పిత్తము, అరుచి, అతిసారము, రక్తవాతము మొదలగు ననేక రోగములను హరించును; అన్నికాలముల యందు పుచ్చుకొన దగినది,

3. గోళమను చల్ల:—ఒకవంతు పెరుగు, వంతున్నరనీరు గలిపి చేసిన చల్ల గోళమనబడును. ఇది వీర్యవృద్ధి చేయును; కాంతినిచ్చును, నేత్రములకు మేలుజేయును; మందాగ్ని, విషదోషము, మేహము, ప్రమేహము, శ్లేష్మరోగము, ఆమరోగము వీనిని బోగొట్టును. ఇది గ్రీష్మ వర్ష ఋతువులయందు పుచ్చుకొన దగినది.

4. షాడభమనుచల్ల:—1 పాలు పెరుగు, 5 పాళ్ళు ఉదకము పోసి చేసినది షాడభమనబడును. శ్లేష్మముజేయును; గుల్మరోగమును, రక్తము స్రవించెడు మూలవ్యాధిని బోగొట్టును; కాంతినిచ్చును; లఘువుగ నుండును; జఠరదీప్తినిచ్చును.

5. కాలశేయమను చల్ల:—పెరుగునకు రెండువంతులు నీళ్లుగలిపి చేసిన చల్ల కాలశేయ మనబడును. ఇది గ్రహణి, విషము, ఉబ్బు, అగ్నిమాంద్యము, వాతము, దేహము ముడతలుపడెడు రోగము, మూలవ్యాధి, పీనసరోగము వీనిని బోగొట్టును. ఇది శరదృతువు నందు బుచ్చుకొన దగియుండును.

6. కరమథితమనుచల్ల:—పెరుగునకు సమముగ నీళ్ళు గలిపి చేతితో చిలికి చేసినచల్ల కరమథిత మనబడును. ఇది కొంచెము వగరుగా, పుల్లగా, స్వాదుగా, మనోహరముగా నుండును; కొద్దిగ కాక, విరేచనబద్ధముజేయును. అగ్నిదీప్తినిచ్చును; ప్రమేహము, చర్ది, ఉబ్బు, మూలవ్యాధి, భగంధరము, కామిల, కఫవాతము, అరుచి వీనిని

గొట్టును;వీర్యవృద్ధి, బలముజేయును; శ్రమను బోగొట్టును; ఇదివర్ష కాలమందు బుచ్చుకొన దగియుండును.

7. ఉదశ్వితమనుచల్ల:—పెరుగునకు నాలుగవపాలు నీళ్ళుపోసి చేసినది ఉదశ్విత మనబడును. (ఇదియే తక్రమని కొందఱి మతము) ఇది గుల్మము, అభిఘాతము, అన్నివాతములు, దారుణమగు గ్రహణి, త్రిష్పరోగము మొదలగు సమస్త రోగములను పోగొట్టును; దేహ పుష్టిని, సౌఖ్యమును ఇచ్చును. ఇది గ్రీష్మఋతువునందు బుచ్చుకొన దగియుండును.

8. తక్రనునుచల్ల:— పెరుగునకు సగము నీళ్ళుపోసి చేసిన చల్ల తక్రమనబడును. (ఇదియే ఉదశ్వితమని కొందరి మతము) ఇది లఘువుగనుండును; పైత్యము నణచును; పాండురోగము, గ్రహణి, ఉబ్బు, శ్లేష్మవాతము, గుల్మరోగము, కడుపులోబల్ల, భగందరము, ఉదర రోగము, అరుచి వీనిని బోగొట్టును. వసంతఋతువునందు శొంఠి, పిప్పలి, మిరియాలు ఉసిరికపప్పు వీని కషాయము కలిపి పుచ్చుకొన దగియుండును

9. దండాహతమనుచల్ల:—పెరుగునకు రెండవంతుల నీరుపోసి కవ్వముతో చిలికివేసినది దండాహత మనబడును. ఇది స్వాదుగా, రుచిగానుండును; దేహపుకాకను వృద్ధిబొందించును;కఫమును,చిక్కగను, కల్లువలెను, చెరుకురసమువల్లను, పిండివలెను, పడుమూత్రమేహమును, పిటికామేహమును; ప్రమేహమును, మూలవ్యాధి వీనిని బోగొట్టును; అన్నమును జీర్ణము చేయును. ఇది యెల్లప్పుడు బుచ్చుకొన దగియుండును.

10. అతిమిళితమనుచల్ల:—పెరుగునకు తొమ్మిదిపాళ్ళు నీళ్ళుపోసి చేసిన చల్ల అతిమిళిత మనబడును. ఇది యనేక ముఖ రోగములను; గుల్మము, బల్ల, భగందరము, ఉదరరోగము, మూలవ్యాధి వీనిని బోనణచును,

చల్లకాచినది:—**Boiled butter-milk.** ఇది అతిసారము, కఫముతో కూడిన అన్నిరోగములు, మార్గాయాసము, నోటిపూత మొదలగు నోటిరోగములు, పీనస, దగ్గు మొదలగు శ్లేష్మరోగములు వీనికి పథ్యముగ అనుకూలముగ నుండును.

చల్లగుమ్ముడు:—**Gmelina Asiatica.** ఇది అడవులలో లేచును. దీని కాయలు చిన్ననిమ్మపండ్లవలె పచ్చగనుండును.దీని కఱ్ఱ చల్ల కవ్వములకు వాడుదురు. దీని వేరు చూర్ణము లేక కషాయము లేక అరుగ దీసిన గంధము కొద్దిగ విరేచనము జేయును. సెగ, సవాయిలను హరించును. వేరుగంధము పట్టువేసిన వాతమేహవాతనొప్పులు నయమగును. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 5 తులముల యెత్తువరకు; గంధము మోతాదు 3 మొదలు 6 అణాలయెత్తువరకు. దీనిఆకు లేక లేత ఆకులు చల్లని నీళ్ళలో వేసి పిసికి పిప్పితీసివేసిన జిగురు గలిగి యుండును. దానిని నిచ్చిన మూత్రబద్ధమును పోగొట్టును. శగరోగమును శాంతింపజేయును. మూత్రకోశము (bladder) నందు దోషమును పోగొట్టును.

చల్లగెడ్డలు:—**Asparagus Larmentosus.** అనగా చిన్నదుంపలు గల పిల్లిపీచర. దీని చూర్ణము మిక్కిలి మేహశాంతి, వీర్యవృద్ధి, దేహపుష్టి నిచ్చును; వీనిని దంచి చల్లని నీళ్ళలోవేసి యూరనిచ్చి ఆనీళ్ళు స్ఫోటకము తగిలినవారి కిచ్చిన పొక్కులలో బాగుగ నీరు నిండి చిదుకును. కొన్ని దేశములలో నీదుంపలను పాలలోవేసి వండి ఆహారముగ తిందురు. దీని చూర్ణము పాలతో వుడికించి పంచదార గలిపి పుచ్చుకొనిన అమితవీర్యవృద్ధి, బలము, పుష్టి, కాంతి గలుగును; కఫమును హెచ్చించును. ఆలశ్యముగ జీర్ణమగును.

చల్లపిల్లిగడ్డలు:—పెద్దపిల్లిపీచర చూడుడు.

చల్లచారు:—Seasoned acid butter-milk. పులి చల్లను రసవర్గములు చేర్చి పోగిచినది జఠరాగ్ని నిచ్చును; మనోహరముగనుండును. గ్రహణి కట్టును. చలువ జేయును సమస్త రోగములను శమింప జేయును, పథ్యముగ నుండును.

చల్లని నీళ్ళు:—Cold water. మూర్ఛ, పైత్యము, ఎండచేతగలిగిన దాహము, మదాత్యయము అనగా విశేషమద్యపానమువలన బుట్టెడు రోగము, విషప్రయోగము, రక్తప్రవాహము, అలసట, సొక్క, భ్రమ, వర్ధి వీని నణచును; విశూచి (cholera), రక్త పైత్యము, ఊర్ధ్వాంగ వాతము వీనిని శమింప జేయును. రత్యనంతరమునందు మితముగ చల్లనీళ్ళు పుచ్చుకొనవచ్చియుండును; మూర్ఛ స్మారకము తప్పడము, కండ్లు చీకట్లుకమ్మడము వీనికి చల్లని నీళ్ళు ముఖముమీద గట్టిగకొట్టిన తెలివి వచ్చును. మరిడిజాడ్యము (Cholera) తగిలిన వారికి గలిగెడు విదాహమునకు మిక్కిలి చల్లని నీళ్ళు ధారాళముగ నిచ్చిన చాల మేలుజేయును.

చల్లనినీళ్లుకూడని రోగములు:—Diseases in which cold water would not agree. పార్శ్వపుశూల, పీనస, పడిసెము, వాతము, గళరోగము, కడుపుబ్బు, తిమ్మెర, కుష్ఠురోగము, అప్పుడు పుట్టిన చర్ది, జ్వరప్రారంభము, శ్వాస, కాసలు, వాతజ్వరము ఈరోగులు గలవారును, విరేచనములకు ఔషధము పుచ్చుకొన్నప్పుడు చల్లని నీళ్ళు పుచ్చుకొనగూడదు.

చల్లసిల్లిగడలు:—పెద్దపిల్లిపీచర చూడుడు.

చల్ల పుచ్చుకొనగూడనివారు:—Those who should not drink butter-milk. శ్లేష్మ తత్వము, వాత తత్వము గలవారు, దంత రోగులు, ఉబ్బువ్యాధిగలవారు, శ్లేష్మవాత రోగములు గలవారు, ప్రసవమైన స్త్రీలు, రక్తక్షీణదేహులు, ఒంటిరక్తము తీయబడిన

వారు, దెబ్బలు, గాయములు తగిలినవారు, మూర్ఛ, భ్రమ, విదాహము, తాపము, నవజ్వరము, రక్తపైత్యము, నీరసము, కార్శ్య రోగము యివి గలిగినవారును, వాతశ్లేష్మజ్వరము గలిగినవారును, చల్ల తరచు యెక్కువగ పుచ్చుకొనగూడదు.

చల్లమీఁది నీళ్ళు:—Water standing over butter-milk sediment. చలవజేయును; పైత్యము నణచును; తేలికనిచ్చును; శ్లేష్మమును వృద్ధిబొందించును; దప్పికను, ఎండవలన గలిగిన ఆయాసము నుబోగొట్టును; మేహరోగము నణచును; విరేచనబద్ధము జేయును.

చల్లములక లేక ములక:—తెల్లములక చూడుడు.

చల్లమేడిద:—Sediment of butter-milk. అనగా చల్లమడ్డి అగ్నిదీప్తినిచ్చును; మనోహరముగ నుండును; గ్రహణిరోగమును బోగొట్టును. జీలకర్ర మొదలగువానితో పోగిచినది సమస్త రోగములను శమింపజేయును.

చల్లలో ఊరనిచ్చి పోగిచిన అన్నము:—తక్రాన్నము చూడుడు.

చల్లారిన అన్నము:—Cooled rice. జఠరదీప్తిని అణచును. మలబద్ధము జేయును; శ్లేష్మమును పెంచును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు అన్నము చూడుడు.

చవటికొమ్ము అనుమూలిక:—A medicinal plant. వెదురు మొలకలను చవిటికొమ్మలని కొందరందురు. కొద్దితీపిగ, చేదుగ, రుచిగల దిగనుండును, దాహము నణచును, పైత్యవికారమును బోగొట్టును.

చవటి ఉప్పు:—Earth salt. గుల్మము, శూల వీనిని శమింపజేయును.

చవులపిల్లి:—కుందేలు మాంసము చూడుడు.

చవులపిల్లితీగ:—Imomava Biloba. దీనిని బాలబందకాడ యందురు. దీనివేరు, ఆకు, కాడలు జిగురు గలిగియుండును. దీని ఆకులు వెచ్చజేసి పైనవేసిన వాత మేహవాతనొప్పులు, కడుపునొప్పులు నిమ్మళిం

చును. ఆకుల రసము లోపలికిచ్చిన మూత్రము జారీచేయును. ఉబ్బు, నిమ్మళించును. దీని ఆకునూరి పైనపూసిన ఉబ్బుతీయును. రసపు మోతాదు పూటకు 3-4 తులములమెత్తువరకు. నీళ్ళలో దీని యాకులు వేసి కాచి ఆనీళ్ళతో కాపడము లేక ఒత్తడము (Fomentation) యిచ్చిన వాతమేహవాత నొప్పులు నివారణ మగును.

చాగనారమట్టలు:—Sanseviera Zeylanica, S. Roxburghiana. సం॥ మూర్వా, దహని, మధుస్రవా. హిం॥ ముర్వా. దీని దుంప రసము చేదుగా, కారముగా నుండును. వేడిచేయును. హృద్రోగము, కఫవాతము. కుష్టు, దురద, వ్రణములు, విషజ్వరము, విషము హరించును. దీని దుంపతో చేసిన సారము (Extract) లేక లేహ్యము క్షయను, పురాణపు దగ్గులను హరించును. మోతాదు పూటకు పావుతులమెత్తు మొదలు తులమెత్తువరకు. దీని లేతమట్టల రసము బిడ్డలకిచ్చిన శ్లేష్మము, కఫము పడిపోవును. మోతాదు పై ప్రకారమే. దీని మట్ట కుమ్ములో వుడికించి దానిరసము చెవులో పిండిన చెవిపోటు నయమగును. దీనితో చేసినతైలము చెవిలోని పోటు, కురుపులను, వ్రణములను మాన్పును.

చాతుర్జాతకము:—Four drugs - Cordamoms & c. అనగా ఏలకులు, దాల్చినచెక్క, ఆకుపత్రికము. నాగకేసరములు. వీని చూర్ణము లేక కషాయము వాంతి, వికారము, ఎక్కిళ్ళు వీనిని శమింపజేయును; అగ్నిదీప్తినిచ్చును. తత్వమును సౌమ్యపరచును. ఆకలిబుట్టించును. పొట్టకుబలముచేయును. మేహశాంతి, పైత్యశాంతి జేయును. మోతాదు పూటకు 2 మొదలు 4 అణాలయెత్తువరకు.

చాదరాశికూర:—Fumaria Officinalis, Eng. Common famitory. సం॥ ఝుకసీ. దీనిని చాతరాసికూర చెదలాసికూర అనియు నందురు.

రుచిగ, చిరుచేదుగా నుండును. వేడిజేయును. రుచి బుట్టించును. మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, నీరసము, మేహము, ఉదరము, నులిపురుగులు, ఎలుక విషము వీనిని బోగొట్టును.నిద్రపట్టకుండుటను, శ్లేష్మపైత్యమును, సన్నిపాతమును, వాతమును జయించును.పొట్టకు బలముజేయును. విరేచనముగావించును. ప్రసవస్త్రీలకు మైలరక్తమును వెడలించును. దీని సమూలమును కషాయముగగాని, తేలిక కషాయముగగాని కాచి వాడనగును. మోతాదు పూటకు 4 మొదలు 8 తులముల యెత్తువరకు. దీని యాకులు ఆముదముతో వెచ్చజేసి చెవివెనుక క్రిందుగ కట్టు గట్టిన చెవినొప్పి నిమ్మళించును; దీనికి విరుగుళ్లు 1 విరిగిచెక్క, 2 వెలగచెక్క. దీనిని కూరగవండి భుజించిన పైరోగములయందు పథ్యముగ నుండును.

చాదువడియాలు:—Buns or cakes made of gingily seed & c నువ్వులు, వన్లేరు, జీలకర్రతో వగయిరాలతో చేసినవి. జఠరదీప్తి నిచ్చును. వాతమును, శ్లేష్మమును హరించును. రుచిబుట్టించును.

చామంతిచెట్టు:—Anthemis Nobilis. Eng. Chamomile plant. సం॥ తరుణీ, శతపత్రి, చామంతి. హిం॥ సేవంతి. దీనివేరు ఆకు రసము లేక కషాయము ఊర్ధ్వశ్వాస, కఫము, పైత్యము, విషము, అనాహము, మలమూత్రబద్ధము, జ్వరము, గుల్మము, మూలవ్యాధి, క్రిమిరోగము, ఉబ్బురోగము వీని నణచును. రసమురొమ్క మోతాదు పూటకు 2–8 తులములయెత్తు; కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

చామంతి పుష్పము:—Chamomile flower. వీనిధారణవలన సువాసనగా, సమశీతోష్ణముగా నుండును కండ్లకు చలవజేయును. శిరోజములకు వృద్ధినిచ్చును. వీనిచూర్ణము లేక తేలిక కషాయము లేక

సారము చేదుగ, కారముగ నుండును. తలత్రిప్పు, పైత్యశ్లేష్మము, జ్వరము, క్రిమిరోగము వీనిని హరించును. జఠరదీప్తి బలము, తేలిక వీని నిచ్చును. ప్రేగులకు మిక్కిలి అనుకూలముగ నుండును. సమస్త రోగములను శమింపజేయును. దేహములో కూడికొనిన దుష్టద్రవకూటమిని కరగించును. అనగా నీరుజేయును. నరములకు సత్తువ నిచ్చును. పొట్టలోని వాతమును వెడలిగొట్టును. నొప్పిని శమింపజేయును. మూత్రమును జారీచేయును. ఋతుబద్ధమును పోగొట్టును. ఉలవకాయల (Kidneys) రోగమును శమింపజేయును. నరుస జ్వరము, అగ్నిమాంద్యము (Dyspepsia), స్త్రీల విరహతాపజ్వరము, అజీర్ణశూల వీనిని బోనడచును. మరియు దీని తేలిక కషాయముతో గాయములు, వ్రణములు, గడ్డలు వీనికి ఒత్తడమిచ్చిన కళ్ళు పట్టకుండ చేయును. నొప్పి శమించుటకు దీనిని పిచ్చికారీ (Injection) చేయనగును. తేలిక కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 20 మొదలు 60 గోధుమగింజల యెత్తువరకు. సారపు (Extract) మోతాదు 10 మొదలు 20 చుక్కలవరకు. దీని గాఢమైన కషాయము వమనము చేయును.

చామంతిపువ్వుల అరకు:-Distilied water of chamomile flower. చామంతి పువ్వుల అరకు అనగా బట్టీ బెట్టి కాచి తీసినది రక్తపైత్యము, జ్వరము, మూర్ఛ, శ్వాస, దాహము, తాపము, అరుచి, అగ్నిమాంద్యము వీనిని బోగొట్టును. మోతాదు పూటకు 2½-5 తులముల యెత్తు చొప్పున దినమునకు 2-3 పూటలను పుచ్చుకొననగును.

చామ అన్నము:— Boiled rice of millet Panicum. రుచిగ నుండును శ్లేష్మమును హరించును. వీనిలో ప్రాత మండిచామలు శ్రేష్ఠము, శరీరమునకు బలమిచ్చును; జీర్ణము గావించును; చలవ చేయును; పైత్యమును అణచును; విరేచనము గావించును; మూత్రములో సుద్దపుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పాలు, 3 పంచదార, 4 వెనుగునీళ్ళు.

చామకూర:—Curry of the leaves of Colocasia Antiquorum. చామ ఆకుకాడలకూర మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, అగ్నిమాంద్యము వీని నణచును. మూత్రపురీషబద్ధమును విప్పును. గురుత్వముగ నుండును; కఫవాతముల జేయును. దీనికి విరుగుళ్ళు 1 పులుసు, 2 చంద్రచెక్క చూర్ణము, 3 పులుసుతో వండడము. నల్లచామకూర గూడ యించుమించు యివేగుణములు.

చామచెట్టు:— Colocasia Antiquorum. Arum Colocasia. Eng. Coces. సం॥ కచు, వితండ. హిం॥ కచు. దీనిఆకు, కాడలు రక్తస్రావమును, రక్తనాడులనుండి పారెడు రక్తప్రవాహమును కట్టును. దీని కాడలు నూరివేసి కట్టిన గాయములు అతిత్వరగా మానును. కాడలరసము చెవిలో బోసిన చెవి నొప్పి మానును. రసి, చీము కారుట కట్టును. నల్లచామకాడలరసములో ఉప్పుగలిపి పూసిన బోలునరములు లేక గవదల వాపు పుండు (Inflamed glands), అడ్డగర్రలు హరించును. నల్లచామదుంపరసము పూసిన వెంద్రుకలు రాలిపోవడము మానును. లోపలికిచ్చిన విరేచనము జేయును. మూలవ్యాధి, కార్జము (Liver) లోని ద్వారముగ నుండెడు రక్తనాడి గట్టిపడిపోవడము (Congestion of portal system) కుదురును. పైనపూసిన కందిరీగలు మొదలగు పురుగులకాటు విషము హరించును. అప్పుడు తగిలిన గాయములు, నరుకులు వీనికి

ఈ దుంపరసము వేసినను లేక దుంపనూరి వేసినను ఒక గంటలో తమంతట తామె కలుసుకొని త్వరగా మానును.

చామదుంపలు:—Curry of roots of do. వీని కూర చలవ జేయును. రుచిబుట్టించును; వీర్యపుష్టి నిచ్చును; రక్తమును వృద్ధి జేయును; గురదాలకు (kidneys) అనగా మూత్రము పుట్టెడు అవయవములకు బలమిచ్చును; విరేచనబద్ధము, అజీర్ణము జేయును; క్రిమిరోగము, వాతము, కఫము వీనిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు నీళ్ళతో బాగుగ కడగడము, పులుసు పెట్టడము. నల్లచామ దుంపలకు యివే గుణములు.

చామరము:—A fly brush or chowri. దీనిని వింజామరయనియు నందురు. దీనిగాలి శ్రమ, చెమట, భ్రమ వీనిని హరించును. సంతోషము నిచ్చును.

చామలు నల్లటివి:—Panicum Frumentaceum. సం॥ శ్యామాక. హిం॥ సమా. సావా. దీని అన్నము శ్లేష్మమును హరించును. గురుత్వముగ నుండును; రక్తపైత్యము, వాతము, సుగ్రహణి వీని నణచును; మిక్కిలి యుష్ణము జేసి దేహమును శోషింప జేయును; దీనికి విరుగుడు మందము అనగా పేలపిండి, నెయ్యి. బెల్లము దానిమ్మపండ్ల రసము, ఇవిచేర్చి పుచ్చుకొనవలెను.

చామరొట్టె:—Bread of do. సమధాతువు జేయును,రుచిగనుండును; దేహపుష్టి, బలము జేయును. యెక్కువగ తినిన కడుపులో నొప్పి, గ్రహణిని బుట్టించును. దీనికి విరుగుడు సికింజిబీను.

చారు:—చింతపండు పాతది చూడుడు.

చాల్ మొగరాయిలు:—నీరుడువిత్తులు చూడుడు.

చించలము:—Turk's cap. అనగా కోడిజుట్టు చెట్టు. ఇది ఎర్రతోట కూర చెట్టువలె నుండును; దీని విత్తులు లేక వేరుచూర్ణము, లేక

దీని సమూలకషాయము లోపలికిచ్చిన జఠరాగ్నిని, వీర్యమును వృద్ధి చేయును; దగ్గును, గ్రంధివాతమును, ఉబ్బురోగమును హరించును. దీని ఆకు నూరి యుడికించి కట్టిన వ్రణముల శోధించి మాన్పును. దీని ఆకుకూర తరుచు పుచ్చుకొనిన గ్రహణి మొదలగు దోషములను పుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పులుసు, 2 చంద్రచెక్కపొడి. చూర్ణపు మోతాదు పూటకు 2-3 చిన్నములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 3-4 తులముల యెత్తు.

చింతకాయ:—Green tamarind fruit. పుల్లగ రుచిగా నుండును. విరేచనము జేయును; వాతమును గొట్టును; రక్తపైత్యమును, ఆమ పైత్యమును, నీరసమును, ఉష్ణమును జేయును; జఠరదీప్తి నిచ్చును; రక్తమును విరుచును; పైత్యము జేయును; చక్కగా ఉడికిన కఫవాతములను జయించును. దీనికి విరుగుళ్ళు 1 ఉప్పు, 2 అల్లము, 3 మిరియాలు, 4 పసుపు.

చింతగింజలు:—Tamarind Seeds. ఇవి వగరుగ నుండును. కఫము, క్రిమిరోగము, గ్రహణి, ఇంద్రియ నష్టము, రక్తవిరేచనములను కట్టును; బలము జేయును. స్త్రీల అమిత రక్తస్రావమును కట్టును; ఇంద్రియమును గట్టిపడ జేయును. దీనిని నీళ్ళతో గంధము తీసిగాని, లేహ్యముగా చేసిగాని ఇయ్యవచ్చును. గంధపు మోతాదు పూటకు పావలాయెత్తు చొప్పున, లేహ్యపు మోతాదు పూటకు 2 వరహాల యెత్తు చొప్పున, దినమునకు రెండుపూటల నియ్యనగును.

చింతచిగురు:—Tender leaves or shoots of tamarind tree. పుల్లగా, రుచిగా నుండును; మేహశాంతి జేయును. పొత్తికడుపును శుభ్రపరచును. వాతము, మొలకలుగల మూలవ్యాధి, గుల్మము, క్రిమి, దురద, విషము, కఫము వీని నణచును. వ్రణములను మా

స్పును. వీర్యమునకు వేడి బుట్టించును. నీరసమును బోగొట్టును. రుచిబుట్టించును. మేధస్సును పెంచును. పథ్యమైనది. కొద్దిగ శ్లేష్మము, పైత్యమును చేయును. దీనికివిరుగుళ్ళు 1అల్లము, 2మిరియాలు, 3ఉప్పు.

చింత చెట్టు:—Tamarindus Indica. Eng. The Tamarind tree. సం॥ తిన్త్రిణీ, వృక్షామ్లు, ఫలామ్లక. హిం॥ అంమ్లి. దీని ఆకు రసము గాని, ఈనెలు, బెరడు చెక్క వీని కషాయముగాని వాడుదురు. చర్దిని అణచును; దుష్టరక్తమును విరుచును; పైత్యమును గొట్టును; రుచిబుట్టించును; మిక్కిలి అగ్నిదీప్తి నిచ్చును; ఉష్ణము జేయును; కఫమును, వాతమును, క్రిమిని, హృద్రోగమును, గుల్మమును, శ్లేష్మ వాతమును పోగొట్టును. దీని బెరడుముళ్ళు అనగా గ్రంథులు వీని కషాయము మిక్కిలి ఉష్ణము జేయును; కఫవాతమును గొట్టును. మోతాదుపూటకు 2తో మొదలు 5తులముల యెత్తువరకు. చింతాకును బియ్యపుకడుగు లేక కలిలో వేసి కాచి వేడిగానున్నప్పుడు ఆయాకును గుడ్డలో వేసి దానితో కాపడము (fomentation) పెట్టిన కవుకు దెబ్బ, గాయము వీనినొప్పి, పోటు నిమ్మళించును. చింతబెరడు భస్మము ఉబ్బును, శూలలను హరించును. మోతాదు చిన్నయెత్తు మొదలు 2 చిన్నముల యెత్తువరకు వెన్నలో పొదిగిగాని, తేనెలో గలిపిగాని యియ్యనగును. చింతకట్టెలయొక్క లేక చింతబెరడు యొక్క నిప్పులలో ఆముదపు పలుకులు (గింజలలోనిపప్పు) సమముగ గలిపి మెత్తగనూరి బిళ్ళవలెచేసి గడ్డలకుగాని, రాచపుండ్లకుగాని, వ్రణములకుగాని నాభిలో లేచెడి విద్రధి వ్రణములకుగాని పైనవేసి దినమునకు రెండుసార్లు కట్టుగట్టుచుండిన నవి హరించును. లేదా వానిని పగులజేయును; శుభ్రపరచును; మాన్పును. దీని ఆకులరసము లోపలికిచ్చిన కామిలరోగమును పోగొట్టును; కార్జమును (liver) బాగుజేయును. మోతాదు పైనవ్రాసిన ప్రకారము.

చింతచెట్టునీడ:—Shade of do. చల్లగనుండును; వాతమును హరించును. జఠరదీప్తినిచ్చును. వాతిరోగులకు, ఉబ్బరోగులకు అనుకూలముగ నుండును.

చింతపండు (క్రొత్తది):—Tamarind new. తియ్యగ, పుల్లగ, రుచిగానుండును; విరేచనము జేయును; వాతము నణచును; శ్లేష్మమును పెంచును. రోగులకు అపథ్యమైనది.

చింతపండు (ప్రాతది):— Tamarind Old. ఇది చలువ జేయును. రోగులు సంవత్సరమునాటి చింతపండు పుచ్చుకొనదగి యుండును. వాత పైత్య శ్లేష్మ రోగములను శాంతింప జేయును. అభిఘాత జ్వరము అనగా బడలికవలన గలిగిన జ్వరము నణచును. వీర్య పుష్టి జేయును. సమస్త రోగములను శమింపజేయును. పథ్యమైనది. హృదయమునకు బలము జేయును. మేహాశాంతి జేయును; విరేచన కారి; డబ్బుపడిన లేక నీరసపడిన వారి పొట్టకు సత్తువ జేయును. వికారము నణచును; పైత్యవమనమును కట్టును; చింతపండు పులుసులో కాటుక గింజల చూర్ణము పావలాయెత్తు మొదలు అర్ధ రూపాయ యెత్తువరకు కలిపి పుచ్చుకొనిన సుఖవిరేచనముల గావించును. చిక్కని పులుసు కొద్దికొద్దిగ నాకుచుండిన గొంతుకపుండు రోగమునుమాన్పును.మోతాదు అరఔన్సు మొదలు 1 ఔన్సువరకు. రక్తముయొక్క విస్తారమును,తాపమును హరించును,వేడిచేతగలిగిన మతిచాంఛల్యమునణచును; దాహమునణచును; ఉష్ణముచేత పుట్టిన గజ్జిని పైత్యాజీర్ణమును పోగొట్టును.ఇందుకు చింతపండు నీళ్ళలోనాన వేసిబాగుగ నానినవెనుక పిసుకకుండ త్రిప్పి దానిలో తుక్కుతీసివేసి వడియకట్టి పుచ్చుకొనవలెను. మోతాదు 3 మొదలు 5 తులముల యెత్తువరకు, రక్తమును శుభ్రపరచును; దీనిని అమితముగ పుచ్చుకొనకూడదు; దగ్గును, సుద్దనుపుట్టించును; నల్లదబ్బ (Spleen) కు,

గుండెలకు నష్టము జేయును; అజీర్ణ రోగులకు, ప్లీహారోగులకు, నష్టము జేయును దీనికివిరుగుళ్లు 1 బాదముజిగురు, 2 సగసాలు, 3 పటిక బెల్లం, 4 పంచదార, 5 తేనె. దీనిలో అనేక సంబారములు చేర్చిన్నీ అనేక కాయకూరలు చేర్చి పులుసు క్రిందను, ప్రత్యేకముగ పలచని చారు క్రిందను, మిరియాల చారు క్రిందను అనేక విధములుగ తయారుచేసి ప్రతిదినము ఆహారముతో పుచ్చుకొనుట ఆచారమైయున్నది. ఇది మిక్కిలి వుపయోగకరమైనట్టి ఆహార పదార్థము.

చింతపండుపానకము– **Sherbeth made of Tamarind juice, & c.** చింతపండు పులుసు, దానిమ్మపండ్ల రసము, శర్కర పానకములో కలిపి అందులో శొంఠి, పిప్పలి, మిరియాలపొడి కలిపి, క్రొత్త కుండలో ఉంచి వడపోసి కొద్దిగా పచ్చకర్పూరము లేక హారతి కర్పూరము కలిపి పుచ్చుకొనిన వాతశ్లేష్మములను గొట్టును; వీర్యపుష్టి నిచ్చును; జఠరాగ్నిని వృద్ధిబొందించును; బలము జేయును. వెంటనే దాహము నణచును.

చింతపువ్వు :— **Tamarind flowers** పుల్లగా, వగరు, తేలికగా నుండును. కాంతి నిచ్చును. వాతమును గొట్టును. రుచి బుట్టించును. శ్లేష్మమును, రక్తాతిసారము, పైత్యము నణచును. అగ్నిదీప్తి నిచ్చును. దీనితో చేసిన లేహ్యము కార్జము (Liver) లో పుట్టుకురుపులు, దుష్టద్రవకూటమిని కరగించును. పైనజెప్పిన అన్ని రోగములకు దీని చూర్ణములో సమముగ పటికపంచదార చూర్ణము కలిపి పుచ్చుకొనవచ్చును. పువ్వుచూర్ణపు మోతాదు 8 మొదలు 10 చిన్నముల యెత్తువరకు.

చింతపొట్టు :— **Dried tender leaves of tamarind tree.** ఇది చింతచెట్టుయొక్క ముదురు చిగురును ఎండబెట్టిన వరుగు. మిగుల పథ్యకారిగ నుండును; దీని చారు పైత్యవికారమును అణ

చును. సాధారణముగా అన్నిరోగములకు పథ్యముగ నుండును. శ్రమ, భ్రమ, దప్పి, బడలిక వీనిని హరించును; హృదయమునకు మేలు జేయును.

చింత:—Sorrow or melancholia. అనగా విచారము; శ్లేష్మమును వృద్ధి జేయును; సమస్తేంద్రియములను, ధాతువులను, రక్తమాంసములను క్షీణింపజేయును; బుద్ధిబలిమిని తగ్గించును; రుద్రవాతము, పక్షవాతము, క్షయ మొదలగు దారుణరోగములను గలుగజేయును. వేగముగ నాయుఃక్షీణము జేయును.

చిక్కుడుకాయకూర:—Curry of the beans called Dolichos Lablab. చలవజేసి, నీరుబెట్టును; రుచిగ నుండును; ఆడువాండ్రకు పాలు గలిగించును; మూత్రము గావించును; సుద్దను బుట్టించును; గుండెలకు, తెల్లదబ్బ (Lungs)ను శుభ్రపరచును; సత్తువజేయును; పుంస్త్వమును హెచ్చించును; విరేచనబద్ధము, గురుత్వము, అజీర్ణము, కడుపునొప్పి దెచ్చును; విదాహమును పుట్టించును. శ్లేష్మమును బెంచును. పైత్యమును హెచ్చించును దీనికి విరుగుళ్ళు చిక్కుడుగింజలు చూడుడు.

చిక్కుడుగింజలు:—Seeds of do. కమ్మగ, రుచిగ నుండును. నేత్రరోగము, క్షయ, విదాహము, కడుపుబ్బు, అపానవాయువును వీనిని బుట్టించును. పైత్యము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తెల్లయుత్తరేణి క్షారము, 2 ఓమము, 3 శొంఠి, కరక్కాయపిందెలు, ఉప్పు ఈమూటి చూర్ణము, 4 నీళ్ళతో వండి పారవంచడము; 5 పుదీనా, లవంగములు మొదలగు మసాలావస్తువులు వేసి వండడము.

చిట్టాముదపు చెట్టు:— Ricinus Communis-smaller variety of castor oil plant. సం॥ ఏరండ, గంధర్వహస్త. హి ॥ చోటా

ఎరెండ్. దీని వేరుకషాయము వాతమును, శ్లేష్మమును, హృద్రోగ మును పోగొట్టును. దీనివేరు, ఎండు మిరపకాయలు, పొగాకువేసి నూరిన ముద్ద నిమ్మకాయంత తినిపించిన గుల్మములకు వచ్చు కడుపు నొప్పి హరించును దీని ఆకులకు ఆముదము చరిమి వెచ్చజేసి ప్రసవ స్త్రీల చన్నులు పైని వేసి 12, లేక 24 గంటలసేపు ఉంచిన తప్పక పాలు చేపువచ్చును. ఆయాకులను పొత్తికడుపున వేసియుంచిన ఋతురక్తమును జారీచేయును. దీని ఆకులను 3-4 మాడపట్టున ఉంచి అందుపైన తలరుమాలుగాని టోపీగాని యుంచుకొనిన శిరో వాతము, తలనొప్పి అణగును; మెదడులోని వేడి నణచును.

చిట్టాముదము:—Oil of the seed of do. దీనిని లోపలికి పుచ్చు కొనిన వాతములను హరించును. దేహపుష్టినిచ్చును. పంచగుల్మ లను, రసదోషమును, అన్నిశూలలను, శిరోవాతములను బోగొ ట్టును; విరేచనము జేయును; దీనిని పైన మర్దనచేసిన వాతమేహ వాతనొప్పులు, ఈడ్పులు నయమగును. దీనిని శిరస్సునకు మర్దన చేసుకొని శీకాయతో రుద్దుకొని స్నానము జేయుచుండిన మెదడు నందు వేడిని శమింపజేసి నేత్రరోగములు హరించును. దీనికిని ఆము దము (పెద్దఆముదాల ఆముదము) యొక్క గుణములు గలిగి యుండును; దాని కంటె నిది యెక్కువ పనిజేయును. ఆముదము చూడుడు. మోతాదు 1 మొదలు 4 తులముల యెత్తువరకు.

చిట్టీతపండ్లు:— Phoenix Farinifera. Eng. Fruit of wild date, smaller variety. సం॥ పరూషక, పండినపండ్లు తియ్యగ రుచిగా నుండును. వాతపైత్యములను గొట్టును.

చిట్టుడుకుసీళ్ళు:—తేటగంజి చూడుడు.

చిట్టెలుకమాంసము:—Flesh of a sort of rat. రుచిగా, లఘు వుగా నుండును; వీర్యవృద్ధి చేయును. నేత్రములకు, వెంట్రుకలకు

బలమిచ్చును. రక్తవాతమును శమింపజేయును. మలమూత్రములను విడిపించును. మూలవ్యాధి, కాస, శ్వాస వీనిని హరించును.

చిత్రమూలము:— **Plumbago Zeylanicum, P. Rosea. P. Capensis Eng. Ceylon Leadwart.** చిత్రక, దహన, వహ్ని మూల. హిం* ఛిత్రక్, చీతా. ఇది తెలుపు, ఎరుపు, నలుపురంగు పుష్పములుగల మూడుజాతులు. ఈమూటిలోను ఎరుపు పువ్వులు గలది శ్రేష్టము. ఎక్కువ పనిచేయును. ఇవి కారముగ నుండును. వీని వేరుయొక్క రసము, లేక కషాయము, చూర్ణము జ్వరములు, సర్వవాతములు, ద్వంద్వరోగములు, కడుపులోని బల్లలు, ఉదర రోగము, మూలవ్యాధి, గ్రహణి, కఫము, వాతపునొప్పులు, పక్ష వాతము, ఉబ్బురోగము, క్రిమిరోగము, దురద, వ్రణములు, కుష్టు, శ్వాస, శూల వీనిని హరించును; విషమజ్వరము, అజీర్ణజ్వరము, అగ్నిమాంద్యము, పురాణజ్వరము వీనిని బోగొట్టును; ఆకలి బుట్టించును; గర్భస్రావమును గలిగించును. దీనిని యితరమందులతో నూరి లోపలి కియ్యనగును. గాని వట్టిదే లోపలి కియ్యకూడదు; ఇచ్చిన కడుపులో పుండగును. దీనివేరు పయిచెక్క బియ్యపు గంజితో నూరి క్రొత్తగా లేచిన గెడ్డలకు అడ్డగర్రల (**Buboes**) కు పైన పట్టువేసిన అవి హరించును, వట్టిదినూ౦ దేహామునం దెక్కడ వేసినను పుండగును; కొన్నితీరని వాతపునొప్పులకు నొప్పిగల చోటను, పక్షవాతమునకు పడిపోయిన అవయవముయొక్క కీళ్ళ మీదను, కుదరని రక్తవిరేచనజాడ్యములకు నాభిచుట్టును సుమారు చిటికెనవ్రేలి వెడల్పున వంటించిన ఆప్రదేశమున పుండై ఆవ్యాధు లను నివృత్తించును. దీనివేరు చెక్కనూరి కొబ్బరినూనెలోగాని, నువ్వుల నూనెలోగాని వేసి కాచి మర్దన చేసిన వాతపు నొప్పులు, పక్షవాతము, ధనుర్వాతము నివారణ మగును. దీనిఆకు నూరి

అడ్డగఱ్ఱమీదను, చీముపట్టసి గడ్డలమీదను పెట్టిన నవి హరించును; వేరునూరి పంటినొప్పిగల చోట పైన (topically) బెట్టిన బాధ నివృత్తించును. దీని లేతఆకులకూర శాక చేయును;అగ్నిదీప్తినిచ్చును; క్రిమిరోగమును, వాత శ్లేష్మరోగములను హరించును.

చిత్రవర్ణముగల పచ్చడము:—Wollen cloth (cloak) of different colours. కాంతిని, దేహోష్ణమును ఇచ్చును; పైత్యమును హెచ్చించును; హేమంత శిశిర ఋతువులయం దనుకూలముగ నుండును; వాతమును శ్లేష్మమును అణచును.

చినరణభేరి:—భూ కాంకుశపు చెట్టు చూడుడు.

చిన్నదూలగొండ:—Hedysarum Alhagi & Alhagi Meurorum. Eng. cameli thorn. సం* దురాలభా, ధన్వయాస, యవాస. హిం* జవాసా. యివి రెండు జాతులుగలవు. మొదటిది చిన్న పొద వలె వేచి తామ్రవర్ణముగల తీగెలుండును. ఆకులు పొడవుగా మిర పాకువలెనుండి చెట్టంతయూ నూగు గలిగియుండును. యీనూగు శరీరమునకు తగిలిన విస్తారము దురద గలుగును. యిది విస్తారముగ రేగటిభూములలో లేచుటవలన రేగటిదూలగొండి యందురు. రెండ వదికూడ పొదవలె లేచునుగాని చిన్నవియగు గుండ్రని యాకులు గలిగి చెట్టంతయు నూగుగలిగియుండును. శరీరమునకు తగిలిన విస్తారము దురదబెట్టును. యిది విస్తారముగ గరువు భూములలో లేచును. యితర భూములలోగూడ లేవవచ్చును. దీనిని దూలగోవెలయని, తీటకసివిందయని యందురు. యీ రెండుజాతులును సమానగుణము గలిగియుండును. దీని వేరు రసము లేక కషాయము, తీపి, చేదు, వగరు రుచులు గలిగియుండును. శీతవీర్యము గలది. చెమట బుట్టించును. రక్తమును శుభ్రపరచును. తత్వమును మంచికి మార్చును. మేహము, సుఖవ్యాధులుగలవారితత్వమును మార్చి బాగు చేయును,

మూత్రమునుజారీచేయును. పైత్యము, తాపము, దాహము, చర్ది, మేహాజ్వరము, తీవ్రమైనజ్వరము, సన్నిపాతము, విషమజ్వరములను హరించును. అపస్మారము (Hysteria)ను బాగుచేయును. రక్తపైత్యమును కట్టును. ఋతురక్తమును జారీచేయును. వీర్యవృద్ధి నిచ్చును. శీతవాత నొప్పులు, కీళ్ళనొప్పులు, ఆమవాతపు నొప్పులు (Gout) వీనిని పోగొట్టును. అగ్నిమాంద్యమును హరించును. రసపుమోతాదు 2-3 తులముల ఎత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల ఎత్తువరకు. దీనిని సమూలము సన్నముగతరిగి నీడను ఎండించి పొగబుచ్చుకొనిన శ్వాస, కాసల శమింపజేయును. దీని వేరు రసముగాని, కషాయముగాని రజస్సులయిన దినము మొదలు 15దినములవరకు ఉదయం సాయంకాలములయందు పుచ్చుకొనుచుండిన వంధ్యత్వదోషము పోయి సంతానయోగ్యత కలుగును, నష్టసంతానముగల స్త్రీలకు యిది అమృతతుల్యముగ పనిజేయును.

చిన్నపల్లేరు:— Tribulus Terrestris. Eng. Small Caltrops. సం॥ గోక్షుర, ఇక్షుగంధా. హిం॥ గోఖురు, గోఖ్రూ. ఇది నేల పల్లికవలె ప్రాకెడు సన్ననియాకులుగల తీగ. పసుపుపచ్చనిపువ్వులు పూచి చెట్టంతటను ముండ్లుగల కాయలు కాయును. దీని సమూల కషాయముగాని, కాయలకషాయముగాని, చూర్ణముగాని చలవ జేయును. మూత్రమును జారీచేయును. వీర్యవృద్ధి, బలము నిచ్చును. ఇంద్రియనష్టము, మూత్రము వెంటపోవు ఇంద్రియమును, గుఱ దాల లోని రోగమును పోగొట్టును. ఋతుశూల, మూత్రకృచ్ఛ్రము, ఉబ్బురోగము, సర్వమేహములు హరించును. ఇంద్రియమును ఘట్టి పడజేయును. పుంస్త్వమును హెచ్చించును. దీనికాడల కషాయము ఇచ్చిన సెగరోగము హరించును. దీని సమూలరసము పుచ్చుకొనిన నపుంసకత్వము నివారణమగును, కషాయపు మోతాదు పూటకు

2½ మొదలు 5 తులములమెత్తువరకు. రసపుమోతాదు 2 మొదలు 4 తులముల మెత్తువరకు. చూర్ణపుమోతాదు 2 మొదలు అణాల యెత్తువరకు ఇందులోని యెరుపుజాతికికూడ యీ వేగుణములు.

చిన్నముత్తువపులగము:—Acalypha Betulina. ఇది పాలచెట్టువంటి యొకచెట్టు, అడవులలో వుండును. దీనియాకులు కోలగ సువాసనగ నుండును. వీని తేలిక కషాయము, అగ్నిమాంద్యము (dyspepsira) ను పోగొట్టును. మరిడిజాడ్యము (cholera) తగిలినవారికి యిచ్చిన వారి పొట్టకు బలముజేయును. శరీరతత్వమును మంచికి మార్చును. దుష్టపదార్థకూటమిని (గుల్మము) కరగించి విడగొట్టును. దీని తేలిక కషాయపుమోతాదు 3 మొదలు 5 తులములమెత్తు.

చిన్ని పువ్వుతేనె:—Honey & Sugar of the flowers of do. ఇది చిన్ని చెట్లపువ్వులలోనుండి తీయబడినది మేహశాంతి జేయును; అరుచిని; చర్దిరోగమును అణచును; మధుమేహమును పోగొట్టును; ఈతేనెపట్టులలోనుండు శర్కర మధురముగ నుండును. పైగుణము లేకాక జ్వరము, ఉన్మాదము, వాతము, గ్రహణి వీనిని పోగొట్టును. రక్తపైత్యమును శమింపజేయును. వీర్యవృద్ధి, బలము గలిగించును.

చిప్పగడ్డి:—A kind of grass. కారముగ, చేదుగవుండును. శ్లేష్మము, వాతము, క్రిమి, హృద్రోగము, జంతువాతము వీనిని హరించును. రసముయొక్క మోతాదు 2 తులములు.

చిప్పలమాంసము:—Flesh of cockle shells. అనగా ఆలచిప్పలు, గుల్లచిప్పలు వీనిమాంసము. వీనిలోని మాంసము మూత్రపురీషము లను గావించును. పైత్యమును గొట్టును. కండ్లకు చలవజేయును. వీర్యపుష్టి, వేడిజేయును.

చిప్పసున్నము:—Lime of do. జఠరాగ్ని వృద్ధిజేయును. గుల్మము, శూల, క్రిమి, అరుచి, కఫము, వాతము వీనిని హరించును.

చిమిడిన అన్నము:—Over boiled rice. అనారోగ్యమైనది. గురుత్వముగనుండి అగ్నిమాంద్యము చేయును. అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు అన్నము చూడుడు.

చిమ్మిలి :— Sweetmeat made of gingily seed dhall and jaggery. బెల్లము, నువ్వుపప్పు వేసి త్రొక్కి చేసినది రుచిగనుండును. బలమును, వీర్యవృద్ధిని యిచ్చును అగ్నిమాంద్యము, కఫము జేయును. దీనికి విరుగుడు మంచినీళ్ళు.

చిరకా:—Vinegar. కల్లుపులుసు చూడుడు.

చిరగడదుంపలు (ఎరుపువి, తెలుపువి):—Dioscorea Purpurea సం॥ రక్తపిండాలు, రక్తాలు. హిం॥ పిండాల్, వీనిని మాదేఫలపు దుంపలనియు; గెనుసుగడ్డలనియు నందురు. ఇవి కోలగ గుండ్రముగా నుండును. వీనిని కూరగను, ఉడకబెట్టియు, కాల్చుకొనియు తిందురు. కమ్మగ, తియ్యగ, రుచిగనుండును. ఆకలిని శమింపజేయును. ఆహారముగ నుపయోగింతురు. చలవచేయును. రక్తమును వృద్ధిచేయును. కడుపులోని వాతమునుబంధించును. వాతము, గురుత్వము, శ్లేష్మము, పైత్యము జేయును. వీనికి విరుగుళ్ళు 1 పంచదార, 2 మోదుగ చెక్కరసము, 3 ఉప్పు.

చిరుతపులి మాంసము:—Leopard-flesh of. రుచిగా, తేలికగా నుండును, వీర్యపుష్టి నిచ్చును, కండ్లకు చలవజేయును. రక్తపైత్యము; రక్తవాతము వీనికనుకూలముగ నుండును; మలమూత్ర విసర్జన గావించును; మూర్ఛరోగము, కాస, శ్వాస, మూలవ్యాధి వీనిని హరించును. దీని అజీర్ణమునకు విరుగుడు నువ్వులనూనె.

చిరింజిపప్పు:—సారపప్పు చూడుడు.

చిరికందులు:—కందులు చూడుడు.

చికలిగొట్టు:—Flowers of a sort of Bignonia Stereos hermum. సుగంధము గలిగి, అతిమనోహరముగా నుండును. కఫ వాతదోషములను బోగొట్టును. నీటి కలుషమును విరుచును.

చిరినెల్లికూర:—నెల్లికూర చూడుడు.

చిరువేరు చెట్టు:—శిరివేరు చూడుడు.

చిఱవేరు రంగుబట్ట:—శిరివేరు రంగుబట్ట చూడుడు.

చిరిసెనగలు:—శనగలు చూడుడు.

చిర్రికూర చెట్టు:—Amaranthus Campestria. సం॥ తండుల, గ్రంథిల, పథ్యశాక. హిం॥ చౌలాయి. దీని సమూలపు కషాయము లేక రసము లేక వేరురసము, త్రిదోషములను, చెడురక్తమును బోగొట్టును; అగ్నిదీప్తి నిచ్చును; కండ్లకు మంచిది; మేదస్సును, రక్తపైత్యమును, విషమును, వాతమును హరించును. గుండెలను శుభ్ర పరచును. దీని వేరు కషాయము లేక చూర్ణము తత్వమును సౌమ్య పరచును. మూత్రబద్ధమును విప్పును. రసదోషమును, నాభివిషమును హరించును. కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు. రసముయొక్క మోతాదు పూటకు 1 మొదలు 4 తులములయెత్తువరకు. దీనిఆకుకూర రుచిగనుండును. వేడిచేయును. తేలికగ జీర్ణమగును, పథ్యకరమైనది.

చిరుపాల చెట్టు:—పిన్నపాల చెట్టు చూడుడు.

చిరుబొద్ది:—పాల చెట్టు చూడుడు.

చిలుకకూర చెట్టు:—Hingtaha Repens. సం॥ హిలమోచికా, జలబ్రహ్మి. హిం॥ హర్‌కుంచ్. ఇదినీళ్ళవారలేచెడు చిన్నమొక్క; సరస్వతిచెట్టునుబోలియుండును. చిన్నచిన్న నల్లనిపువ్వులుపూయును. దీని సమూలరసము లేక కషాయము చేదుగ నుండును. కఫపైత్యమును, క్రిమిరోగమును పోగొట్టును. మేదస్సును బెంచును. అగ్ని

దీప్తి, బలము జేయును. సర్వదోషములనుహరించును. కాంతినిచ్చును. బుద్ధిని హెచ్చించును, కడుపులోని బల్లను, జ్వరము, గ్రహణి, మూలవ్యాధి, ఉబ్బు వీనిని పోగొట్టును. తెల్లచిలుకకూరకును ఇవే గుణములు. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 5 తులముల యెత్తు వరకు. దీని ఆకుకూర పైరోగులకు పథ్యముగ నుండును.

చిలుకతోటకూర:—A species of garden herb. దీనిని దొగ్గలి కూర యందురు. ఇదితోటకూరలో భేదము. పెరటిదొడ్లలోను పొలములలోను పెరుగును. దీనికూర వండుకుని తిందురు. దీనికూర సమూలరసము లేక కషాయము చేలిక నిచ్చును. త్రిదోషముల నణచును. అగ్నిదీప్తి నిచ్చును. రక్తదోషము, క్రిమిరోగము, పాము విషము, అసృగ్దరమను కుసుమరోగము వీనిని బోగొట్టును. కొద్దిగ వేడిజేయును. పైత్యశ్లేష్మములను హరించును. రసము యొక్క మోతాదు పూటకు 2½—4 తులముల యెత్తువరకు. దీని ఆకుకూర పైరోగులకు పథ్యముగ నుండును.

చిలుకమాంసము:—Parrot flesh of. దోషయుక్తమయినది. గురుత్వము జేయును. మూత్రమును విప్పును. అగ్నిమాంద్యమును, వాతమును జేయును.

చిలుకరెక్కలగంధకము:—గంధకము చూడదు.

చిల్లగింజలు:—ఇండుపగింజలు చూడుడు.

చివుకువెలుగుచెట్టు:—వెలమసంధి చూడుడు.

చీకటిమ్రాను:—తమాలవృక్షము చూడుడు.

చీనాపంచదార, తెల్లపంచదార, చక్కెపంచదార:—Sugar. ఇవి చలవ జేయును. రుచి బుట్టించును. వీర్యవృద్ధి, బలము జేయును. మూర్ఛ, సర్వప్రమేహములు, దాహము, ముఖశోష, జ్వరము, బడలిక,

శ్వాస, వాతి, ధాతుక్షయము, మందాగ్ని, దుర్బలము, క్షయ, రక్తపైత్యము, చర్ది, ఎక్కిళ్ళు, మేహాతిసారము, మూత్రకృఛ్రము, పైత్యవికారము, ఉన్మాదము, కామిగ్లు, మదము, తాపము, తల త్రిప్పు స్మృతితప్పడము, పాండురోగము, ప్రదరమను యోనిరోగము వీనిని శమింపజేయును. ద్వంద్వరోగములకు అనుపానముగ నియ్యతగి యుండును. నరుకులను, దెబ్బలనుమాన్పును. గొంతుకను, రొమ్మును, కార్జము (liver ) ను మృదువుపరచును; శుభ్రపరచును; రొమ్ము (గుండెలు) లోని రోగములకు, తెల్లదెబ్బ (Lungs ) కు మేలు జేయును; వేగముగ దేహము తట వ్యాపించును; ప్రాణమును కాపాడును; కడుపులోని వాతమును వెడలించును; మంచిరక్తమును పుట్టించును; నరములకు, ఎముకలకు, కార్జము (Liver) నకు సత్తువ జేయును; ముసలితనమును వేగముగ రాకుండ నాపును; ఔషధమున కనుపానముగనిచ్చిన దానిని త్వరగ దేహమునకు వ్యాపింపజేయును; కడుపు నొప్పిని శమింపజేయును. 20దినముల (సుమారు6తులలయెత్తు) మోతాదుగనిచ్చిన రక్తమునుశుభ్రపరచును; తత్వమును మృదువు పర్చును; దేహమందు గట్టిపడిన దుష్టపదార్థకూటమిని కరిగించును; నీరుజేయును; కళ్ళునాపును; చీనాపంచదార తెల్లగపిండివలెనుండును; తెల్లపంచదార ఇసుకవలె తెల్లగ శుభ్రముగ నుండును; చక్కెపంచదార ఇసుకవలెనుండునుగాని కొంచెము ఎఱ్రగనుండును. ఈమూటి గుణము నించుమించునొకటిగనుండునుగాని మొదటిదానికంటెతక్కిన రెండును ఒకదానికంటెఒకటితక్కువ చలవ. వేడిఅధికముగలవై యున్నవి పరగడుపున ప్రొద్దుటపంచదార వట్టిదే తినినను, అధికముగ దినినను ఆకలి మందగించును; అజీర్ణము జేయును; దీనికి విరుగుళ్ళు 1తుంగ ముస్తలచూర్ణము, 2బాదముపప్పు, 3 పచ్చిపాలు, 4పులుపు పదార్థములు. దీనికి సాధారణపు మోతాదు పావుతులము

మొదలు తులమెత్తువరకు.పట్టికే పంచదారకొని నీళ్ళు త్రాగకూడదు. ఆలాగు త్రావిన జలుబు, వాతము, శ్లేష్మము జేయును. జ్వరము దెచ్చును; అగ్నిమాంద్యము జేయును.

చీరమాను:—A small variety of fish. ఇది నదులలో క్రొత్తనీరు వచ్చినప్పుడే వచ్చును. ఇది మిక్కిలి చిన్నవిగనుండెడు చేపలు. దీని కూర రుచిగా నుండును. బలముజేయును. వీర్యవృద్ధి నిచ్చును; హెచ్చుగ తినిన గురుత్వముగ నుండును. వాతముజేయును. దీనికి విరుగుళ్ళు చేపలుచూడుడు.

చుంచుమాంసము:—Flesh of a musk rat, mouse. దీనిని చుంచెలుక యందురు; ఇది గబ్బువాసన గలిగియుండును; దీనిమాంసము కఫపైత్యములను, కుష్ఠురోగములను బోగొట్టును. దీని మాంసము ఎండించి చూర్ణముజేసి పుంచుకొని నశ్యము చేయించిన పాముబిషము హరించును.

చుక్కకూర:— Rumex Vesicarius. Eng. Bladderedack. సం॥ చుక్రికా, పత్రామ్ల. హిం॥ చూకాశాక్. దీనికూర పుల్లగ రుచిగ నుండును; పైత్యమును, కఫమును వృద్ధిపరచును. వాతమును హరించును; రుచిబుట్టించును; చులకనగా జీర్ణమగును; వంకాయలో కలిపివండి తినిన బహురుచికరముగా నుండును; అగ్నిదీప్తినిచ్చును; వేడిజేయును; పథ్యమైనది; శూలలను, గుల్మమును, అగ్నిమాంద్యమును,హృదయవేదనను, మలబద్ధమును, ఆమవాతమును వీనిని హరించును; వమనమును, దాహమును కట్టును; ఈకూర మాంసాదులలో వేసి వండి తిందురు.

చుట్ట:—Cigar. పుగాకు చూడుడు.

చెక్కెపంచదార:—చీనాపంచదార చూడుడు.

చెంబేలి పుష్పము:—A sort of flower. ఇది సువాసన గలది; వేడిజేసి అర్చును; మెదడుకు బలమిచ్చును. వాతమును హరించును;

ఈపుష్పములతో చేసిన నూనెను పైనజెప్పిన గుణములు గలిగి యుండును.

చెట్టుసంపెంగ:—Michelia Chempaka-a sort of. యీ చెట్టు పెద్దవృక్షమగును; దీనిపుష్పము పసుపుపచ్చగ తెల్లగానుండెడి రెండు జాతులుగలవు. మృదువుగ మిక్కిలి సువాసనగలిగియుండును. మనస్సుకు సంతోషమును, ఆనందమును బుట్టించును. పైత్యశాంతి, మేహశాంతి జేయును. ఈపుష్పములతో మర్బతుకూడ చేసివాడుదురు.

చెప్పులు:—పాదరక్షల గుణము చూడుడు.

చెప్పుచెముడు:—నాగజెముడు చూడుడు.

చెప్పుతట్టాకు చెట్టు:—The Asarabacca plant. సం॥ చవ్వార, కాకాండ. దీనివేరు మిక్కిలి ఉష్ణముజేయును, వాతమును, సన్నిపాతమును, వాతజ్వరములను పోగొట్టును, వెర్రికుక్క విషమును హరించును. దీనిరసపు మోతాదు 1-2 తులములయెత్తువరకు.

చెముడుచెట్టు:—Euphorbia Tirucalli. Eng. Milk Hedge. సం॥ స్నుహి. హిం॥ తూహార్. అనగా కాడచెముడు. దీనిమ్రాను చెక్క లేక కాడలు, వీని రసము లేక కషాయము మిక్కిలి వేడిజేయును; కడుపులోనిబల్ల, అష్టోదరములు, గుల్మము, శ్వాస, కఫము, గ్రంధివాతము, అగ్నిమాంద్యము, అన్ని శూలలు, పాండురోగము, ఉబ్బురోగము, కర్ణవాతము వీనిని బోగొట్టును. మోతాదు పూటకు పావలా యెత్తు మొదలు తులముయెత్తువరకు. దీనిపాలను అరచుక్క మొదలు 2 చుక్కలవరకు తులమెత్తు మొదలు 2 తులములయెత్తువరకు వెన్నతో లేక నేతితో నిచ్చిన విరేచనము లగును. దీని కంఠము దిగువనుండు గుంటలో వీనిపాలు అంటించి దాని పైన పసుపుజల్లిన దగ్గులు నిమ్మళించును. పండుకాడలు వెచ్చజేసి రసముదీసి చెవిలో బోసిన చెవిపోటు నిమ్మళించును. రాచపుండు

లేచినతోడనే దీనిమ్రానుపాలు దట్టముగా దానిపైనపూసిదానిపైన గుడ్డఅంటించి ప్రతిదినముదానిపైన పాలు అంటించుచుండిన ఆపుండు హరించును. దీని మ్రానుకాడల పాలు కీళ్ళనొప్పులకు నొప్పిగల చోటను, పురాణ కుక్షిరోగులకు నాభికిని పట్టువేసిన అవి నివారణ మగును. దీనికాడలు, కొమ్మలు యెండించి కాల్చి చేసిన భస్మము తేనెతోగాని, పంచదార పాకముతోగాని లోపలికిచ్చిన దగ్గులు, శూలలు హరించును; వాతమును గొట్టును; ఉష్ణము జేయును. మోతాదు గుంజయెత్తు మొదలు 4 గుంజలయెత్తువరకు. దీనిపాలు శరీరము మీదపడిన పొక్కును.లోపలికి మోతాదెక్కువైన దారుణ విరేచనముల గావించి చంపును; ప్రేగులకు మిక్కిలిఎష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తంగేడు చిగుళ్ళరసము, 2 నీరుల్లిపాయలరసము, 3 వెన్న. 4 చల్లనినీళ్ళలో కలకండ కలిపిచేసిన పానకము, 5 పొక్కి వచోట చింతాకు నీళ్ళలోనూరి పూయవలెను; వెన్నయైనను పూయ వలెను; దీనిచెక్క, కాడలు, పీనిరసము లేక పాలు లోపలి కిచ్చు నప్పుడు రోగి దేహదార్ఢ్యము మొదలగునవి గమనించి స్వల్పపు మోతాదులతో నారంభించి క్రమముగ హెచ్చించుచు జాగ్రతతో వాడవగును;సుకుమారులగు రోగులకు వానిని లోపలి కియ్యంజనదు.

చెముడుకాకిమాంసము:—Flesh of king crow. వేడిజేసి అర్చును; జ్ఞాపకశక్తి నిచ్చును; వాతరోగమును, మూర్ఛను, పక్షవాతమును హరించును. దీని చేదుకట్టును మ్రింగించిన మూర్ఛరోగము నయ మగును. దీని మాంసము తినిన చెముడుతగ్గును.

చెరుకుకొన, మొదలు, కణుపులు:— Both ends and joints of a sugar cane. చెరుకుకొన అనగా దవ్వ ఉప్పగా, చప్పగా నుండును మొదలు పుప్పి, ఇసుక మొదలయినవి గలిగి ఉప్పగా కణుపులు చప్పగా నుండును; ఇవి దాహమును గలుగజేయును; 'గురుత్వముగ

నుండును; విరేచనబద్ధము, వాతము, శ్లేష్మము జేయును గాన వీనిని పరిహరించవలయును.

చెరుకు:— Saccharum Officinarum. Eng. Sugar cane. సం॥ ఇక్షు, మధుతృణ. హిం॥ ఈఖ్, గన్నా. ఇవి బంగారుతీగె చెరుకు, మొగలిచెరుకు, నామాలచెరుకు, ఎఱ్ఱచెరుకు, నల్లచెరుకు, తెల్ల చెరుకు, అడవిచెరుకు మొదలగు ననేక జాతులుగలవు. బంగారు తీగచెరుకు నమిలి రసముపీల్చి తినుటకు మృదువుగానుండును. బాగా ముదిరినచెరుకు మొదలుముక్క కణుపులు, చివరదవ్వ విస ర్జించి మిగిలినది చర్మముతీసి నమిలి రసము పీల్చుకుని తినినతియ్యగా మనోహరముగా నుండును. ఆకలి దప్పికలను శాంతింపజేయును. చలవజేయును.రక్తమును శుభ్రపరచును,పైత్యము. రక్తపైత్యము, నీరుచురుకు, గుండెలలో మంట వీనిని బోగొట్టును, మలమూత్రముల గావించును; వీర్యపుష్టి నిచ్చును; కంఠమును పొట్టను శుభ్రపర చును; నోటిచేదు నణచును; బలము,పుష్టినిచ్చును; బుద్ధిని హెచ్చిం చును; భోజనానంతరము మితముగ దినుచుండిన జీర్ణశక్తిని వృద్ధి పరచును; చెరుకులన్నియు యించుమించు సమానగుణము గలిగి యుండును. శ్లేష్మము, వాతము జేయును. దీనికి విరుగుళ్ళు 1 సోపు, 2 అల్లము. చెరుకు తరుచు భోజనాత్పరమందు బుచ్చుకొన దగినది; పంచదారకు ఉండు గుణములు దీనికిని గలవు.దీనివేళ్లు కాంజీనముతో కాచియిచ్చిన స్త్రీలకు పాలు వృద్ధిపరచును.

చెరకు తేనె లేక పాకము:—Treacle. అనగా చెరుకురసము తేనె పాకముబట్టి యుంచినది. తియ్యగ, రుచిగానుండును. పైత్యవాత ములను హరించును. విరేచనబద్ధము జేయును.శ్లేష్మమును పెంచును. గురుత్వము, చలవజేయును, దీనికివిరుగుళ్ళు చెరుకురసము చూడుడు.

దీనిని మినపగారెలు, ఇడ్డెనులు వగయిరాలలో ముంచుకుని తినిన మిక్కిలి రుచిగ, ఆరోగ్యముగనుండును.

చెరుకు తినకూడనివారు:—Those who should not eat sugar cane. కుష్టు, ప్రమేహము, అగ్నిమాంద్యము, ఉదరము, పీనస, కఫము, ధవడతీపు, నులిపురుగులు, అరుచి, గుల్మము, జ్వరము, ఉబ్బు, భగందరము, శ్లేష్మప్రకోపము ఈరోగములు గలవారును పుచ్చుకొనగూడదు..

చెరుకుపాయసము:— Rice boiled in sugar cane juice. చెరుకు రసముతో వండిన అన్నము మిక్కిలి మధురముగ నుండును; పైత్యమును హెచ్చించును; వీర్యవృద్ధి, శ్లేష్మము, గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు చెరుకురసము చూడుడు.

చెరుకురసము:—Juice of sugar cane. గానుగనాడి తీసిన చెరుకు రసము మధురముగ నుండును; వేడిజేసి చలవజేయును; మూత్రమును గావించును; కఫము, వాతము, రక్తపైత్యము వీనిని హరించును; రుచి బుట్టించును; వీర్యపుష్టి, కాంతి, బలము, పుష్టి, వాచాలత్వము వీని నిచ్చును; పొట్టను శుభ్రపరచును; శీతపైత్యమును; విదాహమును, క్రిమిని బుట్టించును; విరేచనబద్ధము జేయును; ఝాముకంటె ఎక్కువ కాలము నిలవయుంచిన రసము మిక్కిలి గురుత్వము జేయును; త్రిదోషములను హెచ్చించును. దీనికి విరుగుళ్ళు 1 అల్లము, 2 మోదుగక్షారము, 3 సోపు.

చెరుకురసము నమలిపీల్చినది:— చెరుకు చూడుడు.

చెరువు చేపలు:— కొలనుమీను చూడుడు.

చెరువునీళ్ళు:— Tank water. (ఈ చెరువునకు మరుగొమ్మ్మ లుండిన దీని నీరు మిక్కిలి ఆరోగ్యకరము) చెరువునీరు రుచిగా నుండును; పైత్యము నణచును; ప్రాణప్రదమయి యుండును; శ్రమను పోగొ

ట్టును; రుచిని బుట్టించును; దేహపుష్టి, వీర్యపుష్టి జేయును;కఫవాత ములను జేయును. దీనికి విరుగుళ్ళు ఉదకము చూడుడు.

చెలమనీళ్ళు:—Water of a pit in river or tank. రుచి, తేలిక, స్వచ్ఛత గలిగియుండును; వీర్యవృద్ధి జేయును; సుఖమిచ్చును; పైత్యమును, కఫమును, వాతమును అణచును; ఆప్యాయతను, అగ్నిదీప్తిని యిచ్చును; దప్పికను, తాపమును అణచును.

చెవుల పిల్లి:—కుందేలు చూడుడు.

చెవ్యము:—Piper Chaba. P. Officinarum. సం* చవ్యం. హిం* చవ్య. ఇది గజపిప్పలియొక్క తీగె. దీని ఫలమునే గజపిప్పళ్ళందురు. యీతీగెసువాసనగ నుండును. దీని కషాయము అగ్నిదీప్తి నిచ్చును; కఫము, వాతము, మూలవ్యాధి, క్రిమిరోగము, పాండువు, ఉబ్బు, శూల, కుష్టు, హృద్రోగము, అగ్నిమాంద్యము, అతిసారము సర్వజ్వరములు వీనినిబోగొట్టును; వీర్యవృద్ధిజేయును; వాతపైత్యమును శమింపజేయును; బలముజేయును. మోతాదు పూటకు 3 మొదలు 5 తులముల యెత్తువరకు.

చేకొణితిచెట్టు:—A medicinal plant. యిదియొక తీగెచెట్లమీాద ప్రాకును. దీనివేరు, ఆకురసము వాతరోగమును, జ్వరమును బోగొట్టును. రసపుమోతాదు 2-3 తులములు. దీని ఆకురసము, వావిలాకురసము, వాతనారాయణాకు రసము నువ్వులనూనె సమభాగముగా చేర్చి కాచినతైలము, వాతములు, పక్షవాతములు, మేహవాత నొప్పులు నయమగును.

చేదలాసికూర:—చాదరాసికూర చూడుడు.

చేదు అనబచెట్టు:—Bitter gourd plant. సం* కటుతుంబి. దీని ఆకుపసరు చేదు, వగరు గలిగియుండును; వమనముల జేయును; కాస, శ్వాస, జ్వరము, అగ్నిమాంద్యము,స్థావర జంగమవిషములు,

పాండువు, కుష్ఠు, ఉబ్బురోగములు వీనిని జయించును. మోతాదు 1-2 తులముల యెత్తువరకు.

చేదుజీలకఱ్ఱ:—అడవిజీలకఱ్ఱ చూడుడు.

చేదుదొండ:—దొండచూడుడు.

చేదుగుణము:— **Properties of bitter things.** అనగా చేదుగానుండు వస్తువుల సామాన్యగుణము. క్రిమి, కుష్ఠు, పైత్యము, జ్వరము, దగ్గు, విదాహము, అరుచి, నీరసము, అగ్నిమాంద్యము వీనిని పోగొట్టును. వేడిజేయును. రక్తమును, చర్మరోగములను హరించును. మిక్కిలి గాఢమైన చేదుపదార్ధముల నమితముగ సేవించిన రాజయక్ష్మ, మూలవ్యాధిని బుట్టించును.

చేదుదోసకాయ:—**Cucumis Melo-bitter variety. Eng. Bitter-cucumber.** సం* తిక్తకర్కటి, శశాండులీ. హిం* కడవీ. క్రిమిరోగమును, పైత్యోద్రేకమును నివారించును; వాంతి బుట్టించును; వాతము జేయును.

చేదుపొట్లతీగ:— **Trichosanthes Cucumerina, T. Dioica. Eng. Wild Snake gourd.** సం* పటోల, జ్యోత్స్న. హిం* కడవేపల్వాల్, బాన్‌పటోల్. ఇది డొంకలమీద తీగెప్రాకును. దీని కాడలు, ఆకులు, కాయలుపచ్చివిగాని, యెండువిగాని మిక్కిలి చేదుగనుండును. వీని కషాయము వాత, పిత్త శ్లేష్మజ్వరములు, శీతజ్వరము, పురాణజ్వరములు, మన్యపుజ్వరము, అన్నిజ్వరములు, క్రిమిరోగము, త్రిదోషములు, అరుచి, కుష్ఠు, మేహము, నేత్రరోగములు, వ్రణములు, పాండువు, ఉబ్బు, మందాగ్ని, కామిల వీనిని జయించును. దీని విత్తనములు కుక్షిరోగములను పోగొట్టును; దీని చిగుళ్ళు, ఎండుకాయ తొక్కలు విరేచనముజేయును; వీని వేలిక కషాయముచేసి పుచ్చుకొనవచ్చును. వీని కషాయములో పంచదార

వేసి పుచ్చుకొనిన ఆహారమును జీర్ణము జేయును. దీని పచ్చిఆకుల రసము వాంతిజేయును. దీనివేరురసము 4-5 తులములయెత్తు పుచ్చుకొనిన విరేచనములగును. దీనికాడల కషాయము శ్లేష్మమును వెడలించును. దీని సమూల కషాయము దేహమునకు బలము జేయును; దీని పచ్చికాయల కూర, ఆకుకూర చేదుగ నుండును; పైనజెప్పిన రోగములు గలవారికి మిక్కిలి పథ్యముగ నుండును; ఆరోగముల నణచును. దీని ఆకురసమును పేనుకొరికినచోట 4-5 దినములు రాసిన ఇంద్రలుప్తము హరించి మరల వెంట్రుకలు వచ్చును. రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

చేదుబీరకాయ:—**Luffa Amara-green fruit of.** చేదుగ నుండును; వాతమును, కఫమును గొట్టను; అగ్నిదీప్తి నిచ్చును; లేతకాయ నిప్పులమీద నుడికించి రసముతీసి కణతలకు పట్టించిన తలనొప్పి నిమ్మళించును.

చేదుబీరతీగ:—**Luffa Amara, E. Plucketiana.** సం॥ కృత వేతస, తిక్తకోశాతకీ, హిం॥ కడవితురాయి. దీని సమూల రసము తీక్ష కషాయము చేదుగ నుండును; ఉష్ణము జేయును; మూత్రము గావించును; కడుపులోని బల్ల, పాండువు, మూలవ్యాధి, గుల్మము, ఉబ్బు, కుష్ఠు, శ్వాస, కాస, సర్పవిషము వీనిని జయించును; బలము చేయును; వమనము జేయును; అన్నివాతములను, సన్నిపాతమును హరించును; పెట్టుమందును కక్కించుట కుపయోగించును. చేదు బీరకాయలు పలచగ చక్రములుకోసి కొద్దిగ ఆముదము మంగళ ములోవేసి అందులో ఆముక్కలు వేసి వేయించి వానిని వెచ్చ వెచ్చగ నుండగ గుడ్డలోపోసి తలకుకట్టిన సన్నిపాతము మానును. మూడుపూటలు కట్టవలెను. దీని గింజల చమురు నేతిలోగాని,

నూనెలోగాని, ఆముదములోగాని కలిపి తలకు మర్దనచేసిన శిరో వాతము హరించును. ఆముదములో గలిపి మర్దనచేసిన వాతము మేహవాతనొప్పులు హరించును. నరములకు సత్తువజేయును; పడిపోయిన కాళ్లు చేతులు బాగగును. వట్టిచమురు తలకు పట్టించిన సన్నిపాతము హరించును. దీని పచ్చికాడల తేలిక కషాయములో Nitro Hydro Chloric Acid అను పులుసు గలిపి 1 మొదలు 2 ఔన్సుల చొప్పున దినమునకు 3-4 సార్లు ఇచ్చిన మన్యపు జ్వరములవలన గలిగిన నల్లదబ్బ పెరగడము (Enlargement of spleen) ను, కార్జము (Liver) నకు గలిగిన ఉబ్బు (Dropsy) నివారణమగును. తేలిక కషాయము కాచువిధమును 50 తులముల మరుగు నీళ్ళలో 20 చిన్నములయెత్తు కాడలు పచ్చివివేసి దింపిన తేలిక కషాయమగును. రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు కషాయపు మోతాదు 3 మొదలు 5 తులముల యెత్తువరకు.

చేదుపుచ్చకాయ:—వెర్రిపుచ్చకాయ చూడుడు.

చేదుబాదము:—Bitter Almonds. ఇవి చేదుగ నుండును, వీనిని లోపలి కియ్యవచ్చును; వీటిని నీళ్ళతోనూరి పైన వేసిన శుభ్రపరచును; నీరు జేయును; కరగించును; దృష్టికి బలమిచ్చును; మూత్రపుసంచి, ఉలవకాయలు (Bladder and kidneys) వీనిలోని రాళ్ళను కరగించును, మూత్రము గావించును; కార్జము (Liver) నల్లదబ్బ (Spleen) వీనిలోని అభ్యంతరములను, జబ్బులను తీసివేయును; నిద్రదెచ్చును; ఋతురక్తమును జారీచేయును. వీనిని సిరకాతో నూరి పట్టువేసిన నరములనొప్పి (Neuralgia) ని పోగొట్టును; వీనిని నీళ్ళతోనూరి తలకు రుద్దిన పేలుచచ్చును; ఒంటికి పూసిన కురుపులు, చిడుము మొదలగు చర్మరోగములు నివృత్తించును. దీని పప్పుతో అత్తిపండ్లు కలిపి యిచ్చిన విరేచనము చేయును.

ప్రేగులలో నొప్పి శమించును. దీని వేరు గడ్డలను కరగించును; శరీర తత్వమును మంచికి మార్చును.

చేప నెయ్యి:—Fish oil. అనగా చేపచమురు. వీర్యవృద్ధి, దేహపుష్టి నిచ్చును. క్షయదగ్గు, కార్శ్యము వీనిని బోగొట్టును. పైత్యము, కాక జేయును.

చేపలు పుచ్చుకొనకూడనివి:—Fish unfit for consumption. ఉబ్బినవి, కుళ్ళినవి, యెండిపోయినవి, దానికదిచచ్చి నీటిపైన తేలినవి పుచ్చుకొనగూడదు.

చేపల సామాన్య గుణము:—Fish generally. వేడిజేసి ఆర్చును. అప్పుడుపట్టిన చేపలు రుచిగా, ఆరోగ్యముగానుండును. పైత్యవాతములను గొట్టును. తేలికగ జీర్ణమగును. బలమును, దేహపుష్టి, వీర్యపుష్టి జేయును. ఉష్ణశరీరులకు, కష్టము చేసెడువారికి అనుకూలముగ నుండును. చేపను చమురులో వేపుటకంటె నిప్పుసెగమీద కాల్చిన మంచిది. త్వరగా జీర్ణమగును. ధాతువులకు సత్తువజేయును. దేహస్థితిని హాయిగా నుంచును. దేహపుష్టి, ధాతుపుష్టి జేయును. స్త్రీలకు పాలుబడజేయును. గురదాల (kidneys) పైన క్రొవ్వుబుట్టించును. ధాతుపుష్టి చేయును. లింగమునకు బలముజేయును. గుండెలను శుభ్ర పరచును. క్షయ, ఉబ్బసములకు మేలు జేయును. మహాధిక్యము వలన హృదయము (heart) నకు, కార్జము (liver) నకు కలిగిన నీరసమును తీసివేయును. మంచివి తాజాచేపలు గ్రహణి విరేచనములను కట్టును. అప్పుడు పట్టినచేపలు నీరుల్లిపాయలువేసి నేతిలో వేపించినవి తిని సారాయి మోతాదుగ బుచ్చుకొనిన మిక్కిలి ధాతుపుష్టి జేయును. చేపలు గడిగిన నీరు పుచ్చుకొనిన సర్పవిషమునకు, అన్నములో కలిపిపెట్టిన విషమునకు మేలుజేయును. నరములలో వాత మున్నవారు, జలోదరము గలవారును ఏ చేపలను తినగూడదు,

హెచ్చుగ దినిన శ్లేష్మము, అజీర్ణము, వాతము జేయును. దగ్గును హెచ్చించును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 బాదమునూనె, 3 తేనె, 4 నువ్వుల నూనె, 5 అల్లపు మురబ్బా, 6 సిరకా. వేయించినమీదను కాల్చినమీదను మొదలగునవి చూడుడు. చేపలు వేసి వండిన యన్నము అనగా దానిలో రసవర్గములు చేర్చినది విరేచనబద్ధము చేయును. పొత్తికడుపును శుభ్రపరచునుగాని అనారోగ్యకరమైనది.

చేపలు ఋతువులనుబట్టి పుచ్చుకొనెడు క్రమము :— **Preferable according to seasons.** హేమంత ఋతువునందు నూతిచేపలును, శిశిర ఋతువునందు కొలనుచేపలును, వసంత ఋతువునందు నదిలోని చేపలును, శరదృతువునందు సముద్రములోని చేపలును, గ్రీష్మఋతువునందు బావులలోని చేపలును, వర్ష ఋతువునందు చెరువులలోని చేపలును అనుకూలముగనుండి దేహసౌఖ్య మిచ్చును.

చేపసెన అనగా గ్రుడ్లు:—**Flesh Spawn or eggs.** దీనిని నీళ్ళలో నుడికించి తీసి ఉప్పు, కారము మొదలగు రసవర్గములకూర్చి నేతిలోగాని నూనెలోగాని వేయించి పుచ్చుకొనిన రుచిగా నుండును; బలము నిచ్చును; పుంస్త్వమును హెచ్చించును; లింగమునకు బలమిచ్చును; క్రొవ్వును, కఫమును పెంచును; విరేచనము గావించును; వాతము జేయును; పొట్టకు నష్టము జేయును. దీనికి విరుగుళ్లు జీర్ణౌషధములు.

చొక్కా:—అంగీ చూడుము.

చొరచేప:—సొరచేప చూడుడు.

చోడిజావ:—అంబలి చూడుడు.

చోళ్ళు, తవిదెలు:— **Elusine Coracana. Eng. Ragi.** సం॥ రాజిక. హిం॥ రాగి. దీనిని రొట్టెగాను, తోపగాను, అంబలిగాను వాడిన వీర్యవృద్ధి, దేహపుష్టి, బలము జేయును. మంచి ఆహారపదా

ర్థము. సాధారణముగా దీనిని అంబలిగాను జావగాను పుచ్చుకుం దురు. మేహశాంతి, పైత్యశాంతి జేయును. వెంద్రుకలకు బలము జేయును. అంబలి చూడుదు.

—౯—

## జ

జంగాలి పచ్చ:—Acetate of copper or Verdigris. ఇది రాగి యొక్క కిలము. వీనిని సాధారణముగ లోపలికియ్యరు. దుష్టవ్రణ ములు, కుళ్ళువ్రణములు వీనిపైన వేసిన వానిని శుభ్రపరచి మాన్పును. లోపలి కిచ్చిన వెంటనే వమనముజేయును. మోతాదు 1 మొదలు 3 గోధుమ గింజల యెత్తువరకు; వెంటనే వమనము చేయించవలసినప్పుడు పై ప్రకారము లోపలి కియ్యనగును.

జంగిలీహల్దా:—అనగా కరక్కాయ పిందెలు. కరక్కాయ పిందెలు చూడుడు.

జంతికలు:—A kind of sweet meat. వరిపిండి కుడుములు వండి వానిని యంత్రములో నుంచి యదిమిన సన్నముగ దారమువలె పడును; బెల్లపు పాకములో వేయుదురు. ఇవి మృదువుగ రుచిగ నుండును; బలమిచ్చును; పైత్యము నణచును; శ్లేష్మవాతములను బెంచును. దీనికి విరుగుళ్ళు 1 వేడినీళ్ళు, 2 ఉప్పువేసినకలి, 3 జీల కర్ర, 4 పుదీనా. జంతికలనుపేరుతో మరియొక విధముగా చేయు దురు. చక్కిలములు చూడుడు.

జటామాంసి:—Valeriana Jatamansi, Nardostachys J. Eng. Indian Spikenard, Sambal, సం॥ జటామాంసి, భూతజటా. హిం॥ జటామాన్‌శి, బాల్‌ఛడ్, ఇది ఒక గ్రంధి దినుసు. సువాసకలిగి మనోహరముగనుండును; తీపి, వగరు, చేదురుచులు గలిగియుండును.

శీతవీర్యముగలది. మేహశాంతి జేయును. శ్లేష్మము, పైత్యశ్లేష్మము, రక్తపైత్యము, విషము, జ్వరము, మూర్ఛ, అపస్మారము (hysteria) తాపము, అతిసారము, మేహరోగములు, ఈడ్పురోగములు వీనినణచును. రక్తమును శుభ్రపరచును. పొట్టకు, శ్వాసకోశమునకు, హృదయమునకు, నరములకు సత్తువజేయును. బలముజేయును. దేహములోని మలముల వెడలించును. మూత్రము గావించును. ఋతు రక్తమును వెడలించును. గుండెదడ (palpitation of the heart) అజీర్ణము. మరిడిజాడ్యములోని నరముల ఈడ్పు, వీనిని కట్టును. మోతాదుపూటకు 10 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు.

జనపచెట్టు:—Crotolaria Juncea. Eng. Indian Hemp plant. సం॥ శణ, మాల్యపుష్ప. హిం॥ సన్. దీని ఆకురసము లేక కషాయము చేదుగనుండును. వమనమును, పైత్యమును గొట్టును. వీర్యవృద్ధి జేయును. రక్తస్రావము, ఉబ్బు, కఫము, రాజయక్ష్మ, రక్తపైత్యము, పాండురోగము వీనిని శమింపజేయును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

జనపపువ్వు:—Flower of do. దీనిరసము, కషాయము లేకచూర్ణము చేదుగా నుండును. పైత్యముజేయును. అగ్నిదీప్తి నిచ్చును. రుచి బుట్టించును. వాతాతిసారమును బోగొట్టును. గర్భమును హరించును. రసపు మోతాదు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 3-4 తులములయెత్తు. చూర్ణముయొక్క మోతాదు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు.

జనపవిత్తులు:—Seeds of do. చలవ, గురుత్వము, మలబద్ధము జేయును.

జమ్మిచెట్టు:—Acacia suma, Mimosa Suma. సం॥ శమీ; కేశ హంత్రీ. హిం॥ చికురా, శాన్. దీనియాకు లేక చెక్క రసము లేక కషాయము వెగటుగ, కారముగ నుండును. వేడిజేయును వెంట్రుక లూడ జేయును. శ్వాస, కుష్టు, మూలవ్యాధి, కఫము వీనిని హరిం చును. దీని చెక్క దంతరోగములను పోగొట్టును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు వరకు.

జల్ల:—A kind of fish. నల్లజల్లచేపలు రుచిగానుండును. దేహపుష్టి, బలముచేయును. క్రిమిని, మూత్రరోగమును బోగొట్టును. రక్తపై త్యము, వాతమును శమింపజేయును. శ్లేష్మవృద్ధిజేయును. దీనికి విరుగుడు చేపలు చూడుడు.

జవ్వాది:— An odurus secretion of a kind of cinet cat. ఇదియొక పిల్లిజాతి మృగముయొక్క మదము. చేదుగా, నుప్పగా నుండును; సువాసనగలిగి మిక్కిలి మనోహరముగ నుండును; త్రిదో షహరమైనది; ఉష్ణముజేయును; వీర్యమునకు వేడినిచ్చును; మదము ను గలుగజేయును; దురద,కఫము, వాతము, కుష్టు, మతిహీనత, పైత్యము, నేత్రరోగము, భ్రమ, దుర్గంధము, చెమట వీనిని బోగొ ట్టును; బుద్ధిని హెచ్చించును. దీని ధూపము భూతప్రేత పిశాచము లను దోలును; దేహారోగ్యము నిచ్చును.

జాజికాయ:— Myristica Fragrans, M. Officinalis. Eng. Nutmeg. సం॥జాతిఫల.హిం॥జాయిఫల్,జాఫల్.ఇది వేడిజేసి ఆర్చు ను.కొద్ది వగరు,కారముగల రుచులు గలిగి చమురు గలిగి సువాసనగ యుండును. పైత్యము, వాతము, కఫము, చర్ది, దాహము, గ్రహణి, జ్వరాతిసారము, అరుచి, శూల, ప్రమేహము, క్రిమిరోగము, నోటి దుర్గంధము, నోటిపూత, ఉబ్బు, పార్శ్వవాతము వీనిని హరించును,

మిక్కిలి వీర్యవృద్ధినిచ్చును; మత్తుజేయును; బుద్ధికి బలమిచ్చును; సంతోషమిచ్చును; శుభ్రపరచును; రుచిబుట్టించును; బలము జేయును; రతిసౌఖ్యమునిచ్చును; రక్తపుష్టి జేయును; మలబద్ధము గావించును; మెదడు గట్టిపడు రోగమును పోగొట్టును; ఆకలి దప్పికలవలన గలిగిన దోషముల నణచును కంఠమునకు, పొట్టకు బలమిచ్చును; దేహపు కాక నిలుపును; లింగము క్షీణించి (సన్నమైపోయి) దుర్బలమగుదానిని చక్కజేయును; కామెర్లు, పాండువు. దేహము యొక్క వివర్ణత, మచ్చలు, వాంతివిరేచనములు, వికారము, జలోదరము, అగ్ని మాంద్యము, జలుబు వీనిని హరించును; దేహమునకు కాంతినిచ్చును; బిడ్డల దుర్బలత్వమును పోగొట్టును; హృదయమునకు, రొమ్మునకు, కార్జమునకు సత్తువ జేయును; వాతతత్వముగలవారికి ధాతుపుష్టి జేయును. రుద్రవాతము (Apoplexy) రాతగిన తత్వముగలవారికి ఇయ్యకూడదు. ఉష్ణతత్వముగలవారికి తలనొప్పి గలుగజేయును. అమితముగ దినిన మత్తు, మమత, కునికిపాట్లు, గలుగజేయును. మిక్కిలి ఉష్ణము జేయును. దీనికి విరుగుళ్ళు 1 (ముఖ్యముగ తలనొప్పికి) ధనియాలు లేక కొత్తిమీర, 2 ముఖ్యముగ తెల్లదెబ్బ (Lungs ) నొప్పికి తేనె, 3 సముద్రపు నురుగు, 4 గులాబిపువ్వు. చూర్ణపు మోతాదు 3 మొదలు 10 గోధుమగింజలయెత్తువరకు. దీనికషాయము 2-3 తులములయెత్తు లోపలి కిచ్చిన నిద్రపట్టనివారికి నిద్రదెచ్చును. దీనిని నేతిలో దోరగ వేయించి కొద్దిగ నల్లమందు వేసి నూరి మాత్రలుచేసి యిచ్చిన బిడ్డలకు, పెద్దవాండ్రకు గ్రహణి, రక్తగ్రహణి కట్టును దీనిని నీళ్ళతో గంధము తీసిగాని నీళ్ళతో నూరిగాని పట్టు వేసిన తలనొప్పి, పక్షవాతము మొదలైనవి నివారణమగును; కంటికి చుట్టు పట్టువేసిన దృష్టికి బలమిచ్చును. జాజికాయ నీళ్ళతోనూరి పట్టించిన కర్ణికలు (చెవివెనుక లేచెడు వాపు బిళ్ళలు), గవదబిళ్ళలు

మొదలగు బోలునరముల వాపులు (Glandular swellings) నిమ్మళించును. జాజికాయ నూనెతోగాని ఆముదముతోగాని నూరి మర్దనజేసిన మరిడిజాడ్యము, లోపలి అవయవములు గట్టిపడడము (Congestion) నివారణమగును. జాజికాయ, నెయ్యి, పంచదారతో చేసిన లేహ్యము లేక మిఠాయి బిడ్డల గ్రహణి కట్టును. జాజికాయ, సర్వుచెట్టుకాయ నూరిపెట్టిన పుప్పిపంటినొప్పి హరించును. దీనిని నీళ్ళతో నరగదీసి పట్టువేసిన జలుబు, తలనొప్పి, శిరోవాతము హరించును. దీనిని నీళ్ళతోనూరి ఆ రసమును పోసిన చెవినొప్పి, కండ్లనొప్పి నివారించును. పచ్చికాయలరసము నీళ్ళలోగలిపి కండ్లలోవేసిన నేత్రరోగములు హరించును. దీనిని లోపలికిచ్చునప్పుడు వయస్సు, దేహదార్ఢ్యము మొదలగునవి గమనించి జాగరూకతతో వాడనగును.

జాజికాయనూనె:—Nutmeg oil. అనగా దీనిలోనుండి తీసినచమురు. అగ్నిమాంద్యమును, అజీర్ణమును, నపుంసకత్వమును పోగొట్టును. దేహబలిమిని, బుద్ధిబలిమిని యిచ్చును. వాతాతిసారమును హరించును. నరములకు సత్తువనిచ్చును. సంతోషము గలుగజేయును. మోతాదు 2 మొదలు 5 చుక్కలవరకు. దీనిని పయిన పూసిన మేహవాతము, పక్షవాతపునొప్పులు నయమగును. మరియు దీనికి జాజికాయయొక్క గుణములు కలిగియుండును.

జాజిపువ్వుల తీగ:— Jasminum Grandiflorum. Eng. The Spanish Jasmine. దీనివేరు చూర్ణము లేక దీనివేరు కషాయము లేక ఆకురసము చేదుగా, వెగటుగా నుండును. వాతపైత్యము, కఫము, రక్తకఫము, ముఖరోగము, దంతరోగము, నరుకలు, వ్రణములు, శిరోరోగము వీనిని హరించును. చూర్ణపుమోతాదు పూటకు 2 మొదలు 3 చిన్నముల యెత్తువరకు, కషాయపు మోతాదు

పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు. ఆకురసపు మోతాదు 2-8 తులములయెత్తు. నరుకులకు, వ్రణములకు దీని ఆకునూరి కట్ట వగును. దీని ఆకు శిరోవాతములకు కట్టుకట్టిన నయమగును. దీని వేరు చూర్ణముతో పండ్లుతోమిన దంతరోగములు హరించును.

జాజిపువ్వులు:—Flowers of do. సం॥ జాతీ, సురభిగంధా. త్రిదోషములను, శరీరముయొక్క తాపమును హరించును. సుఖము నిచ్చును. మనోహరముగ నుండును. నేత్రరోగమును పోగొట్టును.

జాపత్రి:—Myristica Fragrans, M. Officinalis Eng. Mace. సం॥ జాతిపత్రీ, జాతికోశ. హిం॥ జాయపత్రి, జావిత్రి. చిరుచేదుగా, కొద్దివగరుగ, స్వాదుగా నుండును. వేడిజేసి ఆర్చును. మనోల్లాసమును గలిగించును. త్రిదోషహరమైనది. ఆరోగ్యమిచ్చును. పొట్టకు, ధాతువులకు బలమిచ్చును. మదమును బుట్టించును. జఠరాగ్నిని హెచ్చించును. బుద్ధికి బలమిచ్చును. ఇంద్రియపుష్టి, రేతస్తంభన జేయును. శ్వాస, హృద్రోగము, శూల, కాస, క్షయ, మూత్రదోషము, అతిసారము వీనినిపోగొట్టును. లింగమునకు బలమిచ్చును. నోటికి సుగంధము దెచ్చును. దేహము లోని అన్ని మార్గములను విప్పును. ప్రసవస్త్రీల మైలరక్తమును వెడలించును. నడుము నొప్పి, లోజ్వరము, ఉబ్బుసదగ్గు వీనిని పోగొట్టును. వాతమును హరించును. నిద్రపట్టనివారికి నిద్రదెచ్చును. విరేచనము కట్టును. దీని చూర్ణపు మోతాదు 8 మొదలు 12 గోధుమగింజల యెత్తువరకు. కొన్ని వేళలలో 30 గోధుమగింజల యెత్తువరకు ఇయ్యవచ్చును. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులముల యెత్తువరకు. గుండెలకు, శార్జమునకు నష్టము జేయును. దీనికి విరుగుడు 1 తుమ్మజిగురు, 2 గులాబిపువ్వు, 3 సముద్రపునురుగు, 4 (తలనొప్పికి) పన్నీరు.

జాపత్రిఅరఖు:—Mace Oil. అనగా జాపత్రిలోనుండి తీసినచమురు. వీర్యవృద్ధి జేయును; బలకరమయినది; పుంస్త్వము నిచ్చును; వాత గుల్మమును హరించును; మదమును బుట్టించును; పైత్యము జేయును. మోతాదు జాజికాయ అరఖువలెనే యియ్యతగియుండును.

జామిచెట్టు:- Psidium Guyava, P. Pomiferum. Eng. Guava tree. సం॥ పేరుకం. హిం॥ లాల్ సఫరీ, సఫేద్ సఫరీ, అమ్రూద్. దీనివేరు లేక ఆకులు లేతవిగాని ముదిరినవిగాని వీని కషాయము పురాణ నీళ్ళవిరేచనముల కట్టును; అగ్నిమాంద్యము నణచును; దీని ఆకుల కషాయము మరిడిజాడ్యము ( Cholera ) లోని విరేచ నములను, వాంతిని కట్టును; పుక్కిలించిన పండ్లనొప్పులు, చిగుళ్ళ వాపు హరించును. పచ్చికాయలు నమలి మ్రింగినను లేక వీని కషాయము పుచ్చుకొనినను నీళ్ళవిరేచనముల కట్టును. మలబద్ధము జేయును. దీని పచ్చిఆకు నూరికట్టిన వ్రణములు మానును. ఆకులు నమలి మ్రింగిన లేక వీని కషాయము పుచ్చుకొనిన గంజాయి మత్తును, వికారమును పోగొట్టును. జామిచెట్టు ఎరుపు, తెలుపు రెండుజాతులు. మొదటిదానియందు వగరు గుణము అధికము. వేరు లేక ఆకుయొక్క కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు.

జామిపండు:—Guava fruit. దీనినే అమ్రూదుపండందురు. బాగుగ పండినపండు రుచిగనుండును. జీర్ణముజేయును. లఘువుగ నుండును. ఎక్కిళ్ళను పోగొట్టును. సంతోషమిచ్చును. పొట్టను మృదువు పరచును. మూత్రము గావించును. ఉష్ణతత్వము గలవారి హృద యము (Heart) నకు, పొట్టకు బలమిచ్చును. విరేచనము గావిం చునుగాని పొట్టకు జబ్బుచేయును. వాతతత్వముగలవారి కడుపు నందును తలయందును నొప్పి పుట్టించును. ముక్కువెంట నీరు

దెచ్చును. వాతమును హెచ్చించును. కడుపులో చిటపటలాడ జేయును. జ్వరము దెచ్చును. కడుపుబిగబట్టును. జామిపండులోని విత్తులు, చర్మము గురుత్వముగ నుండును. మూలవ్యాధిని బుట్టించును. కుళ్ళినపండు మిక్కిలి అనారోగ్యకరమైనది. పండుయొక్క దుర్గుణములకు విరుగుడు సోపు.

జామిపువ్వు:— Flowers of do. సుగంధము గలిగి మనోహరముగ నుండును. త్రిదోషములను హరించును; సమస్తరోగములను శమింప జేయును. నేత్రరోగముల నణచును.

జావ:—బియ్యపునూకల జావ, గోధుమజావ చూడుడు.

జింక:—Flesh of Antelope. సం॥ హరిణ, చారులోచన, సారంగ. అనగా లేడి. దీనిమాంసము రుచిగా, తేలికగా నుండును. త్రిదోషములను గొట్టును. జఠరదీప్తి నిచ్చును; మేహశాంతి జేయును; బలము, వీర్యవృద్ధి, ఆరోగ్యమును యిచ్చును.

జిడ్డుఉస్తి:—A species of Eolanum Trilobatum. దీనిని కాసీవుస్తియందురు. దీనిచెట్టు వంగచెట్టువలె నుండును. కాయలు ఉసిరికాయలకన్న పెద్దవిగానుండును. దానికన్న గుణము తక్కువ. శ్లేష్మమును హరించును. శిశువుల దగ్గులకును, అగ్నిమాంద్యము నకును నేతిలోగాచి పట్టుదురు. విరేచనము గావించును.

జిన్ను:—Gin. ఈసారాయి మూత్రమును అధికపరచును; దగ్గు శమింపజేయును; సెగరోగుల కనుకూలముగ నుండును; మరియు దీనికి బ్రాందిగుణములు గలిగియుండును.

జిబిలికతీగ:—నాగముత్తువ పులగము చూడుడు.

జిరికి విత్తులు:—కాటుకగింజలు చూడుడు.

జిలమలను ధాన్యము:—బుడమలను ధాన్యము చూడుడు.

జిలాబీలు:—A kind of sweet meat. ఇది ఒక విధమైనమిఠాయి. మినపపిండితో చేయబడినవి శ్లేష్మము. వేడిజేసి చలవజేయును; దేహపుష్టి, బలము, ఆరోగ్యము వీనినిచ్చును; వీర్యమునకు పుష్టి, వేడినిచ్చును. అనుకూలముగ జీర్ణమగును; గుర్రాలకు బలమిచ్చును; వీనిని వేడినీళ్ళలో గలిపి పుచ్చుకొనిన గ్రహణి, నీళ్ళవిరేచనములను కట్టును. మిక్కిలి దినిన శీతపైత్యము జేయును; మూత్రములో సుద్ద బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 దానిమ్మపండు, 2 వేపగింజల రసము, 3 లవంగముల కషాయము, 4 జీర్ణౌషధములు.

జిల్లేడాకు విస్తరి:—Platter of the leaves of Asclepias Gigantea. దీనిలో భోజనము మిక్కిలి వేడిజేయును; పీనస, క్రిమిరోగము, శూల, విషము వీనిని హరించును; సర్వాంగములయొక్క అతివృద్ధి నణచును; తేలికపరచును; సమస్తదోషములను హరించును.

జిల్లేడుచెట్టు:—Asclepias Gigantaa & Caloatropis G. Eng. Gigantic Swallow wort. సం* అర్క, క్షీరవృక్ష. హిం* మదార్, ఆక్. దీనివేరు చెక్క చూర్ణము లేక కషాయము లేక తేలిక కషాయము చేదుగ వెగటుగ నుండును; మిక్కిలి ఉష్ణము జేయును; విరేచనముజేయును; త్రిదోషములు, వ్రణములు, సవాయి రోగము, పొక్కులు, దురదలు, చర్మరోగములు, కుష్ఠు, వాతము, గుల్మము, ఉదరము, పక్షవాతము, మూర్ఛ, పాము, తేలు విషము, క్రిమి, అభిఘాతజ్వరము, సన్నిపాతము, జీర్ణజ్వరము, వరుసజ్వరము, దగ్గు, ఒగర్పు, క్షయ, వాతపునొప్పులు, గ్రంథులు వీనిని హరించును; నరములకు సత్తువజేయును; శరీరతత్వమును మార్చును; వినుగు కాలిరోగము, ఎగుపులు (Spasms) వీనిని బోగొట్టును; దేహములోని మలముల వెడలించును; ఋతురక్తమును జారీచేయును; నాడాపామును (Tape worm) చంపును;

ప్రసవానంతరము స్త్రీలకుండెడు వాపు (ఉబ్బు)ను నివృత్తించును. వేరుచెక్క చూర్ణపు మోతాదు పూటకు 3 మొదలు 12 గోధుమ గింజల యెత్తు చొప్పున దినమునకు రెండు లేక 3 సార్లు ఇయ్య నగును. క్రమక్రమముగ మోతాదెక్కువ చేయవగును. వేరుచెక్క చూర్ణముకంటె ఎండించిన దీని పాలచూర్ణ మెక్కువ పనిజేయును, వేరుచెక్కయొక్క తేలికకషాయపు మోతాదు పూటకు 1 మొదలు 3 తులముల యెత్తు చొప్పున, కషాయపు మోతాదు పూటకు అరతులము మొదలు 2 తులముల యెత్తు చొప్పున దినము నకు రెండుపూటలను గాని ఒకపూట (ప్రొద్దుటపూట) ను గాని యియ్యవగును ఏనుగు కాలి రోగము (Eliphantiasis)నకు సగము గోధుమగింజ యెత్తు రసభస్మము (Calomel) 3 గోధుమగింజల యెత్తు సురమూరాయి భస్మము (Antimonial powder), 6 మొదలు 10 గోధుమగింజల యెత్తువరకు జిల్లేడువేరు చూర్ణము కలిపి 1 మాత్ర జేసి 8 గంటల కొకమాత్రచొప్పున కొన్నిదినము లిచ్చిన నివారణమగును. ఆకులపైన నుండెడు తెల్లని పిండివంటిది గీచి ప్రోగుజేసి జిల్లేడుపాలలో కలిపి సుమారు గచ్చకాయలవలె మాత్రలుజేసి పాము కరచిన మనిషికి ఒకమాత్ర తమలపాకులో చుట్టి నమలించి మ్రింగించవలెను; ఒంటికితిమ్మిరి పుట్టువరకు అర గంటకొకసారి ఒకమాత్రచొప్పున ఇయ్యవలెను.ఆవెనుక మోతాదు తగ్గించి గంటకొకసారి. యియ్యవలెను. ఎట్టిస్థితిలో నయినను బాగ గుటకు 9 మోతాదులకంటె ఎక్కువ నియ్య నక్కరలేదు. పాము కరచిన మనిషి స్మృతి తప్పి మాత్రమ్రింగుటకు శక్తిలేకపోయిన యెడల ఆమాత్రను నీళ్ళలోగలిపి త్రాగించవలెను. విషము హరిం చిన వెనుక విరేచనౌషధమిచ్చి తేలిక ఆహార మియ్యవలెను. కొన్ని దినములవరకు మత్తుద్రవ్యములు (Stimulants) ఇయ్య

కూడదు. మాత్రి మ్రింగిన వెనుక వమనమైనయెడల శీఘ్రముగ నయమగును. పాముకరచిన వెంటనే 2-3 జిల్లేడాకులు నమలి మ్రింగినను, దీని వేరు నీళ్ళతో నరగదీసిన గంధము కరచినచోట పూసి, కలికము వేసి, సుమారు తులమిత్తు గంధము లోపలికిచ్చినను విషహరమగును. ఆకులకు ఆముదము చరిమి వెచ్చజేసికట్టినను లేక గుప్పెడు ఆకులు గట్టిగ కట్టగట్టి మధ్యకుకోసి కోతపైన ఆముదము పూసి వెచ్చజేసి దానితో కాపడము పెట్టినను వాత మేహ వాతపు నొప్పులు, ఆమవాతపు నొప్పులు (Gout), వాతగ్రంథులు కీళ్ళ నొప్పులు, సన్నిపాతము, పక్షవాతము నివారణమగును. దీని వేరు చూర్ణమును వేపనూనెలో గలిపి ఆనూనెతో మర్దనజేసిన వాత మేహవాతపు నొప్పులు నయమగును. పండుజిల్లేడాకులు వెచ్చజేసి రసముదీసి చెవిలో బోసిన చెవినొప్పి, చీముకారడము కట్టును. ఆకులకు ఆముదముపూసి వెచ్చజేసి గుదస్థానమందు కట్టిన మూల వ్యాధి మొలకలు హరించును. జిల్లేడుకాయల చూర్ణము 12 గోధుమగింజల యెత్తు, 12 మిరియములు ఈరెండు గలిపి చూర్ణించి యిచ్చిన పాండు రోగము నివర్తించును. ప్రొద్దుట సాయంకాలము ఇయ్యవలెను. మరియు నీరోగికి ప్రతిదినము అర్థశేరు (తవ్వెడు) పాలవిరుగునీళ్ళ (Whey milk) లో తులం పావు నల్లఉప్పు గలిపి యియ్యవలెను. వారము దినములలో నయమగును. జిల్లేడు చెట్లు తెల్లపువ్వులది, నలుపు ఎరుపు పువ్వులది అని రెండు జాతులు. ఇందులో తెల్లనిపువ్వులది శ్రేష్ఠము. దీని ప్రయోగమున గలిగెడు దారుణపువేడి మొదలగు వికారములకు విరుగుళ్ళకొరకు జిల్లేడు పాలు చూడుడు.

జిల్లేడుదూది పరుపు:—Bed of cotton of do. వాత శ్లేష్మములను పోగొట్టును. వసంతఋతువునం దనుకూలముగ నుండును.

జిల్లేడుపాలు:—Milk of do. చిక్కగ, ఉప్పగ నుండును. శ్లేష్మోద్రేకమును, సమస్తవాతములను హరించును. పచ్చిపాలు ఉప్పుతో గలిపి పైనపూసిన స్వల్పగాయములు, ఇరుసునొప్పులు, వెర్రికుక్క నక్క విషములు హరించును. పంటిలోబెట్టిన పంటినొప్పి మానును. వాతనొప్పులు ఇతరనొప్పులు ఉన్నచోట పూసిన నొప్పులు హరించును. కొత్తగలేచెడు గడ్డలపైన పూసిన నవి హరించును. వానిని పగుల జేయును. ఈపాలు ఎండించి చేసిన చూర్ణము కుష్ఠు, సవాయి పొక్కులు, పల్లికలు, ఉబ్బు, ఉదరము, వాతనొప్పులు, విడువని జ్వరము, వరుసజ్వరము, దోషజ్వరము (Typhus fever), అన్ని చర్మరోగములు వీనిని పోగొట్టును. దేహతత్వమును మంచిమార్పు చు.విరేచనము జేయును.మోతాదు పూటకు 2 మొదలు 8 గోధుమ గింజలయెత్తు చొప్పున దినమునకు రెండుపూటలను కొన్నివారములియ్యవలెను, దేహదార్ఢ్యము మొదలగునవి యోచించి క్రమక్రమముగ మోతాదెక్కువ జేయవగును. ఎండించినపాలు జిగురుగల నీళ్ళ (in water with mucilage) పైనవేసి యిచ్చిన పురాణ వాత మేహవాతపు నొప్పులు నయమగును.మోతాదు 10 గోధుమ గింజల యెత్తు చొప్పున దినమునకు మూడుపూటల నియ్యవగును. జిల్లేడు పాలవలన గలిగెడు అమితవిరేచనములు మొదలగు వికారములకు విరుగుళ్ళు 1 నీలిఆకురసము, 2 చల్లనీళ్ళతో జేసిన కలకండపానకము, 3 నీళ్ళతో నూరి తీసిన చింతాకురసము, మరియు జిల్లేడుపాలు, వేరు చూర్ణము, కషాయము, పువ్వులు మొదలగువాని సేవవలన కొందరికి వికారము,వాంతిపుట్టును.అప్పుడు ఆముదము(Castor oil) ఒక మోతాదు లోపలికిచ్చిన నవి నివారణమగును.

జిల్లేడు పువ్వులు:—Flowers of do. వెగటుగ నుండును. కఫము, గుల్మము, మూలవ్యాధి, శూల, దగ్గు, రక్తక్షయ వీనిని హరించును, పుంస్త్వమును బోగొట్టును. పచ్చి (యెండని) పువ్వులు, ఇందుకు సమభాగము మిరియములు నూరి మాత్రలుజేసి యిచ్చిన ఉబ్బసము (Asthma), అపస్మారము (Hysteria), మూర్ఛ (Epilepsy) ఇవి నివృత్తించును. పైనచెప్పిన రెండువస్తువులు నూరి 5 గోధుమగింజల ఎత్తు మాత్రలుజేసి బాగుగ నవి ఆరినవెనుక, కార్కు (బిరడా) గల గాజుబుడ్డిలోనుంచి ప్రతి 5-6 గంటల కొకమారు రోగ బలి మినిబట్టి నియ్యవలెను. ఎండించిన పువ్వులు 10-12 సుమారు 5 తులముల యెత్తు నేతిలోవేసి కాచి ఆనేతిని పూటకు అరతులమెత్తు మొదలు తులమెత్తు చొప్పున తినిన దగ్గు మానును. ఎండించిన పువ్వుల చూర్ణము గంటకొకసారి 3 గోధుగింజలయెత్తు చొప్పున యిచ్చిన మరిడిజాడ్యము (cholera) నిమ్మళించును. వాంతి కట్టును. లేదా తగ్గును. ఎండించిన మొగ్గలచూర్ణములో కొద్దిగ మిరియముల చూర్ణము, ఉప్పుగలిపి యిచ్చిన గుండెఅదురుగల అగ్నిమాంద్యము (dyspepsia ) ను, మరిడిజాడ్యమును (Cholera) నిమ్మళించును. మొగ్గల చూర్ణపుమోతాదు 5 గోధుమగింజల యెత్తు. ఎండించిన పువ్వులచూర్ణము 1-2 గోధుమగింజలయెత్తు. మోతాదుగ పంచ దారతో నిచ్చిన కుష్ఠు, సవాయి, సెగరోగము నివృత్తించును.పాల పథ్యము. పచ్చి (యెండని) పువ్వులు నూరికట్టిన మడమలనొప్పి హరించును. లేక మొగ్గలరసము చెవిలోపోసిన చెవినొప్పి నయమ గును. వీని ప్రయోగమువలన గలిగెడు అతిదారుణపు వేడి మొద లగు వికారములకు విరుగుళ్ళకొరకు జిల్లేడుపాలు చూడుడు.

జీడిగింజలు:—Semecarpus Anacardium. Marking nuts. సం॥ భల్లాతక, అగ్నిముఖి, ఆరోష్కరిత. హిం॥ భిలావ. అనగా నల్ల

జీడిగింజలు; వెగటుగా, చేదుగా నుండును; చమురుగలవి; పైత్యము, ఉష్ణము చేయును. క్రిమిరోగము, శూల, గుల్మరోగము, గండమాల, సుఖరోగములు, మూలవ్యాధి, గ్రహణి, కుష్ఠు, వాతము, కఫము వీనిని హరించును. దీని జీడితో వాతములకు, శూలలకు, తీరని గ్రహణులకు గురి (దీనిని అంటించి పుండుచేయడము) వేసిన నివారణమగును. దంతరోగములకు దీనిని పట్టించిన నివిమానును; మడమలు, అరిపాదములు, వీనిలో నొప్పి, పోట్లు, తిమ్మెర యివిగలవారికి దీని నంటించి అందుమీద పొడిసున్నము జల్లిన నివారణమగును; గోరుచుట్టు, కణుపుజట్ట అను పుండ్లు, మాదలు, ఇవి పుట్టినప్పుడు వానిపైన జీడి అంటించిన అవి అణగిపోవును. అరికాలున ముల్లు పోటు, గాయము వీనికి జీడి అంటించిన చీముపట్టనియ్యక నొప్పి తీయును. కొన్నితత్వములవారికి దీని పొగరువలన దేహము వాచును. స్త్రీలు జీడిగింజలు తినిన వంధ్యత్వము గలుగును. ఉష్ణపైత్యతత్వము గలవారికి తలత్రిప్పు, వికారము, దృష్టిచాంచల్యము, అరుచి మొదలగు ననేక వికారములు గలుగును. దీనికి విరుగుళ్ళు 1 మోదుగ చెక్క రసము, 2 దూలగొండి వేళ్ళరసము, 3 తాడికాయరసము లేక కషాయము, 4 కలకండ గలిపిన చిర్రికూర రసము, 5 కలకండ గలిపిన ఆవుపాలు. జీడిగింజ చమురుయొక్క పొగరువలన గలిగిన దేహముయొక్క వాపు, పుండు, పొక్కులు వీనికి విరుగుళ్ళు 1 నీళ్ళతో నూరి తీసిన చింతాకురసము, 2 చింతపండు, 3 కొబ్బరి పిండెల గంధము, 4 ఆవాలు, చిర్రికూర, వెన్న వీనిని సమభాగములుగ నూరిన ముద్ద, 5 వెన్నలోగలిపిన ఆవాలు, తుంగముస్తల చూర్ణము, 6 వెన్నలోగలిపిన నువ్వులపిండి, వీనిలో దేనినైన పైన పూసిన నివృత్తించును.

జీడినూనె:—Oil prepared of do. సోలెడు కొబ్బరినూనెలోగాని, నువ్వులనూనెలోగాని 2-3 జీడిగింజలు ముక్కలు జేసి కాచి ఆముక్కలు తీసివేసి ఆనూనెను తలకు వ్రాయుచుండిన నది తలవెంట్రుకలకు నలుపును, బలమును ఇచ్చును. పేలను జంపును. నల్లజీడిగింజలు మంచివి 10 లేక 12 గింజలు ముక్కలు జేసి సోలెడు నేతిలో వేసి మరగబెట్టి గుల్లలు తీసివేసి ఆనేతిని పూటకు 4 మొదలు 8 అణాల యెత్తువరకు దినమునకు 3 పర్యాయములు పుచ్చుకొనుచుండిన క్రిమిరోగము, కుష్టు, వాతాదులు, సుఖవ్యాధులు నివారణమగును. రక్తమును శుభ్రపరచును. కొన్ని తత్వములవారికి, సుకుమారులకు దేహము వాచును. మిక్కిలి పైత్యముచేసి తలత్రిప్పు, దృష్టిలో వికారము గలుగును. స్త్రీలకు సంతానయోగ్యత చెడిపోవును. దీనికి విరుగుళ్ళు జీడిగింజలు చూడుడు.

జీడిపండు:—Fruit of do. వెగటుగ, వగరుగ, రుచిగనుండును; ఉష్ణము జేయును. మేహరోగమును వృద్ధిచేయును. జ్ఞాపకశక్తి, వీర్యపుష్టి, దేహపుష్టి వీనినిచ్చును. చలవను, కఫవాతములను, దగ్గును అణచును.

జీడిమామిడిచెట్టు:—Anacardium Occidentale. Eng. Cashew-nut tree. సం॥ స్థూలచూత, శోథహర. హిం॥ కాజు. దీని గింజల చమురు పూసిన కుష్టు, మచ్చలు, పొడలు, పులిపిరికాయలు, బొటిమలు, ఆనికాయలు, వ్రణములు హరించును. దీనిని దేహముపైన బూసిన యెర్రబడును. పుండగును; కంతులు, గడ్డలు, వాపు వీనిపైన పూసిన నవి హరించును. అయోడయిను (Iodine) చేసిన పని జేయును. విత్తుపెచ్చులు ఘాటుసారాయిలో నానవేసి తీసిన చమురు పూసిన కాళ్ళపగుళ్ళు, సాధారణపు కురుపులు, పొక్కులు, పుండ్లుమానును. దీనిని ముంతమామిడిచెట్టని, మొక్క జీడిచెట్టని అందురు.

జీడిమామిడిపండు:—Fruit of Cashew nut. దీనిని మొక్క జీడిపండని అందురు. తియ్యగ, కొద్దివగరుగ నుండును. దీనిపండ్లు దాహము తీర్చును. మేహశాంతి జేయును. క్రిమి, వాతము, మేహవాతపు నొప్పులు, అండవాతము, ఓడవాండ్రకు వచ్చెడు (scurvy) అను రోగము, ఉబ్బును పోగొట్టును. అగ్నిదీప్తిని, దేహపుష్టిని యిచ్చును. వంటిజబ్బునీరు చీయును. వీనితో చేసిన సారాయి దీపనకారి, ఉబ్బు రోగమును పోగొట్టును. పచ్చిని తినిన గొంతుక నుస, దగ్గు గలుగును. దీనికి విరుగుళ్ళు 1 బాదముపప్పు, 2 వేడినీళ్ళు, 3 వేపగింజలు. మధ్యాహ్నము ఈపండ్లు ప్రతిదినము తినుచుండిన ఆరోగ్యమిచ్చును.

జీడిమామిడిపప్పు:—Kernels of do. దీనిని జీడిపప్పు అని యందురు. కమ్మగా, రుచిగా నుండును. వీర్యవృద్ధి, బలము, శరీరపుష్టి నిచ్చును. పైత్యము జేయును. దీనికి విరుగుళ్ళు 1 వేడినీళ్లు, 2 బెల్లము, 3 నేతితో వేయించడము.

జీలకఱ్ర:—Cuminum Cyminum. Eng. Cummin seeds. సం* జీరక, జీర. హిం* సఫేద్ జీరా. దోరగ వేయించిన జీలకఱ్ర గాని, జీలకఱ్ర చూర్ణముగాని, జీలకఱ్ర కషాయముగాని, నీళ్ళతో నూరి తీసిన రసముగాని సువాసనగలిగి, స్వాదుగా నుండును. రుచి బుట్టించును. జఠరదీప్తి, వీర్యవృద్ధి, బలము జేయును. దేహోష్ణమును వృద్ధిబొందించును; పైత్యము, చర్ది, మేహపైత్యము, కఫము, కఫవాతము, ఉన్మాదము, జ్వరము, వాతము, చలవ, రక్తపైత్యము, శూల, తలత్రిప్పు, రక్తాతిసారము వీనిని జయించును; స్త్రీలకు పాలు బడజేయును; అగ్నిమాంద్యము (dyspepsia), గ్రహణి, విరేచనములు, అతిసారము వీనిని పోగొట్టును; పొట్టకు వేడి నిచ్చును. రక్తములోని తీవ్రమైన వేడి నణచును. దేహములోని దుష్టపదార్థ కూటమును కరగించును, కడుపు కొద్దిగ బిగబట్టును; విరేచనబద్ధము

జేయును; పొట్టకు, ప్రేగులకు, కార్జము (liver) నకు, గుర దాల (kidneys) కు సత్తువ జేయును. కడుపులోని దుర్గంధమును, ఎక్కిళ్ళను, కడుపునొప్పిని, అజీర్ణమును అణచును. నల్లదబ్బ (spleen) ఉబ్బును తీసివేయును. మూత్రము గావించును. స్త్రీలు బహిష్టగుటను క్రమపరచును. అధికముగబుచ్చుకొనిన తెల్లదబ్బ (lungs)కు వాతశరీరుల నల్లదబ్బ (spleen) కు నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 కతీరా అనగా బాదముచెట్టు జిగురు. 2 జీలకర్ర దోరగా వేయించడము. జీలకర్ర సగము వేయించినది సగముపచ్చిది చూర్ణము చేసి వీనికి సమభాగము పంచదార కలిపినది. పూటకు పావలాయెత్తు పుచ్చుకొనినగాని, వీనిని ఆవునేతితో వేసి కలిపి పూటకు పెద్దగచ్చకాయంతచొప్పున దినమునకు రెండుపూటలను 10–15 దినములు పుచ్చుకొనిన మేహశాంతి, పైత్యశాంతి జేయును. నీరసము, కాళ్ళు లాగుట, పైత్యము నణచును. జీలకర్రను నిమ్మపండ్లరసముతో సూర్యపుటమున ఏడుమార్లు భావనజేసి పూటకు బేడయెత్తు మొదలు పావలాయెత్తువరకు బుచ్చుకొనిన తలత్రిప్పు, కడుపులోని వేడిని మొదలగు దారుణ పైత్యరోగము లణచును. జీలకర్ర, తేనె, ఉప్పు, నెయ్యి కలిపినూరి తేలుకుట్టినచోట కట్టు (poultice) కట్టిన తేలు విషము హరించును వేయించిన జీలకర్ర మోతాదు పూటకు బేడ యెత్తు మొదలు పావలాయెత్తువరకు. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 6 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. రసముయొక్క మోతాదు 2–3 తులముల యెత్తు. అరతులమెత్తు జీలకర్రను ఇనుపగరిటిలో మాడబెట్టి అందులో 5–6 తులముల నీళ్ళుబోసి దించి వడియకట్టి ఆనీటిని నీళ్ళవిరేచనములు కట్టుటకు వుపయోగింతురు. వేయించిన జీలకర్రతో సమంగా సైంధవలవణం కలిపి నూరి సీసాలో వుంచుకుని

కొంచంకొంచం వాంతులు అగుచున్నవాళ్ళ కిచ్చిన వాంతులు కట్టి పోవును.

జీలకర్ర సన్నాలను ధాన్యము.—A sort of paddy. వీని బియ్యము చాలా సన్నముగా నుండును. వండిన యన్నము చాలా మృదువు గాను, రుచిగా, భోగ్యముగా నుండును. సుకుమారులకు, జబ్బుచేసిన వారికి చాలా అనుకూలముగా నుండును శర్కరపొంగలి, కేసరీ బాతుచేసిన చాలా భోగ్యముగా నుండును. మరియు ధాన్యములు చూడుడు.

జీలుగుచెట్టు, దీనికల్లు :—Caryota urens. Eng. Jaggary palm. ఈచెట్టు కొబ్బరిచెట్టువలె పొడవుగ, లావుగ పెరుగును. ఆకు కొద్ది భేదముగ కొబ్బరియాకులవలెనే యుండును. ఈతపువ్వువలె వెన్ను పొడవుగావుండి, గుర్రపుతోక ఆకారముగా 1½ మొదలు 3 గజ ముల పొడవుగలిగి, కుంచెవలె నుండును. ఈచెట్లు విస్తారముగా మన్యములలోను, కొండ లోయలలో పెరుగును. దీని వెన్నుకోసి కల్లుగీయుదురు. దీని కల్లు చిక్కగా తీసినప్పుడు తియ్యగా, తరువాత క్రమముగా పులుపు, చేదు, వగరు రుచులుగలిగి విస్తారముగా నిషా చేయును. దీనిని కాచికూడా పుచ్చుకొందురు. వీర్యనష్టమును, మూత్రదోషమును పోగొట్టును. బలము, పుష్టి నిచ్చును. ఈకల్లును గాని, దీనిగింజలు నూరి పట్టీవేసినగాని పార్శ్వపు తలనొప్పికి మర్దన చేసిన నయమగును. విరేచనకారి. ఈచెట్టుయొక్క లోపలిభాగమును యెండించి, దంచి, పిండిచేసి, రొట్టెలుగాను, జావగాను వుపయోగిం తురు. భోజనమునకు మారుగా వుపయోగపడును. ఆకలితీరును. బలము, పుష్టి నిచ్చును. ఈకల్లు విస్తారము త్రాగి మత్తెక్కిపోయిన యెడల తాటికల్లుల విరుగుళ్ళే వుపయోగపడును.

జీవం జీవమను పక్షి:—A bird, like turtle-dove--flesh of. అనగా వెన్నెల పులుగు దీని మాంసము రుచిగా నుండును. త్రిదోషముల నణచును. బలమిచ్చును. శీఘ్రముగ జీర్ణమగును.

జీవకము:—A medicinal plant. సం॥ జీవక, దీర్ఘాయు. ఇది ఒక మూలిక. ఇది అష్టవర్గములలో నొకటి.దీని రసము లేక కషాయము లేక చూర్ణము మధురముగ నుండును. రక్తవాతమును, తాపజ్వరమును, క్షయరోగమును పోగొట్టును. ఆయువును, శుక్లమును వృద్ధి జేయును. రసముయొక్క మోతాదు 2-8 తులములమెత్తు. కషాయపు మోతాదు 2-4 తులములమెత్తు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 చిన్నముల మెత్తు.

జీవనాఖ్య పంచమూలములు:—Compound of five drugs. పిల్లిపీసర, పెగ్గుమ్ముడు, జీవంతి, జీవకము, వృషభకము, వీని కూటమి నేత్రములకు మేలు జేయును. శుక్లవృద్ధి నిచ్చును. పైత్యవాతమును హరించును. చూర్ణపు మోతాదు పూటకు 8 చిన్నములు కషాయపు మోతాదు పూటకు 2 తులములు.

జుంటి తేనె:—Virgin honey. అనగా నూతనముగ పట్టిన తేనెపట్టు, తేనె మిక్కిలి మధురముగ నుండును నేత్రములకు మంచిది. విరేచనము జేయును. విదాహము, శ్లేష్మము, ఊపిరిగొట్టునొప్పి, రక్తపైత్యము, మేహము, క్రిమిరోగము, వాంతి, దగ్గు, వగర్పులు వీనిని హరించును. వ్రణముల మాన్పును.

జుట్టుగ చెట్టు:—దుష్టపు చెట్టు చూడుడు.

జున్ను:—Castorium. Testicle of water dog. సం॥ సోనా. హిం॥ జుంద్, జుంద్ బెదస్తర్. దీనిని ఆదిపచ్ఛఖానా అని అందురు. దీనిని లోపలికిచ్చిన పైత్యము, తీవ్రమైన ఉష్ణము జేయును.వాతము

సన్నిపాతము, సూతిక వాతము, సర్వాంగవాతము, జ్వరము వీనిని హరించును. మోతాదు 1 మొదలు 4 గోధుమగింజల మెత్తువరకు. శొంఠి, పిప్పలి, మిరియములతో గాని యితరమందు దినుసులతో గాని నూరి మాత్రలుజేసి వాడవగును. మరియు గర్భిణీస్త్రీల వాతము, దేహపునొప్పులు, జ్వరము, కడుపునొప్పి, ఆకస్మికముగ పడినందున గలిగిన నొప్పులు వీనికి యిచ్చిన నయమగును. మోతాదు 4 గురిగింజలమెత్తు. రెండు తమలపాకులు, అర్ధ (సగము) పోక చెక్క, తగుమాత్రము సున్నముతో నమలి అందులో జున్ను నమలి మింగించవచ్చును. 1-2 పూట లియ్యవచ్చును. కస్తూరి మాత్రలు చేయుటకు ముఖ్యమైనవస్తువు.

జున్ను :—Boiled milk of newly calved cow or she buffalo అనగా ఆవు లేక గేదెయొక్క మురుపాలు కాచివేచినది రుచిగా నుండును. శరీరపుష్టి. వీర్యవృద్ధి జేయును. ఉష్ణము నణచును. పైత్యమును శమింపజేయును; నిద్రదెచ్చును, శుభ్రమగు రక్తమును బుట్టించును; గుండెలకు, గొంతుకకు మేలుజేయును; విరేచనబద్ధము, అగ్నిమాంద్యముజేయును; కఫమును బెంచును, ఆలశ్యముగ జీర్ణమగును; కడుపునొప్పిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పుదీనా, 2 తేనె, 3 మిరియములపొడి.

జువ్వి, రావి, మర్రిచెట్లనీడ:—Shade of the trees Ficus Infectoria, Religiosa, Bengalensis. చల్లగ మనోహరముగ నుండును, యెండబాధను, వడబాధను శమింపజేయును. మేహపైత్యముల నణచును; రక్తమును శుభ్రపరచును; చలవజేయును; కాంతి నిచ్చును.

జువ్విఆకువిస్తరి:—Platter of leaves of Ficus Infectoria. దీనిలో భోజనము చలవజేయును; మేహము, అతిసారము, గ్రహణి, రక్తస్రావము. వీనిని శమింప జేయును.

జువ్వి చెట్టు:—Ficus Infectoria. సం* పార్కటీ, ప్లక్ష, హిం* పాఖర్. దీనిపాలు వ్రణములు, పురుగులు పడెడు పుండ్లు, తినివేయు లేక కుళ్ళిపోవు రాచపుండు మొదలగు పుండ్లను మాన్పును. దీని పచ్చి ఆకు లేక పచ్చి పుడకలు వీనితో దంతధావనము చేసిన పండ్లు ఘట్టిపడును; ఆరోగ్యమిచ్చును. దీని ఆకుల విస్తరలోని భోజనము చలవ, మేహశాంతి జేయును, అతిసారము, గ్రహణి వీనిని శమింపజేయును.

జేగురురాయి:—అనగా పాషాణగైరికము చూడుడు.

జొన్నంగిపిట్ట మాంసము :— A kind of bird-flesh of. వేడి చేయును. రుచి బుట్టించును. మూత్రమును బంధించును.

జొన్న బెల్లము:—Jaggery made of the juice of fresh cholum stalks. అనగా జొన్నకఱ్ఱల రసముదీసి వండినది. కొంచెము ముప్పగా, వెగటుగా, తియ్యగా నుండును. వీర్యవృద్ధి జేయును. వాతము, కఫమును హరించును. పైత్యము జేయును; అనుదినము బుచ్చుకొనిన దురద, కుష్ఠు, విదాహము, తాపము, అగ్నిమాంద్యము వీనిని గలుగజేయును. అనారోగ్యమైనది.

జొన్నలు:—Holchus Sorghum. Eng. Cholum. సం* యావనాల వృత్తతండుల. హిం* జువార్, పనేరా. ఇవి ముఖ్యమైన ఆహార పదార్థములలోనిది. ఇవి తెలుపు, పసుపు, యెరుపు జాతులు గలవు. ఇందు తెలుపువి శ్రేష్ఠము. ఇవి బియ్యము గోధుమలుయెన్ని విధములుగ నుపయోగింతురో అట్లే యివన్నీ నుపయోగపడును. రుచిగా నుండును. బలము, పుష్టి, వీర్యవృద్ధి జేయును.మలమూత్రములను జారీ చేయును.దీనికివిరుగుళ్లు 1పాలు,2నెయ్యి,3ఓమము. (గురుత్వం జేయును గుల్మము మూలవ్యాధినిబలపరచును)శరీరమునుఆరబెట్టును.కఫపైత్య

ములను హరించును. దేహపరిశ్రమ చేయువారికి మంచి యాహారము.
జొన్నలుత్రొక్కి కడిగిన కడుగు నల్లమందు విషమును హరించును.

జ్యోతిష్మతిచెట్టు:—పిన్నమావేరు, పెద్దమావేరు చూడుడు.

జ్యోతిష్మతితైలము:— అనగా, మాలకింకిణిఅరకు. పెద్దమావేరు చూడుడు.

—ఠ—

# ట

టంకణక్షారము:— వెలిగారము చూడుడు.

టర్పెంటైను తైలము:—Oil of Turpentine. ఇది సరళదేవదారు జిగురు అనగా గంధఫెరోజానుండి తీయబడిననూనె. ఇదిమూడు రకములు. 1 రంగులలో కలుపుకొనునది, 2 పైనరాసికొనుటకు వుపయోగించునది, 3 (Pure) పరిశుద్ధమైనది. లోపలికి పుచ్చుకొనునది. అట్టి నిర్మలమయినది లోపలికిచ్చిన ఉష్ణముజేయును. దీపనకారి (Stimulant) విరేచనకారి. మూత్రకారి. పురాణవాతపునొప్పులు, కీళ్ళనొప్పులు, వాపులు, మూర్ఛ, దాగుణమలబద్ధము, ప్రసవస్త్రీలకు వచ్చు జ్వరము, మిక్కిలి నిస్త్రాణజేసెడు మరికొన్ని జ్వరములు నరముల సంబంధమైనపోట్లు, నొప్పులు (Neuralgia) వీనినిపోగొట్టును. క్రిములు, ఏలికపాములు, నాడాపాము (Tapeworm)వీనినిచంపును. సన్నపాటిరక్తనాడులు సడలుటచే గలిగెడు రక్తప్రవాహము లేక ప్రసవానంతరము కొందరికగు అధికరక్తస్రావము( Haemorrhage) వీనిని కట్టును. దీనిని కాలినచోట వెంటనె పూసిన మంట అణగును. పుండుగాకుండాజేయును. దీనితో మితముగ పైన మర్దన జేసినను, లేక తగుమాత్రపు బట్ట గుడ్డగాని ఫ్లానెలు గుడ్డగాని ఓంపి దానిని యీనూనెలో ముంచి నొప్పిగలచోట ఆగుడ్డను పట్టీగా వేసి వెంటనే

ఫ్లానెలుగుడ్డ లేక బట్టగుడ్డ మూటగకట్టి లేక బంతిగ చుట్టి దానిని నిప్పులపైన కాచి ఓర్వగలిగినంత వేడి యుండగా దానితో ఆపట్టీపైన కాపడము పెట్టిన లోపలిపుండు (Internal inflamation), తెరలు తెరలుగ వచ్చు కడుపునొప్పి (Spasmodic affection of the bowels) ప్రసవస్త్రీలకు పొత్తికడుపులోవచ్చు నొప్పి, ప్రాతపడిన లేక ముదిరిన (Advanced stage) రక్తగ్రహణి, నీళ్ళ విరేచనములు, దారుణవాంతి (Obstinate vomitting) అజీర్ణము, అజీర్ణశూల; వగర్పుగల దగ్గు (Bronchitis) దగ్గు, ఉబ్బసపుదగ్గు మొదలగునవి నివారణమగును. పైనజెప్పిన పట్టీలు పిక్కలకు, అరిపాదములకు వేసి కాపడము పెట్టిన మూర్ఛ, తెలివితప్పడము (Insensibility), ఈడ్పులు (Convulsions), సన్నిపాతము (Delirium) వీనికి చాల మేలుజేయును. ముక్కులోని పురుగులకు, (Pecnash or maggoto in the nose) ఈనూనెను ఆవ్యాధిచేత చర్మములోపడిన ప్రతి రంధ్రములోనికి చొప్పించిన (Injection) వానిలోని పురుగులు చచ్చి బయటపడును. ఒకవంతు ఈనూనె 15 వంతులు గంజిలో కలిపి దీనిని గుదద్వారముగుండ పిచికారీ (Enema) చేసిన మూర్ఛ, తెలివితప్పడము, ఈడ్పులు, ముఖ్యముగ ప్రసవస్త్రీలకు వచ్చు ఈడ్పులు, అపస్మారపు మూర్ఛలు (Hysteria fits), తెరతెరలుగ వచ్చు కడుపునొప్పి, అజీర్ణము, అజీర్ణశూల మొదలగువానికి మేలుజేయును. దీనితో చేసిన తైలము అనగా ఒకపాలు హారతికర్పూరము 16 పాళ్ళుగల ఈనూనెలలో కలిపి అందులో రెండుపాళ్ళు మంచిసబ్బు కలిపి బాగుగ కలియునటుల రుద్ది (నూరి)న తైలమగును. దీనితో నొప్పిగలచోట మర్దనచేసిన పురాణవాత, మేహవాతపు నొప్పులు, నడుమునొప్పి, మెలుగునొప్పి మొదలగు నరములసంబంధపు నొప్పులు, పురాణపు

మోకాళ్ళవాపు నొప్పులు, పోటు, కొట్టుకుపోవడము (Bruises), ఇరుకు నొప్పులు, మాంసపుకండ నొప్పులు మొదలగునవి నివారణమగును. ఈనూనెలో దీనికి సమభాగముగ పందిక్రొవ్వుగాని నెయ్యిగాని కలిపి గుడ్డకుపూసి దానిని రాచపుండుపైన దినమునకు రెండు మూడుమార్లు వేయుచుండిన దానిలోని కుళ్ళు చీము మొదలగునవి పోయి మానును. ఈనూనెను లోపలి కిచ్చు మోతాదులు నాడాపాముకు, ఏలికపాములకు ఇచ్చు మోతాదు 1 మొదలు 3 డ్రాముల వరకు; విరేచనములగుట కిచ్చు మోతాదు 4 డ్రాములు మొదలు ఒకటిన్నర ఔన్సులవరకు. దీపన శాంతిగ (Stimulant)ను లేక మూత్రకారిగను, ఇతరవ్యాధులకును ఈనూనెను ఇచ్చు మోతాదు 5 మొదలు 20 చుక్కలవరకు. కొన్ని తత్వములవారికి దీనిని లోపలి కిచ్చిన నొప్పితోకూడిన పలుచూను మూత్రము కావడము సంభవించును; వాంతిపుట్టును. దీనికి విరుగుళ్ళు 1 ఆముదము, 2 జిగట గల పదార్థములు కలిపి చేసిన పాకము (Mucilaginous drinks), నాడాపాము; ఏలికపాములకు ఇచ్చునపుడును, విరేచనము లగుటకు ఇచ్చునపుడును మోతాదుతగ్గించి సమముగ ఆముదముగలిపి ఇయ్యవగును. తక్కిన రోగముల కిచ్చునపుడు ఏలకులు, లవంగములు దాల్చినిచెక్క మొదలగు వస్తువుల చూర్ణముతో, తేనెలోగాని జిగటగల పదార్థముల పానకములోగాని గలిపి యిచ్చిన నిర్బాధకముగ నుండును. దీనిని 3 మొ॥ 5 చు॥లవరకు, కొద్దిగ పంచదార పైనవేసి యిచ్చిన ఎక్కిళ్లు కట్టును. కట్టనియడల ½ ఘం, 1/4ఘం॥లో 3-4 పర్యాయము లియ్యవచ్చును.

టెంకాయ:—కొబ్బరికాయ చూడుడు.

టేకుచెట్టు:—Tectona Grandis-Teak tree. సం* శాకవృక్ష,మహాపత్ర, ఖరపత్ర హిం* సాగవన్. దీని యాకు లేక చక్కకషాయము

చేదుగ, వగరుగనుండును; చలవజేయును; రక్తపిత్తము ఆమదోషము, మూలవ్యాధి, కుష్ఠు, ప్రదరము, శ్లేష్మము, వాతరక్తము, వాతము వీనిని హరించును. గర్భదోషములను హరించి సంతానయోగ్యతను గలిగించి గర్భమును నిలుపును. ఈకర్రనుండి పాతాళయంత్రముచేత తీసిన తైలమును రాసిన చర్మరోగములు హరించును. రసపుమోతాదు 2-3 తులములయెత్తు; కషాయపు మోతాదు 4-5 తులములయెత్తు. దీని ఆకులలో భోజనము వాతమును శమింపజేయును. ఆమము, పైత్యమును బోగొట్టును

టొమేటొ పళ్లు:—కాయలు సీమవంకాయలు చూడుడు.

---

## డ

డావరడంగి:—దేవదాళితీగె చూడుడు.

డేగమాంసము:—Hawk-flesh of. పక్షవాతమును గొట్టును; విషమును హరించును; జఠరదీప్తి నిచ్చును; బలము జేయును; నేత్రేంద్రియ, కర్ణేంద్రియములకు బలమిచ్చును; వీర్యపుష్టి జేయును; కఫమును, పైత్యమును హరించును.

ఢిల్లీ భోగాలను ధాన్యము:—A sort of paddy. వీని బియ్యము బహు సన్నముగానుండును. వీని యన్నము బహు మృదువుగ, రుచిగా భోగ్యముగానుండును. సున్నిత దేహులకు రోగులకు చాలా అనుకూలముగానుండును. వీర్యవృద్ధి, బలము, పుష్టి. ఆరోగ్యము నిచ్చును. మరియు ధాన్యములు చూడుడు.

---

## త

తంగేడుకాయకూర:— Curry of the green fruit of Cassia Auriculata. లేతకాయల కూర మేహమును, క్రిమిరోగమును, మూలవ్యాధిని హరించును; దప్పిక నణచును; నేత్రములకు మేలుజేయును; అతిమూత్రరోగులకు పథ్యముగ నుండును.

తంగేడుపువ్వు:— Flowers of do. చలవజేయును; మేహము, కఫము, అన్నిప్రమేహములు, గ్రహణి వీనిని బోగొట్టును; కాంతి నిచ్చును; అతిమూత్రమును గట్టును. వీనిని నీడను ఎండించి చూర్ణించి సమముగ చీనాపంచదార గలిపి పూటకు పావలాయెత్తు మొదలు అర్ధరూపాయ యెత్తుచొప్పున రెండుపూటలను 20 లేక 40 దినములు పుచ్చుకొనిన అతిమూత్రజాడ్యము కట్టును; లేదా పచ్చిపువ్వులను తెలకపిండిలోవేసి కూరవండి 20–30 దినములు అనుదినము బుచ్చుకొనిన అతిమూత్రము కట్టును. ఈ పువ్వుల కషాయమునకు పై గుణములు గలిగియుండును.

తంగేడుబంక:— Gum of Cassia Auriculata. వగరు గలిగి యుండును; రక్తగ్రహణి, మధుమేహము, అతిమూత్రము నణచును. మోతాదు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు.

తంగేడు విత్తులు:—Seeds of do. వీనిచూర్ణము వగరుగ నుండును; చలవ, మేహశాంతి జేయును; దేహములోని ఘట్టిపడిన పదార్థములను కరగించును; అమిత కారకముచేత చెడిపోయిన దేహతత్వమును బాగుపరచును; అతిమూత్రము, మధుమేహము, విషము, రక్తాతిసారము వీనిని హరించును. వీని చూర్ణముకు సమముగ పంచదార కలిపి పుచ్చుకొన వచ్చును. వీనిచూర్ణములో తేనెగలిపి పుచ్చుకొనినను, అతిమూత్రము కట్టును. చూర్ణపు మోతాదు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు. వీని చూర్ణముతో చేసిన

శేహ్యమును ఉపయోగించవచ్చును. అది పూటకు అరతులమెత్తు చొప్పున దినమునకు రెండుపూటలను పుచ్చుకొనవలెను. మిక్కిలి మృదువుగా చేసిన వీనిచూర్ణము కండ్లలోవేసిన నేత్రరోగములు వర్తించును.

తంగేడు యిగుళ్ళు:—Shoots or tender leaves of do. వీని రసము అతిమూత్రమును కట్టును; అన్ని ప్రమేహముల నణచును; మిక్కిలి దేహపుష్టి నిచ్చును; వాతరోగమును శమింపజేయును; నేత్రములకు చలవజేయును; వీనిని తలమీదనుంచి తలరుమాలు (పగటివేళ) పెట్టుకొనినగాని లేక గుడ్డవేసి కట్టుకొనినగాని తల నొప్పి, పోటు నయమగును. నేత్రరోగములను బోగొట్టును. రసము యొక్క మోతాదు పూటకు 2-3 తులముల యెత్తువరకు.

తంగేడుచెట్టు:— Cassia Auriculata. Eng. Tanner's Cassia. సం॥ గోశ్రేణీ, తలపోటక. హిం॥ తర్వార్. ఈ తంగేడు 3 జాతులు గలవు. తంగేడు, నేలతంగేడు, కొండతంగేడు అని. ఇందులో కొండ తంగేడుకు వైద్యోపయోగము అంతగాలేదు. దీని గింజలలోని పప్పు వేయించుకు తినిన కమ్మగ. రుచిగ నుండును. వీర్యవృద్ధి, బలము జేయును. నేలతంగేడుకు గుణమధికము. ఇది పసుపుపచ్చని పువ్వులు పూయు చిన్నచెట్టు. దీని మ్రానుచెక్కతో తోళ్ళు బాగు చేయుదురు. దీని సమూలముయొక్క చూర్ణములో సమముగా పంచదారగలిపి పూటకు బేడెత్తుమొదలు అర్ధరూపాయి యెత్తువరకు నీళ్ళతో రెండుపూటలను 20 లేక 40 దినములు పుచ్చుకొనిన ఇరు వది మేహములను హరించును. వీర్యపుష్టి జేయును. అతిమూత్రము, నష్టేంద్రియము కట్టును. దీని వేరుచెక్క నూరినముద్ద పూటకు గచ్చకాయంత చొప్పున పెరుగుతో నిచ్చిన గ్రహణి కట్టును.

తంటెపుచెట్టు:—తగిరిశచెట్టు చూడుడు.

తక్కలికూర:—దీనినే చిరినెల్లికూర యందురు. నెల్లికూర చూడుడు.

తక్కెడచెట్టు:—A medicinal tree. దీని వేరు చక్క లేక ఆకురసము లేక కషాయము కారముగ, చేదుగ నుండును. వేడిజేయును, వాతము శోఫ, శ్లేష్మము, అగ్నిమాంద్యము, మలబద్ధము వీటి నణచును. విరేచనము జేయును. దీనియాకు తలకువేసి కట్టిన శిరోవాతము, శిరఃశూలలు హరించును. రసపుమోతాదు పూటకు 2-3 తులములమెత్తు. కషాయపుమోతాదు పూటకు 2½ మొదలు 5తులముల మెత్తువరకు.

తక్కోలములు:—Hibiscus Abelmoschus & Abelmoschus Moschatus. సం॥ లతాకస్తూరికా, తక్కోల. హి॥ ముష్క్ దానా. దీనినే కర్పూరపు బెండ యనియు, కస్తూరిబెండ యనియు నందురు. దీని విత్తులుమిక్కిలి సువాసనగ నుండును. దీనిచూర్ణము, రసము లేక కషాయము స్వాదుగా, సుగంధముగా నుండును. మేహశాంతి జేయును. త్రిదోషములను, అరుచిని పోగొట్టును. మూత్రకృచ్ఛ్రము, మూత్రఘాతము, భ్రమ, మూలవ్యాధి, క్షయ, నేత్రరోగములు, ముఖరోగములు అనగా నోటిలోబుట్టెడి రోగములు,జ్వరము, విషము వీనిని హరించును. మూంతగుండె (heart)కు, పొట్టకు బలము జేయును రుచి బుట్టించును.జఠరాగ్నిని వృద్ధిబొందించును; బలము జేయును, కఫవాతము, వాతపైత్యములను జయించును; చెమట బుట్టించును; చూర్ణపుమోతాదు పూటకు 2 మొదలు 4 చిన్నముల మెత్తువరకు. నీళ్ళతో నూరితీసిన రసపు మోతాదు పూటకు 2-3 తులములమెత్తు; కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల మెత్తువరకు. వీనిని తాంబూలములో నుపయోగించ తగియుండును.

తక్రాన్నము:—Boiled rice soaked in butter-milk & seasoned. అనగా చల్లలో ఊరనిచ్చి పోగిచిన అన్నము. మనోహరముగ నుండును; క్రొవ్వును వృద్ధిజేయును; సమస్త మేహములను గొట్టును; వాతముజేయును; ఉష్ణదోషములను, పాండురోగము, గ్రహణి వీనిని హరించును; దేహపుష్టి, జఠరదీప్తి, ఆయుర్వృద్ధి, కాంతి, సౌఖ్యము వీనిని గలుగజేయును; గర్భిణీస్త్రీలకనుకూలముగ నుండును.

తగరము:—Tin. సం॥ వంగ, రంగ. హిం॥ వంగ్, కత్తిల్. ఇదియొక భూమిలో పుట్టు లోహము. దీనితో గిన్నెలు, పాత్రలు చేయుదురు. ఈపాత్రలలో భోజనము చేయుదురు. యీపాత్రలలో పాడిగపులుసు నిలవయుంచిన కిలము పట్టకుండ యుండును. యేవిధమైన దోషములు కలుగకుండ ఆరోగ్యమిచ్చును. మేహశాంతి, పైత్యశాంతి జేయును. దీనితో రాగి, యిత్తడి పాత్రలకు కళాయి చేయుదురు. అందువలన ఆపాత్రలకు కిలము మొదలగు దోషములు లేకుండ జేయును. తగరము కడియముగా జేసి యేచెట్టువేరుకైనను తొడిగిన ఆచెట్టుయొక్క కాయలు రాలవు; ఎక్కువ కాయలు కాయును.

తగరభస్మము:—Calx of Tin. క్రమముగ శుద్ధిజేసి చేయబడిన వంగభస్మము. మేహములను, మధుమేహము, పైత్యములనుహరించును; శుక్లనష్టము, ప్రమేహము, సెగరోగము, తాపము, పాండువు, క్రిమిరోగము వీనిని హరించును; వీర్యవృద్ధి జేయును; కఫము, క్షయరోగము, శ్వాస, శూల, వమనము, ప్రదరరోగము వీనిని పోగొట్టును; ఆయుర్వృద్ధి. బలము, వీర్యము, కామము, అగ్నిదీప్తి, బుద్ధిబలము, ధాతుస్థైర్యము వీనిని గలుగజేయును; అశుద్ధ, అపక్వ వంగభస్మసేవవలన వాంతి, భ్రాంతి, శుక్లనాశనము, తాపము, కష్టువు, గుల్మము, పాంగువు, ప్రమేహము, పొక్కులు, వాతము, పక్షవా

తము, రక్తవికారము మొదలగు ననేక రోగములు గలుగును. దోష ములు గలుగును. దోషయుక్త వంగభస్మ సేవవలన గలిగిన వికార మునకు విరుగుళ్ళు 1 ఒద్దివేరు చెక్కచూర్ణములో సమముగ కల కండ గలిపి పూటకు బేడెత్తుచొప్పున 10-15 దినములు పుచ్చుకొన డము, 2 తాడికాయ, ఉసిరికాయ, కరక్కాయ, పిప్పళ్ళు వీని చూర్ణము పైన చెప్పిన విధమున సేవించడము. వంగభస్మపు మోతాదు పూటకు 2 మొదలు 4 గింజల వరకు.

తగిరిసిచెట్టు:—Cassia Tora. సం॥ చక్రమర్ద, ప్రపున్నాట, దద్రుఘ్న. హిం॥ చకవడ్, పవాడ్. దీనిని తంటెపుచెట్టని అందురు. దీనిసమూల రసము లేక కషాయము చేదు, కారముగా నుండును. శీతపైత్య మును, శ్లేష్మవాతమును, శిల్పకుష్ఠును, కఫమును హరించును. దేహ కాంతి నిచ్చును. దీని ఆకు జిగటగ నుండును; కొద్దిగ విరేచనకారి. దీని కషాయము దంతములు వచ్చునప్పుడు వచ్చెడు బిడ్డలజ్వరమును హరించును. రసపు మోతాదు పూటకు 2 మొదలు 4 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 6 తులములయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యవగును. దీని ఆకుకు కొద్దిగ ఆముదము చరిమి వెచ్చజేసి నూరికట్టినను, ఆముదములో దీనిఆకును ఉడికించి నూరికట్టినను వ్రణములు, మురికివ్రణములు మానును. దీని వేరు నిమ్మకాయరసముతో నూరి పూసిన తామర మానును. ఆకు నూరి యుడికించికట్టిన గడ్డలు త్వరగ చీముపట్టి పగులును. దీనిఆకులు నలిపి తేనెటీగలు కుట్టినచోట రుద్దిన బాధనయమగును. దీని ఆకును చిదుకకొట్టి ఆముదము చరిమి వెచ్చజేసి దానితో కాపడముబెట్టి కట్టిన ఆమవాతపునొప్పులు (gout), నడుమునొప్పి, మలుగునొప్పి, కీళ్ళనొప్పులు హరించును. దీని ఆకులు కూరవండి తినిన వాతము, కఫము, కుష్ఠు, విసర్పి, దురదలు, పొక్కులు, మూలవ్యాధి, ఉబ్బు

యారోగములయందు పథ్యముగ నుండును. పైత్యము జేయును. అగ్నిదీప్తి నిచ్చును.

తగిరిసవిత్తులు:— Seeds of Cassia Tora. వీని చూర్ణము లేక కషాయము వాతమును, కఫమును, దురదను, కుష్ఠును, క్రిమిరోగమును హరించును; కాంతినిచ్చును. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 5 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు. దీని తైలము రాసిన చర్మరోగములు హరించును.

తడచెట్టు:—Grewia Elastica. సం॥ ధన్వనా, ధనువృక్షా. హిం॥ ధామిన్. దీని పట్టవగరుగ కారముగనుండును.దీని చెక్క లేక ఆకు రసము లేక కషాయము కఫము, వాతములను రక్తకాస, పాండు, ప్రమేహములు హరించును. రసముయొక్క మోతాదు పూటకు 2-4 తులములయెత్తు. కషాయపు మోతాదు 2కి మొదలు 5 తులముల యెత్తువరకు. దీని పండ్లు తియ్యగా, వగరుగానుండును. కఫ, పిత్తములను హరించును. మలబద్ధము జేయును. కొద్దిగ వాతము జేయును.

తడిచీర:—Wet cloth. దీనిని ధరించిన వణుకు బుట్టించును; మిక్కిలి వాతము జేయును; మూత్రకృచ్ఛ్రము, అగ్నిమాంద్యము, పైత్యము, దగ్గు మొదలగు ననేక రోగములను బుట్టించును.

తడియొత్తిన గుణము:—Rubbing of body with a cloth after bathing. అనగా స్నానము జేసి వస్త్రముతో తుడుచుకొనడము వలన కాంతినిచ్చును; శుచిగానుండును; దురద, చిడుము, గజ్జి మొదలగు చర్మరోగములను శోషించును.

తపసిచెట్టు:—Trophis Aspera. సం॥ శాఖోటః, ఖరవృక్ష, హిం॥ సహోడా. దీనిచెక్క, ఆకురసము, కషాయము వాతరక్తము, రక్త

దోషము, కఫవాతము, అతిసారము వీనిని హరించును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తు వరకు.

తమాలవృక్షము:—Garcinia Xanthochymus. సం॥ తమాల, నీలతాల. హిం॥ తమాలు. అనగా సముద్రతీరమునందు లేచెడు నల్లని యాకులుగలచెట్టు. దీనిని చీకటిమ్రాను అని యందురు. దీని చెక్క, లేక ఆకురసము, కషాయము వగరుగ తియ్యగనుండును. చలువచేయును. కఫము, మేహపుబ్బు, వాపు. తాపము, స్ఫోటము వీనిని పోగొట్టును. వీర్యవృద్ధి బలము నిచ్చును. మరియు వేప చెట్టు గుణములు దీనికిని గలవు. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

తమలపాకులు:—Piper Betel. Eng. Betel leaves. సం॥ తాంబూలి, నాగవల్లి, భక్షపత్రా. హిం॥ పాన్. చిరుచేదు, కారము, తీపి రుచులు గలిగియుండును; తమలపాకులు లేతవి, ముదిరినవి, పండించినవి, దక్షిణదేశపువి (దళసరిగకొద్దిగ నలుపుగలిగియుండును) బంగాళాదేశపువి (అనగా కారాకిళ్ళీకి వుపయోగించేవి), అను భేదములుగలవు. మొదట 3 రకములున్నూ ఔషధోపయోగమునకును తాంబూలమునకును వుపయోగించవలెను. నోటిజిగట, దుర్గంధము, శ్లేష్మము, వాతము, గుండెలలో భారము, రసదోషము, అజీర్ణము వీనిని పోగొట్టును; వీర్యమునకు వేడి బుట్టించును; విరేచనము జేయును; సమశీతోష్ణమయినవి; మిక్కిలి సంతోషమునిచ్చును; ఆకలి బుట్టించును, పొట్టకు, హృదయమునకు, బుద్ధికి బలమిచ్చును; జ్ఞాపకశక్తిని హెచ్చించును, తాజా పరచును. సౌఖ్యమిచ్చును, దేహములోనుండెడి దుష్టపదార్థములను తీసివేయును; దంతవాతమును తగ్గించును; శ్లేష్మదాహము నణచును; గొంతుకను, రొమ్మును

శ్మభపరచును; దగ్గు నణచును; జీర్ణము చేయును. తమలపాకులు నమిలినముద్ద పుర్రెమీదలపైన వేయుచుండిన నయమగును. తమల పాకులు వెచ్చజేసి తీసిన రసము జ్వరమును, దగ్గును, శ్లేష్మము హరించును; మోతాదు పూటకు ¼ మొదలు 1¼ తులముల యెత్తు వరకు. ఆకులరసమును కండ్లలో పిండిన నేత్రరోగములు, రేజీకటి వీనిని పోగొట్టును; ఆరసము లోపలికిచ్చిన మెదడు గట్టి పడడమును, కామోద్రేకమును అణచును; ఆరసములో తేనెగలిపి యిచ్చిన దగ్గులు, శ్లేష్మము హరించును. మోతాదు పై ప్రకారము; తొడి మను ఆముదములో ముంచి బిడ్డల ఆసనమున జొనిపిన విరేచనము చేయును; ఆకులు వెచ్చజేసి ఆవనూనె చరిమికట్టిన గొంతుక పుండు నిమ్మళించును. కరియములతో ఆకులు నమలి తినిన స్త్రీలకు సంతా నము కలుగుకయుండునుగాని గర్భాశయము (Ovaries) కు జబ్బు చేయును. ఆకులరసము బిడ్డలదగ్గు, క్షయ, శ్లేష్మము, జ్వరము వీనిని హరించును. వీనిరసములో కొద్దిగ కస్తూరి గలిపి యిచ్చిన అప స్మారము( Hysteria ) వాతములు, సన్నిపాతములు హరించును. ఆకులకు ఆముదము చరిమి వెచ్చజేసి రొమ్ముపైన ఆకుమీద ఆకును దళసరిగ వేసిన బిడ్డలదగ్గు, వగర్పు అణచును; కుడిప్రక్క చంక క్రింద అట్లువేసిన ఆప్రక్కనొప్పి, కార్జము (Liver) గట్టిపడడము మొద లగు కార్జపురోగములు మానును; స్త్రీల చన్నులపైన వెచ్చజేసి వేసిన పాలు హరించును; గవదలపైన వేసిన గవదబిళ్ళలు (Glandular swellings) హరించును; తమలపాకులు అప్పుడు కోసినవి, లేతవి మృదువుగానుండునవి, తాంబూలమునకు మిక్కిలి అనుకూలముగా నుండును. పండించిన ఆకులు బాలింతలు తాంబూ లము వేసికొనిన మిక్కిలి ఆరోగ్యమునిచ్చును. నిర్దోషముగా

నుండును. మిక్కిలి పథ్యమైనవి. తమలపాకులు ఘోండినవి, వడిలినవి, పురుగుకొట్టినవి, సున్నముంచినవి వుపయోగించగూడదు.

తమలపాకు తీగ, వేళ్ళు:—Roots of betel leaf plant. వీని చూర్ణము అతిమధురపు చూర్ణము సమముగ గలిపి తేనెతో నిచ్చిన దగ్గులు శమించును. ఈ వేరును నమలి ఊటమ్రింగిన కంఠస్వరము బాగుగనుండును. పాటకులు, నాటకులు దీని నుపయోగించ దగియుండును.

తరువాణి, అన్నము, చారు:—Rice Cunjee acid. ఒక శుద్ధమైన కుండలో గంజి దినదినము పోయుచుండునది; అనగా ప్రతిదినము నిలవయున్న కొంతగంజిని తీసివేసి క్రొత్తగంజి పోయుచుండిన పులియును. దీనిలో ప్రతిదినము రాత్రులయందు అవసరమైనంత యన్నమును వేయుచూ మరునాడు వుదయము ఆ యన్నమును పిండి తీసి అందులో కావలసినంత తరవాణి తేటను చేర్చికొని, అందులో మజ్జిగ జేర్చిగాని, చేర్చకగాని వుపయోగింతురు. ఇది మేహశాంతిని, పైత్యశాంతిని జేయును. దాహము, తాపము, శ్రమను, అణచును. జఠరదీప్తిని, శరీరపుష్టిని, బలమును జేయును. నిశ్చాకతత్వము గలవారికి మిక్కిలి అనుకూలముగా నుండును. వేసవికాలమందు మిక్కిలి ఆరోగ్యముగా నుండును. కొందరు యీ పిండిన అన్నములో మంచినూనె, పచ్చళ్ళతో పుచ్చుకొనిన బలము, పుష్టి, ఆరోగ్యమును గలుగజేయును. తరవాణిలో రసవర్గములు చేర్చి కాచిన చారు రుచిగ నుండును. పైన చెప్పినగుణములు గలిగియుండును.

తెల్లపిట్టఆవుపాలు:—ఆవుపాలు చూడుము.

తరుబూజా:—Citrallus Valgaris. Cucurbita Citrallus. Eng. Water melon. సం॥ కృష్ణబీజ, ఉర్వారు. హిం॥ తర్బూజ్, తరుబూజా. ఇది పెద్దపుచ్చపండు. గుండ్రముగనైన, కోలగనైన నుండును; పైన ఆకుపచ్చ తెలుపుమచ్చలుగలిగి నున్నగ నుండును; దీనిలోని విత్తులు నల్లగనైన, ఎఱ్ఱగనైన, తెల్లగనైన నుండును. దీనిలో గుజ్జు ఎఱ్ఱగనైన, గులాబిపువ్వు రంగుగనైన, తెల్లగనైన నుండును. దీనిలో అధికముగ నీరుండును; తియ్యగ, చల్లగ నుండును, చలవజేసి నీరుపెట్టును. దీనిలోని నీళ్ళు లేక రసము వేసవి కాలములో ఎండవేళ పుచ్చుకొనుటకు మిక్కిలి అనుకూలముగ నుండును. దాహమునణచును; మూర్ఛాయాసమును, బడలికను; దోష జ్వరము (Typhus fever) లో దీనిని లోపలికిచ్చిన కడుపులో పుండు కానియ్యదు; పైత్యముయొక్క తీవ్రమును, రక్తములోని అతివేడిని అణచును; మూత్రము గావించును; పలుచని రక్తమును పలుచని శ్లేష్మమును పుట్టించును; శరీరము నల్లబడజేయును; పైత్య జ్వరము నణచును; ఎండిన దేహము గలవారికిని, ఉష్ణతత్వము గల వారికిని దేహమును మంచిస్థితిలో నుంచును. మేహమునకు పాల తోడను, పైత్యమునకు చింతపండు పులుసుతోడను ఇమిడ్చిన మేలు జేయును; మూత్రపుసంచిలోని రాతిని కరగించును; జలుబు లేక వాతగిత్వము గలవారి తెల్లదబ్బకు, పొట్టకు నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార, 3 గులకందు దీని విత్తులకు పండు గుణము గలిగియుండును.

తలంటుకొని స్నానము చేయుట:—అభ్యంగన స్నానము చూడుడు.

తలగడగుణము:—Pillow. ఇది మెత్తగా నుండవలెను. రక్తప్రవాహమునకు అనుకూలించును. తలత్రిప్పు, తలనొప్పిని శాంతింప జేయును. సుఖనిద్ర నిచ్చును; ఆరోగ్యము గలుగజేయును.

తలపాగ:— Turban. శిరస్సునకు వేడినిచ్చును. మనోల్లాసము కలుగ చేయును; శిరోవాతము హరించును; తలవెంట్రుకలకు బలమును, నలుపును ఇచ్చును; శీతలమును, ఎండదెబ్బను తప్పించును; కండ్లకు చలవచేయును; కాని మిక్కిలి భారమైనదిగ నుండగూడదు.

తవరాజము:—Sugar Candy. అనగా కలకండ. పటికపంచదార చూడుడు.

తవాక్షీరి:— Bamboo manna. సం॥ వంశరోచన, తుగాక్షీరి, వైణవీ. హిం॥ వంశలోచన్. అనగా వెదురుపాలు. ఇది ముదురు వెదురు కర్రలలో దొరకును; చప్పగా, వగరుగా నుండును; మిక్కిలి మేహశాంతి, చలవ, బలము, వీర్యపుష్టి చేయును; పైత్యము, మూత్రకృచ్ఛ్రము, తలత్రిప్పరోగము, అతిసారము, దగ్గు, క్షయ, కఫము, తాపము, అరుచి వీనిని జయించును. లోపలి గాయములను మాన్పును. మనోల్లాసము నిచ్చును. ముంతగుండె (heart)కు మేలు చేయును. విరేచనబద్ధము చేయును; వాతతత్వముగలవారి నల్లదబ్బ (spleen)కు నష్టము చేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 కుంకుమపువ్వు. మోతాదు 1 లేక 2 అణాలయెత్తు.

తవిదలు:— చోళ్ళుచూడుడు.

తాంబూలము:— The chewing of betel leaves & nut. కారము, వగరు, తీపి, ఉప్పు రుచులు గలది; సువాసనగ మనోహరముగ నుండును. వాతము, క్రిమిరోగము, కఫము, మలబద్ధము, శూల, అరుచి, అగ్నిమాంద్యము, పీనస వీనిని పోగొట్టును; మనస్సునకు సంతోషము, దేహోష్ణము, అగ్నిదీప్తి వీని నిచ్చును. విరేచనము గావించును. వీర్యవృద్ధి చేయును. జీర్ణము గావించును. ముంతగుండెకు, పొట్టకు, బుద్ధికి బలమిచ్చును. ఆకలివేళను, ఉష్ణతత్వము గల వారును, తాంబూలము వేసుకొనిన తలనొప్పి, పైత్యము వీనిని

బుట్టించును; పైత్యరోగులకును, అభ్యాసము లేనివారికిని, చెక్క దోషమువలన తిక్క బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 చల్లనినీళ్ళు, 2 చింతపండు, 3 కలినీళ్ళు, 4 పెరుగు.

తాంబూలనిర్ణయము:— Rules to be observed in chewing betel leaves & nut. తాంబూలమునకు ఒకచెక్క, అయిదు ఆకులును, అనపబద్దంత సున్నమును. అందులో సగము పచ్చకర్పూరమును, మూడు తక్కోలములు, రెండు లవంగమొగ్గలు, ఒక యాలుక్కాయ, శనగగింజంత జాజికాయయును వేసుకొనవలెను. ఈలాగు క్రమముగా తాంబూలము చేసిన సర్వదోషములను హరించును. పోకచెక్కలో పురుగులుండిన గళరోగమును, గండమాల రోగమును పుట్టించును.ఆకుల యీనెలసందున కీటకాంశములుండిన ముఖరోగము దెచ్చును. సున్నములో సన్నపాటి రాళ్ళుండిన మూత్రాశ్మరి రోగమును బుట్టించును; గనుక చెక్క, ఆకు, సున్నము శుభ్రపరచి వాడుక జేయవలయును. ముందు నోటిలో నొక ఆకు ఉంచుకొని ఆవెనుక చెక్క వేసుకొనవలెను. చెక్కలు పంటితో కటుక్కున కొరకడమువలన దంతములకు,నేత్రములకు, కర్ణములకు జబ్బు చేయును.గనుక చెక్కలు సన్నముగా కత్తిరించి వానినే యుపయోగపరచనగును. మరియు భోజనాత్పూర్వమందు ఏడాకులును, భోజనాత్పరమందు అయిదాకులును, రాత్రివేళ రెండయినను మూడయినను ఆకులును, తాంబూలము చేయునగును రతాంతరమున భోజనాత్పూర్వమందు అయిదయినను, ఆరయినను,భోజనాత్పరమందు మూడయినను, నాలుగయినను ఆకులును, రాత్రివేళ రెండయినను, మూడయినను ఆకులును తాంబూలము చేయుదగినది. ఇది నిత్య తాంబూల సేవాక్రమము. మరియు ఆకుల మొదళ్ళు, చివరలు, ఈనెలు

వీటిని తీసివేయువలెను. సున్నపాకును, క్రిందపడిన ఆకును వర్జింపవల యును. రెండాకులు కలిపి వేసుకొనగూడదు.

తాంబూలము పుక్కిటనుంచుకొని నిద్రపోయినగుణము:—Sleeping with a quid of betel leaves & nut. మిక్కిలి చొంగ బయలు దేరును; వివర్ణత గలిగించును; దంతములకు దుర్బలము దెచ్చును; ముఖరోగమును,గళరోగమును విస్తరింపజేయును.గావున నోటిలో తాంబూలము (తమ్మ) ఉంచుకొని నిద్రించకూడదు. నిద్ర పోవుటకుముందు నీళ్ళతో పుక్కిలించి పరుండవలెను.

తాంబూలము వర్జించవలసినవారు:—Those who should avoid the chewing of betel leaves & nut. కుష్ఠు, మధుమేహము, మూత్రరోగము, నేత్రరోగము, క్షయ, జ్వరము, ఉబ్బు, మూత్రకృచ్ఛ్రము, ప్రదరరోగము (కుసుమ రోగము). పాండువు, త్రిష్ణ, మతిచాంచల్యము, శోష, మూర్ఛ, శ్వాస, హృద్రోగము, చర్ది అనగా వమనము, రక్తపైత్యము, దేహతాపము, విసర్పి మొదలగు చర్మరోగములు, అపస్మారము, గ్రహణి, అతిసారము ఈరోగములు గలవారును,ఎండిన దేహము గలవారును,విశేషముగ ఆకలిదప్పికల గొన్నప్పుడును, గాయము తగిలినప్పుడును, సర్పదంష్టమయినప్పు డును,ఇతర విషదోషమున్నప్పుడును తాంబూలము విడువవలయును.

తాంబూల విరుద్ధములు:—Things which are inimical to the chewing of betel leaves & nut. పాలు, నీళ్ళు, వెలగపండు, పనసపండు, మామిడిపండు, అరటిపండు, చెరుకు, మద్యము, పప్పు కట్టు, తేనె, కొబ్బరికాయ, ఇవి పుచ్చుకొనిన ఒకగడియవరకును తాంబూలము వేసికొనగూడదు.

తాంబూల సేవాక్రమము:—How to chew betel leaves & nut తాంబూలములో ప్రాతఃకాలమున చెక్కయును, మధ్యాహ్నమున

సున్నమును, రాత్రియం దాకులును అధికముగ నుండవలెను. తాం బూలము నమలగా మొదట బయలుదేరిన రసము విషతుల్యముగ నుండును. రెండవమారు బయలుదేరిన రసము నీరసము దెచ్చును. విరేచనము జేయును. అగ్నిదీప్తి నిచ్చును. మూడవమారు బయలు దేరిన రసము అమృతతుల్యముగ నుండును. సున్న మెక్కువైన దుర్గంధమును, చెక్క యెక్కువైన వీర్యపుష్టిని జేయును. ఆకులు ఎక్కువ వేసుకొనిన సుగంధము నిచ్చునుగాని ఆలాగున సమానముగ తాంబూలముజేసి దానిరసము మింగిన ఉష్ణము, అరుచి, అగ్ని మాంద్యము, వీర్యనష్టి, పీనస, శ్వాస, పాండురోగము, మూత్ర కృచ్ఛ్రము, ప్రమేహము ఈరోగములను గలుగజేయును. తాంబూల ములో సున్నమెక్కువై నోరుపొక్కినందుకు విరుగుడు శర్కర. మా. ని. కలినీళ్ళు గలిపి పుక్కిటనుంచుకొని యుమ్మివేయవలెను. తమ్మి మింగడమువలన పొట్టకు, ముంతగుండె (heart)కు నష్టము జేయును; హృద్రోగము పుట్టును.

తాంబేలు:—Tortoise flesh of. సం॥ కూర్మ, కచ్ఛప. దీని మాం సము చమురుగలిగి రుచిగానుండును. గురుత్వము, వీర్యవృద్ధి జేయును; పైత్యము నణచును. ఆయుర్వృద్ధి నిచ్చును. పైత్యమును జేయునని కొందరందురు. దీనిగ్రుడ్లు ఉష్ణము, గురుత్వము జేయును. దీనికి విరు గుడు యవక్షారము. తాబేటి గ్రుడ్డులోని చందమామ (పచ్చనిది) సుమారు 1 తులంయెత్తు, పావుశేరుగాని, అర్ధపావుశేరుగాని ఆవు పాలలో వేసి యిచ్చుచుండిన దగ్గులు నిర్మూలించును. దీని చిప్పను భస్మముచేసి,ఆముదములోగాని, కొబ్బరినూనెలోగాని కలిపి వ్రాయు చుండిన కురుపులు, వ్రణములు, చర్మరోగములు పోవును.

తాంబేలు చేదుకట్టె (అనగా మెట్టతాంబేలుయొక్క చేదుకట్టు):– Gall of do. దీనిని చంటిబిడ్డలకు పోసిన జలుబు, దగ్గు, జ్వరము హరిం

చును. దీనిని వాతహారమగు ఔషధములలో గలిపి నూరి మాత్రలు గట్టి యిచ్చిన వాతములు, సన్నిపాతము, సూతికావాతము, అజీర్ణ విరేచనములు, అజీర్ణము. కలరా విరేచనములు నయమగును. మోతాదు 2 వడ్లగింజల యెత్తు మొదలు గురువిందగింజ యెత్తువరకు.

తాచుపాము మాంసము:— Flesh of a Cobra. దీని మాంసము పైత్యమును, అష్టాదశ కుష్ఠులను పోగొట్టును. వయస్సును నిలుపును. వీర్యపుష్టి జేయును. వెంట్రుకలు నెరియడమును, దేహము ముడతలు పడడమును పోగొట్టును.

తాటికలకండ:—Sugar Candy of Palmyra plant. ఇది గండ్ర యిసుకవలెనుండి, కొద్దిగ ఎర్రరంగు గలిగియుండును. ఇది మిక్కిలి మేహశాంతి, పైత్యశాంతి జేయును. శ్లేష్మములను, దగ్గులను హరించును. వీర్యపుష్టి, దేహపుష్టి, బలముచేయును. ఇంద్రియ నష్టము కట్టుటకు ఇచ్చు ఔషధములలో దీనిని ఉపయోగించుట మంచిది.

తాటికల్లు:—Borassus Flabelliformis-Toddy of palmyra tree. తియ్యనిది; కొద్దిగ మత్తుజేయును; దేహపుష్టి, దేహోష్ణము, వీర్యపుష్టి, బలము, తేలిక వీనినిచ్చును; వాతమును,కఫమును హరించును; జఠరదీప్తినిచ్చును; మూత్రము నధికపరచును; విరేచనము గావించును; నిశ్శక్తిని, మేహమును, ప్రమేహమును, పైత్యోద్రేకమును అణచును; మూత్రపుచురుకును పోగొట్టును; మనోహరముగనుండిచలవజేయును. వాతపైత్యమును, మేహపైత్యమునుఅణచును సెగగడ్డలను పోగొట్టును.కొంచెము తలనొప్పి తెచ్చును. అప్పుడుతీసిన కల్లు శ్లేష్మము, పులిసిన కల్లు వెగటుగ నుండును. పైత్యమును బుట్టించును. ఉష్ణము జేయును. విరేచనము గావించును, గురుత్వముగ నుండును ఎక్కువమత్తును, గ్రహణి, కఫపైత్యముగొట్టును.

పోతుతాటికల్లు సూర్యోదయాత్పూర్వమందు అనుదినము 40 దినములు పుచ్చుకొనిన పాండువు, మందాగ్ని, దేహకార్శ్యము ఈరోగములుగలవారికి చాల మేలుజేయును. నాము తాటికల్లు అనగా కాయలకాచెడు చెట్టుకల్లు. క్రొత్తగా గీతపెట్టిన చెట్టుకల్లు జలుబు, శ్లేష్మము, వాతముజేయును. దేహమున నొప్పులను బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 కలి, 2 నిమ్మకాయ.

తాటిచెట్టు:— Borassus Flabelliformis. Eng. Palmyra Palm. సం॥ లేఖ్యపత్ర, దీర్ఘతరు, తాల. హిం॥ తాల్, తాడ్. దీని నీడ మిక్కిలి హితవుగ నుండును. పైత్యతాపమును పోగొట్టును బలమును కాంతినియిచ్చును. దీని చన్నుల రసము లేక కషాయము ప్రదరరోగములను హరించును. లేతతాటిచెట్టు మొవ్వులో నుండి తీసిన నీళ్ళు అతిసారము, ప్రమేహము, పైత్యవాతము వీని నణచును. చలువజేయును.

తాటితేగలు:—Edible sprouts of Palmyra fruit. ఈ తేగలు కాల్చిగాని, తంపటవేసిగాని తినవలెను. రుచిగానుండును. బలము, పుష్టి, వీర్యవృద్ధి నిచ్చును. ఆకలిబాధను శమింపజేయును. విరేచనకారి. పైత్యము, గురుత్వము జేయును దీనికి విరుగుళ్ళు 1 బెల్లము, 2 నెయ్యి.

తాటిపండు:—Palmyra fruit. ఆహారవస్తువు. క్రిమిరోగము, కుష్టు, రక్తపైత్యము వీని నణచును. వాతము, పైత్యము, శ్లేష్మము వీనిని ప్రకోపింపజేయును. రక్తమును, శుక్లమును వృద్ధి బొందించును. గురుత్వమును, అగ్నిమాంద్యము జేయును. అతిమూత్రము, తంద్ర, నేత్రరోగము మొదలగు రోగములను బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 కడుగు, 2 బియ్యము, 3 పొగడపండు, 4 మిరియములు.

తాటి బెల్లము:— Jaggery made of Palmyra toddy. దీనిని సున్నపుకల్లుతో వండుదురు; కొద్దిగ వాసనగను, వెగటుగల తీపిరుచి గలిగియుండును. వాతము హరించును. బలముచేయును. క్రిములను, ఏలికపాములను బుట్టించును. కొన్ని యౌషధములలో వేయుదురు. పాతతాటిబెల్లము శ్రేష్టము. పశువులకు వేయుమందులలో తరుచు వాడుదురు. దీనిని వండి పంచదార చేయుదురు. సారాయికూడ తీయుదురు.

తాటిముంజలు:—Young kernels of unripe Palmyra fruit. చలువ, మేహశాంతి జేయును. వాతమును బుట్టించును. మేహపు రాళ్ళను బోగొట్టును. నీరసమును దెచ్చును. మేహపైత్యశూలలను అణచును. గురుత్వముగ నుండును. దాహము నణచును. ఉష్ణతత్వముగలవారికి పుంస్త్వమునకు మంచిది. పైత్యము నణచును మూత్రమును గావించును. ఆలస్యముగ జీర్ణమగును అమితముగ దినిన ఉబ్బురోగము పుట్టును. దీనికి విరుగుళ్ళు 1 మామిడికాయ, 2 వేడిగంజి. వీనిని పరగడుపున తినకూడదు.

తాటిముంజ నీరు:—Water in unripe Palmyra fruit. రుచిగా నుండును. పైత్యవాతమువలన బుట్టిన రోగముల నణచును. శ్రమను పోగొట్టును. బరువుమోసెడువారికిని, మార్గాయాసము నొందినవారికిని, దప్పిగొన్నవారికిని, వడగొట్టినవారికిని ఆప్యాయత నిచ్చును. చలవ, వాతము జేయును. నీరసము దెచ్చును. దీనికి విరుగుడు మామిడికాయ.

తాటియాకు మొదలగుఆకుల చేత కట్టబడిన యింటిగుణము:—House thatched with palm or other leaves. చలవ జేయును. పైత్యవికారమును, దేహతాపమును అణచును. చల్లగా మనోహరముగ నుండును.

తాటియాకు విసనకఱ్ఱ:— Palmyra leaf fan. దీనిచే వీవబడిన గాలి త్రిదోషములను శమింపజేయును; చల్లగ, మనోహరముగ నుండును; శ్వాసము, తాపము, చమట నణచును. మనస్సునకు బుద్ధిని ఆనంద మిచ్చును.

తాడికాయ:— Terminalia Bellerica. Eng. Belleric myrobalan. సం॥ కలివృక్షఫల, విభీతకఫల. హిం॥ బహెడా. దీనిని తాణికాయ అనియు నందురు. చలవజేసి అర్చును; బిగదీయును; వగరుగనుండును; నీరసమును పోగొట్టును; ఆకలి బుట్టించును; త్రిదోషములను, ద్వంద్వరోగములను హరించును. దగ్గు, వగర్పు, కర్ణనేత్ర రోగములు, కంఠరోగము వీనిని శమింపజేయును. వీర్యవృద్ధిని, బలమును ఇచ్చును. తలవెంట్రుకలకు వృద్ధి, కాంతి నిచ్చును. దుష్ట పదార్థకూటమిని కరగించును. పొట్టకు సత్తువ జేయును. తత్వమును సౌమ్యపరచును. జలుబును, వాతమును, తలనొప్పిని, మూలవ్యాధిని పోగొట్టును. ఉబ్బురోగము, కుష్టు, ప్లీహా (Enlargement of spleen), పురాణ విరేచనములు, నీళ్ళ విరేచనములు వీనిని మాన్పును. విత్తులలోని పప్పుదినిన మత్తెక్క జేయును. ఆపప్పును తేనెతో అరగదీసి కంటిలో బెట్టిన నేత్రరోగములు నివారణమగును. దీని పైబెరడు కొద్దిగ కాల్చి చూర్ణించి వాడుక చేయనగును. దీని పైబెరడు లేక పెచ్చుల కషాయమైనను వాడదగియుండును. చూర్ణపు మోతాదు పూటకు 3 మొదలు 6 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు 3 మొదలు 5 తులములయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. నడుముక్రింది అవయవములకు జబ్బు చేయును, విరేచనబద్ధము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార,

నొప్పులు, వాపులు, బాధలు హరించును. దుప్పికొమ్మును భస్మము చేసి వాడుదురు. దీనిని శృంగిభస్మమందురు. శృంగిభస్మముచూడుడు.

దుష్పినచెట్టు:—తు త్తరిబెండ చూడుడు.

దుష్టపుతీగ:—Odina Wedier. Rhus odina. O. Pinnata. సం॥ జింగినీ, పయశ్యాయగ్మఫలా.హిం॥ జింగన్,జింగినీ దీనిని జట్టుగ తీగనియు నందురు. పాలుండును. దీని వేరు, ఆకు లేక సమూల రసము లేక కషాయము, మిక్కిలి ఉష్ణము జేయును.గాఢవిరేచనము జేయును. ఆకలి బుట్టించును. పక్షవాతము, రుద్రవాతము (Apoplexy) మొదలగు ఘోరమైన వాతములు, ఉబ్బు, పాండువు, క్రిమిరోగము, యోనిశూల, చలిజ్వరము, వరుసజ్వరము, సర్ప, వృశ్చికవిషములు, ఉబ్బునపుదగ్గు వీనిని హరించును.దీని ఆకురసము 60 మొదలు 180 చుక్కలవరకు ఇచ్చిన బిడ్డల క్రిమిని, శ్లేష్మమును హరించును. దీనివేరు నూరి లోపలికిచ్చిన మిక్కిలి ఉష్ణము, గాఢ విరేచనము జేయును. దారుణ రుద్రవాత, బిడ్డలకువచ్చు బాలపాప చిన్ని (Conbalsions) అను రోగము, పక్షవాతముల కియ్యదగు యుండును. దీనిమోతాదు 2 మొదలు 4 అణాలయెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములయెత్తువరకు. దీనివేరు గాని, ఆకుగాని సమూలముగాని నూరి వట్టిదిగాని నూనెలో ఉడికించి గాని కట్టిన దుష్టవ్రణములను,గాయములను శుభ్రపరచి మాన్పును. దీని వేరు రసముగాని ఆకురసముగాని లోపలికిచ్చిన గర్భస్రావమును గలుగజేయును. దీని ఆకురసము 1–2 తులములయెత్తులో నువ్వుల నూనె 5–7 లేక 9 చుక్కలువేసి ఉదయము పూటలను 3 లేక 4 దినములిచ్చిన చలిజ్వరము,వరుసజ్వరముకట్టును.సుమారు 2 తులముల నూనెలో, 1 లేక 1½ తులముల ఎత్తు ఆకురసము కలిపినదిఒక మోతాదు చొప్పున 5 లేక 7 ఉదయపుపూటల నిచ్చిన ఉబ్బు,

త్రిదోషములను హరించును. వీర్యవృద్ధినిచ్చును తెల్లతామరదుంపను ప్రపౌండరీకమందురు. పై గుణములు చేయును.

తామర పువ్వు:—Flower of do. సం॥ పద్మ, కమల ఇది చలవ చేయును; రక్తపిత్తము, దప్పి, తాపము, రక్తదోషము, విస్ఫోటము. విషము, విసర్పి వీనిని నివర్తించును. దేహమునకు కాంతి నిచ్చును.

తామరాకు విస్తరి:—Lotus leaf platter. పచ్చితామరాకులో భోజనము హితవుగ నుండును. వాతమును, జ్వరమును, అగ్నిమాంద్యము గలుగ జేయును. ఎండిన ఆకు అనుకూలముగ నుండును.

తామ్రము:—Cuprum. Eng. Copper. సం॥ తామ్ర, మ్లేచ్ఛముఖ. హిం॥ తాంబా. అనగా రాగి; తీపి, వగటు. చేదుగలిగి యుండును. వాతమును హరించును. ఉష్ణము జేయును. చర్ది, విదాహము, పైత్యము వీనిని బుట్టించును. నేత్రరోగములను బాగుచేయును. వ్రణముల మాన్పును. దీని కిలము వమనమును కలుగ జేయును.

తామ్రపాత్రలో భోజనము:—Taking food in a copper dish or cup. వీర్యమునకు వేడి బుట్టించును. ఉష్ణము జేయును. పైత్యమును, కఫమును గొట్టును. జఠరాగ్ని నిచ్చును. కుష్టు, అమవికారములు, గుండెలు, గర్భము వీనిలోని రోగములు, విషము వీనిని హరించును. మనోవికాసమును గలుగజేయును. శరీరస్థౌల్యమును మట్టుపరచును. పుష్టినిచ్చును. మూలవ్యాధి, క్షయ, పాండురోగము వీనిని శమింపజేయును. కండ్లకు మిక్కిలి మేలుజేయును.

తామ్రభస్మము:—Calx of copper. శుద్ధతామ్రభస్మసేవవలన విరేచనము జేయును. దగ్గులను బోగొట్టును. శూలలను హరించును. గుల్మములు, పాండువు, పరిణామశూల, క్రిమిరోగము, కడుపులో బల్ల, కుష్టు, ఉదరరోగము, పలువిధములగు వ్రణములు, శ్లేష్మము

ఘాతము, జ్వరము, వాంతి, మూలవ్యాధి, ప్రమేహము, శిరోరోగము, ఎక్కిళ్ళు, శ్వాస, కాసలు, వాపు, తంద్ర, భ్రమ, మూర్ఛ, అతిసారము, క్షయ మొదలగు అనేక అసాధ్యరోగములను హరించును. అగ్నిదీప్తిని, ఆరోగ్యమును ఇచ్చును. మోతాదు 1 మొదలు 3 గుంజల యెత్తువరకు. క్రమముగ శుద్ధిభస్మము చేయబడని తామ్రభస్మ సేవవలన వమనము, విరేచనము, సంతాపము, మూర్ఛ, భ్రమ, మేహము, పాకము (దేహము దోసపండు పగిలినటుల పగులుట), శుక్లక్షయము, దౌర్బల్యము వీనిని గలుగజేసి ఆయుక్షీణము జేయును. ఇందుకు విరుగుడు అడవిధాన్యము (నివరిధాన్యము) యొక్క బియ్యము, కలకండ సమముగ నీళ్ళతో నూరి ప్రాతఃకాలమున 3 దినములు సేవించినను, శుద్ధగంధకమును కొన్నిదినములు సేవించినను తామ్రదోషము నివృత్తించును. తామ్రభస్మమును గ్రీష్మ, శరదృతువులయందు పుచ్చుకొనగూడదు. తామ్రభస్మమును ఆయా రోగములకు తగిన అనుపాన చూర్ణములతో గలిపి పొట్లములుగట్టి అనుపానభేదములుగా నివ్వవలయును.

తారంబూరికూర:— A kind of garden herb. రక్తపైత్యమును హెచ్చించును. కఫవాతములను హరించును. రుచి బుట్టించును. మూలవ్యాధిని శమింపజేయును.

తారమాక్షికము:— హేమాక్షికము చూడుడు.

తాళకము:— Yellow orpiment. సం* హరితాల, హిం* హరితాల్. పత్రతాళకమని పిండతాళకమని రెండు విధములు. పత్రతాళము రేకురేకులుగను, పిండతాళకము పసుపుపచ్చగ ముక్కలుగ నుండును. శుద్ధిచేసిన పచ్చతాళకమే ఔషధోపయోగము. మరిన్ని దీనిని చాలా ఔషధములలో వుపయోగింతురు. క్రమముగ శుద్ధిచేయబడినది జ్వరమును, కఫమును, మేహమును హరించును.

and red. కొద్ది తీపి వగరు రుచులు గలిగియుండును. పైత్యశ్లేష్మ జ్వరములను బోగొట్టును. గర్భమును నిలుపును. చర్ది, విదాహము, అతిసారము, ప్రదరమను యోనిరోగము వీనిని హరించును. చలవ, మేహశాంతి జేయును. కండ్లకు చలవ జేయును.

తెల్లకలువగడ్డ:— Nymphoea Lotus-white water lily tuber of. సం॥ కుముద, ధవళోత్పల, హిం॥ కుయీా, కుముద్. దీని రసము కషాయము లేక చూర్ణము వెగటుగా, రుచిగా నుండును. పైత్య శ్లేష్మములను హరించును. మిక్కిలి మేహహరమైనది. తెల్లకుసుమును పోగొట్టును. రసముయొక్క మోతాదు పూటకు 4-5 తులముల యెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులములయెత్తువరకు. చూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు పావలాయెత్తు వరకు.

తెల్లకాకరకాయ (పెద్దది) :—కాకరకాయ చూడుడు.

తెల్లకామంచి పూరి:—కామంచి పూరి చూడుడు.

తెల్లకురువేరు:— Lavendula Carnasa white variety. శీతపైత్యము, తాపము, వాంతి వీనిని హరించును. పైత్యజ్వరమువలన బుట్టిన విదాహమును, తాపమును బోగొట్టును.

తెల్లకోడి మాంసము:—Flesh of a white fowl. చమురు గలిగి రుచిగ నుండును. జఠరదీప్తిని, మిక్కిలి వీర్యవృద్ధిని, దేహపుష్టి, బలమును యిచ్చును. ఉష్ణము జేయును.

తెల్లగన్నేరు, ఎర్రగన్నేరు, వాడగన్నేరు:—Nerium Odorum. Eng. Sweet scented oleander white & red variety. సం॥ కరవీర, హయమారక, చండాతక, హిం॥ కనేర్. ఇవి సన్నపాటి ఆకులు గలిగి తెల్లని లేక యెర్రని పువ్వులు బూయును ఇవి ఈజాతి పువ్వులన్నియు పూజార్హమైనవి. వీని వేరునూరి నేతిలోగాని, నూనె లోగాని, ఉడికించినదిగాని, వేరుగంధముగాని, నూరినదిగాని

పైనపూయుటవలన కఠినమగు కుష్ఠులు, దురదలు, చర్మముపైన పొలుసులువలె కావడము, దద్దుర్లు, పొక్కులు, జంతువిషము, వంటి మీద చీరపేలు, పురుగులు, బొట్టు పెట్టుకొనుచోట పుట్టెడు దురద, పుండు, గజ్జి, చిడుము మొదలగు చర్మరోగముల బోగొట్టును. వేరును నేతిలో వేయించి ఆనెయ్యి లింగమునకు బూసిన వీర్యస్థంభన, లింగమునకు బలమును గలుగును. దీనివేరు చెక్క లేక ఆకు నూరికట్టిన గడ్డలు, కంతులు, తామర హరించును. ఆకుల కషాయము వెచ్చనిది పైనపోయుటవలన వాపులు హరించును. వేరురసము కండ్లలో వేసిన కండ్లవెంట నీరుకారు నేత్రరోగము మానును. దీని వేళ్ళు, పువ్వులు తినిన దారుణ విషమై చంపును. దీని విషచిహ్నములు నరముల బలహీనత, ముంతగుండె (heart) పని నిలిచిపోవడము అనగా నాడి కనుపడకుండడము గలుగును. దీనికి విరుగుళ్ళు 1 నీళ్ళతోనూరి తీసిన కరక్కాయల రసము లేక కషాయము, 2 కుంకుడుకాయలు కొట్టి నీళ్ళుపోసి పిసికి తీసిన రసము. తెల్లగన్నేరు, ఎఱ్ఱగన్నేరు చెట్లు ఒంటి రేకపువ్వులు పూచును. ఎఱ్ఱగన్నేరులో ఎఱ్ఱనిపువ్వులు పూచునవి; గులాబి, ఊదారంగు పువ్వులుపూచునవి రెండుజాతులు. వాడగన్నేరుచెట్టు గులాబిపువ్వుల రంగుగల ముద్దపువ్వులు పూయును. ఇవి అన్నియు ఒకజాతిచెట్లు. వీని గుణములు సమానముగావున యేజాతి చెట్టు అయినను పైన వ్రాయబడిన పనులకుపయోగించనగును. ఈపుష్పధారణము వలన, తలదురద, రక్తదోషమును హరించును. తలవెంట్రుకలకు బలమిచ్చును. పేనుకొరకడము మొదలగు దోషములను బోనణచును.

తెల్లగఱిక:—గరికచూడుడు.

తెల్లగలిజేరు, ఎఱ్ఱగలిజేరు, నల్లగలిజేరు:—Boerhavia Diffusa-white red & black varieties. B. Repens. సం॥ పునర్నవ, శోథఘ్ని

హిం॥ విషఖపరా. యీ మూడుజాతులలో తెల్లగలిజేరు శ్రేష్టము. వీని వేళ్ళు లేక ఆకురసము లేక సమూల కషాయము, చూర్ణము చిరిచేదు, వగరుగ నుండును. వేడిజేసి ఆర్చును. వాతము, కాస, శ్వాస, ఉదరరోగము, మూలవ్యాధి, ఉబ్బు, కామిల, జ్వరము, గుల్మము, పాండువు, హృద్రోగము, క్షయ, కార్జము ( liver ), తెల్లదబ్బ (Lungs ) వీనిలో పుండగురోగము,మందాగ్ని వీనిని హరించును. విరేచనము జేయును. హృదయము (heart) యొక్క బల హీనతవల్ల వచ్చిన ఉబ్బును, మూత్రపిండములను (kidneys) బాగు చేసి మూత్రము అధికపరచును. ఉబ్బును హరించును. విషమును హరించును. వీని ముదురువేళ్ళను పాలావిరిమీద వండి చూర్ణము జేసి ప్రాతఃకాలమందు బెల్లము, నెయ్యి గలిపి పుచ్చుకొనిన మూల వ్యాధి, ఋతురక్తబంధము, పాండురోగము, ఉదరము, శ్వాస, కఫము, వాతము, అరుచి, గుల్మము, అష్టశూలలు, ఉబ్బు వీనిని బోగొట్టును. ఒక మాసము సేవించిన కష్టరోగమును పోగొట్టును. చిక్కిలి ఆయుర్వృద్ధిని, ఆరోగ్యమును ఇచ్చును. దీని వేరు ఆవు నేతిలో నరగదీసి కండ్లకు అంజనము వేసిన పువ్వులును, తేనెతో నరగదీసి వేసిన కండ్లదురదలు, నీరుకారుట, ఎరుపులు బోవును. వీని వేరు నీళ్ళలోగాని, గోమయరసముతోగాని అరగదీసి కండ్లకుబెట్టిన తిమిరము, రేజీకటి నయమగును.దీని యాకురసము సుమారు 1తులము పెరుగులోగలిపి ఉదయం, సాయంకాలములు పుచ్చుకొని పెరుగు అన్నము వుప్పులేకుండ తినిన కామిలరోగము హరించును. యిటుల 3 దినములు చేయవలెను. దీని వేరు గంధము, మిరియం గంధము తీసి కండ్లకు కలికంవేసిన స్త్రీసంగమ దోషము హరించును.దీని ఆకు దంచి వెచ్చజేసి కట్టిన వృషణముల వాపును తగ్గించును. వీని ఆకు కూరవండి నేతిలోపొగిచి పుచ్చుకొనిన ఉబ్బు మొదలగు పైనజెప్పిన

రోగముల నణచును; ఆరోగులకు పథ్యముగ నుండును. గలిజేరు సమూల రసములో ఘాటు సారాయి (brandy) కలిపి పుచ్చు కొనిన కాళ్ళు చేతుల ఉబ్బులు, నొప్పులు, కడుపునొప్పి, విషము, వ్రణము వీనిని హరించును. చెడిపోయిన శ్లేష్మమును, పైత్యమును, రక్తమును బాగుపరచును, పొట్టను మృదువు పరచును. వీని ఆకు కూరకును, సారాయివలె కాచితీసిన. వీని అరకునకును ఇవే గుణములు. దీనిని యెక్కువ దినములు సేవించిన గొంతుకనొప్పి దెచ్చును. దీనికి విరుగుడు కాఫీ. సమూలరసపు మోతాదు పూటకు 2 మొదలు 4 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు. సమూలచూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు పావలా యెత్తుచొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. ఎఱ్ఱగలిజేరు, నల్లగలిజేరునకును ఇవేగుణములుగాని తెల్లగలిజేరునకు గుణమధికము. దీని ఆకులతో రసవర్గములు వేసి పెట్టిన వడియములు నేతిలో వేపుకొని తినిన గుల్మము, కఫము, కుష్ఠం, వుబ్బు, కామిలరోగులకు పథ్యముగ నుండును.

తెల్లగురివిందచెట్టు:—గులివిందచెట్టు చూడుడు.

తెల్లగులాబిపువ్వు:— గులాబీపువ్వులు చూడుడు.

తెల్లచంద్రచెట్టు:— చంద్రచెట్టు చూడుడు.

తెల్లచక్రకేళీపండు:—చక్రకేళీ అరటిపండు చూడుడు.

తెల్లచేమకూర:—Colocasia Antiquorum - White variety. రుచిగా నుండును. జఠరదీప్తి నిచ్చును. మేధస్సు నణచును. క్రిమి రోగములను, మూలవ్యాధిని, అరుచిని బోగొట్టును. వీర్యమునకు చలవజేయును. మలమూత్రములను విడిపించును.

తెల్లచిలకకూర:—చిలుకకూర చూడుడు.

తెల్ల చెరుకు:—White Sugarcane. చెరుకు చూడుడు.

తెల్లజిల్లేడు:—Asclepias Gigantea - white flowers of. సం॥ రాజార్క, శ్వేతార్క. హిం॥ సఫేద్ ఆక్, సఫేద్ మదార్. జిల్లేడు చెట్టును, తెల్లజిల్లేడు చెట్టును సమాన గుణములుగలవి. అయినను తెల్ల జిల్లేడుచెట్టు శ్లేష్మము. బలముగ పనిజేయును. కావున సాధ్యమయిన యెడల తెల్ల జిల్లేడుచెట్టు నుపయోగించవలెను. దీని నుపయోగించు విధములు, మోతాదులు, విరుగుళ్ళనుగూర్చి జిల్లేడు చెట్టు, జిల్లేడుపాలు, జిల్లేడుపువ్వులు చూడుడు.

తెల్లజొన్నలు:—Cholum white. జొన్నలు చూడుడు.

తెల్లతామరపువ్వు:— Nelum biunc Speciosum- Eng. white lotus. సం॥ పుండరక, శ్వేతపద్మం. హిం॥ సఫేద్ కమల. దీనిని ప్రపౌండరీక మందురు. దీని రసము లేక కషాయము తీపి, వగరు చేదు రుచులు గలిగియుండును. చలువ మేహశాంతి జేయును. కర్ణ, నేత్రరోగములను శాంతిపరచును. రక్తదోషము, రక్త పైత్యము, కఫము, పైత్యము, శ్రమ, శరీరతాపము, దాహము, జ్వరము వీనిని హరించును. వ్రణములను మాన్పును. స్ఫోటములను శాంతి పరచును. రసపు మోతాదు 1-2 తులముల యెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులములయెత్తువరకు. నాళములు, కింజల్కములు, బీజములయొక్క గుణము తెల్లకలువ చూడుడు.

తెల్లతామర, కింజల్క-ములు, నాళములు, బీజములు:— Anthers, films & seed of white Lotus. నాళములను సంస్కృతమున మృణాళ, పద్మనాళ, నళినీరుహా యనియు, బీజములను, పదబీజ, పద్మకర్కట, వికతిందుక అనియు నందురు. తెల్లకలువ చూడుడు.

తెల్లతుమ్మచెట్టు:—Rusty Memosa. దీని చెక్క, మద్దిచెక్క, శొంఠి వీని కషాయము 4-5 దినములు పుక్కిలించిన, కదిలిన పండ్లు, దంతములు ఘట్టిపడును. తెల్లతుమ్మచెక్క నీళ్ళతోనూరిన రసముదీసి పంచదారకలిపి యిచ్చిన కుసుమరోగములు మానును. పూటకు 2-3 తులములు.

తెల్లతెగడ:—Convolulus Turpethum. Ipomaea T. Eng. Indian jalap. China jalap. సం॥ త్రిపుట, త్రివృత్. హిం॥ నిశోత్, తిర్బత్. ఇది తెలుపు, ఎరుపు, నలుపు 3 జాతులు. తెలుపు శ్రేష్ఠము. దీనివేరు శుభ్రముగా కడిగి చితుకగొట్టి లోపలి వేరు తీసివైచి పైచెక్కను పాలు ఆవిరిపైన పుడకబెట్టి యెండించి వుపయోగించవలెను. ఇది కొద్ది తీపి, చేదు రుచులు గలిగియుండును. దీని చూర్ణముగాని, కషాయముగాని విరేచనకారి, విరేచనయోషధముగా వాడుదురు. మలదోషమును పోగొట్టును. క్రిమిరోగము, శ్లేష్మము, వాతము, ఉదరరోగము కఫపైత్యము, వాతపైత్యము, బల్లలు, గుల్మము, అష్టశూలలు, ఉబ్బు, పాండువు వీనిని హరించును; సుఖవిరేచనముల గావించును. మిక్కిలి ఉష్ణము, పైత్యము జేయును. దీనికి విరుగుడు తుమ్మచెక్క రసము లేక కషాయము. నల్లతెగడ, ఎర్రతెగడలకు ఇవే గుణములు. తెల్లతెగడ శ్రేష్ఠము. మోతాదు ౧ మొదలు 6 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2-1/2 మొ॥ 5 తులముల యెత్తు. విరేచనౌషధముగ పుచ్చుకొను మోతాదు 2 అ॥ మొ॥ 4 అ॥ యెత్తు వరకు. విరేచనములు అధికమైన చిన్నయెత్తు తుమ్మచిగురు చూర్ణము నీళ్ళతో యిచ్చేది. సీమతెగడ యను చైనా దేశపు తెగడ యొకటి కలదు. దీనికిని పై గుణములు కలిగియుండును. గాని యిది సౌమ్యముగ పనిచేయును. ఎర్రతెగడకు యివే గుణములుగాని తెల్లతెగడ శ్రేష్ఠము.

తెల్లదింతిన:—దింతిన చూడుడు.

తెల్లదబ్బకూర:—మేక తెల్లదబ్బ చూడుడు. (Lungs of gout)

తెల్లనేలములక:—నేలములక చూడుడు.

తెల్లపంచదార:—చీనాపంచదార చూడుడు.

తెల్లపురుగుడు:—Fluggea Leucopyrus. సం॥ రాజపర్ణీ, కాంభోజీ. హిం॥ కాంబోయీ. దీని పండ్లు తెల్లగనుండును. దీని వేరుచెక్క, లేక ఆకురసము, లేక కషాయము చేదుగ, వగరుగ నుండును; రక్తగ్రహణి, రక్తస్రావము వీనిని కట్టును; మేహము నణచును; వయస్సును నిలుపును; వీర్యమునకు బలమిచ్చును; కండ్లకలకలను బోగొట్టును. దీని వేరు చూర్ణము విరేచనములను కట్టును. దీని పచ్చిపుల్లతో 40 దినములు విడువకుండ దంతధావనము జేసిన ఇంద్రియ నష్టమును కట్టును. రసముయొక్క మోతాదు పూటకు 2 మొదలు 3 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు 3 అణాల యెత్తువరకు.

తెల్లబాడిదపు చెట్టు:—బాడిదపుచెట్టు చూడుడు.

తెల్లబరివెంక:— Srophis Aspera, Streblus Aspera - white variety. దీని ఆకులకషాయములో నూనె కలిపి పూసిన వ్రణములు మానును. దీని వేరుచెక్క కషాయముతో కండ్లు కడిగిన నేత్రరోగములు మానును; పుక్కిలించిన చిగుళ్ళకు బలము జేయును; లోపలికి పుచ్చుకొనిన మూత్రమును జారీచేయును. మోతాదు 3-4 తులములయెత్తు. ఈకషాయములో నూనెగలిపి చెవిలో బోసిన కర్ణవ్రణములు, చెముడు నిమ్మళించును. వేరుచెక్క మ్రానుచెక్క నీళ్ళలోవేసి కాచి స్నానముచేసిన కుష్ఠరోగము నిమ్మళించును; ఆనీళ్ళతో కడిగిన కాళ్ళు చేతులు నొప్పులు నయమగును.

తెల్ల బోడతరము:—Sphoranthus Indicus-white variety. సం॥ శ్రావణి, భిక్షు, ముండి. హిం॥ సఫేద్ ముండి. దీనికిని యితర బోడతరముల సుగుణములు గలవుగాని యిది మిక్కిలి శ్రేష్ఠము, దీని విత్తనములు అనుదినము ప్రాతఃకాలమందు 4-5 తులముల యెత్తు చొప్పున సమభాగము శర్కరలో ఒక సంవత్సరము పుచ్చుకొనిన యౌవనము గలుగును; తెల్ల వెంట్రుకలు నల్లనగును; దిన దినము శరీరబలము హెచ్చును. మరియు నీ చెట్టు పువ్వులు పూచి నప్పుడు తెచ్చి నీడను ఎండించి చూర్ణించి ఉదయమున గోధుమ పిండిలో గలిపి రొట్టెచేసి కాల్చి దానిని ఆవు నేతితోడను, పంచదారతోడను ఒక సంవత్సరము తినినను, లేదా యీ చెట్టువేళ్ళను, గుంటకలగర. వేళ్ళను నీడను యెండించి చూర్ణించి అందులో సమముగ పంచదార గలిపి వీనిని ఆవునేతిలో గలిపి యొక సంవత్సరము పుచ్చుకొనినను తెల్లని వెంట్రుకలు నల్లబడును. మిక్కిలి వీర్యవృద్ధి, బలము గలుగును. దీనిని సేవించిన వానితో సంగమము జేసిన స్త్రీలకు అతిసౌఖ్యము గాని దీనిని సేవించు కాలమున నీమములో వుండి నూనె, పులుసు, ఆవ, బచ్చలి స్త్రీ సంభోగము మొ॥ వర్జించవలెను విస్తారము కారమును, అధిక వ్యాయామమును వర్జించి వత్సస్నానపానములలో నీమముగ నుండవలెను. గోధుమ, పాలు, పండ్లు సేవించవచ్చును. సంతోషము గలుగును. దీనితో తామ్రము సువర్ణమగు నందురు. బోడతరము చూడుడు.

తెల్ల మద్దిచెట్టు:—Pentaptera Arjuna & Terminalia Glabra. సం॥ అర్జున, కకుభ, పార్థా. హిం॥ సఫేద్ కోహ్, సఫేద్ అర్జున్. దీని మ్రానుచెక్క చూర్ణము లేక కషాయము చలవ, మేహశాంతి జేయును; వ్రణములు, విదాహము, గుండప హృద్రోగము, జ్వరము నోటిపూత, పుండు నివృత్తించును. లేత ఆకురసము చెవిలో పిండిన

చెవినొప్పి హరించును. దీనికాయలు దేహములోని మలముల వెడలించును; ఋతురక్తమును జారీచేయును. ఆకురసము పూసిన ఆమవాతపు (Rheumatism) నొప్పులు హరించును; గాయములు, వ్రణములు శీఘ్రముగ మానును. దీని ఆకులభస్మము మానని మొండివ్రణములను మాన్పును. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు. చెక్కభస్మము తాంబూలములో సున్నమునకు మారుగ వాడిన కఫమును, గుల్మమును హరించును. యీ చెక్కతో అర్జునారిష్టము తయారుచేయుదురు.

తెల్లమిరియములు:—Piper Album. Eng. white pepper. సం॥ శ్వేతమరీచ, సితవల్లిజ. హిం॥ సఫేద్ మరిచ. ఇవి నల్ల మిరియములు నీళ్ళలో నానబెట్టి పైపొట్టు లేక పొరతీసినవి; కారముగ నుండును. ఉష్ణము జేయును. పొట్టకు బలము జేయును. విషమును హరించును. మూత్రమును జారీచేయును. ఆయురారోగ్యాభివృద్ధి నిచ్చును. వీనికిని నల్లమిరియముల గుణములు గలిగియుండునుగాని వానికంటె నివి సౌమ్యముగ పనిజేయును.

తెల్లములక:—నేలములక చూడుడు.

తెల్లమేకపాలు:—Milk of a white goat. కఫము జేయును. వాతమును హరించును. అపథ్యమైనది. దీనికి విరుగుడు మేకపాలు చూడుడు.

తెల్లలొద్దుగ:—లొద్దుగ చూడుడు.

తెల్లవట్టివేళ్ళు:—వట్టివేళ్ళు చూడుడు.

తెల్లనివస్త్రము:—White cloth. శుచిగా,ఆరోగ్యముగ మనోహరముగ నుండును. సమస్తదోషములను బోగొట్టును. సమశీతోష్ణము నిచ్చును.

తెల్ల వాకుడు:—వాకుడు చూడుడు.

తెల్ల వావిలి:—వావిలి చూడుడు.

తెల్లవుప్పి చెట్టు:—ఉప్పి చెట్టు చూడుడు.

తెల్ల వెంపలి చెట్టు:— వెంపలి చూడుడు.

తెల్ల సెనగలు:—White Bengal gram. వీర్యము యొక్క వేడిని అణచును. అనగా పుంస్త్వమును తగ్గించును. వాతమును వృద్ధి జేయును. రక్తమును బెంచును. కఫమును, పైత్యజ్వరమును హరించును.

తెల్లావుపాలు:—Milk of a white cow. ఆవుపాలు చూడుడు.

తెల్లావాలు:—White Mustard. సం॥ రాజసర్షప, సిద్ధార్థ. హిం॥ సఫేద్ రాయి. ఆవాలు చూడుడు.

తేగలు:—తాటితేగలు చూడుడు.

తేటగంజి:—Cunjee taken out while rice is undergoing boiling. అనగా చిట్టుడుకునీళ్ళు అన్నముడుకు చుండగ తీసిన గంజి మనోహరముగ, జీవాధారముగా నుండును. అనులోమ వాతమును, అగ్నిమాంద్యమును బోగొట్టును, జఠరదీప్తి నిచ్చును. రుచి బుట్టించును. విరేచనము గాపించును. తక్షణమె చెమట బుట్టించును. చెవులు గడియలు పడియుండడమును నివర్తింప జేయును. ధాతువులకు బలమిచ్చును. శ్రమ, బడలిక, విదాహము, దోషజ్వరము వీని నణచును; కండ్లకు మంచిది; క్రిమిని హరించును; చలవ, కఫము జేయును. దీనికి విరుగుళ్ళు 1 పుదీనా, 2 గులకందు.

తేనె:—Honey. సం॥ మాక్షిక, మధు, పుష్పరస, హిం॥ శహత్. శాస్త్రములలో తేనె అనేక నామములతోను, అనేక విధములైన పుష్పములనుండి, అనేక రకముల తేనెటీగలవలన పట్టినవి, రంగుభేధము, రుచిభేదము, గుణభేదములు, చిక్కన, పలచన భేదములతో వివరింపబడినవి. గాని పుష్పములను బట్టి రుచి,వర్ణము

గుణభేదములు గలిగియుండును. అనగా వేపపువ్వువలన పట్టిన తేనె చిరిచేదుగనుండి పైత్యశాంతి, మేహశాంతి జేయుచు. చింతపువ్వు నుండి పట్టిన తేనె వేడిజేయును. వాతహరముగ నుండును. గానుగ పువ్వునుండి పట్టిన తేనె త్రిదోషహరముగ నుండును. అడవులలో అనేక విధములగు పుష్పములనుండి పట్టినతేనె త్రిదోషహరముగ నుండును. ఈ తేనెలు, చిన్న పట్టుతేనె, పెద్దపట్టుతేనె, తొర్రతేనె, పుట్టతేనె అను 4 విధములు. చిన్నపట్టుతేనె శ్రేష్ఠము. పెద్దపట్టు తేనె కూడ మంచిదిగానే యుండును. తొర్రతేనె, పుట్టతేనె కొంచము గుణము తక్కువగ నుండును. తేనెను కాచకుండ ఉపయోగించగూడదు. కాచి దానిలోనుండు మైనము, మలినములు తీసిన గాని నిర్మలముగ నుండదు. నిలువయుండదు.

తేనెకాయువివరము:—తేనె 8 పాళ్ళు, నీళ్ళు 1 పాలు చేర్చి కాగు చున్నప్పుడు వీశకు 15 అణాలయెత్తు పసపుగుండగాని నేలవేముగాని చేర్చి, దానినుండి తెట్టెమైనము, జల్లి 1 గరిటెతో తీసివేయుచు నీరు యిగురువరకును కాచి, తేనె పాకము చూచుకొని దింపుకొనవలెను. చల్లారినవెనుక సన్నని శుభ్రమైన గుడ్డతో వొడబోసి, సీసాలో జాగ్రత్తపెట్టిన నిలవయుండును. గుణదోషముండదు.

తేనె, సామాన్యగుణము:—Honey generally. తియ్యగా కొద్ది పులుపు రుచులు గలిగియుండును. వేడిజేసి ఆర్చును. త్రిదోషహరమైనది; విరేచనకారి; బలముజేయును; పైత్యము సన్నిపాతములు, కడుపునొప్పి, ఎక్కిళ్ళు, వమనము, మూర్ఛ, క్రిమిరోగము, అనేక విధములగు గొప్ప విషదోషములు, దప్పి, చర్ది, రక్తపైత్యము, కుష్ఠు, ఊపిరిగొట్టునొప్పి, వాతము, శ్లేష్మము, దగ్గు, వగర్పులు, మేహము, అతిసారము, శీతపైత్యము, కఫము, పక్షవాతము వీనిని హరించును. నరములయొక్క మార్గములను విప్పును; దేహములోని దుష్టవస్తువులను దీసివేయును; శుభ్రపరచును; మూత్రరోగమును,

నేత్రరోగములను అణచును; మూత్రపు సంచిలోని రాతిని కరగించును; పొట్టకు, హృదయమునకు సత్తువచేయును; వ్రణముల మాన్పును; ఉష్ణశరీరులకు తలనొప్పి బుట్టించును; మిక్కిలి ఉష్ణము జేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 నీళ్ళు, 3 దానిమ్మకాయ, 4 నిమ్మకాయ, 5 నారింజకాయ, 6 ధనియములు. మోతాదు 4 మొదలు 8 అణాలయెత్తువరకు. తేనె, నెయ్యి సమముగ గలిపి త్రాగిన విషమయి చంపును. దీనికి విరుగుడు బట్టకాల్చిన మసి గలిపిన నీళ్ళు. తేనె కొద్దిగ బుచ్చుకొనిన విరేచనము కట్టును; అధికముగ బుచ్చుకొనిన విరేచనము జేయును. సుమారు తులమెత్తు తేనెను 3-4 తులములమెత్తు నీళ్ళలో కలిపి పుచ్చుకొనిన శీతదాహమణగును. ఇటుల వేసవికాలపు ఉదయపు పూటల బుచ్చుకొనిన మిక్కిలి సౌఖ్యముగ నుండును. పైనవ్రాసిన భాగముల వరుసను తేనెను వేడినీళ్ళలో కలిపి పుచ్చుకొనిన గుండెలనొప్పి, వికారము, ఊపిరిగొట్టునొప్పి, తాంబూలము మ్రింగినప్పుడు గలుగు గుండెనొప్పి (డొక్కపట్టుట) శీఘ్రముగ హరించును. పక్షవాతము వచ్చినవెంటనే సుమారు సోలెడుచొప్పున ప్రశస్తమైన తేనె 2-3 పర్యాయములు త్రాగించిన పక్షవాతమును ఆపును, తగ్గును.

తేనెక్రొత్తది:—Honey new. మధురముగ నుండును; ఉష్ణము, పైత్యముజేయును, కొద్దిగ శ్లేష్మమును హరించును, దేహపుష్టి; వీర్యపుష్టి నిచ్చును. కాచినగాని ఔషధోపయోగముగాదు.

తేనెతెట్టు:—Beehive. సం॥ మధుజ, మధూలిత. అనగా తేనెపట్టు. ఇది మృదువుగ, జిగటగ నుండును; వ్రణముల మాన్పును; విరిగిన ఎముకల నతుకుకొనజేయును; వాతము, కుష్ఠు, విసర్పి, రక్తదోషము వీనిని బోగొట్టును; దీనిని పైన పూయతగియుండును. దీని ధూపము పిశాచబాధను తొలగించును.

తేనెతోనలను భక్ష్యములు:—A sort of sweet meat. తేనె,పిండి,

పంచదార గలిపి చేసిన ఒకవిధమైన భక్ష్యము. శ్లేష్మమును హరించును; పైత్యముజేయును, వీర్యపుష్టిని, దేహపుష్టిని యిచ్చును.

తేనతో చేసిన మద్యము:—Liquor prepared from honey. వీర్యవృద్ధి, రక్తవృద్ధిచేయును. వేడిజేయును, కుష్ఠు,విషము, మేహము వీనిని హరించును. జఠరదీప్తి నిచ్చును. ఆరోగ్యమైనది.

తేనె పంచదార కలిపిన గుణము :—Honey mixed with sugar. తేనె పంచదార కలిపి పుచ్చుకొనిన అన్నిరోగములకును అనుకూలముగ నుండును. దాహమణచును. అతిసారరోగమును కట్టును.వీర్యవృద్ధి నిచ్చును. శ్రమను బోగొట్టును. ఔషధములకు అనుపానముగ వాడవచ్చును.

తేనె ప్రాతది:—Honey old. మేదస్సును, శ్లేష్మమును, ఆమమును, త్రిదోషములను హరించును. మనోవికాసత నిచ్చును. భోజనాత్పరమందు బుచ్చుకొనిన దేహపుష్టి జేయును. భోజనాత్పూర్వమందు బుచ్చుకొనిన దేహమును శుష్కింపజేయును. సామాన్య ఉష్ణమును బోగొట్టును. చర్దికిని, జ్వరమునకును అనుకూలించదు.

తేనె పుచ్చుకొనగూడనివారు:—Those who should not take honey. నూతనజ్వరము, ఉష్ణము, పైత్యమేహమువలన గలిగిన వమనము, విదాహము, మతిభ్రమ, శిరోరోగము వీనియందు తేనె పుచ్చుకొనదగదు.

తేయాకు:—Camellia Theifera. Eng. Tea plant. సం॥ చాహా. హిం॥ ఛాయ్, ఛా. దీనితో చేయబడిన తేలిక కషాయములో పాలు పంచదార కలిపినది ఉష్ణముజేసి అర్చును. దీనిని మితముగ బుచ్చుకొనిన ఆకలి బుట్టించును. జీర్ణము జేయును. చెమట బుట్టించును. నరములకు సత్తువజేయును. కాళ్లు చేతులు వణకెడు రోగమును హరించును. నిద్రబడలికను పోగొట్టును. బుద్ధికి, పుంస్త్వమునకు, పొట్టకు, ప్రాణమునకు బలమిచ్చును. సంతోషము కలుగజేయును,

దేహమునకు బలము జేయును; బడలికను పోగొట్టును; మూత్రము గావించును. విదాహము నణచును. జలుబు, తలనొప్పి నణచును. పొట్టలోని చెడ్డ శాకను తగ్గించును. వాతఅజీర్ణమును అణచును. శరీరపు రంగును బాగుచేయును. ఏయౌషధముతోనైన అనుపానముగ నిచ్చిన ఆ యౌషధమును బాగుగ శరీరమునకు వ్యాపింప జేయును. మనోవికాసత నిచ్చును. నోటి దుర్గంధమును పోగొట్టును. హృద్రోగము, ముసలితనము, వణకురోగము వీనిని దూరపరచును. విచారమును, బద్ధకమును పోగొట్టును. పాండురోగము, కామిర్లు, ఉబ్బు, మూలవ్యాధి, మూత్రబద్ధము, గురదాల (kidneys) నీరసము వీనిని పోగొట్టును. మార్గాయాసము నొందినవారు, విడువని జ్వరితులు, యెల్లప్పుడు దేహప్రయాస, బుద్ధిప్రయాస నొంది అలసినవారికిని మేలుజేయును. మనోహరముగ నుండును, రక్తములోని వేడిని తీసివేయును. ఎండిపోయిన లేక ఆరిపోయిన దేహము చెమటపట్టి మృదువుపడును. పోయిన జలము తిరిగి వచ్చును. నీడను కూర్చుని పనిచేయువారికి, తీర్పులు వ్రాయువారికి, కవీశ్వరులకు బుద్ధిసూక్ష్మత, ఊహాపోహలు బాగుగ కలుగును. దీని అమిత సేవవలన నిద్రపట్టక యుండును. నరముల చలనము ( Nervous agitation ) గలుగ జేయును. దీనిని పరగడుపున బుచ్చుకొనిన జబ్బుచేయును. ఉష్ణరోగమును బుట్టించును. గనుక భోజనాత్పరమందే పుచ్చుకొనతగియుండునని కొందరి మతము. మరియు కొందరు ఘనమైన ఆంగ్లేయ వైద్యుల అభిప్రాయప్రకారం తేయాకు అమితముగ బుచ్చుకొనిన వారికి నరముల సంబంధమైన చేతులు, కాళ్ళు, దేహము వీనియందు వణకు, దడ పుట్టునందురు. జీర్ణశక్తి, పుంస్త్వము తగ్గును. ప్రాణమునకు నిస్త్రాణ గలుగును. విషమజ్వరము (Typhus fever), ఉదరరోగము, పాండురోగము, ఉబ్బురోగము, విరేచనబద్ధము గలుగును. ఛలవ ప్రదేశములలో పుట్టినవారికిని, నివసించువారికిని, వాతశ్లేష్మ

తత్వములుగలవారికిని తేయాకుఅనుకూలించును.ఉష్ణప్రదేశములలో పుట్టినవారికిని, నివసించువారికిని, ఉష్ణపైత్య తత్వములు గలవారికిని ప్రతికూలించును. అసౌఖ్యముగ నుండును. తేయాకు తెలుపు, ఆకు పచ్చ, పొగరంగు, నల్లరంగు గలవి నాలుగు విధములు, వీనిలో తెల్లరంగుగలది శ్రేష్ఠమని కొందరి మతము.నల్లనిది శ్రేష్ఠమని కొందరి మతము. మోతాదు సుమారు 10 తులములయెత్తు (4 ఔన్సులు) వేడినీళ్ళలో 2 అణాలయెత్తు తేయాకువేసి తీసిన తేలికకషాయము, పాలు, పంచదార కలిపి ఒకసారిగాని రెండుసార్లుగాని పుచ్చుకొన దగియుండును. దీనివలన గలిగెడు దుర్గుణములకు విరుగుళ్ళు 1 సోపు, 2 పాలు, 3 పంచదార.

తేలుమణి చెట్టు:—Heliotropium. Indicum. Eng. Indian turnsole. Heliotrope. సం॥ హస్తిశుండి, శ్రీహస్తిని, ధూసర పత్రిక. హిం॥ హస్తిశుండి. దీనిని గురుగుచెట్టు అనియు అందురు. దీని వేరు లేక ఆకురసము లేక వేరుకషాయము శీతజ్వరము, తేలు విషము, వాతము, ఉబ్బురోగము, విదాహము, దగ్గు,మధుమేహము వీని నణచును. చిగుళ్ళనొప్పి, ముఖముమీది బొటిమలు వీనిని బోగొట్టును. కంటిరెప్పలు పుండగుదానిని, లేక పొక్కులు లేచెడు దానిని పైనపూయుటవలన మాన్పును. తెగి విడిపోయిన గాయ ముపైన వేసిన కలుసుకొని మానును.ఆకును ఆముదములోవేసి కాచి లేక వుడికించి ఆ యాముదమును తేలుకుట్టినచోట పూసి రుద్దిన విషము విరుగును. పిచ్చికుక్క కాటుపైన వేసిన విషము హరించి మానును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషా యపు మోతాదు 2½-5 తులముల యెత్తు.

తేలుమణిరాయి:—Bezour Oriental. ఇది మేకజాతి మృగముల పొట్టలోగాని; ఎద్దు, ఒంటె, అడవిపంది, కోతి మొదలగు కొన్ని

మృగముల పొట్టలోగాని, చేదతిత్తిలోగాని పుట్టును. చెమట బుట్టించును. విషమును, ఆటురోగమును నివృత్తించును. లోపలి కిచ్చు మోతాదు 3 మొదలు 6 గోధుమగింజలయెత్తు. ఈరాతిని పైన అంటించిన సర్పవిషము, తేలువిషము హరించును. దీనిని మిరియముల చూర్ణముతో నిచ్చిన మరికిజాడ్యము నివృత్తించును.

తైలగండూషము:—Gingelly oil-gargle of. ఉదయమున దంతధావనానంతరమందు మంచి నువ్వులనూనె నోటిలో కొంతసేపు పుంచి పుక్కిలించడమువలన ముఖరోగములు,మద్యపానము మొదలగువాని వలన గలిగిన దుర్గంధము, నోటిపూత, దంతముల చిగుళ్ళవెంబడి రక్తముపడడము వీనిని పోగొట్టును. దంతములకుపటుత్వమునిచ్చును. క్రిమిని, అరుచిని, కఫమును హరించును. కదలిన పండ్లు గట్టిపడును. జఠరదీప్తి నిచ్చును; రుచి బుట్టించును.

తైలాన్నము (అనగా అన్నములో నువ్వులనూనె కలుపుకొని తినుట):— (Boiled rice mixed with gingelly oil). నూనె గలిపిన అన్నము దేహోష్ణమును వృద్ధిజేయును. వాతమును హరించును. దేహముయొక్క అతిబలుపును దీసివైచి గట్టిపరచును. క్రొవ్వును గొట్టును. కాంతి నిచ్చును. మలబద్ధము జేయును. చర్మరోగమును బుట్టించును. పైత్యము, ఉష్ణము జేయును. మేహకారక శర్కరలకు హాని జేయును. దీనికి విరుగుడు కలిసిక్కు.

తైలాభ్యంగనము:—అభ్యంగనము చూడుడు.

తొండమాంసము:-ఊసరవెల్లి మాంసము చూడుడు,

తొగరచెట్టు:—Marenda Umbellata సం॥ ప్రసాదిని, అంబుపత్రి. దీనిని మోలుగచెట్టని, మోలుగుచెట్టని అందురు. దీని చెక్క యొక్క ఆకుర సము లేక కషాయము లేక వీని చూర్ణము కఫము, వాతము, సర్పి, కుష్టు. మేహము, వ్రణము వీనిని హరించును. అజీర్ణవికారము

ముల కట్టును. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తుల ముల యెత్తు. రసము 2-5 తులములయెత్తు. చూర్ణము 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు. దీని పండురసము, కషాయము దేహము లోని మలములను వెడలించును. ఋతుబద్ధమును విప్పును. మూత్ర కృచ్ఛ్రమునకు వీని కషాయములో కొద్దిగ సూరేకారము గలిపి యియ్యవలయును. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తుల ముల యెత్తువరకు. దీని కాయకూర, కఫము, వాతము, విసర్పి, గుల్మము. కుష్ఠు, మేహము, మూత్రకృచ్ఛ్రము వీనిని శమింప జేయును. అగ్నిమాంద్యము జేయును. దీని ఆకులు విస్తరలో భోజ నము మేహమును, కఫమును, వాతమును శమింపజేయును. విసర్పి మొదలగు చర్మరోగముల హరించును.

తొలిసూలు ఆవుపాలు:—ఆవుపాలు చూడుడు.

తోకమిరియములు:—చలవ మిరియములు చూడుడు.

తోటకూర:—కొయ్యతోటకూర, పెరుగుతోటకూర, ఎర్రతోటకూర, చిలకతోటకూర చూడుడు.

తోటలోని చప్పరము:—A canopy or pendal of Mango leaves. లేతమామిడి ఆకులతో వేయబడిన చప్పరము మిక్కిలి చలవజేయును. పైత్యమును హరించును. ఆహ్లాదకరముగ నుండును.

తోడేలుమాంసము:—Wolf's flesh. ఉబ్బు,మూత్రబద్ధము, గ్రహణి వీనికి పథ్యముగ నుండును. కఫమును హరించును.బలము నిచ్చును. వాతమును హరించును. అగ్నిదీప్తి నిచ్చును. దీనిమాంసము తిని, దీని చముకు మర్దనచేసిన పక్షవాతము హరించును.మిక్కిలి ఉష్ణము జేయును. దీనికి విరుగుడు బూరుగబంక లేక బూరుగ ఆకు.

తోపుచీర:—Red Black tint coloured cloth. అనగా ఎరుపు నలుపు కలిసినరంగు వస్త్రము వాతమును, కఫమును హరించును,

హేమంత శిశిర ఋతువులయం దనుకూలముగ నుండును.

తోయపిప్పలి:—బొక్కెన చెట్టు చూడుడు.

తోరమల్లిభస్మము:—Calx of false diamonds. విరేచనము జేయును.వాతము, శూలలు, త్రిదోషములవలన బుట్టిన రోగములను హరించును. మోతాదు 1-2 గురిగింజల యెత్తువరకు.

త్రికటుకము:—Pepper, dry ginger and long pepper. అనగా శొంఠి, పిప్పలి, మిరియములు. వీనిని త్రియూషమని యందురు. మిరియములు 1 పాలు, శొంఠి 2 పాళ్ళు, పిప్పళ్ళు 3 పాళ్ళు ఈమూటిచూర్ణము కఫము, క్రొవ్వు అనగా స్థౌల్యము, శ్వాస, కాస, గుల్మము, కుష్ఠు. గళరోగము, శ్లీపద మనగా ఏనుగుకాలురోగము, పీనస, జలుబు వీనిని హరించును. జఠరదీప్తినిచ్చును. ఉష్ణము జేయును. మోతాదు పూటకు 1 మొదలు 2 చిన్నముల యెత్తువరకు. వీటిని సమానభాగముగ జేర్చి వాడవచ్చును

త్రిజాతము :— Cardamoms, Cloves, leaves of Cassia Lignea or Cinnamon. అనగా ఏలకులు, లవంగములు, ఆకు పత్రికము లేక దాల్చినచెక్క. వీనిచూర్ణము దేహోష్ణము,జఠరదీప్తి వీని నిచ్చును. జీర్ణము జేయును. పైత్యశాంతి, మేహశాంతి జేయును. శ్లేష్మము నణచును. అరుచిని బోగొట్టును. మోతాదు పూటకు 1-2 అణాలయెత్తు.

త్రిఫలము:—Chebulic, Belleric and Emblic Myrobalans. అనగా కరక్కాయ,తాడికాయ, ఉసిరికాయ. కరక్కాయ 1 పాలు, తాడికాయలు 2 పాళ్ళు, ఉసిరికపప్పు 4 పాళ్ళు. వీని చూర్ణము సేవించిన నేత్రములను బాగుచేయును. శుక్లవృద్ధినిచ్చును. కఫపైత్యములను, కుష్ఠులను, జలుబులను, శిరోరోగములను, మధుమేహము, ప్రమేహము, మూలవ్యాధిని, మేహమును బోగొట్టును. మరియు నేయితోగాని, తేనెతోగాని, పంచదారతోగాని, బెల్లము, నూనె

సమముగా కలిపిగాని, ప్రాతఃకాలమందు బుచ్చుకొనిన సమస్తరోగ ములను హరించును. మోతాదు పూటకు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. వీనిని సమాభాగములుగను వాడుచున్నారు. ఈమూడు వస్తువులును విడివిడిగా చూర్ణించి తూచుకొని కలుపుకొనవలెను. త్రిఫలముల నీళ్ళతో నూరి రసము దీని కషాయము, తేనె గలిపి సేవించిన కామిలరోగము మానును. పూటకు 2-3 తులములు పుచ్చుకొనవలెను. మొదట వ్రాసిన పాళ్ళప్రకారం తయారుచేసిన త్రిఫలచూర్ణము రాత్రి పరుండబోవునపుడు నిత్యము శూల, మధు మేహ, ప్రమేహరోగులకు కొద్దిగ తేనె, 4 ఔన్సుల నీళ్ళు కలిపిన్నీ, కృశులకు తేనె, నెయ్యి కలిపిన్నీ సేవించుచుండిన విరేచనబద్ధమును లేకుండచేసి ఆరోగ్యము నిచ్చుచుండును.

త్రియాషకము:—త్రికటుకము చూడుడు.

త్రిసమము :— Compound of Chebulic Myrobalans. Dry ginger and jaggery. అనగా కరక్కాయ, శొంఠి, బెల్లము వీనిని సమముగ కలిపి ప్రాతఃకాలమందు సేవించిన అగ్నిమాంద్యము, వాతము, భ్రమ, పైత్యము, కఫము వీనిని బోగొట్టుటయేగాక కాయసిద్ధి నిచ్చును. మోతాదు 4 మొదలు 6 అణాల యెత్తువరకు.

త్రిసుగంధములు:— Compound of Cardamoms. Mace and Cinnamon. ఏలకులు, జాపత్రి, దాల్చినచెక్క వీని సముదాయ చూర్ణము మేహశాంతి, పైత్యశాంతి జేయును. జఠరదీప్తి, వీర్య వృద్ధి నిచ్చును. వాంతి, వికారముల నణచును. నోటికి ఆరోగ్యముగ నుండును. మోతాదు 2-3 అణాల యెత్తు.

—ద—

# ద

దండాహతమను చల్ల:—చల్ల చూడుడు.

దంతధావనము:— Cleaning teeth and washing face. ప్రాతః కాలమందె దంతధావనము చేయుటవలన పైత్యశ్లేష్మములను హరించును. నోటికి రుచి బుట్టించును. పరిశుభ్రపరచును. నేత్రములకు చలవ జేయును. దంతములకు నిర్మలత, దార్ఢ్యము గలిగించును. ముఖ శిరోరక్తనాడుల ననుకూలస్థితియందుంచును.

దంతధావనమున కనుకూలించెడుపుడకలు:—Sticks fit to be used in cleaning teeth. పాలు, ముండ్లు, చేదు, వగరు గలిగిన పుడకలు అనుకూలముగ నుండును. వీనిలో ఉత్తరేణి, రావి, మర్రి, జువ్వి, చంద్ర, అంకుడు, మద్ది, కానుగ, గిరిమల్లిక, బ్రరెంక, వేప, కడిమి, మారేడు, మేడి, మామిడి, దానిమ్మ, జాజి, దిరిసెన, సంపెంగ, వావిలి, నేపాళము, నేరేడు, ఊడుగ, తక్కోలము వీని పుల్లలతో దంతధావనము చేయుటవలన దంతిదార్ఢ్యము గలుగును. దంతరోగములను హరించును. రుచిబుట్టించును. సౌఖ్యము నిచ్చును. తుమ్మ, చింత, కంది మొదలగు ఇతరములయినవానితో దంతధావనము చేయుటవలన దంత వక్త్రరోగములు పుట్టును. అసౌఖ్యముగ నుండును.

దంతధావనము చేయకూడని వారు:—Those who should not clean teeth with stick. దంతములు, దవడలు, చిగుళ్ళు, పెదవులు వీనియందు వాపు పొక్కులు, నొప్పి గలవారును, ఎక్కిళ్ళు, వాంతి, తలనొప్పి, మూర్ఛ, శోష ఇవి గలవారును దంతధావనము చేయగూడదు. అనగా పుల్లతో పండ్లు తోమకూడదు. చూర్ణములతో చేయవచ్చును.

దధ్యన్నము, లేక దధ్యోదనము:—Boiled rice soaked in curd & seasoned. అనగా అన్నము అల్లము, మిరియములు, జీలకఱ్ఱ, ఇంగువ మొదలగు సంబారములతో పోగిచిన పెరుగులో కలిపినది. స్వాదుగా రుచిగానుండును. కఫమును, పైత్యమును. కలిగింప జేయును. వీర్యవృద్ధి, బలము జేయును. దేహపుష్టి నిచ్చును; నిద్రదెచ్చును. జ్వరమున్నప్పుడు పుచ్చుకొనగూడదు.

దర్భ:—Poa Cynosuroides. Eng. Sacrificial grass. సం॥ కుశ, దర్భ, యజ్ఞభూషణ. హిం॥ కుశా, డాభ. తెల్లదర్భ. నీలి వర్ణము నందు దర్భ, రెండుజాతులు. వీనివేళ్ళు, లేక ఆకుల రేకులు గడ్డి, రసము లేక కషాయము వగరు, తీపి రుచులు గలిగియుండును. బిగదీయును. (Astringent); వేళ్ళరసము లేక కషాయము దుష్ట వీర్యమును పోగొట్టును; పైత్యశ్లేష్మమువలన బుట్టినరోగముల హరించును; సవాయిరోగముల నివృత్తించును; మూత్రమును జారీ చేయును. వేరు చలి కషాయము రక్తముపడు మూలవ్యాధిని, శిశ్నము, యోని వీని లోని మంట, దురద మొదలగు వానిని పోగొట్టును; వేరు నూరి పెరుగుతో నిచ్చిన, యోని, శిశ్నము వీని వెంట కారు సెగ సంకటపు రసి (Gleet) కట్టును; ఆకురసము గాని, నూరినముద్దగాని, క్రొత్తగాయములకు, నరకులకు, వేసిన రక్తము కట్టి మానును. లోపలికిచ్చిన మూత్రమును జారీచేయును; ఉబ్బు (Dropsy), పురాణ నీళ్ళవిరేచనములు, రక్తగ్రహణి, రక్త వమనము రక్తస్రావము, వరుసజ్వరము వీనిని పోగొట్టును. ఆకురసము కండ్లలో పోసిన నీళ్ళుకారుట కట్టును. ఒంటికి పూసిన గజ్జి, చిడుము మానును; ముక్కులోపోసిన ముక్కువెంట రక్తముపడుట కట్టును. వేరు, ఆకు వీని రసముయొక్క మోతాదు పూటకు 2-8 తులముల మెత్తువరకు. చలికషాయపు మోతాదును అలాగునే యియ్య

వచ్చును. దీనిని పాలతో నియ్యవచ్చును. సెగరోగమునకు వేరు యిచ్చెడు మోతాదు 1 తు॥ యెత్తువరకు.

దవనము, పెద్దదవనము:—**Artemisia Vulgaris. A. Sieversiana Eng. Southern wood. larger variety.** సం॥ దమన, గంధోత్కట. హిం॥ దౌన్, దవనా, సువాసనగ, మనోహరముగ నుండును, చేదుగ, వగరుగ నుండును; శీతవీర్యముగలది; విషదోషమును పోగొట్టును; భూతభయమును నివర్తింపజేయును; త్రిదోషహరమైనది; దురద, కుష్ఠు, కఫవాతములు, రక్తదోషము, అపస్మారము, విస్ఫోటము, విసర్పి, పాండురోగము, హృద్రోగము వీనిని హరించును. దీని చూర్ణమును నూనెలో గలిపి స్నానానంతరము ఒంటికిబూసుకొనిన సువాసనగ, ఆరోగ్యముగ నుండును. వీర్యవృద్ధి నిచ్చును, దీనిని స్త్రీలు శిరస్సున ధరించుటవలన సువాసనగ మనోహరముగ నుండును. అంటువ్యాధుల దూరపరచును.

దశమూలి:—**Daedalacanthus Koscus.** దీని వేరును పాలలో వేసి ఆపాలు ఇచ్చిన కుసుమరోగము నివృత్తించును. చూలుతో నున్న పశువులకు దీనిని తినిపించిన కడుపులోని దూడ బాగుగ వృద్ధి బొందును.

దశమూలములు:—**Compound of ten roots.** అనగా మారేడు, దుందిలము, గుమ్ముడు, కలిగొట్టు, నెల్లి, ముయ్యాకుపొన్న, కోలపొన్న, వాకుడు, ములక, పల్లేరు అనునవి, వీని సముదాయ కషాయము సర్వజ్వరములు, సన్నిపాతము, శ్వాసకాసలు, వాత, పిత్త, శ్లేష్మదోషములు, శిరోరోగము, ఉబ్బు, అనాహము, అరుచి, పక్షవాతము, భ్రమ, దాహము, క్రిమి, వాతశ్లేష్మ దోషములతో గూడిన విషమజ్వరములను హరించును. దశమూల కషాయములో సైంధవలవణము, యవాక్షారము కలిపి సేవించిన శ్వాసకాసలు

హృద్రోగము, గుల్మము, శూల హరించును కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తు॥ యెత్తువరకు.

దక్షిణదిక్కుగాలి:—అష్టదిక్కులగాలి చూడుడు.

దానిమ్మచెట్టు:—Punica Granatum. Eng. Pomegranate tree. సం॥ దాడిమ, దంతబీజ, శుకవల్లభ. హిం॥ అనార్, దాడిమ, దాలీమ్. దీని మ్రానుచెక్క, వేరుచెక్క, ఆకు, మొగ్గ, పువ్వు, లేతకాయ, ముదురుకాయ, తొక్క వీనిరసము, చూర్ణము లేక కషాయము వగరుగ నుండును; బిగదీయును; గ్రహణి, రక్తగ్రహణి, నీళ్ళవిరేచనములు వీనిని కట్టును, వేరుచెక్క కషాయము క్రిమిని, ఏలిక పాములను, నారాపామును చంపును; ప్రసవానంతరము యోనిని సంకుచితపరచును; గ్రహణిని, రక్తగ్రహణిని, నీళ్ళవిరేచనములను కట్టును; పుక్కిలించిన నోటిపూత నిమ్మళించును. ఆకురసము లేక లేతకాయల రసము గ్రహణిని, రక్తగ్రహణిని కట్టును. పువ్వుల రసము లేక లేతఆకుల రసము 3-4 చుక్కలు ముక్కులో పోసిన ముక్కువెంట రక్తముపడుట కట్టును. లేతఆకులు గుప్పెడు తెచ్చి నూరి అందులో గచ్చకాయంత వెన్న, గచ్చకాయంత పటిక పంచదార చూర్ణము గలిపి గచ్చకాయలకంటె ఉరవుగా మాత్రలు చేసి పూటకొకటి చొప్పున సుమారు తులమెత్తు పెరుగు, పెరుగుతో దినమునకు 3 పూటల చొప్పున పుచ్చుకొనిన గ్రహణి, రక్త గ్రహణి కట్టును. కాయల తొక్కలు 5 తులముల యెత్తు ముప్పావుశేరు పాలలో వేసి నాల్గవవంతుగ ఇగరగాచి పుచ్చుకొనిన పురాణ రక్తగ్రహణి కట్టును. మొగ్గలచూర్ణము దగ్గు, గ్రహణి, నీళ్ళవిరేచనములు కట్టును. పచ్చిపువ్వులునూరి పండ్లకు పూసినచిగుళ్ళ వెంటరక్తముపడుటకట్టును. రసముయొక్క మోతాదు పూటకు 1 మొదలు 2½ తులముల యెత్తువరకు, కషాయపు

మోతాదు 2-3 తులములయెత్తు. చూర్ణపుమోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. 100 తులములయెత్తు నీళ్ళలో 5-6 తులముల యెత్తు పచ్చి వేరుచెక్కవేసి సుమారు 50 తులముల నీళ్ళు యుండు వరకు యిగరగాచి దానిని ఉదయము మొదలు అరగంట కొకసారి 2 తులములయెత్తు కషాయము చొప్పున అది అంతయు సరిపోవువరకు పుచ్చుకొనిన నాడాపాము దానంతట అదే పడి పోవును. లేదా మరునాడు ఉదయమున 2-3 తులములయెత్తు ఆముదము పుచ్చుకొనిన అది చచ్చి పడిపోవును. దానిమ్మకాయల పై చర్మము పచ్చిదిగాని, యెండించినదిగాని, రసముగాని, కషాయముగాని, యెండించినదాని చూర్ణముగాని, జఠరదీప్తినిచ్చును. అరుచి, గుల్మము, శూల, ప్రమేహము, గ్రహణి, అతిసారము, రక్తముపడు మూలవ్యాధి, పైత్యము, విదాహము వీని నణచును. వీర్యవృద్ధిచేయును. చూర్ణపు మోతాదు 1-2 అ॥ యెత్తు. కషాయపు మో॥ 2½ మొ॥ 5 తు. రసపు మో॥ 1-2 తులములు.

దానిమ్మపండు :— Pomegranate fruit-generally సామాన్యగుణములు; వాతమును. పైత్యమును, కఫమును, దుష్టరక్తమును హరించును; త్రిదోషహరమైనది; పొట్టకు బలము జేయును; ఆకలి పుట్టించును, తేలికనిచ్చును; శ్లేష్మతత్వము గలవారికి జబ్బుజేయును; జ్వరములో పుట్టిన విదాహము నణచును; నిక్కాక దేహులకు దీని రసములో కుంకుమపువ్వుగాని, పసుపుగాని కలిపి యిచ్చిన మేలు జేయును.

దానిమ్మపండుతియ్యనిది:— Pomegranate. fruit sweet. చలవజేసి నీరుపెంచును; గుండెలకు బలమిచ్చును; జీర్ణము గావించును; రుచి బుట్టించును, మేహమును గొట్టును; పైత్యశాంతి జేయును; రక్తగ్రహణి నణచును; పొట్టకు, హృదయమునకు బలము జేయును;

గుండెలలో వికారమును, నొప్పిని, దగ్గును హరించును; ఉష్ణతత్వము గలవారి పుంస్త్వమునకు బలమిచ్చును; కంఠస్వరమును బాగు చేయును; దేహపుష్టి, రక్తపుష్టి నిచ్చును; రక్తము శుభ్రపరచి కాంతినిచ్చును; భోజనాత్పరమందు బుచ్చుకొనిన అన్నమును జీర్ణము జేయును; జ్వరరోగులు పథ్యముపుచ్చుకొనిన తరువాత మితముగ పుచ్చుకొనుచుండిన మిక్కిలి ఆరోగ్యముగ నుండును.

దానిమ్మపండు పుల్లనిది:— Pomegranate fruit acid or sour. చలవజేసి వేడిజేయును; హృత్తికడుపుకు బలమిచ్చును; రుచి బుట్టించును; రక్తపైత్యమును హరించును. రక్తాతిసారమును, మేహమును గొట్టును. ఉష్ణదేహులకు అనుకూలముగ నుండును. విరేచన బద్ధముజేయును. ఈ పుల్లనిగింజలు మితముగ పుచ్చుకొనుచుండిన ఆరోగ్యము నిచ్చును.

దాల్చినిఅరకు:—Cinnamomum Zeylanicum - oil extracted of (Cinnamon oil) ఇది మిక్కిలి కారముగ, తియ్యగనుండును. వీర్యపుష్టి జేయును. వాతము, క్రిమిరోగము, శ్లేష్మము, దగ్గు, కడుపుబ్బు, అజీర్ణము, మందాగ్ని, శూల. ఎక్కిళ్ళు. చర్ది, దంత శూలలు, చిగుళ్ళవాపు వీని నణచును. పొట్టలోని వాతమును వెడలించును. మరియు దీనికి దాల్చిని చెక్కయొక్క సుగుణములు గలిగియుండును. మోతాదు 1–2 చుక్కలు తమలపాకుమీద వేసి నమలి మ్రింగవచ్చును. లేదా నీళ్ళలో వేసి పుచ్చుకొనవచ్చును. పుప్పిపంటికి దూదిని తడిపి పంటిపైన బెట్టవచ్చును. చిగుళ్ళవాపు నొప్పికి పైన బూయనగును. లేదా తమలపాకుపైన దీనిని పూసి ఆయాకు నమలి దానిని నొప్పిగల చిగుళ్ళపైబెట్టి యుంచినను నొప్పి, వాపు నయమగును.

దాల్చినిచెక్క:—Cinnamomum Zeylanicum. Eng. Cinnamon bark. సం॥ గుడత్వక్. వరాంగక. హిం॥ దాల్చిన్. దీని చూర్ణము, కషాయము నీళ్ళతోనూరి తీసినరసము సువాసనగలిగి వగరు, తీపి, కారపురుచులు గలది. వేడిజేసి అర్చును. మేహశాంతి జేయును. పొట్టలోని వాతమును వెడలించును. బిగదీయును. అజీర్ణము, కఫము, వాతము, పైత్యము, చర్ది, గుల్మము, శూల, దగ్గు, గ్రహణి, సంగ్రహణి, నీళ్ళవిరేచనములు వీనిని కట్టును. రక్తవమనము కట్టును. దేహముయొక్క అన్నిమార్గములను విప్పును. దేహములోని దుష్టవస్తుకూటమును కరగించును. అన్నివిషముల విరుచును. శిరస్సు, హృదయము (Heart) కార్జము (Liver), వీనిశక్తుల కాపాడును. కండ్లకు కాంతినిచ్చును. శిరోవాతము, ఉబ్బు (నజ్జు) వీని నణచును. మూత్రమును, రజోరక్తమును శుభ్రపరచును. జారీచేయును. శీఘ్రప్రసవము గావించును. ధాతుపుష్టి, బలము చేయును. పొట్ట, హృదయము, బుద్ధి (Brain) వీనికి వాతముచేత గలిగిన నీరసమును పోగొట్టును. బలము జేయును. గొంతుకలో గురగురమను శబ్దమును హరించును. గుండెలను శుభ్రపరచును. జీర్ణముజేయును. జలుబు, తలనొప్పికి, నరముల సంబంధపు తలనొప్పి (Neuralgic headache) కి, కణతలకు దీనిని నీళ్ళతో నూరిగాని, నీళ్ళతో గంధము తీసిగాని పట్టువేసిన నయమగును. ఫావుశేరు గుమ్మపాలలో పావుతులము దీని చూర్ణము వేసి కలిపి ఉదయపు పూటలను 15 దినములు పుచ్చుకొనిన వీర్యవృద్ధి జేయును. పుంస్త్వమును హెచ్చించును. దాల్చినిచెక్క అప్పుడప్పుడు నమలి ద్రవము మ్రింగుచుండినను, దీని నూనె కొద్దికొద్దిగ తమలపాకుమీద వేసి ఆకుతో నమలి తినుచుండినను బుతుబద్ధము మానును. దాల్చినిచెక్కను నీళ్ళతోనూరి రసముతీసి గరిటలో

నుడికించి గట్టిపడునప్పుడు అందులో కొద్దిగ పటికపంచదార చూర్ణము కలిపి అందులో కొద్దిగ ఆవునెయ్యి వేసి కలిపి దింపి పూటకు గోలీకాయంత చొప్పున దినమునకు రెండు పూటలను 2-3 దినములు పుచ్చుకొనిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. ఎరుపుగలిగి పలచనగ చుట్టచుట్టుకొనియుండు దాల్చినిచెక్క శ్లేష్మము. ఇది ఉష్ణతత్వము గలవారికిని, మూత్రపు సంచికిని, నడుమునకును నష్టము చేయును. దీనికి విరుగుళ్ళు 1 పంచదార, 2 బాదము జిగురు. చూర్ణపు మోతాదు 1 అ॥ మొ॥ 2 అ॥ మెత్తువరకు. దీనిని నీళ్ళతోనూరి తీసినరసముగాని, కషాయముగాని పైరోగములకు పనిచేయును. రసపు మోతాదు 1-2 తు॥ కషాయపు మోతాదు 2½ - 5 తు॥ దీనిని లవంగపట్టయని వాడుకలో అందురు గాని లవంగాలచెట్టు చక్కకాదు.

దామిలింతకూర:— Curry of the leaves of a garden herb. దీని ఆకుకూర సంగ్రహణి, పైత్యము, ప్రమేహము వీని నణచును; జఠరదీప్తి నిచ్చును.

దాసానిచెట్టు:—మందారచెట్టు చూడుడు.

దాసానిపువ్వము:—మందారపువ్వము చూడుడు.

దాళువాధాన్యము:—A sort of paddy. వీనిని గరికసన్నాలందురు. యివి రెండవపంట ధాన్యముగుటవలన వీని యన్నము రుచి, బలము తక్కువగానుండును. తేలికగా జీర్ణమగును. ఆరోగ్యము తక్కువగా నుండును. మరియు ధాన్యములు చూడుడు

దింతెన:—Clitorea Ternatea (white & black) సం॥ గిరికర్ణిక, అపరాజిత. హిం॥ కోయల్. దీనిని దింతెనయని, గంటెనయని యందురు. ఇదియొకతీగ. తెలుపు, నలుపు (ఛాయా) రెండుజాతులు. తెలుపు శ్రేష్ఠము. దీని వేరు, గింజలు వుపయోగింతురు. దీని వేరు

క్షారము, చేదు, వగరు రుచులు గలిగియుండును. దీని వేరురసము, కషాయము లేక చూర్ణము, విరేచనము జేయును. వాతమును హరించును. పైత్యము, కఫము, కుష్ఠు, శ్వేతకుష్ఠు, ఆమదోషము, గుల్మము, ఉదరము, శూల, ఉబ్బురోగము, క్రిమి వీనిని హరించును. జఠరదీప్తి నిచ్చును. శ్లేష్మవాతము, ఉన్మాదము, కాసశ్వాసలు, క్షయ వీనియందు బాగుగా పనిచేయును. దీని పుష్పములరసము కండ్లలోపిండిన నేత్రరోగములు హరించును. దీనివేరు గంధమును పాముకరచినచోట మర్దనచేసి కండ్లలోపిండి నూరినముద్ద సుమారు గచ్చకాయంత మ్రింగించిన పాముశిష.ము హరించును. దీని గింజలు మెత్తగా నీళ్ళలోనూరి పైప్రకార ముపయోగించిన పామువిషము హరించును. దీనిచూర్ణము 2 అణాలయెత్తు ౬ తులముల ఆవుపాలలో గలిపి ఉదయపుపూటల నిచ్చుచుండిన దారుణమగు ఉబ్బురోగమును, ఉదరరోగములను, నివృత్తించును. మిక్కిలి పథ్యముగా నుండవలెను. రసపుమోతాదు 1-2 తులములు, కషాయపు మోతాదు 2½ మొదలు ౬ తులములు ఎత్తువరకు. చూర్ణపు మోతాదు 1 మొదలు ౪ అణాల ఎత్తువరకు. దీనివేరు చూర్ణము చనుబాలలో గలిపిగాని, వేరురసముగాని లోపలికిచ్చిన బిడ్డలకు వాతము లేక అడుపువాతము (Crouh)న వికారపెట్టి వమనముజేసి శ్లేష్మము పడిపోయి వ్యాధి నయమగును. 2-3 ఏండ్ల బిడ్డలకిచ్చు మోతాదు ౬ చిన్నములయెత్తు. వమనమునకు విరుగుడు పుల్లనిచల్ల.

దివసరిధాన్యము:—A kind of paddy అనగా మూడున్నర మాసములకు పండు ధాన్యము. వీని అన్నము చవురుగలిగి రుచిగా నుండును. వాతపైత్యములను జయించును. మలమూత్రము గావించును. వీర్యపుష్టి, బలము జేయును. మరియు ధాన్యములుచూడుడు.

శిరిసెన చెట్టు:—Mimosa Sirissa, Albizzia Lebbek, Acacia Speciosa. Eng. Sirissa Tree. సం* శిరీష. మృదుపుష్ప. హిం* శిరిస్. దీని చెక్క, అకురసము చేదు, కొద్ది కారపురుచి గలిగి యుండును. వీని రసము లేక కషాయము వేడిచేయును. విషదోషము, స్త్రీసాంగత్య దోషము, చర్మరోగము, కుష్టు, దురద, శ్వాస, కాస, రక్తశ్లేష్మము వీనిని హరించును. తాళక, మణిశిలల దోషమును హరించును. దీని విత్తులు మూలవ్యాధిని, నీళ్ళవిరేచలములను కట్టును. దీని పువ్వులు గడ్డలను, పొక్కులను, వాపును, విషములనో హరించును. ఆకులు నేత్రరోగములనుహరించును. మ్రానుపట్ట కషాయము లోపలికిచ్చుచూ దీనిగంధము కరచినచోట వ్రాయుచుండిన ఎలుక, కందిరీగ. జెర్రి, తేలు, తేనెటీగ, తుమ్మెద, పామువిషములను హరించును. ఎండించిన చెక్క చూర్ణముతో పండ్లు తోము కొనిన వాపు, సలుపు, రక్తము. చీమువచ్చుట, పిప్పిపన్ను మొదలగు దంతరోగములను నివారణచేయును. వ్రణములపైన యీ చూర్ణము జల్లుచుండిన అందుండెడి క్రిములను జంపి మాన్పును. విత్తుల తైలము లోపలికి పుచ్చుకొనిన శ్వేతకుష్టు హరించును. మోతాదు అరతులమెత్తు మొదలు తులమెత్తునరకు. రసపు మో॥ 1-2 తులములు. కషాయపు మో॥ 2½ మొదలు 5 తు॥ల వరకు.

దీపము గుణము:—Lamp Light. చీకటిని పోగొట్టును. లక్ష్మీకరమై, మనోహరముగ నుండును. కాంతినిచ్చును. వాతముశమనచును. పైత్యము హెచ్చించును. భయమును పోగొట్టును.

దుండిలపు చెట్టు:—Bignonia Indica, Colosanthes Indica & Oroxylum Indicum. సం* శ్యోనాక, అరలు. హిం* అర్లు, సోనాపాట. దీనివేరు, చెక్క కషాయము, చేదుగ, కొద్ది వగరుగ, కారముగ నుండును, ఇది దశమూలములలో నొకటి. జఠరాగ్నిని

వృద్ధి బొందించును. జ్వరము, గుల్మము, మూలవ్యాధి, పొత్తికడుపున బుట్టెడు రోగములను, ఆమవాతము, క్రిమి; సన్నిపాతము, ఆమ వాతనొప్పులు, పిత్తము, శ్లేష్మము, అతిసారము, శ్వాస, కాస, అరుచిని జయించును. రసముయొక్క మోతాదు పూటకు 2-౩ తు॥ల యెత్తు. కషాయపు మోతాదు ౩౮ మొదలు 5 తు॥ల యెత్తు. దీని వేరుచూర్ణము ఆవునేతితో కలిపి యిచ్చుచుండిన స్త్రీలకు పాలుబడ జేయును. మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. దీని లేత కాయల కూర చిగుళ్ళకు రుచిబుట్టించును. పై రోగములలో పథ్యముగ నుండును. దీని లేతకాయలకూర పైనజెప్పిన రోగములమీద పనిజేయును. ఆరోగములకు పథ్యముగ నుండును.

దుంపరాష్ట్రిము:— Vanda Roxburghii & Cymbidium Tessaloides-larger variety. Eng. Galangal greater. సిం॥ రాస్నా, గంధనాకులీ. హిం॥ రాస్నా. ఇది దుంపరాష్ట్రిమని, సన్నదుంపరాష్ట్రిమని, కళింగరాష్ట్రిమని అందురు. యీకళింగరాష్ట్రిమునకు గుణమధికము. చేదు, కారము గలిగియుండును. వేడిజేయును. జ్వరము, శ్లేష్మము, శ్వాస, కాస, వాతము, జ్వరములు, సన్నిపాతము, ఆమవాతము, వాత మేహవాతనొప్పులు, ఉబ్బు, ఉదరము, మూలవ్యాధి, గుల్మము, విద్రధియను నాభియందుబుట్టెడు వ్రణము వీనిని జయించును. విరేచనము గావించును. కంఠస్వరమును బాగుచేయును. సమస్త వాతరోగములను పోగొట్టును. విషమును హరించును. అగ్నిమాంద్యమును పోగొట్టును. వీర్యపుష్టి జేయును. నరములకు సత్తువజేయును. దీని చూర్ణముగాని, కషాయముగాని తేనెతోగాని, నీళ్ళలోగాని తీసినగంధముగాని వాడనగును. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు ౩౮ మొదలు 5 తులముల యెత్తువరకు. గంధము 1-2 అణాల

మెత్తువరకు. నీని దుంపయు, కాల్చిన లవంగ మొగ్గలు, అక్కలకర్ర, యష్టిమధుకం యివి తేనెతోగాని, తమలపాకుల రసము, తేనె గలిపి గాని అరగదీసి యిచ్చిన చంటిబిడ్డల దగ్గు,శ్లేష్మము,డొక్కలుయెగర వేయుట మొదలగు వాతశ్లేష్మరోగములను హరించును. వీనినిపెద్దల కున్ను వాడదగియుండును. మరిన్ని దీనితో వాతశ్లేష్మహరమైన యౌషధములు నరగదీసి యిచ్చిన అమోఘముగ పనిజేయును.

దుంపలు సామాన్యగుణము:—Roots, edible generally. రుచిగ నుండును. దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి జేయును. క్షుత్తును నివారించును. గురుత్వముగ నుండును. శూల బుట్టించును. వాతము, శ్లేష్మము జేయును. వీనికివిరుగుళ్ళు 1 నెయ్యి, 2 బెల్లము, 3 పులుసు, 4 తమలపాకులు, 5 చంద్రచెక్కపొడి లేక కషాయము, 6 నువ్వు చెట్టుకాల్చి చేసిన క్షారము.

దుచ్చైనచెట్టు:—ఉత్తరేణిచెట్టు చూడుడు.

దున్నపోతు మాంసము:—Flesh of a he-buffalo. మిక్కిలి గురుత్వముగ నుండును. దేహపుష్టి, వీర్యపుష్టి నిచ్చును. శిరోపైత్యమును, రక్తపైత్యమును హరించును.

దుప్పిమాంసము:—Spotted deer-flesh of. చమురుగలిగి, మృదువుగ, రుచిగా నుండును. కొద్దిగ వేడిచేయును. దేహపుష్టి, వీర్యపుష్టి, బలము, అగ్నిదీప్తి,ఆయుర్వృద్ధి వీనినిచ్చును.ముదిమిని బోగొట్టును. గుల్మరోగము, విద్రధి యను నాభివ్రణము, శూల, వాతపిత్తములు, కఫము వీని నణచును. శీఘ్రముగ జీర్ణమగును. దీని తోకను విష ముండును.

దుప్పికొమ్ము:—Spotted Deer horn. దుప్పికొమ్ము గంధము తీసి పట్టువేసిననూ, యీగంధముతో శొంఠిగంధము, మంచిగంధము, రక్తచందనము, తవ్వగంధము అరగదీసి పట్టువేసిన వాత, మేహవాత

శొప్పులు, వాపులు, బాధలు హరించును. దుప్పికొమ్మును భస్మము చేసి వాడుదురు. దీనిని శృంగిభస్మమందురు. శృంగిభస్మముచూడుడు.

దువ్వెన చెట్టు:—తుత్తురిబెండ చూడుడు.

దుష్టపుతీగ:—Odina Wedier. Rhus odina. O. Pinnata. సం॥ జింగినీ, పయశ్యాయగ్మఫలా. హిం॥ జింగన్, జింగినీ దీనిని జుట్టుగ తీగనియు నందురు. పాలుండును. దీని వేరు, ఆకు లేక సమూలాల రసము లేక కషాయము, మిక్కిలి ఉష్ణము జేయును. గాఢవిరేచనము జేయును. ఆకలి బుట్టించును. పక్షవాతము, రుద్రవాతము (Apoplexy) మొదలగు ఘోరమైన వాతములు, ఉబ్బు, పాండువు, క్రిమిరోగము, యోనిశూల, చలిజ్వరము, వరుసజ్వరము, సర్ప, వృశ్చికవిషములు, ఉబ్బునపుదగ్గు వీనిని హరించును. దీని ఆకురసము 60 మొదలు 180 చుక్కలవరకు ఇచ్చిన బిడ్డల క్రిమిని, శ్లేష్మమును హరించును. దీనివేరు నూరి లోపలికిచ్చిన మిక్కిలి ఉష్ణము, గాఢ విరేచనము జేయును. దారుణ రుద్రవాతి, బిడ్డలకువచ్చు బాలపాప చిన్ని (Conbalsions) అను రోగము, పక్షవాతముల కియ్యదగు యుండును. దీనిమోతాదు 2 మొదలు 4 అణాలయెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములయెత్తువరకు. దీనివేరు గాని, ఆకుగాని సమూలముగాని నూరి పట్టిదిగాని నూనెలో ఉడికించి గాని కట్టిన దుష్టవ్రణములను, గాయములను శుభ్రపరచి మాన్పును. దీని వేరు రసముగాని ఆకురసముగాని లోపలికిచ్చిన గర్భస్రావమును గలుగజేయును. దీని ఆకురసము 1–2 తులములయెత్తులో నువ్వుల నూనె 5–7 లేక 9 చుక్కలువేసి ఉదయము పూటలను 3 లేక 4 దినములిచ్చిన చలిజ్వరము, వరుసజ్వరముకట్టును. సుమారు 2 తులముల నూనెలో, 1 లేక 1½ తులముల ఎత్తు ఆకురసము కలిపినదిఒక మోతాదు చొప్పున 5 లేక 7 ఉదయపుపూటల నిచ్చిన ఉబ్బు,

పాండురోగములు నివర్తించును; సమూలకషాయమిచ్చినను వీటిని నివర్తించును; దీనివేరు గంధముతీసి నేయికలిపి పూటకు అరతులము యెత్తు చొప్పున స్త్రీలు బహిష్టయిన 4 దినములు ప్రొద్దుటిపూటల నిచ్చి పెరుగన్నము పథ్యము పెట్టిన సంతానము లేనివారికి సంతానము గలుగును. దీని వేరు నీళ్ళతో గంధముతీసి కలికము వేసి కొద్దిగ (అరతులమెత్తుకు లోపుగ) లోపలికిచ్చిన సర్పవిషమును, కుట్టిన చోట గంధము వేసిన వృశ్చిక విషమును హరించును. దీని ఆకు పసరులో సున్నముగలిపి పైనపూసిన ఉబ్బు వాపు హరించును. దీని వేరు లేక ఆకురసము లోపలికిచ్చునపుడు రోగి దేహబలము రోగబలము యోచించి జాగ్రతగ వాడతగియుండును. దీనికాయల కూర చిరిచేదుగనుండును, వేడిజేయును; జఠరదీప్తినిచ్చును; క్రిమి, మూలవ్యాధి, గుల్మము, పాండువు వీనికి పథ్యముగనుండును.

దూదిపరుపు (ప్రత్తిమాది):—Bed made of cotton. సౌఖ్యముగ నుండును; దేహోష్ణమును నిలుపును. వాతమును పోగొట్టును; వర్షకాల, శీతకాలములయం దనుకూలముగ నుండును.

దూలగొండితీగ:—పెద్దదూలగొండి చూడుడు.

దూలగోవిలచెట్టు:—చిన్నదూలగొండి చూడుడు.

దూసరతీగ:—Coceulus Villosus. Marsilea Quadr folia. సం॥ వత్సాదనీ, పాతాళగరుడ. హిం॥ చిరహటా. దీనిని దుయ్యతీగ అనియు నందురు. దీని సమూలరసము లేక కషాయము పంచదారగాని, ఆవునెయ్యిగాని, చేర్చియిచ్చిన, వున్మాదము చిత్తభ్రమ తగ్గును. తీవ్రమైన పైత్యము, మూత్రకృచ్ఛ్రము, శగరోగము, మేహముహరించి దేహపుష్టినిచ్చును. చమట బుట్టించును. విరేచనకారి, చలవచేయును. రసపు మోతాదు 2-8 తులములు, కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తు॥. దీని సమూలకషాయములో ఆవుపాలు

గలిపి పుచ్చుకొనుచుండిన మధుమేహమును హరించును. దీని సమూల కషాయములో తగుమాత్రము మిరియాలచూర్ణము మేక పాలలో గలిపి (సుమారు 20 తు॥ యెత్తు) వుదయపుపూటలను పుచ్చుకొనుచుండిన వాత మేహవాత నొప్పులు హరించును. సుమారు 2-3 తు॥ యెత్తు దీని ఆకురసము 10 తు॥ యెత్తు నీళ్ళలో వేసిన గడ్డకట్టును. ఈగడ్డతీసి తగుమాత్రము పటికిబెల్లము చూర్ణముతో పుచ్చుకొనుచుండిన వెంటనే శగరోగముయొక్క బాధను నివారించి పోగొట్టును. దీని ఆకులకూర వండుకతినిన మేహశాంతి, పైత్య శాంతిచేయును. పై రోగములకు పథ్యముగనుండును.

దేవకాంచన వృక్షము:—కాంచన వృక్షము చూడుడు.

దేవచంద్ర:—చంద్ర చూడుడు.

దేవదాలితీగ:—Andropogon serratus. సం॥ దేవదాలి, జీమూతక. హిం॥ దేతారా. బందాల. దీనిని డావరడంగి యందురు. దీనివేరు కషాయము లేక దీనివేరురసము జ్వరము, కాస, శ్వాస, ఊపిరిగొట్టు నొప్పి, అరుచి వీనిని జయించును; ఉబ్బు, పాండువు, సర్పవిషము, విషప్రయోగము, వమనము వీనిని హరించును. కషాయపు మోతాదు 3-4 తులములయెత్తు. రసముయొక్క మోతాదు 1-2 తులముల యెత్తు.

దేవదారుచెట్టు:—A medical Small tree available in forests. సం॥ చంద్రదారు. ఇదియొక చిన్నచెట్టు. దీని ఆకులు గోరింతాకుల వలె చిన్నవిగను, దీనిపండ్లు పగడములవలెను వుండును. దీనిచెక్క, ఆకురసము లేక కషాయము చేదుగ నుండును; శీతపైత్యజ్వరము, శ్లేష్మవాతము, ఆమదోషము, క్రిమిని పోగొట్టును; ప్రమేహము, కుసుమరోగములు, వీనిని జయించును. దీని లేత ఆకులు, చిగుళ్ళు, చలవ, మేహశాంతి జేయును, వీనిని నలియగొట్టి నూనెలో

వేసి కాచి ఆనూనెతో తల యంటుకొనిన కండ్లకు చలవ జేయును. దీని మ్రానుచెక్క తేలిక కషాయము జ్వరమును బోగొట్టును; రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు, కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తువరకు నియ్యనగును.

దేవదారు దీని తైలము:—సరళ దేవదారు చూడుడు.

దేశవాళి గోంగూర:—గోంగూర చూడుడు.

దొండతీగ దీనికాయ:—Coccinia Indica, Momordica Monodelpha, cephalandra Indica. సం* రక్తఫలా, తుండికేరీ, కుందురుకే, పమా. హిం* కుందురు, కండారీ. యీతీగె తోటల లోను, కట్టవలమీాద లేచును. తెల్ల నిపువ్వులు పూయును. దీని కాయలు పొడవుగానుండి సారలుండును; చేదుగా నుండును; పండిన ఎర్రగానుండును, దీనిని చేదుదొండకాయఅందురు; దీని ఆకురసము పైత్యము, ఉబ్బు, పాండువు, క్షయ, మూలవ్యాధి వీనిని హరించును; దీని యాకునూరి పైనవేసికట్టిన లేక పూసిన మానని ఏవిష జంతువుయొక్క కాటువలన గలిగిన పుండునైనను, వ్రణమునైనను శీఘ్రముగ మాన్పును. వీనికాయలు పచ్చివి చేదుగానుండును; పండిన తియ్యగానుండును; కాయకూర చలవ, మందము, గురుత్వము జేయును; పైత్యము, రక్తస్రావము, వాతరోగము, శోభ, పాండువు, అపానవాతము, క్రిమిరోగము వీనిని హరించును; కఫము నణచును; వమనము జేయును; దీనికి విరుగుళ్ళు గుంటకందు ఉష్ణౌషధములు. దీని పచ్చికాయలు కుమ్ములోబెట్టి వుడికించి రసముతీసి ఆరసములో ముత్యం, పగడం, అక్కలకర్ర, సముద్రపుకొబ్బరి, చంగల్వకోష్టం, యష్టిమధుకం, శీతాంశురసం, సైంధవలవణం, అరగ

దీని సన్నిపాతములో జిహ్వాదోషమునకు 2 పర్యాయములు రా బంగారపుతీగెతో నాలుక గీసినయెడల జిహ్వాదోషము హరించును,

దొండపండు:—Fruit of do. గురుత్వము, శ్లేష్మము జేయును; కాస, శ్వాస, వమనము, వాతపైత్యములు, రక్తపైత్యము, కామిల వీని నణచును; అగ్నిమాంద్యము జేయును.

దొంతరగన్నేరు పుష్పములు:— Nerium Odorum - flowers of Oleander. వీని ధారణవలన శోష, దురద, కఫవాతములు వీని నణచును; తలత్రిప్పు మొదలగు శిరోరోగములను పోగొట్టును.

దొగ్గలికూర:—చిలకతోటకూర చూడుడు.

దోనెనీళ్ళు:—Fountain or Spring water. అనగా ధారనీరు నిర్మలముగ, లఘువుగ, రుచిగ, చల్లగనుండును; వీర్యవృద్ధి, జఠరదీప్తి నిచ్చును; సౌఖ్యమును, తృప్తిని కలుగజేయును; వాతపిత్తకఫముల నణచును; చలవజేయును, గాని యీ నీరు పుట్టుస్థలమును బట్టి గుణభేదములుండును; మన్యప్రదేశములు, లోయలలో పుట్టినవి జబ్బుచేయును.గనుక కాచి వడబోసుకుని వుపయోగించవలెను.

దోసకాయ:—Cucumis Sativus. Eng. Common Cucumber. సం* కర్కటి, త్రపుసా. హిం* ఖీరా. గురుత్వముగ నుండును; మూత్రమును విడిపించును; విరేచనబద్ధము జేయును; మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, మూలవ్యాధి, దాహము, రక్తపైత్యము వీనిని శమింపజేయును; చలవ,వాతము, అజీర్ణము, శ్లేష్మము,శూల, వీనిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 శొంఠి, 2 సోపు, 3 ఉప్పు, 4 తేనె, 5 పొంగించిన కానుగవిత్తులరసము, 6 వెర్రిపుచ్చవేరు రసము, 7 మిరియముల చూర్ణము. లేతకాయ పైత్యమును హరించును, బలము, వీర్యమునకు చలవ జేయును. ముదురుకాయ పైత్యము జేయును.

దోసపండు:—Fruit of do. చలువజేయును; మూత్రమును వెకలించును; శ్లేష్మవాతములను బుట్టించును; గురుత్వముగ నుండును; విరేచనము గావించును. దీనికి విరుగుడు గోధుమపిండి. మరియు దోసకాయ చూడుడు.

దోసవిత్తులు:—Seeds of do. వీని చూర్ణము రుచిగనుండును; మేహశాంతి, పైత్యశాంతి, బలము, వీర్యవృద్ధిజేయును; మూత్రకృచ్ఛ్రమును, కడుపులో పుండగు జ్వరము ( Typhus fever )ను, అతిమూత్రమును అణచును. వీని నూనెకును పైగుణములు కలిగియుండును; మోతాదు పూటకు 2 మొదలు 8 అణాలయెత్తువరకు; పంచదార చూర్ణమునకు సమముగ కలిపి పుచ్చుకొనవచ్చును.

దోసాకుకూర:—Curry of the leaves of do. రుచిగ నుండును; పైత్యమును హరించును మూత్రమును జారీచేయును.

దోసెలు:—అట్లు చూడుడు.

ద్రాక్షచెట్టునీడ:—Shade of Grapes tree. మనోహరముగ, హితవుగ నుండును; వీర్యవృద్ధిని, కాంతిని, బలమును ఇచ్చును.

ద్రాక్షపండ్లు (ఎండినవి):—Vitis Vinifera. Eng. Grapes. సం॥ ద్రాక్షా, మధుఫలా. హిం॥ అంగూర్, దాఖ్. వీనిని అంగూరు పండ్లనికూడ అందురు. చలువ, మేహశాంతి జేయును. తియ్యగ, పుల్లగ, వగరుగ, రుచిగనుండును; రుచినిబుట్టించును; రక్తపైత్యము జ్వరము, శ్వాస, దాహము, దోషజ్వరము, వాతపైత్యము, శ్లేష్మవాతము, శోష వీనిని పోగొట్టును. మందమును బుట్టించును. చర్ది, అరుచి నణచును. రక్తవృద్ధి, శుక్లవృద్ధి నిచ్చును. నేత్రములకు మేలుజేయును. మలమూత్రబద్ధమును విప్పును. అతిమూత్రమును పోగొట్టును. శుభ్రమైన రక్తము బుట్టించును. పొట్టను మృదువుపరచును. ఇతర ఫలహారములలో నన్నిటికంటె శ్రేష్టమైనది,

రక్తమును శుభ్రపరచును. మంచి ఆరోగ్యము నిచ్చును. గుండెలకు, గురదాలకు బలము చేయును. గింజలతో తినిన ప్రేగులు, పొట్ట, మూత్రపుసంచి వీనిలో పుట్టిన నొప్పిని అణచును. త్వరగా జీర్ణము గావించును. అమితముగ దినిన వాతమును, కడుపులో నొప్పి బుట్టించును. అగ్నిమాంద్యము, గురుత్వము, శ్లేష్మము చేయును దీని విరుగుడ్లు 1 సోపు 2 తుంగముస్తలు. ఈపండ్లతో ద్రాక్షారిష్టము, ద్రాక్షాసవము తయారు చేయుదురు. ఇవి మిక్కిలి ఔషధోపయోగముగా నైనవి. చక్కగ పనిచేయును.

ద్రాక్షపండ్లుపచ్చివి, నల్లనివి:—Green, Black or unripe grapes. పచ్చనివి పులుపు హెచ్చుగనుండును. నల్లనివి తియ్యగా నుండును తియ్యనివి త్వరగజీర్ణమగును. శరీరమునకు బలము పుష్టినిచ్చును. శుభ్రమైన రక్తమును బుట్టించును పుల్లనివి రుచి బుట్టించును. అగ్ని మాంద్యమును హరించును. బలము చేయును. జబ్బుపడి లేచినవారికి మిక్కిలి హితకరముగ పథ్యముగ నుండును. స్థైర్యమును, ఉష్ణమును కలుగ చేయును. దీని విరుగుడ్లు 1 గులకంద, 2 కరంజ ఓమము, 3 సోపు, 4 సికంజబీను.

ద్రాక్షపండ్ల సిరకా:—Grapes vinegar. పుల్లగ, రుచిగ నుండును. ఆకలి చేయును. స్థైర్యమును, వాతమును హరించును. కార్శ్యమును, పొట్టకు బలమిచ్చును. నీరసదేహులకు మంచిది, శ్లేష్మ దబ్బుకు పట్టుచేయును. దీని విరుగుడ్లు 1 గులకంద, 2 సోపు.

ద్రాక్షసారాయి:—Wine. అనగా ద్రాక్షపండ్లతోదీసిన సారాయము. రుచిగ, మనోహరముగ నుండును. బుద్ధిని హెచ్చించును. కొంచెము మత్తు చేయును. మనోవికాస మిచ్చును. గొప్పగ వేడి, గొప్పగ స్థైర్యము చేయును. హృద్య అనగా గుండెకొట్టుకొనుట, మూలవ్యాధి, వాతము, పాండురోగము, మేహము వీనిని శమనము చేయును. శరీర

పుష్టి, రక్తపుష్టి అగ్నిదీప్తిపీనినిచ్చును. పొట్టకుబలమును, హృదయమునకు మేలును జేయును. సంతోషమును, దేహసౌఖ్యమును యిచ్చును. బడలిక, నిస్త్రాణపడ్డవారికి మేలుజేయును.జ్వరితులకు మంచిది కాదు. కార్జము (liver) లో పుండయినవారికి విషతుల్యముగ నుండును.

—౦—

# ధ

ధనాసారిగోంగూర:—గోంగూర చూడుడు.

ధనియాలు:—Coriandrum Sativum-seeds of- Eng. Coriander seeds. సం॥ ధన్యాక, కుసుంబరీ. హిం॥ ధనియ. చలవజేసి ఆర్చును. తీపి, వగరు రుచులుగలిగి స్వాదుగ నుండును. వీని రసము, చూర్ణము లేక కషాయము తలతిప్పు, పైత్యవికారము, చర్ది, ఎక్కిళ్ళు, అరుచి, క్రిమి, విదాహము, జ్వరము, మేహము, అత్యుష్ణము, తరుణజ్వరము, కడుపులోమంట, తాపము వీనిని హరించును. సంతోషమిచ్చును. చెమట బుట్టించును. పొట్టలోని వాతమును తలకెక్కనియ్యదు. ఆకలి బుట్టించును. ఉష్ణముచేత హృదయము (heart)న బుట్టిన జబ్బును తీసివేయును. విరేచనమును కట్టును. పొట్టకు బలమిచ్చును. నిద్ర దెచ్చును. మూత్రమువెంట పడెడు ఇంద్రియమును కట్టును. వీనిని నీళ్ళతో నూరి పట్టువేసిన కాక, తలనొప్పి నణచును. వట్టివి విస్తరించి పుచ్చుకొనిన వీర్యమునకు నష్టము జేయును. ఉబ్బసరోగమును, బుద్ధిమాంద్యమును, పరాకును దెచ్చును. మూత్రమెక్కువ జేయును. దీనికి విరుగుళ్ళు 1 దాల్చినచెక్క, 2 వేపిన కోడిగ్రుడ్డు, 3 తేనె, 4 లవంగములు. దీనిరసపు (నీళ్ళుపోసి నూరి తీసినది) మోతాదు 2-3 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు.కషాయపుమోతాదు

2½ మొదలు 5 తులముల యెత్తువరకు. వట్టివి తినెడు మోతాదు చేడెత్తు మొదలు పావలాయెత్తువరకు. మరియు పచ్చి ధనియములు చేదుగ, మధురముగ నుండును. మూత్రమును అధికపరచును. పైత్యమును హరించును. ధనియాలు నేతిలోగాని, నూనెలోగాని వేపి అందు తగుమాత్రము కారము ఉప్పు కలిపి పొడుముచేసి పుచుకుని అన్నములో కలిపి పుచ్చుకొనుచుండిన అజీర్ణము, అజీర్ణవిరేచనములు కట్టును; జ్వరపడి లేచినవారు, ప్రసవస్త్రీలును వాడిన అనుకూలముగ నుండును.

ధాన్యములు:—Paddy. అనగా వరిపంట ధాన్యములు లేక వడ్లు; ఇవి సాధారణముగా తెలుపుగలసిన పసుపురంగుగనుండును; కొన్ని ఎరుపు వాటుగను, కొన్ని నలుపువాటుగ నుండును; కొన్ని సన్నముగ, లావుగా, పొడవుగా, పొట్టిగనుండు అనేకవిధములైన ధాన్యములు వేరువేరు పేర్లుగలిగియున్నవి; వీనిలో కొండలమీదను, కొండలోయలలో పండించునవి, మెరకభూములలో పండించునవి, చెరువులక్రింద పండించునవి, ఏటికాలువలవలన సాగుచేసి పండించునవి, నదులకు ఆనకట్టలుకట్టి ఆనీటి కాలువలవలన సాగుచేసి పండించునవి గలవు. యీ ధాన్యములు 8 విధములుగ విభజించడమైనది.

1. కొండలమీదను, కొండప్రాంతములు, కొండలోయలలోను ఎదచల్లి పండించు ధాన్యములు మిక్కిలి సన్నముగ నుండును; వీని బియ్యముతో వండిన యన్నము చమురుగలిగి, రుచిగానుండును; సున్నిత దేహులకు అనుకూలముగ నుండును; యీ ధాన్యము మిక్కిలి శ్రేష్ఠము.

2. మెరక లేక మెట్టభూములయందు ఎదచల్లి పండించు బుడమ, జిలను ఎరడాము మొదలగు ధాన్యములు చమురుగలిగి రుచిగా నుండును. గాని కొంచము మోటుగ నుండును; బలమైన పనులు జేయువారికి

అనుకూలముగ నుండును. యీ ధాన్యములుకూడ శ్రేష్టమైనవి. బలము, పుష్టి, ఆరోగ్యకరము.

3. చెరువులక్రింద, వాగులు లేక ఏటికాలువల ఆధారమున పండించు ధాన్యములు. సంవత్సరమునకు ఒకేపంట యగుటవలన రుచికరముగ బలకరముగ నుండును గనుక శ్రేష్టముగానే యుండును.

4. డెల్టా భూములలో సంవత్సరమునకు ఒకేపంట; బలమైన భూము లలో పండించు ధాన్యములు బలకరముగ, రుచికరముగ నుండునుగాని పైవానికి పోలవు.

5. కాలువలక్రింద బలమైన భూములలో పండించు ధాన్యములు. యీ భూములలో రెండవపంట పండించెదరు గనుక పైవానియంత బల కరము, రుచికరముగ నుండవు.

6. కాలువలక్రింద భూములలో సముద్రమునకు దగ్గరగా నుండు భూములు, పర్రలలో పండించు ధాన్యములు రుచి, బలము తక్కు వగనుండి గుణహీనముగ నుండును.

7. 3-4 మాసములకు పండించు రసంగి, బసంగి, రెండవపంట పండించు ధాళ్వాధాన్యము (గరికిసన్నములు) కూడా రుచి, బలముతక్కువగా నుండును గనుక గుణము, రుచి తక్కువగా నుండును.

8. బాసుమతీ మొదలగు వడ్లు పొట్టివిగా నుండును. ఈ జాతులలో కొన్ని సన్నముగ పొడవుగా నుండును. యీ జాతుల బియ్యము, అన్నముకూడ సువాసనగలిగి యుండును. యీబియ్యముతో పులా వులు, క్షీరాన్నము, కేసరీబాతు, శర్కరపొంగలి మొదలగునవి చేయు దురు. మంచి సువాసన, మిక్కిలి రుచిగ, మనోహరముగా నుండి బలము, పుష్టి, వీర్యవృద్ధి నిచ్చుటయేగాక మంచి ఆరోగ్యముగ నుండును. మన దేశములోని ధాన్యములు ముదుగులు, సన్నములు, మిక్కిలి సన్నములు అనేకరకములు గలవు. ముదుగులు, అక్కుళ్ళు,

కొణామణి, బుడమ, జిలమ, ఎరడాము మొదలగునవి. సన్నములు- కిచిడి, కృష్ణకాటుకలు, ఆట్రగడ, సన్నాటఱిగడ మొదలగునవి. చిక్కిలి సన్నములు- జీలకఱ్రసన్నాలు, ఢిల్లీభోగాలు, జయపూరు సన్నాలు, వంకసన్నాలు, రాజనాలు, బాసుమతి మొదలగు ధాన్యములు అనేకరకములు గలవు. ముదుగులు ఆలశ్యముగ జీర్ణమగును, పండిన భూములనుబట్టి గుణము గలిగియుండును. ప్రతివారియొక్క శరీరతత్వము, బలాబలములు, దేహారోగ్యము, జీర్ణశక్తి ననుసరించి పైనవ్రాసిన ధాన్యములయొక్క బియ్యములను వండి భుజించుట శ్రేయస్కరము. పండిన 4 మాసములయిన తరువాత నుపయోగించిన జబ్బుచేయకుండ వుండును. సంవత్సరమైన తర్వాత ఆబియ్యము రోగులకు, జబ్బుపడిలేచినవారికి, బాలింతలకు ఉపయోగించవచ్చును. దంపినబియ్యము తెల్లగకాక కొంచము తవుడురేఖగలిగినవి నుపయోగించుట ఆరోగ్యకరము. మిల్లులలో నాడించుబియ్యము అంత ఆరోగ్యముగా నుండవు.

ధారాగృహము:—Remaining in a house containing artificial springs or jets of water. దీనిలోనుండిన చలవ, మేహశాంతి జేయును. నిద్రదెచ్చును. ఎండకాలములో ననుకూలముగ నుండును, మేహఉష్ణ శరీరులకు మాత్రము సరిపడును.

ధారోదకము:—దొనసీళ్ళు చూడుడు.

ధారోష్ణాలు:—Cow milk just drawn. అనగా గోవూష్ణధారలు. (అప్పుడు పితికిన గుమ్మపాలు) అమృతతుల్యముగ నుండును. గర్భములోని తాపమణచును. వీర్యపుష్టి జేయును. వాతమును, పైత్యమును శమింపజేయును. శరీరము ఎండిన లేక శుష్కించినవాండ్రకు దేహపుష్టి, బలము జేయును. పాండువు, కామిల రోగములను మాన్పును. సర్వేంద్రియములకు బలమిచ్చును. రక్తపుష్టి జేయును. జఠరాగ్నిని వృద్ధిబొందించును. మూత్రకృచ్ఛ్రము, పురాణ జ్వరము,

మేహపైత్యము, మేహరోగములను, రక్తపైత్యమును, దేహము, పాదములు, చేతులు, కండ్లు వీనియందుండెడు తాపమును అణచును. మిరియపుపొడి, శర్కరగలిపి పుచ్చుకొన దగియుండును. ఉష్ణధారలు చల్లారినవెనుక బుచ్చుకొనిన త్రిదోషముల జేయును. చతుర్విధ ధారోష్ణాలు చూడుడు.

ధావళీ గుణము:—A coarse woollen cloth-wearing of. దీనిని ధరించుటవలన వాతమును శ్లేష్మమును పైత్యమును వృద్ధి బొందించును. చెమట బుట్టించును. కొద్దిగ దాహమును పుట్టించును. శ్వాస, శూల వీనిని శమింపజేయును; సదా శుచిగ నుండును.

ధూపదవృక్షము దీనిజిగురు అనగా అరపూస:—Veteria Indica. V. Malabarica-white dammer. Indian cohel tree- its resin. హిం॥ సఫేద్ డామర్. ఇది యెల్లప్పుడు పచ్చగనుండెడి పెద్ద వృక్షము. యీచెట్టుకు నాట్లువేసిన జిగురువచ్చును. దీనిని అరపూస యందురు. దీనితో వార్నీసులు చేయుదురు. యీ జిగురు వెలిగించిన దీపమువలె వెలుగును.సువాసనగలిగి కొద్దిపొగమాత్రము వచ్చును. దీని నూనెలలోకలిపి వండి పలాస్త్రీలు తయారుచేసి వేసిన కురుపులు, వ్రణములు మానును. దీనిపండ్లనుండి తీసిన తైలము రాసిన వాత మేహవాతనొప్పులు, శరీరమందు పోట్లు నయమగును. అరపూస మెత్తగానూరి దెబ్బతగిలిన గాయములో వేసి దానిమీద కొంచము కిరసనాయిలువేసిన రక్తము కట్టును.గాయము చీముపట్టకుండ మానును.

ధూమము:—Inhaling incense or smoke of offering by fire. దేవతాప్రీతికొరకు జేసెడు హోమధూమము, సాంబ్రాణి, గుగ్గిలము మొదలగువాని ధూపధూమము ఆరోగ్యమును, ఆయుర్వృద్ధి నిచ్చును. ఈధూమమువలన స్ఫోటకము, పొంగులు, యితర దుర్గం

ధ స్తలములయందు వేయుచుండిన దోషములను నివృత్తించును. మరియు దోమలు మొదలగు క్రిములను చంపును. రానివ్వకుండ జేయును. తదితరములైన ధూమములు అనగా గోళ్ళు, వెంట్రుకలు, శవములు మొదలగువాని ధూమములు కాసరోగమును, నేత్రరోగ మును ప్రకోపింపజేయును. ఆయుక్షీణము గలిగించి అనారోగ్యముగ నుండును.

—౦—

# న

నంది వర్ధనము:— Tabernaemontana Coronaria - Ceylon jasmine. సం* నంద్యావర్త, నందివర్ధన, తగర. హిం* తగర్, ఛడ్ని. యీ చెట్లను దొడ్లలోను, పుష్పవనములలోను పెంచుదురు. యివి రెండుజాతులు. ముద్దపుష్పము, రేకపుష్పములు పూయును. మంచి సువాసనగలిగియుండును. పూజార్హమైనవి. వంటిరేకపువ్వు లను గరుడవర్ధనమని యందురు. దీనియాకు కట్టిన రక్తదోషము, శిరోరోగము, నేత్రరోగము వీనిని హరించును. కఫవాతముల జేయును. దీని పండుటాకుల రసమును కండ్లలో వేసిన కలకలు మానును. దీని పువ్వులను కండ్లకద్దుకొనిన చలవజేయును. యీ పువ్వులరసము కండ్లలో వేసిన, లేక రాత్రి పరుండబోవునపుడు కండ్లకువేసి కట్టినను కండ్లకలకలు, ఎర్రబడుట, కండ్లమంటలు మొదలగునవి మానును. మేలుజేయును.

నందివృక్షము:— Cetrela Toona, Eng. Indian Mahagamy tree! సం* నందివృక్ష, తూణీ. హిం* తూన్, తూన, ఇదియొక పెద్ద వృక్షము. హిమాలయా ప్రాంతములలో పెరుగును. దీని ఆకు నిమ్మ ఆకులబోలి తెలుపురంగు చిన్నపువ్వులు పూయును. దీనికర్ర గట్టిది.

దీనిలోచేర్చిన సామానులు గట్టిగా,నునుపుగా అందముగానుండును. ఇది తిక్త, కటు, కషాయ రసములుగలది. దీని చెక్కరసము లేక కషాయము శేలిక నిచ్చును. ఉష్ణము జేయును. విషమును హరించును. వాతపిత్త శ్లేష్మముల ప్రకోపము నణచును. శుక్లవృద్ధి చేయును. దురద, కుష్ఠు, శ్వేతకుష్ఠు వీనిని బోగొట్టును రక్త దోషము, చర్మరోగములను, స్త్రీసంగమదోషము గ్రహణిని హరించును. రసముయొక్క మోతాదు 2-4 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½-5 తులముల యెత్తు.

నకచినిని:—ముక్కుతుమ్మిడితీగె చూడుడు.

నక్కదోస దీని కాయ:— Cucumis Utilissimus, C. melo. Eng. A smaller variety of Cucumber largerly cultivated in Kistna & Guntur Districts. సం* కంకటి, లోమశీ. హిం* కకిడీ. ఈదోసకాయ చిన్నదిగను,పుల్లగనుండును. ఇది పథ్యకరమైనది. జ్వరము మొదలగు కారణములచేత గలిగెడి అరుచిని పోగొట్టును. చలవజేయును. విరేచనము, మూత్రము గావించును. శ్లేష్మవాతముల ప్రకోపింప జేయును. గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు దోసకాయ చూడుడు. ఈకాయలు ఊరుగాయలుగ పెట్టుకొని ఉపయోగింతురు. దీని ఆకులరసము చేదుగా నుండును. విరేచనము జేయును. పైత్యము, గుల్మము, ఉదరము, శ్లేష్మము, క్రిమి, కుష్ఠు, జ్వరము హరించును. రసముయొక్క మోతాదు 2 మొదలు 4 తులముల వరకు.

నక్కపుట్ట చెట్టు:—Justicia Procumbens. దీనిని నక్కపీతిరి చెట్టు అనియు అందురు. ఈచెట్టు 2-3 అడుగులకంటె ఎక్కువ యెదుగదు. దీని పువ్వులు గులాబిరంగు గలిగియుండును. దీని ఆకులరసము కండ్లలోపిండిన కండ్లకలకలు మానును.

నక్కపెంటికె చెట్టు:—A medicinal plant. ఇది భూమి పంటియుండును; చెట్టుమొదట కంతులవలె లేచును. దీనిని నక్కపీలాకు అందురు దీని సమూలము ఎండించి కాల్చి వెన్నలోగాని, నూనెలోగాని వేపనూనెలోగాని కలిపి పట్టించిన బిడ్డలకు కాళ్ళమీదను, చేతులమీదను అగు కరపాణికరపులు, గజ్జికురుపులు మానును.

నక్కమాంసము:—Jakal-flesh of. కారముగ నుండును; త్రిదోషహారమైనది; వాతమును గంధర్వరోగమును తీయు, పోగొట్టును; దేహపుష్టి, బలము జేయును; ఉబ్బు, మలమూత్రబద్ధము, మూలవ్యాధి, గ్రహణి వీనికి పథ్యముగ నుండును. దీని చర్మధూపము పిశాచబాధను నివర్తింపజేయును; దీని మాంసము వలన గలిగిన అజీర్ణమునకు విరుగుడు నువ్వులనూనె. దీని మాంసమును నూనెలో వేసి వండి ఆనూనె పడుమునకు బూసిన రక్తముపడెడు మూలవ్యాధి నిర్మూలించును.

నక్కవిరిగిపండు:—Fruit of certain jungle tree. వెగటుగ, కటుగ గురుత్వముగా నుండును; వేడిజేయును. పైత్యమును, మేహమును సంగ్రహణి రోగమును బుట్టించును. దీనికి విరుగుడు సజ్జాతైలము.

నక్కెరచెట్టు:— Cardia Myxa & C. Latifolia- Eng.-Sebesten tree- సం॥ శ్లేష్మాంతిక, శేలు. హిం॥ లసోరా. విసోడా, దీనిఫలము తీపి, పులుపు, వగరు రుచులు గలిగియుండును. దీనిని బంకనక్కెరని, పెద్దనక్కెరని, విరిగిచెట్టని యందురు. దీని ఎండిన పండ్ల చూర్ణము లేక వీళ్ళతో వీనిని నూరి తీసిన రసము చలవ, మేహశాంతి, వీర్యవృద్ధి జేయును; తత్వమును సౌమ్యపరచును; దాహమును కట్టును. గుండెలలోని వ్యాధులను, సద్దపడెడు మూత్రవ్యాధులను అణచును. గొంతుకకు, గుండెలకు మేలుజేయును.

ఉష్ణజ్వరముల పోగొట్టును. చూర్ణపు మోతాదు పూటకు బేడెత్తు మొదలు పావలా యెత్తువరకు. రసపు మోతాదు 2-3 తులముల యెత్తు. పండ్లగుంజు 4-5 తులములయెత్తు బుచ్చుకొనిన సౌమ్యముగ విరేచనము గావించును. దీని చెక్క, ఆకురసము, కషాయము స్వాదుగానుండును. వీర్యమునకు వేడిజేయును; రక్తపిత్తము, పరిణామశూలను, జ్వరమును హరించును; కండ్లకు చలవ జేయును. మోతాదు పూటకు 4-5 తులముల యెత్తు. విత్తుల చూర్ణము నూనెలో గలిపి పూసిన తామర నిమ్మళించును. దీనిగింజలలోని పప్పు రుచిగనుండును. వీర్యవృద్ధి, బలము చేయును. నక్కరాసకూర అగ్నిదీప్తి కాంతినిచ్చును. పైత్యవాతమును హరించును. విరేచన బద్ధము జేయును. శ్లేష్మము నణచును.

నఖముచిప్పలు:—Unguis Odoratus- సం॥ నఖ, వ్యాఘ్రనఖ, చక్రకారక. హిం॥ నఖీ. వీనిని వ్యాఘ్రనఖమని, శంఖనఖమని యందురు. ఔషధములకు సువాసన గలుగజేయు వస్తువు. యివి సముద్రములోను నదులలోను బుట్టు ఒకవిధమగు జంతువులయొక్క చిప్పల పైభాగము. గోరునుబోలి చవరముగా ఆలువు చిప్పలను బోలియుండును. రేగాంత, కలువరేకంత, గుర్రపుడెక్కంత, ఏనుగు చెవియంత, పందిచెవిలంత వుండు విధములుగలవు. ఆఖరున వ్రాసిన దానిని వుపయోగించరు. గుర్రపుడెక్కంత వురవుగల చిప్పలను ఔషధాదులయం దుపయోగించుట శ్రేష్టము. సుగంధముగానుండును. గాన తైలాదులయం దుపయోగింతురు. యివి కారము తీపి, రుచులు గలిగి ఉష్ణవీర్యము గలవిగానుండును; వేడిజేయును, శ్లేష్మవాతములను హరించును. ప్రమేహము, జ్వరము, క్రిమి, వాతరక్తము, కుష్టు, దురద, చర్మరోగములు, రక్తదోషము, విషము వీనిని హరింపజేయును. వ్రణములు, విద్రధి, శూల, కఫము

వీనిని హరించును. బలము, పుష్టి, కాంతి, వీర్యవృద్ధి నిచ్చును. వీని ధూపము గ్రహబాధలను శమింపజేయును. తైలములలో కాచి యుపయోగించిన శిరోరోగములు, నేత్రరోగములు మానును. వీనిని శుద్ధిచేసి వాడవలయును. పంచపల్లవముల కషాయము, కరక్కాయ కషాయము, బెల్లపునీళ్ళు, చింతాకురసము, ఆవుపేడరసము వీనితో నుడకబెట్టిగాని, డోలాయంత్రమున వండినగాని శుద్ధియగును. యీ చిప్పలను జిల్లేడుపాలతోగాని, హంసపాదియాకు రసముతోగాని నూరి పుటముబెట్టిన భస్మమగును. యీ భస్మమును పైరోగములకు అనుపానభేదములుగ నిచ్చిన నయమగును. యీ భస్మము కొబ్బరినూనెలోగాని, వేపనూనెలోగాని, కలిపి రాసిన దురద, కుష్టు చర్మరోగములు నివారణమగును. వ్రణమును మాన్పును. వ్రణములమీద యీ భస్మమును చల్లుచుండిన మాన్పును. మోతాదు 1–2 అణాలఎత్తు.

నత్తలు:—**A kind of shells-flesh of.** సం॥ జలశుక్తి, శంబూక. అనగా గుండ్రముగ నుండు నత్తగుల్లలు వీని మాంసము మలమూత్రముల గావించును; మదము నిచ్చును; పైత్యరోగము, రక్తపైత్యము, గుల్మము, వాతము, మూలవ్యాధి వీనిని పోగొట్టును; వీర్యపుష్టిని, వేడిని యిచ్చును; కఫము జేయును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 వేడినీళ్ళు. నత్తగుల్లలు 40 దినములు తినిన మూలవ్యాధి నయమగును.

నమ్మదుంప:—**Scirpus kysoor.** సం॥ కశేరుకం, స్వల్పకంద. హిం॥ కసేరు. దీనిని గొట్టుగడ్డ అనియు, నెమ్ముటములనియు, నెమ్మిటాయి యనియు నందురు. చలవజేయును; తియ్యగ, వగరుగ నుండును; మలమును బంధించును; వాతము, కఫము, అరుచి వీనిని

గలిగించును; స్త్రీలకు స్తన్యవృద్ధి గలుగజేయును; పిత్తము, రక్త వికారము, దాహము, నేత్రరోగము వీనిని నశింపజేయును.

నరమామిడిచెట్టు:—Teranthera Monopetala దీనిని నర్రమామిడి యందురు. దీని మ్రానుచెక్క- చూర్ణము లేక రసము లోపలి కిచ్చిన నీళ్ళవిరేచనములను, అజీర్ణ విరేచనములను కట్టును; యీ చెక్కను మేక పాలతో లేక ఆవుపాలతో నూరి పట్టువేసిన మేహ వాతనొప్పులు, వాతపునొప్పులు, గుండె, పక్క-శూలలు నివృత్తించును. చూర్ణపు మోతాదు పూటకు 2-8 చిన్నములయెత్తు. రసపు మోతాదు పూటకు 1-2 తులములయెత్తు.

నరమూత్రము:—Human urine. 5 సం॥ దాటిన మొ॥ పిల్లలు (ఆరోగ్యమైన) మూత్రమును వుపయోగించవలెను. ఉప్పు, చేదు, వగరు గలిగి యుండును; పైత్యము జేయును; తాత్కాలికములగు నరుకులకు, కాల్పులకు దీనిని వేసిన, వాతము చీము మొదలగునవి పుట్టనియ్యక వేగమె మాన్పును; తాపమణచును; కాలిన పుండుకు బూడిదలో కలిపి వేసిన శీఘ్రముగ పుండును మాన్పును; సన్నిపాతము, అపస్మారము, గ్రహణి, ఉన్మాదములు, విశూచి. దారుణమైన ఉబ్బు, పాండురోగములు వీనిని హరించును; పైన చెప్పిన రోగములకు పథ్యము జేయించవచ్చును. లోపలి కియ్యవచ్చును. కలిగిన కండ్లకు, దురదలు, పొక్కులు, పిల్లలకు కాళ్ళమీదనయ్యేడు కురుపులు మొదలగునవి నరమూత్రముతో గడిగిన వేగముమానును. లోపలి కిచ్చేడు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

నర్మదోదకము:—Water of the river Narmada. తియ్యగా రుచిగానుండును. వీర్యవృద్ధి, బలము జేయును. త్రిదోషహరమైనది. పథ్యముగ, ఆరోగ్యముగ నుండును.

నర్రచెట్టు:—Laurus Involncrata. ఇది కొండలమీద పెరిగెడి చిన్న చెట్టు. దీని పచ్చి చెక్క మిరియములతో నూరి వేసిన గాయములు మానును.

నలుగుపిండి వంటికి నలుగుబెట్టుకొనడము:— అభ్యంగన స్నానము చూడుడు.

నల్లఆలచందకాయ:—అలచందకాయలు చూడుడు.

నల్లఉప్పిచెట్టు:—ఉప్పిచెట్టు చూడుడు.

నల్లకలువ:— తెల్లకలువ చూడుడు.

నల్లకలువగడ్డ:— Nymphoea Stellata-tuber of. వగరు, చిరుచేదుగ నుండును; చలవ జేయును; పైత్యమును హరించును; వాతము జేయును; రక్తపైత్యము, రక్తకుసుమ, రక్తస్రావము వీనినణచును; దీనిరసము, కషాయము, లేక చూర్ణము వాడదగియుండును. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 5 తులములయెత్తువరకు; రసపుమోతాదు పూటకు 2-3 తులములయెత్తు. చూర్ణపు మోతాదు పూటకు 2 అణాల మొదలు 4 అణాలయెత్తువరకు. చూర్ణమునకు సమముగ పంచదార కలిపి యియ్యనగును.

నల్లగగ్గెర చెట్టు:—అడవిగగ్గెర చూడుడు.

నల్లగలిజేరు:— తెల్లగలిజేరు చూడుడు.

నల్లగంటెన:— తెల్లదంతిన. నల్లదంతిన చూడుడు.

నల్లగుంటకలగర:—Eclipta Prostrata-blue. సం॥ కృష్ణభృంగరాజ హిం॥ కాలా భాంగ్రా. దీని పువ్వులు నీల వర్ణముగనుండును. దీని సమూలము నీడను ఎండించి చూర్ణముజేసి ప్రతిదినము ఉదయమున సుమారు బేడయెత్తుచూర్ణము ఆవుపెరుగులో గలిపి ఒక సంవత్సరము విడువకుండ బుచ్చుకొనవలయును. ఈసంవత్సరమును బహుసీమముగ నుండవలెను. అనగా లఘువైన శాకాహారములను

పులుసు, కారము తగ్గించి స్నాన, పాన, భోజన శయనాదులలో నియమముగలిగి జితేంద్రియుడై (అనగా స్త్రీసంగమము వర్జించి)యుండ వలెను. మొదటినెలలో సమస్తరోగములు నివారణమగును; రెండవ నెలలో తెల్లని వెండ్రుకలు నల్లబడును; మూడవనెలలో బుద్ధికి బలము గలుగును, మిక్కిలి సౌఖ్యముగనుండును; నాలుగవ నెలలో వానిని శత్రువులు చూచి భయపడుదురు; అయిదవనెలలో వానినం దరు మర్యాదచేయుదురు; ఆరవ నెలలో వానికైశ్వర్యము గలుగును; ఏడవనెలలో వానిదేహకాంతి భేదించును; ఎనిమిదవ నెలలో గొప్ప వాడగును; తొమ్మిదవనెలలో వాడు ఒకప్పుడు కనిపించును; మరి యొకప్పుడు కానరాకుండును; పదియవనెలలో వాని నెవ్వరును కను గొనజాలరు; పదునొకండవనెలలో బహుశూరుడగును; పండ్రెండవ నెలలో మహాత్ముడగును. గుంటగలగరచూడుడు.

నల్లచంద్ర:— చంద్ర చూడుడు.

నల్లచిత్రమూలము:— చిత్రమూలము చూడుడు.

నల్లచేమకూర:— చామకూర చూడుడు.

నల్లచేమదుంప:— చామదుంప చూడుడు.

నల్లచెరకు:— Sugar cane black. కొంచెము నలుపు, ఎరుపు గలది; కఠినముగ నుండును; కొద్దిగ వేడిచేయును; రుచిగానుండును; త్రిదోషములను హరించును; ధాతుపుష్టి, వీర్యవృద్ధి, బలము జేయును.

నల్లజీడిగింజలు:— జీడిగింజలుచూడుడు.

నల్లజీలకర్ర:— Nigella Sativa. Eng. Small Fumnel or Black Cummin. సం॥ కృష్ణజీరక, ఉపకుంచికా. హిం॥ కాలాజీరా. ఇది నల్లగ, సువాసనగలిగి శీమతుపాకిమందు రవ్వలవలె నుండును, కారముగనుండును; లోపలి కిచ్చిన అజీర్ణము, కడు

పుబ్బు, విరేచనములు కట్టును; కఫము, శోభ, జ్వరము, నేత్ర వ్యాధులు, శిరోరోగములు మొదలగునవి హరించును. దీనిని గుడ్డలో మూటగట్టి నలుపుచు వాసన చూచుచుండిన పడిశము, శిరోభారము, తలనొప్పి తగ్గును; దీనిని మెత్తగనూరి అందులో మంచి గంధము, హారతికర్పూరము మిశ్రమముచేసి వంటికి పూయుచుండిన, దురదలు, దద్దుర్లు, చలితమును పోగొట్టును. దీని చూర్ణము గాని, నీళ్ళువేసి నూరి తీసిన రసముగాని ఇయ్యవచ్చును. దీనిని బట్టలలో గాని, కాగితపు పుస్తకములలోగాని యుంచిన వానిని పురుగులు కొట్టవు. దీని చూర్ణమును నూనెలోగాని, నేతిలోగాని కలిపిపూసిన సర్పి మొదలగు పొక్కులు (కురుపులు) మానును. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 అణాలయెత్తువరకు. రసపు మోతాదు 3-4 తులములయెత్తు.

నల్లతాచు కూసము:— Skin of black Cobra. దీనిని మసిచేసి, దానిని తాడికాయ చూర్ణమును నూనెలో కలిపి, లేపనము చేసిన తెల్లపొడల కుష్టు నివారణ మగును.

నల్లతుమ్మచెట్టు:- Acacia Arabica. A. Farnesiana. Eng. Indian gum Arabic tree. సం* బర్బూర. హిం* బబ్బుల్. అనగా పెద్దముండ్లుగల సాధారణపు తుమ్మచెట్టు. వగరు, కొద్దితీపి, రుచికలిగియుండును. దీనిమ్రానుచెక్క- తెలిగకషాయము మిక్కిలిబలము జేయును; విరేచనబద్ధము జేయును; రక్తపొడ మొదలగు కొన్ని పాములు కరచినప్పుడు నోటివెంటను, మూత్రద్వారము వెంటను రక్తముపడు దానిని కట్టును; దానివలనకలిగిన అతిసీరసమును పోగొట్టును. మోతాదు పూటకు 3-4 ఔన్సులు చొప్పున దినమునకు రెండుపూటలనియ్యనగును. దీనికషాయముతో దుష్టవ్రణములుకడిగిననయమగును;దీనిలోకవిరిగాని,పటికిగాని కలిపి పుక్కిలిపట్టుచుండిన

దంతరోగములు, చిగుళ్ళ నొప్పులు, నోటిపూతి నివారణమగును. దీని ఆకు పసరులో నల్లమందు, పసుపు, కరక్కాయ, పొంగించిన పటిక యిరుపగరిటెలో నిమ్మపండ్ల పులుసువేసి ఉడికించి కండ్లకు చుట్టు పట్టువేసిన కండ్లకలక, ఎరుపులు, నీరుకారడము, నొప్పి మానును. దీని చెక్క కషాయములో పటికచూర్ణముకలిపి పుక్కిలించుచుండిన చిగుళ్ళవాపు, పండ్లనొప్పులు, పండ్లవెంట రక్తము చీము పడుటమానును. దీని చెక్క చూర్ణము నూనెలోగలిపి పూసిన సెలలు వేసెడు వ్రణములు నయమగును. దీని జిగురు, పొట్టను గొంతుకను మృదువు పరచుటకు ఔషధములలో గలుపుదురు. గ్రహణి విరేచనములు కట్టును. దీని జిగురు కొద్దిగ నేతిలో వేయించి చూర్ణము జేసి యిచ్చిన, హృదయమునకు బలము జేయును. ఇంద్రియనష్టముకట్టును. వీర్యవృద్ధి చేయును. మోతాదు 1 లేక 2 అణాలయెత్తు. పంచదారతోగాని, యితరచూర్ణములతోగాని కలిపి యియ్యవచ్చును.

నల్లతెగడ — తెల్లతెగడ చూడుడు.

నల్లదింతిన:—దింతినచూడుగు.

నల్లనువ్వులనూనె:—Sesamum Indicum-black variety-oil of (Black gingily oil). సం॥ తిలతైల, పాపఘ్నతైల. దీనిని పుచ్చుకొనిన క్రిమి, కఫము, ఆమము, త్రయాహికజ్వరము, శూలు, గుల్మము, ఉదరరోగము వీనిని హరించును. నూనె నువ్వులది చూడుడు. మోతాదు అరతులమెత్తు మొదలు తులమెత్తువరకు.

నల్లపుట్టగొడుక్కు:—Mushroom black. దీనికూర వీర్యవృద్ధిచేయును, కఫమును, సర్వదోషములను గలుగజేయును. దీనికి విరుగుడు తెల్ల పుట్టకొక్కు చూడుడు.

నల్లపురుగుడు:— Phyllanthus Multiflorus. P. Reticulaters. సం॥ పృష్ణకాంభోజీ, కృష్ణపతంగినీ. దీని ఆకురసము, వేరుచూర్ణము

లేక కషాయము చలవ, మేహశాంతి జేయును. తత్వమును మార్చి కూర్చును. దేహములోని దుష్టపదార్థ కూటమును కరగించును, మూత్రము గావించును. రసపుమోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. చూర్ణపుమోతాదు 2 మొదలు 4 చిన్నములయెత్తు. కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. దీనికవులు హారతికర్పూరము, చలవమిరియములువేసి నూరి చిన్న గచ్చకాయలవలె మాత్రలుచేసి వానిలో నొక్కొకటి బుగ్గనుంచుకొనిన చిగుళ్ల వెంట రక్తముపడడము కట్టును.

నల్ల పెసరపప్పు:—Phaseolus Radiatus black-dhall of. సం* కృష్ణముద్గ. పొట్టుదీసినది స్వాదుగ నుండును. వాతరోగము, దగ్గును దెచ్చును. శీతపైత్యము జేయును. దీనికి విరుగుళ్ళు పెసరపప్పు చూడుడు. దీని పప్పుతో కూరలలోను, పప్పుగాను యితరవిధములు పచ్చ పెసరపప్పువలె వాడవచ్చును.కొంచె మెచ్చుతగ్గుగా ఆవిధము గానే పనిజేయును, అంత శ్లేష్మము కాదు.

నల్లబనాతుపచ్చడము:—Black woollen blanket. శరీరమునకు వేడి బుట్టించును. చలినాపును. వాతరోగమును హరించును. కఫమును, క్రొవ్వును అణచును. శిశిర హేమంత ఋతువులయం దనుకూలముగ నుండును. ఆరోగ్యము నిచ్చును.

నల్లమందు:—Papaver Somniferum. Eng. Opium. సం* అఫిన, అహిఫేన. హిం* అఫీమ్. ప్రశస్తమైన మందు చేదుగ నుండును. పైత్యము, ఉష్ణము, మత్తు, విరేచనబద్ధము జేయును. మనోత్సాహము బుట్టించును, చక్కగమాట్లాడించును. క్రిమిరోగము, కఫము, వాతము, అతిసారము, గుదశూల, గుల్మము వీనిని హరించును. నరములకు సత్తువ, బలముజేయును. రతిసౌఖ్యమిచ్చును. వంటినొప్పులు దీయును. 2-3 యేండ్లలోపు వయసు బిడ్డలకును, వృద్ధులకును

మంచిది. శ్వాస, కాసలు, తాపము, క్షయ, వ్రణములు, కుష్ఠు, పీనస, స్ఫోటకము, మూలవ్యాధి, గ్రహణి, ప్రమేహము, కుసుమ రోగము వీనిని హరించును; విరిగిన ఎముల నతుకొనజేయును. అగ్నిదీప్తిని జీర్ణశక్తిని యిచ్చును. నరుకులను, గాయములను మాన్పును. నిద్రదెచ్చును. చలిజ్వరము గలవారికిచ్చిన చలిని తగ్గించును. ఈడ్పులు (Spasms), గాయపుసంధి లేక వాతము (tetanus), వెర్రికుక్క విషసంధి (Hydrophobea), మూర్ఛ (Epilepsy),మరిడిజాడ్యము (cholera) మొదలగు రోగములు. నిస్త్రాణ (debility), కడుపులో పుండయ్యే జ్వరము (Typhus fever), వేడిగల జ్వరము (ardentremittant fever) వీనిని పోగొట్టును. నాడి (pulse) వేగమును, శరీరములోని వేడిని హెచ్చించును. బుద్ధికి బలమిచ్చును. రక్తస్రావము, వాత, మేహవాతపు నొప్పులు, అతిమూత్రరోగము వీని నణచును. దీని దుర్గుణములు దురదబుట్టించును. అమితముగ దినిన రక్తమునకు వేడి బుట్టించి క్షీణింపజేయును. కాంతిని బోగొట్టును. బుద్ధిబలమును తగ్గించును. గుండెలకు, వీర్యమునకు, కార్జము (liver) కు హానిజేయును. దీనికి విరుగుడు 1 అక్రోటు, 2 బాదము, 3 దాల్చినిచెక్క, 4 మిరియములు, 5 ఆవునెయ్యి మోతాదు మిక్కిలి విస్తారముగ దినినను నూనెలో కలిపి పుచ్చుకొనినను విషతుల్యమై చంపును. దీనికి విరుగుళ్ళు 1 అల్లపురసము, 2 శొంఠిరసము లేక కషాయము, 3 రెండు మాషములయెత్తు ఇంగువ కలిపిననీళ్ళు, 4 ఎర్రజొన్నలపిండి నీళ్ళలో కలిపినది, 5 మంగకాయల రసము 3-4 తులములయెత్తు, 6 ముళ్ళ తోటకూర సమూలము (ముక్కలుదంచి) అష్టభాగముగా గాచిన కషాయము 4-5 తులములయెత్తు, 7 వాకుడు సమూలరసము, 5-6 తులములయెత్తు సుమారు పావుసేరు ఆవుపాలలోగలిపి పుచ్చు

కొనడము,8 వస, సైంధవలవణము, పిప్పళ్ళు, మంగకాయ ఒక్కొక్కటిపావుతులం చొప్పున ఉష్ణోదకముతో నూరి పానముచేయుట, 11 వెలిగారము, మైలతుత్తము వీనిని సమముగ (పావుతులంచొప్పున) చూర్ణించి అందులో నెయ్యిగలిపి సేవించడము. వీనివలన వచునమైనల్లమందు విషము శీఘ్రముగ నివృత్తించును. నల్లమందు, నూనె, నాభి కలిపి పుచ్చుకొనిన అతిదారుణమగు విషమగును. దీనికివిరుగుడు నరమూత్రము. మోతాదు చిన్నబిడ్డలకు సన్న ఆవగింజంత మొదలు 8 సన్నఆవగింజలంత వరకు. పెద్దవాళ్ళకు అర్థ పెసరగింజ మొదలు చిన్నగురిగింజ ప్రూసంతవరకు. ఈనల్లమందును యితర మందులతో కలిపి వాడిన మిక్కిలి వుపయోగకరముగ నుండును పైరోగములకు బలముగ పనిచేయును. అతిసారము, గ్రహణి రోగులకు మిక్కిలిపని చేయును; దీనినిఆంగ్లేయవైద్యులు అరకుగాను (Tinture) చూర్ణము లలో కలిపిన్ని, పిచికారీ (ఇంజక్షన్) (Injection)లోనూ వాడిన మిక్కిలి పనిచేయుచున్నవి.

నల్లమద్ది:—Terminalia Arjuna & T. Tomentosa. సం॥ అర్జున, కకుభ, ఇంద్రద్రుమ. హిం॥ కాలాఅర్జున్, కాలాకోహ్. దీని పట్ట చూర్ణము లేక కషాయము వ్రణము నార్చును. కఫమును. శైత్యపు చెమటను, మలదోషమును, పైత్యమును, క్రిములను హరించును. చూర్ణపు మోతాదు ప్రూటకు 3 మొదలు 4 అణాలయెత్తువరకు. కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

నల్లవంకాయ:—Brinjals Black. రుచిగ, మనోహరముగ నుండును. కఫపైత్యముల నణచును. రుచిబుట్టించును, విరేచనము జేయును. నేత్రరోగము, గుల్మము, కుష్ఠు వీనిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు వంకాయ చూడుడు.

నల్లవావిలి:—Gendarussa Vulgaris. సం॥ నీలి నిర్గుండీ, సేఫాలికా. హిం॥ నీలసంహాలు. దీని ఆకురసము లేక కషాయము వెగటుగ

నందును; పైత్యము, ఉష్ణము జేయును; జ్వరము, పురాణ మేహ వాతపునొప్పులు, వాతపునొప్పులు, శ్లేష్మము, క్రిమిరోగము, వాతము, కఫము, గుల్మము, అరుచి, కుష్టు, దురద, ఉబ్బు, విషము వీనిని హరించును. దీని తేలిక కషాయము తలనొప్పి, పార్శ్వపు నొప్పి, మూతి వంకరఅయ్యేవాతము వీనిని హరించును. రసము యొక్క మోతాదు పూటకు 2 తులములయెత్తు, కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తు వరకు. తేలిక కషాయము 3 మొదలు 6 తులముల యెత్తువరకు. దీని పసరు చెవిలో బోసిన చెవినొప్పి నిమ్మళించును. పార్శ్వపు నొప్పికి ఆనొప్పి యున్నవైపు ముక్కులో పసరు బోసిన నయమగును. దీని ఆకునలిపి ఆముదమున వెచ్చజేసి నొప్పిగల మోకాళ్ళకు కట్టినను, దీనిఆకును, ఉప్పును, వెచ్చజేసి దానితో కాపడముపెట్టి కట్టినను పురాణవాత మేహవాతపు నొప్పులు, మోకాళ్ళ వాపులుగల నొప్పులు హరించును. దీని ఆకులు నీళ్ళలోవేసి కాచి ఆనీళ్ళతో స్నానము చేయించినను పురాణజ్వరములు విడుచును. దీని ఆకు రసము బిడ్డల దగ్గును పోగొట్టును. దీని ఆకుపసరులో నూనెకలిపి పట్టించి రుద్దిన, మెడ గొంతుక వీనింగల నరములవాపు(Glandular swellings) నివృత్తించును. దీని రసములో ఆవాలు కలిపి యిచ్చిన వాంతు లగును. వట్టి రసమిచ్చినను కొందరికి వికార పెట్టును; వాంతిజేయును. దీని రసములో నూనె వేసికాచి అనూనె బూసిన గజ్జిపొక్కులు, రసి కారే పొక్కులు హరించును. దీని ఆకులను బట్టలలో నుంచిన వానిని పురుగులు కొట్టకుండును.

నల్లవుప్పిచెట్టు:—ఉప్పిచెట్టుచూడుడు.

నల్లవుమ్మెత్తచెట్టు:—Datura Fastuosa, D. Alba. Eng. Datura Thorn apple tree-purple. సం॥ కృష్ణదత్తూర, కృష్ణోన్మత్త

హిం॥ కాలా ధతూరా. దీని వేరు, ఆకు, లేక వీని రసము లేక ఆకుపసరు యెండించిన చూర్ణము, లేక ఆకు యెండించిన చూర్ణము, లేక వేరు చూర్ణము చేదు, వగరు, తీపి రుచులుగ నుండును; మత్తుజేయును, విషవస్తువు; వాతము, మూర్ఛ, పిచ్చి, దారుణపు తలనొప్పి, కఫము, కాస, శ్వాస, క్రిమిరోగము, కుష్ఠు, విషము వీనిని పోగొట్టును. చూర్ణపు మోతాదు పూటకు పాతిక గోధుమ గింజలయెత్తు మొదలు 20 గోధుమ గింజల యెత్తువరకు క్రమముగ హెచ్చించుచూ 20 లేక 40 లేక 60 దినములు వరుసగా దినము నకు రెండుపూటలను పుచ్చుకొనవలెను. కుష్ఠురోగులు 80 దినములు పుచ్చుకొనవలెను. అయితే వీరు 40 దినములు పుచ్చుకొని ఒక మాసము వరకు పుచ్చుకొనడము మాని తిరుగా ఆరంభించి 40 దిన ములు పుచ్చుకొనవలెను. దీని ఆకురసము వంటికి బూసిన దేహ మున వ్యాపించియుండు రసదోషము, తామర, సర్పి, గజ్జి, చిడుము మొదలగు చర్మరోగములు హరించును. దీని సమూలముగాని, ఆకునుగాని నీడను ఎండించి సన్నముగ ముక్కలుగచేసి మూడు దినములు ప్రొద్దుట, సాయంత్రముగాని, లేక దగ్గు, ఒగర్పు కని పించినప్పుడు గాని పొగపుచ్చుకొనిన దారుణమగు దగ్గు, ఒగర్పు, ఉబ్బసదగ్గు, మేఘరంజి మొదలగు దగ్గులు తోడనే శమించును. దీని పచ్చిఆకు నూరి ఆవుపేడలోగాని గేదెపేడలోగాని కలిపి ఉడి కించి కట్టుకట్టిన గడ్డలు, గండమాలలు, సెలలువేయు పుట్టవ్రణ ములు పగులును; శుభ్రపరచును; మానును, మూలశంక బాధ నివృ త్తించును. దీని ఆకులు చన్నులపైనవేసి కట్టినను, నూరి కట్టినను పాలు హరించును; ఆకులకు ఆముదముపూసి వెచ్చజేసిగాని, ఆము దము కాచి అందులో ఆకులువేసి వడిలించినవిగాని, నూరి ఆముదము గలిపి ఉడికించిగాని కట్టుకట్టిన గడ్డలు, చనుకుదురు (పుండు) హరిం

చును; నొప్పి శీఘ్రముగ మానును. దీనివిత్తులు గ్రహణిని, రక్త గ్రహణిని కట్టును.వీని తైలము పూసిన నరములకు సత్తువనిచ్చును; లింగమునకుపూసిన దానికి దార్ఢ్యము, లేపనము (Erection) గలుగును. విత్తులను రినూ పుప్పిపంటిలో బెట్టిన నొప్పి హరించును; మూర్ఛకు, పిచ్చికి, ముందు వచ్చెడి దారుణపు తలనొప్పికి దీని వేరుచూర్ణమును అరగోధుమ గింజయెత్తు మొదలు 3 గోధుమ గింజల యెత్తు చొప్పున నిచ్చిన అది నివారణ మగును. దీని యెండు వేరు తమలపాకులో అరగోధుమగింజయెత్తు మోతాదుగ నిచ్చిన సవాయిరోగము నివృత్తించును. దీనివిత్తులు నపుంసకత్వమును పోగొట్టును. ఇందుకు 15 పండ్లలోని గింజలను చిదుగగొట్టి 10 శేర్ల ఆవుపాలలో వేసి బాగుగ కాచి తోడుపెట్టి వెన్నతీసి నెయ్యి చేసి ఉంచుకొని ఈనేతిని లింగమునకు దినమునకు రెండుసార్లు పూయుచు దినమునకొకసారి ఆనేతిని 4 గోధుమ గింజలయెత్తు చొప్పున 15 దినములు పుచ్చుకొనిన, పుంస్త్వము గలుగును. దీని ఆకులకు ఆముదము చమిరి వెచ్చజేసి కట్టిన వాత మేహ వాతపు నొప్పులు హరించును. దీని ఆకుల చిక్కని రసము, (Concentrated juice) పూసిన గాలిబిళ్ళలు, గవదలవాపు, బిళ్ళలు, మెత్తదనము ( Tenderness ) ఇవి హరించును. దీని ఆకుల రసము వెర్రికుక్క విషమును హరించును. దీనికి యిచ్చు విధము వెర్రికుక్క కరచిన రెండువారముల వెనుక, పది దినముల లోపుగ ఉదయము 6 గంటలకు చిన్నగరిటె (Dessert spoonful) శ్రీరభాగ్గు చూర్ణము తినిపించవలెను. అరగంట వెనుక దీని ఆకులరసము 2 తులములన్నర యెత్తు ( 1 ఔన్సు ) త్రాగించ వలెను. ఇచ్చిన వెంటనే కొంచెము తాటిబెల్లముగాని మరి యేదయినగాని వాంతి కాకుండ ఉండుటకు తినిపించవలెను.

ఆవెనుక ఆ మనుష్యుని యెండలో 4-5 గంటల వరకు కట్టి పెట్టి యుంచవలెను. తరువాతను ఆ మనిషికి వెర్రియెత్తి వెర్రికుక్కవలె అరవడము మొదలగు పిచ్చిపనులు చేయును. ఈలాగు జరిగిన ఆమనిషికి వెర్రికుక్క కరచినట్టు నిశ్చయించవలెను. మధ్యాహ్నత్వరమందు (Afternoon) ఆ మనిషి నెత్తిమీద చాలాకుండల చన్నీళ్ళు పోయవలెను, తిరువాత ఆ మనిషికి పందిమాంసము ఉప్పుచేప, వంకాయలు, ఉలవలు, సెనగలు యీలాంటివి వండి ఆహార మియ్యవలెను. తరువాత తేలిక ఆహార మియ్యవలెను; వెర్రికుక్క విషము నివృత్తించును. వేరుచూర్ణపు మోతాదు ఆకు చూర్ణమువలెనే,మిక్కిలి కొద్ది మోతాదునుండి ఆరంభించిక్రమక్రమముగ హెచ్చించవలెను. రసమును ఆవిధముననే హెచ్చించవలెను. మోతాదెక్కువయైన తలదిమ్ము పట్టును. కంటిపాపలు పెద్దవగును. స్మారకము తప్పును. పిచ్చెత్తును. చంపును. గనుక ఈ మూలిక ప్రయోగమందు అతిజాగరూకతతో ఉపయోగించుచుండవలెను. దీని విషమునకు విరుగుళ్ళు ఉమ్మెత్తచూడుడు. తెల్ల, పచ్చ ఉమ్మెత్తలకును పైగుణములుగలిగి యుండునుగాని, నల్లయుమ్మెత్త యెక్కువ పనిజేయును.

నల్లఉలవలు,దీనికట్టు:— Dolichos Biflorus - black variety (Black horse gram) boilings of. ( వగరు, ( తీపి, రుచిగ నుండును; ఉష్ణము జేయును. శ్లేష్మము, గుల్మము, శూల, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, వాతము వీనిని హరించును. దీనికట్టు లఘువుగా నుండును. విరేచనము జేయును. శ్లేష్మము, వాతము, మూత్రకృచ్ఛ్రము, శూల, క్రిమి వీనిని హరించును. వీర్యనష్టము చేయును. ఉలవలు చూడుడు.

నల్లావాలు:—Mustared seed black. ఆవాలు చూడుడు.

నల్లావుపాలు:—Milk of a black cow ఆవుపాలు చూడుడు.

నల్లేరు:—Vitis Quandrangularis. Cisacrs. Q. సం॥ వజ్రాంగీ, వజ్రవల్లి. హిం॥ హాడ్ సంహారి, హాడభాంగ. దీని ఆకులు, కాడలు దురదగలిగి యుండును. ఉష్ణముచేయును. నల్లేరు కాడలు కుమ్ములో ఉడికించి రసముదీసి అందులో కొద్దిగ తేనె గలిపి యిచ్చిన దారుణపు ఎక్కుళ్ళు నిలుచును. సన్నిపాతమందుకూడ నియ్యవచ్చును. మోతాదు 1 మొదలు 2 తులముల మెత్తు రసములో సుమారు అరతులం తేనె వైచి యియ్యవచ్చును. కణుపులు పరిహరించి కాడల చూర్ణము శ్లేష్మము, దగ్గు, జ్వరము, వాతము, గుల్మము వీనిని హరించును. విరేచనము జేయును. మొలకలుండు మూలవ్యాధిని పోగొట్టును. జఠరదీప్తి నిచ్చును. ఆయుర్వృద్ధిని, కాంతిని యిచ్చును. అజీర్ణమును పోగొట్టును. శరీరతత్వమునుమార్చును. చూర్ణపు మోతాదు పూటకు 2 అణాలు మొదలు 4 అ॥లు మెత్తువరకు, చూర్ణముకు సమముగ పంచదార కలిపి నీళ్ళతో లేక తేనెతో లేక కడుగు (rice washings) తోనైన నియ్యవచ్చును. దీని వడియములు అనగా లేత కాడలుదంచి వుప్పు, కారము వగయిగా చేర్చి వడియములుచేసి యెండించి నేతిలోగాని, నూనెలోగాని వేయించి భోజనములో పుచ్చుకొనిన శ్లేష్మహరముగ నుండును. మూలవ్యాధి, గుల్మము, అగ్నిమాంద్యము, వాతము వీనినిహరించును. వేడిచేయును. విరేచనకారి. మేహపైత్య రోగులకు అపథ్యముగా నుండును. దీనికాడల భస్మము ఉబ్బురోగమును హరించును. మోతాదు 1-2 అణాల మెత్తు.

నవనీతము:—(Butter) వెన్న చూడుడు.

నవాసాగరము:—Ammonium Chloride. Sal Ammoniac. సం॥ నరసార. అమృతలవణ. హిం॥ నవ్ సాదర్. ఇది ఒంటెలద్దె కాల్చి చేసిన క్షారము; కొన్ని గనులయందును పుట్టును. కొద్దిచేదు, ఉప్పు రుచిగలది. చల్లదనము గలది, దీనిని లోపలికిచ్చిన కడుపులో

మంట, ఈడ్పులు, (spasms), పంచగుల్మములు, ఉబ్బు, మూల వ్యాధి, ఉదరరోగము, ఋతుబద్ధము మొదలగు యోనిదోషములు (womb complaints), గర్భాశయము పెరగడము (uterine) (enlargment) వీనిని హరించును. చెమట బుట్టించును. మూత్ర మును వెడలించును. యకృత్తు, ప్లీహరోగములు(liver & spleen diseases), ఊపిరితిత్తుల (lungs) రోగములు, దగ్గులు త్రిదోష ములను హరించును.నవాసాగరము సున్నముగలిపి అరచేత మర్దించి (ammonium carb ) అని బజారులో అమ్ముదురు. వాసనజూపిన శోష అనగా స్మృతితప్పడము, మూర్ఛ,అపస్మారము( Hysteria ), బాలపాపచిన్నెలు (Convultion ) శిరోవాతము, శిరోక్రిమి, తల నొప్పి, తేలువిషము, కండ్లు చీకట్లుకమ్మడము వీనిని పోగొట్టును. తేలువిషమునకు కుట్టినచోట పచ్చిసున్నములో నవాసాగరము గలిపి అంటించవలెను. దీనిని నీళ్ళలోగలిపి పూసిన పుండు(inflamation), గడ్డలు(Tumours), వ్రణము, కుళ్ళి లేక మాంసము తినివేసే రాచపుండువంటి వ్రణములు, ఎర్రపొక్కులు వీనిని పోగొట్టును. మోతాదెక్కువైన వాంతిజేయును. వాంతిచేయించే మోతాదు 30 గోధుమగింజలయెత్తు. సాధారణపు మోతాదు పూటకు 3 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు. మాత్రజేసిగాని, నీళ్ళలో గలిపిగాని యియ్యవచ్చును. మరియు 1 ఔన్సు నవసారము, 9 ఔన్సులనీళ్ళు, 1 ఔన్సు అల్కహాల్ (alcohal) అనే ఘాటుసారాయి కలిపిపూసిన కుళ్ళువ్రణములు బాగగును; 1 భాగము నవాసారము, 2 భాగ ములు సీమసున్నము వేరువేరుగ బాగుగ యెండించి కలిపి గాఢా గ్నిని పుటముబెట్టి తీసినది వాసన చూపుటకు మిక్కిలి అనుకూలముగ నుండును. ఇదియె అమోనియాకార్బు (ammonium carb) అని బజారులలో అమ్ముదురు. దీనిని వాడవచ్చును.

నళద్వయము:—Phragmites Karka & Arundo karka. Eng. Burgrass two sorts. సం॥ నళ, రంధ్రీ. హిం॥ నర్ సల్. అనగా రెండుజాతుల కిక్కిసగడ్డి. వీనిరసము అనగా వేళ్ళు లేక సమూల కషాయము చేదుగ, స్వాదుగ నుండును; కఫమును హరించును. వీర్యమునకు వేడినిచ్చును; దాహమణచును; మోతాదు రసము2-8 తులములమెత్తు; కషాయము 2½ మొదలు 5 తులములమెత్తువరకు ఇయ్యవగును

నాగకేసరములు:—Mesua Ferrea. Eng. Cobra's saffron. సం॥ నాగకేసర, చాంపేయ. హిం॥ నాగకేసర్. నాగేశ్వర్. వీని రసము లేక కషాయము చేదు, వగరు రుచులుగలది. త్రిదోషహర మైనది. రసదోషము, కఫము. దుర్గంధము, శీతపైత్యము, మేఢ్రరోగము, శ్లేష్మముపడెడు దగ్గులు, కుసుమరోగము, రక్తగుల్మము, వంధ్యత్వము, పొత్తికడుపులోని రోగములు, అగ్నిమాంద్యము, హృద్రోగము, దురదలు, సర్పవిషము వీనిని పోగొట్టును; చర్ది, దప్పి, సర్వరోగములను శమించునటుల జేయును. బలమిచ్చును; తేలికనిచ్చును; రుచిపుట్టించును; పొట్టకు బలమిచ్చును; దీని చూర్ణము గాని, నూరిన ముద్దగాని వెన్న,పంచదారతో నిచ్చిన రక్తమూల వ్యాధిని కట్టును. దీని చూర్ణమును ఆవుపాలలోగలిపి యిచ్చుచుండిన తెల్ల కుసుమ, యోనిరోగములు, ఋతుదోషములను హరించును. దీని చూర్ణమును నేలవుసిరిక ఆకు పసరులోగలిపి ఋతుకాలమందు 3 దినములు యిచ్చి పత్యముగనుండిన గర్భదోషములను పోగొట్టి సంతానప్రాప్తి గలుగును. రసముయొక్క (నీళ్ళతోనూరి తీసిన రసము) మోతాదు 2-8 తులములమెత్తు. కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తు॥ల మెత్తువరకు,చూర్ణపు మోతాదు 2 మొ॥4అణాలమెత్తు వరకు,

నాగజెముడు:—Opuntia Dillenii & Cactus Iudicus. Eng. Prickly pear. సం* విశ్వసార, విదరం. హిం* ఫణిమనసా, నాగ్ ఫణ్. దీనిని చెప్పుజెముడని, నాగతాళి అని యందురు. తురకములో చెప్పల్ సేండ్ అందురు. దీని ఆకారము చెప్పు అట్టలవలె కోలగ, దళసరిగ ముండ్లు గలిగియుండును. దీనివేరు లేక ఆకులరసము వాత గుల్మములు, గ్రంధులు, రక్తస్రావము వీనిని హరించును. దీని ఆకుల లోని గుంజునుగాని, పువ్వుల రేకులనుగాని నూరి కట్టుకట్టిన కఠినమైన గడ్డలు పక్వమై పగులును. గడ్డలు, వ్రణములు వీనిలోని మంట, పోటు అణగును. లేతమట్టలు రెండు శ్రవణముతో ముండ్లు తీసివేసి గుడ్డతో నూగు తుడిచి రెండు మర్రియాకుల మధ్యవుంచి చీపురు పుల్లతో కుట్టి కుమ్ములో కొంతసేపువుంచి వుడికినతరువాత తీసి కల్వ ములోవేసి నూరి దానిలో పటికిబెల్లం చూర్ణముగలిపి పుచ్చుకొనిన మూలవ్యాధి, రక్తముపడెడు మూలవ్యాధి నయమగును. యీవిధ ముగా ఉదయసాయంకాలములు 9-11-13 దినములవరకు చేయ వలెను. ఇచ్ఛాపత్యం. దీనిపండ్లు తినిన మేహశాంతి జేయును. సెగ రోగము మానును. రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు. పండ్లు 1-2 ప్రతిదినము కొన్నిదినములు తినవలెను. పండ్లరసమును సిరపు లేక పానకము (syrup)గ తయారుచేసి పూటకు అరతుల మెత్తు మొదలు తులమెత్తువరకు రోజుకు 3-4 పర్యాయము లిచ్చు చుండిన ఉబ్బసదగ్గు నయమగును.

నాగదొండచెట్టు:—ఆకాశగరుడ చూడుడు.

నాగభస్మము:—సీసభస్మము చూడుడు.

నాగమల్లిచెట్టు:—Justicia Nasuta & Rhinacanthus Communis సం* యూధికా, పూర్ణి. హిం* పాలక్ జుహీ. దీనివేరు గాని ఆకుగాని నిమ్మకాయరసముతో నూరి పూసిన తామర మొద

లగు చర్మరోగములు మానును. దీనివేరునూరి ఆవునేతిలో ఉడికించి ఆ నేతిని పూసిన సర్పి, చర్మి పొక్కులు మానును. దీనివేరు పాలలో వేసి కాచి పుచ్చుకొనిన మిక్కిలి వీర్యవృద్ధి గలుగును. దీని వేరు గంధము లేక నూరినముద్ద పుచ్చుకొనిన సర్పవిషము హరించును. మోతాదు అరతులం మొదలు తులమెత్తు వరకు.

నాగముత్తువపులగము:—Sida Spinosa & S. Alba. సం॥ నాగబలా, గాంగేరుకే. హిం॥ గాంగేరున్. దీనిని జిబిలికయనిన్నీ అందురు. దీని ఆకులు నిత్యమల్లి ఆకులవలె నుండును. నేలపై తీగ ప్రాకును. ముత్తువపులగమువలెనే పూవులు పూయును, ముత్తువపులగము యొక్క గుణములు కలిగి యుండును. దీని ఆకులున్ను, బెల్లము (కొద్దిగ) కలిపినూరి గుడ్డకు దళసరిగా పట్టించి చెయ్యి, కాలు విరిగిన చోటవేసి పైన వెదురుబద్దలువేసి కట్టిన ఎముకలను త్వరగా అతుకొనజేయును. పశువులకున్నూ కట్టవచ్చును. ముత్తువపులగము చూడుడు.

నాగముషిణిచెట్టు:—ముషిణిచెట్టు చూడుడు.

నాగముస్తలు:—తుంగముస్తలు చూడుడు.

నాగార్జుని:—రెడ్డివారి నాలుబాలు చూడుడు.

నానుబాలు:—Soaked rice mixed with gingily seed and jaggery. అనగా నానబెట్టిన బియ్యం, నువ్వులపప్పు, బెల్లంకలిపి చేసినది. రుచిగ నుండును; ఆకలిని తీర్చును; గురుత్వముగ నుండును; కఫముజేయును; అపథ్యమైనది; దీనికి విరుగుళ్ళు 1 కలినీళ్ళు, 2 పెరుగుమీంది నీళ్ళు.

నాభి:—Aconitum Ferox-root of. Eng. Indian aconite. సం॥ విష, వత్సనాభ, అమృత. హిం॥ మితాజేలియా, బిచ్‌నాగ్. దీనిని వసనాభి యని అందురు. ఇది విషము. సర్వవాతములు,

జ్వరములు, సన్నిపాతములు, కష్టరోగమును హరించును; పైత్యము జేయును; నీరసం, చర్ది, తాపము వీనినిబుట్టించును. నాలుకనీడ్చును; మోతాదెక్కువైన చంపును; దీనిని సారాయితోగాని,నీళ్ళతోగాని గంధముతీసి ఆగంధమును చీముపట్టకుండ యుండెడు రాచపుండు, గోరుచుట్టు, కణుపుజెట్ట, తేలువిషము వీనిపైన పట్టించిన నవి హరించును. మోతాదు పూటకు యవప్రమాణము (12 సన్నఆవగింజల యెత్తు). కష్టరోగికి పూటకు గుంజ (24 సన్నఆవగింజల) యెత్తు చొప్పున కొన్ని నెలలవరకు దినమునకు రెండుపూటల నియ్యనగును. నాభిని శుద్ధిచేయవలెను. ఆవగింజంత చొప్పున ఆరంభించి క్రమక్రమముగా మోతాదు ఎక్కువ చేయవలెను. నల్లమందుతోగాని, వేపచెక్క, చంద్రచెక్క, కానుగచెక్క, వీనిలో దేనియొక్క అయినా రసముతోగాని, కషాయముతోగాని, చూర్ణముతోగాని పుచ్చుకొనదగియుండును; కాలక్రమముగ మోతాదు 4 గుంజల యెత్తువరకు హెచ్చించవచ్చును; దీనికివిరుగుళ్ళు 1 చిరివేళ్ళరసము, 2నల్లజీలకర్ర, 3 విరిగినార, పెన్నేరుదుంప వీనిని ఆవుపంచితముతో నూరి తీసిన రసము. 4 ఆవుపాలు, 5 పయిడిప్రత్తిచెట్టు ఆకు. పువ్వు, కాయి వీని రసము.

నామదుంపలు:—కోవిలదుంప చూడుడు.

నారచీర:— Garment of bark worn by sages. దీని ధారణము వాతమును శమింపజేయును; చలి, ఎండ, వీని బాధల నణచును; శుచిగ నుండును.

నారజెల్ల:—A kind of fish. కఫమును, వాతమును ఎక్కువ జేయును. అపథ్యమైనది. దీనికి విరుగుడు చేపలు చూడుడు.

నారదబ్బకాయ, పండు:—A kind of orange or Citron. సం* నారదం. చేదుగ, పుల్లగ, స్వాదుగ నుండును. చలవజేయును. రుచి

బుట్టించును; జఠరదీప్తిని, తేలికను ఇచ్చును, వాతము, పైత్యము, మాంసగత వాతము, మేఢశూల, ఛర్ది, గుల్మము, గజ్జి, క్రిమి రోగము, మూలవ్యాధి, కఫరోగము వీనిని జయించును; నీరసము దెచ్చును: విరేచనబద్ధము జేయును; దీనికి విరుగుళ్ళు 1 ఉప్పు, 2 బెల్లము, 3 పంచదార. దీని ఆకు చితుగగొట్టి, వెచ్చజేసి తలకు గట్టిన తలనొప్పి, తలభారము, తలపోటు నయమగును; వీనిని మజ్జిగలో వేసిన సువాసనగ, ఆరోగ్యముగ నుండును.

నారదబ్బపండు ఊరినది:—**Pickle of do.** పండిన నారదబ్బకాయ పదిహేనుముక్కలుకోసి కొంచెము వుప్పులో వేసి పదిహేను రోజులు ధాన్యములోనుంచి అటుతరువాత పదిహేనురోజులు నిత్యము ఒక ముక్క చొప్పున ఉదయముపూట పుచ్చుకొనిన మనోహరముగ నుండును. జఠరాగ్నిని వృద్ధిబొందించును. మిక్కిలి జీర్ణశక్తి నిచ్చును; గుల్మములు, అష్టీలకమనురోగము, కడుపులోబల్ల, జ్వరము మొదలగునవి హరించును.

నారదబ్బకాయపచ్చడి:—**Pickle of do.** దీనిపచ్చడి పుల్లగ, చేదుగ, రుచిగ నుండును. వాంతి, వికారము, పైత్యము వీనిని హరించును; గురుత్వముగనుండును. క్రిమిని హరించును. ఆరోగ్యముగ నుండును, పథ్యమైనది. లేగదూడలకు యీపచ్చడిలో నొకముక్క మ్రింగించిన యెడల క్రిములు పడిపోవును.

నారదబ్బ పువ్వు:—**Flowers of do.** కఫవాతములను, అతిపైత్యమును హరించును; మృదువుగ నుండును. కొద్ది వేడిజేయును.

నారింజపండు తియ్యనిది, పుల్లనిది;—**Citrus Aurantium. Eng. orange sweet & sour.** సం॥ నారంగ, త్వక్సుగంధ, నాగరంగ, హిం॥ నారి గి. దీనిని దబ్బపండని అందురు. బాగుగ చెట్టున బండినది తియ్యనిది చలవజేయును. సర్వమేహములను, పైత్యములను హరిం

చును; మూత్రముగాంచిచును; పొట్టకు బలమిచ్చును; ఆకలిని వృద్ధి జేయును. ఉష్ణమువలన పుట్టినదగ్గును,ఉష్ణమును, జ్వరపిదాహమును నణచును. రక్తమును శుభ్రపరచును. పుల్లనిది ఉష్ణతత్వముగలవారి కనుకూలముగ నుండును. చలవతత్వముగలవారికి శ్లేష్మముబెంచును. దగ్గు దెచ్చును. గుండెలకు కండ్లకు నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 ఉప్పు, 2 పంచదార, 3 బెల్లము, 4 ఆరికబియ్యము, 5 సజ్జాహారము, 6 కాకఔషధములు,మరియు కమలాఫలము,బత్తాయినారింజ పండు, తియ్యనిమ్మపండు, ఈడెపండు వీనికిని సాధారణముగ నారింజ పండు గుణములు గలిగియుండునుగాని వీనిలో నేదైనను మేహ తత్వము, ఉష్ణతత్వము, పైత్యతత్వము గలవారికిని, ఆరోగ్యస్థితిలో నున్నవారికిని మితముగ బుచ్చుకొనిన మేలుజేయును. ఎవ్వరైనను అమితముగ పుచ్చుకొనినను, వాతశ్లేష్మ తత్వములు గలవారికిని, వాతశ్లేష్మ జన్యరోగములు గలవారికిని అనారోగ్యము, రోగవృద్ధి జేయును. పైనజెప్పిన నారింజపండుజాతిలో దేనినైన భుజించిన తోడనే ఉదకపానముజేసిన పొట్టను జెరుపును. నీళ్ళవిరేచనములు గావించును. వాతశ్లేష్మములను బెంచును. జ్వరము దెచ్చును.

నారింజపండుతొక్కలు:—**Orange peel.** నారింజపండు జాతిపండ్లలో దేనితొక్కలు (పైచర్మము) అయినను సువాసనగ, చేదుగ నుండును. వీని చూర్ణముగాని, కషాయముగాని, తేలిక కషాయముగాని కడుపులోని వాతమును వెడలించును, అగ్నిమాంద్యము (dyspepsia)ను, పైత్యజ్వరమును పోగొట్టును, మేహము నణచును. చూర్ణపు మోతాదు పూటకు అణాయెత్తు మొదలు బేడయెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తువరకు.

నాలుక చేప:—Sole fish. ఇది పలచగ నాలుకవలె నిడుపుగ నుండును. దీనిమాంసము మృదువుగ, రుచిగనుండును; త్వరగ జీర్ణమగును; నీరసులకును, జబ్బుపడి లేచినవారికిని పెట్టదగియుండును.

నాలుగు లేక అంతకంటె ఎక్కువ ఈతల ఆవుపాలు:—ఆవుపాలు చూడుడు.

నిడుపుకొమ్ముల ఆవుపాలు:—ఆవుపాలు చూడుడు.

నిద్రగన్నిక:—Mimosa Pudica-variety of. Sensitive Plant. సం॥ లజ్జాలు. శమీపత్ర. నమస్కారీ. హిం॥ లజ్జాలు. దీనిని అత్తపత్తి చెట్టని యందురు. యీచెట్టు నేల నాశ్రయించి పెరుగు చిన్న మొక్కలు. దీని ఆకులు జమ్మాకులవలె నుండి నలుదిశలు అందముగా విస్తరించును. పసుపుపచ్చని పువ్వులు పూయును. మనుజుని చెయ్యి తగిలినంత మాత్రమున ఆకులు పైకి ముడుచుకొనిపోవును. దీని సమూలకషాయము లేక చూర్ణము మేహశాంతి, పైత్యశాంతి, వీర్యవృద్ధి చేయును; ఇంద్రియసష్టమును కట్టును; మూలవ్యాధిని, భగందరమును పోగొట్టును; చూర్ణము ఆవుపాలలో నియ్యవలెను. వేరుకషాయము మూత్రకృఛ్రమును పోగొట్టును. దీనియాకు రసదోషమును విరుచును. దీని పచ్చిఆకు నూరి కట్టిన బుడ్డహరించును; గడ్డల కరగగొట్టును; వ్రణములకు కట్టిన కుళ్ళును ఆపును. దీని ఆకుచూర్ణము శరీరతత్వమును మంచికి మార్చును; రక్తము లేక పైత్యము చెమటవలన గలిగెడు వ్యాధులను పోగొట్టును. దీని ఆకు నూరి పూసిన భగందరము మానును. దీనిసమూలమును ఆదివారముతో గలసిన మంచితిథి నక్షత్రమున తెచ్చి నీడను ఎండించి చూర్ణించి పుచ్చుకొనిన మొదటి వారమున అన్ని పైత్యరోగములు, అన్నిపురాణజ్వరములు నిమ్మళించును; రెండవవారమున, మూలశంక, పాండువు మొదలగు

వ్యాధులు, మూడవవారమున, కుష్ఠు, పల్లికలు. పొలుసు బార డము, పొక్కులు నిమ్మళించును. దీని రసములో గుగ్గులపు మాత్రము గలిపి చేసిన అంజనము కంటి పొరలను కోసివేయును. పైప్రకారము మంచిదినమున తెచ్చిన దీనివేరు మెడలో కట్టిన కొన్ని దగ్గులు నిమ్మళించును; మొలకు కట్టిన వీర్యనష్టము కట్టును; దీని ఆకు పసరులో దూది తడిపి ఆదూదిని గాయపు సందులోను, వ్రణముల రంధ్రములలోను లేక గోతులలోను వేసి కట్టిన నవి కండపెట్టి పూడి మానును. చూర్ణపు మోతాదు 2-4 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణములో సగము పంచదార కలిపి పుచ్చుకొన వలెను.

నిద్రగుణము:—Sleep. రాత్రినిద్ర దేహపుష్టి, బలము జేయును. ఉత్సాహమును బుట్టించును; జఠరాగ్నిని వృద్ధిబొందించును; ఆహార మును జీర్ణముగావించును. ధాతువులకు సర్వేంద్రియములకుసౌమ్యత నిచ్చును; శ్రమను, తంద్రను, వాతమును గొట్టును; వీర్యపుష్టి జేయును; సుఖము, బుద్ధిబలిమి, కాంతి, ఆరోగ్యమును, వీని నిచ్చును.

నిద్రలేని గుణము:—Want of sleep. ఉష్ణము, నేత్రములకు జబ్బు, బడలిక, అజీర్ణము, బలక్షీణము వీనిని గలుగజేయును; రోగమును బుట్టించును; బుద్ధిబలమును తగ్గించును, మెదడు, నరములు వీనికి సంబంధించిన రోగములను బుట్టించును. దగ్గు, పడిసెమును బుట్టించును.

నిద్రాభంగ గుణము:—Diseases caused by disturbed sleep. ఇందువలన భ్రమ, తంద్రి, ఒడలునొప్పి, తలబరువు, ఆవులింతలు,

బలహీనత, బడలిక, అజీర్ణము, సోమరితనము గలుగును. త్రిదోష ముల‌ను బుట్టించును.

నిమ్మకాయ:—Lime green. పచ్చినిమ్మకాయ రసము దాహము, శూల, ఎక్కిళ్లు, చర్ది, శ్వాస వాతశ్లేష్మము వీనిని బోగొట్టును; పైత్యము జేయును.

నిమ్మగడ్డి:—కామంచిపూరి చూడుడు.

నిమ్మపండు:—Citrus Bergamia, Citrus Acida. Eng. Lime or Acid lime fruit. సం* జంబీర. దంతశఠ. హిం* నీంబుఫల్. దీనిరసము పుల్లగనుండును; చలవజేసి ఆర్చును; ఆకలిని, జీర్ణశక్తిని వృద్ధిజేయును; త్రిదోషహరమైనది; మతిభ్రమ, నేత్రరోగము, శ్రమ, దురదలు, స్థావర జంగమ విషములు, అరుచి, దాహము, శూల, ఎక్కిళ్ళు, చర్ది, శ్వాస, కఫము, గుల్మము, పాండువు, మలబద్ధము, దారుణమయిన పైత్యములు, వాతము, ముక్కు, ముఖము, కంఠము వీనియందు బుట్టెడు రోగములు వీని నణచును; ఆయుర్వృద్ధి, కాంతిని యిచ్చును; శుభ్రపరచును, దేహములోని దుష్టపదార్థ కూటమును విప్పును; సారాయి మొదలగు మత్తుద్రవ్యముల మత్తును హరించును; రక్తములోని వేడిని, కడుపులోని వేడిని, మంటను, వికారమును అణచును, భోజనము చేసిన వెంటనే వాంతి అయ్యెడు గుణముకట్టును; పొట్టకు, కార్జమునకు బలముజేయును. పైత్యజ్వరము, శీతపైత్యజ్వరము వీనికి మేలుజేయును. 1/2 మొదలు 1 ఔన్సు చొప్పున నిమ్మపండురసం యిచ్చుచుండిన పొంగు, స్ఫోటకములలో గలుగు వేడి, మంటలు శరీరవాతముతో కూడిన జ్వరమును శాంతిపరచి మేలుజేయును. ఊపిరితిత్తులు, పొట్ట, ప్రేగులు, యోని, మూత్రపిండములు మొదలగు అవయవములనుండి వచ్చెడు రక్తమును కట్టును. ఆమవాత మేహవాత నొప్పులకు కూడ పని

చేయును. 1 భాగము రసము 8 భాగములు నీళ్ళు గలిపి యిచ్చుచుండిన వాడవాళ్ళకు వచ్చు స్కర్వే (Scurvey) రోగమును హరించును. రాకుండ జేయును. వేడినిమ్మపండు రసము యిచ్చిన నిమోనియా (Pneumonia) ఇన్ఫ్లుయంజా (Influenza) లకు చాలా మేలు జేయును. ½ ఔన్సు నిమ్మపండురసము కొద్దిగ నీళ్ళలో వేసి యిచ్చిన గుండెలలోని మంట తగ్గించును. కాఫీకషాయములో (Strong decoction)యిచ్చిన పాలు వేయకుండా నిమ్మపండురసము వేసి మలేరియాజ్వరము తగ్గించును.1గ్లాసు నీళ్ళలో నిమ్మపండురసము గలిపి పరుండబోవునపుడు పుచ్చుకొనిన కడుపు, ప్రేగులు శుభ్రపరచి సుఖవిరేచనము జేయును. కొద్దిగ నిమ్మపండురసము సమభాగము నీళ్ళుగలిపి యీ రెంటికి సమానముగ పంచదారగలిపి యిచ్చిన వాంతి కట్టును. అగ్నిమాంద్యము పోగొట్టును. సుమారు రెండు తులముల రసముచొప్పున యిచ్చుచుండిన అపస్మారమువల్ల గలిగిన గుండెదడ (Hysteric palpitation of the heart) నిమ్మళించును; సోడాలో నిమ్మపండు పులుసు వేసి యిచ్చిన వమనము, పైత్యశూల నిమ్మళించును. నిమ్మకాయ రెండుముక్కలుగకోసి ఒకముక్క ఉప్పు చూర్ణము నద్ది నాలుకమీద రుద్దిన అరుచి, నోటి అసహ్యము నివృత్తించును. నిమ్మపండు రసములో రుద్రాక్షకాయను అరగదీసి ఆ గంధము నాలుకకు పట్టించి రుద్దిన సన్నిపాతాదులయందు గలుగు జిహ్వాదోషములను నివృత్తించును. నూనెలో నల్లమందు వేసి కాచి ఆ వేడినూనెలో నిమ్మకాయ బద్దనుముంచి దానితో కాపడము బెట్టిన కవుకుదెబ్బ, గాయము, వీనివల్ల గలిగిననొప్పి, పోటు నిమ్మళించును. దగ్గుగలవారికి, వాతశ్లేష్మతత్వములవారికి, నంజు (ఉబ్బు) వ్యాధిగలవారికి, జబ్బు జేయును; పరగడుపున దినిన పొట్టకు హాని జేయును; వాతము, శ్లేష్మము జేయును; తలకు, గుండెలనరములకు,

ప్రేగులకు నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార, 3 ఉప్పు, 4 ఆరికబియ్యము, 5 నేరేడుచెక్క, 6 ఖర్జూరపు పండ్ల రసము, 7 నిమ్మపండ్లరసమును ఆముదములోకలిపి శిరస్సుకు మర్దన చేసి స్నానము చేయించుచుండిన శిరస్సునందుండు దుష్టవేడిని తగ్గించును, మెదటికి చలువజేయును. ఉన్మాదము భ్రమ మొదలగు రోగములను శమింపజేయును.

నిమ్మ, దబ్బ, నారింజ, మొదలగు ఈ జాతి చెట్లనీడ:—Shade of the trees of orange kind. మనోహరముగ, చల్లగానుండును; దాహము నణచును; పైత్యమును హరించును.

నిర్విష:—Kyllingia Monocephala Delphineum Denudatum. సం॥ నిర్విషా. హిం॥ నిర్బిషీ. దీనిని ఫార్సీ భాషలో జద్వార్ అందురు. యిది కారముగ, చేదుగా నుండును. శీతవీర్యముగలది. దీని దుంప నాభికొమ్మును బోలి గట్టిగ యుండును; వాతశ్లేష్మములను, రక్తదోషమును, విషములను, వ్రణమును హరించును; తేలు, పాము మొదలగు విషములను హరించు శక్తిగల దగుటచేత దీనికి నిర్విషమని పేరు గలిగెను.

నివాతము:— Sleeping in a place where there is moderate wind or breeze- అనగా అమితముగ గాలితగిలెడుచోట రాత్రి పరుండడము. ఆయుర్వృద్ధి నిచ్చును; నిరోగముగ నుండును; వాతరోగికిని, గ్రీష్మకాలమందందరికిని మిక్కిలి పథ్యముగ నుండును.

నివ్వరిధాన్యపు బియ్యము:— Oryza Sativa - wild variety of (A sort of paddy) సం॥ నీవార. దీని అన్నము రక్తపైత్యము నణచును; తేలికగ నుండును; జీర్ణశక్తిని, జఠరదీప్తిని, ఆరోగ్యమును యిచ్చును. యీధాన్యము కొండలమీదను వాటంతటవి లేచి పండును. అచ్చట వున్నవారికి లభించును.

నీటిపిప్పలి:—బొంకొన చెట్టు చూడుడు.

నీటి ప్రబ్బలిచెట్టు :— Calamus Rotung- a sort of. (A sort of Rattan tree,) సం* నికుంచక. జలవేతస. హిం* జల్ బేత్. దీని వేరు ఆకురసము లేక కషాయము వగరుగ, చేదుగ నుండును; చలవ జేయును; శ్లేష్మము, వ్రణములు, రక్తస్రావము వీనిని బోగొట్టును. రసపుమోతాదు పూటకు 4-5 తులముల యెత్తు. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 6 తులములయెత్తు.

నీటివుత్తరేణి:— Water Achyranthes Aspera. ఇది వుత్తరేణి వలెనేయుండి నీటిపై ప్రాకును. దీని సమూలరసము లేక కషాయము కారముగ నుండును; వాపు, కఫము, కాస, శ్వాస, వాతము, శోష వీనిని బోగొట్టును. రసపు మోతాదు పూటకు 2 మొదలు 3 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులములు.

నీడగుణము:—Resting under shade. దాహము, శ్రమ, బడలిక, పైత్యము, తాపము వీని నణచును; సుఖము నిచ్చును.

నీరుకాయివస్త్రము:— Watery reddish tint coloured cloth. సౌఖ్యమును, దేహోష్ణమును యిచ్చును; రుచిగనుండును; చలిని, చల్లనిగాలిని దేహమునకు తగులకుండ నాపును.

నీరుకొంగమాంసము:—Water crane flesh of. చమురు గలిగి యుండును; విరేచన బద్ధమును, కఫపైత్యములను జేయును; గురుత్వముగనుండును.

నీరుకోడిమాంసము:—Water fowl.flesh of చమురుగలిగి రుచిగ నుండును; వీర్యవృద్ధి నిచ్చును; శరీరమునకు వేడిజేయును; సర్వేంద్రియములకు సౌమ్యతను గలుగజేయును; రక్తమును బుట్టించును; దీనిని గొలకన్నికోడి అని అందురు.

నీరుగొబ్బిచెట్టు:—Hygrophila Spinosa. Asteracantha Longifolia. Ruellia longifolia. సం* ఇక్షుగంధా, కోకిలాక్షా. హిం* తాఖ్ మఖానా. దీనినే గొలిమిడిచెట్టు అనికూడ నందురు. దీని వేళ్ళ కషాయము మేహశాంతి, చలవజేయును. మూత్రబద్ధము, బొట్టు బొట్టుగా బాధతో పడేమూత్రము, ఉబ్బు, ఉదరము, మూత్రకృచ్ఛ్రము వీనిని హరించును. మూత్రమును జారీచేయును. కషాయపు మోతాదు పూటకు 4 మొదలు 8 తులములయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని సమూలముగాని, వేళ్ళుగాని కషాయము కాచి యిచ్చిన మూత్రమును జారీచేయును. ఉబ్బురోగము హరించును. దీనిసమూలమును దంచి, ఆముదముతో వెచ్చజేసి వేసికట్టిన, నడుము, వెన్ను, తొంటి వీనియందు నొప్పులు నివారణమగును. దీని ఆకుకూర రుచిగానుండును. ఉబ్బు, పాండువు, క్షయ వీనిని పోగొట్టును. దీని ఆకుకూర పైరోగులకు పథ్యమైనది. దీని విత్తులే గొబ్బిగింజలు. గొబ్బిగింజలు చూడుడు.

నీరుడివిత్తులు దీనితైలము (చాల్ మొగరాయిలు):—Gynocardia Odorata, Hydrocarpus withania Eng. Chalmogara seeds & oil. సం* కుష్ఠవైరి, తువరక. హిం* చాల్ మొగల, జంగిలీ బాదం. వీనిచెట్టుఎల్లప్పుడుపచ్చగనుండును. దీనినిఅడవిబాదామందురు. యీవిత్తులు కుంకుడు గింజలకంటె కొంచెము పెద్దవిగ, బూడిద రంగుగ, గుండ్రముగానుండును. యీవిత్తులలోని పప్పునూరి ఆముదములోగాని చల్లలోగాని కలిపి రాసిన గజ్జి, చిడుము, దురద మొదలగు చర్మరోగములు మానును. యీవిత్తులు మెత్తగానూరి అందు కొంచెము పాదరసముచేర్చి బాగుగ కలిపి శరీరమునకు రాసుకుని 2-3 గంటలు వుండి వేడినీళ్ళతో స్నానము చేయుచుండిన గజ్జి, చిడుము, దురదలు, చర్మరోగములు, కుష్ఠువు నయమగును. యీ

విత్తులనుండి తీసిన తైలమును చాల్ మొగ రాయిల్ (Chalmogar oil) అందురు. యీతైలమునుగాని దీనితో సమభాగం వేసలైను (Vaciline) కలిపిగాని శరీరమునకు రోజుకు 5–6 సార్లు రాయుచుండిన చిడుము, గజ్జి, తామర, దద్దుర్లు, దురదలు, మచ్చలు, కష్టంవు మొదలగు కుదరని చర్మరోగములు తప్పక నివారణ యగును. యీతైలమున్ను ఆలివుఆయిల్ (Olive oil) సమభాగం కలిపి రాయుచుండిన ఆమవాతపు నొప్పులు (Rheumatic pains) బెణుకు నొప్పులు నయమగును. యీతైలము లోపలికి సేవించిన కుష్టు రోగము, దారుణమగు చర్మరోగములు, కంటివెంట నీరుకారె నేత్రరోగము, వాతరక్తము, నవాయిరోగము, మచ్చలు, దద్దుర్లు, తామర మొదలగు రోగములు నివారణజేయును. మోతాదు ప్రారంభమున 5 చుక్కలు మొదలుపెట్టి క్రమేపీ 60 చుక్కలవరకు హెచ్చించవచ్చును. పంచదారమీాద వేసిగాని, ఆవుపాలలో కలిపి గాని భోజనమైన తరువాత రోజుకు 2–3 పర్యాయములు యివ్వవలెను. యీవిత్తులనుండి తీయబడిన గైనోకార్డిక్ ఏసిడ్ (Gynocardic acid) అనునది బజారులో దొరకును. దీనినికూడ పైనవ్రాసిన రోగములకు యిచ్చిన బాగుగ పనిజేయును. మోతాదు పూటకు గోధుమగింజలో నాలుగవవంతు మొదలు అర్ధగోధుమ గింజవరకు (1/4 to ½ grain) ప్రారంభించి క్రమేపి 2–3 గోధుమ గింజలవరకు హెచ్చించి గుల్కందులో బెట్టి యివ్వవచ్చును.

నీరుల్లిపాయలు.—Allium Cepa. Eng. Onions సం॥ పలాండు, ముఖదూషణ, సుకంద, హిం॥ ప్యాజ్. కారము అదో రుచిగలది: వేడిజేసి అర్చును. చలవజేసి అర్చునని కొందరిమతము. పైత్యశాంతి, మేహశాంతి చేయును. దుష్టరక్తమును, మూలశంకను

బోగొట్టును. రక్తాతిసారము, గ్రహణి, రక్తగ్రహణి, నడుమునొప్పి, ఉదరము, ఉబ్బు వీనిని హరించును. మూత్రములోని సుద్దను పోగొట్టును. నరములకు సత్తువ, వీర్యపుష్టి, బలము, దేహపుష్టి జేయును, కాంతినిచ్చును. ఆకలి బుట్టించును. విరేచనము జేయును.మూత్రము గావించును. దేహమునకు ఉష్ణము, ఇంద్రియములకు చురుకుదనము బుట్టించును. దీపనకారి (stimulant), రక్తమూత్రము కట్టును. రక్తనాళములను శుభ్రపరచును.శ్లేష్మము, జ్వరము, దగ్గు,పురాణజగర్పు గలదగ్గు(Bronchitis),అజీర్ణము,కడుపునొప్పి వీనిని హరించును.పొట్టలోని వాతమును వెడలించును. వీనిని నూరి వంటికి పూసిన ఓడవాండ్రకు వచ్చెడు (Scurvy) అనురోగము నివృత్తించును. వీనిని పచ్చివి తినిన నిద్రదెచ్చును; మూత్రమును, బుతురక్తమును జారీచేయును; పురుగులు కుట్టినచోట దీనిరసము రుద్దిన మంటఅణగును; వీనిరసముగాని వీనినడుమ నుండెడు పాయ యుడికించి తీసిన రసముగాని చెవిలో పోసిన చెవినొప్పి, పోటు, అణగును; ఇతర కర్ణరోగములు నివృత్తించును. వీనిరసములో ఆవనూనెను సమముగ గలిపి మర్దనజేసిన వాతి మేహవాతనొప్పులు హరించును. వీనిని సిరకాతో వండి పుచ్చుకొనిన పాండువు, ప్లీహ (Enlargement of spleen), అగ్నిమాంద్యము (dyspepsia) హరించును. సిరకాలో వీనిని ఊరబెట్టి పుచ్చుకొనిన జీర్ణశక్తిని,ఆకలిని హెచ్చించును. పైత్యవికారము నణచును. చెడుగుణములుగల కూరలలో వీనిని వేసి వంట చేసిన వాని చెడుగుణములను విరచును; మాంసములో వేసి వంటచేసిన వుల్లిపాయలు దినిన దేహపుష్టి, ఆరోగ్యముగలుగును;వీనిని వండి లేక యుడికించి తినిన కఫమును, పొట్టలోని నొప్పిని హరించును. వీని రసము 2-3 తులములయెత్తు త్రాగించి వీని నూరిన ముద్ద గడ్డలో పెట్టి వాసన చూపించి 2-3 వుల్లిపాయలు నూరిన ముద్ద కాటుపైన

లేక కుట్టినచోట వేసికట్టిన సర్పవిషము, తేలు
విషము తేలుకుట్టినచోట మంట నివృత్తించును. వీని రసము పూటకు
సుమారు 1 మొదలు 2 తులములయెత్తు వరకు. రసములో ఏగాణి
యెత్తు పంచదార కలిపి ఉదయపు పూటలను పుచ్చుకొనిన రక్తము
పడే మూలవ్యాధి నిమ్మళించును. సాధారణ ఉరవగల యుల్లిపాయ 2
లేక 3 మిరియపు గింజలతో రోజుకు రెండుపూటల తినిన మన్యపు
జ్వరము నిమ్మళించును. 1 పెద్దఉల్లిపాయ రెండు ముక్కలుగ కోసి
అందుపైన సున్నపుపొడిజల్లి దానితో బాగుగా తేలుకుట్టినచోట
రుద్దిన మంట తత్క్షణమే నిమ్మళించును; మూర్ఛ వచ్చినపుడు ఉల్లి
పాయల రసము ముక్కులో పిండిన వెంటనే తెలివివచ్చును;ఉల్లిపా
యలు కుండలోపోసి, పైన మూతవేసి, చీలమన్ను ఇచ్చి, ఆవుపేడ
గోతిలో పూడ్చిఉంచి 4 నెలలు వెనుక తీసినవాటి నుపయోగించిన
వీర్యవృద్ధి గుణమధికమగును. ఉల్లిపాయల కషాయము పుచ్చుకొనిన
బొట్లుబొట్లుగా బాధతోపడే మూత్రము కట్టును. ఒక యుల్లిపా
యలో 1 గోధుమగింజయెత్తు నల్లమందుంచి,కుమ్ములోఉడికించి తినిన
రక్తగ్రహణి కట్టును, మూడువుల్లిపాయలున్ను, గుప్పెడు చింతా
కున్ను నూరి ఇచ్చిన విరేచనము చేయును; వడగొట్టిన మనిషికి వీని
రసము వంటికి పూసిన వడతీరును; వేసవి కాలములో బిడ్డల మెడను
ఉల్లిపాయకట్టిన వడగొట్టదు; వీనిని ఉడికించి బిడ్డలకు తినిపించిన వారి
పొట్టకు బలము జేయును; మరిడిజాడ్యము (cholera) దేహపు
నొప్పులు, జ్వరములు మొదలగు రుగ్మతలను బుట్టించెడు విషవా
యువు దోషములను పోగొట్టును; అట్టి రుగ్మతలు రాకుండ వీనిని
దండగాచేసి మెడలో ధరించుచుందురు; వీనిదండలనుగుమ్మములకుతోర
ణములుగ కట్టుదురు; వేసవికాలములో ఎండలో నడుచునపుడు ఒక
యుల్లిపాయను నడినెత్తినిఉంచి దానిపైన తలరుమాలుగాని టోపిగా ని

ఉంచుకొని నడిచిన వడగొట్టదు. రసము లోపలికి బుచ్చుకొనిన మాత్రములో పుట్టెడు రాతిని కరగించును; తీసివేయును; మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. పైనజెప్పిన దీని కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు వరకు. వీని రసము కండ్లకు పెట్టిన రేచీకటి మానును. వీనిరసములో తేనె గలిపి కండ్లకు పెట్టిన తేజస్సు గలుగును. వీని రసమును, తేనెయును సమముగ గలిపి బాగుగ పొంగించి ఉదయపు పూటలను వారముదినములు పుచ్చుకొనిన వీర్యవృద్ధిగలుగును. రసముయొక్క మోతాదు 1-2 తు॥ల ఎత్తు. వీనిని తినుటవల్లను, కొద్దిగ ఉల్లిపాయతిని జబ్బునీరుపుచ్చుకొనిన నీటిదోషమును హరించును. వీనిరసము కండ్లలో పిండిన కండ్ల కలక నజ్జుచేత నీరు కారడము కట్టును; ముక్కులోపోసిన ముక్కువెంట నీరుకారడము మానును; వీని విత్తసములు మెత్తగ నూరి కండ్లకు సురమావలె పెట్టిన కండ్ల రెప్పల పాండిమ (తెలుపు) మానును. ఉల్లిపాయలను నూరి దానితో పండ్లుతోమిన పండ్ల వెంట చీము, రక్తముపడుట కట్టును; నొప్పమానును వీనిని నూరికాళ్ళకు చేతులకు రుద్దిన మంటలు, తిమ్మిర్లు హరించును. సుమారు బేడయెత్తు మెంతులు, ఒకయుల్లిపాయను సన్నగ కోసిన ముక్కలు, ఉల్లిపాయ అంత వెన్న కలిపి తినిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. దినమునకు రెండుపూటలను 2-3 దినములు పుచ్చుకొనవలెను. ఉల్లిపాయలను కెమ్మెత్త,సంబరేణి ఆకులతో నూరికట్టినను, ఉల్లిపాయలుమాత్రము కుమ్ము(పొయ్యి)లోవుడికించికట్టినను గడ్డలు త్వరగాపగులును; పచ్చివి నూరి క్రొత్తగలేచిన గడ్డలకుకట్టిన నవి హరించును; వీనిదుర్గుణములు, బుద్ధిమాంద్యము, అజీర్ణము, కడుపు వుబ్బు, శ్లేష్మము, వాతము వీనిని బుట్టించును; గురుత్వముగ నుండును; రక్తపైత్యము గలుగును దీనికి విరుగుళ్ళు 1 వీనినివుప్పునీళ్ళతో కడగడము సిరకాలోఊరబెట్టి

డము. 3 పులుసులో వేయడము లేక పీనిని వండడము, 4 నేతిలో వేయించడము.

నీరుల్లియాకుకాళ్ళ కూర:—Curry of the onion leaves. వీనిని కూరవండిగాని, యితర కూరలలో వండిగాని పుచ్చుకొనిన రుచిగా నుండును. గుండెలలోని వాతము గుల్మము, మూలవ్యాధి వీనిని పోగొట్టును; మూత్రబద్ధమును విప్పును; అగ్నిదీప్తి నిచ్చును; లఘువుగ నుండును.

నీరువావిలిచెట్టు:—Vitex Trifolia. సం* జలనిర్గుండీ. హిం* జల సంహాలు. దీనిని సిరివావిలి యందురు. ఇది నీళ్ళయొడ్డునను, ఇసుక ప్రభూములలోను లేచెడు చిన్నచెట్టు. దీని ఆకు కొద్దిగ, సువాసనగ నుండును. దీని లేతచిగుళ్ళు,ఆకును ఆముదముతో వెచ్చజేసి కట్టినను లేక దానితో కాపడము పెట్టినను, వాత మేహావాతపు నొప్పులు, ఇరుకు నొప్పులు, ఇతర నొప్పులు, వృషణముల వాపు, పోటు, గాయములు,చేతులు కాళ్ళు ముడుచుకొనిపోవడము లేక బిగదీసుకుపోవడము, ఈడ్పులు (Convulsions) వానియందలి వాపు వీనిని హరించును. నరములకు సత్తువ జేయును. ఆకునూరి కట్టిన గడ్డలు హరించును. ఆకునూరి పట్టించిన చర్మరోగములు, ఉబ్బు హరించును. దీని ఆకు చూర్ణమును (సమూల చూర్ణము) నీళ్ళతో పుచ్చుకొనిన ఆహ్నికజ్వరము నివృత్తించును. దీని కాయలు నరములకు సత్తువజేయును. తలనొప్పిని పోగొట్టును. ఋతురక్తమును జారీ చేయును. ఇందులకు కాయలను యెండించి చూర్ణముచేసిగాని, కషాయముచేసిగాని, లేహ్యము చేసిగాని యియ్యనగును. చూర్ణపు మోతాదు పూటకు 1 మొదలు 3 అణాల యెత్తుచొప్పునను, కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తుచొప్పునను, లేహ్యము పూటకుఅరతులమెత్తు చొప్పున దినమునకు రెండు పూటల నియ్యవగును. దీని వేరుతో సుగంధముగలనూనె చేయుదురు.

నీలకంఠమను పక్షిమాంసము:—A kind of bird-flesh of. కఫము, వాతము, రక్తదోషము వీనిని నివారణ జేయును. ఉష్ణము జేయును. దీనికి విరుగుడు పసుపు.

నీలభస్మము:—Calx of Sapphire. సం॥ నీలమణి, ఇంద్రనీల, ఇది నవరత్నములలో నొకటి. ఉష్ణము, పైత్యము జేయును. జఠరదీప్తి నిచ్చును. వాతక్షయ, విషమజ్వరము, కఫపైత్యము, వాతము, శీత పైత్యము, దగ్గు వీనిని హరించును. శ్వాసకాసలను, త్రిదోషములను హరించును. దీని ధారణవలన గ్రహ (నవగ్రహ) దోషముల బోగొట్టును. ఆరోగ్యమిచ్చును. మోతాదు పూటకు 2॥ మొదలు 1 గురి గింజ యెత్తువరకు.

నీలాంజనము:— Antimony Sulfide. Eng. black antimony or getena. సం॥ సౌవీరాంజన, స్రోతోంజన. హిం॥ సుర్మా. దీనిని సుర్మారాయియని, సౌవీరాంజనమని యందురు. దీనిని క్రమముగ శుద్ధిచేసినదిగాని, భస్మము చేసినదిగాని మిక్కిలి మృదువుగా నుండును. వ్రణములు, వాతపైత్యము, గుల్మము, క్రిమిరోగము, కాస, రక్తకాస, ప్రమేహము, మూలవ్యాధి, మేహరోగము, ఎక్కిళ్ళు, శ్వాసకాసలు, క్షయ, విషదోషములు, నోరు, కండ్లు, ముక్కు వీని రోగములు హరించును. విరేచనములు, రక్తగ్రహణి, రక్తస్రావము వీనిని కట్టును. వాంతి జేయును. ఆహికజ్వరమునందు దీనినిచ్చి వాంతి జేయించవ నయమగును. దీనిని దానిమ్మపండ్ల రసములో 7 సార్లు కాల్చి ముంచితీసిగాని, త్రిఫలకషాయములో 7 సార్లు చనుబాలలో 7 సార్లు కాల్చి ముంచితీసి ఎండిన తరువాత మెత్తగా నూరి కండ్లకు బెట్టుకొనుచుండిన దృష్టికి బలమిచ్చును. వెలుగు చూడ లేకపోవుట (glare of the sight ), నీళ్ళుకారుట, కండ్లమంటలు, ఎరుపులు

మొదలగు ననేక నేత్రరోగములు నయమగుటయేగాక కండ్లకు చలువ, తేజస్సు కలుగును.

నీలిచెట్టు:—Indigofera Tinctoria. Eng. Indigo plant. సం॥ నీలినీ, నీలి. హిం॥ నీల్. ఇది పిన్ననీలి, పెద్దనీలి అని రెండు జాతులు. రెంటినుండి నీలిమందు తీయుదురు. ఇవి రెండును సమానగుణములు గలవి. వీనిలో దేనియొక్కయైన సమూలరసము లేక ఆకు రసము చేదుగనుండును. ఉష్ణము జేయును. సర్పవిషము, శ్వాస, కాస, కఫము, శూల, అగ్నిమాంద్యము, ఆమవికారము, వాతము, కష్టు వీనిని జయించును. దీని ఆకుచూర్ణమును తేనెతో నిచ్చిన పక్క శూల, కార్జపు (liver) పుండు (hepatitis) నివృత్తించును. దీని ఆకు కషాయము మూత్రకృచ్ఛ్రమును, సమస్తవిషములను హరించును; తత్వమును మంచికిమార్చును. మోతాదు పూటకు 2–3 తులములయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని లేతఆకుకాడలరసములో తేనె గలిపి పూసిన బిడ్డలనోటిపూత నయమగును. దీనివేరు పాలలోవేసి కాచి యిచ్చిన విరేచనములగును. దీనికాడలకషాయము పుక్కిలించిన నోటియొక్క రసపుపట్టును విరుచును. నీలి ఆకును నలిపి రసమును పిండివేసి దానిని పుప్పిపంటిపైన ఉంచి దానికియెదురుగనుండు పంటితో నొక్కిపట్టిఉంచిన పురుగు చచ్చును; నొప్పి అణగును. ఆకునూరి నూనెలో గలిపిపూసిన గజ్జి, చిడుము మానును. వేరును రమ్మునారాయిలో ఊరబెట్టిన ఆసారాయిని లోపలికిచ్చిన తిలలోని క్రిమిజాతిని హరించును. మోతాదు3–4 తులములయెత్తు, నీలిఆకురసము (Extract) మూర్ఛ, నరముల వ్యాధులు, ఒగర్పుగల దగ్గు (bronchitis), పురాణ మెదటిరోగములు వీనిని పోగొట్టును. మోతాదు పూటకు 3 మొదలు 12 గోధుమగింజల యెత్తువరకు; ఆకును. నీళ్ళతోనూరి పొత్తికడుపుకు

పూసిన లేక ఆకును ఆముదముతో వెచ్చచేసి పొత్తికడుపుకు కట్టిన మూత్రబద్ధము నివృత్తించును. మూత్రము జారీచేయును. దీనివేరు లేక ఆకుకషాయము జంతువిషములను, పాషాణ విషములను హరించును. మోతాదు పూటకు 4 మొదలు 8 తులములయెత్తుచొప్పున కొన్నిపూటలియ్యవలెను. ఆకు పసరులో దాల్చిని అరఖుకలిపి దూదిని తడిపి పుప్పిపంటిలో బెట్టిన పురుగులు చచ్చును. నొప్పి తీయును. రెండుమూడుమార్లు ఈలాగున చేయనగును.

నీలిమందు:—Indigo. ప్రస్తుతకాలమున నీలిమందు రెండువిధములు. నీలిచెట్లనుండి తీసినది. రసాయన శాస్త్రప్రకారము తయారుచేసినది. (Chemical) మరియొకటి గలవు. ఈక్రింద వ్రాయబడిన వుపయోగములు మొదటి రకమునకే—నీలిమందును నీళ్ళలోవేసి కాచి యిచ్చిన గురదాల (kidneys) రోగమును పోగొట్టును. దీని చూర్ణమును తేనెతోనిచ్చిన పురాణమెదటి రోగములు, నరముల రోగములు, ఒగర్పుగల దగ్గు (bronchitis), మూర్ఛ వీనిని హరించును. దీనిని నూనెలోగలిపి పూసిన వ్రణములు, పుండ్లు, అక్కి, దద్దురు (erysipelas), గజ్జి, చిడుము, కురుపులు మానును. వెంట్రుక లెదుగును. దీనిని నీళ్ళలోగలిపి పొత్తికడుపుకు పూసిన మూత్రబద్ధము కడుపుకుపూసిన కడుపుబ్బు నివారణమగును. కాలిన పుండుకు వేసిన మంట అణగును. ఉబ్బు (swelling) గలచోట పూసిన ఉబ్బు హరించును. పశువులు, గుర్రములు వీనిపుండ్లకు దీనిని వేసిన మానును. మురికివ్రణములపైన దీని చూర్ణమును జల్లిన నవి మానును. కషాయపు మోతాదు పూటకు 8-4 తులముల యెత్తు, చూర్ణపుమోతాదు పూటకు 2 మొదలు 5 గోధుమగింజల యెత్తువరకు. నీలిమందును సాధారణముగ లోపలి కియ్యకూడదని కొందరిమతము.

నీళ్ళలో వేసిన అన్నము:—Rice soaked in water. రాత్రి కుండలో నీళ్ళలో వేసిన వేడియన్నము ఉదయమున బుచ్చుకొనిన మిక్కిలి చలవ, మేహశాంతి, పైత్యశాంతి జేయును. మంటలు, విదాహము, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము వీనిని శమింపజేయును.

నీళ్ళు కొద్దిగ పుచ్చుకొనదగిన రోగులు:— Those who should drink water in small quantity. అరుచి, పడిసెము, ముక్కు దిబ్బడ, క్షయ, జఠరమాంద్యము, ఉదరరోగము, కుష్ఠు, జ్వరము, నేత్రరోగము, అతిసారము, ప్రమేహము ఈరోగములు గలవారు ఉదకపానము అల్పముగ జేయవలయును.

నీళ్ళసామాన్యగుణము:—Water generally. ఉదకము చూడుడు.

నులకమంచము:—Cot woven with bobbin or grass of hemp. దీనిమీద పరుండడమువలన కఫవాత పైత్యములను, సమస్తరోగములను శమింపజేయును. చలికాలమునందు వృద్ధులకును, చలిజ్వరము మొదలగు రోగులకు, పురటాళ్ళకును, వాతాది రోగములు రాకుండ నాపుటకును అనుకూలముగ నుండును.

నులిదడ చెట్టు:— Helicteres Isora. Eng. Indian screw tree. సం॥ రంగలత, ఆవర్తని. హిం॥ మొరడ్ ఫలీ. దీనిని చామంతి చెట్టని, దీనికాయలను మెలికాయలని, అరవమున వాలంబ్రిచెట్టని యందురు. ఇది చేదు, వగరు రుచులుగలది. దీనివేరు, అకురసము లేక కషాయము, క్రిమి, శ్లేష్మము, గుల్మము, ఉదరము, దగ్గు, వ్రణము, పైత్యము, ఉబ్బు, దురద, విషము వీనిని శోషణచును. వీర్యస్తంభన జేయును. కండ్లకు మేలుజేయును. దేహములో నేయవయవమందైన ముఖ్యముగ రొమ్ములనుండెడు చీము, రక్తము లేక దుష్టపదార్థములను దీసివేయును; పొట్టలోని రోగములను పోగొట్టును. దీని లేక కషాయము వస్తికర్మ (పిచికారీ) కుపయోగించును.

దీని కాయ చుట్ట చుట్టుకొని యుండును. దీని చూర్ణము ఆముదమున గలిపి చెవిచుట్టు బూసిన చెవిలో కురుపులు మానును. రసపు మోతాదు 1-2 తులములు, కషాయపు మోతాదు 2 మొదలు 5 తు॥ యెత్తు వరకు.

నులివేడివంటకము:—Boiled rice slightly hot. మనోహరముగ, రుచిగ నుండును; పైత్యమును, వాతమును అణచును; భ్రమ, రక్తపిత్తము, క్రిమి, కడుపుబ్బు, గుల్మము, అజీర్ణము, క్షయ, మూలవ్యాధి, ఎక్కిళ్ళు, శ్వాస వీనిని శమింపజేయును; జఠరదీప్తిని, బలమును ఇచ్చును. ఆరోగ్యముగ నుంచును.

నువ్వుచెట్టు:— Sesamum Indicum. Eng. Gingily oil plant. సం॥ తిలవృక్ష, స్నేహఫల. హిం॥ తిల్ కాజాడ్. దీని సమూలమును, నువ్వులను నూరి తేనెతో ఉడికించి కట్టిన గట్టిగనుండి పగులని గడ్డలు త్వరగా పక్వమై పగులును. దీనిసమూలము ఎండించి కాల్చిన బూడిద ఉష్ణము చేయును; అజీర్ణమును, కడుపునొప్పిని పోగొట్టును.

నువ్వుపప్పు:—Cleaned gingily seed. వేడిచేసి చలవచేయును; శరీరమునకు, గుండెలకు, ఊపిరితిత్తులకు (Lungs) కు నీరుబెట్టును, దగ్గునుసదుపాయము జేయును, దానంతటది జారేమూత్రమునుగట్టును; కొబ్బరితోబుచ్చుకొనిన మూత్రవ్యాధిని శమింపజేయును; కఫపైత్యము జేయును. దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి జేయును. దీనికి విరుగుళ్ళు 1 వేయించడము, 2 తేనె.

నువ్వుపువ్వు:—Flower of gingily plant. వాతము హరించును. వీర్యవృద్ధిజేయును. దీనిరసము కండ్లలో పిండిన నేత్రరోగముల హరించును.

నువ్వువుండలు:—Sweetmeat made of gingily seed. బెల్లము పాకముపట్టి నువ్వుపప్పు వేసిచేసినవి వాతమును, నేత్రరోగమును పోగొట్టును; వీర్యవృద్ధి నిచ్చును, పుంస్త్వమును హెచ్చించును.

నువ్వులపచ్చడి:—Pickle of gingily seeds with Chillies etc. ఇది నువ్వులలో కారమువగయరా రసవర్గములువేసి చేసినపచ్చడి, జఠరదీప్తినిచ్చును; వాతమునుగొట్టును; వేడిని, కఫమును జేయును; బలము నిచ్చును.

నువ్వులపొడి:—Powder of fried gingily seed. కఫపైత్యములను జేయును; బలమిచ్చును;వాతమునుబోగొట్టును;వంటినీరార్చును.

నువ్వులవడియాలు:—Buns of gingily seed. వాతమును హరించును; ఉష్ణము జేయును; బలము, జఠరదీప్తి నిచ్చును; కఫమును బెంచును. దీనికి విరుగుడు నువ్వులు చూడుడు.

నువ్వులు:—Sesamum Indicum. Eng. Gingily seed. సం॥ తిల, పితృతర్పణ, పాపఘ్న. హిం॥ తిల్. తీపి వగరు రుచిగలవి. ఉష్ణము జేయును; వాతమును, చర్మదోషమును హరించును; జఠరాగ్ని నిచ్చును, మూత్రమును కొద్దిపరచును; మేదస్సును బెంచును; మేహమును వృద్ధిబొందించును; దేహపుష్టి; బలముజేయును; వ్రణములను మాన్పును; బిగదీయును; మంచియాహారము; రక్తము వృద్ధి, వీర్యపుష్టి జేయును. కంఠధ్వనిని బాగుజేయును; గొంతుకకు కొంచెము నష్టముగేయును; ద్వంద్వజాతితత్వములకు, మూలవ్యాధి రోగులకు మేలుజేయును; కడుపును, మలద్వారమును మృదువు పరచును; మేహనజ్జును తీసివేయును: ఋతురక్తమును జారీచేయును; కఫపైత్యముల జేయును; ఆలస్యముగ జీర్ణమగును. దీనికి విరుగుళ్లు 1 పెరుగు, 2 ఉప్పు, 3 కలిసీళ్ళు కలిపిన తేనె. 4 కలిసీళ్ళు, 5 వెచ్చజేయడము; 6 తేనె, వీని కషాయ మిచ్చిన ప్రసవస్త్రీల మైలరక్తమును వెడలించును. మోతాదు 4-5 తులముల యెత్తువరకు.

నూకలజావ:—Gruel of grits. బియ్యపునూకలు జావ చూడుడు.

నాగుతోటకూర:—A kind of Amaranthus Tristis. తేలికగ నుండును; ఉష్ణము, పైత్యము జేయును; శూల, గుల్మము వీనిని హరించును; హృత్తికడుపును శుభ్రపరచును.

నాగుదోసకాయ:—నూతురుబుడమ చూడుడు.

నూతిచేపలు:—Well fish. పైత్యము జేయును; కఫమును, కఫవాతమును జయించును.

నూతినీరు:—Well water. ఉప్పునూతినీళ్ళు, తియ్యనూతి నీళ్ళు చూడుడు.

నూనె పిండివంటలు:— Cakes & prepared or fried in gingily oil. దాహము, చర్మరోగము, పైత్యము, కాక వీనిని బుట్టించును; గురుత్వముగనుండును, కండ్లకు జబ్బుజేయును; రక్తపైత్యమును దెచ్చును. దీనికి విరుగుళ్ళు పిండివంటలు చూడుడు.

నూనె నువ్వులది:—Gingily oil. నువ్వులు బాగుచేసి ఆడినసూనె ఆరోగ్యముగ నుండును; జఠరదీప్తి, దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి వీనినిచ్చును; ఋతుంక్తమును జారీచేయును; వంటినీరు దీయును; దురద మొదలగు చర్మరోగములను, క్రిమిరోగమును, వాతమును గొట్టును; కండ్లకు మంచిది; ఉష్ణము. పైత్యముజేయును. దగ్గు దెచ్చును; కఫమును, వ్రాచూపులను; శ్వాసను హెచ్చించును; శూలను బుట్టించును; మేహజ్వరమును బలపరచును;విరేచనబద్ధము జేయును; అమితముగ బుచ్చుకొనిన గర్భస్రావము గలిగించును. దీనికి విరుగుళ్ళు 1 కలినీళ్ళు, 2 పొడపత్రియాకురసము, 3 నీళ్ళుకలిపినతేనె. దీనికి పైనపూసిన గాయమును మృదువుపరచి మాన్పును. గడ్డలను కరగించును; పుండు మానును; ఈడ్పులను కట్టును. వడతగిలిన మనిషికి నూనెలో చనుపాలుపోసి రంగరించి చెవులలో

పోసిన వడతీరును. వేడిచిట్టుకుకు నీళ్ళమీద కొద్దిగ నెయ్యివేసి యియ్యవలెను.

నూనె, హారతికర్పూరము కలిపి పుచ్చుకొనిన విషమగును. దీనికి విరుగుళ్ళు 1 నీలిచెట్టువేరు, మిరియములు ఈ రెంటిని నూరి తేనెలో కలిపి యియ్యవలెను. 2 తంగేటి చిగుళ్ళునూరి మజ్జిగలో కలిపి యియ్యవలెను.

నూనె, తమలపాకు రసము కలిపి పుచ్చుకొనిన విషమగును. దీనికి విరుగుళ్ళు 1 బూరుగుచెక్క, పర్పాటకము. నీళ్ళతో నూరి లోని కియ్యవలెను, 2 కలినీళ్ళు, 3 పొడపత్రియాకురసము.

ఇంగువ, నూనె రుచి బుట్టించును; జఠరదీప్తినిచ్చును; వాతమణచునుగాని మిక్కిలి ఉష్ణము, పైత్యము జేయును; మేహరోగమును హెచ్చించును. దీనికి విరుగుళ్ళు 1 మొగలి చన్నులరసము, 2 పొడపత్రియాకు. తైలవర్జ్యములు, నూనె పుచ్చుకొనగూడని వారు చూడుడు.

నూనెను వండిన అటుకులు:—Flattened rice fried in gingily oil. గురుత్వముగ నుండును; వాతమును గొట్టును; కఫమును బెంచును. దీనికి విరుగుళ్ళు 1 కలి, 2 నీళ్ళుగలిపిన తేనె, 3 ఉప్పు.

నూనెకూడనిది:—Gingily oil unfit for use. ప్రాతది, పురుగులు పట్టినది, విరోధద్రవ్యములలో మిశ్రమమైనది, ఉప్పు మొదలగునవి కలసినది పరిహరించవలయును.

నూనెపుచ్చుకొనగూడనివారు:—Those who should not use or drink gingily oil. నేత్రరోగులు, జ్వరము, కుష్ఠు, విషము, శూల, భగందరము, పిచ్చి, మతిభ్రమ, స్మృతిలేకపోవడము ఈ రోగములు కలవారును, రసము దినినవారును నూనెను ఉపయోగించకూడదు.

నత్తళ్ళు పచ్చివి — Sprats-fresh-flesh of. వీనిని మెత్తళ్ళని యందురు. ఇవి సముద్రములోనుండెడి చిన్న చేపలు. రుచిగా నుండును; ఉష్ణము జేయును, త్వరగా జీర్ణమగును.

నత్తళ్ళు ఎండువి:—Do dried. ఉష్ణము, పైత్యము జేయును. వంటి నీరార్చును. బాలింతలకు పథ్యముగ నుండును. కొన్ని కాయకూరలలో వేసి వండి తిందురు, ఆరోగ్యముగ రుచిగ నుండును.

నెమలడుగు చెట్టు:—Caesalpinia Bonducella. సం॥ పూతీకరంజ, హిం॥ పూతిరంజ్. దీనిని నెమలిచెట్టని యందురు. దీనిచెక్క, ఆకు. రసము లేక కషాయము కారముగ నుండును; ఉష్ణముజేయును; యోనిదోషము, కుష్ఠు, గుల్మము, మూలవ్యాధి, వ్రణము, క్రిములు, కఫము వీనిని హరించును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు; కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు వరకు. దీనిచెక్క మెత్తగానూరి మడమశూలలకు గుడ్డవేసి కట్టి అప్పుడప్పుడు తడుపుచుండిన క్రొత్తగాలేచుచున్న మడమశూల హరించును. దీనికాయలలోని పప్పు నిమ్మపండురసములో అరగదీసి పూసిన గజ్జి, చిడుము నశించును. ఆకు నూరికట్టిన వాపులు, నొప్పులు హరించును. పొక్కజేయును. గనుక కొంచముసేపు ఉంచి తీసివేసి కొబ్బరినూనె వ్రాయవలెను.

నెమలిపించె విసనకఱ్ఱ:—Fan made of peacock whisk. చల్లగా మనోహరముగ నుండును; కాంతినిచ్చును, కండ్లకు మేలుజేయును; తాపమును, పైత్యమును, వాతమును అణచును. దేవతా ప్రియమైనది.

నెమలిమాంసము:—Peacock-flesh of. సం॥ మయూర, చిత్రపింఛక. హిం॥ మోరక్. చమురు గలిగి రుచిగ, తేలికగా, తృప్తికరముగా నుండును. పైత్యమును,రక్తపైత్యమును శమింపజేయును;

విషమును హరించును; నేత్రములు, చెవులు, బుద్ధి, జఠరాగ్ని, బలము, కాంతి, కంఠస్వరము, ఆయుష్యు వీనికి మేలుజేయును, చేతులు, కాళ్ళు, ముడుచుకు పోయెడు రోగము ( Contracted limbs) గలవారి కనుకూలముగ నుండును; వేడిజేయును, వాతమును పక్షవాతమును హరించును; వీర్యవృద్ధి బలముజేయును, దీని మాంస ములో కొబ్బరివేసి వండి పుచ్చుకొనిన విషతుల్యముగనుండును. దీనికి విరుగుళ్ళు 1 గుమ్ముడువేరు చూర్ణమును సౌవర్చలవణ చూర్ణమును గలిపిననీళ్ళు, 2 నిమ్మపండ్లరసము గలిపినశొంఠి, కరక పిందెలు ఉప్పు వీనిచూర్ణము, 3 పెసరపప్పు. దీనిమాంసము మార్గ శిర, పుష్య, మాఘ, ఫాల్గుణ, చైత్రమాసములయందు పుచ్చు కొనుట పథ్యకారిగను; ఆశ్వీజ, కార్తీక, జ్యేష్ట ఆషాఢమాసముల యందు అపథ్యకారిగను; సర్పములను భక్షించుచుండినదైనయెడల శ్రావణ భాద్రపద మాసములయందుగూడ పథ్యకారిగనుండును. దీని చమురు (క్రొవ్వు) మర్దన జేసినయెడల బిరుసుగనుండెడి కీళ్ళ పట్లు విడిపోవును.

**నెమ్మిచెట్టు:—Ougeni Dalbergioides, Dalbergia Oojeinensis**

సం॥ తినిశ, నేమీా. హిం॥ తినిశ, తిరైచ్చ. దీనికి తినిశచెట్టు అనియు నందురు. దీని చెక్క కషాయము పైత్యము, శ్లేష్మము, రక్త దోషము, మేదోరోగము, కుష్టు, ప్రమేహము వీనిని హరించును. నెమ్మిపండ్లు రుచిగానుండును; వాతపిత్తములను పోగొట్టును. చలవజేయును. హృదయమునకు, శరీరమునకుగూడ బలము పుష్టి నిచ్చును. వీర్యవృద్ధిజేయును. ప్రదరము, రక్తపిత్తము పోగొట్టును. శ్లేష్మవృద్ధి జేయును. కషాయపు మోతాదు 2-4 తులములు.

నెయ్యి అప్పుడు వెన్నకాచినది:—Butter Just Clarified. సం॥ సద్యోఘృతము. సువాసనగ, మనోహరముగ రుచిగనుండును. నేత్రములకు చలవచేయును. వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, కాంతి, బుద్ధి బలిమి, ఆరోగ్యము వీనినిచ్చును, కొద్ది వేడిచేయును. జఠరాగ్నిని వృద్ధిబొందించును, విషమును హరించును.

నెయ్యి పుచ్చుకొనగూడనివారు:—Those who should not use ghee. క్రొత్తగ జ్వరము తగిలినవారికిని, శ్వాస, ఉదరము, శ్లేష్మప్రకోపము, అగ్నిమాంద్యము, కుష్ఠు, భగందరము ఈరోగములు గలవారికిని, నెయ్యి అపథ్యముగ నుండును.

నెయ్యి షడ్రుతువులయందు పుచ్చుకొనెడు క్రమము, గుణము:—Mode of taking ghee on 6 seasons. గ్రీష్మఋతువునందు శర్కరతోను, వర్ష ఋతువునందు పంచకోలముల చూర్ణముతోను, శరదృతువునందు యవధాన్యపు పేలాలపిండితోను, హేమంత ఋతువునందు సైంధవలవణముతోను, శిశిరఋతువునందు పిప్పళ్ళపొడితోను, వసంతఋతువునందు త్రికటుకచూర్ణముతోను ఆవునెయ్యి కాచి ప్రాతఃకాలమందు బుచ్చుకొనిన ఆరోగ్యము, ఆయుర్వృద్ధి గలుగును.

నెయ్యి సామాన్యగుణము:—Ghee generally. త్రిదోషహరమైనది. పైత్యము, విషము, శోష, వాతపైత్యము, ఉబ్బు వీనినణచును. కండ్లకు చలవజేయును. బుద్ధి, జ్ఞాపకశక్తి, దేహపుష్టి, కాంతి, బలము, ఆయుర్వృద్ధి సుస్వరము, ఇంద్రియపుష్టి, జఠరదీప్తి వీనిని గలుగజేయును. పిల్లలకు, పెద్దలకు మూడుకాలములయందును హితముగనుండును. గాయము తగిలినవారికిని, వాడిన దేహము గలవారికిని, జ్వరపడి లేచినవారికిని, క్షయ, కార్శ్యరోగము, విసర్పియిరోగములు గలవారికిని అగ్నితప్తమైన వారికిని నెయ్యి,

మిక్కిలి పథ్యముగను, అనుకూలముగ నుండును. దీని అజీర్ణమునకు విరుగుళ్ళు 1 ఉష్ణోదకము, 2 నిమ్మపండ్ల పులుసు, 3 మిరియములు, 4 పుల్లనిమజ్జిగ, 5 ఇండుపగింజల గంధము కలిపినచల్ల, 6 నారింజపండు.

నెరసి:—Eleodendron Roxburghii. దీనిని నిరిజయని యందురు. దీని వేరుగంధము లోపలికిచ్చి గాయమునకు బూసిన సర్పవిషము హరించును. దీని గంధము పైనపూసినచో నెటువంటివాపు, ఉబ్బయినను హరించును. బలమయిన వగరుగలది. విరేచన బద్ధము జేయును. లోపలికిచ్చే మోతాదు అరతుల మెత్తువరకు నీళ్ళతో తీసినగంధ మియ్యవగును.

నెల్లి, చిరినెల్లిచెట్టు:—Premna Integrifolia, P. Spinosa. సం॥ గనికారిక, అగ్నిమంద, జయంతి, హిం॥ అరణి, అగేథు. దీనిని తక్కలిచెట్టని, తెక్కలి చెట్టనియందురు. అనగా పెద్దనెల్లి, చిరునెల్లి, గబ్బునెల్లి, కూరవెల్లి యని అందురు. వీనిచెక్క, వేరు, ఆకురసము లేక కషాయము చేదుగ, కొలదికారము, వగరుగ నుండును. వేడి జేయును. వాతము, పాండువు, ఉబ్బు, శ్లేష్మము, జ్వరము, మన్యపు జ్వరము, క్రిమి, అగ్నిమాంద్యము, మలబద్ధము వీని నణచును. శరీర తత్వమును మంచికి మార్చును. సవాయి, వాతపునొప్పులను హరించును. దీనివేరు నూరి వైనుసారాయిలోగాని, ఆవుపాలలో గాని కలిపియిచ్చిన కడుపునొప్పి నయమగును. దీని వేరుకషాయములో శిలాజిత్తు కలిపి సేవించుచుండిన స్థౌల్యరోగము మానును. దీనివేరు గంధము పూసిన సర్పి మొదలగుపొక్కలు మానును. రసపు మోతాదు పూటకు 2-3 తులములమెత్తు కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములమెత్తువరకు. నెల్లికాయలవరుగు మేహశాంతి జేయును.

నెల్లికూర, చిరినెల్లి కూర:—Curry of the leaves of do. చిరిచేదు, స్వాదుగ నుండును. వాతపైత్యములను, కఫమును శమింప జేయును; అగ్నిదీప్తి నిచ్చును. గుల్మము, మూలవ్యాధి వీనిని హరించును. పైత్యము జేయును.

నేతి తలయంటు :— Anointing with ghee. అభ్యంగనము చూడుడు.

నేతిదొండకాయ:—A sort of Coccinia Indica రుచిగనుండును. చలువజేయును. పైత్యశాంతి, మేహశాంతి జేయును. పథ్యమైనది. వీనిని కూర జేసి పుచ్చుకొందురు.

నేతిపిండివంటలు:—Cakes Puddings Sweets, Hots prepared in ghee. రుచిగ, మనోహరముగ, తేలికగ నుండును. వాతపైత్యములను హరించును. బలము, వీర్యవృద్ధి, కాంతి వీని నిచ్చును. కండ్లకు మంచిది. ఉష్ణము, గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు పిండివంటలు చూడుడు.

నేతిబీరకాయ :— A sort of Cucumber-curry of. సం* ఘృత కోశాతకి. రుచిగనుండును. వీర్యపుష్టి జేయును. ఎక్కిళ్ళు, విషము, విషజ్వరము, ప్రమేహము, పైత్యము, దాహము వీని నణచును. దేహతత్వమును సౌమ్యపరచును. సమశీతోష్ణముగ నుండును. పథ్యమైనది.

నేపాళపుచెట్టు పెద్దది:—Jatropha Curcas, Eng. Angular leaved physic nut or country croton shrub. సం* బృహద్దంతి, గుచ్ఛ ఫలా, కాననవేరండ. హిం* ముగలాయిఅండ్, పహాడీ. దీనిని అడవి ఆముదపు చెట్టుఅనిన్ని, పెద్దనేపాళపుచెట్టనిన్ని అందురు. దీనిపాలు మర్దనవలన వాతములను, మేహవాతపు నొప్పులను హరిం

చును. పుండ్లను శుభ్రపరచి మాన్పును. చిడుము, తామర, మొద లగు చర్మరోగములను పోగొట్టును. దీని మ్రానుచెక్క దంచి ఆము దముతో వెచ్చజేసి కట్టిన మోకాళ్లవాపు పోటుగల మేహవాతపు నొప్పులు నయమగును. దీని విత్తులు దినిన విరేచనము గావించును. గాని కొందరికి వమనములగును. విత్తులలోని ఆకులు తీసివేసి 2-3 విత్తనములను తినవచ్చును; ఎక్కువతినిన విషమగును; దీనికి విరు గుళ్లు నేపాళము చూడుడు. దీని ఆకులను ఆముదముతో వెచ్చజేసి కట్టిన గడ్డలు హరించును; దీని ఆకునూరి కొద్దిగ ఆముదములో ఉడి కించి కట్టిన గడ్డలు పగులును. దీని విత్తులనూనె గజ్జి, చిడుము, విసర్ప మొదలగు చర్మరోగములను పోగొట్టును. దీనిలో కొద్దిగా కొబ్బ నూనెగలిపి మర్దనజేసిన పురాణమేహవాతపు నొప్పులు నిమ్మ ళించును. వేరుచూర్ణము పూటకు ఒక చిటికిచొప్పున ఇచ్చిన ఉదర రోగములు హరించును. 20-30 దినము లియ్యవలెను. దినమునకు రెండుపూటల నియ్యవలెను.

నేపాళము:— Croton Tiglium. Eng. Purgative Croton (Croton oil Seeds) సం॥ జయపాల, బీజరేచన. హిం॥ జమాల్‌గోటా, జేపాల్. ఔషధములలో వాడే నేపాళగింజల పప్పు లేక దీని చమురు మిక్కిలి పైత్యము, ఉష్ణము జేయును. వాతమును హరించును. మూత్రము గావించును. వికారము పెట్టి వమనమును బుట్టించును. మోతాదెక్కువైన చంపును. దీనికి విరుగుళ్లు 1 నెయ్యి, 2 పసుపు, 3 తంగేటిచిగుళ్ళు, 4 తుమ్మచెక్క రసము, 5 చంద్ర చెక్క రసము, 6 మునగ చెక్క రసము, 7 మునగఆకు కషాయము, 8 నీరుల్లిపాయలరసము, 9 వసకాల్చిన మసి, 10 ధనియాలు, కల కండనూరి పెరుగుగలిపి త్రాగడము. దీనివిత్తులను దీపముమీద కాల్చి దాని పొగపీల్చిన ఉబ్బసపుదగ్గు అణగును. దీని విత్తుల చమురు ఒక

వంతు, ఆవనూనె లేక ఆలివునూనె ( Olive oil ) 10 వంతులుగలిపి రొమ్మునకు పూసిన బిడ్డలకుగుర్రుగల దగ్గు (Bronchitis) అణగును; విత్తుల గంధము పైనపూసిన యెఱ్ఱబడజేయును. (rubefacient); ఆగంధము కణతలకు పట్టువేసిన తలనొప్పి నిమ్మళించును. మరియు నేపాళము పిచ్చి, వెఱ్ఱికుక్క, వెఱ్ఱినక్కకాటు విషజన్ని, రుద్రవాతము (apoplexy) మొదలగు దారుణవ్యాధులు గలవారికి తోడనే విరేచనములు చేయించుట కనుకూలముగ నుండును. నేపాళపువిత్తులలోని పలుకులు (పత్రములు) దీసివేసిన గాఢవిరేచనము చేసెడు దుర్గుణము తగ్గును. ఒకగింజలోని పప్పులో ఒకబద్ద మోతాదుగ ఇయ్యవచ్చును. గాని తేనెతో నూరి అంతకు తక్కువ మోతాదుగ ఇయ్యడము మంచిది. ఒక గోధుమగింజయెత్తు దీనిపప్పు, 8 గోధుమగింజలయెత్తు హారతికర్పూరము గలిపి యిచ్చిన అనుకూలమైన మోతాదు. ఏడేండ్లలోపు వయసుగల పిల్లవాండ్రకు, ముసలివారికి నేపాళ మియ్యకూడదు. పిచ్చుక గ్రుడ్డంత పేడలో ఒకగింజయుంచి నిప్పులమీద పేడమాడువరకు దానినుంచి తీసి ఆగింజలోని పప్పును తేనెతో రెండుమాత్రలు చేయవలెను; అట్టి 2-3 మాత్రలు పెద్దవారికి మోతాదు. తేనె 4కి 1 పాలువేసి నూరిన మాత్రయగును. ఈగింజలను పాలలో ఉడికించి లోని పత్రము తీసివేసి గింజకొక మాత్రజేసి పెద్దవారికి ఒకమాత్ర నియ్యనగును; గింజలలోని పప్పును గుడ్డను మూటగట్టి పేడలో ఉడికించితీసి వానిలోని ఆకులను తీసివేసి 1 వంతుపప్పు, 2 వంతులు కవిరివేసి నూరిన విరేచనౌషధముగ వాడనగును; మోతాదు 1 గురిగింజ యెత్తు పెద్దవారికిచ్చెడు మోతాదు. కడుపులో బల్లలు గలవారికి దినమునకు 1 గోధుమగింజ యెత్తుచొప్పున కొన్నిదినములు ఇచ్చిన నయమగును. గింజలనూనెతో మర్దనచేసిన వాతపునొప్పులు హరించును. ఈనూనె 1 చుక్క విరే

చనములగుట కిచ్చే మోతాదు. గింజలలోని ఆకులను నీళ్ళలో నాన బెట్టి ఆనీళ్ళనిచ్చిన విరేచనము లగును. ఆయాకుల చూర్ణము పాము కరచిన గాయములో వేసిన విషము హరించును.

నేరేడుచెట్టు:—**Syzygium Jambolanum & Eugenia Jambolana Eng. Jambul, the black plum.** సం* జంబు, సురభి పత్ర. హిం* జామూన్. దీనినే కాకినేరేడందురు. అల్ల నేరేడు కంటే దీనికే గుణ మధికము. దీని మాను చెక్క రసము లేక కషాయము గ్రహణి, రక్తగ్రహణి, అతిసారము, నీళ్ళవిరేచనములు, జ్వరము వీనిని కట్టును. ఏలకులు, దాల్చినిచెక్క మొదలగు వస్తువులు చేర్చి యియ్యవచ్చును. దీని కషాయమును పుక్కిలించిన గొంతుకపుండు (sore throat) నివ్మళించును. రసము తినుటచేతగాని ఇతర కారణ ములచేతగాని నోటివెంట చొల్లు (saliva) కారుటకట్టును. దీని లేత ఆకులరసమును మేకపాలతో నిచ్చిన రక్తగ్రహణి కట్టును. దీనిఆకు లునూరి తేలుకుట్టినచోట కట్టిన విషమును హరించును. బాధ నివృ త్తించును. ఆకులరసమును పుక్కిలించిన ఉబ్బి మెత్తబడిన చిగుళ్ళు ఘట్టిపడి నొప్పి హరించును. దీని పండ్లతో చేసినపాకము (syrup) నీళ్ళవిరేచనములు, గ్రహణి కట్టును.పండ్లుతినినను నీళ్ళవిరేచనములు గ్రహణి కట్టును మూత్రపు సంచిలో రాళ్ళు పుట్టుట మానును. పండ్లతో చేసిన సిరకా పొట్టకు బలముజేయును. ప్లీహరోగమును పోగొట్టును. ఎండించిన దీని విత్తుల చూర్ణమిచ్చిన అతిమూత్రమును కట్టును. మధుమేహము అనగా మూత్రములో పంచదార పుట్టుట మానును. పుట్టకుండ పోవును. వీని చూర్ణమును, మామిడిటెంకల చూర్ణమును సమముగ కలిపి యిచ్చిన నీళ్ళవిరేచనములను, రక్త గ్రహణిని కట్టను. నేరేడు ఆకులు ఒకగుప్పెడు, ప్రత్తిగింజలు అరగుప్పెడు, రుబ్బురోటిలో ఆవుపాలు సుమారు ఒక సోలెడు

వేసి బాగారుబ్బి, గుడ్డతో ఆ రసంపిండి 1-2-3 పర్యాయములు యిచ్చిన పాషాణవిషములను హరించును. దీని ఆకుల విస్తరిలో భోజనము చేసిన అతిసారము, గ్రహణినికట్టును. పైత్యము నణచును. ఆరోగ్యము నిచ్చును. విరేచనబద్ధము జేయును. ఎండించిన విత్తుల చూర్ణము 160 గోధుమగింజల యెత్తు ఇచ్చిన ముషిణిగింజల విష మును హరించును. పచ్చివిత్తుల రసమిచ్చిన అతిమూత్రము కట్టును. ప్లీహరోగము ( enlargement of spleen ) పోగొట్టును. పండ్లతో చేసిన సిరకా చలవ జేయును. అజీర్ణమును పోగొట్టును. చెక్కయొక్క గాథ కషాయముతో మురికిపుండ్లు, వ్రణములు గడిగిన నవి శుభ్ర పడి మానును. దీని యాకులచూర్ణముతో పండ్లు తోముచుండిన నవి ఘట్టిపడును. మానుచెక్కరసపు మోతాదు 1 మొదలు 3 తుల ముల యెత్తు వరకు. కషాయపు మోతాదు 3 మొదలు 5 తుల ముల యెత్తువరకు. విత్తులచూర్ణపు మోతాదు పావలాయెత్తువరకు. ఆకురసపు మోతాదు 3-4 తులములయెత్తు. పచ్చివిత్తుల రసము యొక్క మోతాదు 2 తులములు. పండ్లతో చేసిన సిరకా మోతాదు 1 మొదలు 2 తులములు.

నేరేడు నీళ్ళు:—అనగా నేరేడుచెట్టు వేరునుండి మేడిచెట్టునీళ్ళు తీసి నట్టు తీసిననీళ్ళు వగరుగనుండును. చలవ జేయును. రక్తపైత్య మును, మేహమును, అతిసారమును, రక్తగ్రహణిని అణచును. మోతాదు 2 మొదలు 4 ఔన్సులవరకు. ఈచెట్టుయొక్క నీడ చలవ జేయును. వీర్యవృద్ధి నిచ్చును. అతిసార, రక్తాతిసారములను శమింప జేయును. శ్లేష్మవృద్ధి చేయును.

నేరేడుపండు:—Fruit of do. వగరు, తీపి, పులుపు రుచులు గలది. చలవజేసి ఆర్చును. ఆకలి బుట్టించును. మేహశాంతి, పైత్యశాంతి జేయును. పుంస్త్వమునకు బలమిచ్చును. శిరోపైత్యములను, మేహ

మును, కఫపైత్యమును అణచును. శ్లేష్మము జేయును. వేడివిరేచనములు కట్టును. వీర్యపుష్టి, గురుత్వము, విరేచనబద్ధము, చలవ, వాతము జేయును. ఉష్ణతత్వముగల వారిపొట్టకు బలమిచ్చును మరింత గుండె (heart), రక్తము వీనిలోని వేడిని పోగొట్టును. కడుపులో వాతము బంధించును. గొంతుకకు, రొమ్మునకు, గర్భిణీస్త్రీలకు జబ్బు చేయును. నేరేడుపండ్లకు విరుగుళ్ళు 1 శొంఠిచూర్ణము, 2 ఉసిరిక పప్పు. తియ్యనిపండ్లకు విరుగుడు కడిగి ఉప్పుతో పుచ్చుకొనడము. నేరేడుపండ్లు తినుటవలన ప్రేగులలోగాని, పొట్టలోగాని చేరిన తలవెంట్రుకలు, లోహపుముక్కలను హరించివేయును.

నేరేడు విత్తులు:—Seeds of do. నేరేడుచెట్టు చూడుడు.

నేలఅనప చెట్టు:— A ground gourd plant. సం॥ నాగదుంబి, భూతుంబి. ఇది యేటా లేచెడు చిన్నతీగె. యిది తరుచు పుట్టపైన లేచును. దీనివేరు లేక సమూలము లేక కషాయము చేదుగ, కారముగ నుండును. ఉష్ణము జేయును. సన్నిపాతము, గళగండము, ధనుర్వాతము, పక్షవాతము, మహావాతములు వీనిని హరించును. రసపుమోతాదు అరతులము మొదలు తులమెత్తువరకు. కషాయపు మోతాదు 2 తులముల యెత్తువరకు.

నేలఆముదపుచెట్టు:—Jatropha Glandulifera. ఇది యేటేట లేచెడు చిన్న చెట్టు. దీనికి బటానీగింజంత కాయలుండి వానిపైన సన్నని వంకర ముండ్లుండును. వీని విత్తులలోనుండి తీసిన ఆముదము ఉష్ణము జేయును పురాణ మేహవాతనొప్పులు, వాతనొప్పులు, పక్షవాతము వీనిని పోనడచును. ఇదిపైన మర్దనచేయుటకు మిక్కిలి ఉపయోగముగనుండును. ఈచెట్టునుండి బయలుదేరెడి తెల్లనిపాల లేక రసము కండ్లలోపోసిన పొరలను కోయును.

నేలకొబ్బరి:—రత్నపురుష చూడుడు.

నేలగుమ్మడి—:Ipomaea Digitata, Convolulus Paniculatus, సం॥ విదారి, వృష్యకంద, భూమికూష్మాండ. హిం॥ బిదారీకంద్, బిలాయి. యిదిపాలుగల నేలగుమ్మడి. నీరుగల నేలగుమ్మడని రెండు విధములు. తీపి రుచిగలది. దీనిదుంప తెల్లగ, జిగటగలిగి యుండును; మృదువుపరచును; మేహశాంతి దేహపుష్టి, వీర్యవృద్ధి జేయును; నిశ్శాక నణచును;వీర్యనష్టముకట్టును,తత్వమును మంచికిమార్చును; నపుంసకత్వమును, క్షయను, రక్తపైత్యమును, దేహము ఎండిపోవ డము పోగొట్టును; బలము జేయును.ఆయుర్వృద్ధి నిచ్చును.'రక్తమును శుభ్రపరచును; స్త్రీలకు పాలుబడజేయును; ఋతురక్తమును వెడల డమును క్రమపరచును. గర్భమును నిలుపును. దీనిచూర్ణము ఆవు వెన్న,పంచదారతో తినిన మిక్కిలి దేహపుష్టి శీఘ్రముగ జేయును; చూర్ణపు మోతాదు, పూటకు 1 అణాయెత్తు మొదలు 4 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు 1-2 ఔన్సుల చూర్ణమునకు సమముగ పటికపంచదార చూర్ణము గలిపి సుమారు 5 తులముల యెత్తు ఆవుపాలతో సేవించ నగును.

నేలగురుగుడుచెట్టు:—A Medicinal plant. ఇది యేటాలేచెడు చిన్న మొక్క. దీనిని నేలపురుముడని నేలగోరిమిడని అందురు. దీని ఆకు చేదుగ నుండును. సమూలరసము లేక కషాయము, చూర్ణము వేడి జేయును. వాతము, శూల, ఋతుశూల, కుష్ఠ, వ్రణములు, చర్మరోగము వీనిని బోగొట్టును. దంతపు చిగుళ్ళనొప్పని హరిం చును. ముఖముమీది బొటిమల బోగొట్టును. కంటిరెప్పలు పుం డగు లేక పొక్కుపొక్కె-దానిని మాన్పుటకు పైన పూయనగును. ఆకురసపు మోతాదు 1-2 తులముల యెత్తు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాలెత్తువరకు; చిగుళ్ళనొప్పికి ఆకు నలియ గొట్టి పెట్టనగును. ఋతుశూలకు దీని సమూలచూర్ణము

ఒక భాగము, శంఖభస్మము ¼ భాగము, కర్పూరశిలాజిత్తు భస్మము ¼ భాగము ప్రకారము కలిపి నూరి, ఒక సీసాలోవుంచుకొని బహిష్టు యైనది మొదలు 3 దినములు రెండుపూటలా బియ్యపు కడుగుతో పూటకు 2-3 అణాలయెత్తు చొప్పున యిచ్చిన ఋతుశూలలు 2-3 బహిష్టులకు వరుసగ యిచ్చిన ఋతుశూలను బోగొట్టి సంతానము గలుగజేయును. బియ్యపుకడుగులోకలిపి 3 దినములు ఉదయ సాయం కాలములయందు దియ్యవలెను. యిచ్ఛాపథ్యం.

నేలతంగేడుచెట్టు:—Cassia Obovata-Eng. Country senna. సం॥ హేమపుష్పి, స్వర్ణపత్రి, కళ్యాణి. హిం॥ చుయీాకాఖాసా. దీని వేరు, ఆకు చేదు, వగరు రుచులుగలిగి యుండును. వేడిజేయును, శ్లేష్మము, వాతము, పైత్యము వీనిని బోగొట్టును. జఠరదీప్తిని, వీర్యపుష్టిని యిచ్చును. కుష్టు, మేహము, జ్వరము వీనిని హరించును. విరేచనము జేయును. అనుపానవిశేషముగ నిచ్చిన సమస్తరోగము లను హరించును. దీని సమూలమును నీడను ఎండించిన చూర్ణమును 20 లేక 40 లేక 60 దినములు అనుదినము ఉదయపు పూటలను తేనెతో బుచ్చుకొనిన బలముగలుగును. పంచదారతో తినిన ఉష్ణ మును, నీరసమును అణచును. పటికి పంచదారతో తినిన కీళ్ళకు బల మిచ్చును. శరీరమునకు బలముజేయును. పాతబెల్లముతో తినిన కడు పులోనుండెడు మలమును తీసివేయును. శుభ్రపరచును. ఆవునెయ్యి, పంచదారతో నిత్యముతినిన యెప్పటికిని ఆరోగ్యముగ నుండును. ఆవువెన్నతో తినిన ఎండిపోయిన రొమ్ము తిరిగి పుష్టియిచ్చును. కడు పులో నొప్పియును బాగగును. పెరుగుతో తినిన విషముతిన్నను బాధింపదు. శరీరముననున్న మచ్చలు, తామర మానును. మీాగ డతోతినిన విషమెక్కదు. కడుపులోని మలమును దీసివేయును. ఆవు పాలతో తినిన దేహకాంతి నిచ్చును. రొమ్మును శుభ్రపరచును.

దేహబలము గలుగును. గొ్రఱెపాలతో బుచ్చుకొనిన బలము, ధాతుపుష్టి హెచ్చును. పదిమంది స్త్రీలతో రమింపవచ్చును. లేడిపాలతో బుచ్చుకొనిన చాలబలము గలుగును. ఎప్పటికి అలసట గలుగదు. ఒంటెపాలతో బుచ్చుకొనిన ఎల్లప్పుడు మనస్సు సంతోషముగ నుండును. ఖర్జూరపు కాయతో పుచ్చుకొనిన నోటి దుర్గంధము లేకుండును. ఏమి భుజించినను రుచిగ నుండును. ఖర్జూరపు పండుతో తినిన ఆకలి, దాహము గలుగదు. బలముగ నుండును. దానిమ్మపండ్ల రసములో పుచ్చుకొనిన ఎల్లప్పుడు సంతోషముగ, సుఖముగ నుండును. రొమ్మునొప్పి హరించును. నారదబ్బ పండ్లరసముతో బుచ్చుకొనిన రొమ్ము చులకనగ నుండును, కఫము హరించును. ఆకలి, జీర్ణశక్తి గలుగును. గుంటకలగరాకు రసముతో పుచ్చుకొనిన వెంట్రుకలు నెరియకుండును; సత్తువగలిగి యుండును. పాలతోను, అరటిపండ్లతోను తినిన నేత్రములు బాగుగనుండును; అల్లపు రసముతో బుచ్చుకొనిన ముఖకాంతి, కండ్లకు తేజస్సు గలుగును; మెదటికి మేలుజేయును; పుంస్త్వము, జీర్ణశక్తి హెచ్చును; సెగసంకటము, మూడపట్టు మంట, అతిమూత్రము, మూత్రద్వారము పెద్దదగుట, మూత్రకృచ్ఛ్రము, దంతదౌర్బల్యము వీనిని నివృత్తించును. మోతాదు పూటకు 2 అ॥ మొదలు 6 అ॥ యెత్తువరకు.

నేలతప్పిట చెట్టు:—గ్రంథితగరము చూడుడు.

నేలతాడి:—Hypoxis Orchioides, Curculigo O. సం॥ ముసలీ, వారాహీ, తాలమూలీ. హిం॥ కాలీముసలీ. ఇది నలుపు, తెలుపు రెండు జాతులు. సన్నముగా సుమారు జానెడు పొడవుగల మొపలు. దీని ఆకులు లేతవి ఖర్జూరపు ఆకులనుబోలి చిన్నవిగ నుండును, పసుపుపచ్చని పువ్వులు పూయును. జిగురుగలిగి తీపి,

చేదు రుచిగలవి. దీని దుంపలచూర్ణము లేక కషాయము వేడిజేసి అర్పును; వీర్యవృద్ధిజేయును; ఉష్ణమును, మేహమును, అమితరక్తము వలన గలిగెడి రోగమును, క్షయరోగమును బహిష్ఠదోషములను (అనగా ఋతురక్తదోషములు Menstrual derangements) కుసుమరోగము, శెగరోగము. శుక్లనష్టము బోగొట్టును; బలమును, ఆయుర్వృద్ధిని, సౌఖ్యమును ఇచ్చును. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాలయెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తు॥ యెత్తువరకు. దీనిచూర్ణము సమభాగముగ పటికిపంచదారతో బుచ్చుకొనిన ఉబ్బసరోగమును, మూలవ్యాధిని అణచును; ధాతు పుష్టి జేయును. 4 అ॥ చూర్ణము. కిసిమా జీలకర్ర రసముతో కలిపి పుచ్చుకొనిన కామిలరోగమును, శొంఠిరసముతో పుచ్చు కొనిన శ్లేష్మవాంతి, విరేచనములను హరించును; ఓమము రసముతో పుచ్చుకొసిన దగ్గును, పిప్పళ్ళరసముతో పుచ్చుకొనిన వెర్రికుక్క విషమును, స్ఫోటకమునునిమ్మళించును. కల్లుప్పుతో తినిన ఆకలిపుట్టును. వేడినీళ్ళతో త్రాగినకడుపునొప్పితగ్గును. ఆవుపాలతో త్రాగినధాతు పుష్టి, వీర్యపుష్టి, పుంసత్వము హెచ్చించును; దేహపుష్టిజేయును. మంచినూనెతో కలిపి తినిన దగ్గు, కఫమును హరించును; నీరుల్లిపాయ రసముతో తినిన దేహశాంతి హెచ్చును; తులసి ఆకురసముతో కలిపి యిచ్చిన బిడ్డల కడుపునొప్పులు, నివర్తించును. త్రిఫలకషాయ ముతో యిచ్చిన సెగరోగము హరించును. మరియు అనుపాన విశేషములతో నిచ్చిన వనేక రోగములను బోగొట్టును. దీనిని పటికి పంచదారతోను, వేడినీళ్ళతోను 40 దినములు పుచ్చుకొనిన హృద యము, మెదడు, దేహము వీనికి మేలుజేయును; దేహపుష్టి, వీర్య పుష్టిజేయును. వీనికి పథ్యము పులుసు, జలుబు వస్తువులు, స్త్రీ

సాంగత్యము, విచారము, కోపము, అలసట, చల్లనినీళ్ళు, చల్లని గాలి వర్జింపవలెను.

నేలతుత్తురు బెండ:—Ground Mallow. దీనిని నేలబెండ అని యందురు. ఇది నేల(పాకును; పసుపుపచ్చని పువ్వులుండును. దీని ఆకులును, కాడలును జిగురు గలిగియుండును; మేహశాంతి జేయును; దీని సమూలమును నూరి పటికిపంచదార కలిపి యిచ్చిన గ్రహణి, రక్తగ్రహణి వీనిని కట్టును. మోతాదు కుంకుడుకాయంత చొప్పున దినమునకు రెండుపూటలను 3-4 దినములు ఇయ్యవలెను.

నేలనెమలిపిట్ట:—Florikin-flesh of. దీని మాంసము రుచిగ నుండును; వాతము హరించును; గురుత్వము, వేడి జేయును; దేహపుష్టి, వీర్యపుష్టి, జఠరదీప్తి వీని నిచ్చును; స్వరమును బాగు జేయును; అరుచిని బోగొట్టును

నేల నేరేడుచెట్టు:—Premna Herbacea. సం॥ భూజంబు, నాదేయి. దీని వేరు రసము లేక కషాయము వగరుగ, రుచిగ నుండును; కఫ పిత్తముల హరించును. మలబద్ధము జేయును; కంఠరోగమును బోగొట్టును; శుక్లవృద్ధి జేయును. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. రసపుమోతాదు 2-3 తులములు.

నేలపరుండడము:—Sleeping or lying on the ground. వాతము జేయును; ఒంటినొప్పులను, కర్ణశిరోనాశికా రోగములను బుట్టించును; అసౌఖ్యమైనది.

నేలమాళిగ:—Living in an under ground house. నేల కొట్లులో నివసించడమువలన జఠరాగ్ని నిచ్చును; మూర్ఛ, దాహము, శ్రమ, చెమట, వీనిని హరించును. వేడిని, శీతబాధను, వాతమును, మేదస్సును అణచును. దేహకాంతిని పోగొట్టును, వివర్ణత దెచ్చును.

నేలములక (పెద్దనేలములక):—Solanum Jacquinii. S. Xanthocarpum. సం॥ బృహతీ. వారాకీ. హిం॥ బడీకటేలీ. ఇది పసుపు, తెలుపు,నలుపు, కాయలుగల జాతులుగలవు. దీనిపువ్వులు తెలుపు, వూదారంగు కలిసియుండును; వంగచెట్టునుబోలి చిన్న ఆకులుండును. ఇది దశమూలములలో నొకటి. దీని సమూలము వుపయోగించవలెను. యీ మూడును యించుమించు సమానగుణముగాని తెల్లవి శ్రేష్టము. దీని సమూల కషాయముగాని, చూర్ణముగాని కారము, చేదుగ నుండును; జఠరదీప్తినిచ్చును; త్రిదోషముల నణచును; శ్లేష్మము, దగ్గు, జ్వరము వీనిని హరించును; హృద్రోగము, శాంతి, శ్వాస, కాసలు, ఆమదోషము, మలబద్ధము వీనిని హరించును; బలము జేయును;దీని పండ్లరసము బూసిన మేఢ్రదోషమును హరించి దార్ఢ్యమిచ్చును; తెల్లములక రసబంధమునకు వుపయోగింతురు. దీనికాయలు పైరోగములకున్నూ పనిచేయును; ఆ రోగముల యందు పథ్యముగనుండును; దీని పండ్లను నూరి పసుపుగలిపి యోని పైన వ్రాసుకొనినను,ధూపము వేసికొనిననూ యోనిశూల దురదలు హరించును; దీనికాయలుగాని, వేరురసముగాని తేనెగలిపి మర్దన చేయుచూ దీనినే లోపలికి పుచ్చుకొనుచుండిన యింద్రలుప్తమును అనగా పేను కొరుకుటను పోగొట్టును; దీని వేరును చనుబాలలో అరగదీసి కండ్లకు బెట్టుచుండిన నేత్ర రోగములను హరించును; దీని సమూలకషాయపు మోతాదు 2½ మొ॥ 5 తు॥ మొత్తువరకు. చూర్ణము మో॥ 1–2 అణాలయెత్తు. వీని కాయలకూర వాత, శ్లేష్మ రోగులకు పథ్యముగనుండును; దీని విత్తులచూర్ణము వీర్యవృద్ధి జేయును; నేత్రరోగములు, స్వరభంగము, పీనస, మూత్రకృఛ్రమును హరించును; మోతాదు 3–4 చిన్నములయెత్తు.

నేలరేగుచెట్టు:—Ground Zizyphus Jujuba. దీనిపండ్లు తియ్యగ, పుల్లగనుండును; కఫవాతములను హరించును; అగ్నిదీప్తి నిచ్చును. విరేచనము గావించును; రక్తపైత్యము బుట్టించును.

నేలవుశిరక చెట్టు:— Phyllanthus Niruri. P. Usinaria. సం* భూమ్యామలకీ, భూతదాత్రీ. హిం* భూయీఆమలా. సీయారి. ఇందులో కాడలు యెరుపు, తెలుపు రంగులనుబట్టి రెండుజాతులు. యెరుపు, రసవాదోపయోగము. తెలుపు, జాత. ఔషధోపయోగము. దీని సమూలాల రసము, లేక కషాయము, లేక చూర్ణము వగరు, తీపి, చేదుగనుండును. వీర్యవృద్ధిజేయును. పొట్టకు బలమిచ్చును. వాతము, పైత్యము, కఫము. వీనిని హరించును; వ్రణమును మాన్పును. పొత్తికడుపులోని తాపమును, పోట్లను అణచును. మేహశాంతి చేయును. గ్రహణి, పాండువు, కామిల, ఉబ్బు, ఉదర రోగము, సెగరోగము, మూత్రరోగము వీనిని హరించును. దేహములోని మలములను, మూత్రమును వెడలించును. దీని వేరు పూటకు తులముపావు నూరి ఆవుపాలు సుమారు పావుశేరులో కలిపి యీ చొప్పున రెండు పూటలను కొన్ని దినములిచ్చిన పాండు రోగము నివృత్తించును. సమూలరసములో నూనెవేసి కాచి కండ్లలో వేసిన నేత్రరోగములు హరించును. ఆకు చల్లతోనూరి పూసిన బిడ్డల చిడుము, గజ్జి నివృత్తించును. దీనివేరు, ఆకుల చూర్ణము వరికడుగుతో నుడికించి కట్టు (Poultice) కట్టిన వాపు, పోటుగలవ్రణములు మానును. ఆకులో కొద్దిగ ఉప్పువేసి నూరి కట్టిన ముసికిపుండ్లు, వ్రణములు మానును. ఆకునూరి పూసిన గజ్జి, పల్లికలు, పొక్కులు, నోటిలోని పొక్కులు, పుండు నయమగును. ఆకునూరి పాలలోనిచ్చిన మూత్రరోగములు, ఉదరము, ఉబ్బురోగము మానును. ఆకునూరిన ముద్ద పూటకు

కరక్కాయంత ఉండవలెను. దీని లేతయాకుల తేలిక కషాయముతో బేడెత్తు మొదలు పావలాయెత్తువరకు మొంతులు తినిన పురాణరక్త గ్రహణి కట్టును. 5-6 పూటలియ్యవలెను, దీని ఆకులును మొంతులును నూరినది పూటకు గెచ్చకాయంత చొప్పున పెరుగు తుల మెత్తుతో దినమునకు 2 పూటలను పుచ్చుకొనిన పురాణ రక్తగ్రహణికట్టును. దీనివేరు కడుగుతో నూరి సుమారు జాజికాయంత యిచ్చిన స్త్రీలరక్తస్రావము కట్టును. ఒకతులమెత్తు రసములో ఒక అణాయెత్తు మిరియాలచూర్ణము కలిపి బహిష్ఠయిన మూడు దినములూ యిచ్చిన దారుణ ఋతుశూల ఋతుబద్ధము హరించును. ఇట్లు 2-3 బహిష్ఠలకు యివ్వవలెను. ఈ మూడు దినములు, పొంగు నీళ్ళ అన్నము, పాలుఅన్నము పథ్యము చేయవలెను. (వుప్పుకూడదు) సంతానయోగ్యత గలుగును. దీని సమూలము ½ తు॥ మొ॥ 1తులమెత్తు వరకు. 2-3 తులముల పెరుగులో గలిపి త్రాగించి, మజ్జిగ అన్నము (ఉప్పు లేకుండా) 3 దినములు వుదయం, సాయంకాలముయందు పుచ్చుకొనిన కామిల రోగము తప్పక నివారణయగును. 3-4 పూటలియ్యవలెను. దీని పచ్చియాకులో కొద్దిగ (10,12) మిరియములు వేసి నూరి పూటకు సుమారు జాజికాయంత చొప్పున దినమునకు రెండుపూటలను 5-6 దినములిచ్చిన వరుస జ్వరము, చలిజ్వరము నిమ్మళించును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములచొప్పునను, కషాయము పూటకు 2½ మొదలు 5 తులములమెత్తు చొప్పునను, చూర్ణము పూటకు 2 అ॥ మొదలు 4 అణాల మెత్తువరకు.

నేలవేము:—Swertia Chirata, Gentiana Chirata. G. Kuroor, Agathotes Chireyta. Eng. The Chirata, Hymalaya or Indian Gentianna. సం॥ భూనింబ, జ్వరాంతక, కిరాతతిక్త.

హిం॥ చిరాతా, చిరాయతా, నిల్ కట్. ఇది ఏటాలే చెడు చిన్న చెట్టు. ఇది మన దేశములో విస్తారముగ దొరకునదిన్నీ రెండు హిమాలయప్రాంతములో దొరకు దానిని సీమనేలవేమని వాడుదురు. దీని యందు గుణమధికము. దీనిసమూలకషాయముగాని. తేలికకషాయముగాని, చలికషాయముగాని, చూర్ణముగాని వెగటు,చిక్కలి చేదుగ నుండును. పైత్యశ్లేష్మవాతములు, సన్నిపాతజ్వరము, శీతజ్వరము, ఆహికజ్వరము, మన్యపుజ్వరము,ఆమవాతపునొప్పులు (Rheumatism)విదాహము, గుల్మము, శూల, రక్తకాస, దగ్గు. కుష్ఠు,దురద, వ్రణము, గండమాల, అన్ని జ్వరములు వీనిని హరించును; కార్జము (Liver) ప్లీహము (Spleen) ల యొక్క జబ్బులను (Enlargements etc.) నివృత్తించును. పాముత్రిషమును హరించును; నీరసమును పోగొట్టును, జఠరదీప్తినిచ్చును; బలముజేయును; రక్తమును శుభ్రపరచును; చిడుము మొదలగు చర్మరోగముల పోగొట్టును; క్రిమిని హరించును. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులములయెత్తు, చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాలయెత్తు వరకు. పైనచెప్పిన గుణములనేగాక దీని సారము (Liquid extract) నీళ్ళవిరేచనములను, గ్రహణిని, రక్తగ్రహణిని కట్టును. మోతాదు 30 మొదలు 60 చుక్కలవరకు. ఇది చిక్కలి యుపయోగకరమైన వస్తువు. దీనితో సుదర్శనచూర్ణము మొదలగు యనేక యోగములుచేసి వాడుదురు.

నైఋతిదిక్కుగాలి గుణము:—అష్టదిక్కులగాలిగుణము చూడుడు.

—ప—

# ప

పంచ కోలములు:—Compound of five or six drugs. అనగా శొంఠి, పిప్పలి, పిప్పలిమూలము, చెవ్యము, చిత్రమూలము ఇవి 5 దును పంచకోలములని, మరియొక సాంప్రదాయ ప్రకారము కరక్కాయ, అజామోదము, సౌందర్యలవణము, శొంఠి, ఇంగువ యీ సముదాయచూర్ణమునకున్నూ యీ దిగువ గుణములే కలిగి యుండును. వీనితో మిరియములు కలిపిన షడూషములని పేరు, వీని చూర్ణము లేక కషాయము వాతము, సన్నిపాతము, ఉదరము, కడుపులోనిబల్లలు, మలమూత్రబద్ధము, గుల్మము, శూల, అజీర్ణము, అగ్నిమాంద్యము, పడిసెము, జలుబు, మూలవ్యాధి వీనిని హరించును. చూర్ణపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులములమెత్తు వరకు.

పంచదారపుచ్చుకొన కూడనివారు:—Those who should not eat Sugar. కుష్ఠు, గుల్మము, మూలవ్యాధి, క్రిమి, శూల, మహోదరము, ఉబ్బు, జ్వరాతిసారము, అతిమూత్రము, మధుమేహము (Sugar Complaint) ఈ రోగములు గలవారు పంచదార మానవలయును.

పంచదార:—Sugar. చీనాపంచదార చూడుడు.

పంచపల్లవములు:—Compound of tender leaves of five trees. అనగా రావి, మర్రి, జువ్వి, మేడి, నేరేడుచెట్లు వీనిచిగుళ్ళ కషాయము వగరుగ నుండును; శీతపైత్యము, అతిసారము, కాళ్ళు చేతులుమంటలు, మేహము, పైత్యము వీనిని హరించును; వీర్యస్తంభన జేయును. పై అయిదు చెక్కలయొక్క కషాయమిచ్చిన రక్తప్రదరము, కుసుమరోగములు మానును. మరియు మామిడి, నేరేడు, వెలగ, మాదీఫలము, మారేడు అను 5 చెట్లయొక్క

చిగుళ్ళనుకూడ పంచపల్లవములని గ్రంథాంతరమున చెప్పియున్నది. వీనికిన్ని పై గుణములేగాక వీని కల్కమునుగాని కషాయమునుగాని యిచ్చిన పిత్తాతిసారము, గ్రహణిని కట్టును. విరేచనబద్ధము చేయును. కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులములు. రసపు మోతాదు 2-3 తులములు.

పంచపల్లవపత్రములో భోజనము:—Taking food in a Platter of leaves of do. మర్రి, జువ్వి, రావి, మేడి, బ్రహ్మమేడి వీని ఆకుల విస్తరి ఉత్తమమైనది; చలవజేయును; బుద్ధిని హెచ్చించును; పైత్య మణచును; కొద్దికఫము, వాతము జేయును.

పంచముటి గంజి:— Cunjee made of five sorts of grain. అనగా ఉలవలు, పెసలు, శనగలు, యవలు, బియ్యము వీనిని గలిపి గాచిన వేడిగంజి త్రిదోషహరమై యుండును. మాంద్యమునకు, సర్వ జ్వరములకు మంచిది.

పంచమూలములు(లఘు):—Compound of five drugs-small అనగా కోలపొన్న, ముయ్యాకుపొన్న, నేలములక, వాకుడు, పల్లేరు అనునవి. వీనిని కనిష్టపంచమూలములందురు. వీని సమూలసమభాగ కషాయము పైత్యజ్వరము, కఫము, శ్లేష్మపైత్యములనుహరించును. మోతాదు 2 మొదలు 5 తులముల యెత్తువరకు.

పంచమూలములు(గురు):—Compound of five drugs- Big. అనగా మారేడు, గుమ్ముడు, నెల్లి, కలిగొట్టు, దుందిలము అనునవి. వీనిని మహత్పంచమూలములందురు. వీని వేరు లేక చెక్కల సము దాయకషాయము చేదుగ, వగరుగ నుండును. వాతరోగములు, శ్వాసకాసలు, అగ్నిమాంద్యము, అజీర్ణము, జ్వరములనుహరించును. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 5 తులములయెత్తే

వరకు. పై రెండు విధములు పంచమూలము గలసి దశమూలము లగును. దశమూలములు చూడుడు.

పంచసుగంధములు:—Compound of five spices. తక్కోలములు, పోకచెక్కలు, లవంగములు, జాజికాయ, పచ్చకర్పూరము వీని సముదాయచూర్ణము రుచిగ నుండును. క్రిములను, పైత్యమును హరించును. అగ్నిదీప్తి నిచ్చును. మోతాదు పూటకు పావుతులము. మరియు మంచిగంధములో అగరుగంధముకలిపి, కొద్దికొద్దిగ పచ్చ కర్పూరము, కుంకుమపువ్వు, కస్తూరి కలిపినది పంచసుగంధ మం దురు. దీనిని శరీరమునకు వ్రాసుకొనిన చల్లదనముగలిగి సుగంధము గలిగి యుండును. చర్మదోషములు, రక్తదోషము, శిరోరోగము లను, విషములను హరించును. శరీరకాంతినిచ్చును. మనోహరము గ ఆరోగ్యముగ నుండును.

పండుమీను:—The perch or cockup-fish. అనగా పండుగొప్ప అను చేపమాంసము చమురుగలిగి రుచిగనుండును. బలము జేయును. జఠరదీప్తి నిచ్చును. మేహమును, మూలవ్యాధిని, జ్వరమును, అరు చిని పోగొట్టును; త్రిదోషహరమై పథ్యముగ నుండును.

పండ్లుసామాన్యగుణము:—Fruits generally. స్వాదు, తీపి, పులుపు, వగరు రుచులు గలిగియుండును; బలము, వీర్యవృద్ధి, కాంతి, జఠర దీప్తి, రక్తపుష్టి వీనినిచ్చును; ఆకలి, దాహముల నణచును; అమిత ముగ దినిన గురుత్వముజేయును; దీనికి విరుగుళ్ళు 1 సజ్జాక్షారము, 2 నువ్వుచెట్టు కాల్చి చేసిన క్షారము.

పందికొక్కు:—Bandicoot. దీనిమాంసము రక్తపైత్యమును, పైత్య వాత రోగములను జయించును. సమస్తధాతువులకు బలమిచ్చును. కష్టం, జ్వరము, పశువులరోగమును పోగొట్టును. గురుత్వముగ నుం డును. మేదస్సును పెంచును.

పందిమాంసము:—Fork. అడవిపందిమాంసము, ఊరపందిమాంసము చూడుడు.

పందిరి దోసకాయ:—Cucumis Sativus. a sort of. సం* చీనా కర్కటి. హిం* చీనాకకడీ. తియ్యగనుండును. గురుత్వము జేయును. చలవ, వాతము, శ్లేష్మములను వృద్ధిపరచును. దాహము, తాపమును శమింపజేయును.

పందిరినీడ:—Shade of a Pendal. చల్లగనుండును. శ్రమను పోగొట్టును. నేత్రములకు చలవజేయును. విసర్పి నణచును బుద్ధివికాసము నిచ్చును. ప్రమేహమును, వికారమును శమింపజేయును.

పంపర పనాసపండు:—Citrus Decumana. Eng. Shaddoe or Pemelmoos. గుండ్రముగ, కోలగ పెద్దగా పైచర్మము గరుకుగ నుండును. పండు చర్మము దళసరిగ దూదివంటి కండగలిగి లోపల తొనలుండును. ఇవి ఎర్రగను, కొన్ని తెల్లగను ఉండును. కొంచము పులుపు తీపి రుచులు, శీతవీర్యము, గురుగుణము, మధురవిపాకము గలది. చలవ, మేహశాంతి చేయును. తృప్తినిచ్చును. కొద్దిశ్లేష్మము, అగ్నిమాంద్యము జేయును. దీనికి విరుగుళ్ళు 1 కరక్కాయముర బ్బా, 2 పంచదార.

పక్కిచెట్టు:—Tamarix Gallica. Eng. Tamarisk. సం* పిచుల, ఝావుక. దీనికి పాలుండును. ఈపాలు కాళ్ళపగుళ్ళకు, చర్మము మీద బొబ్బలేచి పైచర్మము ఊడిపోయిన దానికిని వేసిన వానిని మాన్పును. దీని చెక్కరసము లేక పాలు లేక కషాయము చేదుగ, కారముగ నుండును. మూత్రకృచ్ఛ్రమును నశింపజేయును. మాంసమును కుళ్ళు పుట్టకుండ జేయును. దీనిపుల్లతో దంతధావనము జేసిన దంతవాతము నివారణమగును

పగటి నిద్ర:—Sleeping in the day time. బద్ధకమును బుట్టించును. వాతము జేయును. అన్న మరుగక యుండును. శోదస్సును

హెచ్చించును; బుద్ధిమాంద్యము జేయును. నీరసము దెచ్చును. దుర్బల శరీరమును గలుగజేయును. గాని వేసవికాలమందు మిత ముగ పగటి నిద్ర సౌఖ్యమిచ్చును.

పగటినిద్ర కూడనివారు:—Those who should not sleep in the day time. జ్వరితులు (అన్నము పుచ్చుకొన్న వారు), పాం డువు, ఉబ్బు, వాతము, అగ్నిమాంద్యము ఈరోగములు గలవారు పగటినిద్ర మానవలయును.

పగడపుతీగె చెట్టు:—Arum Colocosta. సం॥ నలికా, కపోతాంఘ్రి, విద్రుమలతా. హిం॥ నలికా. దీనిని గువ్వగుత్తి చెట్టని యందురు. ఇది సుగంధద్రవ్యము. కారము, చేదు రుచులుగలది. దీని వేరు, ఆకు రసము లేక కషాయము రుచిబుట్టించును; రక్తపైత్యము, కుష్ఠు, విషమును, ప్రమేహమువలన గలిగిన రక్తస్రావమును, సుఖరోగ ములను బోగొట్టును. మేహశాంతి, చలవజేయును; నేత్రములకు మేలు చేయును; మూత్రకృచ్ఛ్రమును హరించును. రసపు మోతాదు పూటకు 2–3 తులముల యెత్తు చొప్పుననూ, కషాయము పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తు చొప్పునను పుచ్చుకొనదగి యుండును.

పగడభస్మము:— Corallium Rubrum Eng. Corals. Calx of. చక్కగశుద్ధిజేసిచేసిన భస్మము శ్లేష్మము, పైత్యము, అగ్నిమాం ద్యము. దగ్గు, మేహకారకము, మేహవాతము వీనిని హరించును; త్రిదోషముల నణచును, వీర్యవృద్ధి, బలము, దేహపుష్టి చేయును. అతి మూత్రము, రక్తమూలము, క్షయ, పొట్టలోని వాతము, క్రిమిరోగము వీనిని హరించును. హృదయమునకు, పొట్టకు బలముజేయును మో తాదు పూటకు 2 మొదలు 4 గురిగింజలయెత్తు చొప్పున దినమునకు 2 పూటల నియ్యనగును. వట్టిది తినిన నాలుక పొక్కును గాన శొంఠి

చూర్ణము, జీలకర్ర చూర్ణము, వెన్న, తేనె మొదలగువానిలో దేనితోనయిన కలిపి పుచ్చుకొనవలెను. నెయ్యి, తేనె, కలకండ వీనిని సమభాగముగ పరిగ్రహించి ఆవుపాలతో బుచ్చుకొనిన దోష యుక్త ప్రవాళ (పగడ) భస్మసేవవలన గలిగిన వికారము నివృత్తించును.

పగడము:—Corals. సం* ప్రవాళ, విద్రుమ. హిం* మూంగా. సముద్రమందు బుట్టును. నవరత్నములలో నొకటి. దొండపండువంటి ఛాయగలిగి గుండ్రముగ, కోలగ, వంకరలేక నున్నగ, గొగ్గులు పుచ్చులు లేక స్థూలముగనుండుపగడము శ్రేష్ఠము. తియ్యగ, పుల్లగ నుండును. వీని ధారణవలన వాతపిత్తాది దోషములను హరించును. వీర్యవృద్ధిని, కాంతిని, ఆయురారోగ్యములనిచ్చును. తేనెతో అరగ దీసి పూసిన జిహ్వాదోషమును పోగొట్టును.

పగలు నిద్రించకూడినవారు:—Those who should sleep in the day time. సంచారము, స్త్రీసంభోగము, అశ్వారోహణము, దూరము నడవడము, వీని నధికముగ నొనర్చుటచే అలసటనొందిన వారును, అతిసారరోగులును, శూల, శ్వాస, దాహము, ఎక్కిళ్ళు ఇవి గలవారును, కృశించినవారును, క్షీణకఫము గలవారును, శిశువులు, మత్తులు, వృద్ధులు, అజీర్ణరోగులు, ఉపవాస మున్నవారు, అల్పాహారం బొనర్చినవారును, రాత్రులందు జాగరణముజేసిన వారును, పగటియందు నిద్రింపనగును. సౌఖ్యకరముగ నుండును. పైనజెప్పినవారు పగటినిద్ర పోకపోయిన త్రిదోషప్రకోపము గలుగును. రోగము జనించును. ఉన్నరోగ మధికమగును.

పచ్చకర్పూరము:—Laurus Camphor-Refined or Purified Camphor. సం* హిమకర్పూర. హిం* హింకాపూర్. చీనీయా కాపూర్. భీమసేనకర్పూరము. Eng. Bornes Camphor. సం*

భీమశేనకర్పూర. హిం॥ భీమశేన్ కపూర్. యిది ఒకవిధమైన పచ్చ కర్పూరము. యిది బోర్నియో, సుమత్రా దీవులనుండి, సింగపూరు నుండి తయారయి వచ్చును. పచ్చకర్పూరమనగా హారతికర్పూర ములో కొన్ని సుగంధద్రవ్యములుచేర్చి బట్టీపెట్టి తయారుచేసినది. చిన్నచిన్న బిళ్ళలుబిళ్ళలులాగున నుండును. తెల్లగా కొద్ది పసుపు పచ్చగా లేక గౌరవర్ణముగ నుండును. యీవిధముగానే 2-3పర్యా యములు బట్టీపెట్టి తయారుచేసినది చాలా శుద్ధముగాను, గుణాధి క్యముగా నుండును. పచ్చకర్పూరము తయారుచేయు పద్ధతులనుబట్టి శాస్త్రములలో అనేకములు గలిగియున్నవి. వంటభేదములనుబట్టి గుణభేదము గలిగియుండును. పచ్చకర్పూరము చిరిచేదుగ మిక్కిలి సువాసనగలిగి మనోహరముగా నుండును రక్తపైత్యము, క్రిమి రోగము, నేత్రరోగములు కఫము, దాహము, తాపము, భ్రమ, మూర్ఛ, ఉన్మాదము, అరుచి, పైత్యవికారము, వాతపైత్యము. వాతశ్లేష్మము, పైత్యశ్లేష్మము, దగ్గు, క్షయ, ఆరువిధములగు మూత్రవ్యాధులు వీని నణచును. విరేచనము జేయును. వీర్యపుష్టి నిచ్చును. బుద్ధిని హెచ్చించును. వాచాలత్వము నిచ్చును. బలము దేహపుష్టి జేయును. చెమట సమస్త దుర్గంధములు నణచును. విష దోషము, చర్మము, దంతములు, శిరస్సు వీనియందలి రోగములను శమింపజేయును. మిక్కిలి కామజనకమైనది. మరియు అశ్వారోహ ణము చేసినప్పుడును, కడుపుబ్బు గలిగినప్పుడును, రతికాలమందును, ఎండబడినప్పుడును, ఖుత్పిపాసల నధికముగ బొందినప్పుడును, దోషించినప్పుడును, తాపము పుట్టినప్పుడును ఇది సేవించడము ప్రశస్తము; పచ్చకర్పూరము చలవజేయును. పడిసెము దెచ్చును. తిమ్మిరి బుట్టించును. దీనికి విరుగుడ్లు 1 కస్తూరి, 2 సముద్రపునురుగు. మోతాదు 1 మొదలు 2 గురిగింజ పూసల యెత్తువరకు.

పచ్చకాంచనము:—కాంచనవృక్షము చూడుడు.

పచ్చగడ్డిమేసిన ఆవుపాలు:—Milk of a cow fed with do. ఆవు పాలు చూడుడు.

పచ్చగన్నేరు:—Thevatia Nerifolia.Eng. The Exile or yellow Oleander. సం* పీతకరవీర. హిం* పీలాకనేర్. ఈ చెట్టు దేవాలయములలో, పూలతోటలలో వేయుదురు. ఈ చెట్టు పాలుగలిగి సన్నని యాకులుగలది. దీని పువ్వులు పసుపుపచ్చగను పొడవుగను సువాసన గలిగియుండును. తెల్లని పువ్వులుపూయు జాతియునుగలదు. దీని చెక్క చేదుగనుండును. గాఢ విరేచనకారి. మోతాదెక్కువైన విషతుల్యమగును. దీని చెక్క చూర్ణము 1 మొదలు 2 గోధుమగింజలమెత్తు ఇచ్చిన అహికజ్వరము కట్టును. దీనికాయలోని పప్పుతినిన విషమై శీఘ్రముగ మనిషిని చంపును. ఇందుకు విరుగుడు 1 ఆవుపేడ నీళ్ళలోకలిపి వడపోసి వెంటనే లోపలికిచ్చిన విషము విరుగును. 2 కరక్కాయ నీళ్ళతోనూరి తీసిన రసము. 2-3 పర్యాయములు ఇవ్వవలెను. దీనిపాలుకూడా విషము.

పచ్చపావురము:—Green Pigeon. దీనిని పోలుగుపిట్ట అనియుందురు. దీనిమాంసము వగరుగలిగి రుచిగానుండును; ఉష్ణము జేయును. వాతమును హరించును. వీర్యమునకు వేడిని, పుష్టిని యిచ్చును. బలము జేయును; పథ్యకరమైనది.

పచ్చపిట్ట:—A deep yellow bird. దీనిని పచ్చారుబుడ్డియని యందురు. ఇది పసుపురంగు గలిగి మిక్కిలి యందముగ నుండును. దీని మాంసము క్రొవ్వుగలిగి రుచిగా నుండును. త్రిదోషములను హరించును; మిక్కిలి జఠరదీప్తి నిచ్చును.

పచ్చపెసరపప్పు:—Dhall of green gram. చలవజేసి ఆర్చును. త్రిదోషములను హరించును; జఠరదీప్తి నిచ్చును. దాహము నణ

చును. గళరోగము, నేత్రరోగము, కుష్ఠు, క్షయ, మూలశంక, అజీర్ణము, విదాహము, జ్వరము, రక్తపైత్యము, మేహపైత్యము వీనిని శమింపజేయును విరేచనము జేయును; దేహపుష్టి నిచ్చును, మంచిరక్తమును బుట్టించును; త్వరగ జీర్ణమగును; వేసవికాలములో దినుటకును, ఉష్ణపైత్య తత్వములు గలవారికిని, పైత్యజ్వరము, ఉష్ణజ్వరము గలవారికిని, పీనసరోగులకును, ఉష్ణరోగులకును, దంద్వరోగులకును అనుకూలముగ నుండును; కడుపు బిగబట్టడమును పోగొట్టును; పొట్టుదీయని పప్పు శ్రేష్టము. పొట్టుదీసినది మిక్కిలి జబ్బుచేయును; వేయించి పొట్టుతో ఉంచిన పప్పువండి తినిన జఠరదీప్తి నిచ్చును; పైత్యరోగమును గొట్టును; సర్వేంద్రియములకు బలమిచ్చును; శ్లేష్మవాతితత్వములు గలవారికిని, వృద్ధులకును, వాతకఫరోగులకును మిక్కిలి జబ్బుచేయును; పుంస్త్వమునకు, ధాతుపుష్టికి నష్టముజేయును; వాతతత్వము గలవారి గుర దాలకు నష్టముజేయును. వాతమును, తలనొప్పిని బుట్టించును; దీనికి విరుగుళ్ళు 1 పిప్పళ్ళు, 2 ఓమము, 3 ఉదకము, 4 శొంఠి, కరక్కాయిపిందెలు, ఉప్పు వీని చూర్ణము, 5 పంచదార, 6 తేనె, 7 ఉష్ణఔషధములు, 8 జీలకర్ర.

పచ్చపెసలు:—పెసలు చూడుడు.

పచ్చరటిపండ్లు:—A sort of Plantain. వీనిని పట్నంలో పచ్చవాళ్ మందురు. పొడవుగా, ఆకుపచ్చగానుండును. బాగాపండిన కొంచం పసుపుపచ్చగావుండును. సువాసనగా, మంచిరుచిగావుండును. మేహశాంతి, పైత్యశాంతిజేయును. ఆకలిని శాంతింపజేయును. అరటిపండు సామాన్యగుణము చూడుడు.

పచ్చలభస్మము:—Calx of Emeralds. సం॥ గరుత్మంత, మరకత. హిం॥ పన్నా, ఆకు పచ్చరంగుగలిగి, బరువుగలిగి, కాంతిగలిగియుండు పచ్చ శ్రేష్ఠము. దీని ధారణవలన ఆయురారోగ్యైశ్వర్య

ములు గలుగును. పైత్యము జేయును; శ్లేష్మవాతము, క్షయ, రాజయక్ష్మ, పాండురోగము, మూలవ్యాధి, కఫము, సన్నిపాత జ్వరము, ఉబ్బు, చర్ది, జ్వరములు వీనిని హరించును. మోతాదు 1/2 మొదలు 1 గురిగింజ యెత్తువరకు.

పచ్చాకు:—Dried fragrant leaf sold in Bazars. సం* ధ్యామక్య పత్ర. హిం* పసడీ. వగరు, చేదుగ, సువాసనగ నుండును; కాక జేయును; మదనోద్రేకమును గలుగ జేయును. దీని ధూపము భూత పీడల బోగొట్టును. దీని తేలిక కషాయము పొట్టకు బలము జేయును; జీర్ణశక్తినిచ్చును; నిద్రదెచ్చును. దీని చూర్ణముగాని కషాయముగాని కఫవాతముల హరించును చూర్ణపుమోతాదు పూటకు 2-3 అణాల యెత్తు. కషాయపు మోతాదు 2½ - 5 తులములయెత్తు. దీనిని వంటికి నలుగు పెట్టుకొను పిండిలోను, పసుపులోను కలుపుకొని వాడిన శరీరమునకు కాంతినిచ్చుచు సువాసనగ ఆరోగ్యముగనుండును.

పచ్చిచేపలు:—చేపలు చూడుడు.

పచ్చిపాల పెరుగు:—Curd of unboiled milk. రుచిగ నుండును; పైత్యమును గొట్టును. కఫమును, మేదస్సును, ఆమమును బెంచును. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

పచ్చిపోక గుణము:—Areca Catechu. Eng. Raw or unboiled betel nut. పచ్చి లేక ఉడకబెట్టని పోక చెక్క చూర్ణము వగరుగ నుండును. నోటికంపు, కంఠదోషము, రక్తపైత్యము, ఆమము, శ్లేష్మము, పైత్యము వీనిని శమింపజేయును. ఊపిరిగొట్ట నొప్పిని హరించును. చూర్ణపు మోతాదు 1-2 అణాలయెత్తువరకు, దీనిని కత్తిరించి తాంబూలములలో వాడుదురు, తమిళులు, బెంగాళులు,

ఓడ్రలు మొదలగువారు కారాకిళ్లీలలోను, పుగాకు తాంబూలములలో వేసుకునేవారును నుపయోగింతురు.

పటికి:— Alum. సం॥ స్ఫటికారి. హిం॥ సుహాగ. ఇది ఉత్తర హిందూస్తానములోని గనులలో దొరకును. పుల్లగ, వగరుగ, నుండును. విషమును హరించును. నేత్రరోగములను, వ్రణములను మాన్పును; గడ్డలను కరగించును. శుద్ధిచేయబడినది తినవచ్చును; రసపుపట్టుకు, నాలుకపూతకు, గళరోగమునకు పటికి గలిపిన నీళ్ళు పుక్కిలించిన నయమగును. ఆనీళ్ళను కంటిలో వేసిన కండ్ల యెరుపులు, కలకలు నయమగును. పొంగించిన పటికి, పసుపు మొదలగు వానిలోగలిపి కండ్లకు పట్టువేసిన నేత్రరోగములునయమగును,లోపలికిచ్చినసీళ్ళవిరేచనములను,బహుమూత్రమును,రక్తవమనమును,రక్తస్రావమునుకట్టును. మోతాదు ¼ అణా మొదలు 2 అణాల యెత్తు వరకు. రక్తము పడకము కట్టువరకు గంటగంటకియ్యవలెను. పటికి కొద్దిగ బురద నీళ్ళలో వేసి కలిపిన బురద విరిగిపోవును; కోడిగ్రుడ్డు తెల్లసొనలో వేసి కలిపిన పెరుగువలెనగును. దీనిని కండ్లకలకలకు పట్టువేసిన నయమగును. పటికినీళ్ళు పుక్కిలించినను, లోపలికి పుచ్చుకొనినను నోరు బెరడుకట్టును. దీనికి విరుగుడు నెయ్యి.

పటికి పంచదార:— Saccharum Purification Eng. Sugar Candy. సం॥ ఖండశర్కర. శీతోఫల. హిం॥ మిస్రి, ఖాండ్. దీనిని కలకండయని, తవరాజమని, ఖండశర్కరయని, పటికిబెల్లమని యందురు. తెల్లగ పలకలు గలిగినముక్కలు (Crystals) లాగున యుండు దానిని కలకండయందురు. తెల్లగా అచ్చులులాగునయుండి లోపలపలకలు (Crystals) లాగున యున్నదానిని తెల్లపటికిబెల్లమని యందురు. ఇవి రెండును శ్రేష్ఠము. మనవైపున చేసినది అంత తెల్లగా యుండక తేమగలిగి అచ్చులులాగున యుండుదానిని పటికి

బెల్లమని యందురు. యిది అంత ప్రశ స్తము కాదు; తియ్యగా నుం డును; చలవ మేహశాంతిజేయును, జఠరదీప్తి, వీర్యవృద్ధి, దేహ పుష్టి, బలమునిచ్చును; నీరసమును పోగొట్టును; వాతపిత్త శ్లేష్మ ములవలన బుట్టిన రోగములు, దాహము, తాపము, భ్రమ, ఉన్మాదము, మూర్ఛ, చర్ది, శ్రమ, దగ్గు, రక్తపైత్యము, నేత్ర రోగములు వీనిని శమింపజేయును. పైత్యశ్లేష్మము, పొడిదగ్గు, మేహము, పైత్యము, కాసశ్వాసలు, క్షయ, వీని నణచును; మూత్రముగావించును; సర్వేంద్రియములకు బలముజేయును. అమిత ముగ దినిన ఆకలి మందగింపజేసి విరేచనబద్ధము జేయును; గుర దాలకు (Kidneys) నష్టముజేయును; దీనికి విరుగుళ్ళు 1 బాదం పప్పు, 2 పుల్లగనుండు ఫలములు, దీనిని మెత్తగాచూర్ణించి బార్లీ గంజిలోను, సగ్గుబియ్యం జావలోను కలిపి యిచ్చిన జ్వరపడి లేచిన వారికి, రోగులకు ఆరోగ్యముగానుండును.

పట్టుగొడుగు:—Silk umbrella. మనోహరముగ నుండును; కాంతి, బలము నిచ్చును; చలవజేయును; ఎండ, గాలి, ధూళి, వీనినినాపును.

పట్టువస్త్రము:—Silk cloth. దీని ధారణవలన చల్లగా నుండును; కఫము, వాతము, రక్తపైత్యము, మూర్ఛ, దాహము, శ్రమ వీనిని హరించును; బలమును, దేహపుష్టి, కాంతి నిచ్చును. శీతోష్ణము లను శరీరమునకు పట్టకుండ జేయును.

పట్టెమంచము:— Cot woven with broad tape. సర్వాంగము లకు సౌఖ్యముగ నుండును; దోషమును హరించును; సర్పభయము బోగొట్టును. ఆరోగ్యమైనది.

పతంగిచెట్టు:—Caesalpinia Sappan. Eng. Sappan wood. Brasiletto. సం॥ రక్తముక్త, పతంగ, హిం॥ పతంగ్, యిది

పెద్దవృక్షము. దీని చెక్క రక్తచందనమువలె ఎఱ్ఱగానుండును. దీని ఆకులు పొడవుగాను, దీని పువ్వులు ఎఱ్ఱగానుండును; దీనిలోపలి చేవను ఔషధమునకును, బట్టలకు రంగుకును వుపయోగించును; యిది తియ్యగను, శీతవీర్యము గలిగి పైత్యకఫముల నణచును. రక్తచందనముయొక్క గుణములు గలిగియుండును. దీని మ్రాను చెక్క కషాయము బుతురక్తమును జారీచేయును. అజీర్ణ, గ్రహణి, విరేచనములను కట్టను. చెక్క నూరి రాసిన గజ్జి, చిడుము మొద లగు చర్మరోగములు మానును. మోతాదు పూటకు 4-5 తుల ముల యెత్తుచొప్పున కొన్ని పూట లియ్యవలెను.

పత్రబీజపుచెట్టు:—బీజపత్రము చూడుడు.

పద్మకాష్టము:— Prunus Padam. a fragrant wood brought from southern India. సం* పద్మకాష్ట. చారు, సుప్రభ. హిం* పద్మకాష్ట, పద్మాక్. దీనిని పద్మకమందురు. యిది పెద్ద వృక్షము. హిమాలయములో మొలచును. ఇది కాయలుకాయదు. పసుపు ఎరుపురంగులగల పువ్వులు పూయును; పువ్వులు పరిమళముగ నుం డును. దీని కఱ్ఱ కషాయము తాపజ్వరము, స్ఫోటకము, కుష్ఠు, కఫము, రక్తపిత్తము, దప్పి, విసర్పము, మేహము, జ్వరము, దురద, భ్రమ, చర్ది, మొదలగు రోగములను నివారణజేయును. వంధ్యాస్త్రీలు నష్టసంతానముగల స్త్రీలు దీని కషాయముగాని, గంధముగాని సేవించిన సంతతి నిలుచునట్లుజేయును; గర్భస్రావము కలుగకుండ ఆపును; గర్భదోషముల నన్నిటిని మాన్పును. దీని గంధమునుకూడ పై రోగముల కుపయోగించవచ్చును. కషాయపు మోతాదు పూటకు 2½-5 తులములు; గంధపు మోతాదు పూటకు అరతులము,

పద్మపుకాయ:—Berries of a creeping plant. అనగా పద్మపు తీగె అను చెట్టుకాయ. అగ్నిమాంద్యము, గురుత్వము, అజీర్ణము, విరేచనబద్ధముజేయును. దీనికి విరుగుడు నువ్వుచెట్టు కాల్చి చేసిన క్షారము.

పద్మపూతిక:—A sort of grass. దీని కషాయము లేక చూర్ణము కారముగ, చేదుగనుండును; ఉష్ణముజేయును; రక్తపైత్యమును, పీనసమును జయించును; విషము, అపస్మారము, భూతజ్వరము మొదలగు వానిని బోగొట్టును; మేదస్సును బెంచును; కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తుచొప్పునను, చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 4 అణాలయెత్తువరకు.

పద్మమధు:—Lotus honey. అనగా తామర పుష్పములనుండి తీసిన తేనె. దీనిని నేత్రములయందు బెట్టిన సర్వనేత్రరోగములను హరించును. మేహాశాంతి, వీర్యవృద్ధి. బలముజేయును. త్రిదోషహారమైనది.

పనసకాయ కూర— Curry of unripe Jack fruit. రుచిగ నుండును; వాతశ్లేష్మములు జేయును; మేదస్సును వృద్ధిజేయును; బలమును, వీర్యపుష్టిని యిచ్చును; మిక్కిలి గురుత్వముజేయును; గుల్మము. శ్లేష్మము, అగ్నిమాంద్యము, పీనసము ఇవి గలవారు దీనిని బుచ్చుకొనకూడదు. దీని దుర్గుణములు పోవుటకు పారవంచుట, పులుసు, అనబెట్టుట పొంగుచుట.

పనసగింజలు:—Seeds of Jack fruit. రుచిగా నుండును; వీర్యవృద్ధి జేయును; మలమూత్రములు విడిపించును; దేహకాంతి నణచును; పైత్యముచేయును; గురుత్వముగనుండును. దీనికి విరుగుడు నేతిలోగాని, నూనెలోగాని వేయించడము,

పనసచెట్టునీడ:—Shade of Jack tree. దాహము, శాక, పైత్యము వీని నణచును; చలవ జేయును; మనోహరముగ నుండును.

పనసపండు:— Artocarpus Integrifolia - fruit of. Eng. Jack fruit. సం* పనసఫల, కంటకఫల, మృదంగఫల. హిం* కటహల్ కాఫల్. దీని తొనలు తియ్యగ రుచిగా నుండును; పైత్య మణచును; దేహపుష్టి, బలము, శుక్లవృద్ధి వీని నిచ్చును; రక్తమును బుట్టించును; మెదటికి, నరములకు బలము జేయును; అజీర్ణము, అండవృద్ధిరోగము, అగ్నిమాంద్యము, కడుపునొప్పి, శీతపైత్యము, దాహము వీనిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నూనె, 2 అరటిపండ్లు, 3 మామిడి జీడిరసము.

పనసాకువిస్తరి:—Platter of the leaves of Jack tree. దీనిలో భోజనము మనోహరముగ నుండును; రుచిబుట్టించును; వాత శ్లేష్మము నణచును; దేహపుష్టి నిచ్చును.

పన్నీరు:—Rose water. చలవజేయును; కండ్లకు చలవనిచ్చును; రక్తపైత్యము, దాహము, తాపము, మూర్ఛ, మదము, శ్వాస, రక్తకుసుమ, శ్రమ, చెమట వీని నణచును; దేహపుష్టిని, కాంతిని యిచ్చును; మెదటికి, పొట్టకు బలమిచ్చును; శాకచేత పుట్టిన విదాహము నణచును; రొంప దెచ్చును. లోపలికి పుచ్చుకొను మోతాదు 2-3 తులముల యెత్తువరకు.

పప్పుచారు:—Tamarind water (boiled) added with dhall onions, chillies & while boiling & Seasoned. చారు కాగునపుడు పెసరపప్పుగాని, కందిపప్పుగాని, వండినదిగాని, పచ్చిదిగాని వేసి అందులో వుల్లిపాయ, పచ్చిమిర్చి, ఉప్పు వగయిరాలతో మరగనిచ్చి పోగిచినది. ఈ మరుగునప్పుడు కొద్దిగ కంకాయ, మునక్కాయ, బెండకాయ వగయిరాలను చేర్చి

కాచినది రుచిగానుండును; మేహశాంతి, కొద్దిగ వాతము జేయును; గురుత్వముగనుండును; శ్లేష్మము బెంచును; తరుచు బుచ్చుకొనిన గుండెలలో భారము, నొప్పిబుట్టించును; దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 శొంఠి, కరక్కాయపిందెలు, ఉప్పు వీని చూర్ణము.

పయిడిప్రత్తిచెట్టు:—Gossypium Herbeceum, Eng. Indian Cotton plant bearing red flowers- సం* రక్తకార్పాసీ, సూత్రపుష్ప. హిం* లాల్‌కపాస్ కాజాడ్. దీనిఆకు, కాయ, పువ్వు వీనిరసముగాని, ఆకు ఆవుపాలతో నూరి తీసిన రసముగాని నాభివిషమును, పాషాణవిషమును, ఎలుక, పాములవిషము హరించును; మోతాదు 5 మొదలు 10 తులములవరకు. కండ్లకలకను, కండ్ల యెరుపును, కర్ణరోగములను బోగొట్టును. దీని యాకు, పువ్వు, కూరవండి పెట్టిన కుసుమరోగములను హరించును; గ్రహణినికట్టును; మేహశాంతి జేయును. ఆకులను నిప్పుపైన వెచ్చజేసి తీసినరసము చెవిలో పిండిన చెవిలో చీము, హోరు, చెముడు తగ్గును. పువ్వుల రసము పిండిన కండ్లకలకలు, యెరుపులు తగ్గును. ఆకులరసముతో నూరి 5-6 పుటములుబెట్టిన బంగారము, వెండిభస్మము దీని గింజలు చితుకగొట్టి కషాయము కాచి వడపోసి. అందు పాలు, పంచదార గలిపి, పుచ్చుకొనుచుండిన స్త్రీలకు పాలు వృద్ధిపరచును. రసము లోపలికిచ్చు మోతాదు 2-3 తులములయెత్తు.

పరమాన్నము:—Rice pudding or rice boiled in milk. అనగా పాయసము, ఇది పాలలో బియ్యము వేసి పంచదారగాని, బెల్లము గాని చేర్చి వండినది రుచిగనుండును. బలము, కాంతి, బుద్ధి బలము వీనినిచ్చును, వీర్యపుష్టి జేయును. వాతపైత్యమును, పరిణామశూలలను, అణచును. దాహమును బుట్టించును. గురుత్వము, అగ్ని మాంద్యము జేయును. విరేచనబద్ధము జేయును. కఫమును

ఱెంచును. దీనికి విరుగుళ్ళు పాలసా హూన్యగుణము చూడుము. దీనిలో కొద్దిగ జీడిపప్పుగాని, బాదముపప్పుగాని, కిసిమిసిపండ్లు, యాలు క్కాయలు చేర్చిన అది మిక్కిలి రుచిగా మనోహరముగ నుండును. ఆప్యాయత నిచ్చును.

పరికెగెడ్డలు:—కోవిలదుంపలు చూడుడు.

పరిమిపండ్లు:—Berries of a wild tree. బాగుగ పండినవి వగరుగ, తియ్యగ నుండును. వాతమును గొట్టును. పథ్యమయినవి. బాగుగ పండనివి పైత్యశ్లేష్మముల జేయును.

పరులుగట్టిన వస్త్రము:—Cloth worn by others. అలక్ష్మీకర మైనది. గజ్జి, చిడుము, కుష్టు, తామర, మొదలగు చర్మరోగము లను, అంటువ్యాధులను గలుగ జేయును.

పర్పాటకము:—Oldenlandia Corymbosa Biflora. సం॥ పర్పట, తృష్ణారి. హిం॥ పిత్తపాపడ. ఇది యెఱ్ఱనిది, తెల్లనిది రెండుజాతులు. దీని కషాయము లేక చూర్ణము చేదుగనుండును. సమస్తవిదాహ ముల నణచును. వేడిజేయును. రక్తాతిసారము, దగ్గు, మదము, క్రిమిరోగము, ప్రలాపము, శీతపైత్యము, పైత్యశ్లేష్మజ్వరములు వీనిని బోగొట్టును. పైత్యము, భ్రమ వీని నణచును. మలబద్ధము జేయును. చెమట బుట్టించును. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములయెత్తుచొప్పున, చూర్ణపు మోతాదు 1 అ॥ మొదలు 2 అ॥ యెత్తుచొప్పున దినమునకు 4-5 సార్లు ఇయ్యవచ్చును.

పల్లకియెక్కడము:—Palanquin - going in. అందలము చూడుడు.

పల్లెమొట్టఅనుచేప:— A sort of fish. నలుపు, ఎరుపు రంగులు గలది. వాతరోగము, మందాగ్ని, అరుచి, శ్లేష్మమును గొట్టును.

పల్లేరు:—పెద్దపల్లేరు, చిన్నపల్లేరు చూడుడు.

పశ్చిమదిక్కుగాలి గుణము:—అష్టదిక్కులగాలి చూడుడు.

పసగడుగు:—బియ్యపుగడుగు చూడుడు.

పసుపు:—Curcuma Longa-Eng. Turmeric. సం॥ హారిద్రా, నిశా. హిం॥ హల్దీ. చేదు, వగరు, కారపు రుచి గలిగియుండును. ఉష్ణముజేసి అర్చును. శ్లేష్మమును, మేహమునుహరించును. తేలికను, జఠరదీప్తిని యిచ్చును. రక్తమును శుభ్రపరచును. జీర్ణముచేయును. క్రిమిరోగము, తంద్ర, దగ్గు, జ్వరము, విషము, కుష్ఠు, దురద, మేహవ్రణములు, కఫరోగములు, అర్శరోగము, మూత్రము వెంట సుద్దపడెడు మేహరోగము, ఉబ్బు వీనిని పోగొట్టును; ముంతగుండె (heart) కు, పొట్టకు బలముజేయును. నీళ్ళవిరేచనములు కట్టును; సుఖప్రసవము గావించును; మూత్రమును జారీచేయును. పాండువు, కామిలరోగము హరించును; కండ్లకు కాంతిదెచ్చును. కార్జములో పుండగురోగము (Hypotitis) ను పోగొట్టును; కార్జము (liver)ను శుభ్రపరచును. పసుపుకొమ్ము నిప్పులమీద కొద్దిగ కాల్చి నమిలిన పండ్లనొప్పులు హరించును. దీని (కాల్చిన పసుపుకొమ్ము) ఊట మ్రింగుచుండిన ఒగర్పుగల దగ్గు (Bronchitis) శమించును. పసుపు నీళ్ళతో అరగదీసి కండ్లలో పెట్టిన నేత్రరోగములుహరించును. పసుపు నూరి కట్టినను లేక పసుపుగుండ నీళ్ళతో గలిపి కట్టినను గడ్డలు, వ్రణములు, దుష్టవ్రణములు హరించును. శుభ్రపడును. మానును. పసుపు, నల్లమందు, పటికి కలిపి వుడికించి కండ్లకు పట్టువేసిన కండ్ల ఎరుపులు, పోటు మానును. దీని పువ్వులరసము పూసిన శోభి మచ్చలు నివృత్తించును. తేలు కుట్టినచోట పసుపుగుండ కాల్చిన పొగ బట్టించిన తేలువిషము హరించును; పచ్చిపసుపు నూరి తలకు పట్టించిన తలదిమ్ము, తల తిరగడము నిమ్మళించును. ఎండు పసుపు కొమ్ము పొగబట్టిన అపస్మారము (Hysteria) యొక్క మూర్ఛ నివృత్తించును. ఒకవంతు పసుపు 2 వంతులు పటికి (Alum) రెండు చూర్ణించి కలిపి చెవిలోనికి చొచ్చునటుల ఊదిన చాలకాలముగ

నుండు రసి, చీముకారుట కట్టును. పసుపును, సున్నమును కలిపి వేసిన స్వల్పగాయములు, కొట్టుకపోవడము నిర్మూలించును. పుండు కాకుండ చేయును. నొప్పి హరించును. నీళ్ళతో పసుపు, సున్నము గలిపికట్టిన గోరుచుట్టు, మడిమశూల, కణుపుమీద, జెబ్బ మొదలగునవి హరించును. ఈకట్టు నీళ్ళతో తడుపుచుండవలెను. పసుపుకట్టిన లేక పసుపు నీళ్ళలోగలిపి పోసిన వ్రణములలో పురుగులు చచ్చును. ఇతర చిన్నజంతువులు, పురుగులు చచ్చును. పసుపుపొగ లేక పసుపు కలిపి వేడినీళ్ళ యావిరిపట్టిన దగ్గు, పడిశెము, శిరోభారముమానును. పసుపుగుండ పాలలోగలిపి అందులో మిరియాలపొడి గలిపి దినమునకు రెండుపూటల నిచ్చిన జ్వరముగల దగ్గు, పడిసెము అణగును. పట్టి పసుపుగుండ నీళ్ళలోగలిపి యిచ్చిన సర్పవిషము, పడిసెము, దగ్గు నిర్మూలించును. పసుపు చిక్కగ నీళ్ళలోగలిపి పూసిన గాయములు, కవుకుదెబ్బలు, ఇరుకునొప్పులు మానును. గజ్జి, చిడుము మొదలగు చర్మరోగములును మానును. పసుపుచూర్ణము, బెల్లము సమముగగలిపి పూటకు 1/2 తులమువంతున గోమూత్రముతోగలిపి సేవించుచుండిన శ్లీపదము హరించును. పసుపుకషాయముతో కండ్లు కడిగి తడిపసుపుగుడ్డ కండ్లమీద ఉంచిన లేక దానితో కండ్లుతుడుచుచుండిన కండ్లకలకలు నివృత్తించును దూదిపింజెమీదగాని, పచ్చి నూలుచుట్టమీదగాని పసుపుగుండ దళసరిగబోసి దానిని కంటిమీద వేసి కట్టుకట్టిన కంటికి దెబ్బతగిలి యెర్రబడడము, వాపు, నీరుకారడము కట్టును. పచ్చిపసుపు దుంపను నీడనుఆరబెట్టి దానిని ఒకనిమ్మకాయలో రంధ్రముజేసి అందులోఉంచి మూడుదినములు నిమ్మకాయలోనేడుంచి నాలుగవనాడు పసుపుకొమ్ముతీసి దానిని ఒకరోజు ఎండబెట్టి మరునాడు దానిని మరియొక నిమ్మకాయలో 8 దినములు ఉంచి నాల్గవదినము ఎండించి ఈ చొప్పున 7 నిమ్మకాయలలోఉంచి

తీసిఉంచి రోగిఉమ్మితో పసుపుకొమ్మును గంధముతీసి కండ్లకు కాటుక వలె ఉంచిన కంటిరెప్పలమీది వెంట్రుకలు రాలిపోవు రోగము నివృత్తించును. రెప్పలమీద వెంట్రుకలు లేచును. పచ్చిపసుపుకొమ్ము తెచ్చి బ్రహ్మచెముడు చెట్టుమ్రానులో రంధ్రముచేసి అందులో పసుపుకొమ్ముఉంచి రంధ్రము దాని మ్రానికర్రతో పూడ్చి 7 దినములు ఉండనిచ్చి యెనిమిదవనాడు పసుపుకొమ్మును తీసి యారబెట్టి యాపసుపుకొమ్మును నీళ్ళతో గంధముతీసి పూయుచుండిన శ్వేత కుష్టువు, తెల్లపొడలు, మచ్చలు మానును. పసుపుగుండను నరమూత్రముతో కలిపి త్రాగించిన సర్పవిషమును హరించును. పసుపు వెల్లుల్లికలిపినూరి అరికాళ్ళకు, అరిచేతులకు అవసథముండినయావత్తు శరీరమునకు రుద్దిన శీతలముతగ్గించి వేడిని బుట్టించును. ప్రతిదినము బిడ్డలకుగాని,స్త్రీలకుగాని వంటికిపూసుకొని స్నానము చేయుచుండిన చర్మరోగమును హరించుచూ శరీరమునకు కాంతి, ఆరోగ్యమును యిచ్చును. మరిన్ని స్త్రీ బహిష్టయై స్నానముచేసిన వెంటనే పసుపు నీళ్ళలోకలిపి 3 పురిశళ్ళు త్రాగిన లేక కొద్దిగా 4 అ॥ల యెత్తు పసుపుముద్దను మ్రింగిననూ, రజోదోషములను హరించుచూ పిండకోశము శుభ్రపరచి ఆరోగ్యము నిచ్చును. వేపఆకునూ, పసుపునూ నూరిరాసిన మశూచికపు పొక్కులకు, దిగజారిన తరువాత దురదను పోగొట్టిఆరిపూడిపోవునట్లుచేయును. దుర్గంధమును హరించును మన్య ప్రాంతములకు వెళ్ళినప్పుడు పరిశుభ్రమైన నీరు దొరకనప్పుడునూ, నీళ్ళయందు కొద్దిగ పసుపుగుండ చేర్చి కాచిన నీటిదోషముండదు. పసుపు అధికముగ తినిన ముంతగుండె (heart) కు, ఇంద్రియమునకు నష్టముజేయును. దీనికివిరుగుళ్ళు 1 నిమ్మపండు, 2 పంపరపనాస పండు, 3 నారింజపండు, పసుపును లోపలికిచ్చు మోతాదు పూటకు 2 మొదలు 4 అణాల యెత్తువరకు.

పసుపువన్నెజిగురు:—Stalegmitis Gambogioides & Garcinia Pictoria, Eng. Mysore Gamboge. ఇది యొక చెట్టు జిగురు. అరవములో మక్కియందురు. గాఢవిరేచనకారి; ఉదరరోగమును హరించును; కడుపులోని క్రిమిని వెడలించును. మోతాదు ¼ మొదలు 1¼ అణాల యెత్తువరకు పంచదారతో నియ్యనగును. మరియు గాంబేజి 10 గోధుమగింజల ఎత్తు, అన్నభేది 6 గోధుమగింజల ఎత్తు, పటికిబెల్లము 20 గోధుమగింజల ఎత్తు, పిప్పరమెంటు ఆయిలు 3 చుక్కలు, నీళ్లు 3 ఔన్సులు కలిపి 4 గంటలకు 1 ఔన్సు చొప్పున క్రిమి (నారాపాము) పడిపోవువరకు ఇచ్చిన పడిపోవును.

పసుపువస్త్రము:—Yellow Cloth. కఫమును హరించును. వసంత కాలమున అనుకూలముగ నుండును.

పాకపుచలిమిడి:—చలిమిడి చూడుడు.

పాచితీగె లేక సీతమ్మ నూలుపోగులు:—Cuscuta Reflesea, Eng. Dodder. సం॥ ఆకాశవల్లీ, అమరవల్లీ, హిం॥ ఆకాశబేల్, అమరబేల్. అరబ్బీభాషయందు అఫ్తిమూన్ అందురు. యీతీగలు చెట్ల మీద సన్నముగా దారములవలె విస్తారముగా ప్రాకును. వేరు భూమికి నాటియుండదు. పచ్చని రంగుగనుండి గోరింతకాయలవలె కాయలుండును. దీని కాడ జిగురుగలిగియుండును. కొంచెము చేదు, వగరు, తీపి రుచులు ఉష్ణవీర్యము కటువిపాకము గలది. దీని రసము లేక కషాయము నేత్రరోగము, పైత్యశ్లేష్మము, ఆమదోషము, అగ్నిమాంద్యము వీనిని హరించును. విరేచనము జేయును. క్రిమిహరము, బలము, వీర్యవృద్ధి కలిగించును. దీనిని కాల్చి మసిచేసి మసికిరెట్టింపు మురదారశింగుచేర్చి జిల్లేడుపువ్వుల రసముతో మెత్తగానూరి భగందరవ్రణములకు వేయుచుండిన శీఘ్రముగ మానిపోవును. యితర దుష్టవ్రణములుకూడ మానును. రసపు మోతాదు 2-3 తులముల ఎత్తు. కషాయపు మోతాదు 2½-5 తులముల ఎత్తు.

పాచిన అన్నము:—Rotten boiled rice. పైత్యమును పెంచును. దోషము జేయును; గురుత్వముగ నుండును; అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు అన్నము చూడుడు.

పాటల గంధి:—A medicinal shrub. దీనిని పాటల గన్ని అనియు నందురు. ఇది తీగె ప్రాకును. దీనికాడ బూడిదరంగుగ నుండును. దీనివేరు చేదుగ నుండును. పొట్టకు బలము జేయును. జ్వరము, రక్తగ్రహణి, కడుపునొప్పి, ప్రేగులలోవ్యాధి, మరిడిజాడ్యము వీనిని పోగొట్టును. పాము, తేలు, వెర్రికుక్క మొదలగు జంతువుల విష మును హరించును శీఘ్రప్రసవము గావించును. దీని కషాయము లేక చూర్ణము లోపలికియ్యనగును. చూర్ణము గాయముల పైని వేయనగును. కషాయపు మోతాదు 24 గంటలలో 60 రూపాయల యెత్తు కొద్దికొద్దిగా అప్పుడప్పు డియ్యవలెను. దీని చూర్ణము జ్వర ములకు, విషములకు, శీఘ్రప్రసవములకు నియ్యనగును. మోతాదు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు. దీని ఆకురసము కండ్లలో పిండిన కూనలు మొదలగు నేత్రరోగములు పోగొట్టును.

పాఠ తీగ:—Cissampelos Hernandifolia & Sida Acuta. సం* పాఠా. హిం* పాఠా. దీనిని చిరుబొద్ది లేక విషబొద్దియనియు, దీని వేళ్ళను అగరు శొంఠి అనియు నందురు. తీగె ప్రాకును. చేదుగ, వగరుగ నుండును. వేడిజేయును త్రిదోషములను, వ్రణములను, విషము, కుష్టు, దురద, జ్వరము, చర్ది, గ్రహణి, అతిసారము వీనిని జయించును. ఆమదోషము, కుసుమరోగము, దాహము నణచును. పొట్టకు బలము జేయును. దీనివేరు శొంఠితో కషాయముగాచి యిచ్చిన ఆహిక జ్వరము విడుచును, మోతాదు రెండున్నర మొదలు 5 తులముల యెత్తువరకు. దీనియాకులకు ఆముదముపూసి వెచ్చజేసి గడ్డలపైన వేసికట్టిన త్వరగా చీముపట్టి పగులును. దీని వేళ్ళచూర్ణ

ముగాని, కషాయిముగాని, శ్లేష్మము, వాతము, అత్యుష్ణము, విషము వీనిని హరించును. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు.

పాతచింతపండు:—**Old Tamarind.** చింతపండు చూడుడు.

పాతనెయ్యి, పాతిననెయ్యి:—**Old ghee or ghee burried in the ground.** ఒక సంవత్సరము నిలవయుంచిన నెయ్యి పాత దగును. ఇదియైనను, సంవత్సరము నేలలో పాతిన నెయ్యియైనను అపస్మారము, మదము, ఉన్మాదము, మూర్ఛ వీనిని, శిరః, కర్ణ, నేత్ర, యోనిజములగు పురాణరోగములను పోగొట్టును. వ్రణములను శుభ్రపరచి మాన్పును. పదిసంవత్సరములు నిలువయున్న నెయ్యి పైనచెప్పిన రోగములను, మరియు ననేక రోగములను పోగొట్టును. ఉష్ణము, గురుత్వము జేయును. దీనికి విరుగుడు పన్నీరు. మరియు నెయ్యి చూడుడు. దీనిని లోపలికి పుచ్చుకొనెడు మోతాదు 4 మొదలు 8 అణాలయెత్తువరకు.

పాదప్రక్షాళనము:—**Washing feet and legs.** అనగా కాళ్ళు మోకాళ్ళనుండి కాళ్ళు కడుగుకొనడమువలన పరిశుభ్రమగును. మార్గాయాసమును, శ్రమను నివారణజేయును. అగ్నిదీప్తి, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి నిచ్చును. కండ్లకు చలవజేయును. రక్తమునకెక్కిన వేడి నణచును.

పాదరసము:—**Hydrargyrum. Eng. Mercury.** సం॥ పారద, సూత. హిం॥ పారా. శుద్ధిజేసినపాదరసము త్రిదోషములను, సమస్త వాతరోగములను, కుష్టురోగములను, ధాతురోగములను, విషములను హరించును. ఆమవికారమును, క్రిమిరోగమును, సవాయిరోగమును పోగొట్టును. జఠరదీప్తి నిచ్చును. వీర్యవృద్ధి, దేహపుష్టి, బలము జేయును. ఆయురారోగ్యముల నిచ్చును. పుంస్త్వమును

హెచ్చించును. చక్షురింద్రియములకు బలమును, ప్రకాశమును, స్మృతిని, రూపమును ఇచ్చును. ముదిమిని పోగొట్టును. తత్వమును శీఘ్రముగ మంచికి మార్చును. అనుపాన విశేషములచేత సమస్త రోగములను జయించును. దీనితో చేసిన పలాస్త్రీ వేసిన మొండి వ్రణములు, కురుపులు, సవాయివ్రణములు నివారణమగును. దీనిని లోపలికి పుచ్చుకొను విధము: శుద్ధిజేసిన పాదరసము (ఇంగిలీకము లోనుండి తీసినది (శ్రేష్ఠము) ను తెల్లములక చెట్టు వేళ్ళ చూర్ణము తగుమాత్రము అరచేతిలో నుంచుకొని కొద్దికొద్దిగా నీళ్ళతో పాద రసమును, చూర్ణమును బాగుగ మిశ్రముచేసి మ్రింగుటకు మాత్రగ లేక మాత్రలుగజేసి ఉదయమందు సాయంకాలమందు పుచ్చుకొన వలయును. ఇట్లు 20-40-60 దినములుగాని, ఆరునెలలవరకుగాని, సంవత్సరము వరకుగాని సేవించనగును. పైన ఉదహరించిన రోగ ములుహరించును.నిరోగులును పుచ్చుకొనదగియుండును. మోతాదు పూటకు 1 మొదలు 3 చిన్నముల యెత్తువరకు. ఇచ్ఛాపథ్యము. రోగపీడితులు నూనె, ఆవ, చేప, పులుసు వర్జింపవలసి యుండును. చిరకాలసేవ జేయువారు ఇచ్ఛాపథ్యమున నుండవచ్చును.క్రమముగ శుద్ధిగాని పాదరస సేవవలన రసపుపట్లు, కీళ్ళనొప్పులు మొదలగు ననేక వికారములు గలుగును. దీనికి విరుగుళ్ళు 1 ఆవుపాలలో శుద్ధి జేసిన గంధకమును కొన్నిదినములు పూటకు 1 మొదలు 2 అణాల యెత్తుచొప్పున సేవించడము, 2 పైనజెప్పిన మోతాదులను,గంధక మును, తమలపాకులోబెట్టి తినడము, 3 తమలపాకులు, గుంటకలగ రాకు, తులసియాకు వీనిలో ఒక్కొక్కదాని పసరు సేరున్నర, మేక పాలు సేరున్నర వీనిని యేకముచేసి సర్వాంగములపైన రెండు జాములు మర్దనజేసి శీతోదకస్నానము జేయడము. ఈ చొప్పున 3 దినములు చేయవలెను.

పాదరక్షలు, చెప్పులు:—Slippers or shoes. ఆరోగ్యమును, సుఖమును ఇచ్చును. శ్రోత్ర, నేత్రేంద్రియములకు మేలుజేయును. శిరస్సుకు వేడినెక్కకుండ జేయును. మరియు తేమ, దారుణవేడి, అగు భ్రమము, ముండ్లు, రాళ్ళు, తేలు, జెర్రి, మొదలగు విషపు పురుగుల బాధలు కలుగకుండజేయును.

పాదుకలు:—Sandals. అనగా కర్రతో చేయబడిన పావుకోళ్ళు. పాదరోగములను హరించును. నిర్మలినముగ నుండును. త్రిదోషములను శమింపజేయును. భూమిలోని శీతోష్ణములను దేహమునకు ఎక్కనియ్యక ఆరోగ్యమిచ్చును. వీనిని స్నానము చేయునపుడును, కర్ర చెప్పులను మలమూత్రవిసర్జనకాలమందును ముఖ్యముగ మరుగు పెరడులోనికి వెళ్ళినప్పుడును ఉపయోగి ప తగియుండును.

పానకము:—Sherbeth or drink made of Jaggery or Sugar. అనగా బెల్లముతోగాని,పంచ దారతోగానికొద్దిగ మిరియాల చూర్ణము కలిపి చేసిన పానకము. శ్రమను బోగొట్టును. కఫమును గొట్టును. ఆకలిని,దాహము నణచును. ఆప్యాయత నిచ్చును. గురుత్వముగ నుండును. మూత్రము గావించును. విరేచనబద్ధముజేయును. పరగడుపున బుచ్చుకొనిన యాకలి మందగింపజేయును. భోజనాత్పరమున పుచ్చుకొనదగియుండును. మిరియపుపొడివేసి కొంచెముచిక్కగ జేసిన పానకమును సర్పదష్టమైనవారికి కడుపునిండ త్రాగించి యాపానకమును దేహమంతటను పూసిన సర్పవిషము విరిగిపోవును.

పానయోగ్యముగాని నీళ్ళు:—Water unfit for drinking. నిస్సారమై, బురదగనుండెడు నీరు, నాచు, నీటికసవు, ఆకులు నీటిచేత కప్పబడిననీరు, సూర్యచంద్రకిరణ ప్రసారములేక గాలి తగలక జిడ్డుగా, బరువుగా నుండెడు నీరు, మలినమై నురుగుగట్టిన నీరు, దుర్గంధముగల నీరు, క్రొత్తనీరు కలసిన నీరు, పురుగులుండెడు నీరు,

గంతములకు పీడకరమైనంత చల్లగ నుండెడు నీరు, ఎండ నుడికిన నీరు, కలగ బారిననీరు, దుష్టవస్తువులు గలసిన నీరు పానయోగ్యములు గావు. దీనికి విరుగుళ్ళు ఉపక్రమము చూడుడు.

పాపర చెట్టు:—పిన్నపాపర చూడుడు.

పాపరబుడమకాయ:—పిన్నపాపర చూడుడు.

పాపిట చెట్టు:—Pavetta Indica. Ixora I. Pavetta Eomentosa. సం* పర్పణ, ఘృతిధూపక. హిం* పవార. ఇది అడవిప్రాంతములలోనుండు చిన్నచెట్టు. తెల్లని పుష్పములు గుత్తులుగుత్తులుగా పూయును. దీని కాయలకూర వెగటుగ, రుచిగనుండును. కాక జేయును. రుచిబుట్టించును. జఠరాగ్నిని వృద్ధిబొందించును. జ్వరము, వాతపైత్యము, గుల్మరోగము వీనిని హరించును. దేహపుష్టి, బలము జేయును. వీర్యమునకు వేడిబుట్టించును. గురుత్వము, విరేచనబద్ధము జేయును. దీని ఆకులను బియ్యపుకడుగులో వుడకబెట్టి వెచ్చవెచ్చగా ఆకుపైన ఆకులు దళసరిగా వేసి కట్టు కట్టుచుండిన చనుకుదురు, వాపులు, బాధలు నివారణమగును.

పాము:—Serpent-flesh of. సం* సర్ప, భుజంగ. హిం* సాంప్. దీని మాంసము చిరిచేదుగ నుండును. పైత్యము, కాక జేసి యార్చును. క్రిమిరోగము నణచును. మూలవ్యాధిని పోగొట్టును. దీనిమాంసమును పైనవేసి కట్టిన గడ్డలు, కంతులు, గండమాలలు హరించును. కొండపాము మాంసము ఎండినది కుష్ఠురోగమును పోగొట్టును. పాము మాంసచూర్ణము కానుగనూనెలో గలిపి వంటికిబూసిన కాకి చెమ్మలను మూర్ఛరోగము (Epilepsy) నివారణ మగును. పాము కూసమును దేహముయొక్క యేభాగమందు కట్టినను విడువని జ్వరము విడుచును. పాము కూసముయొక్క పొగ ఆసనమునకు పట్టిన మూలశంక బాధ నివృత్తించును.

పాయసము:—పరమాన్నము చూడుము.

పాయలకూర :—Portulaca Oleracea, P. Quadrifida. Eng. Spinach. సం॥ లోనీ, ఘోటికా, లోనికా. హిం॥ లోన్యాశాక్, కుల్ఫా. దీనిని ఫార్సీ భాషలో కుర్ఫాయందురు. దీనిని సన్నపాయిల యని, గోళికూరయని, యందురు. చలవజేసి నీరుపెట్టును. త్రిదోష హరమైనది. సంగ్రహణి. కుష్ఠు, మూత్రాశ్మరి, మూలవ్యాధి మొదలగు రోగములను జయించును. దాహమును, నీరుడు చురుకును పోగొట్టును. వెంద్రుకలకు బలమిచ్చును. వీర్యపుష్టి జేయును. రక్తమును శుభ్రపరచును. పైత్యమును, మెదడు, పొట్ట వీనిలోని వేడినణచును. ఉష్ణ, పైత్యజ్వరము, రక్తవమనము వీనిని కట్టును గుండెలను శుభ్రపరచును. ఉష్ణపుదగ్గు, వాంతి, వికారము, రక్తపైత్యము వీనినణచును మూత్రములో పుట్టెడురాళ్ళను హరించును. వేడివిరేచనములను కట్టును. నీరసులకు, మేహతత్వ శరీరులకు మిక్కిలి అనుకూలముగ నుండును. విస్తరించి తినిన శ్లేష్మమును బెంచును, కండ్లకాంతిని జెరుపును. గురదాలకు (kidneys) తల నరములకు నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 పటికిపంచదార, 2 పుదీనా, 3 రూమిమస్తకి.

పారిజాతపుచెట్టు:—Nyctanthes Arbortritis, Erythrina Fulgens, E. Indica. Eng. coral tree or night jasmine. సం॥ పారిజాత, పారిభద్ర, నాలకుంకుమ. హిం॥ ఫర్‌హద్. దీని ఆకురసముగాని, కషాయముగాని, జ్వరము, పైత్యజ్వరము, పురాణజ్వరము, పైత్యము, శ్లేష్మము, వాత మేహవాతపు నొప్పులు, నడుమునొప్పి వీనిని హరించును. విరేచనము జేయును. నరములకు సత్తువజేయును. చెమట బుట్టించును, మూత్రమును జారీచేయును, ఆకురసముతో కొద్దిగ ఉప్పుగలిపి యిచ్చిన క్రిమిని హరించును. ఆకురసములో

కొద్దిగ తేనెగలిపి యిచ్చిన పురాణ జ్వరములు హరించును. కషాయము వాతపునొప్పులు హరించును. 6-7 లేత ఆకులలో కొద్దిగ అల్లమువేసినూరి యిచ్చిన వరుస జ్వరము నివృత్తించును. ఆకు రసము భిడ్డలజ్వరమును హరించును. దీని విత్తుల చూర్ణము నీళ్ళలో గలిపి పూసిన తలమీద పొక్కులు, చుండ్రు మానును. ఆచూర్ణము లోపలికిచ్చిన పైత్యమును, శ్లేష్మమును హరించును. పైత్యజ్వరమును పోగొట్టును. రసము యొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½-5 తులములయెత్తు. ఆకు రసములో విరేచనమ్ము చేసెడు గుణ మధికముగ నున్నది. ఆకును పప్పువేసికూరవండి తినిన పైత్యహరము. బలముజేయును.

పారిజాతపుష్పము:—Flowers of coral tree. పూజార్హాతమైనవి, సువాసనగ నుండును. కఫపైత్యములను హరించును. వీనిరసము చెవిలో పిండిన చెవిపోటు నివారణమగును. మిక్కిలి చలవజేయును.

పాలకికూర:—Beta Maritima. B. Bangalensis (A sort of ground herb) సం॥ పాలంకి, పాలక్యా. హిం॥ పాలక్. జిగటగ నుండును. గురుత్వము, శ్లేష్మము, చలవజేయును. ప్రమేహమును, పైత్యరోగమును శమింపజేయును. మూలవ్యాధిని హెచ్చించును. దీనికి విరుగుడు ఆవాలచూర్ణము.

పాలఆనబకాయ:—A kind of gourd. సం॥ దుగ్ధతుంబీ, క్షీరతుంబీ. రుచిగనుండును. పైత్యము, వాతము వీని నణచును. స్త్రీల గర్భమును, శుక్లమును వృద్ధిజేయును. బలము పుష్టినిచ్చును.

పాలకు అనుకూలించెడు వస్తువులు:—క్షీరమిత్రములు చూడుడు.

పాలకు అనుకూలించని వస్తువులు:—క్షీరవిరుద్ధములు చూడుడు.

పాలకూకు (గోకుడు):—Crust of burnt milk. అనగా పాలకుండ అడుగునయుండు గోకుడు. జఠరదీప్తినిచ్చును. కఫము, వీర్యపుష్టి, చలవ జేయును. దీనికి విరుగుళ్ళు 1 పంచదార, 2 తేనె.

పాలకూర:—మనుబాల చూడుడు.

పాలకొడిశ విత్తులు:—కొడిశపాల విత్తులు చూడుడు.

పాలగుండ:—Curcuma Angustefolia. Eng. Country or Indian arrowroot. సం॥ క్షీరపిష్ఠ, హిం॥ తిక్కోరా. ఇదియొక దుంప నుండి తయారుచేసినది. తెల్లగనుండును. తియ్యగ, రుచిగ నుండును. శైత్యము, క్షయ, శ్వాస, కాస, దాహము, మేహము, బహుమూత్రము వీనిని శమింపజేయును. వీర్యవృద్ధి నిచ్చును. దీనినే మోసముగ తవాక్షీరియని యమ్ముదురు. మోతాదు 2 మొదలు 4అణాల యెత్తువరకు. దీనిని పాలలోవేసి కాచి పంచదార చేర్చి బిళ్ళలువలె చేయుదురు. అందు యాలకాయలు, కిసిమిసిపండ్లు చేర్చి బిళ్ళలవలె చేయుదురు. రుచిగ నుండును. వీర్యవృద్ధి, బలము చేయును. ఇదియొక ఫలహారముగ నుపయోగింతురు. ఈ పిండిని అరోరూటు (Arrowroot) పిండివలె వాడవచ్చును. దీని గంజి గ్రహణి, రక్తగ్రహణి, జ్వరములు, మూత్రబద్ధము, శగరోగము, విషమజ్వరము (Typhoid fevers) ప్రేగులయందును, మూత్రకోశమునందును పుండగుట, మసుసుటయందును, స్త్రీల ముట్టు శూలలయందును బార్లీగంజివలె కాచి అందు పాలుచేర్చిగాని, చేర్చకగాని, గ్లూకోజు కలిపిగాని యిచ్చిన చక్కని యాహారమగును.

పాలగుమ్మడి:—అనగా పాలుగల నేలగుమ్మడిచెట్టు. నేలగుమ్మడి చూడుడు.

పాలగురుగు:—మనుబాల చూడుడు.

పాలతాలికెలు:—A sort of puddings boiled in milk. పాలతో జేసెడు భక్ష్యవిశేషము. రుచిగ, మనోహరముగ నుండును. బలమును, దేహపుష్టిని యిచ్చును. పైత్యమణచును. దాహము పుట్టించును. గురుత్వముగనుండును.

పాలతీగె:—A kind of milk plant. వాతముజేయును. పైత్యము నణచును. వీర్యవృద్ధి జేయును. నేత్రరోగమును హరించును. స్త్రీలకు పాలు బడజేయును.

పాలతుత్తము:—White vitriol. వెగటుగ, కారముగ నుండును. విరేచనము జేయును. నేత్రములకు మేలుజేయును. క్రిమిరోగము, దురద, కుష్టు, విషము హరించును. మనోవికాసము నిచ్చును. మోతాదు 6 మొదలు 12 గోధుమగింజల యెత్తువరకు. క్రమముగ శుద్ధిచేయకయున్నను, అమితసేవవలనను పైత్యవికారము, వమనము పుట్టును. దీనికి విరుగుళ్ళు 1 నిమ్మపండ్ల పులుసు (పూటకు 3-4 తులముల చొప్పున 3 దినములు ఉదయపు పూటలను పుచ్చుకొనవలెను), 2 నీళ్ళలో వేసి పిసికిన వరిపేలాలు 3-4 దినములు రెండు పూటలను పుచ్చుకొనవలెను;

పాలపండు:— Mimusops Hexandra. M. Indica-fruit of. సం॥ క్షీరీ, రాజాదని, రాజఫల. హిం॥ ఖిర్నీ, ఖిర్నీ. అనగా పాలచెట్టుపండు. చిన్న వేపపండ్లవలె నుండును. మధురముగ, జిగటగ నుండును. వాతపైత్యము రక్తపైత్యమును హరించును. దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి. చలవజేయును. కండ్లకు, పొట్టకు, మూత్రగుండెకు బలమిచ్చును. దాహమును, స్మృతితప్పడమును పోగొట్టును. సంతోషమిచ్చును. శిరోభారమును, జ్వరమును, వాంతిని కట్టును. ఆకలిని పుట్టించును. పుంస్త్వమును, ఇంద్రియమును వృద్ధిజేయును; శ్లేష్మము జేయును; కడుపులో వాయువును బంధించును; ప్రేగులలో నొప్పి బుట్టించును. దీనికి విరుగుడు వాము, ఉప్పు నమిలిమ్రింగుట.

పాలపిట్ట:—The bird called Jay. దీని మాంసము బలము జేయును; కామిల, పాండురోగములను జయించును.

పాలబచ్చలి:—A sort of spinach. దీనికూర జిగటగ, గురుత్వముగ నుండును; చలవ, శ్లేష్మవృద్ధి, విరేచనము జేయును; అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు శాకసామాన్యగుణము చూడుడు.

పాలమీగడమీగడ:—Cream of milk. కమ్మగ, రుచిగ, నుండును; రుచి బుట్టించును; దేహపుష్టి, బలము, కాంతి, వీర్యవృద్ధి నిచ్చును; ఆమవాతమును, వాతమును, రక్తపైత్యమును బోగొట్టును; నేత్రములకు చలవ జేయును; వ్రణముల మాన్పును. అగ్నిమాంద్యము, గురుత్వము జేయును; దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 అల్లమురబ్బా.

పాలలోవేసిన అటుకులు:—అటుకులు చూడుడు.

పాలవిరుగుడు:—Curdled milk. అనగా కాగి విరిగిపోయినపాలు, రుచిగ నుండును; త్రిదోషములను జేయును; నాభిశూల దెచ్చును; రక్తమును విరుచును; అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

పాలసాపళ్ళు:—Grewia Asiatica. G. Elastica. సం* పరూషక. పారావత. హిం* ఫాల్సా. వీనిని పాలాక్షిపండ్లందురు. యీపండ్లు చిన్నవిగా, పుల్లగా, రుచిగా నుండును; చలవ, శరీరమునకు బలము జేయును; రుచి బుట్టించును; ఆరోగ్యమునిచ్చును. యీపండ్ల రసముతో షర్బతు చేయుదురు. రుచిగా, ఆరోగ్యముగా నుండును. చలవ, మేహశాంతి జేయును.

పాలసుగంధి:—Hemidesmus Indicus. Asclepias Psendo-sarsa-Eng. Sarasaparilla. సం* అనంతా, సుగంధా, కాష్టశారిబా, హిం* అనంతమూల్. దీనిని సుగంధి యనియు, సుగంధపాలయనియు నందురు; తీపిగ, చేదుగ, వగరుగ, సువాసనగ

నుండును; చలవ జేయును; మూత్రకారి; బలకారి; పైత్య శ్లేష్మములను హరించును; సర్పి మొదలగు చర్మరోగములను బోగొట్టును; మేహశాంతి జేయును; సర్పవిషమును హరించును; దీని చూర్ణము ఆవుపాలలో వేసి యిచ్చిన మూత్రకృచ్ఛ్రము, మూత్రబద్ధము నివృత్తించును. పచ్చివేళ్ళు నూరినదియు పాలలో గలిపి యియ్యవచ్చును. పావుశేరు పాలలో 2 మొదలు 4 అణాలయెత్తు చూర్ణముగాని, పచ్చిదినూరినది పావుతులము మొదలు అరతులమెత్తుగాని కలిపి యియ్యనగును. దీనికషాయములో జీలకర్ర చూర్ణము (సుమారు శేడయెత్తు గలిపి యిచ్చినను, దీనితో జీలకర్ర కలిపి కాచిన కషాయమిచ్చినను రక్తమును శుభ్రపరచును; రక్తములో నుండెడు తీక్ష్ణము నణచును. దీని కషాయము ఇచ్చిన చర్మవ్యాధులు, రసపుపట్లు గండమాలలు, సవాయిరోగములు, కుష్ఠువ్యాధులు, నివృత్తించును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులములయెత్తు చొప్పున దినమునకు 2-3 పూటల నియ్యనగును. పాలసుగంధి వేరు పచ్చిదిగాని, యెండినదిగాని (సుమారు తులమెత్తు) ఆవుపాలతో నూరి సుమారు అర్ధపావుశేరు పాలలోగలిపి 3 దినములిచ్చిన రక్తవమనము, రక్తపైత్యమునుకట్టును; దినమునకు రెండుపూటల నియ్యనగును, దీనివేరును వెన్నలో వేయించి యెండించి, చూర్ణించి తేనెతో నాకించిన బిడ్డలనోటిపూత, పుండునయమగును. మోతాదు 2 అణాలయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. దీనివేరు చూర్ణమునుగాని, కషాయమునుగాని లోపలికిచ్చిన వాతమేహవాతపునొప్పులు, గడ్డలు (Boils) నయమగును; దీని కషాయములో నీరుల్లిపాయల రసమును, కొబ్బరినూనెను గలిపియిచ్చిన రక్తమూలము నివారణమగును, దీనిని నీళ్ళతో నూరి రసము తీసి యిచ్చిన నీళ్ళవిరేచనములు కట్టును. దీని తేలికకషాయము మూత్ర

మును జారీచేయును. తేలికకషాయము చేయువిధము; 30 తులముల
యెత్తు మరుగునీళ్ళలో 5 తులములయెత్తు దీనివేరునువేసి చేయ
నగును. దీనిని 3 మొదలు 10 తులములయెత్తు చొప్పున దినమునకు
2-3 మార్లుగాని, యెక్కువ మార్లుగాని యియ్యనగును. దీని పచ్చి
వేళ్ళునూరిగాని, ఎండిన వేళ్ళు ఆవుపాలతో గట్టిగ ముద్దగనూరిగాని,
ఆవునేతితో ఉడికించినది పూటకు అరతులమెత్తు చొప్పున 3-4 దిన
ములు రెండుపూటల నిచ్చిన దారుణమగు గజ్జి, చిడుము, సర్పి
మొదలగు చర్మరోగములు పెద్దవారికిగాని, బిడ్డలకుగాని నివృత్తిం
చును. కందిపప్పు, ఆవునెయ్యి, ఆవుపాలు లేక మజ్జిగ అన్నము
తినవలెను. ఔషధ సేవాదినములలో ఉప్పు తినకూడదు.
(Sarasaparilla) కు మారుగ వాడతగియుండును; దానికంటె అధిక
గుణముగ నిది పనిజేయును.

పాలాత్తిపండ్లు:—పాలసాపండ్లు చూడుడు.

పాలుఅన్నము:—Eating rice with hot milk. వేడిపాలన్నము
అహ్లాదకరముగ నుండును; వాతమును గొట్టును; బలము జేయును.
విరేచనము గావించును; రక్తపుష్టి, వీర్యపుష్టి,ఆయుర్వృద్ధినిచ్చును;
బాలురకు, వృద్ధుల కనుకూలించి యుండును; దాహము బుట్టిం
చును, కొద్దిపైత్యము; శ్లేష్మము జేయును. దీనికి విరుగుళ్లు 1 పంచ
దార, 2 సైంధవలవణము, మిరియాలపొడి, పంచదార కొద్దిగచేర్చి
పుచ్చుకొనిన సౌమ్యముగ పనిచేయును.

పాలు కాచినవి:— Boiled milk. వేడిపాలు తాపమును,శ్లేష్మమును
హరించును; దేహసౌఖ్యము, జఠరదీప్తి, వీర్యపుష్టి, బలము వీని
నిచ్చును. కాగి చల్లారినపాలు పైత్యమును హరించును; సగము
పాలు, సగము నీళ్ళుపోసి నిగరగాచినపాలు మిక్కిలి అనుకూల
ముగా, లఘువుగా నుండును. పాలు పైత్యము, కాక, శ్లేష్మము
జేయును. దీనికి విరుగుళ్ళు పాలు చూడుడు.

పాలుకూడనివి:— Milk unfit for drink. దుర్గంధము, వివర్ణము, రుచిపోవడము, అధికముగ నీళ్ళతోగాని, ఉప్పు మొదలగు క్షీరవిరుద్ధ వస్తువులతోగాని మిశ్రమమై యుండడము, ఇట్టి యవస్థలబొందిన పాలు పుచ్చుకొనగూడదు. పచ్చిపాలు పితికిన వెనుక 10 గడియలకు వికృతినొందును. కాచినపాలును 20 గడియలకు వికృతినొంది విష తుల్యమగును. పదిగడియ లనగా 8 గంటలు.

పాలు పచ్చివి:—Unboiled Milk. రుచి తక్కువగ, గురుత్వముగ నుండును. బలముజేయును. ఆమవికారము, అజీర్ణము, వాతము బుట్టించును. అపథ్యమైనవి. దీనికి విరుగుళ్ళు పాలు చూడుడు.

పాలుపుచ్చుకొనెడు కాలవిశేషగుణములు:—Benefits according to the times at which milk is drunk. మధ్యాహ్నత్పూర్వ మందు పాలు పుచ్చుకొనిన వీర్యవృద్ధి, దేహపుష్టి, జఠరదీప్తి, బుద్ధి, బలము వీనినిచ్చును. మధ్యాహ్నము పుచ్చుకొనిన బలమును, వీర్యపుష్టిని ఇచ్చును. కఫమును, ప్రమేహమును, శ్లేష్మమును హరిం చును. దేహపుకాక నిచ్చును. రాత్రివేళ బుచ్చుకొనిన యనేకదోష ముల నణచును. బలము నిచ్చును. వీర్యపుష్టి జేయును. అమృత తుల్యముగను. పథ్యముగను ఉండునుగాని రాత్రిపాలు పుచ్చుకొనిన తోడనే నిద్రింపకూడదు.

పాలుపుచ్చుకొనకూడనివారు:—Those who should not drink milk. ఆమము, జ్వరము, వ్రణము, కుష్టు, కఫము, మేహము, భగందరము, అతిసారము, విషూచి, గ్రహణి, అజీర్ణము, రక్తవిరేచ నములు, నీళ్ళవిరేచనములు, శ్లేష్మరోగము, పైత్యరోగము, గళ రోగము, ఉరోగములు గలవారికి పాలు అపథ్యమైనవి గనుక వారు పుచ్చుకొనకూడదు.

పాలుపుచ్చుకొనవలసినవారు:—Those who should drink milk. వ్యాధినొంది నీరసపడినవారికిని, ఔషధసేవ జేయువారికిని, గర్భిణి స్త్రీలకును, ప్రసవించిన స్త్రీలు, దాట్లు మొదలగు సాధనపు పనులు చేసెడువారికిని, శరీరము శుష్కించి యున్నవారికిని, బాలురకును, వృద్ధులకును, నల్లమందు అభ్యాసము గలవారికిని పాలు అమృత తుల్యమై పథ్యముగ నుండును.

పాలు పుచ్చుకొనవలసిన కాలములు:—Occasions and seasons in which milk should be drunk. ఆకలి, దాహము గలిగి యున్నప్పుడును, శరీరమున వేడి తగ్గియున్నప్పుడును, గుఱ్ఱము, రథము, ఏనుగు, పర్వతము వీని నెక్కుడమువలన గలిగిన యాయాస మందును, స్త్రీసంభోగమందును, శరత్, శిశిర, గ్రీష్మఋతువులందును క్షీరపానము ప్రశస్తము.

పాలుంచెడు పాత్ర విశేషగుణములు:—Properties of milk according to the vessel in which it is kept. రాగి పాత్రలోని పాలు వాతమును, సువర్ణపాత్రలోని పాలు పైత్యమును, వెండి పాత్రలోని పాలు శ్లేష్మమును బోగొట్టును. కంచుపాత్రలోని పాలు త్రిదోషహరమై, తేలికను, రక్తపుష్టిని యిచ్చును. మట్టిపాత్రలోని పాలు వీర్యపుష్టి నిచ్చును. కఫపైత్యముల నణచును. రసపాత్రలోని పాలు వీర్యవృద్ధి నిచ్చును. కష్టమును హరించును. గంధకపాత్రలోని పాలు కాస, శ్వాసలను, క్షయను బోగొట్టును. అయస్కాంత పాత్ర లోని పాలు నూరువిధములచేత శ్రేష్ఠమైనవి. త్రిదోషములను హరించును. శుభ్రమైన రక్తమును బుట్టించును. గాజుపాత్రలోని పాలు పరిశుభ్రముగనుండి యేదుర్గుణములును యుండవు.

పాలు సామాన్య గుణము:—Milk generally. రుచిగ నుండును. ప్రాణప్రదమైనవి. దేహపుష్టి, వీర్యవృద్ధి, బలము జేయును. మేద

స్సను బెంచును. వాతపైత్యమును హరించును. ఆహారపు సంచిలో బుట్టెడుదుర్గుణమునుబోగొట్టును. విరేచనముగావించును. పైత్యము, శాక, శ్లేష్మము, గురుత్వముజేయును. దీనికి విరుగుళ్ళు 1 పంచదార, 2 తేనె, 3 పెసలువేసి మరగబెట్టిన నీళ్ళు, 4 నిమ్మపండ్లరసము.

పావుదార:—Camel's gall. హిం॥ పావ్ జార్. ఇది ఒంటె చేదులో బుట్టువస్తువు. దీనిని పావుజేర్రు అనియు అందురు. పైత్యము, శాక జేయును సర్వవాతములను, సన్నిపాతములను, సమస్తదోషములను హరించును. సర్వాంగములకు వేడిజేయును. మోతాదు 2–3 గుంజల యెత్తు.

పావురము:—Pegeon. సం॥ పారావత. దీని మాంసము శాకజేసి ఆర్చును. రుచిగ నుండును. పైత్యవాతము, రక్తపైత్యము, విషమ జ్వరము, శూల, వీనిని జయించును. వీర్యపుష్టిని, పుంస్త్వమును ఇచ్చును. పక్షవాతమును, ఉబ్బును బోగొట్టును. తేలిక నిచ్చును. గురదాలకు బలమిచ్చును. రెక్కలు పూర్ణముగ రానిపిల్లల మాంసము మృదువుగ మిక్కిలి ఆరోగ్యముగ నుండును. పావురపు మాంసము శాకతత్వముగలవారికి తలనొప్పి దెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 ద్రాక్షపండ్లరసము. దీనిరెట్ట (మలము) యెండించినదాని చూర్ణము పూటకు బేడయెత్తుచొప్పున తేనెలోగలిపి దినమునకు రెండుపూటలను 10–15 దినములు పుచ్చుకొనిన పక్షవాతము, మూతివంకర పోవడము మానును. దీని రక్తము పైవ్యాధులచేత జబ్బుతగిలిన భాగములకు పూసిన మేలుజేయును.

పాషాణము:—White oxide of Arsenic. అనగాశంఖపాషాణము. ఇది విషవస్తువు. అయినను దీనిని క్రమముగ శుద్ధిజేసినది భస్మము, లేక సింధూరము, లేక కట్టు, తగు మోతాదులుగ నిచ్చిన అహికజ్వరము, చలిజ్వరము, విడువని జ్వరము, శీతపైత్య, సన్నిపాతజ్వర

ములు, ఏనుగ కాలిరోగము (Elephantiasis), రుద్రివాతము (apoplexy), గవదబిళ్ళలు మొదలగు బోలునరముల వ్యాధులు (Glandular complaints), దారుణములగు వాతరోగములు, కుష్ఠురోగము, మూర్ఛ, వ్రణములు, పుట్టవ్రణములు (Cancers), ఉదరరోగము, వెర్రికుక్క విషజన్ని, పురాణవాత మేహవాతపు నొప్పులు, కంతులు మొదలగు ననేక రోగములను జయించును, బలము జేయును. పుంస్త్వమును, వీర్యవృద్ధిని యిచ్చును. మత్తు జేయును. దీనిని విశేషజాగ్రతతో వాడుక చేయతగినది. పాషాణము పట్టిది మోతాదు యెక్కువ దినినచంపును. దీనికివిరుగుళ్ళు 1 పయిండి ప్రత్తిఆకు, పువ్వులు కాయలు వీని రసము, 2 నీలివేరు, మిరియాలు వేసి కాచిన కషాయము, 3 నేరేడుచిగుళ్లు, 4 కాకరాకు పసరు, 5 వెలగపండ్లరసము, 6 తమలపాకుతీగె. మిరియాలు వేసి కాచిన కషాయము, 7 సిరకా, 8 సబ్బునీళ్లు, (40తు॥ యెత్తుసబ్బు 160 తు॥యెత్తునీళ్ళలోగలిపి3–4నిముషములకొకసారి8–10తులములయెత్తు పుచ్చుకొనవలెను), 9 వెంటనే వాంతిచేయించడము, 10 సున్నపు నీళ్లు(సున్నపుకుండలో పైన తేరిన నీళ్లు), 11 నేరేడువిత్తుల చూర్ణము 130 గోధుమగింజలయెత్తు యియ్యవలెను. పాషాణ మిశ్రమమైన ఔషధములు సేవించిన కొన్నితత్వములవారికి దేహము ఉబ్బడము మొదలగు దుర్గుణములను బుట్టించును. దీనికి విరుగుడు పనసచెక్క రసము లేక కషాయము. క్షయదగ్గులమీద పాషాణము లోపలి కియ్యగూడదు. పైన వేసిన పొక్కును. వ్రణములను తినివేయును. అనగా పెద్దపుండు జేయును. దీనినినూనెలోగలిపి పైనపూసిన గడ్డలు, వ్రణములు హరించును. పక్వమైనవానిపైన వేసిన వానిని పగుల జేయును. పాషాణము పట్టిదే లోపలికిచ్చు మోతాదు గోధుమగింజ యెత్తులో 60వ భాగము యెత్తు మొదలుకొని 12వ భాగముయెత్తు

వరకు. భస్మ, సింధూర, కట్ల మోతాదులు, అవి చేయబడు విధములు, వానిసత్త్వలు వీని ననుసరించి అవగింజంత మొదలు రెండు వడ్లగింజల యెత్తువరకు యుండును.

పిండికుండ చెట్టు :—Tranquibar Justica. దీనిని అరవములో తనకు మురంగె, పూనక పూండు అనిన్ని అందురు. దీని సమూలరసము చలవజేయును; విరేచనకారి. దీనిని బిడ్డల స్ఫోటకమున కిచ్చిన మేలు జేయును; మోతాదు పూటకు అరతులమెత్తు మొదలు తులమువరకు. దీని యాకు నూరి కట్టిన గాయములు, కవుకుదెబ్బలు నయమగును. సమూలరసము రొమ్మునొప్పిని, ప్రక్కనొప్పిని, (పార్శ్వపు) నొప్పిని బోగొట్టును. మోతాదు 2 తులములయెత్తు.

పిండికొండ చెట్టు :— Lycopodium Imbricatum. Selaginella Imbricata. సం॥ పాషాణభేది, శిలాగర్భజ, అశ్మరిఘ్న. హిం॥ పాత్రాజోరి, పాతర్ చూచి. దీనిని కొండ పిండి చెట్టని, తెలకపిండి చెట్టని యందురు. చేదు, వగరుగ నుండును. దీని సమూలరసము లేక కషాయము మేహశాంతి, పైత్యముజేయును; మూత్రమును గావించును; మూత్రబద్ధమును విప్పును; ఉబ్బు, శూల, శుక్రదోషము, హృద్రోగము, కడుపులోబల్ల, గుల్మము, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, వ్రణములు, అతిమూత్రము, మూత్రనాళము పుండగుట, శిరరోగము వీనిని హరించును; వీని వేళ్లరసమునందు యవాక్షారము గలిపి యిచ్చిన శీఘ్రముగ మూత్రమును జారీచేయును. పాత్రికడుపును శుభ్రపరచును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు, కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు.

పిండివంటలు సామాన్యగుణము:—Cakes or puddings generally. పిండివంట గురుత్వముగ నుండును; అగ్నిమాంద్యము

జేయును; నీళ్ళలో వండినవి నీరసము దెచ్చును. నేతితో జేసినవి పైత్యమును బోగొట్టును; వీర్యవృద్ధిజేయును. నూనెలో వండినవి పైత్యము, శ్లేష్మము జేయును; వాతమును గొట్టును. నిప్పులమీద కాల్చినవి తేలికనిచ్చును, కమ్ములోనుంచినవి దేహపుష్టి నిచ్చును. యవలు, గోధుమలు, పెసలు వీనిచేత చేసిన భక్ష్యములు తేలికగ నుండును; తక్కినవానితో చేసినవి ధాతుపుష్టిజేయును; గురుత్వ ముగనుండును; శ్లేష్మమును బుట్టించును. పిండివంటలకు విరుగుళ్ళు 1 వేడినీళ్లు, 2 ఉప్పువేసినకలి, 3 నెయ్యి, 4 పులిమజ్జిగ, 5 నారింజ పండు రసము, 6 మిరియాల కషాయము.

పిక్క-చెట్టు:—Trigonella Corniculata. సం॥ స్పృక్కా, ప్రిక్కా, వధూ. హిం॥ లంకాయికా, పూరి. దీని వేరు రసము లేక చూర్ణము స్వాదుగనుండును; చలవ,వీర్యవృద్ధి జేయును; కుష్టులను, త్రిదోషములను హరించును; ఆరోగ్యమిచ్చును. రసపు మోతాదు పూటకు 2-3 తులములమెత్తు. చూర్ణపు మోతాదు పూటకు 1 అణా మొదలు 2 అణాల మెత్తువరకు.

పిగిలిపిట్టమాంసము:—Bulbul-flesh of. చమురు గలిగి రుచిగ నుండును; బలమునిచ్చును; వాతమును హరించును.

పిచ్చికసుమచెట్టు:—బలురక్కసచెట్టు చూడుడు.

పిచ్చుకమాంసము:—ఊరపిచ్చుక మాంసము చూడుడు.

పిట్టు వాసినమీద వండినది:— Flour boiled in steam. బలము జేయును; వాతము నణచును; రుచిగనుండును; శ్లేష్మము, పైత్యము గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు పిండివంటలు చూడుడు.

పిన్నదూలగొండిచెట్టు:—చిన్నదూలగొండి చూడుడు.

పిన్ననేరేడు:—A species of Myrtus Cyminum. దీని చెక్క రసము లేక కషాయము వగరుగనుండును; మలబద్ధము జేయును;

కఫపిత్తములు, వ్రణము, రక్తదోషము వీనిని హరించును. రసపు మోతాదు 2-3తులములయెత్తు. కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

పిన్నపాపర:—Citrullus Colocynthis, smaller variety. సం॥ ఇంద్ర, క్షుద్రఇంద్రవారుణి. హిం॥ చోటాయింద్రాయన్. దీనినే పామరబుడుమ యందురు. దీని సమూలరసము, కషాయము, వేరు రసము, కాయలు లేక వేరుచూర్ణము చేదుగ, కారముగ నుండును; విరేచనము జేయును; క్రిమి, జ్వరమును హరించును; పొత్తికడుపు, బిడ్డల కడుపులోనుండు మైలను వెడలించి శుభ్రపరచును. శ్వాస, కాస, వాతము, గుల్మము, కుష్టు, వ్రణము, ఉదరము, శూల, బల్లలు, పాండురోగము, ఆమశూల వీనిని జయించును; కాక జేయును; అగ్నిదీప్తి నిచ్చును. రసపు మోతాదు 1-2 తులములయెత్తు, కషాయపు మోతాదు 2-3 తులములయెత్తు. చూర్ణపు మోతాదు 1 మొదలు 4 అణాల యెత్తువరకు.

పిన్నపాలచెట్టు:—Asclepias Rosea. Oxystelma Esculentum. సం॥ దుగ్ధికా, క్షీరావి, క్షీరిణీ. హిం॥ ధూధియా, ధూద్ధి. దీనిని చిరుపాలచెట్టనియు, కాంచనక్షీరి యనియు నందురు. దీనివేరు లేక ఆకురసము, చెక్క చూర్ణము చేదుగనుండును; పైత్యము, క్రిమి, విషము, దురదలు, కుష్టు, వాతరోగము, కఫము, హృద్రోగము వీనిని బోగొట్టును. గర్భమును నిలుపును; శుక్రమును వృద్ధిబొందించును. రసపు మోతాదు 2-3 తులముల యెత్తు. వేరు చూర్ణపు మోతాదు 1 అణా మొదలు 2 అణాల యెత్తువరకు.

పిన్నమావేరు:—పెద్దమావేరు చూడుడు.

పిన్నసదాప:—Peucedanum Graveleno, P. Sowa. Eng. Dill seed plant. సం॥ శతపుష్పి, మిశ్రేయా. హిం॥ సోయా,

దీని విత్తులు కారముగ, తియ్యగ, సువాసనగ నుండును; వీని చూర్ణము, రసము లేక కషాయము అగ్నిదీప్తి నిచ్చును; పొట్టకు, హృదయమునకు మేలుజేయును; కాక, మలబద్ధము, వీర్యనష్టి చేయును. వీని తేలిక కషాయము స్త్రీలు ప్రసవమయిన వెంటనే యిచ్చిన ప్రసవాయాసముతీరి సౌఖ్యముగ నుండును దీని యాకుల రసము వాతమును, శ్లేష్మమును హరించును. వీనిని ఆముదమున వెచ్చజేసి గడ్డలకు కట్టిన త్వరగ చీముపట్టి పగులును. దీని చూర్ణము బిడ్డల అజీర్ణము, కడుపునొప్పి వీనిని నివారించును; ఎక్కిళ్ళు వాంతిని కట్టును. వీనికాయలు దగ్గును, వాతమును హరించును. కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములయెత్తు వరకు. రసముయొక్క మోతాదు 1 మొదలు 2 తులములయెత్తు వరకు. చూర్ణపుమోతాదు 1 అణా మొదలు 2 అణాల యెత్తువరకు.

పిప్పలికట్టె:—A Medicinal drug largely cultivated in agency tracts. దీని రసముగాని, కషాయముగాని ప్రసవస్త్రీల మైల రక్తమును వెడలించును. వాతము, సూతికావాతమును హరించును. దీని చూర్ణము బాలింతలకు కాయములో వేసి వాడుదురు.

పిప్పలిమూలము:—Piper Officinarum. Eng. Piper root. Root of long pepper plant. సం॥ పిప్పలి మూల, సర్వగ్రంథి, కోల మూల, హిం॥ పీప్లామూల్. దీనిని మోడియని యందురు. కారము గనుండును. పైత్యము, కాక జేయును. అగ్నిదీప్తినిచ్చును. శ్లేష్మము, క్రిమిరోగము, ప్లీహ వాతగ్రంథులు, సర్వవాతములు, శ్లేష్మ వాత జ్వరములు, కాస, శ్వాస, గుల్మము, హృద్రోగము, పాండువు, ఉబ్బు, అగ్నిమాంద్యము, ఎక్కిళ్ళు, శూల వీనిని హరించును. గర్భాశయముపైన బాగుగ పనిచేయును. బాలింతల దుష్టరక్తమును వెడలించును. దీనిచూర్ణము పీల్చుట చేత శిరస్సున పుట్టినరోగములు మానును. దీని కషాయము పుక్కి-

ళించుటచేతగాని దీని పొడితో పండ్లుతోముటవల్లగాని పండ్ల జలుబు, చిగుళ్ళవాపులు, జలుబు హరించును. పొట్టలోని వాతమును వెడలించును. శరీరతత్వమును మంచికి మార్చును. విరేచనకారి, గొంతుక బొంగురుబారడమును హరించును. గాయపుసంధి (Tetanus), పక్షవాతము, రుద్రవాతము, ఆమవాతము (Rheumatism) నడుము నొప్పి, గుండెలనుతట్టిన శ్లేష్మము వీనిని హరించును.. శాకతత్వము గలవారికి జబ్బుచేయును. దీనికిని పిప్పళ్ళ గుణము గలిగియుండును గాని కొంచెము తక్కువ పనిజేయును. దీని మోతాదు పిప్పళ్ళ వలెనే వాడతగియుండును.

పిప్పళ్ళ ద్రావకము:–Tincture of long pepper పైత్యము జేయును. విరేచనము గావించును. ఆకలి బుట్టించును. మూత్రకృచ్ఛ్రమును, వాతమును, శ్లేష్మమును హరించును. జఠరాగ్నిని వృద్ధిబొందించును.

పిప్పళ్ళు: —Piper Longum- Eng. Long pepper. సం* పిప్పలీ, కణ, మాగధీ. హిం* పీపల్, పీప్ల. చముకుగలిగి, కారముగ నుండును. పైత్యము, కాకి జేయును. జఠరదీప్తి. వీర్యపుష్టి, బలము వీనినిచ్చును. శ్లేష్మము, వాతము, జ్వరము, సర్పవిషము, దగ్గు, ఒగర్పు, ఎక్కిళ్ళు, క్షయ, విశూచిరోగము వీనిని బోనడచును. ఆమవాతము (Rheumatism), పక్షవాతము, గాయపుజన్ని, రుద్రవాతము, సూతికావాతము వీనిని హరించును. గర్భాశయము (Uterus) పైన పనిచేయును. ప్రసవస్త్రీల దుష్టరక్తమును వెడలించును. గర్భిణీస్త్రీల కిచ్చిన గర్భస్రావము గలిగించును. దీనికి విరుగుడు శొంఠిచూర్ణము గలిపిన పాలనీళ్ళు. మోతాదు పూటకు 1 అణా మొదలు 2 అణాల యెత్తువరకు. వీని కషాయము దగ్గును, రొమ్మున తట్టియుండెడు శ్లేష్మములు హరించును. పిప్పళ్ళను కొద్దిగ వెచ్చచేసిన శుద్ధియగును. మోతాదు 2-3 తులముల యెత్తు.

పిరంగిచెక్క:–Smilax China-Eng. China root. సం* చీనీ, అమృతోపహిత. హిం* చోప్‌చీనీ. ఇదియొక చెట్టుదుంప. ఇది రక్త

మును శుద్ధపరచును. చర్మరోగములు, సర్వకుష్ఠులను, సర్వపైత్య ములను, క్రిమిరోగములను, సర్వదోషములను, పురాణ సుఖవ్యాధు లను, సవాయిరోగములను, మేహవాతమును హరించును. సర్వాంగ ములకు వేడిజేయును. దేహపుష్టి, వీర్యపుష్టి జేయును. చెమట బుట్టిం చును. ఓడవాండ్రకు వచ్చెడు (Scurvy) అను రోగమును నివారణ జేయును. ఇంగిలీకము, రసము వీని దోషములను పోగొట్టును గాని ఇది కొన్నితత్వములవారికి జబ్బు చేయును. యౌవనములోనున్న వారును, కాకతత్వముగలవారును దీనిని పుచ్చుకొనకూడదు. మరియు దీనిని సేవించు కాలములో అపథ్యము చేసినయెడల చాల జబ్బు చేయును. మరణమును కూడ గలిగించును. దీనిని సేవించవలసి వచ్చినయెడల దేహమును చులకన పరచవలెను. 7 దినములు ప్రయాణముచేసి మరీసేవించవలెను. 20 దినములుగాని 40 దిన ములుగాని దీనిని సేవించవలెను. దీని కషాయముతో దీని చూర్ణ మును పుచ్చుకొనిన త్వరితముగ పనిజేయును. చూర్ణపు మోతాదు పూటకు 1 మొదలు 2 డ్రాముల చొప్పున, దీని కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తుచొప్పున, దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని చూర్ణము, కషాయము పుచ్చు కొనడముకంటె దీనితో సమభాగము పాలసుగంధియు, మరికొన్ని వస్తువులను గలిపి చేసెడు ఫిరంగాది లేహ్యము సేవించిన యనుకూ లముగను, నిర్బాధకముగ నుండును.

ఫిరంగిసాంబ్రాణి:— Boswellia Glabra, B. Thurifera. Eng. Indian Olibanam or Frankincense. సం॥ కొంకనదూపం, నాలాక్షీ, కుందురు. హిం॥ కుందురు. ఇది అందుగచెట్టు జిగురు. ధూపద్రవ్యము. దీనిని కుందురుమ్కమని యందురు. సువాసనగ, చేదుగ, కారముగ, జిగటగ నుండును. త్రిదోషములు, కుష్టు వ్రణ

ములు, చర్మవ్యాధులు, గాయములు, సర్వజ్వరములు వీనిని హరిం చును. గుండెలలోని వ్యాధులను పోగొట్టును. పైత్యప్రకోపమును, రక్తపైత్యము నణచును. విరేచనములను, గ్రహణిని, రక్తగ్రహణిని కట్టును. ప్రదరము, ఉన్మాదము, తాపము నణచును. హృదయము నకు బలమిచ్చును. వీర్యవృద్ధి, బలము జేయును. దీనిని నేతితో గాని సుగంధికషాయముతోగాని, వేపచెక్కరసముతోగాని యిచ్చిన కుష్ఠురోగమును శాంతిపరచును. సెగరోగము నివృత్తించును. మోతాదు 2 మొదలు 6 గురిగింజల యెత్తువరకు. దీనిని నీళ్ళలోవేసి కాచి వడపోసిన శుద్ధియగును. దీనిని తరుచ పలాస్త్రిలలో వేయు దురు.

పిల్లిచర్మము, వెంట్రుకలు:—Skin & hair of a cat. వీని ధూపము గ్రహబాధలను శాంతింపజేయును. జ్వరదోషము, కుష్టు, దురద, దద్దుర్లు వీనిని హరించును.

పిల్లిపీచర:—పెద్దపిల్లిపీచర చూడుడు.

పిల్లి పెసరకట్టు:—Phaseolus Trilobus - boilings of pulse. పైత్యరోగము, మూత్రకృచ్ఛ్రము, తాపజ్వరము, రక్తపైత్యము, తలత్రిప్పు వీనిని పోగొట్టును. వీర్యపుష్టిని, దేహపుష్టిని యిచ్చును.

పిల్లిపెసలు:—Phaseolus Trilobus. సం॥ ముద్గపర్ణి, శాకముద్గ. హిం॥ ముగవన్. వీనినే కారుపెసలని అందురు. వీనిపప్పు చలవ జేయును. పైత్యరోగులకు మంచిది. తేలికగ జీర్ణమగును. పైత్య, మేహజ్వరములకు ననుకూలించును.

పిల్లిమాంసము:—Flesh of a Cat. విషమును, క్రిమిని, గుదరోగ మును నివారణ జేయును.

పిస్తాపప్పు:—Pistacia Vera, Eng. Distachid-nut. సం॥ నికోచక, ముకూలక. హిం॥పిస్తా. దీనిపప్పు తియ్యగ కమ్మగనుండును.పొట్టను,

ముంత గుండెకు బలమును, దేహపుష్టిని, శుక్లవృద్ధి, వీర్యవృద్ధియిచ్చును. శీతలమువలన పుట్టిన వికారము నణచును; పైత్యము జేయును, ఆలస్యముగ జీర్ణమగును; దీనికి విరుగుళ్ళు 1 పులుసుపదార్థము, 2 దానిమ్మకాయ, పంచు. దీని గుణములును బాదముపప్పు గుణములతో సమానముగానుండును.

పీతచందనము:—మంచిగంధం చూడుడు.

పీతలు:—Crabs flesh of. చెరువులయందును, వరిమళ్ళ యందును నుండు పీతలమాంసము రుచిగా నుండును. తృప్తినిచ్చును. మిక్కిలి వీర్యపుష్టి, బలము జేయును. గురుత్వముగ నుండును; కాక జేయును; వాతమును జయించును; నడుము నొప్పులను బోగొట్టును; ఈపీతల రంధ్రములలోని నీళ్ళు సన్నిపాతము మొదలగు త్రిదోషయుక్తమగు వెక్కిళ్ళను కట్టును.

పీతలు (సముద్రపువి) Sea Crabs flesh of. వీని మాంసము చమురు గలిగి రుచిగానుండును. వాతమును హరించును; వీర్యపుష్టి, స్తంభన గలుగ జేయును; మలమూత్రవిసర్జన గావించును; బుద్ధికి, జఠరాగ్నికి బలమునిచ్చును; కార్శ్యరోగమును, ఉబ్బును పోగొట్టును. వీని కండ్లలోని రాయి విషమును పీల్చును.

పుగాకు:—Nicotiana Tabacum-Eng. Tobacco. సం॥ క్షార పత్రి, ధూమ్రపర్ణి. హిం॥ తమాఖ్. చేదుగ, వెగటుగ, కారముగ నుండును; మితముగ దీనిపొగబుచ్చుకొనుటవలన వాతమును, శ్లేష్మమును హరించును; విరేచనము జేయును; ఉబ్బసపు దగ్గును, ఎగుపులుగల దగ్గు (Spasmodic cough)ను, నరముల వికలతను (Nervous irritability), జలుబునుహరించును; మత్తును, వుత్సాహమును గలుగజేయును; దేహతత్వమును సౌమ్యపరచును, పీనస స్వరదోషము, నోటి దుర్గంధము, పాండువు, రక్తక్షీణత, పొత్తికడు

పున బుట్టెడు రోగము, ముఖరోగము, కొన్నిజాతుల అగ్నిమాంద్యము (Dyspepsia), సోమరితనము, బుద్ధిప్రయాస దేహప్రయాస వలన గలిగిన బడలిక వీనిని బోగొట్టును. చుట్టపీకలు తెచ్చి కొబ్బరి నూనెలో వేసి పలాస్త్రీ పదునుగ కాటుకవలెనూరి మానని పుండ్లకు వేసిన మానును.

పుగాకు వేసి పిసికి తీసి వడియకట్టిననీరు కండ్లలో పోసిన కండ్ల వెంట నీరుకారడము, చీమువలె కారడము కట్టును. కండ్లకలకలు, పువ్వులు, బాలపాపచిన్నెలు నిర్మూలించును. చెవిలో పోసిన చీము కారడము కట్టును. పుగాకును కొబ్బరినూనెలో వేసి పిసికి వడియకట్టి ఆ చమురు తలకు పూయుటవలన వెండ్రుకలు రాలిపోవడము చుండ్రు మొదలగు దోషములు నివృత్తించును. పుగాకు, గచ్చపలుకులు కలిపి నీళ్ళతోనూరి అండమునకు పట్టించిన వరిబీజపుబాధ, వాపు నిర్మూలించును. పుగాకుకాడల క్షారము, పిప్పలిచూర్ణసమ భాగముగ కలిపి, నిమ్మపండ్లరసముతో నిచ్చిన శూలలు హరించును. మూత్రము గావించును. ఘాటుగల పుగాకును చిన్నచిన్న ముక్కలు 2 తులములు, నువ్వులనూనె 4 తులములు ఒకమూతి వెడల్పు సీసాలో గట్టి కార్కుతో మూతవేసి 2 మాసములువుంచి, తీసి చేతితో మరియొక గాజుపాత్రలో వేసి పిసికి వడియకట్టి మరియొక సీసాలో కార్కు వేసి యుంచినది 20 మొదలు 40 చుక్కలవరకూ, పాము కరచినవారికిచ్చిన తక్షణము వమనమై, విషము దిగును, విరేచనమగును. ఈ తైలమును తేలు, జెర్రి కుట్టినచోట మర్దన చేసిన బాధ నయమగును. దీని తేలిక కషాయమనగా ముప్పావు శేరు వేడినీళ్ళలో 3 తులములమెత్తు పుగాకు వేసి చేసినది లోపలి కిచ్చిన ఉదరరోగము,ఉబ్బురోగము (Dropsy),మూత్రబద్ధము వీనిని

పోగొట్టును. మోతాదు పూటకు 60 మొదలు 90 చుక్కలచొప్పున పెద్దవాండ్రకు దినమునకు రెండుపూటల నియ్యనగును.

పుగాకు గుదస్థానమందు కట్టిన మలబద్ధము నివృత్తించునుగాని కొందరికి వమనములగును.

దీనిపొగ దేహమునకు పట్టించిన సవాయిపొక్కులు, రసదోషమును, వాతమును హరించును. దీని పొగ విషవాయువును విరుచును. ఈపొగను గుదస్థానమునకు పట్టించిన నివారించును.

పుగాకును మెత్తగ నూరి కట్టిన లేక మెత్తచేసి కట్టినను మురికి వ్రణములు, చీముపట్టియున్న వ్రణములు మానును. పుగాకు, కచ్చి శీతాఫలపాకు, పచ్చ కర్పూరము మెత్తగ నూరి కట్టిన పురుగులు పట్టిన వ్రణములలోని పురుగులు చచ్చి వ్రణములు మానును.

దీనిచూర్ణము (ముక్కుపొడుము) పీల్చుటవలన నిద్రమాంద్యమును పోగొట్టును. బుద్ధికి చురుకుదనమును బుట్టించును. తుమ్ములను గలిగించును. దృష్టిబలమును, ఘ్రాణేంద్రియ బలమును తగ్గించును. ఎండలో నడచుచు పొడుము పీల్చిన తలనొప్పి, వికాసము బుట్టించును.

హుక్కాపొగ పుచ్చుకొనిన వెనుక దాని బుడ్డిలోని నీళ్ళతో కడిగిన కుళ్ళువ్రణములు, పురుగులుపట్టిన వ్రణములు నయమగును. హుక్కాపొగగొట్టము లేక కాడలోచేరియుండెడి నల్లని తైలమును పట్టించిన చీముపట్టిన వ్రణములు మానును. ఆతైలమును కండ్లలో పెట్టిన కండ్లవెంట చీముపలెకారు రోగము, రేజీకటి మానును. హుక్కా పొగ అనగా పుగాకును శుభ్రపరచి, కొన్ని సుగంధ ద్రవ్యములు చేర్చి తయారుచేసినది కాల్చి, పొగ పీల్చిన, చుట్టలు కాల్చుటకంటె సుగుణములు కలిగియుండును. కఫవాతముల హరిం

ము. పుగాకునూరి వెన్నపూసకు పట్టీ (Poultice) వేసికట్టిన గాయపుసంధిరోగము (Tetanus) మానును.

వేడిగానుండు పుగాకుయొక్క గాఢకషాయముతో వత్తడము (Fomentation) ఇచ్చిన మాంసపుకండల బిగింపు, బిరుసుదనము (Muscular tension) మానును. గాయపుసంధి (Tetanus) లోని ఈడ్పులను (Spasms) కట్టును. అండత్రయముల నొప్పి నివారించును. పుగాకును నూరిపట్టించిన వాతపునొప్పులు, చర్మరోగములు మానును. పుగాకుతడిపి వేసిన లేక అంటించిన మొలగజ్జి మానును.

పుగాకు కాడను సన్నగగీసి ఆముదములో ముంచి బిడ్డల ఆసనములో నెక్కించిన మలబద్ధము హరించును. విరేచనము జేయును గాని కొందరికి వికారపెట్టును.

ఎండుపుగాకు తడిపి మెత్తగజేసి కట్టిన క్రొత్తగలేచిన బృహత్తు యొక్క వాపు, నొప్పి నిమ్మళించుచుగాని కొందరికివాంతి, వికారము పుట్టును. గడ్డలపైనవేసి కట్టిన వానిని హరించును. పగులజేయును. నొప్పితీయును. మాన్పును. పచ్చిపుగాకు కట్టినను పైనజెప్పిన పనులు జేయును. పుప్పిపంటిపైన బెట్టిన నొప్పిని హరించును. పుండై రసికారు వృషణములకు పుగాకు కట్టిన నయమగును.

పుగాకు నూరినదిగాని, హుక్కాబుడ్డిలో అడుగునచేరు మడ్డిగాని, పుగాకుపిసికిన నీళ్ళుగాని వేసిన గొంతుకలో లేక ముక్కులో లేక దేహమందెక్కడనైన పట్టియుండు జలగలు ఊడిపడును.

పుగాకు లేక కాడలు కాల్చిన బూడిద నూనెలో గలిపి పూసిన చిడుము, చర్మరోగములు మానును. ఎండుయాకుల చూర్ణములో నిమ్మపండ్లరసము గలిపి పట్టువేసిన ప్లీహరోగము (Enlargement of spleen) బాగగును.

పుగాకు పొగ అమితముగ బుచ్చుకొనివను, పుగాకుఅమితముగ నములుట (నోటిలో నుంచుకొనుట) వలనను గుండెలలో వేడి పుట్టును. రొమ్ముగాార్చును. మెదడు గాచ్చును. గుండెదడను, గుండె నొప్పిని, తలనొప్పిని బుట్టించును. ఆకలిని, జీర్ణశక్తిని తగ్గించును. నరములకు, మాంసపుకండలకు బలహీనము బుట్టించును. పక్ష వాతమును గలిగించును. దృష్టిని, కార్జముయొక్క పనిని జెరచును. పుగాకు తినిన వమనమును, విరేచనమును చేయును. అధికముగ తినిన మత్తెక్కించును. చంపును. దీనికి విరుగుళ్ళు 1 పాలు, 2 నెయ్యి, 3 కొబ్బరికాయనీళ్ళు.

పుచ్చకాయ (కూరపుచ్చకాయ):—A sort of cucumber. ఇవి దోసకాయలవలె చిన్నవిగను కోలగను ఉండును దీనికూర రుచిగ నుండును. వాతము జేయును. మూర్ఛను, పైత్యమును అణచును. నేత్రరోగములకు, మూలశంక రోగములకు మేలుజేయును. శుక్రమునకు హానిచేయును. కఫమును వృద్ధిజేయును. చలవ అగ్నిమాంద్యము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 శాకవస్తువులు.

పుచ్చపండు:—తరుబూజాపండు చూడుడు.

పుట్టకొక్కుల సామాన్యగుణము:—Mushrooms-curry of-generally. ఇది తెలుపు, పసుపు, ఎరుపు, జాతులుగలవు. ఇందులో తెలుపు, పసుపుజాతులు మంచివి. ఎరుపు, నలుపుజాతులు దోష యుక్తమైనవి. రుచిగ నుండును. బలముజేయును. దేహపుష్టిని, కాంతిని యిచ్చును. పైత్యము నణచును. వాతము, శ్లేష్మము మల మూత్రబద్ధము, మేదోరోగము, మేహము, వాతరక్తము వీనిని గలుగజేయును. అగ్నిమాంద్యము జేయును. వీనికి విరుగుళ్ళు 1 ఆవాలు, 2 జీర్ణకరౌషధములు. ఎర్రపుట్టకొక్కు, తెల్లపుట్టకొక్కు, నల్లపుట్టకొక్కు చూడుడు.

పుట్టతేనె:—Honey in an ant hill. తేనె చూడుడు.

పుత్రజీవిచెట్టు:—Putrajiva Roxburghii, Nageia Putranjiva. సం* పుత్రజీవ, గర్భకర. హిం* జియాపోతా, పుతజియా. దీని వేరు చెక్క లేక విత్తుల రసము లేక కషాయము త్రిదోషములను శమింపచేయును. తాపము, దప్పి, మూలవ్యాధి వీనిని పోగొట్టును. శుక్ర వృద్ధి జేయును. గర్భధారణ కలుగజేయును. మలబద్ధము జేయును. మూత్రము గావించును.

పుదీనా:— Mentha Sativa & Mentha Arvensis. Eng. The Marsh mint. సం* పూతనీ, పుదీనా, వ్యంజన. హిం* బం. త. పొదీనా. కొద్ది తీపిగలది. దీని యాకు కాడలు వేడిజేసి అర్చును. దీని సమూలకషాయము లేక చూర్ణము అన్నమును జీర్ణము జేయును; కఫదోషమును, వాతదోషమును హరించును; పొట్టకు బలము జేయును; అగ్నిమాంద్యము (Dyspepsia)ను, వాంతిని కట్టును; పొట్టలోని వాతమును వెడలించును; అపస్మారమును (Hysteria), తెరతెరలుగా వచ్చు కడుపునొప్పి (Spasmodic colic), పాండు రోగమును పోగొట్టును; వికారము ఉణచును; రుచి బుట్టించును. ఈడ్పులను(Spasms)కట్టును; అప్యాయతనిచ్చును; బడలిక తీర్చును; దీపనకారి; జీర్ణకారి; విరేచనము జేయును; మూత్రము గావించును; దేహమును, సౌమ్యస్థితిని, శుభ్రముగను ఉంచును; గుండెలను శుభ్రపరచును; అతిశ్రేనుపులను కట్టును; కోరగల జంతువుల విషమును హరించును; ఋతురక్తమును జారీచేయును. పచ్చియాకును వాసన జూచుటవలన తలలోనుండు జబ్బును, ముఖము తిరగడము(Fainting) ను పోగొట్టును. పాలలో వేసిన వానిని త్వరగ విరిగిపోనియ్యదు. నల్లమిరియములతో బుచ్చు

కొనిన అజీర్ణము పోగొట్టును. చలి తేలిక కషాయము (Cold infusion), బిడ్డల పొట్టలోని వాతమును హరించును; మిక్కిలి తినిన ప్రేగులకు నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తవాక్షీరి, 2 బాదాం జిగురు. కషాయపు మోతాదు 3–4 తులముల యెత్తు. తేలిక కషాయపు మోతాదు 5–6 తులములయెత్తు. చూర్ణపు మోతాదు 1 మొదలు 4 చిన్నముల యెత్తువరకు. దీని ఆకును చింతపండువేసి కొద్దిగ జీలకర్ర వగైరాలను చేర్చి పొగిచి నూరిచేసిన పచ్చడి మిక్కిలి రుచిగను, ఆరోగ్యముగ నుండును. రుచి బుట్టించును. వికారమును పోగొట్టును. దీని సమూలమునుండి పూదీనాపువ్వు తీయుదురు. తైలమున్నూ తీయుదురు. పై గుణములు వీనికిని కలిగియుండును. పువ్వు మోతాదు 1–2 గింజల యెత్తు. తైలపు మోతాదు 2–3 చుక్కలు.

*

పునుగు:—Viverra Zibetha. Eng. Civet produced by the civet cat. సం॥ గంధమార్జారీ, గంధచేలికా. ఇది పునుగుపిల్లి మదము; సుగంధముగనుండును; దీనిని చందనము మొదలగు సుగంధద్రవ్యములతో చేర్చి స్నానానంతరమున శరీరమునకు పూసుకొనుచుండిన సువాసనగా, మనోహరముగా నుండును. మదన వికారమును బుట్టించును. రక్తపైత్యము, వాతరోగము, కఫము, కుష్ఠు, పొక్కులు, దురద, చర్మరోగములను, క్రిమిరోగము, విషము, వ్రణములు వీనిని హరించును. కాంతినిచ్చును. దేహదుర్గంధమును పోగొట్టును. దీనిని గోరోజనము, గుగ్గిలము, తేనెగలిపి లోపలికి పుచ్చుకొనిన వాతము, యీడ్పువాతమును శమింపజేయును. వుత్సాహమును, కామోద్రేకమును కలగజేయును. మోతాదు అనగా వుపయోగించువిధము, పునుగు 1 అ॥ యెత్తు, గోరోజనము, 2 అ॥

యెత్తు గుగ్గిలము 4 అ॥ యెత్తు ఈ మూడును కలిపిన చూర్ణము ½ అణాయెత్తు మొదలు 1 అణాయెత్తువరకు తేనెతో పుచ్చుకొనవలెను.

పురుగుడు చెట్టు:— తెల్లపురుగుడు, నల్లపురుగుడు చూడుడు.

పులగము:— Rice boiled with green gram Dhall. అనగా బియ్యముతో కొద్దిగ పెసరపప్పు,ఉప్పు చేర్చి వండిన అత్తెసరన్నము రుచిగనుండును. కాక జేయును. వాతమును, చలవనణచును. దేహ పుష్టి బలముజేయును. గురుత్వముగ నుండును. కాక పైత్యశరీరు లకు, అజీర్ణము, గ్రహణి గలవారికి జబ్బుజేయును. దీనికి విరుగుళ్లు సైంధవలవణము మరియు అన్నము చూడుడు.

పులసచేప:—A kind of sea fish. తెల్లగ నుండును. మిక్కిలి చమురుగలిగి రుచిగ, గురుత్వముగ నుండును. కాక జేయును. పైత్య వాతరోగులకును, రసము దినినవారికిని, సుఖరోగులకును మిక్కిలి జబ్బుజేయును. అపథ్యమైనది. దీనికి విరుగుళ్లు చేపలు చూడుడు.

పులిగడుగు:—లక్ష్మిచారు చూడుడు.

పులిచర్మము:—Skin of a Tiger. సన్యాసుల శయనాసనములకు అనుకూలముగానుండును. గ్రహదోషములను బోగొట్టును. ఆయు ర్వృద్ధి నిచ్చును. దేహమును వృద్ధిబొందించును. నిరోగమైనది.

పులిచంచలి:— Oxalis Corniculata, Eng. The Indian Sorrel, సం॥ అమ్లలోనికా, చాంగేరీ. హిం॥ అమ్రూల్ శాక్, దీనిని పులిచింత యనియు నందురు. దీని యాకు పుల్లగ, పలచగ, చిన్నదిగ, రుచిగ నుండును. దీని సమూలరసము లేక చూర్ణము లేక కషాయము జఠరదీప్తి నిచ్చును. వాతరక్తము నణచును. వాతమును, అగ్నిమాంద్యము (Dyspepsia) ను, సీరసమును, గుల్మమును, మూలవ్యాధిని శమింపజేయును. మూత్రమును జారీ జేయును. వీర్యమునకు వేడి పుట్టించును. దేహపుష్టిని వృద్ధి

జేయును. లఘుత్వమునిచ్చును. గర్భములోనుండు రోగములను, చర్మరోగములను, గ్రహణి, సంగ్రహణి రోగములను నిశ్శేషముగ బోనణచును. దీని ఆకును నీళ్ళుచాసిగాని, పొయ్యకగాని నూరి యెర్రబడి పుండుగా నుండుచోట కట్టిన చల్లబడి నొప్పి, మంట, పోటు నివ్మూలించును. దీని యాకును వేడినీళ్ళతో నూరి రసము తీసి అందులో తెల్లనీరుల్లిపాయల రసము కలిపి తలకు పూసిన పైత్యపు తలనొప్పి మానును. దీని యాకులరసము పూసిన వులిపిరికాయలు హరించును. ఆరసము కండ్లలో పిండిన కంటిపొరలు, దుర్మాంసములు హరించును. దీని సమూలముతో చేసిన లేహ్యము బలము, మేహశాంతి, చలవజేయును. దీనియాకులతో చేసిన పచ్చడి పుల్లగ రుచిగా నుండును. రుచిబుట్టించును. అగ్నిదీప్తినిచ్చును. రోగులకు మిక్కిలి పథ్యమైనది. దీని యాకులను ఉప్పుతో నూరి కండ్లకు కట్టిన కండ్లమసక, పొరలు, దుర్మాంసము హరించును. రసముయొక్క మోతాదు పూటకు 1-2 తులముల యెత్తుచొప్పున, చూర్ణపు మోతాదు పూటకు 1-2 అణాల యెత్తుచొప్పున, కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 5 తులముల యెత్తుచొప్పున, లేహ్యపు మోతాదు పూటకు 4 మొదలు 8 అణాల యెత్తువరకు దినమునకు రెండ పూటల నియ్యనగును.

పులినెయ్యి:—Fat of Tiger. ఇది పెద్దపులియొక్క క్రొవ్వు దీనిని వాత, మేహవాతములచే శాళ్ళుపడినవారికి ఆవునెయ్యిగాని, ఆముదముగాని మిశ్రమముజేసి మర్దనచేసిన నరములకు సత్తువజేసి, కాళ్ళువచ్చును.

పులిమాంసము:—Flesh of tiger. ఉప్పగ నుండును. కాకను. కఫమును జేయును. బుద్ధిని హెచ్చించును. లఘువుగ నుండును. వాతమును, పైత్యమును, మూలవ్యాధిని, ఉబ్బు, మలమూత్రబద్ధము,

గ్రహణి వీనిని హరించును. దీనిని ఆవాలనూనెలో వేసి వండి యా నూనె దేహమునకు పూసిన లేక మర్దనజేసిన రక్తమాంసక్షీణమైన దేహము తిరిగి రక్తమాంస పూరితమగును.

పులుగుడుచెట్టు:—తెల్లపురుగుడు, నల్లపురుగుడు చూడుడు.

పులుపుగుణము:—Acidity. అనగా పుల్లగ నుండెడు వస్తువుల సామాన్యగుణము. రుచిబుట్టించును, జీర్ణము గావించును. జఠరదీప్తి నిచ్చును. అమితముగ పులుసు పుచ్చుకొనిన కఫము, పాండువు, కార్శ్యరోగము, దగ్గు,వాతరోగము గలవారికి అపథ్యముగనుండును.

పుల్లగోంగూర:—గోంగూర చూడుడు.

పుల్లదబ్బకాయ:— Sour orange. చలవజేయును; పైత్యమును హరించును ముంతగుండె (Heart) కు బలమిచ్చును; ఆకలి బుట్టించును; వికారముగొట్టును; విరేచనము గట్టును; రొమ్మునకు, తల నరములకు జబ్బుచేయును. దీనికి విరుగుడు గసగసాల పానకము. దీనిని ముక్కలుక్రింద కోసి నిమ్మకాయ పచ్చడివలె బెట్టుదురు. పైత్యహరముగ నుండును. మేహపైత్యరోగులకు పథ్యముగ నుండును. ఆకలి వృద్ధిపరచును. ఆరోగ్యమిచ్చును.

పుల్లనిగంజి:—Sour cunjee. గురుత్వముగ, చిక్కగ నుండును; ఆప్యాయతను, దేహపుష్టిని యిచ్చును; దాహమును, తాపమును, శమింపజేయును; వాతమును హరించును; శ్లేష్మమును, పైత్యమును గలుగజేయును.

పుల్లపాయలకూర:—యిది నీటి వారనులేచును కొంచము పుల్లగా నుండును. పాయిల, పెద్దపాయిల గుణములు గలిగియుండును.

పుల్లప్రబ్బలి:—అమ్లవేతసము చూడుడు.

పుల్లబచ్చలి:—Country sorrel. దీని రసము లేక కషాయము వేడి జేసి ఆర్చును; గుల్మము, హృద్రోగము, మూలవ్యాధి, క్షయ,

మేహము, పైత్యము, రక్తపైత్యము, పైత్యభ్రమ, పాము, తేలు విషములు, కడుపు బిగబట్టడము, కడుపులోమంట వీనిని పోగొట్టును; ఆకలి బుట్టించును; విరేచనము జేయును; మూత్రము గావించును; బుద్ధికి బలమిచ్చును; కడుపులోని చెడుకాకను తీసివేయును; పైత్య విరేచనములను. రక్తగ్రహణిని కట్టును. దీని సమూల రసమును పుక్కిలించిన లేక దీని ఆకు నమలి యుమ్మివేసిన. పండ్లనొప్పులు మానును; పండ్లు గట్టిపడును. ఆకునూరి కట్టిన గడ్డలు త్వరగా పక్వమై పగిలి మానును; పైనపూసిన గజ్జిమానును. దీనిని మాంసములో వేసి వండిన అది త్వరగ జీర్ణమగును; కాక ఉత్వము గల వారికి ఎక్కిలి యనుకూలముగ నుండును; పుంస్త్వమును తగ్గించును; శ్లేష్మవాతముల జేయును. దీనికి విరుగుళ్ళు 1 లవంగాలు, 2 కొబ్బరి, 3 ఆవాలు, 4 బెల్లపుపానకము రసపుమోతాదు పూటకు 4-5 తులములయెత్తు కషాయపుమోతాదు 3 మొదలు 5 తులముల యెత్తువరకు. దీని కూరకు పై గుణములుండును.

పుల్లరేగుపండు:—A sort of berries. ఈ చెట్లు అడవులలో లేచును. దీనిని కొన్ని ప్రాంతములందు వల్లరేగుచెట్టని యందురు. పులుపు, తీపి రుచులు గలిగియుండును. రుచిబుట్టించును. కాక జేయును. వాత మునణచును. మలబద్ధము, శీతపైత్యము జేయును. జ్వరము దెచ్చును. దీనికి విరుగుడు నువ్వులచెట్టు కాల్చిన క్షారము.

పువ్వుల చప్పరము:—A canopy of flowers. సువాసన గలిగి మనోహరముగ నుండును. చలవ నిచ్చును. కామోద్రేకమును బుట్టించును. వాతము జేయును.

పువ్వులపాన్పు:—Bed of flowers. సువాసనగలిగి మనోహరముగ నుండును. మన్మథోద్రేకమును బుట్టించును; శ్రమ తాపమును

హరించును. సౌఖ్యమునిచ్చును. మృదువుగనుండును. వాతశ్లేష్మముల నధికపరచును.

పుష్కరమూలము:—Iris Florentina I. Germanica. సం* పుష్కరమూల, పద్మ పుష్కర. హిం* పోహకర్ మూల్. దీనివేరు సువాసనగ నుండును. దీని నుండి తీసిన తైలము అత్తరువుగా యుపయోగింతురు. దీనిని సువాసనగల తైలములలో వేయుదురు. చంగల్వకోష్టును బోలియుండును. దీని చూర్ణము లేక కషాయము చేదుగ, కారముగనుండును; వేడిజేయును, కఫవాతము, జ్వరములు, శ్వాస, కాస, హిక్క, అరుచి, శోథ, పాండువు, ఉబ్బసదగ్గు, హృద్రోగము, పార్శ్వశూల, వాతము, సన్నిపాతజ్వరములు వీనిని హరించును. రక్తపైత్యమును గొట్టును; గర్భము నిలుపును; శ్లేష్మజ్వరము, విషము, క్రిమిరోగము వీనిని హరించును. బుద్ధిని హెచ్చించును. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

పుష్ప కాసీసము:—Sulphate of iron, yellowish variety. సం* పుష్పకాసీస, అన్నబేది చూడుడు.

పుష్పధారణగుణము:—Decorating hair with lock of flowers. శిరోభారమును, దుర్గంధమును బోగొట్టును; కండ్లకు చలవజేయును, సుఖమును సంతోషము నిచ్చును; కామోద్రేకమును గలుగజేయును. మనోహరముగ నుండును.

పుష్యరాగభస్మము:—Calx of Topaz. ఇది నవరత్నములలోనొకటి. వాతమును జయించును; మిక్కిలి జఠరదీప్తినిచ్చును; ఆయుర్వృద్ధి బుద్ధిబలము, వీర్యవృద్ధి వీనిని గలుగజేయును; కాంతినిచ్చును. మోతాదు పూటకు 1 మొదలు 4 గురిగింజల యెత్తువరకు.

పుష్పాంజనము:—Zinc oxide. సం* పుష్పాంజన, కుసుమాంజన. హిం* పుష్పాంజన్. అనగా సత్తుభస్మము. నేత్రములనుండి కారెడి

నీళ్ళను కట్టును; ఎక్కిళ్ళను శ్వాసను, దురదను, కఫమును, పీనస రోగమును పోగొట్టును; లూతమను నేత్రవ్రణమును, ఇతర నేత్ర రోగములను, ఎలుక విషమును, ఊపిరిగొట్టు నొప్పిని హరించును. మోతాదు 2 మొదలు 4 గురిగింజల యెత్తువరకు.

పుష్పాసవము:—Wine made of flowers. అనగా పుష్పము లతో చేసిన సారాయము. మిక్కిలి రుచిగనుండును; మనోవికాస మును గలుగ జేయును; కాక చేయదు, పైత్యము, వాతము, పాండువు, మేహము, మూలవ్యాధి, క్రిమి వీనిని శమింప జేయును.

పూతట్లు:—A sort of cakes. వరిపిండితో రేకులుచేసి పంచదార నెయ్యి వేసి చేసెడు ఒక భక్ష్యము. రుచిగనుండును. బలము, దేహ పుష్టినిచ్చును; కొద్దిగ గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు పిండివంటలు చూడుడు.

పూతికపండ్లు:—తూతికపండ్లు చూడుడు.

పూరేడు పిట్ట:—A sort of bird like a quail. దీని మాంసము వేడిజేసి చలవ జేయును; రుచిగనుండును; తేలిక నిచ్చును; వాత పైత్యములను హరించును; రుచిబుట్టించును; అగ్నిదీప్తి నిచ్చును; కఫమును, శ్వాసకాసల నణచును; క్షయను పోగొట్టును; అతివేగ ముగా జీర్ణమగును. శరీరమునకు బలమిచ్చును. మిక్కిలి పథ్యమైనది.

పూర్ణపుఉండ్రాళ్ళు:—ఉదుంబరములు చూడుడు.

పూర్ణపుబూరెలు:—బూరెలు చూడుడు.

పెండలము (ఇది యెఱ్ఱ, తెల్ల, తీగలుగలిగివుండును.):— Dioscorea Alata. The yam.- సం॥ స్థూలకంద, గ్రామకంద. రుచిగ, స్వాదు గను, మేహశాంతి, వీర్యపుష్టి, బలము జేయును. రుచిబుట్టించును. మూత్ర ముగావించును. కొద్దిగ కఫవాతములను జేయును; మొంతగుండెను,

పొట్టకు బలమిచ్చును; పైత్యపుకాకను, దాహము నణచును, అగ్నిమాంద్యము, మలబద్ధముజేయును. కడుపులో గాలి బంధించును. దీనికి విరుగుళ్ళు 1 బెల్లము, 2 తమలపాకు. ఈ పెండలపు తీగలు చాలారోజులు నిలవయుండినవానికి గుండ్రని కాయలు కాయును. కూర వండికొనిన రుచిగా నుండును. దేహపుష్టి, బలము జేయును.

పెగ్గుమ్ముడు:—గుమ్ముడుచెట్టు చూడుడు.

పెట్లుప్పు:—సూరేకారము చూడుడు.

పెట్లుప్పుద్రావకము:—సూరేకారపుద్రావకము చూడుడు.

పెద్దఅంకుడుచెట్టు:—కొడిశపాలచెట్టు చూడుడు.

పెద్దఆరె:—ఆరెచెట్టు చూడుడు.

పెద్దకచోరము:—కచోరము చూడుడు.

పెద్దకాకరకాయ:—కాకరకాయ చూడుడు.

పెద్దగన్నేరుచెట్టు:—గన్నేరుచెట్టు చూడుడు.

పెద్దగురువిందచెట్టు—బండిగురివిందచెట్టు చూడుడు.

పెద్దజిలకఱ్ఱ :— Anethum Forniculum. Eng. Sweet fennel seed. ఇది సోపువలెనుండును. సోపుఅని దీనిని అమ్ముదురు. సువాసనగ, కారముగ నుండును. పొట్టలోని వాతమును వెడలించును. పొట్టకు బలముజేయును. ఆకలి బుట్టించును. స్త్రీలకు పాలుపడజేయును. దీనిఆకుల కషాయము మూత్రమును జారీచేయును. కండ్ల బలహీనమును పోగొట్టును. దీనివిత్తుల తేలికకషాయము నైనుతో బుచ్చుకొనిన తేలు విషము హరించును; కషాయపు మోతాదు 2½-5 తులముల యెత్తు.

పెద్ద దవనము:— దవనము చూడుడు.

పెద్దదూలగొండచెట్టు:— Dolichos Prurians & Mucuna Prurians-Eng. The cowhage. సం॥ ఆత్మగుప్తా, కపికచ్ఛు.

శూకశింబీ. హిం* _కౌంచ్, కివాంచ్. యిది చిక్కుడుతీగవలెపాకును, పువ్వులు, కాయలు చిక్కుడువలె నుండును. కాయలపైన సన్నని నూగు యుండును. యీనూగు శరీరమునకు తగిలిన విపరీతమైన దురదపెట్టును. దీని వేరు, యీాకుకాడల రసము లేక కషాయము తీపి, చేదు రుచులుగలిగి యుండును. రక్తపైత్యము, వాతము, దుష్టవ్రణములు, అతిసారము, అండవృద్ధి, మేహాతిసారము, వాత జ్వరము వీనిని హరించును. దీని వేరు కషాయములో తేనెకలిపి యిచ్చిన విశూచిజాడ్యము (cholera) నివ్మృళించును. దీని కాయ మీాది నూగు బెల్లములో పొదిగికాచి పంచదార పాకములోగాని, తేనెలోగాని కలిపియిచ్చిన యేలికపాములు, క్రిములు చచ్చును. నూగు మోతాదు 1-2 గురిగింజలంత మూడుదినములు ఉదయము పూటలను ఇచ్చి, నాల్గవదినము విరేచనములకు ఇయ్యవలెను. దీని విత్తనములు తియ్యగనుండును. మదమును బుట్టించును. వీర్యపుష్టి చేయును. కుసుమరోగమును, వీర్యనష్టమును కట్టును. దీని విత్తుల చూర్ణము 1 పాలు, పెద్దపల్లేరు విత్తుల చూర్ణము 1 పాలు, రెంటికి సమము చీనాపంచదార కలిపి దీనిని గోరువెచ్చని పాలతో పుచ్చు కొనిన మిక్కిలి వీర్యవృద్ధి, రతిసౌఖ్యము గలుగును. విత్తులను ఆవు పాలతో వండి విత్తులపై చర్మముతీసి వేసి త్రొక్కి, పంచదార పాకము పట్టి లేహ్యముగ చేసి పుచ్చుకొనినను వీర్యవృద్ధి కలుగును. దీని వేరు దేహమునకు బలము జేయును. మూతివంకర వాతము, పక్షవాతము మొదలగు నరముల రోగములను కుదుర్చును. విత్తులకును అటువంటి గుణము కలదు. విత్తులను ఇతర మూలికలతో నిచ్చిన వీర్యనష్టము కట్టును. దీని వేరుకషాయము లోపలికిచ్చిన సన్నిపాతము కుదురును. దీని వేరు గంధము లేక వేరునూరినది వంటికి పూసిన ఉబ్బురోగము నివర్తించును. దీనివేరుముక్కలు ఒకటి ముంజేతికి,ఒకటి చీలమండకు

కట్టిన ఉబ్బురోగము నివర్తించును.దీనివిత్తును కొద్దిగ నీళ్ళలో అరగ తీసి తేలుకుట్టినచోట అంటించిన దాని విషమును పీల్చివేయును. దీని వేరుకషాయము మూత్రమును జారీచేయును. గురదాలకు(kidneys) శుభ్రపరచును. దీని కాయ నూగుతో చేసిన పలాస్త్రి యంటించిన కొద్దిగ యెఱ్ఱబడి పొక్కును. కసుమరోగము, వీర్యనష్టము ఇవి కట్టుటకును, వీర్యవృద్ధి చేయుటకును ఇచ్చువిత్తుల చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు దినమునకు రెండు పూటలచొప్పున 15 లేక 20 దినములు నియ్యవలెను. కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తులముల యెత్తుచొప్పున నియ్యనగును.దీని వేరు కషాయము సుఖవ్యాధులుగలవారి శరీరతత్వమును మార్చును. మూత్రబద్ధమును మాన్పును.దీని కాడల కషాయము ఉబ్బురోగమును పోగొట్టును. దీని వేరురసము ఆవుపాలలో గలిపి యిచ్చిన జ్వరము, గజ్జి, చిడుము నివృత్తించును.కషాయపు మోతాదు పైప్రకారము. రసపు మోతాదు ౨-4 తులములయెత్తు. దీనిఆకులకు ఆముదము చరిమి వెచ్చజేసివేసిన వ్రణములు మానును. దీని సమూలమును ఎండించి సన్నముగ ముక్కలుకోసి వానిపొగ బుచ్చుకొనిన దగ్గు, వగర్పులు నిమ్మళించును; దీని వేరుతో చేసిన తైలము ఏనుగుకాలు (Elephantiasis) రోగమును మాన్పును.

పెద్ద దేవదారు:— దేవదారు చూడుడు.

పెద్దదోసకాయ:—Large species of cucumber. మేహము నణచును. మిక్కిలి శీతలము జేయును. వాతమును, శ్లేష్మమును బుట్టించును. గురుత్వము చేయును. దీనివిరుగుళ్ళు దోసకాయచూడుడు.

పెద్దనేపాళము:— నేపాళపుచెట్టు పెద్దది చూడుడు.

పెద్దనేలములక:— నేలములక చూడుడు.

పెద్దపల్లేరు:—Pedalium Murex. Eng. Caltrops. సం॥ స్వాదంష్ట్రా స్థూలశృంగాట, గోక్షుర. హిం॥ బాడాగోఖురు. పెద్దపల్లేరును ఏనుగుపల్లేరు అని పేరుగలదు. వీనివేళ్ళు, ఆకులు, కాయలు తీపి, చేదు రుచులుగలిగియుండును. సమశీతోష్ణముగనుండును. వీనిరసము లేక కషాయము, చూర్ణము మృదువుపరచును. పైత్యశాంతి, మేహశాంతి జేయును. జఠరదీప్తి నిచ్చును. వీర్యవృద్ధి, ధాతుపుష్టి జేయును; త్రిదోషములను హరించును. శూల, హృద్రోగము, మూత్రకృచ్ఛ్రము, మూలవ్యాధి, ప్రమేహము, కఫరోగము, అగ్నిమాంద్యము, శోష, తాపము వీనిని నివృత్తించును; గుండెలను శుభ్రపరచును; మూత్రమును జారీచేయును; మూత్రపు సంచి (bladder). గురదాలు (kidneys) వీనిలో నొప్పిని, పుండును, వేడి నణచును. మూత్రపుమంటను పోగొట్టును; మూత్రబద్ధమును విడగొట్టును; శుక్లనష్టమును కట్టును; మూత్రము వెంటపోవు ఇంద్రియమును కట్టును; ఋతురక్తము జారీచేయును; ప్రసవస్త్రీల మైలరక్తమును వెడలించును. రక్తపొడలు లేక పల్లికలు వీనిని పోగొట్టును. దీనియాకు కూర తినిన కడుపులో బల్ల నివారణమగును. సమూలరసమును సారాయిలో కలిపి పుచ్చుకొనిన మూలికల విషము ( Vegetable poison ) ను హరించును. దీని సమూల రసము మూత్రద్వారముల పుట్టెడుమ్రణమును, వాపును హరించును. రసపుమోతాదు పూటకు 2 మొదలు 4 తులముల యెత్తు చొప్పున, కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. సమూల రసములో తేనెగలిపి పుక్కిలించిన నోటిపూత, దుర్గంధము నివృత్తించును. ఏనుగుపల్లేరు సమూలరసము 2-3 తులములయెత్తులో తగు మాత్రము సారాయి కలిపి పుచ్చుకొనిన సర్పవిషము విరుగును. దీని

ఆకురసము రెండువంతులు, నువ్వులనూనె ఒకవంతుకలిపి తైలపక్వముగ గాచి యా తైలమును మర్దనచేసి లోపలికి పుచ్చుకొనిన కీళ్ళనొప్పులు, నడుము నొప్పులు, గురదాల (kidneys) నొప్పులు మానును; ధాతుపుష్టి జేయును; ముఖకాంతి దెచ్చును; చుక్క చుక్కలుగ పడెడు మూత్రమును కట్టును. లోపలికి పుచ్చుకొను మోతాదు 1-2 తులములయెత్తు సారాయితోగాని, తేనెతోగాని పుచ్చుకొనవలెను.దీనియాకుపొగ బుచ్చుకొనిన ధాతుపుష్టి జేయును. ముండ్లుతీసిన పెద్దపల్లేరుకాయలను 3మాస్లఆవుపాలతోవండి, 3మార్లు ఎండబెట్టిచూర్ణించిదీనికిసమముగపంచదారగలిపి పుచ్చుకొనిన దేహపుష్టి,బలము వీర్యపుష్టి జేయును. ఇంద్రియనష్టముకట్టును. పంచదార కలిపినచూర్ణపుమోతాదు పూటకు బేడయెత్తు మొదలుపావలాయెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యవలెను. ఏనుగు పల్లేరు చెట్టును తగుమాత్రము మంచినీళ్ళలో 3-4 మార్లు త్రిప్పి జాడించి యానీళ్ళు వడపోసి వానితో అత్తెసరన్నము క్రొత్తకుండలో వండి స్త్రీలు ఋతుస్నానము మొదలు 3 దినములు వరుసగ ఉదయపు పూటలను పులుసులేకుండ పుచ్చుకొనిన గర్భవతులగుదురు. ఆనీళ్ళు గాని, కాయల కషాయముగాని పుచ్చుకొనిన మూత్రకృఛ్రము, సెగరోగము నివ్మళించును నీళ్ళమోతాదు పూటకు 5 మొదలు 10 తులముల యెత్తు కషాయపు మోతాదు పూటకు 2న్నర మొదలు 5 తులముల యెత్తు. దినమునకు రెండుపూటల నియ్యవలెను. దీని ఆకుకూర రుచిగనుండును. వాతము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, కఫము, దాహము, మేఢ్రశూల, ప్రమేహము వీని నణచును.

పెద్దపాపర:—వెర్రిపుచ్చ చూడుడు.

పెద్దపావిలికూర:—Portulaca Oleracea-big variety. సం॥ బృహల్లోని. హిం॥ బడాలోని. దీనిని బొడ్డుపావిల, గంగపావిల యందురు.

దీని రసము చలవ జేయును. తాపజ్వరము నణచును. దీనియాకునూరి కణతలకు పట్టించిన అలసట, నిద్రలేమి, వీనివలన గలిగిన తలలోని వేడిని, నొప్పిని పోగొట్టును. ఓడవాండ్రకు వచ్చునీరసము, నొప్పులు మొదలగు చిహ్నములుగల (scurvy) అను రోగము గలవారికిని, కార్జముయొక్క రోగములుగలవారికిని యిచ్చిన ఆయాసమును తీర్చును. శరీరతత్వమును మార్చును. దీని విత్తులు క్రిమిరోగమును, ఒగర్పును, ప్రేగులు మొదలగువానిని కప్పియుండు పొరయొక్క రోగములను (mucus disorders) పోగొట్టును. దీనిరసము పొట్టలోని పుండు (inflamation of the stomach) ను, నోటివెంటరక్తము పడుటను మాన్పును. రసముయొక్క మోతాదు 3-4 తులముల యెత్తు. గింజలచూర్ణపుమోతాదు 2-3 అణాలయెత్తువరకు.

పెద్దపిల్లిపీచర, పిల్లిపీచర:—Asparagus racemosus. A. Gonoclades. సం॥ శతావరి, శతమూలి. హిం॥ శతావరి. దీనికి పిల్లి తేగలని, చల్ల పిల్లిగడ్డలని పేర్లుగలవు. తీపి, చేదుగ నుండును. దీనిరసము గాని, కషాయముగాని చలువ, మేహశాంతి జేయును. రక్తపైత్యమును, కఫమును, అతిసారమును జయించును. సెగరోగమును, ప్రమేహమును శమింపజేయును. వీర్యవృద్ధి, దేహపుష్టి, బలము జేయును. ఇంద్రియనష్టము కట్టును. పుంస్త్వము నిచ్చును. మేహవాతమును గొట్టును. భ్రమ, మూర్చ, క్షయ, దేహకార్శ్యము వీనిని జయించును. ఆయురారోగ్యవృద్ధి జేయును. స్త్రీలకు పాలు వృద్ధి జేయును. గర్భాశయమునకు సత్తువ జేయును. కుసుమరోగమునుపోగొట్టును. గర్భమును నిలుపును. తత్వమును సౌమ్యపరచును. శరీరములోని మార్గములను సరిగా జేయును. నడుమునకు సత్తువనిచ్చును. పొట్ట(stomach), కార్జము (liver), గురదాల (kidneys) వీనికి వేడిబుట్టించును. దీనికి తేనెతో చేసిన దీని మురబ్బా పైన చెప్పిన

సుగుణములు గలిగియుండును. దీనిని నూనెలో వేసి కాచి పూసిన చర్మరోగములు హరించును. నేతిలో వేసి కాచి బిడ్డలకు పెట్టిన చలవ దేహపుష్టి, బలము జేయును. రసపు మోతాదు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు 2న్నర మొదలు 5 తులముల యెత్తు వరకు.

పెద్దబచ్చలి:—బచ్చలి చూడుడు.

పెద్దమాను చెట్టు:—పెను వేప చెట్టు చూడుడు.

పెద్దమా వేరు,పిన్న మా వేరు:—Celestrus Paniculata, Cardiospermum Halicacabum, Eng. Staff tree. సం* జ్యోతిష్మతి, పారావతాంఘ్రి, స్వర్ణలత. హిం* మాల్కంగనీ. దీనిని పెద్ద వెక్కడని, చిన్న వెక్కడని, మా వేరని, మాలకంకిణి యని యందురు. దీని వేరు లేక యాకురసము లేక కషాయము, దీని విత్తుల తైలము కారముగ, చేదుగ నుండును. కాక చేయును. కఫ రోగము, క్రిమిరోగము, విసర్పి, స్ఫోటకము, ఉబ్బురోగము, పాండువు, జలోదరము, భగందరము, నేత్రరోగము, శిరోరోగము,పీనస వాతరోగము వీనిని హరించును. విరేచనము జేయును. తరుచుగా దీనివిత్తులున్నూ మరికొన్ని వస్తువులను చేర్చితీసిన తైలమును మాల్కంకిణి అరకందురు. దీనిని ఉబ్బు మొదలగు రోగములకు తగిన పథ్యముతో నిచ్చిన నివారణమగును. మోతాదు 2 మొదలు 8 చుక్కలవరకు. రసముయొక్క మోతాదు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు 2న్నర మొదలు 5 తు॥ల యెత్తువరకు. దీని కాయలను కెక్కడుకాయలందురు. (heat pea) యీకాయల రసము లేక కషాయము కాక, పైత్యము జేయును. బలము, బుద్ధి ప్రకాశము నిచ్చును, కఫవాతములను హరించును.

పెద్దముత్తవపులగము:—ముత్తువపులగము చూడుడు

పెద్దయేలకులు:—ఏలకులు చూడుము.

పెద్దవరగోగు:— వరగోగు చూడుడు.

పెద్దవరివంటకము:—Boiled rice of coarse sort of paddy. రుచిగనుండును. తీవ్రమైన జఠరాగ్ని గలవారి కనుకూలముగ నుండును. బలము నిచ్చును. వీర్యవృద్ధి జేయును.

పెద్దవావింట చెట్టు:—వాయింట చెట్టు చూడుడు.

పెద్ద వెక్కుడు:—పెద్దమా వేరు చూడుడు.

పెద్ద సర్పాక్షి:—సర్పాక్షి చూడుడు.

పెమవేప చెట్టు:—Ailanthus Excelsa. సం॥ మహానింబ. హిం॥ బకాయన్. దీనిని పెద్దమాను అని పియ్యాపయని, గండుగయనియందురు. దీని చెక్కరసము లేక కషాయము లేక చూర్ణము వగరుగ, చేదుగ నుండును. శీతజ్వరము, పైత్యము, గ్రహణి, రక్తగ్రహణి, రక్తాతిసారము, కుష్ఠురోగము, కఫము, దురద, విశూచి వీనిని హరించును. దీని పచ్చిచెక్క రసములో సమముగ పెరుగుగలిపి 5–6 పూటల నిచ్చిన గ్రహణిని కట్టును. దీని మానుచెక్క కషాయ మిచ్చిన పురాణ రక్తగ్రహణి కట్టును. దీని చూర్ణమిచ్చినను కట్టును. కషాయపు మోతాదు పూటకు 2న్నర మొదలు 5 తులముల యెత్తు చొప్పున, రసపు మోతాదు 2–3 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. పచ్చిచెక్క నూరిన ముద్ద గచ్చకాయంత పెరుగుతో రేపుమాపు 2 – 3 దినములు పెరుగుతో పుచ్చుకొనిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. చెక్క చూర్ణమునకు సమముగ పంచదారగలిపి పుచ్చుకొనవచ్చును.

పెన్నేరు చెట్టు:—Physalis Flexuosa. Withania. Somnifera. P. Somnifera. సం॥ అశ్వగంధా, వాజికరీ, వారాహకర్ణీ, హిం॥ అస్‌గంద్. ఇదివేటాశేచెడు చిన చెట్టు. గుఱ్ఱపువాసనగలిగియుండును.

దీని దుంపరసము లేక కషాయము లేక చూర్ణము,వగరుగకొంచెము చేదుగ నుండును. ఉష్ణవీర్యముగలది. క్షయరోగము, కఫము, వాతము, వ్రణము, మేహము, కార్శ్యరోగము, రక్తపైత్యము వీనిని పోగొట్టును. బలమును, దేహపుష్టి, కాంతిని, పుంస్త్వమును ఇచ్చును. వీర్యవృద్ధిజేయును. జఠరాగ్నిని వృద్ధిజేయును. వయస్సును నిలుపును. దగ్గు, ఉబ్బసము, కుష్టు, సన్నిపాతము, పురాణ రోగములు, సూతికరోగము వీనిని హరించును. పిండోత్పత్తి జేయు అవయవములకు నడుముకు సత్తువ జేయును. దేహములోని మలముల వెడలించును. మూత్రమును జారీచేయును. దీని పచ్చిదుంపను నూరి కట్టినను, ఎండుది నీళ్ళతో నూరికట్టినను మొండివ్రణములుమానును. దీని దుంప శొంఠితో నూరికట్టినను దీని దుంపయొక్క, శొంఠి యొక్క గంధములుతీసి కలిపి పట్టువేసినను, వాత మేహవాతపు నొప్పులు నివృత్తించును. దీని దుంపను నేతిలోవేసి కాచి ఆ నేతిని పూటకు 1–2 తులముల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటల పుచ్చుకొనినను, ఆ నేతిని భోజనకాలమున ప్రథమ కబళముతో పుచ్చుకొనినను మేహవాతపు నొప్పులు, కీళ్ళనొప్పులు,నడుమునొప్పి నిర్మూలించును, నరములకు సత్తువజేయును. దీని దుంపరసముయొక్క మోతాదు పూటకు 2–3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తు చొప్పున, చూర్ణపు మోతాదు 2 అణాలయెత్తు మొదలు 4 అణాల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని యాకులకు ఆముదము పూసి వెచ్చజేసి వేసిన రాచపుండ్లు, గడ్డలు హరించును. దీని యాకుల తేలిక కషాయ మిచ్చిన జ్వరము హరించును, మోతాదు పూటకు 4 మొదలు 6 తులముల యెత్తువరకు. దీని పండ్లు మూత్ర

మును వెడలించును; దీనివిత్తులు చూర్ణము వెన్నతీయుటకు తగినట్లుగ పాలను తోడుకొనజేయును. మూత్రము జారీచేయును. దీని గంధము లింగమునకు రాయుచుండిన లింగదోషమును పోగొట్టి పటుత్వము, బలుపుగలిగించును. పెన్నేరు కషాయములో సమముగ పాలు గలిపి తగినట్టు పంచదార కలిపి పుచ్చుకొనుచుండిన స్త్రీల గర్భకోశమును బాగుపరచి సంతానయోగ్యత గలుగజేయును. పురుషులకు పుంస్త్వము హెచ్చించును.

పెరుగుఅన్నము:—Boiled rice mixed with curd. మేహము పైత్యము నణచును; బలము; దేహపుష్టి నిచ్చును; క్రొవ్వుబెంచును; గురుత్వముగ నుండును; దేహమునకు బూడిద బూసినట్లుండెడు రోగమును, శాకను అణచును; వాతము, విరేచనబద్ధముజేయును; అమితముగదినిన రోగము బుట్టించును. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

పెరుగుపుచ్చుకొనగూడనికాలములు:— Seasons or times at which curd should not be taken. భోజనమునకు ఆదియందును రాత్రియందును, వసంత, గ్రీష్మ, శరత్కాలములయందును, అగ్నిమాంద్యముగ నున్నప్పుడును, పరగడుపునను పెరుగుపుచ్చుకొనగూడదు. మిక్కిలి చలిప్రదేశముల యందును, చలిజ్వరబాధ గలిగెడు మన్యపు ప్రదేశములయందు నివసించెడువారును, ఎప్పుడును పెరుగు తినకూడదు. ఉష్ణప్రదేశములలో నివసించెడు వారును, జఠరదీప్తిగలిగిన మేహశాంక, పైత్యాతిత్వములు గలవారును, చిన్నతనమునుండి రాత్రి పెరుగు బుచ్చుకొను అభ్యాసము గలవారును, నల్లమందు తిను అభ్యాసముగలవారును రాత్రి అన్నముతో పెరుగు బుచ్చుకొనవచ్చును. ఎవ్వరైనను రాత్రి అన్నములో పెరుగు బుచ్చుకొనునప్పుడు కొద్దిగ నీళ్ళు గలిపిగాని, సైంధవలవణ

మును, శొంఠి చూర్ణమును తగుమాత్రము పెరుగు అన్నములో కలిపి పుచ్చుకొనిన దోషరహితముగాను, సౌఖ్యముగాను ఉండును.

పెరుగు పుచ్చుకొనవలసిన కాలములు:—**Seasons in which curd should be taken.** హేమంత, శిశిర ఋతువులయందు పెరుగు మిక్కిలి పథ్యముగ నుండును; దేహదార్ఢ్యమును, కాంతినినిచ్చును.

పెరుగుకు సరిపడని వస్తువులు:—**Articles incomparable with curd.** పెసరపప్పు, మినపప్పు, గంజి, పాలు, తేనె, ఉసిరికాయ వీనితోను, పందిమాంసము, కోడిమాంసము ఇవి పుచ్చుకొనినప్పుడును బుచ్చుకొనగూడదు. ఈ నిషేధములను లక్ష్యముంచక పెరుగు బుచ్చుకొనిన జ్వరము, రక్తపైత్యము, సర్పి, కుష్టు, పాండువు మొదలగు రోగములను బుట్టించును. మరియు పెరుగు మజ్జిగగాని, మజ్జిగ పాలుగాని, పెరుగు పాలుగాని కలిపి పుచ్చుకొనిన విష తుల్యముగ నుండును.

పెరుగు తియ్యనిది:—**Sweet curd.** జిడ్డుగ, కమ్మగ, తియ్యగ, రుచిగ నుండును. కఫమును క్రొవ్వును వృద్ధిబొందించును; పైత్య శాంతిజేయును; శాకనణచును; విరేచనబద్ధము జేయును. దీనికి విరుగుళ్ళు 1 శొంఠిచూర్ణము, 2 సైంధవలవణము, 3 ఉప్పు.

పెరుగు తోటకూర:—**Amaranthus Tristis.** సం॥ మారిష, శాక వీర, ప్రణీక. హిం॥ మరసా, నవడా. దీనికూర రుచిగ నుండును; చలవజేసి ఆర్చును; మేహశాంతి చేయును. దీనిసమూల కషాయము మూలవ్యాధి నణచును; నులిపురుగుల గొట్టును; వాత మును హరించును; గొంతుకనుండి పడెడు రక్తమును, పురాణ విరేచనములను కట్టును; స్త్రీల ఋతురక్తమును విస్తారము పోకుండ జేయును; ఎముకలలోని వేడిని హరించును; అప్పుడప్పుడు వచ్చెడు జ్వరమును కట్టును; విషమును విరుచును. దీని యాకులను నూరి

కట్టిన గాయములు, వ్రణములు మానును. శీతపైత్యము జేయును; కడుపు బిగబట్టును; నల్లదబ్బ; (Spleen) కు నష్టము జేయును; మాందము జేయును; గురుత్వముగ నుండును; మలబద్ధము నణచును. దీనికి విరుగుళ్ళు 1 అంజీరు, 2 నువ్వుచెట్టు కాల్చి చేసిన క్షారము. దీని సమూలకషాయపు మోతాదు పూటకు 2తు॥ మొదలు 5 తులములయెత్తు వరకు.

పెరుగు పుచ్చుకొనకూడనివారు:— Those who should not take curd. ఉబ్బు, వాపు, దగ్గు, వగర్పు, క్షయరోగము, అగ్నిమాంద్యము, వ్రణము, ఆమజ్వరము, కుష్టు, కఫరోగము. ఈ రోగములు గలవారు పెరుగుపుచ్చుకొనకూడదు.

పెరుగు పుచ్చుకొనకూడినవారు:—Those who may take curd. పీనస, అతిసారము, గ్రహణి, అరుచి, మూత్రకృచ్ఛ్రము, కార్శ్య రోగములు గలవారికి పెరుగు అనుకూలముగ నుండును.

పెరుగు పులిసినది:—Sour curd. శ్లేష్మపైత్యములను, అజీర్ణమును బుట్టించును; రక్తమును పాడుజేయును; అసౌఖ్యముగ నుండును. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు.

పెరుగుమీగడతోనున్నది:—Curd with cream. మిక్కిలిరుచిగా, జిడ్డుగలిగి మనోహరముగా నుండును; బలమిచ్చును; గురుత్వము జేయును; మేదస్సు (కొవ్వు) ను, వీర్యమును వృద్ధిచేయును; మిక్కిలి జఠరదీప్తి గలవారి కనుకూలముగ నుండును.

పెరుగు మీగడ తీసినది:—Curd without cream. రుచిగ నుండును; మలబద్ధమును, తేలికగనుండును; కాంతినిచ్చును; పుచ్చుకొనదగి యుండును.

పెరుగు మీది నీళ్ళు:—Water in or over the curd. కొంచెము పుల్లగా, రుచిగా నుండును; దాహము, శ్రమ పీని నణచును;

తేలికగ నుండును; శ్రోత్రేంద్రియమునకు బలమిచ్చును; కఫవాతములను గొట్టును; వీర్యపుష్టి జేయును; జఠరదీప్తి నిచ్చును; శ్లేష్మమును హరించును. రాత్రియందు పుచ్చుకొనగూడదు.

పెరుగుమీాది మీాగడ:—Cream of curd వాతమును హరించును; వీర్యపుష్టి, బలము జేయును; కంఠము, చెవులు వీనికి మేలుజేయును; మేహవ్రణములను మాన్పును; మంటలను శాంతింపజేయును; గురుత్వముగ నుండును; కఫమును బెంచును; రోగమును బలపరచును; అగ్నిమాంద్యము, గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 అల్లపు మురబ్బా.

పెరుగు సామాన్య గుణము:—Curd its effect generally- స్వాదుగా, రుచిగ నుండును. చలువజేయును; పైత్యముజేయును. జఠరదీప్తి, వీర్యవృద్ధి, బలము జేయును. మేదస్సును బెంచును. గురుత్వముగ నుండును. రక్తపైత్యము, నేత్రరోగము శాంతింపజేయును. కాంతినిచ్చును. విరేచనబద్ధము చేయును. పొట్టలో బుట్టెడు తాపమును హరించును. ఊపిరిగొట్టునొప్పిని బోగొట్టును, శీతజ్వరమును, మరికొన్ని దుర్గుణములను బుట్టించును. పాలుగాకుండ, పెరుగుగాకుండ అనగా తోడుకొన్నది త్రిదోషములను కలుగజేయును. గనుక పుచ్చుకొనకూడదు. దీనికి విరుగుళ్ళు, 1 వేడినీళ్ళు, 2 జీలకఱ్ఱ, 3 వర్ణావాలు, 4 ఉప్పు, 5 సైంధవలవణము, 6 శొంఠిపొడి, 7 బెల్లము, 8 శంఖభస్మము, వడకట్టిన పెరుగులో సున్నము కలిపి పట్టువేసిన మేహావాతపు నొప్పులు నిమ్మళించును.

పెసరకట్టు:—Boilings of green gram dhall- రుచిగా నుండును, జీర్ణముజేయును. జఠరదీప్తినిచ్చును. కఫపైత్యములను హరించును, శ్లేష్మము, విదాహము, తాపము, వ్రణములు, కర్ణగళ నేత్రరోగములు, జ్వరము, శ్వాస, కాస, ప్రమేహము శ్రమ, మదము,

విషము, పైత్యము, కుష్ఠు, స్ఫోటకము, మేహము, క్షయ, నీరసము, యోనిరోగము, పాండురోగము, మూలవ్యాధి వీనిని శమింపజేయును.

పెసరగంజి:—Cunjee prepared with rice & green gram. అనగా పెసలు, బియ్యము కలిపి కాచినగంజి. విదాహము, జ్వరము వీనినణచును. పైత్యజ్వరములకు మిక్కిలి మంచిది, కొద్దిగ వాతము జేయును. పైత్యమును గొట్టును. మిక్కిలి శేలికగనుండును.

పెసరపప్పుపులగము:—పులగము చూడుడు.

పెసరబూరెలు:—A sort of cakes made with green gram dhall. అనగా పెసరపప్పు, బెల్లము కలిపి పూర్ణముగబెట్టి చేసినవి. రుచిగ మృదువుగ నుండును. పైత్యమును గొట్టును. బల మిచ్చును. శ్లేష్మము, గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 అల్లము, 3 ఉత్తరేణి క్షారము, 4 కలినీళ్ళు.

పెసల సామాన్యగుణము:—Phaseolus mungo. Eng. Green gram. సం॥ ముద, హరిమంద. హిం॥ మూంగ్. యివి పచ్చ పెసలు, నల్లపెసలని రెండుజాతులు. పచ్చపెసలు శ్రేష్టము. కండ్లకు మంచిది. మేహశాంతిని, పైత్యశాంతిని, కొద్దిగవాతమును జేయును. శేలికగనుండును. రక్తపైత్యము, కఫము వీనిని బోగొట్టును. విరేచనబద్ధము జేయును. చలువ తత్వముగలవారికి గురదాల (Kidneys) లో వాయువును, తలనొప్పిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పంచదార, 2 తేనె, 3 ఉష్ణౌషధములు, 4 కలినీళ్లు, 5 అల్లము.

పేణీలు అను భక్ష్యము:—A kind of cakes made of wheat flour. సర్వేంద్రియములకు బలము జేయును. పైత్యవాతమును హరించును.

వీర్యపుష్టి, బలము వీని ని చ్చును. గురుత్వముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 లవంగాలు, వేపగింజలరసము.

**వేపకొనలు:**—Tender leaves of rattan plant. వేపచెట్టు చిగుళ్లు రుచిగా నుండును. కఫపైత్యములను హరించును. వాతము జేయును.

**వేపపండు:**—Cane or rattan fruit. సం॥ వేత్ర. హిం॥ బేత్ కా ఫల్. పుల్లగనుండును. అగ్నిదీప్తి నిచ్చును. పైత్యము, దాహము నణచును.

**వేప విసనకర్ర:**—Fan made of rattan leaves. కఫవాతములను గొట్టును. చెమట నణచును. చలువజేయును.

**పేయమనుగంజి:**—A sort of drinkable cunjee. ఒక భాగము బియ్యమున 14 భాగములు నీరుబోసి మెతుకు లుండునటుల కాచి నది పేయము. ఇది మిగుల శ్రేష్ఠమయినది. వాతపిత్తశ్లేష్మములను, అనులోమ వాతమును, ఆకలి, దాహము, ఆయాసము, నీరసము, కుక్షిరోగము, జ్వరము వీనిని హరించును. అగ్నిదీప్తి నిచ్చును. జీర్ణముజేయును. విరేచనము గావించును. మిక్కిలి పథ్యముగ నుండును.

**పేరింట చెట్టు:**— Corchorus olitorius. C. Tricocutaris. సం॥ నాడికా. హిం॥ కోష్టా. ఇది ఏటేట మొలచును. దీని యాకుకూర వండుదురు. జిగటగనుండును. మేహశాంతి, పైత్యశాంతి జేయును. దీని ఆకు ఎండబెట్టి గుండచేసి నేతిలో వేయించి పుచ్చుకొనిన అజీర్ణమును బోగొట్టును. దీని విత్తనముల రసము లోపలి కిచ్చిన సర్పవిషమును గొట్టును. విత్తనములచూర్ణము పంచదారతో బుచ్చుకొనిన శిరోరోగములను, కుష్టురోగములను బోగొట్టును. బుద్ధికి

బలమిచ్చును. విత్తులయొక్క కాదు పావలాయెత్తు. చూర్ణపు మోతాదు జేడయెత్తు.

పేలాలగంజి:—Cunjee of fried rice. తేలికగ నుండును. చలువ జేయును. గ్రహణిరోగము, విదాహము, తాపము, మూర్ఛ జ్వరాతిసారము, అతిసారము, మశూచికజ్వరము, మేహము, కఫము వీని నణచును. ధాతువులకు సౌమ్యత నిచ్చును. రోగుల కనుకూలముగా నుండును.

పేలాలు, పేలాలపిండి:—Fried corn or paddy & its flour. సం॥ లాజ. హిం॥ ఖైలై. వడ్లువేయించి చేసినవి పేలాలు. వీని పిండి వగరుగ, రుచిగ నుండును. వెంటనే ఆప్యాయమును, బలమును ఇచ్చును. రక్తపైత్యము, ప్రమేహము, ఆకలి, తాపము, విదాహము, శ్రమ, చర్ది, ఎక్కిళ్ళు, అతిసారము, పైత్యము, వమనము వీని నణచును. జఠరదీప్తినిచ్చును. చలువ జేయును. నేత్రరోగముల శమింపజేయును. మేదస్సును, శ్లేష్మమును తగ్గించును. తేలికవై యుండును. అన్నిజ్వరముల యార్తిని, కడుపుబ్బును, కాస, శ్వాసలను దెబ్బను హరించును. వ్రణముల మాన్పును.

పేలాలు వర్జింపవలసిన వారు:—Those who should not eat fried corn. అజీర్ణముగను, అగ్నిమాంద్యముగ నున్నప్పుడు, భోజనముచేయకముందు, రాత్రివేళల, జబ్బుచేసినప్పుడు వట్టివి విస్తారముగ తిన్పుకొనకూడదు.

పొగ:—Smoke. ధూమము చూడుడు.

పొగచుట్ట:—Cigar. పుగాకు చూడుడు.

పొగడచెట్టు:—Mimusops elengi. సం॥ వకుళ, శింధుగంధా, మధుపుష్పా, హిం॥ మవుల్‌సిరి, బకుల్. దీని చెక్కరసము లేక కషాయము తీపిగ, వగరుగ నుండును. చలువ జేయును. సంగ్రహణి రోగమును, విషమును హరించును. దీని మానుచెక్క కషాయము

గాని, పచ్చికాయ కషాయముగాని పుచ్చుకొనిన మూత్రపుసంచి (bladder) లోను, మూత్రమార్గములోను(Urethra) అను పుండును మాన్పును. ఆప్రదేశములనుండి రసికారుటను కట్టును. జ్వరమును హరించును. పైకషాయమును పుక్కిలించిన చిగుళ్ళ రోగము, దంతరోగము హరించును. కదలెడు పండ్లు ఘట్టిపడును. దీనిచెక్క చూర్ణము పుచ్చుకొనిన సంతానయోగ్యతను నిచ్చును. రసము యొక్క మోతాదు 2-8 తులములయెత్తు. కషాయపుమోతాదు 2న్నర మొ॥ 5 తు॥ల ఎత్తు. చూర్ణపు మో॥ 2 మొ॥4అణాలఎత్తు.

పొగడచెట్టునీడ:—Shade of do- చల్లగ మనోహరముగనుండును. శిరోరోగములను, నేత్రరోగములను హరించును; కాంతినిచ్చును.

పొగడపండు:—Fruit of do_ తీపిగ, వగరుగా, రుచిగా నుండును. గ్రహణిరోగమును పోగొట్టును. చలవచేయును. ప్రమేహమును హరించును. పొట్టకు బలముచేయును. దంతదార్ఢ్యము నిచ్చును. పైత్యమును హరించును. ప్రేగులలో వాతము బంధించును. దీనికి విరుగుడు ఉష్ణపుమధములు పండిన పండులోని గుంజులో పంచదార కలిపి యిచ్చిన పురాణరక్తగ్రహణి కట్టును.

పొగడ పువ్వులు:—Flowers of do- సువాసనగ మనోహరముగా నుండును. వీనిధారణవలన దారుణమగు తలనొప్పిని, శిరోవాతములు నేత్రరోగములను హరించును. కాంతి నిచ్చును. మనోహరముగ నుండును. పువ్వుల చూర్ణమును నస్యముగాచేసి పీల్చిన తీవ్రజ్వరము తలనొప్పి, భుజములు మొదలగు దేహముయొక్క అన్ని భాగముల యందు నొప్పిపుట్టు హావాయనే బంగాళా దేశములో వచ్చెడువ్యాధి, ముక్కువెంట కారెడు పడిసెపు నీరు, తలనొప్పి వీనిని కట్టును, ఈపువ్వులతో తీసెడు సారాయివంటి యరకు మనోహరముగ నుండును; కాక, బలము చేయును; దీపనము పుట్టించును.

పొట్టేలుమాంసము:—Flesh of ram. రుచిగ నుండును. త్రిదోష హరమైనది; బలము, వీర్యపుష్టి, దేహపుష్టి వీని నిచ్చును; పీనస, జ్వరము, వాతము వీని నణచును; గురుత్వము జేయును; కఫమును పెంచును; దీనికి విరుగుళ్ళు మాంసము చూడుడు.

పొట్టికాకరకాయ:—Green fruit of Momordica muricata. చేదుగనుండును, త్రిదోషములను హరించును; జ్వరము, దద్దురు, కుష్ఠు, విషము, కఫము, వాతము, క్రిమిరోగము వీనిని హరించును. రుచి బుట్టించును; కండ్లకు మేలుజేయును; తేలికగ నుండును; జఠరదీప్తిని కాంతిని యిచ్చును; కొద్దిగ పైత్యము, కాక జేయును; దీనికి విరుగుళ్ళు కాకరకాయ చూడుడు.

పొట్టికాకరచెట్టు:—Momordica muricata. దీని సమూలరసము, దాల్చినిచెక్క, పిప్పళ్ళు, బియ్యము, నీరుడివిత్తుల నూనె వీనితో చేసిన నూనె లోపలికిచ్చిన గజ్జికురుపులు, చిడుము మొదలగు చర్మ రోగములను మాన్పును. సమూలచూర్ణము పైన జల్లిన కుష్టువ్రణములు, మురికివ్రణములు మానును.

పొట్టిపిట్ట:—A sort of fly catcher bird. దీని మాంసము వాతమును గొట్టును; అగ్నిదీప్తి నిచ్చును, రుచి బుట్టించును; విషమును, విసర్పి మొదలగు రోగములను పోగొట్టును. పథ్యమైనది.

పొట్ల ఆకు కూర:— Curry of the leaves of Snake gourd. కఫపైత్యము, జ్వరము, కాస, క్రిమి వీనిని హరించును. కాంతి నిచ్చును; చలువజేసి వేడిజేయును; వాతమును శమింపజేయును.

పొట్లకాయకూర:—Curry of Snake gourd. రుచిగ నుండును; సమశీతోష్ణము జేయును; కఫపైత్యమును, జ్వరమును, క్రిమిరోగమును, ఆమవాతమును గొట్టును; అగ్నిదీప్తినిచ్చును. విరేచనము గావించును. త్రిదోషములను హరించును. పైత్యవాతములనణచును.

వీర్యపుష్టి జేయును; శేలికమై అన్నిరోగములకు పథ్యమైయుండును, హృదయమునందలి పురుగులను నశింపజేయును. శరీరములో కాకను శాపమును బోగొట్టును.

పొట్లచెట్టు:— Momordica charantia. Trichosanthes angina. Eng. The snake gourd plant. సం॥ పటోలా, శ్వేత రాజి, సుదీర్ఘ. హిం॥ చిచేండా. అనగా పొడవుగా కాయలుకాచు పొట్ల. దీనివేరు విరేచనము జేయును. విషమును హరించును. దీనిని తియ్యపొట్ల అందురు. దీని కాడలకూర కఫమును హరించును. ఆకు, కాయల గుణములు చూడుడు.

పొడపత్రిఆకు:— Leaves of a sort of Asclepias vomitoria సం॥ పొడపత్ర. దీనిని పుట్టపొదర అని యందురు. ' దీని ఆకుల నిజ రసముగాని కొంచము నీళ్ళుపోసి తీసినరసము పొంగించినదిగాని దీని ఆకు కషాయముగాని వెగటుగ, చేదుగ నుండును. పిల్లలకుగాని, పెద్దలకుగాని యిచ్చిన విరేచనము జేయును.నులిపురుగులనుచంపును; కాక జేయును; వాతము, జ్వరము, దగ్గు, పడిశము, పిల్లలకు వచ్చెడి యితరజబ్బులు హరించును. నేత్రములకు మేలుజేయును. తేలువిషమును హరించును. నిజరసపు మోతాదు 1 మొదలు 2 తులముల వరకు. నీళ్ళుపోసి నూరి తీసిన రసపుమోతాదు 2-3 తులములవరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల మెత్తువరకు.యీ ఆకు పరీక్ష. దీనిఆకులరసము ఒక చిన్న బెల్లపుముక్కమీద కొంచెము వేసి 5 నిమిషములు అయిన తరువాత బెల్లపుముక్క తినిన తీపి ఏమియు లేక చప్పగా నుండును. దీని ఆకుల కషాయము మధుమేహము (Sugar complaint) ను హరించును. దీనిని యూనానీ వైద్యులు గూడ్ మారీబూటీ అని అందురు.

పొ_త్తిచీర:—Cloth made of fibres. మిక్కిలి పవిత్రమైనది. హిమంత శిశిర ఋతువులయం దనుకూలముగ నుండును. వాతప్రకోపము వణచును. వీర్యమునకు వేడిజేయును.

పొ_త్తిదుంప:—Gloriosa Superba (country poison root) సం॥ లాంగలీ, అగ్నిశిఖా, కలికారి. హిం॥ కలిహారి. దీనిని అడవి దాభియని, చన్నచర్లగడ్డయని. నాగేటిగెడ్డయని, కనుగుట్టు గెడ్డయని యు నందురు; దీని చూర్ణము దేహమున శీఘ్రముగ వ్యాపించును; వెగటుగ, చేదుగ నుండును; కాక చేయును; కుష్టు, వాపు, మూల వ్యాధి, కడుపుబ్బు, వాతము, వ్రణము, శూల, కఫము, ఉబ్బు, అగ్నిమాంద్యము వీనిని పోగొట్టును. నులిపురుగులను జంపును. పైత్యము జేయును. గర్భస్రావమును గలిగించును. దీనిని నీళ్ళతో గంధముతీసి క్రొత్తగా లేచెడు గడ్డలకు పట్టించిన అవి హరించును. తేలు, పురికొస (Centipede), జెర్రి ఇవి కుట్టిన లేక కరచినచోట దీని గంధముపూసి నిప్పుతో కాచిన నొప్పి, మంట యణగును. దీనిని వంటికిబూసిన చీరపేలు మొదలైనవి చచ్చును. దీని దుంప గంధమును ప్రసవవేదన పడుచుండెడు స్త్రీల పాదములకు, చేతులకు బూసిన శీఘ్రముగ ప్రసవమగుదురు. దిని దుంపను నూరి నీళ్ళలో కలిపి పిసికి తేరనిచ్చి నీళ్ళు పారబోసి అడుగుమడ్డిని తిరిగి నూరి నీళ్ళలో కలిపి పిసికి తేరనిచ్చి యానీటిని విసర్జించి యీవిధముగ చేయుచుండిన తెల్లనిసత్తు బయలుదేరును; ఇది చేదుగ నుండును. దీనిని తేనెతో నిచ్చిన సెగరోగము మానును. దీనిదుంపచూర్ణమును పూటకు ¼ అణాయెత్తు మొదలు 1½ యెత్తువరకు మాత్రమే యిచ్చిన శరీరతత్వమును మార్చును. బలము జేయును. ఆహిక (వసుస) జ్వరమును పోగొట్టును. పై మోతాదుకంటె అధికముగ నిచ్చిన విషమై చంపును. దీనికి విరుగుడు శొంఠి కషాయము.

పొన్నగంటికూర:—Achyranthes Triandra. సం* మత్స్యాక్షీ, లోహమారక, శీతహార. హిం* మచేచీ. కొంచెము తీపి, వగరు, చిరిచేదు కలిగి స్వాదుగ నుండును. చలువ, మేహశాంతి జేయును. రక్తపైత్య మణచును; త్రిదోషహారమైనది రుచిబుట్టించును; నేత్రేంద్రియములకు బలముజేయుచూ సమస్త నేత్రరోగములను పోగొట్టును. వీర్యవృద్ధి జేయును. దగ్గు, శ్వాస, జ్వరము, విదాహము, మూలవ్యాధి, మూత్రకృచ్ఛ్రము, ప్రమేహములు, వాతము, క్రిమి రోగము వీనిని జయించును. పథ్యమైనది; దీని పసరుకు సమముగ నువ్వులనూనెగాని, కొబ్బరినూనెగాని గలిపి పసరు ఇగరగాచి తలకు మర్దనచేసిన నేత్రరోగములు హరించును. దీని యాకు పసరుపోసిన లేక ఆకునూరి గాయముపైన వేసి కట్టిన గాయము మానును.

పొన్న చెట్టు:—Calophyllum Inophyllum, C. Apetalum. Eng. Alexandrian Laurel pannay tree. సం* పున్నాగ, మధ్పదాలయ. హిం* సుల్తాన్ చంపక్, యుండి. దీని చెక్క లేక యాకురసము లేక కషాయము మూత్రమును జారీచేయును. దీని మానుచెక్క గంధమును పట్టించినను, ఆకులు వెచ్చజేసి కట్టినను గడ్డలు హరించును. దీని విత్తుల తైలముతో మర్దనచేసిన వాత, మేహవాతపునొప్పులు హరించును. గజ్జి, చిడుము మొదలగు చర్మ రోగములను పోగొట్టును, దీని తైలముతో దీపములు వెలిగింతురు. గాని యీతైలమును లోపలి కివ్వగూడదు. రసపు మోతాదు పూటకు 2–3 తులములమెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు; ఈచెట్టు నీడ చల్లగ, మనోహరముగా నుండును. చలువ జేయును; వీర్యవృద్ధిని, కాంతిని యిచ్చును; త్రిదోషహార మైనది. దీని పువ్వులు మనోహరముగ వుండును; పైత్యము,

వాతము నణచును; కాక జేయును; మతిచలనము, నేత్రరోగములు, తలత్రిప్పు మొదలగు ననేక శిరోరోగములను బోగొట్టును.

పోక చెట్టునీడ:—Shade of areca tree. పంచేంద్రియములకు హిత వుగా, మనోహరముగ నుండును; చలువ జేయును.

పోకపొత్తి:— The coat or skin covering of the areca nut bunch. దీనిలో భోజనము పరిశుభ్రముగా, ఇంపుగ నుండును. కాంతిని, అగ్నిదీప్తిని యిచ్చును. పైత్యమును, వాతమును అణ చును. ఎండినపొత్తి కాళ్ళు, చేతులు విరిగినప్పుడు కట్టు గట్టుట కనుకూలముగ నుండును.

పోక మామిడికాయ:— Fruit of a wild Mango tree. సం॥ క్షుద్రామ్రి. ఇది మామిడికాయవలె పుల్లగ రుచిగ నుండును. జఠరదీప్తి నిచ్చును రుచిబుట్టించును. వీర్యమునకు చలువ నిచ్చును. శ్లేష్మమును, ఆమపైత్యమును, వాతమును, కఫమును జేయును. దీనికి విరుగుళ్లు మామిడికాయ చూడుడు.

పోకలు సామాన్య గుణము:—Areca Catechu. Eng. Areca nut or Betel-nut. సం॥ పూగీఫలా, క్రముకఫల. హిం॥ సుపారీ. అనగా పోకచెక్కలు పోకకాయలను కత్తిరించి వుడకబెట్టినవి పోక చెక్కలందురు.వీనిలో చక్రములక్రింద కత్తిరించినవి లవంగచూర్ణమం దురు. వీటినన్నిటిని తాంబూలములో వాడుదురు. వీటిలను, మెత్తని పోకల నుపయోగించుట శ్రేష్ఠము. పోకలను కత్తిరించకుండా వుడక బెట్టినవి వల్రాగపోకలందురు. వీనిచూర్ణము వగరుగ నుండును. పైత్యము, కాకజేయును; వాతమును హరించును. విరేచనము జేయును. కఫపైత్యములను, కాస, శ్వాస, జ్వరము, క్రిమిరోగము, నోటిదుర్గంధము వీని నణచును. ముంతగుండె (Heart) కు, పొట్టకు

బలమిచ్చును. నీళ్ళవిరేచనములను కట్టును. పండ్లకు బలము జేయును. చెడువస్తువులను దేహమునందు వ్యాపింపకుండ యాటంక పరచును. కడుపులోని వాతమును తలకెక్కకుండ జేయును. నరము లకు సత్తువ చేయును. నోటినరముల జబ్బును, జలుబును హరించును. సంతోషము గలుగజేయును. విరేచనముతో చెడునీరును తీసి వేయును. దీని కషాయమెన్నడును పుచ్చుకొనగూడదు. వట్టిపోకలు దినిన రక్తమును జెరచును. పాండురోగము బుట్టును. వీర్యనష్టము జేయును. కడుపులో వాతమును బంధించును. గుండెలకు నష్టము జేయును. పట్టు బట్టును. దీనికి విరుగుళ్ళు 1 కతీరా(బాదము జిగురు) 2 సముద్రపు నురుగు, 3 గ్రాహిచేసిన కానుగవిత్తుల రసము. పోక చెక్కవలన గలిగిన తిక్కకు విరుగుళ్ళు 1 చన్నీళ్ళు, 2 చింతపండు, 3 తడిసినబట్టగాలి, 4 శర్కర, 5 తేనె గలిపిన శర్కర. దీనిచూర్ణము వట్టిదే లోపలికి పుచ్చుకొను మోతాదు 2-3 అణాలయెత్తు. పోకల మసి పండ్లుతోము కొనుట కనుకూలముగ నుండును.వీనిని తాంబూ లములో వేసుకొనుటకు సర్వత్రా నుపయోగింతురు.

పోతుఆగాకర:—గొడ్డుఆగాకర చూడుడు.

పోతువడ్ల:—మాధవితీగె చూడుడు.

పోలుగపిట్ట:—Green Pegeon. పచ్చపావురము చూడుడు.

పోస్తుకాయ:— Capsules of the fruit of Poppy tree. సం* ఖస్‌తిల. హిం* పోస్తుకెఫలీ. ఇది నల్లమందు చెట్టుకాయ పెచ్చులు. చేదుగ నుండును. కొద్దిగ మత్తుజేయును. వీని తేలిక కషాయము లోపలికిచ్చిన విరేచనముల కట్టును. నిద్రదెచ్చును. వీని చూర్ణము వైనులో గలిపియిచ్చినను నిద్రదెచ్చును. దీని తేలిక కషాయము యొక్క మోతాదు 1 తులము మొదలు 3 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 1/2 యెత్తు మొదలు 2 అణాల యెత్తువరకు.

వీనిని నీళ్ళలోవేసి ఆనీళ్ళను చక్కగ మరగనిచ్చి ఆవేడినీళ్ళలో బట్ట గుడ్డగాని, ఫ్లేనలు గుడ్డగాని ముంచి నీళ్ళు పిండి వేసి ఆగుడ్డతో వత్తడ మిచ్చిన కవుసదెబ్బ, గాయము, గడ్డ. పలుగుసుపు, చిరుళ్ళవాపు వీనివలన గలిగిన నొప్పి శమించును.

ప్రత్తిగింజలు:—Cotton seeds. వీనిలోని పప్పు వాతపిత్తశ్లేష్మములు వలన గలిగిన వమనమును కట్టును. మేహమును, కాక నణచును. వీనిని నీళ్ళతో నూరి లోపలికిచ్చిన రక్తవిరేచనములు, గుండెలలో నొప్పి, మంట, దగ్గు, ఒగర్పు, పాషాణవిషము వీనిని పోగొట్టును. మోతాదు 2-3 తులముల యెత్తు. వీనిలోని చమురు పూసిన మచ్చలు, పొడలు నివృత్తించును. యీగింజలను పాలలో వేసి కాచి ఆపాలు యిచ్చిన స్త్రీలకు పాలు వృద్ధిపరచును.

ప్రత్తిగింజలు మేసిన ఆవుపాల గుణము:—Milk of the cow fed on cotton seeds. ఆవుపాలు చూడుడు.

ప్రత్తిచెట్టు:—Gossypium Herbeceum, G. Indicum - Eng. Cotton plant. సం॥ కార్పాసీ. సూత్రపుష్ప. హిం॥ కాపాస్. దీని ఆకులరసము రక్తగ్రహణిని కట్టును. ఆకుదంచి ఆముదములో వెచ్చజేసిగాని ఆకులునూరి ఆముదము కొద్దిగ గలిపి యుడికించిగాని నొప్పులుగల మోకాళ్ళకు (Gouty joints) కట్టిన నయమగును. దీని లేతఆకులు, వేళ్ళు వేసి నీళ్ళుకాచి ఆనీళ్ళు తగుమాత్రము వేడిగ నుండగ ఆనీళ్ళలో నడుము మునుగువరకు (Hip bath) కూర్చుండ బెట్టిన యోనిశూల నిమ్మళించును. దీని లేతఆకులు ఎండించి వానితో తేయాకునీళ్ళ (Tea) వలె కాచియిచ్చిన విరేచన జాడ్యములు మానును. దీనియాకు వేసి కాచిన నీళ్ళయావిరి గుదస్థానమునకు పట్టించిన మాటిమాటికి విరేచనమగునట్లుండు గుణము కట్టును. దీని వేరు రసముగాని కషాయముగాని మూత్రబద్ధము, మూత్రకృచ్ఛ్రము, ఋతుబద్ధము వీనిని నివృత్తించును. గర్భస్రావము గలిగించును.

ఋతుర క్తమును జారీచేయును. ఆకు లేక వేరు రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు వేరుచెక్క 10 తులముల యెత్తు, 60 తులములయెత్తు నీళ్ళలో వేసి నీరు సగమిగురువరకు కాచిన కషాయమును ప్రతి యరగంట కొకసారి 5 తులముల చొప్పున నియ్యవలెను. దీని సారము (Fluid extract) అయిన యెడల మోతాదు 30 మొదలు 60 చుక్కల వరకు ఇయ్యవచ్చును. దీని ఆకులరసములో కొద్దిగ సూరేకారము, కేవలచిన్ని అరగదీసిన చిక్కని గంధము పొత్తికడుపునకు పట్టువేసిన, మూత్రబద్ధమును విప్పి జారీచేయును.

ప్రపౌండరీకము:—తామరదుంప చూడుడు.

ప్రబ్బలిచెట్టు:—Calamus rotung (A sort of rattan) సం॥ వేతస. నిచుళ, మంజరీ. హిం॥ బేత్. దీని సమూలరసము లేక కషాయము కారముగ, చేదుగనుండును. వేడిజేయును. శ్లేష్మరోగము, నీరసము, మూలవ్యాధి, గుల్మరోగము, శూల, క్రిమి, ఉదర రోగము వీనిని హరించును. రసపుమోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½-5 తులములయెత్తు.

ప్రవాహోదకము:—Current water. త్రిదోషములను హరించును. లఘువుగ నుండును. ఆకలి బుట్టించును. ఇందు స్నానముచేయుట వలన శరీరమునందలి, శిరస్సునందలి దుష్టవేడిని తగ్గించి, శరీరకాంతి బుద్ధిబలము నిచ్చును. ఆయురారోగ్యమును కలుగజేయును.

ప్రాతఃస్నానగుణము:—Bathing in the morning. బలము, దేహపుష్టి, జఠరదీప్తి, ఆప్యాయము, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి, మనోవికాసము వీనినిచ్చును. పైత్యము, దేహమాలిన్యము, దుస్వప్నములు, చర్మరోగములు వీనిని పోగొట్టును.

ప్రాతఃకాలపుఉదకపానము:—Sipping of water early in the morning. బంగారు, వెండి, రాగి, కంచు, అయస్కాంతము, ఇనుము, మన్ను, గాజు, పింగాణీ వీనిలో దేనితోనైన చేయబడిన పాత్రలో రాత్రి పరుండబోవునపుడు ఉంచబడిన ఉదకమును రాత్రి నాల్గవజామున సూర్యోదయము గాక మునుపు మలమూత్రమువిసర్జన సేయకముందు పుచ్చుకొనిన మలమూత్రములను జారీచేయును, అన్నిదోషములు, వాతపిత్తశ్లేష్మప్రకోపము, హృద్రోగము, కాస, శ్వాస, క్షయ, అశ్మరి, గ్రహణి, కార్శ్యరోగము, అతిసారము, అతిమూత్రము, ఆమము, విషూచి, శూల, ప్లీహ, క్రిమి, గుల్మము, విసర్పి, కుష్ఠు, మూర్ఛ, పాండువు, హలీమకము, అపస్మారము, త్రివిధ విషజ్వరములు, అగ్నిమాంద్యము, పొత్తికడుపు నొప్పి, ప్రమేహములు, గజ్జలలో బిళ్ళలు, గళరోగము, శిరోరోగములు, కర్ణరోగములు, నాసికా రోగములు, నేత్రరోగములు, ఇంద్రియ నష్టము, శ్వేతము మొదలగు సమస్తరోగములు హరించును. సంతోషము, బలము, దేహపుష్టి, ఆయుర్వృద్ధి, వీర్యవృద్ధి, ఆరోగ్యము వీనినిచ్చును. నిరోగియయి నూరేండ్లు జీవించును. మరియు ప్రాతఃకాలమందు ముత్యపుచిప్పెడు నీళ్ళను ముక్కు రంధ్రముల వెంట పీల్చిత్రావిన ఇంద్రియస్ఖలనము కట్టును. ఆయుర్వృద్ధి గలుగును. నిరోగియైయుండును. దవడలయందు బుట్టుపదునొకండు రోగములు, దంతములయందు బుట్టు 11 రోగములు, ముక్కున బుట్టు 7 రోగములు, గొంతుకయందు బుట్టు 8 రోగములు, చెవులయందు బుట్టు 26 రోగములు, నేత్రములయందు బుట్టు 90 రోగములు, శిరస్సునందు బుట్టు 21 రోగములు హరించును. ఉదకపాన క్రమము—రాత్రి సంగ్రహించి యుంచిన నీళ్లుకాక వేరు నీళ్ళతో 1-2 మార్లు పుక్కిలించి రెండుచేతులను కడుగుకొని ఆచే

ములతో కండ్లు తుడుచుకొని ఆ సంగ్రహించి యుంచిన నీళ్ళను 3 అరపురిసెళ్ళ నీళ్ళతో నారంభించి క్రమక్రమముగ వృద్ధిచేయుచు అనగా కొన్నిదినములు 3 అరపురిసెళ్ళ నీళ్ళు, కొన్నిదినములు 4 అరపురిసెళ్ళనీళ్ళు ఈచొప్పున వృద్ధిచేయుచు దోసెడు నీళ్ళవరకు వృద్ధిజేసి మాసమువరకుగాని, 6 మాసముల వరకుగాని,సంవత్సరము వరకుగాని, రోగాంతము వరకుగాని, యెల్లప్పుడుగాని జీర్ణశక్తి, దేహదార్ఢ్యము, ఆరోగ్యము మొదలగు వానిని గమనించి అనుదినము శ్రద్ధతో బుచ్చుకొనిన పైనజెప్పినరీతిని ఆరోగ్యము మొదలగునవి గలుగును. పుచ్చుకొను నీళ్ళను తనకుడిచేతి పురిసెటిలో నుంచుకొని (పోసుకొని) కొద్దికొద్దిగ పానము జేయవలయును.

ముక్కువెంట నీళ్ళుపీల్చడమును ఒకటిరెండు చుక్కలు నీళ్ళు పీల్చడముతో నారంభించి క్రమక్రమముగ నింపాదిగ హెచ్చించుచు అభ్యాసముజేసి ముత్యపుచిప్పపట్టునన్ని నీళ్ళు అనుదినము ముక్కు రంధ్రములవెంట పీల్చి పైనజెప్పిన కాలపరిమితి వరకు పానము జేయుచుండనగును. ప్రాతఃకాల ఉదకపానము సేయువారు ఉదయపు పూటను టీ (Tea), కాఫీ (Coffee) పుచ్చుకొనకుండుట శ్రేయస్కరము. వాని అవసరమును ఉండదు. మరియు ప్రాతఃకాల ఉదకపానపు దినములలో రోగులు అనారోగ్యకర పదార్థములను పుచ్చుకొనకూడదు.

ప్రేంఖణపుచెట్టు:—Aglaia roxburghiana. సం॥ ప్రియంగు, ఫలినీ, వనితా, హిం॥ ప్రియంగు. పూర్ ప్రియంగు. దీనివేరు మానుచెక్క రసముగాని, కషాయముగాని, చేదుగ, వగరుగనుండును. వాతము, పైత్యము, రక్తాతిసారము, శరీరదుర్గంధము, చమట, దాహము, వాంతి, జ్వరము, రక్తదోషము, గుల్మము, ప్రమేహము వీనిని హరించును; బలము, కాంతినిచ్చును. దీని ఫలములు,

చలవజేయును. మధురముగ, వగరుగ నుండును; మలబద్ధము జేయును; కఫపైత్యములను హరించును; గురుత్వముగ నుండును; బలము జేయును. రసపు మోతాదు 2-8 తులములు. కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తులములు, చూర్ణపు మోతాదు 1-2 అణాల యెత్తు.

ప్రొద్దు తిరుగుడుచెట్టు:—**Croton plicatum, Helianthus annuas, Eng. Sun flower,** సం॥ సువర్చల, సూర్యభక్తా. హిం॥ హుర్ హుల్, హుల్‌హుల్. దీనిని సూర్యావర్తి యని యందురు. చేదు, కారము రుచి. దీని సమూలరసము లేక కషాయము లేక చూర్ణము కుష్ఠు, క్షయ, గ్రహణి, మేహము, క్రిమి, దగ్గులు వీనిని బోగొట్టును. దీని ఎండిన కాడలు ఆవాలతో కషాయము కాచి యిచ్చిన కుష్ఠువ్యాధి నివారణమగును. దీని యెండిన ఆకుల చూర్ణము కడుపు నొప్పిని పోగొట్టును. మూత్రమును జారీచేయును. చెవిలో పోసిన చెవిపోటు నివారణమగును. దీని సమూల కషాయముతో ఒత్తడ మిచ్చిన నరముల బలహీనము **(Nervous weakness)** ను పోగొట్టును. సమూలరసపు మోతాదు పూటకు 3-4 తులముల యెత్తు; కషాయపు మోతాదు 2½-5 తులముల యెత్తు. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు.

—౯—

# బ

బ. కనక్కేర చెట్టు — నక్కేర చెట్టు చూడుడు.

బంగారు అరటిచెట్టు:—**Yellow plantain tree.** సం॥ సువర్ణకదలీ. సువర్ణరంభా. ఈచెట్టు పసుపుపచ్చని రంగుగలది. దీని పండ్లు రుచిగ నుండును; చలువజేయును, అగ్నిదీప్తి నిచ్చును; అధిక ఆహారా

పిత్తము బుట్టించును; దప్పిక, తాపము, కఫము వీని నణచును; శుక్రమును వృద్ధిజేయును; గురుత్వముగ నుండును.

బంగారుతీగె చెరుకు:—చెరుకు చూడుడు.

బంగారు పళ్ళెమున భోజనము, దీని పాత్రతో నీరు, పాలు పుచ్చుకొనుట:—Taking food drinking water, milk &c. in a gold plate dish or Cup. దేహపుష్టి, వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, సుఖము, కాంతి, వీని నిచ్చును; కండ్లకు చలువ, నేత్రుకలకు బలము జేయును; మిక్కిలి ఆరోగ్యముగ నుండును.

బంగారపు భస్మము:—స్వర్ణభస్మము చూడుడు.

బంగారపు వరకు:—Gold leaves. అనగా మేలిమి బంగారమును మిక్కిలి పలుచగ చేయబడిన రేకులు. కాకతో కూడిన సమధాతువు జేయును; విషదోషమును, పైత్యవికారము నణచును; ఇంద్రియ నష్టము కట్టును; దారుణ మేహముల న.చును; హృదయము (Heart) నకు బలముజేయును. క్షయ, నిస్త్రాణ (General debility) వీనిని పోగొట్టును. దేహపుష్టి, బలము. కాంతి, బుద్ధిబలము, జ్ఞాపకశక్తి, వీర్యవృద్ధి, కామము వీనిని గలుగజేయును. మనోల్లాసమును, ఆయుర్వృద్ధిని, ఆరోగ్యము నిచ్చును, దీనిని వేడిఅన్నముతో కలిపిగాని, లేహ్యములలో గలిపిగాని పుచ్చుకొనవలెను. మోతాదు పూటకు అరరేకు మొదలు ఒక రేకవరకు.

బంగారుగంధము (అనగా మంచిసానపై మేలిమి బంగారును అరగదీసిన గంధము:—Gold grinded on stone in whet stone or hone. మేలిమి బంగారమును నీళ్ళతోగాని, తేనెతోగాని గట్టిసాన (అనగా కురంజిసాన) మీద అరగదీసిన గంధము. దీనిని వెన్నతో గాని, నేతితోగాని వెన్నపంచదార లేక నెయ్యిప చదారతోగాని, తేనెతోగాని దినమునకు రెండుపూటలను 20 లేక 40 దినములు

సేవించిన విచారపు పిచ్చిని పోగొట్టును. మెదటికి సత్త్వ, జ్ఞాపక శక్తి, దేహపుష్టి, కాంతి, బలము, వీర్యవృద్ధి, కామము వీనిని గలుగజేయును. మేహశాంతి జేయును. హృదయమునకు బలము నిచ్చును. ఆయుర్వృద్ధిని, ఆరోగ్యమునిచ్చును. మోతాదు పూటకు 1 మొదలు 2 వడ్లగింజల యెత్తువరకు. (1 or 2 grams) బిడ్డలు పుట్టినది మొదలు సుమారు 1 సం॥ వరకు ప్రతి వుదయపు పూటను చనుబాలతోగాని, తేనెతోగాని స్వల్పముగ నరుగదీసి యిచ్చుచుండిన నిరోగులను చేయుటయేగాక బలము, పుష్టి, ఆయురారోగ్యము నిచ్చును.

బంగాళాదుంపలు:—ఆలుదుంపలు చూడుడు.

బండారుచెట్టు:—**Cinchona excelsa.** దీని మానుచెక్క చేదుగ, వగరుగ నుండును. దీనిరసము లేక కషాయము గ్రహణిని, రక్త గ్రహణిని కట్టును. శీతపైత్యమును హరించును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

బండిగురివిందచెట్టు:—**Adenanthera pavonia - big variety** సం॥ మాధవీ, వాసంతికా. హిం॥ నేవారీ, వాసంతీ. ఇది పెద్ద వృక్షము. దీని చెక్కకషాయము బిగదీయును (Astringent.). బలము జేయును. ప్రాణమును క్షీణింపజేయు నీళ్ళవిరేచనములు, రక్త గ్రహణి వీనిని కట్టును. దీని విత్తుల చూర్ణములో నీళ్ళుకలిపి నొసట (Forehead) పట్టువేసిన అలసటబడుటవలనను; చలి, వాన, యెండలో తిరుగుటవలనను గలిగిన తలనొప్పి నిమ్మళించును. దీని విత్తులను నీళ్ళతో అరుగదీసిన గంధము వంటికిబూసిన పేలడము (Prickly heat) నిమ్మళించును. వృషణములపైన బూసిన వాని వాపు, నొప్పి నయమగును, వీని చూర్ణము 60 గోధుమగింజల

మెత్తు వేడినీళ్ళతో లోపలికిచ్చిన వమనములగును. దీనిని పెద్ద గురివింద అనియు నందురు. మోతాదు 3½ మొ॥ 5 తు॥ మెత్తు వరకు. దీని పువ్వులు మనోహరముగ నుండును. కఫవాతములను, శ్వేతరోగములను పోగొట్టును. మదనోద్రేకము గలుగజేయును.

బండియెక్కిన గుణము:— Going in a cart. శకటారోహణము చూడుడు.

బచ్చలి:— Basella alba. Brubra. Eng. Indian spinach. సం॥ ఉపోదకి. లోణీ. హిం॥ .పోయి శాకాక్. నోనియా దీని తీగలు ఎరుపు, తెలుపు 2 రకములుగలవు. దీని యాకులు, కాడలు క్రమముగ వండినకూర రుచిగ, స్వాదుగ నుండును. చలువజేయును, విరేచనము గావించును. మేహము, మేహవాతము, పైత్యము, దగ్గు, శ్లేష్మము, రక్తపైత్యము, మదము, తాపము, దాహము వీని నణచును. విషమును గొట్టును. జఠరదీప్తినిచ్చును. వీర్యపుష్టి జేయును. గాని జ్వరము మొదలగు రోగములచే బాధపడువారికి అపథ్యమైనవి. ఈ బచ్చలి జాతిలో మట్టుబచ్చలియని దుబ్బులు పెరిగెడి యొక జాతి గలదు. అదిన్నీ బచ్చలివలెనే వండుకుతిందురు. పైగుణములే దీనికిన్నీ కలవు. దీనికి విరుగుళ్ళు నీళ్ళలో కొద్ది వుడికించి పారవంచుట, పులుసు పెట్టుకొనుట, ఆవపెట్టుట, మెండు, పచ్చి మిరపకాయలువేసి వండుట, నువ్వుచెట్టు సమూలము కాల్చి చేసిన క్షారము. దీని యాకుల రసముగాని, యాకునూరిన ముద్దగాని కాలినచోట పైనపూసిన మంట నణచును. మంటలుగల పొక్కులు (Erysipelas) ను మాన్పును. దీని యాకుల తేలిక కషాయము మూత్రమును జారీచేయును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల మెత్తు. చొప్పున దినమునకు రెండు పూటల నియ్యనగును. ఆకునూరి కణతలకు వేసిన తలలోనుండెడు

తీవ్రమైన వేడితగ్గును. నిద్రపట్టును. కతీరా అనగా బాదాంజిగురును దీనియాకు రసముపోసి నూరి మాత్రగట్టి యిచ్చిన నోటివెంట పడెడు రక్తమును కట్టును. మాత్రప్రమాణము సెనగగింజలంతేసి పూటకు 2-3 యియ్యనగును. దీని పువ్వులు, కాయలు కూరవండుకుని తిందురు. రుచిగానుండును. శ్లేష్మము, వాతము జేయును. గురుత్వముగనుండును. అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు పైన చూడుడు.

బటాణీలు:—Pisum. Sativum. Eng. Peas. సం* కలాయ. హిం* సతీనా, మటర్. వీనిని వేయించి పైపొప్పర తీసివేసి తిందురు. కమ్మగ, తియ్యగ కొద్ది వగరు గలిగియుండును. చలువ, వాతము జేయును. పైత్యము, కఫము వీనిని హరించును. వీర్యవృద్ధి, బలము, దేహపుష్టి జేయును. రక్తదోషమును పోగొట్టును. ఆమ్లదోషమును కలుగజేయును విరేచనము జేయును. రక్తోద్రేకమును శాంతిపర చును; పచ్చి బటాణీలను కూరలలో వేసుకొందురు. రుచిగా ఆరోగ్యముగా నుండును. బటాణీలు కఫపైత్యమును వృద్ధిపరచునని కొందరందురు.

బత్తాయి నారింజపండు:—Batavia orange. ఇది తియ్యగ, రుచిగ కొద్ది పులుపు గలిగియుండును. చలువ, మేహశాంతి జేయును; రక్తములోని అతివేడిని, పైత్యమును, శాకదగ్గును అణచును; జబ్బుపడి లేచినవారికిని, నీరసదేహులకును రక్తవృద్ధి గలుగజేయును. రుచిబుట్టించును. మూత్రము గావించును; (Typhoid) జీర్ణజ్వరములు మొదలగు జ్వరములయందు ఆహారముగ దీని రసమును యిచ్చుటకు అనుకూలముగ నుండును. హృదయమునకు బలము జేయును. నీరసదేహులకు దీనిరసములో (Glucose) కలిపిగాని, కలుపకగాని వాడదగియుండును, బలము, పుష్టి, రక్తవృద్ధి ఆరో

గ్యమునిచ్చును. వాతశ్లేష్మ రోగులకు జబ్బుచేయును. దీనికి విరుగుళ్లు మొదలగువానిని గురించి నారింజపండు చూడుడు.

బదినిక:—Lemodorum spatulatum. సం* వృక్షరుహా. శేఖరీ, వృక్షభక్ష. ఇది అనేక వృక్షములయందు లేచును. యివి అనేక రకములు గలవు. చెట్లనుబట్టి గుణభేదము గలిగియుండును. వగరు, చేదు, తీపి రుచులు గలిగియుండును. చలువజేయును; విరేచనబద్ధము జేయును. వ్రణములను, విషమ వ్రణములను, గాయములను మాన్పును దీని చూర్ణమును తేనెతో గలిపియిచ్చిన పైత్యము, మతి చాంచల్యమును అణచును. అనేక రంగులు పూయును. బంగారు వన్నెగల దీని పువ్వుల చూర్ణము తేనెతో నిచ్చిన క్షయ, ఉబ్బసపు దగ్గు, పిచ్చి మానును. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. వాతకఫములను హరించును. రక్తమును శుభ్రపరచును. విషహరము. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులములవరకు. తాంత్రికులు దీనిని శుద్ధిగాతీసి పిశాచబాధలకు నుపయోగింతురు. (తరువాయి బదినికకూడ చూడుడు)

బదినిక:—Lemodorum spatulatum. సం* వృక్షరుహా, వృక్షాదనీ. హిం* బందాల్. యీతీగె మామిడి, చింత, ముషిణి మొదలగు ననేక చెట్ల కొమ్మలయందు పుట్టి వేళ్ళు లేకుండగనే పెరుగును. బదినికలన్నియు ఒకేవిధముగ నుండునుగాని రంగులు భేదములుగల పువ్వులు గలిగియుండును. దీనిరసము లేక కషాయము చేదు,వగరు, తీపి రుచులు గలిగియుండునుగాని వృక్షభేదములనుబట్టి రుచిగుణభేదము గలిగియుండును. చలువజేయును; గాయములను, వ్రణములను మాన్పును; కాయసిద్ధి గలిగించును; విరేచనబద్ధము జేయును. దీని చూర్ణము తేనెతో నిచ్చిన పైత్యము, మతిచాంచల్యమును శాంతింపపరచును; బంగారువర్ణముగల దీని పుష్పములను, చూర్ణ

మును తేనెతోనిచ్చిన క్షయరోగము, ఉబ్బస రోగము, పిచ్చి కుదురును. భూతబాధలను నివారణజేయును. రసపు మోతాదు 2-3 తులములఎత్తు. కషాయపు మోతాదు 2 - 1/2 మొదలు 5 తులముల ఎత్తువరకు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల ఎత్తువరకు.

బరివెంక చెట్టు:— Trophis aspera. Streblus aspera. సం॥ శాఖోట, శ్వాఖోట. హిం॥ సహోరా, సిహోడా. దీనిని బఱెంక చెట్టనియు, బరింక చెట్టనియు నందురు. దీని ఆకులు గరుకుగ నుండును. దీని మానుచెక్క, ఆకు వీని చూర్ణము లేక కషాయము కుష్ఠురోగమును బోగొట్టును. పైత్యము జేయును. మేకయొక్క పాలను హరింపజేయును. చూర్ణపు మోతాదు పూటకు 2 అ॥ మొదలు 4 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. దీని పాలను వుదయము ననే గుడ్డకుపట్టించి, వేసిన కంతులు, గవద బిళ్ళలు హరించును. దీని పుడక దంతధావనకు మిక్కిలి యుపయోగకరము. దీని ఆకులో కండ్ల రెప్పల లోపగు కురుపులకు వ్రాసిన (Rubbing) 3-4 దినముల కొకసారి యవి హరించును. దీని పండ్లు మధురముగ నుండును. కఫపిత్తములను హరించును. మేహశాంతి జేయును.

పలపపుటాయి:— శంఖజీరకము చూడుడు.

బలురక్కసిచెట్టు:— ఏనుగచెవి చామ చూడుడు.

బల్లి:— Lizard. దీనిని కొన్ని గ్రంధి దినుసులతో లేహ్యముచేసి యిచ్చిన కుష్ఠురోగము, సుఖరోగములు నివృత్తించును. ఆకుపచ్చని బల్లుల మాంసము కుష్ఠురోగము, గండమాల, వ్రణములు వీనిని జయించును.

బలురక్కెస చెట్టు:— Argemone mexicana. Eng. Yellow thistle. Prickly or Mexican poppy. సం॥ స్వర్ణక్షీరి, స్వర్ణదుగ్ధ, శృంగాలకంటకి. హిం॥ చోక్, కుట్టెలా. యిదియే యూలికా కంకుష్టము. దీనిని కొన్నిప్రదేశములలో నులిపుచ్చయనియు, పిచ్చి కుసుమ లేక వెర్రికుసుమచెట్టనియు నందురు. ఇది పసుపు పచ్చని పువ్వులు పూచెడు ముండ్లచెట్టు. ఏటేట లేచును. దీనిపచ్చని పాలు కండ్లలో వేసిన కండ్లకలకలు, పురాణ నేత్రరోగములు హరించును. పైన పూసిన సవాయి పొక్కులు, వ్రణము, ఇతర పొక్కులు, గాయములు, కొట్టుకొనిపోవుట వీనిని మాన్పును. దీని సమూలపు రసము లోపలికిచ్చిన మూర్ఛరోగము నివృత్తించును. విరేచనము జేయును. నొప్పిని హరించును; నిద్రదెచ్చును. సమూలమును నూరి కట్టిన మొండివ్రణములు మానును. పచ్చివేరు నూరిపెట్టిన తేలు విషము హరించును. దీని విత్తులనుండి తీసిన చమురు కుష్టు, పుర్రి మాద, ఇతర చర్మరోగములు, ఎండవలన గలిగిన తలనొప్పి వీనిని హరించును. లోపలికిచ్చిన విరేచనము జేయును. దేహములోని మలములను వెడలించును. పంచదార గడ్డమీద ఈచమురు 30 చుక్కలు వేసి యిచ్చిన కడుపునొప్పి, పొట్టలోని వ్యాధులు శీఘ్రముగ వింతగ నిమ్మళించును. రోగికి విరేచనమగును. మంచి నిద్ర పట్టును. దీనిసమూలపు తేలికకషాయము మూత్రకారి; మూత్రబద్ధమును విడిపించును. దీని మొండించినపాలు ఉబ్బు, ఉదరరోగము, చర్మరోగములు వీనిని హరించును. దీని గింజలలో నల్లమందువంటి విషమున్నది. వీనిని ఇపికేక్వానాకు మారుగ వాడుదురు. వాంతి చేయును. సమూలరసపు మోతాదు 1-2 తులముల యెత్తు; కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు, చమురుమోతాదు 10 మొదలు 30 చుక్కలవరకు,

బలురక్కసిపులప:—Soured curry of the tender leaves of do. బలురక్కస లేతఆకులు చల్లలో ఊరించి రసవర్గములలో చేసినది తేలికగ నుండును. పైత్యము జేయును. కఫమును, వాతమును, కడుపులో బల్లను శమింపజేయును. పులియజేయు క్రమమునుగూర్చి కసివిందపులప చూడుడు.

బలుసుచెట్టు:—Webera Tetrandra. Canthium parviflorum. సం॥ బలాకా, ఖారవాజీ, వృకగంధినీ. దీనివేరు లేక మానుచెక్క లేక ఆకులకషాయము అతిసార విరేచనములు, రక్తగ్రహణి, నీళ్ళ విరేచనములు వీనిని కట్టును. వేరురసము లేక కషాయము క్రిమిని జంపును. వేరురసపు మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. వేరు, చెక్క, ఆకు వీని కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు.

బలుసుఆకుకూర:—Curry of the leaves of do. రుచిగ, కొద్ది వగరుగ నుండును. మేహశాంతి జేయును; గ్రహణి రోగములను, వింశతి మేహములను, పైత్యములను జయించును. జ్వరమును హరించును. పులుసు వేసి వండిన దీనియాకులకూర గ్రహణి, రక్తగ్రహణి రోగులకు మిక్కిలి పథ్యముగ నుండును.

బలుసుకాయకూర:—Curry of the young fruit of do. వగరుగ, రుచిగనుండును. కొద్దివేడి, వీర్యముయొక్క చలువను, కఫవాతమును గొట్టును. మేహములను హరించును.

బలుసుపండు:—Fruit of do. వగరుగ, మధురముగ నుండును. వాతము, పైత్యము, మేహమును శమింపజేయును. పథ్యమైనది.

బసంగిరసంగి అను ధాన్యములు:—A sort of paddy. 4 మాసములకు పండెడు తేలికపంట ధాన్యములు గనుక వీని బియ్యపు అన్నం రుచి తక్కువ, బలము తక్కువగ నుండును. గనుక మంచివికావు. మరియు ధాన్యములు చూడుడు.

బాడిదచెట్టు:—Erythrina Indica. సం॥ పారిభద్ర,రక్తపుష్పక, బహుపుష్ప. హిం॥ పర్ హాద్. ఇది ఎఱుపు, తెలుపు రెండుజాతులు, తెల్లపువ్వులది శ్రేష్టము. దీనిచెక్క లేక ఆకురసము లేక కషాయము వగరు, కారముగ నుండును. కఫము, వాతము, ప్రమేహము, ముఖ రోగము, కర్ణరోగము, విషదోషము, క్రిమి వీనిని హరించును. పైత్యముజేయును. దీపనపాచనములను గలిగించును. రసపు మోతాదు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తు. దీని రసము చెవిలోబోసిన చెవి పోటు తగ్గును. దీనిచెక్క చూర్ణము పంచదార కలిపి సేవించిన సవాయి మచ్చలు, పుండ్లు, మేహపొడలు హరించును. మోతాదు 2 అణాల యెత్తు. దీని ఆకు మూత్రమును జారీచేయును. గర్భస్రావ మును గలిగించును. విరేచనము జేయును, దీనిచెక్క గ్రహణిని కట్టును. దీని ఆకు, చెక్కరసము రాసిన కురుపులు; వ్రణములలో క్రిములను జంపి మాన్పును; దీని ఆకునూరి కట్టిన బిళ్ళలను హరింప జేయును; తెల్లబాడిదపు లేతవేళ్ళనునూరి చల్లని ఆవుపాలలో గలిపి సేవించిన వీర్యవృద్ధి జేయును.

బాడిదపువ్వు:—Flowers of do. దీని రసము లేక కషాయము వగ రుగ నుండును; కడుపులోని బల్లలను హరించును; తీవ్రములగు శూలలను జయించును; పువ్వును నూరి కుంకుడు గింజంత ప్రదయ సాయంకాలముల తినుచుండిన గుల్మము, శూల, అగ్నిమాంద్యము హరించును; పథ్యము జాగ్రతగా చేయవలెను.

బాతుగ్రుడ్డు:—Duck egg. రుచిగ నుండును; దేహపుష్టి, బలము వీనినిచ్చును; అజీర్ణము జేయును, దీనికి విరుగుళ్ళు కోడిగ్రుడ్డు చూడుడు,

బాతుమాంసము:— Duck-wild and tame-flesh of. అడవి బాతు మాంసము చలువజేసి ఆర్చును; తాజా (Refresh) పర చును; రక్తమును బుట్టించును; బలమిచ్చును; గురుత్వముగనుం డును. పెంపుడుబాతు మాంసము కాకజేయును; దేహపుష్టినిచ్చును; వాతమును బోగొట్టును; గురదాల (Kidneys) కు, ముంతగుండె (Heart)కు, రొమ్ము, (chest)కు, బలముజేయును; పుంస్త్వమును హెచ్చించును. జీర్ణమగునేని అన్ని మాంసములకంటె మంచిది. దీని ప్రక్కలమాంసము మంచిది. మంచిరక్తమును బుట్టించును, తక్కిన భాగముల మాంసము ఆలస్యముగ జీర్ణమగును; తలనొప్పి దెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2. శికింజబీను, 3 శొంఠి, 4 అల్లము.

బాదము గంజి:—Almond cunjee. బాదముపప్పు నీళ్ళతోనూరి నీళ్ళతో పలుచగా గలిపి నేతితో పొగచి యుడికించినది కాకజేసి చలువ జేయును; పొట్టకు బలమిచ్చును; తేనెతో గలిపి పుచ్చుకొన కూడదు.

బాదమునూనె:—Almond oil. మృదువు పరచును; తుయ, దగ్గు వీనిని బోగొట్టును; మూత్రపుసంచిలోని పుండ్లను మాన్పును; మెదడు (Brain), గుండెలు (chest), హృదయము (Heart), కండ్లు (Eyes)వీనికి మేలుజేయును. మోతాదు 2 డ్రాములు మొదలు (120 చుక్కలు) ½ ఔన్సు వరకు. దీనితో తలయంటుకొనిన లేక మాడ పట్టు (Crown of the head) న మర్దనజేసిన తలలోనిపోటు, దుష్టవేడిమి, వికారము వణచును; నేత్రములకు మేలుజేయును.

బాదముకాయలు:—Amygdalus communis & Prunus amygdalus. Eng. Almonds sweet. సం॥ వాతవైరి, బాదామ. నేత్రోపమ. హిం॥ బాదామ్. పప్పు సమశీతోష్ణమైనది.

క్రొత్తకాయలలోనిపప్పు శ్రేష్టమయినది; వేడిజేసి చలువ జేయును; వీర్యవృద్ధి, శరీరపుష్టి జేయును; మేహవాతమునణచును; రొమ్మునకు (Chest) బలమిచ్చును; మూత్రపుసంచిలోని పుండ్లను మాన్పును; అన్ని అవయవములకు సత్తువజేయును; గొంతుకను,రొమ్మునుమృదువు పరచును; దగ్గు, కార్జపు (Liver) నొప్పి, క్షయ వీనినణచును; మంచియింద్రియమును బుట్టించును; పొట్టకు, గుకదాలకు(Kidneys) బలముజేయును; వాతమును హరించును; పండ్లనొప్పి, ద్వాద్వ గుణము, దేహము అర్చుకొనిపోవడము, శిరోరోగము వీనిని పోగొట్టును; పొట్టుతీసిన బాదముపప్పు వీర్యవృద్ధిజేయును; విడిచివిడిచి వచ్చు జ్వరమును పోగొట్టును. దీనిపాలు లేక తీసినరసము పైన బూసిన పొక్కులు బొటిమలు హరించును; మంచి బాదముపప్పు నీళ్ళతో నూరి తీసినపాలు లేక రసము లోపలికిచ్చిన బొట్టుబొట్టుగా పడెడు మూత్రమాకట్టును; మూత్రముగావించును. బాదముపప్పు పైత్యమును హెచ్చించును; పొట్టకు నీరసము దెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 రూమిమాస్తకి, 2 శర్కర, 3 అంజూరుపండ్లు, 4 నేతిలో వేయించడము. చెడిపోయినపప్పు చేదుగానుండును; ఇది తినడము వలన జబ్బుజేయును. దీనికి విరుగుడు పులుపువస్తువులు బాదము కాయలపెచ్చులు కాల్చినమసితో పండ్లుతోమిన పండ్లనొప్పి, దంత రోగములు నివారణమగును. 5, 6, 7, 8 బాదం పలుకులను నీళ్ళలో నానవేసి పొట్టు తీసి వేసి, యిందులో సుమారు ఒక 1/2 తులం గస గసాలున్నూ వేసి నీళ్ళతో 2-3 పర్యాయములునూరి పాలుతీసి ఇనుప మూకుడులో పోసి కాచి చిక్కపడేవరకు పటికి, పంచదారచూర్ణము, 2 యాలకాయలచూర్ణము వేసి గరిటితో త్రిప్పుచు దగ్గరపడు నప్పుడు కొద్దిగ మంచి నేయినివేసి దింపుకొని పరగడుపున పుచ్చుకొనుచుండిన వీర్యవృద్ధి, బలము, బుద్ధిబలము, ఆప్యాయతను

యిచ్చును. నరముల బలహీనతను నీరసమును పోగొట్టును. చేదు బాదము చూడుడు.

బార్లీబియ్యము:—యవలు చూడుడు.

బాలబందకాడ:—చవులపిల్లితీగె చూడుడు.

బాలింతబోలు:—Balsamodendron myrrh-resin of. Eng. Myrrh. సం॥ బోళ, గంధరస. హిం॥ బోల్. దీనిని బోళమనియు నందురు. సువాసన, వగరు, చేదు గలిగియుండును; రక్తవాతము, కంతులు, పొత్తికడుపులో బుట్టెడు శూలలు, మూలవ్యాధి, శూలలు గ్రంథులు, గ్రహణి, గుల్మలు, వ్రణములు వీనిని బోగొట్టును; జఠర దీప్తి నిచ్చును; వీర్యమునకు చలువజేయును; పైత్యము నణచును; కాకజేయును; నరములకు సత్తువజేయును; బలమిచ్చును; శ్లేష్మమును, కఫమును వెడలించును; విరహతాపజ్వరమును బోగొట్టును; హృదయమునకు మేలుజేయును; సంతోషమిచ్చును; దీనిని నిమ్మపండ్ల రసముతో నూరి బలమైన కవుకుదెబ్బలకు పట్టువేసిన నొప్పి తీయును; గడ్డలకు, కంతులకు పట్టువేసిన వానిని హరించును; క్షయ, దగ్గు, ఉబ్బసము, పురాణపు దగ్గులు, అతినీరసము వీనిని బోగొట్టును గాని హఠాత్తుగ కాకజేసి నాడిలో వేగము పుట్టించునుగాన అట్టి రోగులకు జాగ్రతతో వాడతగియుండును. దీనిని సారాయి (Alcohal) లో గలిపి పైనపూసిన చిగురువాపు, వ్రణములనుండి దుర్గంధము గల గసికారుట వీనిని బోగొట్టును. మరియు కుసుమ రోగములు, యోనిరోగములు, మొదలగు గర్భాశయ దోషములను హరించును; లోపలికిచ్చు మోతాదు 15 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు. 2 వంతులు బాలింతబోలు, 1 వంతు నల్లమందు, 1 వంతు రససింధూరము వేసి కొద్దిగ నీళ్ళతో మృదువుగ నూరి కందిగింజలంతేసి మాత్రలుజేసి పూటకొకమాత్ర లేక 2 మాత్రలు

చొప్పున దాల్చినచెక్క రసముతో నిచ్చిన గ్రహణి, రక్తగ్రహణి, నీళ్ళవిరేచనములు, జాకవిరేచనములు కట్టును.

బావంచాలు:— Psoralea corylifolia. Vernonia anthelmintica. Trifolium unifolium. Eng. Pabchi seeds. సం* సోమరాజీ, వాకూచీ, కుష్టఘ్నీ. హిం* బావచీ. వీనిని బావంచిగింజలని, కాలుగెచ్చ విత్తులని, కారుగెచ్చవిత్తులని, కారుబోగివిత్తులని, కాలగింజలని యందురు. చేదు, కారము, స్వల్ప తీపి రుచులుగలది. వీనిని లోపలి కియ్యవచ్చును; పైన పూయవచ్చును; ఇవి సువాసనగలిగి చేదుగనుండును; వీనిచూర్ణము లేక రసము లేక కషాయము వాతము, కఫము, క్రిమి, పైత్యజ్వరము, కుష్ఠు, శ్వేత కుష్ఠు, దద్దుర్లు, చిడుము, దురద మొదలగు చర్మరోగములు హరించును; పొట్టకు బలముజేయును; మూత్రము గావించును; దేహములోని మలముల వెడలించును; ఇంద్రియపుష్టిజేయును; రక్తపిత్తము, వాతరక్తము, పాండువు, ఉబ్బుల శమింపజేయును. శ్వాస, కాసలను హరించును. బావంచాలు, సుగంధి, వీని కషాయము పూటకు 2-3 ఔన్సుల చొప్పున సేవించుచుండిన సవాయిరోగము పోగొట్టును. మరియు బావంచాలు చంద్రచెక్క, వుసిరికపప్పు సమభాగము కషాయము పూటకు 2-3 ఔన్సులచొప్పున కొంతకాలము సేవించుచుండిన శ్వేతకుష్ఠులు బోగొట్టును. బావంచాలు, పిండితోగల సమభాగ చూర్ణమును పూటకు 2-3 అణాల యెత్తు చొప్పున సేవించుచుండిన చెవుడు మానును. బావంచాలు మజ్జిగతోగాని ఆవుపంచితముతోగాని నానబెట్టి నూరి శరీరమునకు పూసుకొనుచుండిన చర్మరోగము మానును. చూర్ణపు మోతాదు పూటకు 1 అణా మొదలు 3 అణాల యెత్తువరకు, నీళ్ళతో నూరి తీసిన రసపు

మోతాదు 1-2 తులములయెత్తు, కషాయము మోతాదు 2-1/2-5 తులములయెత్తు.

బావినీళ్ళు:—Well water. కొంచె ముప్పగ, తియ్యగ నుండును, వేడిజేయును. శ్లేష్మమును, వాతమును పోగొట్టును. జఠరదీప్తి నిచ్చును విరేచనము గావించును. పైత్యముజేయును.

బిడాలవణము:—Vitsalt. సం॥ విడ్ లవణ, కృష్ణలవణ. హిం కాలానమ్మక్; ఇది కొద్ది మెరుపుగా కొంత బూడిదవర్ణముగా కలిసి అక్కడక్కడ మోరు గలిగియుండును. దీని చూర్ణము జఠరాగ్నిని వృద్ధిబొందించును; హృద్రోగము, వాతము, మలబద్ధము, కడుపుబ్బు, ఆమశూల, శ్వాస, కాస, అరుచి వీనిని జయించును. వేడిజేయును. దీనికి విరుగుడు ముగలిచన్నులరసము. మోతాదు-పూటకు 2 మొదలు 4 చిన్నములయెత్తువరకు.

బియ్యపుకడుగు:—Rice washings. బియ్యము కడిగిన నీళ్ళకు కడుగు అనియు పసగడుగనియు అందురు. ఈనీళ్ళతో పంచదార కలిపి పుచ్చుకొనిన మూత్రము జారీయగును. నీరుడు చురుకుకట్టును. చలువజేయును; తాపము, దప్పి తగ్గును. ఎక్కువద్రాగిన జలుబు చేయును. బియ్యము మొదట గడిగిదీసిన కడుగు బుచ్చుకొనిన రక్తపైత్యము, అగ్నిమాంద్యము, అతిసారము, మేహమును జయించును. రెండవమారు కడిగి తీసినది కష్టు, ప్రమేహము, విషము, రక్తపైత్యము వీనిని శమింపజేయును. వేసవికాలమున ఎండ తగిలినవారికి గలిగిన ఆయాసము. మొదలగు బాధల నణచును. మోతాదు 4 మొదలు 20 తులముల యెత్తువరకు.

బియ్యపురొట్టె:—Rice bread. వరిపిండిలో ముందుగ వేడినీళ్ళుపోసి పిసికి అందులో కొద్దిగ నెయ్యివేసి మెదిపి చేసిన రొట్టె మృదువుగ, రుచిగ నుండును, త్రిదోషహారమై యుండును. కాకజేసి చలువ

జేయును. బలమిచ్చును. కష్టపుపని జేయువారి కనుకూలముగ నుండును. నీళ్ళతో చేసిన రొట్టె గురుత్వముగనుండి కడుపునొప్పి దెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 జీలకఱ్ఱ, 2 పుదీనా.

బియ్యము:—**Oryza sativa. Eng. Rice.** సం* తండుల. హిం* చావల్. పచ్చివి తినుటవలన అగ్నిమాంద్యము, పాండురోగమును బుట్టించును. ప్రేగులలో సుద్దబుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పెరుగు, 2 పాలు గలిపిన నీళ్ళు. అన్నము చూడుడు.

బియ్యపునూకలజావ:—**Rice grits gruel.** బియ్యమును కొద్దిగ వేపి నూకలుగ విసిరి పిండితీసివేసి ఆ నూకలతో పలచగ జావకాచి నది రుచిగ నుండును. మేహశాంతి, పైత్యశాంతి జేయును. దాహము, తాపము, శోష నణచును. మూత్రిముగావించును, బలముజేయును. జ్వరపడి పథ్యముయిచ్చుటకు అనగా అన్నము పెట్టుటకుముందు ఒకటి రెండు దినములు ఈ జావ యిచ్చిన తేలికగ జీర్ణమై ఆరోగ్యము నిచ్చును.

బిరుసయిన అన్నము:—**Imperfectly boiled rice.** మూత్రపురీష ములను బంధించును. అరుగకుండ నుండును. రోగమును, ఆమవికార మును గలుగజేయును. నీరసమును దెచ్చును. దీనికి విరుగుళ్ళు అన్నము చూడుడు.

బిలంబికాయలు:—విళంబికాయలు చూడుడు.

బీజపత్రముఅను చెట్టు:—**Kalanchoe laciniata, Cotyledon laciniata.** సం*: హేమసాగర. హిం* హేమ్‌సాగర్. దీనిని పత్ర బీజమన, గాయపాకు చెట్టని, తురకములో జక్మేహయాతని పేర్లు గలవు. దీనిఆకులమీద మొక్కలు మొలచును. ఆకుల రసము చలువజేయును. దేహపుష్టినిచ్చును. దీని ఆకులు పచ్చడిచేసిగాని పప్పులోవేసి వండిగాని పుచ్చుకొనిన మూలవ్యాధి బాధ నణచును,

మేహశాంతి, పైత్యశాంతి జేయును. దీని ఆకురసముగాని నూరిన ముద్దగాని గాయములను, తేలువిషమును మాన్పును. ఆకు కాడలు నూరికట్టిన వ్రణములను, పుండ్లను మాన్పును. గాయమును త్వరగ కలుసుకొని పుండుగాకుండ మాన్పును. వాపుతీయును. ఇరుకునొప్పులను హరించును.

బీరకాయ:—Luffa acutangula. Eng. Sharp angled cucumber. సం॥ కోశాతకీ, హేమపుష్పికా, ధామార్గవః. హిం॥ తోరయిా. దీని కూర రుచిగ నుండును; చలువజేసి నీరు పట్టును; వాతపైత్యములను శమింపజేయును; పొట్టను మృదువు పరచును; తేలిక నిచ్చును; జఠరపుష్టిని, పుంస్త్వమును ఇచ్చును; కుష్ఠరోగముల నన్నిటిని జయించును; కుష్ఠు, మేహము, క్షయ, శ్వాస, కాస, అరుచి, సెగరోగము, శ్లేష్మరోగము, కాకజ్వరము వీనికి మేలుజేయును; కొద్దిగ కాకజేయును; దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 మాంసము, 3 గసగసాల (Spices). ఇది అన్ని రోగములకు పథ్యముగనుండును. బీరకాయలో అనేక భేదములున్ననూ గుణములో సామాన్యముగా సమానముగా నుండును.

బీరకాయపచ్చడి—Pickle of do. స్వాదుగ నుండును; కఫమును హరించును; అరుచిని బోగొట్టును; జఠరదీప్తినిచ్చును; వేడిజేయును.

బీరకాయపొట్టు:—Dried scrapings of do. ఎండించి నేతిలో వేయించినది రుచిగ నుండును. తేలికగ జీర్ణమగును. పథ్యమైనది.

బీరాకు:—Leaves of do. దీనిరసము లేక కషాయము వేడిజేసి నీరు పట్టును; శ్లేష్మమును పండించును; హరించును; ఉబ్బును బోగొట్టును; చెడురక్తమును తీసివేయును; పైత్యమును హరించును. రసపు మోతాదు 1 మొదలు 3 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

బుగ్గనీరు:— Spring water లేక చలమనీరు నిర్మలముగా లఘువుగా రుచిగా, చల్లగా నుండును; త్రిదోషహరమైనది; పైత్యశాంతి, మేహశాంతి జేయును; అగ్నిదీప్తినిచ్చును; ఆరోగ్యమైనది.

బుడమకాయ :— Bryonia callosa-green fruit of. చేదుగ నుండును; జఠరాగ్ని నిచ్చును; పైత్యము, వాతము, మూలవ్యాధి, శూల, ఉదావర్తము, మూత్రకృచ్ఛ్రము, గుల్మ, మేహము వీని నణచును; మలమూత్రములను గావించును; పథ్యమైనది; లేతకాయ చేదుగనుండి పైత్యమును హరించును. ముదురుకాయ చేదుగ పుల్లగనుండి రుచి బుట్టించును; పైత్యము జేయును. పండుకాయ మేహశాంతి జేయును. మరియు పచ్చికాయలను ముక్కలుకోసి ఆముదమువేసి యుడికించి ఆ యాముదమును లోపలికిచ్చిన క్రిములు హరించును; విరేచనము గావించును. ఈ కాయలలో కొన్ని పండి నవి తియ్యగనుండును. వానికిన్ని పైగుణములే కలిగియుండును. పచ్చికాయలను ముక్కలుకోసి తరగుచేయుదురు. నేతిలోగాని, నూనెలో వేయించుకుని భోజనముతో తినిన పైరోగులకు పథ్యముగ నుండును. మోతాదు రెండుమూడు తులములయెత్తు. ఆ యాముదమును గొప్ప మోతాదుగా గుర్రములకుపోసిన వాని కడుపునొప్పి మొదలగు కడుపులోని వ్యాధులు నివారణమగును. రుచిబుట్టించును; లఘువుగ నుండును.

బుడమతీగ:— Bryonia callosa. Pubescent cucumis. సం॥ చిర్భిట, గోరక్షకర్కటీ. హిం॥ కచరియా. దీని వేరురసము లేక సమూలరసము లేక కషాయము చేదు, వగరు రుచులు గలిగి యుండును. శ్వాస, గుల్మ, ప్లీహ, వ్రణము, ఉదరము, కాస మొదలగు రోగముల బోగొట్టును. రసముయొక్క మోతాదు పూటకు 2-8 తులములయెత్తు. కషాయపు మోతాదు 2క మొదలు

5 తులములమెత్తు. ఆకు నూరికట్టిన వ్రణములు మానును.

బుడనువరుగు:—Dried bits of do. బుడమకాయలు ముక్కలుగా చేసి ఎండించినవి నేతిలో వేయించి పుచ్చుకొనిన జఠరదీప్తినిచ్చును, వేడిజేయును. తేలికగ జీర్ణమగును. రుచిబుట్టించును. జీర్ణముగావించును. వాత శ్లేష్మ రోగములకు పథ్యమునకు నుపయోగించును. నూనెలో వేయించి పుచ్చుకొనిన అధిక జలపాన దోషమును హరించును.

బుడమలను ధాన్యములు:— A sort of paddy. వీని యన్నము యెఱ్ఱగా నుండును. మిక్కిలి రుచిగానుండును. ఆలశ్యముగ జీర్ణమగును. రక్తపైత్యము, దాహము, మేదోరోగము, త్రిదోషములను హరించును; పాతగిల్లిన తరువాత నుపయోగించవలెను; పథ్యకరము. మరియు ధాన్యములు చూడుడు. జిలమలను ధాన్యముకూడ యివే గుణము మెట్టపంట యగుటవలన మంచివి.

బుడ్డకాకర చెట్టు:— A species of heart pea. సం॥ సూక్ష్మమూలా, వల్లికాప్రియా. దీని వేరు లేక సమూలకషాయము లేక ఆకురసము జిగటగ నుండును; రక్తపైత్యము, మూత్రదోషము, కామిల, క్షయ వీనినణచును; విరేచనము జేయును. రసపుమోతాదు 1-2 తులములు. కషాయపు మోతాదు 2½ మొ॥ 5 తు॥ మెత్తువరకు. దీని ఆకు నూరి కట్టిన వ్రణములు మానును. దీని ఆకు రసములో ఆముదమువేసి కాచి లోపలికిచ్చినను, పైన మర్దన చేసినను వాత మేహవాతపు నొప్పులు, నడుమునొప్పి నయమగును. దీని సమూలరసమును ఆముదములో లేక నూనెలో పోసి కాచి దేహమంతట బూసిన పైత్యసంబంధమగు దద్దుర్లు మొదలైనవిమానును సమూలమును నీళ్ళతోనూరి పట్టించిన వాత మేహవాతపు నొప్పులు కాళ్ళు చేతుల బిరుసుతనము (Stiffness) నయమగును. వీని

ఆకులు, బెల్లము, ఆముదములో వేసి కాచి ఆయాకులను కండ్ల మీద వేసి కట్టినను ఆ యాముదము కండ్లలో వేసినను కండ్లకలకలు ఎరుపులు నయమగును. సమూలము పాలలో ఊరనిచ్చి తీసికట్టిన వాపు తీయును; కఠినమగు గడ్డలు, మేహపుగడ్డలు వీని మంటలు, పోటు అణచును; మెత్తబడును; పగులును.

బుర్రగుంజు:—Pulp in a palmyra nut. తాటి టెంకలోని గుంజు మధురముగ నుండును; వాతపైత్యమును, మేహమును, పైత్యమును బోగొట్టును; మూత్రము గావించును; రక్తపైత్యము నణచును; వీర్యపుష్టి, చలువ, గురుత్వము, శ్లేష్మము జేయును. దీనికి విరుగుడు బియ్యపు కడుగు.

బుర్రబచ్చలి:—Cissus sitosa. Vitis. S. హిం* హర్వాల్. దీని ఆకులు దళసరిగ, కొద్ది పులుపు, కారముగ నుండును. వీనికి ఆముదముపూసి వెచ్చజేసి గడ్డలకు వేసి కట్టిన అవి పక్వమై త్వరగా పగులును. దీని దుంపను ముక్కలుగ కోసి యెండించి చూర్ణించి ఆ చూర్ణము 2-3 అణాలయెత్తు పంచదార కొద్దిగ గలిపి పుచ్చుకొనిన మూలవ్యాధి శమించును.

బూడిదగుమ్మడికాయ:—enincasa cerifera, Cucurbita pepo. Eng. White gourd melon-ash colored gourd. సం* కూష్మాండకీ, బృహత్ఫలా, పుష్పఫలీ. హిం* పేఠా, కుంహడా. చలువజేసి నీరుపెట్టును; మూత్రము గావించును; పొట్టను మృదువు పరచును; పాండురోగమును, జ్వరమును పోగొట్టును; మంచి రక్తమును బుట్టించును; కార్జము (Liver) లో, కడుపులో నుండు వేడి నణచును, విదాహమును కట్టును; దేహపుష్టి నిచ్చును; మేహ, శాకశరీరుల కనుకూలముగ నుండును, శీతది ఉప్పుగ నుండును; పొత్తికడుపును శుద్ధిపరచును; వీర్యపుష్టి,

బలము జేయును, కఫము, పైత్యము, మంధాగ్ని, గ్రహణి, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి, అతిమూత్రము, క్రిమిరోగము, ప్రమేహము, మేహపైత్యము వీనిని జయించును; దీనితో కాచిన నీళ్ళు ఆవిరిపట్టిన సవాయి పుండ్లు నయమగును, ముదిరినకాయ గుంజురసము విరేచనకారి; తత్వమును మార్చును; విదాహము కట్టును; దేహపుష్టినిచ్చును; దీని మురబ్బా త్వరగ జీర్ణమగును; క్షయరోగికి ఆహారముగ నిచ్చిన బాగుగ పనిజేయును. దీని గుంజు రసముగాని, పోతుతాడికల్లుగాని 10 తులముల యెత్తులో పసుపు గుండ 100 గోధుమగింజల యెత్తు. ఎరడాబియ్యపు తవుడు 100 గోధుమగింజలయెత్తు గలిపి ఈ చొప్పున రేపు మాపు ౬-6 దినము లిచ్చిన అతిమూత్రము కట్టును. పథ్యము ఇగురుకూర అన్నము. దీని గుంజు రసము నిచ్చిన రసము (Mercury) ఒంట జీర్ణించినవారికి మేలుజేయును. దీనికూర గురుత్వము, అగ్నిమాంద్యము జేయును. దీనికి విరుగుళ్ళు 1 జీలకర్ర, 2 పుదీనా, 3 లవంగాలు, 4 జీర్ణౌషధ ములు. దీని ముక్కలతో పులుసుగాని, చల్లపులుసుగాని వండి పుచ్చుకొనిన, రుచిగనుండి మేహశాంతి, పైత్యశాంతి జేయును. ఈపండిన కాయలతో కూష్మాండ లేహ్యము హల్వా, మురబ్బాలు చేయుదురు. అవి మిక్కిలి మేహశాంతి, పైత్యశాంతిగా ఆరోగ్య ముగా నుండును. క్షయాది రోగులకు అనుకూలముగా నుండును.

బూడిదగుమ్మడి వడియాలు :— **Dried cakes of do.** బూడిద గుమ్మడికాయ పెసరపప్పు లేక మినపప్పు లేక ఉలవపప్పుతో చేసి నవి రుచి బుట్టించును; కొద్దిగ పైత్యమును, వాతమును, కార్శ్య రోగమును అణచును; మూత్రమును తక్కువపరచును; వీర్యపుష్టి, బలము, కాక జేయును. గురుత్వముగ నుండును. దీనికి విరుగుడు ఉప్పువేసిన కలి.

బూరుగచెట్టు:— Bombax malabaricum. B. Heppaphylla, Eng. Silk cotton tree. సం* శాల్మలీ, మోచ. హిం* శేమల్. ఇది ముండ్లుగలదనది, ముండ్లులేనిది అని రెండువిధములు. ఇందులో మొదటిది శ్రేష్ఠము. మరియు తెల్లని పువ్వులుగలది, ఎర్రనిపువ్వులుగలది అని రెండు విధములు; ఇందులో మొదటిది శ్రేష్ఠము. వీని చెక్కరసము చిక్కగనుండును; వేడిజేసి నీరుపెట్టును; లేక ఆర్చును. చెక్కరసము లేక కషాయము కొద్ది వగరు, తీపి రుచులు గలిగియుండును; చలవ కొద్దిగ పైత్యము జేయును, రక్తమిశ్రమయి పడు కఫరోగము, క్షయ, శ్లేష్మము, జ్వరము, ఉబ్బు, విసర్పి, రక్తపైత్యము, నెత్తురుగడ్డలు, గజ్జి, అతిమూత్రరోగము, కుష్ఠము వీనిని పోగొట్టును; విరేచనబద్ధము జేయును; మూత్రము గావించును; శుక్రవృద్ధి నిచ్చును; దేహపుష్టి జేయును. (పువ్వులు పూయకుండనుండి గుప్పెడులావుగల) లేతచెట్టుయొక్క వేరును తీసి కర్రకత్తితో ముక్కలుజేసి నీడను ఎండించి గంధము తీసి బిళ్ళచేసి ఆరనిచ్చి దీనికి సమముగ పటికపంచదార కలిపి చూర్ణముజేసి అది ప్రతిదినము 6 అణాలయెత్తు మొదలుకొని 12 అణాల యెత్తువరకు 40 దినములు పుచ్చుకొనిన అద్భుతముగ ధాతుపుష్టి జేయును; నిశ్శక్తి నణచును; పైత్యవిరేచనములు, రక్తవిరేచనములు కట్టును; దేహమున మంటలు, ఇంద్రియము మూత్రమువెంట పడుట నిద్రలో స్ఖలనము వీనిని ఆశ్చర్యముగ నివృత్తిజేయును.

బూరుగనీళ్ళు:—Juice of the root of do మేడిచెట్టు వేరునుండి నీళ్ళు తీసినటుల ఈచెట్టు వేరునుండి తీసిన నీరు సర్పి, వాపు, రక్తకుసుమ, రక్తపైత్యము, రక్తదోషము, రక్తకాస వీనిని పోగొట్టును; వీర్యవృద్ధి, దేహపుష్టి నిచ్చును; మూత్రమును జారీచేయును; వాతము, గురుత్వము జేయును.

బూరుగదూదిపరుపు:—Bed & pillows stuffed with the cotton of do. మృదువుగ నుండును; కఫవాతములను శమింప జేయును; నిద్రసౌఖ్యము నిచ్చును; వీర్యవృద్ధి జేయును; అన్నికాలముల యందనుకూలముగ నుండును.

బూరుగ పువ్వు:—Flowers of do. వగరుగ, తియ్యగ, శీతలముగ, మనోహరముగ నుండును; కఫము, రక్తపైత్యములను బోగొట్టును; మేహశాంతి జేయును; గ్రహణిని కట్టును. ప్రదరరోగములను హరించును.

బూరుగ బంక:—Gum of do. సం॥ మోచరస, శాల్మలీవేష్టక, మోచనిర్యాస. హిం॥ మోచరస్. వగరుగ నుండును; మలమును బంధించును; గ్రహణి, రక్తగ్రహణి, అతిసారము, కుసుమరోగమును గట్టును; వీర్యవృద్ధి స్తంభన జేయును; గర్భమును నిలుపును; వాతము, రక్తదోషము, పిత్తదాహము వీనిని శమింపజేయును; ఒక మాసము దీనిని సేవించిన పాదరస దోషములను హరించును. 2-3 అణాలయెత్తు.

బూరెలు, పూర్ణపుబూరెలు:—A sort of cakes. రుచిగ, గురుత్వముగ నుండును; శుక్రవృద్ధిని, పుష్టినియిచ్చును; శ్లేష్మము జేయును, దీనికి విరుగుళ్ళు పిండివంటలు చూడుడు.

బెండకాయ:—Abelmoschus esculentus, Hibiscus E. Eng. The edible hibiscus, Okra. సం॥ భిండ, భిండీతక, చతుష్పద. హిం॥ భిండీ. జిగటగ కొద్ది తియ్యగ నుండును; నాభి శీతలించును; కడుపునొప్పి బుట్టించును; చలువ, వాతము, కఫమును బెంచును; మేహశాంతిజేయును; బలము, వీర్యవృద్ధిజేయును; ప్రేగులు అరియుంకుటను పోగొట్టును; శాకశరీరుల కనుకూలముగ నుండును; వాత, కఫ శరీరులకు జబ్బుచేయును. దీనికి విరుగుళ్ళు 1 జీలకర్ర,

2 పుల్లమజ్జిగ, 3 నీళ్ళతోగాని, పులిమజ్జిగతోగాని ఉడకబెట్టి పారవంచి పొంగచడము, మిక్కిలి లేతకాయలు 1 గాని, 2 గాని ఉదయపు పూటలను 10 లేక 15 దినములు అనుదినము పుచ్చుకొనిన యింద్రియనష్టము కట్టును.

బెగ్గురుపక్షి:—Cyrus or indian crane. అనగా సారసపక్షి. దీని మాంసము రుచిగ నుండును; చలువజేయును; పైత్యమునణచును.

బెల్లపు సారాయి:— Jaggery liquor or rum. రమ్ముసారాయి చూడుడు.

బెల్లము:—Jaggery. సం* గుడ, ఇక్షుసార. హిం* గూడ్. జ్వరము శూల, ఉదరరోగము, వాతము వీని బోగొట్టును; కడుపులో పురుగులు బుట్టించును; బలముజేయును; ఒంటినీరును దీయును. బాలింతలకు, మశూచికము పడినవారికి, గాయము తగిలినవారికి పథ్యముగ నుండును.

స్త్రీసాంగత్యము చేసినతోడనే సుమారుతులమెత్తు బెల్లము నమిలి మ్రింగిన నీరసముండదు. క్రొత్తబెల్లము దోషయుక్తముగ నుండును; జఠరదీప్తినిచ్చును.

ప్రాతబెల్లము శ్లేష్మము; సర్వదోషములను, జ్వరమును, తాపమును బోగొట్టును; రుచిబుట్టించును; మూత్రవిసర్జన గావించును; జఠరదీప్తి నిచ్చును; పాండువు, ప్రమేహము వీనినణచును; శ్రమను బోగొట్టును; పథ్యమైనది. బాలింతలకుకూడ నుపయోగించును.

కరుగుడుబెల్లము క్షయను బుట్టించును; గురుత్వము, విరేచనబద్ధము జేయును; మూత్రముగావించును; బెల్లముయొక్క అజీర్ణమునకు విరుగుళ్ళు శొంఠి, బెల్లపు పానకము కొద్దిగ మిరియాలపొడి గలిపి పుచ్చుకొనిన వడదెబ్బ తగ్గును. విదాహము కట్టును. గుండెదడ నాపును. చలువచేయును. నిద్రదెచ్చును. కడుపులో మంటను

శమింపజేయును. బెల్లము పాతది పథ్యముగను, క్రొత్తది అపథ్యముగా నుండును.

బేడిసచేపలు:—Silver fish. వీనికూర రుచిగ నుండును; వాతమును; కఫమును హరించును; పథ్యమైనది.

బేదానాగింజలు:—Quince seed. వీని శీతలక కషాయముగాని, కషాయముగాని, చూర్ణముగాని, వగరుగ నుండును, మేహశాంతి జేయును; సెగరోగమును, గ్రహణిని శమింపజేయును; పొట్టకు బలముజేయును; నోటిపూత, పొక్కులు నిమ్మళించును. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు; చూర్ణపు మోతాదు పూటకు అణాయెత్తు మొదలు పావలా యెత్తు వరకు. దీని గింజలు నీళ్ళలో నానబెట్టి కొద్దిగ పంచదార గలిపి పుచ్చుకొనిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును.

బొంతఅరటిపండ్లు:—A kind of plantains. పైత్యశాంతి, మేహశాంతి, శుక్రవృద్ధి జేయును; రక్తపైత్యము, ప్రమేహము, రక్తదోషము, కుసుమరోగము, వీనినణచును; గురుత్వముగ నుండును.

బొంతచేప:—Mullet. దీని మాంసము రుచిగ నుండును; మిక్కిలి క్రొవ్వియుండును; శాక జేయును; వాతమును, చలువను అణచును; మేక మొదలగువాని మాంసములకంటె త్వరగ జీర్ణమగును; నేత్రరోగులకు పథ్యముగ నుండును; సుకుమారులకు ఇతర రోగులకు గురుత్వము జేయును; దురదలు పుట్టించును; పుంస్త్వమును తగ్గించును; ఈచేపల కూరయును పాలును భోజనకాలమున తరచు బుచ్చుకొనిన కుష్ఠురోగము బుట్టును, అపథ్యమైనది; దీనికి విరుగుళ్ళు చేపలు చూడుడు.

బొండుగపువ్వు :— Flowers of certain tree. సుగంధముగ నుండును; కఫమును, వాతమును హరించును.

బొక్కెన చెట్టు:—Lippia nodiflora. Commelyna Bengalensis. సం॥ జలపిప్పలి, తోయపిప్పలి. హిం॥ జలపీపల్. ఇది నీటిరేవోకలను లేచెడు చెట్టు. దీనినే నీరుపిప్పలి లేక నీటిపిప్పలి అనియుందురు. నేలప్రాకును; దీని చిన్నఆకులు గొట్టుగుండ్లుగ నుండును. దీని రసము లేక కషాయము వగరుగ, కారముగనుండును; కాక చేయును; వాతమును, క్రిమిరోగమును హరించును; బురదరక్తమును జారీచేయును; పామువిషమును హరించును; కడుపునొప్పి మొదలగు ననేక కుక్షి వ్యాధులను పోగొట్టును. దీని ఆకులు వెచ్చజేసి చేసిన తేలికకషాయ మిచ్చిన బిడ్డల అజీర్ణమును గొట్టును; ప్రసవస్త్రీల మైలరక్తమును వెడలించును. దీని మోతాదు పూటకు 2-3 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యవగును. మరియు వీని సమూలమును జటామాంసితో కషాయము కాచి యిచ్చిన ఉదర రోగము నివృత్తించును; దేహములోని మలములను వెడలించును. ఉదరరోగమునకు దీని ఆకును కడుపునవేసి కట్టిన నయమగును. ఈ ఆకును నూరి గాయములకు వేసిన రక్త ప్రవాహము కట్టును; గాయమును మాన్పును; ఇతర పుండ్లను మాన్పును; దీని ఆకును ఆముదముతో వెచ్చజేసి కట్టుకట్టిన వాతపునొప్పులు, కవుసదెబ్బలు, వాపులతో కూడిన ఇతర నొప్పులు, గడ్డలు హరించును. దీని ఆకును తలకు కట్టిన సన్నిపాతము (Delirium) నివారణ మగును. దీని ఆకు వెచ్చజేసి కట్టిన దుష్టరక్తమును విరుచును. నేత్రవాతమును, వాపును, నొప్పిని అణచును. దీని పసరు చెవిలో బోసిన చెముడును పోగొట్టును. లోపలకిచ్చిన కఫము, విషవేగము, ఉబ్బు వీనిని బోగొట్టును. దీని ఆకుకూర వేడిచేయును. శ్లేష్మమును హరించును, తేలికగ నుండును. జఠరదీప్తి నిచ్చును.

బొగ్గులు:—Charcoal. ఇవి నీటిలోని మైలను, కుళ్ళిపోయిన మాంసము మొదలగువాని దుర్గంధమును తీసివేయును. వీని చూర్ణమును వరిపిండి లేక గోధుమపిండి నీళ్ళతో ఉడికించి అందులో అధికభాగముగ గలిపి కట్టుకట్టిన వాపులు, వ్రణములు మాన్పును. వాని దుర్గంధమును, మైలను తీసివేయును. జావ లేక గంజిలో వీని చూర్ణము కొద్దిగ గలిపి త్రాగించిన నోటివెంట వచ్చెడు దుర్గంధమును, అగ్నిమాంద్యమును (Dyspepsia) పోగొట్టును.

బొడ్డచెట్టు:—Fig tree. మేడిచెట్టు చూడుడు.

బొడ్డుపావిలకూర:—పెద్దపావిల చూడుడు.

బొడ్డుమల్లె:—Double jasmine. మల్లెపువ్వులు చూడుడు.

బొద్దితీగె:— Cissampelos Pareira. Osyris pelteta. సం॥ అంబష్ఠా. హిం॥ మాయి, మాయిచూ. ఇది తీగెజాతును. దీని ఆకులు గుండ్రముగ, వెడల్పుగ, దళసరిగ వుండి బూడిదపూసినట్లుండును. దీనివేరు చేదుగ, సువాసనగ నుండును; దీని రసము లేక కషాయము లేక పాకము (Syrup) పొట్టకు బలముజేయును; పొట్టలోని నొప్పుల నణచును; కాకజేయును; పైత్యమును, వాతమును, కఫమును అణచును; పురాణవిరేచన జాడ్యముల కట్టును; మూత్రకృచ్ఛ్రము, ఇతర మూత్రరోగములు, క్షయ, గురదాల (Kidneys) మూత్రపుసంచి (Bladder) వీనిపుండ్లు (Ulcers) పాండురోగము, విషములు వీనినినివారించును. ఉబ్బసము (Asthma) ను పోగొట్టును. దీని ఆకు మేహశాంతిజేయును. దీనిని నూరికట్టిన క్రొత్తగాయములు మానును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. దీని ఆకుకూర త్రిదోషహరమైనది. విరేచనబద్ధము జేయును. దీనిని చిరిబొద్ది అనియు నందురు.

బొప్పాయిచెట్టు:—మదనానబచెట్టు చూడుడు.

బొప్పాయిపండు:—మదనానబపండు చూడుడు.

బొబ్బర్లు:—Dolichos catiang. సం॥ రాజమాష, నృపమాషః. హిం॥లోబియా; కమ్మగ, రుచిగనుండును. వేడిజేసి చలువజేయును. గుండెలను మృదువుపరచును. పురుషులకు ఇంద్రియమును, స్త్రీలకు పాలును కలుగజేయును. మూత్రమును, విరేచనమును గావించును. దేహపుష్టి నిచ్చును. రజోరక్తమును శుభ్రపరచును. గురదాల (Kidneys) నొప్పిని, అశ్మరి రోగమును పోగొట్టును. బుద్ధిని జెరచును. వికారమును బుట్టించును. అపానవాయువును ఎక్కువజేయును. మేహపైత్యమును, రక్తపైత్యమును, శ్లేష్మపైత్యమును చేయును. గురుత్వముగ నుండును. చెడురక్తమును బుట్టించును. మలమును విస్తరింపజేయును. దీనికివిరుగుళ్ళు 1 పులుసు, 2 దాల్చిని చెక్క, 3 శొంఠి, 4 జీలకర్ర, 5 ఉప్పు, 6 జీర్ణౌషధములు.

బొమ్మచెముడు:— కోలజెముడు చూడుడు.

బొమ్మిడాలు అను చేపలు:—Tobaccopipe fish. చమురు గలిగి రుచిగ నుండును. వాతమును, కఫమును గొట్టును, లఘువుగ జీర్ణమగును. జ్వరమును, పైత్యమును బోగొట్టును.

బోడతరము పెద్దబోడతరము:—Sphoranthus hirtus, S Indicus. Indian globe thist. సం॥ ముండీ, శ్రావణి, భిక్షు. హిం॥ ముండీ. దీనిని బోడసరమని యందురు. దీనివేళ్ళు, కాడ, ఆకు పువ్వు, వీనిరసము లేక కషాయము లేక చూర్ణము చేదుగ, కొద్ది తీపిగ నుండును; తేలికనిచ్చును. వేడిచేసి నీరుపెట్టును లేక చలువ నిచ్చును. వీర్యవృద్ధి జేయును. జ్వరము, రక్తవాతము, అనులోమ వాతము, ఉన్మాదము, అపస్మారము, అంతర్వృద్ధి, అండవృద్ధి, భ్రమ, మేహము, కుష్ఠు, శూల, కఫము, దగ్గు,క్షయ, గళరోగము,

గుల్మము, మూలవ్యాధి వీనిని హరించును. శ్లీపదమను ఏనుగుకాలు రోగమును మాన్పును. వాచాలత్వము, కాయసిద్ధి గలుగఁజేయును. జడత్వమును, ముదిమిని బోగొట్టును. హృదయమునకు, మెదటికి, నల్లదబ్బకు (Spleen) ప్రాణమునకు, పొట్టకు బలము జేయును. దేహములోని దుష్టద్రవకూటమిని విడగొట్టును. కరగించును. శుభ్రపరచును. మనోచంచలతను, భయమును, ఆందోళనమును పోగొట్టును. కామిర్లు, ద్వంద్వరోగమును, మూత్రపుచుకుకు వీని నణచును. దేహములో పుట్టు అన్ని వ్రణములను పోగొట్టును. దీనిని పుచ్చుకొను క్రమము. దీని సమూలము నీటిలో ఊరబెట్టి సారాయి వలెనే అరకుతీసి పూటకు మూడు. నాలుగు తులముల యెత్తు చొప్పున పుచ్చుకొనవచ్చును లేదా దీని సమూలమును నీడను ఎండించి చూర్ణముచేసి సమముగ పంచదారగలిపి ఉదయపు పూటలను పూటకు 2 అణాలయెత్తు మొదలు 8 అణాలయెత్తువరకు క్రమక్రమముగ హెచ్చించి క్రమేణా 2 అణాలవరకు తగ్గించి పుచ్చుకొవలెను. 20, 30 లేక 40 దినములు పుచ్చుకొనవలెను. పైన చెప్పిన గుణము లిచ్చును. మరియు దీని సమూలముయొక్క పసరుతో నాల్గవవంతు నువ్వులనూనె బోసి తైలపక్వముగ గాచి. ప్రతి ఉదయపు పూటకు అర్ధరూపాయి యెత్తుచొప్పున 41 దినములు పుచ్చుకొనిన పుంస్త్వమును మిక్కిలి హెచ్చించును. ఇది పుచ్చుకొను దినములలో పులుసు, మజ్జిగ మొదలగు చలువ పదార్థములు మిక్కిలి చల్లనినీళ్ళు, మిక్కిలి వేడినీళ్ళు, అమిత భోజనము, పరగెత్తడము, అతివ్యాయామము, కోపము, దుఃఖము, స్త్రీ సాంగత్యము, శిరస్నానము మానవలెను. సగము కాచిన నీళ్ళు పుచ్చుకొనవలెను. ఇది ఫిరంగి చెక్కతో సమానమైనది. దేహమును గాగుచేయుటకు దీనికంటె మంచి వస్తువు వదియును లేదు. సవాయి

మొదలగు సమస్త సుఖవ్యాధులయందు బాగుగపనిజేయును. దీని విత్తనముల చూర్ణము క్రిమిహరమైనది. వేరుచూర్ణము పొట్టకు బలము జేయును. దీని వేరుచెక్క పెరుగుతో నూరి ఆసవమునకు వేసికట్టిన మూలవ్యాధి బాధ నివారణమగును. దీని ఆకునూరి కట్టిన చనుకుదురు అన్ని వ్రణములు మానును. విత్తులు, వేరు వీని చూర్ణపు మోతాదు పూటకు 2-3 అణాలయెత్తు చొప్పున దినము నకు రెండుపూటల నియ్యనగును. పెద్దబోడతరమునకును ఇవియే గుణములు. దీని ఆకుకూర వండి పుచ్చుకొనిన పైనజెప్పిన రోగము లలో అనుకూలముగ నుండును.

బోడిఆవుపాలు:—Milk of an hornless cow. ఆవుపాలుచూడుడు.

బోదారుశృంగి:—మురదారుశింగు చూడుడు.

బోళము:—బాలింతబోలు చూడుడు.

బ్రహ్మచెముడు:—కత్తిమందుచెట్టు చూడుడు.

బ్రహ్మదండిచెట్టు:—Tricholapsis galaberrina. సం॥ బ్రహ్మదండి, కంటపత్రఫల. హిం॥ బ్రహ్మదండి, ఊంటూకటారా. ఇది వీటాలే చెడు చిన్నముండ్లచెట్టు. దీనికి బంతులు బంతులుగనుండి ముండ్లు గలిగియుండును. దీని ఆకులు లేక సమూలము వేడిజేయును. చేదుగా నుండును. దీని ఆకురసము, లేక కషాయము కఫము, పైత్యము, వాతము, శోథ, శూల, అజీర్ణము, మూత్రకృఛ్రము నశించును. రసపుమోతాదు 1-2 తులములు;కషాయపు మోతాదు 2 మొదలు 4 తులములవరకు. యీ చెట్టుకాల్చి చేసిన క్షారము కూడ పైరో గములను హరించును. మోతాదు 2 మొదలు 4 అణాలయెత్తువరకు.

బ్రహ్మమేడిచెట్టు :— Ficus hispida (A species of fig tree) సం॥ కాకోదుంబరికా, ఫల్గు. హిం॥ కఠూమల్, కఠ్‌గులార్.

దీనిని బొడ్డమేడి యని యందురు. దీని చెక్క, ఆకురసము కఫ పైత్యము, కుష్ఠు, వ్రణములు, రక్తపైత్యము, ఉబ్బు, పాండు రోగము వీనిని హరించును. దీని కాయలు లేక పండ్లరసమును తేనెతోగాని, పంచదారగాని కలిపి సేవించిన రక్తపైత్యమును (నోటివెంట, ముక్కువెంట, మూత్రమువెంట, గుదస్థానమువెంట రక్తముపడుట) కట్టును. రక్తపిత్తమునకు యుపయోగపడుఔషధము లకు అనుపానముగా నిచ్చిన శీఘ్రముగా గుణముజేయును. దీని ఆకులవిస్తరిలో భోజనముజేసిన మేహము, పైత్యమును హరించును.

బ్రాంది:— Brandy. దీనిని దేహదార్ఢ్యము మొదలగువానిని గమ నించి మితముగ పుచ్చుకొనిన మనోల్లాసము, పొట్టకు బలము వీని నిచ్చును; కాకచేయును; పురటాళ్ళకు, దేహశ్రమ, గాయము, దెబ్బలు తగిలినవారికి, బడలిక, వంటినొప్పులు తీయును. చెవిపోటు. నొప్పిగలవారి చెవిలోపోసిన నొప్పి నివృత్తించును; వాతము చేయ నియ్యదు. గుండెలనొప్పి, వాతపునొప్పి, పక్షవాతము మొదలగు నొప్పిగల లేక నరముల బలహీనతగల ప్రదేశమున పూసిన లేక మర్దనజేసిన నొప్పులు హరించును; నరములకు సత్తువ నిచ్చును; పన్నునొప్పి, చిగురువాపుగలవారు దీనిని నోటయుంచి పుక్కిలించిన నొప్పి నివారించును. కాలినచోట వేసిన పొక్కనియ్యక మంట (తాపము)ను నిమ్మళింపజేయును. అగ్నిమాంద్యము అజీర్ణమును పోగొట్టునుగాని అజీర్ణముగా నున్నప్పుడు దీనిని పుచ్చుకొని తిరిగి ఆహారము తినకూడదు. మితముగ బుచ్చుకొనిన వాతతత్వము గల వారికి మేలుజేయును; పైత్య మేహతత్వములు గలవారికి అంతగా మేలుజేయదు. విరేచనముల కట్టును. దీనికి విరుగుళ్ళు మద్యము చూడుడు.

—క—

# భ

భంగు:—Bhang. ఇది గంజాయితో జేయు మత్తుద్రవ్యము. గెంజాయి చూడుడు.

భద్రదేవదారు:—దేవదారు చూడుడు.

భద్రముస్తలు:—తుంగముస్తలు చూడుడు.

భారంగి:—గంటుభారంగి చూడుడు.

భారద్వాజపిట్ట:— King crow-flesh of. దీని మాంసము చిరి చేదుగ, రుచిగనుండును; వీర్యపుష్టి, బలము జేయును; కఫమును హరించును; రుచిబుట్టించును; దాహమును గలుగ జేయును.

భీమసేన కర్పూరము:—Dryobalanops aromatica. Eng. Bornes camphor. పచ్చకర్పూరము చూడుము.

భీర, మహాభీర:—Certain medicinal plants. ఈచెట్ల ఆకు, కాడ భస్మము జేసి నూనెలో కలిపి బూసిన చిడుము, గజ్జి, వ్రణములు వీనిని మాన్పును. వీని ఆకురసము పైత్యశాంతి జేయును. వీని ఆకును ఎండించి ధూపము వేసిన పిశాచబాధ నివర్తించును. ఆకు రసపు మోతాదు 3–4 తులములయెత్తు.

భుజపత్రిచెట్టు:—Betula bhojapathra. సం* భూర్జపత్ర, భూతఘ్న, లేఖ్యపత్ర, హిం* బోజ్‌పత్ర. దీనిని భూర్జవృక్షమని యందురు. దీని పట్టను వలచిన పొరలు పొరలుగా కాగితములవలె పలచగ వచ్చును. మరిన్ని యీ పలచని రేకులపైన పూర్వము గ్రంధములు వ్రాసియుండిరి. దీని ఆకులు అరటి ఆకులవలె యుండుటచేత వస్త్రములగ నుపయోగించియుండిరి. వీనిపై మంత్ర శాస్త్రజ్ఞులు యంత్రములను వ్రాసి గ్రహబాధల నివారించుచుందురు. ఇది కారము, వగరు రుచులు గలది; దీని ఆకుపట్ట లేక కషాయము రక్తపైత్య

మును, శ్లేష్మమును హరించును; మేహశాంతి జేయును. కర్ణరోగమును జయించును; దీని ఆకుల ధూపము గ్రహబాధల నివృత్తించును. కషాయపు మోతాదు పూటకు 2½-5 తులములయెత్తు.

భూమిచంపకము:—Kaempferia rotunda. సం॥ భూమిచంపక. హిం॥ భూయిచపక్. ఇది పసుపు లేక అల్లపుచెట్టు వంటిచెట్టు. దీని పువ్వులు ఊదాగ, తెల్లగ, సువాసనగ నుండును. దీని దుంప వ్రేలిలావుగ నుండును; అల్లపువాసన గలిగి కారముగ నుండును. దీని దుంపరసము పామువిషమును హరించును. దీని సమూలముగాని, దుంపగాని నూరి కట్టిన క్రొత్తగాయములు, వ్రణములు. వ్రణసంబంధమైన వాపులు, గవదలు, రక్తము పేరుకొనుట మొదలగునవి హరించును. పై ముద్దలు నూనెలో వేసి కాచిన తైలమునకున్నూ పై గుణములు గలిగియుండును. దీని కషాయముతో కాపడమిచ్చిననూ, కడుగుచుండిననూ పైన వ్రాసిన వానికి మేలుజేయును. దీనిచూర్ణమును లోపలికిచ్చిన రక్తము శుభ్రపరచి దేహములోపల పేరుకొన్న లేక ఘట్టిపడిన రక్తమును లేకకూడియున్న చీమును వెడలించును; వాపులను ఉదరరోగ సంబంధపు ఉబ్బును హరించును. చూర్ణపు మోతాదు 1 అణా మొదలు 2 అణాల యెత్తువరకు.

భూతపిల్లిగడ్డ:—The sac of a wild cat containing substance like musk. సం॥ పూతిగంధా, మార్జాలవృషణ. దీనిని పూతపిల్లిగెడ్డ అనియు, నందురు. సువాసన గలిగి యుండును; అతిసారము, దుర్గంధము, వాతము, శ్లేష్మము, శాపము, శ్లేష్మముచేత బుట్టిన తలనొప్పి వీనిని పోగొట్టును; వీర్యవృద్ధినిచ్చును. దీనిని చనుబాలతో అరుగదీసి చంటిపిల్లలకు పోసిన వాతము, దగ్గు, ఉబ్బస

దగ్గు, వగరుపుగలదగ్గు, శ్లేష్మము, జ్వరము, అజీర్ణమును హరించును. దీనిని వాసనచూచిన తలనొప్పి, శిరోవాతము, జలుబును హరింప జేయును. దీనిని దగ్గర యుంచుకొనిన అంటువ్యాధుల చేరనివ్వదు.

భూతాంకుశపు చెట్టు:—Nepeta malabarica. దీని ఆకు కొంచెము చేదు, సువాసన, వగరు గలిగియుండును; జీర్ణశక్తి నిచ్చును; పొట్టకు బలము జేయును. దీని ఆకు పసరుగాని, తేలిక కషాయముగాని బిడ్డల కడుపునొప్పి, అజీర్ణము, పండ్లు వచ్చునప్పుడు వచ్చు జ్వరము వీనిని పోగొట్టును. దీని వేరుయొక్క లేక సమూలముయొక్క కషాయము కుక్షిరోగములు, పురాణగ్రహణి, రక్తగ్రహణి, వరుస జ్వరము వీనిని పోగొట్టును. దీని ఆకుల తేలిక కషాయ మిచ్చిన తల నొప్పి హరించును; ఋతురక్తమును జారీచేయును; చలిజ్వరము వచ్చువారికి దీని సమూలపు తేలిక కషాయపు ఆవిరి పట్టిన చెమట అధికముగ పట్టును. ఆ తేలిక కషాయము పుచ్చుకొనుచుండిన చెమట పట్టుట అధికమగును; చలిజ్వరము నివృత్తించును. దీని సమూలమునుండి బట్టీతో తీసిన చమురు మర్దనచేసిన వాత, మేహ వాతపు నొప్పులు హరించును దీని సమూల కషాయముతో దేహము కడిగిన ఆమవాతపునొప్పులు హరించును. రసపు మోతాదు సుమారు 2 తులములయెత్తు, కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. తేలిక కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు.

భూతులసి:—A species of ocimum sanctum. ఇది తులసి యాకారముగనే యుండునుగాని, ఘాటైన వాసన గలిగియుండును. దీని ఆకుపసరు లేక సమూలపు కషాయము పైత్యము శాంతి జేయును; కారముగనుండును; కఫమును, క్రిమిదోషమును హరించును; అగ్ని దీప్తినిచ్చును. పసరు మోతాదు 2–3 తులములయెత్తు; కషాయపు

మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులములమెత్తువరకు. ఈ చెట్టును ఇంటిలో వ్రేలాడగట్టిన దోమలుండవు. దీని విత్తనములు కంటిలో నలుసుపడినప్పుడు వేసిన ఆనలుసు ఊడిపోవును.

భూశర్కరదుంప:—A sort of sweet root. ఇదితియ్యగనుండును, మేహశాంతి, దేహపుష్టి, వీర్యపుష్టి జేయును; శరీర తత్వమును మంచికి మార్చును. ఇందుచే రోగులకు దీని కషాయము అనుదినము ఆహారముగ (Diet) నిత్తురు. మోతాదు 6 మొదలు 20 తులముల మెత్తువరకు. దీనిని లేహ్యములలో నుపయోగింతురు.

భోజ్యమాంసము:—Mutton or flesh fit for consumption. నిరోగమయి, లేతిదయి, మృదువుగనున్న జంతువుల మాంసము శరీరపుష్టిని, సౌఖ్యమును ఇచ్చును.

—:o:—

# మ

మంకెనచెట్టు:—Pentapetes phoenicea. సం॥ బంధూక, బంధు జీవక, అర్కవల్లభ. హిం॥ గోజునియా, దుప్‌హరియా. దీని ఆకులు కోలగ, సన్నముగ నుండును; ఎర్రని చిన్నపువ్వులు బూయును. దీని కూర స్వాదుగ, చేదుగ, వెగటుగ నుండును; విరేచనబద్ధము జేయును; కఫవాతములను బోగొట్టును; శేలిక నిచ్చును. ఆకు నూరి కట్టిన గడ్డల పణచును; మృదువుపరచును; నొప్పితీయును. దీని విత్తులు మేహశాంతి, పైత్యశాంతి జేయును. వీని చూర్ణము నీళ్ళతో నిచ్చిన సెగరోగము నిమ్మళించును. మోతాదు బేడెత్తు. దీని పువ్వులు కఫమును, మలబద్ధమును జేయును; వాతపైత్యముల హరించును.

మంగచెట్టు:—**Randia dumetorum, Posqueria D. Eng. Emetic nut tree.** సం* పిండీతక, మదన. హిం* మైన్ ఫల్. వేరు లేక దీని మానుచెక్క లేక చెక్కచూర్ణము లోపలి కియ్యవగును; పైన పూయనగును; కారముగ, వగరు, చేదుగ నుండును; దురద, జ్వరము, వ్రణము, గుల్మము, విద్రధి యనగా నాభిలో బుట్టెడు వ్రణము, వాతము, ఉబ్బు, నీళ్ళవిరేచనములు, రక్తవిరేచనములు, పాండువు, కాస, శ్లేష్మరోగము, అతిశ్వాస, హృద్రోగము, పీనస, పడిసెము, అస్థిగతజ్వరము, పొత్తికడుపున బుట్టెడు రోగము వీనిని హరించును. దీని వేరుచెక్క నూరి తల రుద్దుకొనిన శిరోవాతములను హరించును; పేలుజచ్చును. మానుచెక్క నూరి పట్టువేసిన యెముకల నొప్పి, పోటు నిమ్మళించును; ఆవుపేడతో నూరి వుడికించి కట్టిన లేక పట్టువేసిన గాయపునొప్పి తీసివేయును. రసముయొక్క మోతాదు 1-2 తులములయెత్తు; చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు. దీని చెక్క, కాయల కషాయముతో వస్తికర్మకు నుపయోగకరముగ నుండును.

మంగకాయకూర:—**Curry of young fruit of do.** లేతకాయల కూర త్రిదోషహరమైనది; సర్వరోగములను బోగొట్టును; రుచి పుట్టించును; జఠరదీప్తిని, దేహపుష్టిని యిచ్చును; క్రిమిరోగమును, కఫవాతమును, కాస, శ్వాస, క్షయ వీని నణచును; గాయముల మాన్పును; దీని కాయలను మెత్తగానూరి (నీళ్ళతో) సవాయి మొదలగు రోగములచే శిశ్నము వాచియుండిన దానిని శీఘ్రముగ వాపును తగ్గించును. ఇట్లు 3-4 కట్లు వుదయ సాయంకాలముల యందు కట్టవలెను.

మంగకాయ పండు, యెండుది:—**Dried fruit of do.** దీని చూర్ణము వాంతిజేయును; విశారపెట్టును; శ్లేష్మమును వెడలించును; చెమట

బుట్టి చును; రక్తవిరేచనములు కట్టును; క్రిమిని జంపును; అన్నివిధ ములను యిపికాక్యానాతో సమాన గుణముగలది. మోతాదు వాంతిచేయుటకు 15 మొదలు 40 గోధుమగింజల యెత్తువరకు. రక్తవిరేచనములు కట్టుటకు 15 మొదలు 80 గోధుమగింజల యెత్తు వరకు; వికారపెట్టి శ్లేష్మము పడజేయుటకు, క్రిమి హరమునకు, చెమట పుట్టుటకు 5 మొదలు 10 గోధుమగింజల యెత్తువరకు. 2-3 కాయలు చిదుకకొట్టి 3-4 ఔన్సుల నీళ్ళలో పావుగంట నాన నిచ్చి బాగుగ పిసికి వడియకట్టి యిచ్చినను వాంతిచేయును; వేడి నీళ్ళు పుచ్చుకొనుచుండిన శీఘ్రముగ వాంతి చేయును. వాంతి చేయించుటకు వుపయోగించు వస్తువులలో మిక్కిలి సుకుమార మైనది. మంగకాయలోని గింజలను నీళ్ళతో నూరి చిక్కని రసము దీసి గిద్దెడు రసమును వుదయమున నిచ్చినవెంటనే 2-3 వాంతులై పక్వాశయమును, ఆమాశయమును శుభ్రపరచును. శ్లేష్మమును వెడలించును. జ్వరము తగ్గును. కాయలు నీళ్ళతోనూరి పట్టువేసిన వాత మేహవాతపునొప్పులు, గడ్డలు, గాయములు, చర్మరోగములు మానును, నరములకుజబ్బు; ఈడ్పుగుణములు కట్టును. దీని గింజను నీళ్ళతో నరగదీసి నేత్రములకు పెట్టిన సన్నిపాతదోషమును హరించును.

మంగుస్తానుకాయ దీని గింజలనూనె:— Garcinia mangostana. G. Purpurta. Eng. Red mango oil kokam. హిం॥ మంగుస్టీన్. యీ కాయలు దీని చెక్క లేత ఆకుల కషాయము గ్రహణీ విరేచనములు కట్టును, గుంట్రముగ నుండును. దీని తొక్క గుంజ తినినను దీని కషాయ మిచ్చినను అతిసార విరేచనములు, గ్రహణీ విరేచనములు కట్టును. పిల్లలకుకూడ నివ్వవచ్చును. యీ కాయ తొక్క నీళ్ళలో వేసి కాచి సగము యిగిరిన తరువాయిత వడియపోసి

దానితో సమభాగం పంచదారకలిపి తేనెపాకముగ (Syrup) కాచి యిచ్చినగ్రహణి, అతిసారము, జ్వరము నివారణమగును మోతాదు 2 మొదలు 3 తులముల యెత్తువరకు. దీనికాయను ముక్కలుగాచేసి పంచదార నద్దుకొని నమిలిమ్రింగిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. దీని గింజలనూనెను కోకం (Kokam butter) అందురు. యిది చలువ జేయును. విరేచనముద్వారా పైత్యమును వెడలించును. మృదువు పరచును. ఓడవాళ్ళకు వచ్చు స్కర్వీ (Scurvy) అను రోగమును పోగొట్టును. గ్రహణి, అతిసార విరేచనములమీద బాగా పని జేయును. మోతాదు 2 తులం పావుశేరు నీళ్ళలో కలిపి యివ్వవలెను.

మంచముమీద పరుండడము:— Sleeping on a cot. వాతము, చలువ వీనిబాధల నొందకుండజేయును; తేలికను, సౌఖ్యమును ఇచ్చును. ఆరోగ్యముగ నుండును.

మంచిగంధము:— Santalum album. Eng. Sandal wood. సం* చందన భోగవల్లభా, హరిచందన. హిం* చందన్. దీని శ్రీగంధమని, గంధపుచెట్టని, చందనపుచెట్టని, పసుపుపచ్చగా నుండుదానిని పీతచందనమని యందురు. దీని మాను లేక వేరుచెక్క (బెరడుగాను) ఉపయోగించును. ఆ చెక్క చూర్ణము లేక కషాయము వగరు, చేదు రుచులుగలది; చలువజేసి వేడిజేయును; మనోహరముగను, సువాసనగను ఉండును; కండ్లకు చలువజేయును; దుష్టరక్తమును హరించును; వీర్యవృద్ధి, కాంతి నిచ్చును; రక్తమును శుభ్రపరచును; వీర్యమునకు చలువజేయును; చెమట బుట్టించును, రక్తపైత్యము, కుసుమరోగము, తాపము, దాహము, జ్వరము, మేహజ్వరము, తీవ్రమగు తాపజ్వరము, అతిసారము, కఫము, అరుచి, మేహము, ప్రమేహము, కుష్టు, క్రిమిరోగము, అన్నివిషములు, శ్లేష్మము,

సుకదలు, పొక్కులు, విసర్పి, మదము, భ్రమ, ఉన్మాదము, అప స్మారము, జలుబు, క్షయ, రాజయక్ష్మ శ్వాస, కాస, పీనస, పాండురోగము, విద్రధియును నాభిలోనిపుండును, రక్తకాస, గంధర్వ రోగము, వాతము, పైత్యము, శ్రమ, చర్ది, ఎక్కిళ్ళు వీనిని హరిం చును; బలము జేయును; అధికముగను, వట్టిది పుచ్చుకొనిన పుంస్త్వ మును తగ్గించును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పటికి పంచదార, దీని చూర్ణమును నీళ్ళలోగలిపి యిచ్చిన తాపజ్వరము నయమగును; చెమటబుట్టించును. ఈచూర్ణమును ఆవుపాలతో నిచ్చినను, ప్రశస్త మైన చందినిఅత్తరు 5 మొ॥ 10 చుక్కలు చక్కెరకేళీ అరటి పండుతో పుచ్చుకొనినను సెగరోగము నివృత్తించును. లేతకొబ్బరి కాయ నీళ్ళలో దీని చూర్ణము గలిపి యిచ్చిన విదాహము కట్టును. వేసవికాలములో స్నానానంతరము ఈచూర్ణమువంటికిబూసికొనినను లేక గంధము బూసికొనినను చలువజేయును; అమితముగ చెమట బట్టకుండ జేయును; సుగంధముగ, మనోహరముగ నుండును. మంచి గంధములో పాకతికర్పూరము, కచ్చూరములు, కలబందరసము కలిపి పట్టువేసిన మేహవాతపు నొప్పులు నిమ్మళించును. మంచిగంధ ములో రసకర్పూరము గలిపిపూసిన పొక్కులు, గడ్డలుఅణగిపోవును. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. కషా యపు మోతాదు 2 మొదలు 5 తులముల యెత్తువరకు. దీనితో చందనాది చూర్ణము, చందనాది తైలము తయారుచేయుదురు. ఇది ప్రమేహము, శగరోగము, కుసుమరోగములు మొదలైన రోగ ములయందు మిక్కిలి వుపయోగకరమైనది. దీని గంధము సువాస నగా నుండి దుర్గంధము లేకుండ జేయును.

మంచినూతి నీళ్ళు:—బావినూతి నీళ్ళు చూడుడు.

మంచినూనె:—నూనె చూడుము.

మంచుగడ్డ దీని నీళ్ళు:—Ice & Ice water. చల్లగనుండును, చలువ చేసి వేడిచేయును. కాలేయమునకు (Liver), పొట్టకు బల మిచ్చును. జీర్ణశక్తి గలిగించును. మంచుగడ్డ ముక్కలు నోటిలో వేసుకొని చప్పరించుచుండిన వాంతి, వికారము, దాహము, చర్ది, నోటివెంట రక్తముపడుట కట్టును. మంచుగడ్డముక్కలు వేసవికాలములో షర్బతులు, సోడాలు, పానకములలో వేసి పుచ్చుకొనిన చల్లగ మనోహారముగా నుండును. నారింజ, నిమ్మ, బత్తాయి రసములలో వేసి పంచదారకలిపి పుచ్చుకొనిన దాహము కట్టును. మనస్సునకు హితవుగను, ప్రాణమునకు సంతుష్టిగా నుండును. జ్వరము హెచ్చుగా (High temparature) యున్నప్పుడు రబ్బరుసంచి (Ice bag) లో మంచుముక్కలువేసి తలమీదను. నొసలుమీదను పెట్టుచుండిన హెచ్చుజ్వరము (Temparature) తగ్గును. సన్నిపాత జ్వరమునందు పరాకుతగ్గించును. విస్తారము వేడివలన తలనొప్పి, తలపోటుగా యున్నప్పుడు మంచుగడ్డ ముక్కలు రబ్బరుసంచిలో వేసి తలమీదను, నొసటమీదను పెట్టుచుండిన నయమగును. మంచుగడ్డ ముక్కలు విస్తారము నోటిలో వేసుకొనుచుండిన, గొంతుకనొప్పి, దగ్గును కలుగజేయును. పండ్లకు జబ్బుచేయును. దీనికి విరుగుడు పటిక పంచదార తేనెగలిపిన నీరుల్లిపాయల రసము.

మంచునీళ్ళు:—Dew water. మిక్కిలి చల్లగ నుండును. శ్రమను శోషణచును. సన్నిపాతజ్వరమును, శ్వాస, కాస, మూర్ఛభ్రమము వీనిని పోగొట్టును. జఠరదీప్తి నణచును.

మంజిష్ట:—Rubia cordifolia. R. Manjista. Eng. Bengal or Indian madder root. సం॥ మంజిష్ఠా, జ్వరనాశనీ, రక్తాంగీ. హిం॥ మజీట్. దీని చూర్ణము లేక కషాయము కొద్దిగ చేదుగ,

వగరు, తీపిగ నుండును; కాక జేయును; కఫోద్రేకము, వ్రణము, జ్వరము, మేహము, మూలవ్యాధి, రక్తాతిసారము, విసర్పి, విష దోషము, నేత్రరోగము వీని నణచును; స్త్రీల యోని రోగములను పోగొట్టును. స్త్రీల ఋతురక్తమును, ప్రసవమైన స్త్రీల మైలరక్త మును వెడలించును; శుద్ధిపరచును; కంఠస్వరమును బాగుచేయును. శరీరకాంతి నిచ్చును. ఉదరము, కామిల, అతిమూత్రము, శిశువుల శ్లేష్మరోగము వీనిని హరించును. చూర్ణపు మోతాదు పూటకు 10 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 3 లేక 4 తులముల యెత్తుచొప్పున దినమునకు రెండు పూటల నియ్యనగును.

మండమను గంజి:—A sort of cunjee. ఒక భాగము బియ్యములో 14 భాగములు నీరుబోసి మెతుకులు లేనటుల ఉడికించినది మండ మని చెప్పబడును. ఇది త్రిదోషములను హరించును; అనులోమ వాతము, దాహము, ఆయాసము, దోషము వీని నణచును; జీర్ణము జేయును; ధాతువులకు బలమును, సౌమ్యతను, అగ్నిదీపమును, చెమ టను గలుగజేయును.

మందార చెట్టు:—Hibiscus rosa sinensis. Eng. China rose or Shoe-flower plant. సం॥ జపా, రుద్రపుష్ప, హిం॥ గుడ్ హాల్. దీనిని దాసానిచెట్టనియు నందురు. దీని ఆకులకు ఆముదము పూసి వెచ్చజేసి గడ్డలకు వేసిన మృదువుపరచును; అణగగొట్టును; నొప్పి తీయును. ఆకుల పసరు లోపలి కిచ్చిన మూత్రబద్ధమును, మూత్ర కృచ్ఛ్రమును పోగొట్టును; విరేచనము జేయును; దీనివేరు నూరి నువ్వులనూనె గలిపి యిచ్చిన స్త్రీల రక్తస్రావము కట్టును. మోతాదు గచ్చకాయంత; ఆకుపసరు మోతాదు 3-4 తులముల యెత్తు.

మందార పుష్పము:—Flowers of do. దీనిని దాసాని పుష్పమని, జపాపుష్పమని అందురు; వీని రేకులతో చేసిన తేలిక కషాయము గాని, పాకము (Syrup) గాని హృదయమునకు బలమిచ్చును; మృదువుపరచును; ఆప్యాయత నిచ్చును, తాపజ్వరములో నియ్య నగును; పైత్యశాంతి, మేహశాంతి జేయును; మూత్రపు మంట మూత్రకృచ్ఛ్రము వీనిని మేఢ్రము, యోని వీని మంటను, నొప్పిని, అణచును. ఆలివు ఆయిలు (Olive oil) లో గాని కొబ్బరినూనెలో గాని నూనెకు సమముగ పువ్వులరసము బోసి నీరిగుకువరకు గాచి తలకు పూసుకొనుచుండిన వెండ్రుక లెదుగును. ఈ పువ్వులు 2-3 నేతిలో వేయించి యిచ్చిన స్త్రీల ఋతురక్తస్రావము కట్టును. ఈ పువ్వులు ఒకటిగాని, రెండుగాని ఉదయపు పూటలను 5-6 దినములు తినిన కన్యలు ఋతుమతు లగుదురు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులములు యెత్తువరకు. దీని పువ్వులను నలిపి పేను కొరికినచోట దినమునకు రెండుమూడుమార్లు రుద్దుచుండిన అది మాని వెండ్రుకలు తిరిగివచ్చును.

మట్టగిడస:—The sucking fish. దీని మాంసము చమురుగలిగి రుచిగనుండును. తేలికగ జీర్ణమగును. వేడిజేయును. హృదయమునకు బలమిచ్చును. అరుచి, జ్వరము, ఉబ్బు, వీని నణచును. వీర్యమునకు వేడిబుట్టించును. వీర్యవృద్ధి బలము నిచ్చును. పథ్యమైనది.

మట్టితైలము:—Petroleum or rock oil. ఇది భూమిలోనుండి, రాళ్ళలోనుండి బయలుదేరును. మండునట్టి పదార్థము. దీనిని లోపల కిచ్చిన కాక జేయును; గురదాల (Kidneys) పైన పనిజేసి మూత్రమును అధికపరచును; ఉబ్బువ్యాధి (Beri-beri) ని పాగొట్టును, దీనిని లోపలికిచ్చి పైన పూయనగును. మోతాదు 30 చుక్కలు ఏదయినజిగురుగలవస్తువు(Mucilage) పైనవేసిగాని,పంచదారపైన

వేసిగాని యియ్యవగును. లోపల కిచ్చిన కడుపులోని నాడాపామును ఆంపును. వాతమును, శూలలను పోగొట్టును. మోతాదు 10 మొదలు 30 చుక్కలవరకు జిగురుగల పదార్థము (Mucilage) పైన వేసిగాని, పంచదారపైనగాని యియ్యవగును. పైన మర్దన జేసిన వాతపు, మహావాతపు నొప్పులు, మూర్ఛ, అపస్మారము (Hysteria), పక్షవాతము నివృత్తించును. దీనిని పైన పూసిన చర్మరోగములు, రసికారు పొక్కులు (Eczema), వ్రణములు, కుళ్ళు మురికివ్రణములు, రాచపుండ్లు మానును. దీనిని సబ్బులోగాని, నూనెలోగాని గ్లిసరైను (Glycerine) లో గాని, కలిపిగాని, వట్టిది గాని పైన పూయవగును.

మట్టుబచ్చలి:—బచ్చలి చూడుడు.

మడుగునీరు:—Pond water. చెరువు నీరు చూడుడు.

మడ్డిపాల:—తురుష్కము చూడుడు.

మణిశిల:—Realgar or red orpiment. సం* మనస్సిల, నైపాలీ, కునటీ. హిం* మనశిల్. చేదుగ, కారముగ నుండును; దీనిని లోపలికి పుచ్చుకొనుటకు శుద్ధిచేయవలెను; అనగా ముక్కలక్రింద కొట్టి గుడ్డ 4 మడతలువేసి అందులోవుంచి డోలాయంత్రమున సున్నపు నీటిలో ఒక ఝాము వండిన శుద్ధియగును. మోతాదు 1-8 గింజల యెత్తు. దీనిని పైన బూయుటవలన గజ్జిని, కురుపులను, దద్దురు రోగమును, బొట్టుంచుకొనెడుచోట బుట్టెడు చర్మరోగములను హరించును; లోనికి బుచ్చుకొనిన వేడిచేయును; భూతజ్వరమును, ఇతర జ్వరములను, విషమును, కఫవాతమును, కుష్టును బోగొట్టును; దేహదార్ఢ్య మిచ్చును; కొన్ని ఔషధములలో నుపయోగింపబడును. క్రమముగ శుద్ధిచేయనది యుపయోగించుటవలన అనేక దోషములు కలుగును. దీనికి విరుగుడు ఆవుపాలలో తేనెవేసి మూడు

దినములు సేవించిన శుద్ధిచేయని మణిశిల సేవవలన గలిగిన వికార మణగును.

మదనగడ్డి:—A sort of grass. దీనిరసము లేక కషాయము వెగటుగ చేదుగనుండును; వాతము, శ్లేష్మము. విషము వీనిని హరించును. రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

మదనబుడతనీడ:—Spermacoce hispida. Eng. Shaggy button weed. సం* మదనఘుంటా. హిం* మదనఘుంటి. దీని వేరు పాలసుగంధివేరు రుచి గలిగియుండును. దానివలెనే పని జేయును. తత్వమును మంచి స్థితికి మార్చును; రక్తమును శుభ్రపరచును; దీని వేరు కషాయము పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని విత్తులు ఇంద్రియవృద్ధి జేయును.

మదనానబచెట్టు:—Carica papaya. Eng. Papaya tree. సం* నలికాదళ, ఏరండదిర్భిటా, మధుకర్కటీ హిం* పోపైయ్యా. అండఖర్బూజా. బొప్పాయిచెట్టని యందురు. దీనిపువ్వు నలిపి పేను కొరికినచోట రుద్దిన మానును. 4-5 దినములు రుద్దవలెను. దీని మానుపాలు 2-3 సార్లు పూసిన తామర, గజ్జి, చిడుము మానును; ఈపాలు ప్లీహ (Spleen), కార్జము (Liver) వీనిని పెరుగుటను పోగొట్టును. ఇందుకు 60 చుక్కల పాలలో సమముగ పంచదార కలిపి దానిని మూడు మోతాదులుచేసి ఒక దినమునకు ఇయ్యవలెను. ఈప్రకారముగ నిచ్చిన అగ్నిమాంద్యము మానును. పచ్చికాయ దెచ్చి నిలువున కత్తితో గీతలుపెట్టిన పాలుకారును; ఆపాలను ఒక చిప్పలోగాని, గాజుగిన్నెలోగాని తీసుకొని కాలుచున్న యిసుకలో పెట్టిన తెల్లని చూర్ణమగును; ఇట్లగుటకు 24 గంట లుండ

వలెను. ఈచూర్ణము పెద్దవాండ్రకు 1 మొదలు 2 గోధుమగింజల యెత్తుచొప్పున, పంచదారతోగాని, పాలతోగాని లోపలి కియ్య వచ్చునుగాని భోజనానంతర మియ్యవలెను. పచ్చికాయనుండి తీసిన పాలవంటి రసము మిక్కిలి జీర్ణశక్తి నిచ్చును; అగ్నిమాంద్యము (Dyspepsia) మీద బలముగ పనిజేయును; పాలవంటి రసము యొక్క మోతాదు పూటకు 30 చుక్కల చొప్పున దినమునకు 2-3 సార్లు నియ్యనగునుగాని ప్రతిసారియు కొద్దిగనీళ్ళుకలిపి యియ్య వలెను ఆరసము కాయనుండి తీసినతోడనే పుచ్చుకొనవలెను;నిలువ యుండిన త్వరగ చెడిపోవును; ఈపాలు గ్లాసులోనే యుంచవలెను; ఈపాలు మర్దనచేసిన తేలువిషము హరించును; ఆపాలు లోపలికిచ్చిన కడుపునొప్పిహరించును; కొద్దిగ విరేచనముజేయునుగాని గర్భిణులకు ఇయ్యకూడదు; ఎందుచేతనన దీనికి ఋతురక్తము జారీచేయుగుణము గలదు. గనుక గర్భస్రావమును గలిగించును. ఈపాలు పైప్రకారము ఇచ్చిన క్రిమిరోగమును హరించును. పచ్చికాయ స్త్రీలు వండుకు తినిన పాలుపడును. దోరకాయ చక్రములుగకోసి యెండించి చూర్ణించి యిచ్చిన అగ్నిమాంద్యము (Dyspepsia) హరించును. మోతాదు 5 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు. పచ్చికాయ కూరవండి తినినను కాకజేయును; వాతమును, వంటినీరును హరించును; పచ్చికాయను కొబ్బరికోరువలె తీసి కట్టినను. కుమ్ములో వుడికించి దంచికట్టినను, వృషణముయొక్క వాపు (Hydrocle) నొప్పి నయమగును. హృదయము, పొట్ట వీనిలోని చెడువేడిని పోగొట్టును; స్త్రీలకు పాలుపడును; పొట్టకు నష్టముజేయును. దీనికి విరుగుడు పండు చూడుడు. కాయనుగాని, చూర్ణమునుగాని మాంసములో వేసి వండిన త్వరగా మెత్తగ నుడుకును. ఆకులు దంచి కట్టిన ఏనుగుకాలి రోగము నివృత్తించును; మరియు నీవ్యాధికి పేరు

కొన్న దీని రసము పూటకు 2 మొదలు 4 గోధుమగింజలయెత్తు మోతాదుల చొప్పున మాత్రలుకట్టి యియ్యవగును. ఆకులు పైన వేసి కట్టిన నరముల సంబంధమైన నొప్పులు మానును. ఆకులు వేడి నీళ్ళలో ముంచిగాని లేక నిప్పులమీద వెచ్చచేసిగాని నొప్పిగల చోట వేసి కట్టవలెను.

మదనానబపండు:—Fruit of do. ఈ పండు తియ్యగ, స్వాదుగ, రుచిగ నుండును. చలువజేసి నీరుపెంచును. శరీరతత్వమును మార్చును. రక్తస్రావము, రక్తముపడు మూలవ్యాధి, మూత్ర ద్వారమున పుట్టిన వ్రణములు, పుండ్లు వీనిని నివృత్తించును. అగ్నిమాంద్యము ( Dyspepsia ) ను పోగొట్టును. ప్రతిదినము ఉదయమున బుచ్చుకొనిన విరేచనబద్ధ ప్రకృతి మారును. పురాణపు నీళ్ళవిరేచనములు కట్టును. రొమ్ములోనుండి రక్తముపడెడు వ్యాధికి మేలుజేయును. కాకనణచును. మూలవ్యాధిని శమింపజేయును. హృదయమునను, పొట్టలోను బుట్టిన దుష్టవేడిని అణచును. ఆలస్యముగ జీర్ణమగును. కఫవాతములను బెంచును; చలువ శరీరులకు జబ్బుజేయును; కడుపు నిండుగనున్నప్పుడు దినిన జ్వరము దెచ్చును. దీనికి విరుగుడు శొంఠి, పిప్పలి, మిరియాల చూర్ణము లేక కషాయము. పండుగుంజు వంటికి పూసిన పేలడము మానును. పండులోని విత్తులు క్రిమిని హరించును. వీని చూర్ణ మియ్యవగును. మోతాదు 1/2 అణా మొదలు 1 అణా యెత్తువరకు.

మద్దత్తు:—Opium & prepared for smoking. ఇది నల్లమందు పుగాకు కొద్దిగెంజాయి తుమ్మాకు వగయిరాలతో చేయుదురు. మత్తుజేయును. దీని పొగ దేహమును శుష్కింపజేసి నీరసపరచును. రక్తమును, ఇంద్రియమును హరించును. వర్జనీయమైనది.

మద్దిచెట్టు:— తెల్లమద్ది, నల్లమద్ది చూడుడు.

మద్యము:—Liquor or arrack. సం॥ మదిరా, మద్య. హిం॥ దారు. అనగా సారాయి. ఇది తాటి, యీత, కొబ్బరికల్లుతోగాని, బెల్లముతోగాని, ఇప్పపువ్వుతోగాని ఇందులో మేలయినది ద్రాక్ష పండ్లతోగాని తీసినది. వగరు, చేదు, కారము గుణములుగలది. కాక, పైత్యము జేయును. దీనిని మితముగ బుచ్చుకొనిన జఠర దీప్తి, కాంతి, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి, తేలిక, సంతోషము,తుష్టి, పుష్టి వీని నిచ్చును. శ్వాస, కాస, కఫము, శ్లేష్మము, వాతము, విచారము వీని నణచును వ్రణములను, గాయములను మానును. విరిగిన యెముకలను, మాంసమును అతుకుకొన జేయును. అల సట, ఆయాసము వీనిని బోగొట్టును. విరేచనము జేయును. కర్ణనేత్రేంద్రియములకు బలము జేయును. సాహసమును, ధైర్య మును గలిగించును. నిద్రనేలుకొనువారికి, నిద్రేచ్ఛ గలవారికి, చిక్కినవారికి, బలసినవారికి అనుకూలముగ నుండును. జ్వరమును, రక్తపైత్యమును హెచ్చించును. అమితముగ బుచ్చుకొనిన బుద్ధిని జెరచును. దృష్టిబలమును పోగొట్టును. వీర్యనష్టము జేయును. దేహము శుష్కింప జేయును. మరియు పలువిధము లైన రోగములను దెచ్చి శీఘ్రముగ జంపును. దీనికి విరుగుళ్ళు 1 నీరు కలిపిన తేనె, 2 వసకషాయము, 3 నిమ్మపండ్లరసము, 4 తర వాణి. మరియు నీరుకలియని సారాయి కాలిన ప్రదేశమందు వెంటనేపోసి తడుపుచుండిన మంట, తాపము అణగును. వాతము జేయనివ్వదు. విస్తరించి పుండుగాకుండ జేయును. ఇరుకునొప్పి, పక్షవాతము, నొప్పులు వీనికి నొప్పిగలచోట లేక వాతముచేత పడిపోయిన భాగమున మంచి(రెండు మూడు వంటలది)సారాయితో తడుపుచు రుద్దుచువచ్చిన అవి నయమగును. సారాయిలో

అనగా 1/2 మొ॥ 1 ఔన్సులో 5 మొ॥ 10 చుక్కల ఎరకూ (Camphordine) కర్పూరపు అరకు వేసి యిచ్చుచుండిన కలరా విరేచనములు, అజీర్ణ విరేచనము కట్టును. క్రొత్తగా కాచిన మద్యము (సారాయి) కంటె పాతది శ్రేష్ఠము.

మద్యము వర్జింపవలసినవారు:— **Those who should avoid drinking liquor.** కుష్ఠు, మేహము, విదోషము, రక్తపైత్యము, జ్వరము ఈ రోగములు గలవారును, ఎండదెబ్బ, గాలుపు తగిలిన వారును, పైత్యరోగులును, మిగుల అన్నము దినుటవలనను, మిగుల జలపానం బొనర్చుటవలనను కడుపుబ్బియుండెడు వారును, అన్నము భుజించినతోడను, దర్బలులును, హృద్రోగము గలవారును మద్య పానము జేయకూడదు.

మధ్యమపంచమూలములు:—**Decoction of certain 5 roots.** ముత్తువపులగము, గజ్జేరు, ఆముదపువేరు, అడవిపెసర, పిల్లిపెసర వీని వేళ్ళు లేక సమూలముల కషాయముగాని, చూర్ణముగాని కఫవాతముల నణచును. ఆరోగ్య మిచ్చును. మలాదులను భేదించును.

మథితమనుచల్ల:— **A sort of Butter milk.** చల్ల చూడుడు.

మధుశర్కర:—చిన్నిపువ్వుల తేనె చూడుడు.

మనుబాల:—**Tylophora asthmatica.** సం॥ జీవంతి, అంత్రి, అంత్ర పాచక, హిం॥ అంతముల్, జంగ్లీపిక్వాన్. దీనిని వెర్రిపాలయని, పాలగురుగు అని, పాలకూరచెట్టని అందురు. సన్నముగ పొడవుగ నుండు ఆకులును, పాలుగలిగి తీగెప్రాకెడు చిన్నచెట్టు. తెల్లని పువ్వులుపూయును. దీని వేళ్ళు సన్నముగా చీపురుపుల్లలావున గుత్తిగానుండును. దీని ఆకు, వేరు కషాయము లేక చూర్ణము చెమటబుట్టించును. (Diaphoretic), కొద్దిమోతాదులుగ నిచ్చిన

ప్రేగులయందు బుట్టు గ్రహణి రోగమును కట్టును. పెద్ద మోతాదులుగ నిచ్చిన వాంతిజేయును. యిపికాక్యునా (Ipecacuna) తో సమానముగ పనిజేయును. యీవేళ్ళను మెత్తగానూరి ఆవుపాలలో గలిపి యిచ్చిన వాంతులయి పెట్టుమందు పడిపోవును. దీని ఆకునుగాని, వేరుగాని మెత్తగదంచి కట్టిన నేత్రరోగములు నయమగును. దీనివేరు కషాయము దగ్గును, వగర్పుతోకూడిన దగ్గును నివృత్తి చేయును. సెగరోగమునకు మిక్కిలి మేలుజేయును. దీని ఆకుతో వండిన కూర తినిన పైనజెప్పిన సుగుణములు గలిగియుండును. కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులముల ఎత్తువరకు. చూర్ణపు మోతాదు 1/2 అ॥ మొదలు 1 అ॥ ఎత్తువరకు. వాంతిచేయించుటకు యిచ్చు మోతాదు 2 అ॥ మొదలు 4 అ॥ ఎత్తువరకు. స్వర్ణజీవంతి చూడుడు.

మనుబోతు మాంసము:—Flesh of bison or wild buffalo. బలము నిచ్చును. అమితముగ బుచ్చుకొనిన వేడిజేసి గ్రహణిరోగమును బుట్టించును. గురుత్వముగ నుండును.

మనుష్యుడు:—Man or woman. మట్టిలోఉండి చీకిపోకుండ నున్న మనిషిపుర్రె (Skull) చూర్ణముజేసి సుమారు అణాయెత్తు చొప్పున సుమారు పావుశేరు (20 తులములయెత్తు) ఆవుపాలలో గలిపి స్త్రీ వెలుపలయున్నప్పుడు మూడు దినములు ప్రొద్దుటపూటల నిచ్చిన గర్భము నిలుచును. వంధ్యాదోషము నివృత్తించును. పథ్యము నెయ్యి, పాలు, అన్నము తినవలెను. మగవారికి పిచ్చియెత్తిన ఆడుదాని మూత్రము, ఆడుదానికి పిచ్చియెత్తిన మగవాని మూత్రమును త్రాగించిన నయమగును. మనిషి చెవిలోని గులిమి పైన పూసిన ఆనికాయలు మానును. మనిషిపిత్తము, అరమణుగులేక చుక్క ఆవుపాలలో వేసి పుచ్చుకొనిన సాహసుడు, నిర్భయుడు

అగును. చచ్చినవాని యెముకను భస్మముచేసి నశ్యము చేయించిన శాకిచమ్మలు, మూర్ఛలు, మానును; ఆ భస్మముయొక్క పొగ కూడ పట్టవలెను. మనిషి గోళ్ళభస్మము మొగవానికి తినిపించిన వశ్యుడగును. మనిషి వెంట్రుకలు నూనెలోముంచి కాల్చి మసిజేసి దానిని గాయములో పెట్టిన ఎలుక, పిల్లి, దుప్పి, పులి వీని కాట్ల విషము హరించును. బహిష్ట అయిన స్త్రీ మూర్ఛ రోగిని మూర్ఛ యున్నప్పుడు ముట్టుకొనిన మూర్ఛ నివారణమగును రుతిమతియై స్త్రీతో రమించిన పురుషుండు పందయై నిర్భాగ్యుడై పోవును; కళ కాంతులు నశించును. మనిషి మెదడు రెండు గురివింద గింజలంత విషజాతి పురుగు కాటుపై అంటించిన విషము విరుగును. మొదటి సారి యూడిన పిల్లవాని దంతము లేక పన్ను క్రిందపడకుండ జాగ్రత చేసి వెండితావీజులో పెట్టి స్త్రీ తన యొద్దనుంచుకొని సంభోగము చేసిన గర్భము కాకుండును. అట్టి పంటిని లేక దంతమును నూరి పాముకాటుపైన బెట్టిన విషము విరుగును. బాధలేకుండ నూడిన మనిషి దంతముపైన వడ్లంగిపిట్ట రెక్క వెంట్రుకలు చుట్టికట్టి నిద్ర బోవుచుండు మనిషి తలక్రిందనుంచిన ఆమనిషి ఆదంతమును తీసి వేయువరకు నిద్రమేలుకొనడు. చనిపోయినవాని ఎముక దగ్గరనుంచిన చాతుర్థికజ్వరము కట్టిపోవును; ఆ యెముకను నూరి చూర్ణముచేసి నశ్యము చేయించిన నిద్రవచ్చును. బహిష్ట అయిన స్త్రీ యొక్క ఋతురక్తమును వెర్రికుక్క కాటుపైన బెట్టిన దానివిషము విరిగి పోవును; శ్వేతకుష్ఠు మచ్చలపైన పూసిన అవిమానును. మూల శంక రక్తమును కుక్క తినిన దానికి వెర్రి యెత్తును. మనిషి యింద్రియ మును శ్వేతకుష్ఠు (తెల్లబొల్లి) మచ్చలపైన బూసిన అవిమానును. మనిషియొక్క యుమ్మి గాయమును మాన్పును; జంతు విషమును విరుచును. మనిషి మూత్రము మరగబెట్టి నొప్పి, పోటుగల కాలి

వ్రేళ్ళను ఆమూత్రముతో తడిపిన లేక కడిగిన నొప్పులు, పోటు నివ్మ ళించును; ఆ కాచిన మూత్రమును లోపలికిచ్చిన యెటువంటి విష మైనను విరిగిపోవును. కడుపులో బల్లయున్న మనిషి తన మూత్ర మును ప్రొద్దుట పూటలను ఇరువై యయిదు తులముల చొప్పున 10-15 దినములు పుచ్చుకొనిన బల్ల కరిగిపోవును, అయిదారు సంవ త్సరములలోపు ఈడుగల పిల్లవాండ్ర మూత్రముతో ఉదయము లను కండ్లు కడిగిన కండ్ల కలకలు నయమగును. ఈ మూత్రము 1-2 ఔన్సు (oz)ల చొప్పున యిచ్చుచుండిన సన్నిపాతజ్వరమును నివృ త్తించును. మనిషియొక్క మూత్రము పాముకరచినవెంటనే యిచ్చిన పామువిషము హరించును. కాలినప్రదేశమును తనయొక్క గాని, యితరులయొక్కగాని మూత్రముతో తడిపిన మంట అణగి పోవును. వెంటనే తడిపిన పొక్కు పొక్కకుండును. పైనచెప్పిన యీడుగలబిడ్డల మూత్రములో మెత్తగ తాల్చిన లేక వస్త్రఘాలి తము చేసిన పిడక బూడిదను కలిపి కాలిన పుండుపైన పూసిన నొప్పి, పోటు అణగి శీఘ్రముగ మానును.

మయిలతుత్థము దీని భస్మము:— **Cupri sulphas, Blue vitrio or sulphate of copper & its calx.** సం॥ తుత్థ, మయూర గ్రీవక, తామగర్భ. హిం॥ నీలాతుతియా, ఇది భూమిలో పుట్టును. మరిన్నీ రసాయన శాస్త్రరీత్యాకూడ తయారుచేయుదురు. కారము, వగరుగనుండును. దీనిలో తామ్రము, గంధకము యుండును. దీనిని మయూరతుత్థమందురు. దీనిని యితర వస్తువులతో కలిపి పైని పూయుటవలన దుష్టవ్రణములు, దురద, గజ్జి, కుష్టు వీనిని హరిం చును. దీనిని నేయి, తేనె వేసి నూరి అవి యిగిరిపోవువరకు నూరి ఒకగరిటెలో వేసి కాచి, దానిని కలిలోగాని, కడుగులోగాని, 3 దిన ములు వుంచి తిరిగి కాచిన శుద్ధియగును. దీనిని లోపలికిచ్చుటకు

వుపయోగించుట మంచిది. దీనిని త్రాగిన అనుపానములతో శ్లేష్మ వాతరోగములు మొదలగు అనేక రోగములకు వాడవచ్చును. దీనిని లోపలికిచ్చిన వమనమును, విరేచనమును గావించును. దీనిని క్షయరోగముయొక్క ప్రారంభమునను, నల్లమందు విషముగా తిని నప్పుడును, అమితముగ తిండితిని యూపిరిసలుపక యుండినప్పుడును, రుద్రవాతము (Apoplexy) వచ్చు చిన్నెలు కనుపడినప్పుడును, దీనిని లోపలికిచ్చిన వెంటనే వాంతిచేసి మేలుజేయును. వాంతి యగుటకు మోతాదు ½ అణా మొదలు 1 అణా యెత్తువరకు. ఎనిమిది తులములయెత్తు నీళ్ళలో కలిపి ఇయ్యవలెను. మోతా దెక్కువయైన అనేకవికారములను బుట్టించును; చంపును. దీనికి విరు గుళ్ళు 1 పుల్లనిమజ్జిగ, 2 నిమ్మకాయ రసము, 3 వరిపేలాలనువేసి పిసికిన నీళ్ళు. ఇందులో దేనినైనను మూడు నాలుగు దినములు యియ్యవలెను. దీనిని క్రమముగ శుద్ధిజేసి చేసినభస్మమును సేవిం చినశూలలు, ఆమపైత్యము, కుష్టు, శ్వాస, కాస, వీనిని హరించును. వెన్నతో సేవించిన దురద, విషము, కుష్ఠులను, వాయువిడంగ చూర్ణముతో సేవించిన క్రిమిరోగమును, తమలపాకుల రసముతో సేవించిన కఫరోగమును హరించును. ఈభస్మమును తేనెలో గలిపి అంజనము చేసిన దారుణమైన నేత్రరోగములు నివారణ మగును. ఆముదములో గలిపి పుచ్చుకొనిన విరేచనమగును.

మయూరతుత్థము:—అనగా మైలతుత్థము చూడుడు.

మయూరశిఖ:—Celosia cristata & Adiantum melanacaulon. Eng. Maiden hair. సం॥ మయూరశిఖ, శిఖనీ, కేకి శిఖా. హిం॥ మోర్‌శిఖా. ఈచెట్టు నెమలి జుట్టువలె నుండును. చేదు, తీపి, వగరు రుచులుగలది; లఘువుగ నుండును; పైత్యము, శ్లేష్మము, అతిసారము, మూలవ్యాధి, నీరసము, దగ్గు, క్షయ,

గొంతుకలో పుండు అగు రోగము వీనిని పోగొట్టును; బలము జేయును; గాయమును మాన్పును. మోతాదు 2 అ॥ మొదలు 4 అ॥ యెత్తువరకు నియ్యవచ్చును.

మరాటి మొగ్గలు:—A certain aphrodisiac drug. సం॥ మహారాష్ట్రి, మరహట్టిక. హిం॥ మరేఠీ. ఇదియొక చెట్టుపువ్వు(మొగ్గలు); లవంగ మొగ్గవలె నుండునుగాని వానికంటె లావుగ పెద్దవిగ నుండును; మత్తుజేయును; నిద్రదెచ్చును; విరేచనము కట్టును; నొప్పిని పోగొట్టును; వీర్యస్తంభన జేయును. వీనిని పాలలో కలిపి నియ్యనగును. ఒక మొగ్గ దానిలో విత్తుతో నూరిన చూర్ణము ఒకసారి నియ్యతగియుండును. కూరలలో వుపయోగించు మసాలా వస్తువులలో నొకటి.

మరువము:—Sweet marjoram. సం॥ మరువక, గంధపత్ర. హిం॥ మరువా. యివి మంచి సువాసనగల మొక్కలు, వీనిని విస్తారముగ పెంచుదురు. సువాసనకొరకు స్త్రీలు శిరస్సున ధరింతురు. మనస్సుకు సంతోషమును, ఆనందమును కలుగజేయును. దీని సమూలపు రసము లేక కషాయము లేక చూర్ణము సువాసనగలిగి వగరుగ, చేదుగ నుండును; వేడిజేయును; పైత్యము, శ్లేష్మము, విషము, మేహము, కార్శ్యరోగము, క్షయరోగము వీనిని పోగొట్టును; పైత్యభ్రమ, దాహము, తాపము వీని నణచును; విరేచనబద్ధము జేయును, ఆకలి పుట్టించును. జీర్ణశక్తిని వృద్ధిజేయును. ఇంద్రియ పుష్టిజేయును; శాక్రమేచ్ఛను వృద్ధిపరచును. దీనిని తైలములో వేసి కాచి వాడిన సువాసనగలిగి మెదటికి చలువ, వెంట్రుకలను వృద్ధిపరచును. దీని అరకుకూడ పై వ్యాధులకు దీనిని నూనెవలె వుపయోగింతురు. రసముయొక్క మోతాదు పూటకు 2 తులములయెత్తు; కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు;

చూర్ణపు మోతాదు 2 అ॥ మొదలు 4 అ॥ యెత్తువరకు. అరకు 30 మొ॥ 60 చుక్కలవరకు. నూనె (Oil) 5 మొ॥ 10 చుక్కల వరకు.

మర్దన:—అంగమర్దన చూడుడు.

మర్దన వర్జింపవలసినవారు:—Those who should avoid rubbing of body. పైత్యరోగులు, జ్వరముగలవారు, దాహము, ఆకలి చేత సొక్కియున్నవారు, రక్తపైత్యము, ప్రమేహము గలవారు అంగమర్దనమును వర్జింపవలయును.

మర్రిచెట్టు:— Ficus Indica & F. Bengalensis. Eng. Banian tree. సం॥ న్యగ్రోధ, వట. హిం॥ బడ్, వడ్.. దీనిచెక్క కషాయము లేక చూర్ణము పుచ్చుకొనిన అజీర్ణము, జ్వరాతిసారము, ఉబ్బు వీనిని పోగొట్టును; బలముజేయును; అతిమూత్రజాడ్యము నివృత్తించును. దీని గంధము చిరకాల సేవచేసిన కాయసిద్ధి, ఆయుర్వృద్ధినిచ్చును. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. గంధపుమోతాదు 1 తులమెత్తు మొదలు 2 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 2 అ॥ మొ॥ 4 అ॥ యెత్తువరకు

మర్రిఆకులు:—Leaves of do. వీనిరసము లేక కషాయము విరేచనబద్ధము జేయును;రక్తపైత్యము నణచును; మేహశాంతి జేయును.

మర్రిచిగుళ్ళు:—Young leaves of do. వ్రణములను, సమస్త విసర్పులను మాన్పును; తాపమణచును; నోటిపూతను మాన్పును.

మర్రిచెట్టునీడ:—Shade of do. జువ్విచెట్టునీడ చూడుడు.

మర్రిపండు:—Fruit of do. దీనిలోని విత్తులు మేహశాంతి, వీర్యపుష్టి, బలముజేయును. ఎండించిన పండ్లచూర్ణము, అతిమధుకచూర్ణము సమభాగములు, ఈరెంటికి సమముగ పంచదారకలిపి

పుచ్చుకొనిన రక్తనమనము కట్టును. మోతాదు పూటకు అరతుల మెత్తు మొదలు తులమెత్తువరకు.

మఱ్ఱిపాలు:—Milk of do. వీనిని లోపలికి పుచ్చుకొనిన మేహ శాంతి జేయును; కుష్ఠురోగమును పోగొట్టును; వీర్యపుష్టి జేయును; వీనిని పుక్కిలించిన నోటిపూత నివ్మూలించును. అరటిపండు సగము ముక్కలో నిలువున వ్రేలితో రంధ్రముచేసి దానినిండుగ మఱ్ఱిపాలు పోసి 10–15 దినములు ఉదయపుపూటలు పుచ్చుకొనిన వీర్యనష్టము కట్టును. వీర్యవృద్ధి, ధాతుపుష్టి జేయును; సెగరోగములు నిమ్మూలించును; కాళ్లు పగిలిన వానిపైన పూసిన అవి మానును. వ్రణముల పైన పూసిన వానిలోని పురుగులను జంపును.

మఱ్ఱియాకుల విస్తరి:—Platter of the banian leaves దీనిలో భోజనము పైత్యము నణచును; విషదోషము, వ్రణములు, క్రిమి రోగము, అతిసారము, గ్రహణి, కుసుమరోగము వీనిని హరించును, చలువ, దంతములకు బలముజేయును.

మఱ్ఱియూడలు:—Drops of banian tree. వీని రసము లేక చూర్ణము వగరుగనుండును; పైత్యమును, మేహమును అణచును; వీర్యపుష్టిజేయును; క్రిమిరోగమును, గ్రహణి, కుసుమరోగమును బోగొట్టును; అగ్నిమాంద్యము, వాతము జేయును; దీనికి విరుగుళ్ళు 1 ఇంగువ, 2 జీలకఱ్ఱ, 3 దాల్చినిచెక్క, లవంగాలు వీనిచూర్ణము. మఱ్ఱియూడలతో దంతధావనముజేసిన దంతరోగములు మానును; రసముయొక్క మోతాదు పూటకు 2–5 తులముల మెత్తు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అ॥ యెత్తువరకు.

మలుగుమీను:—Eel-flesh of. తేలికగనుండును; జఠరమాంద్యము జేయును; నేత్రరోగములను జయించును.

మల్లి చెట్టు:— Jasminum sambac. Eng. Jasmine or arabian jasmine. సం॥ మల్లికా, వార్షికీ. హిం॥ బాల్ ఫూల్. దీనియాకు లేక వేరురసము శుక్రవృద్ధిజేయును; వాతపైత్యము, రక్తదోషము వీనిని హరించును. దీని యాకులను కొద్దిగ నెచ్చజేసి నేత్రములపైన వేసి కట్టిన లేక ఆకులను దట్టముగ తలపైనవేసి కట్టినను కండ్ల మొకుపులు మొదలగు నేత్రరోగములు నివృత్తించును. దీని యాకులను నూనెలోవేసి కాచిన తైలమునుగాని, ఆకుపసరును నూనెలో వేసి కాచిన తైలమునుగాని తలకు మర్దనజేసిన నేత్రరోగములు మానును. పసరు 2 వంతులు, నూనె ఒకవంతు ఉంచి పసరు (ఆకు రసము) ఇగర గాచవలెను.

మల్లిపువ్వులు:—Flowers of do. ఇవి మిక్కిలి సువాసన గలిగి మనోహరముగ శిరస్సున ధరించుటకు మిక్కిలి అనుకూలముగ నుండును. కామమును వృద్ధిపరచును. వీర్యమునకు వేడిపుట్టించును; శ్లేష్మమును హరించును; నేత్రములకు బలమిచ్చును; వెంట్రుకలకు మేలుజేయును; పేలు పడును. వీనిని రెండుమూడు గుప్పెళ్ళు వట్టివిగాని, చిదుకగొట్టిగాని చన్నులపైనవేసికట్టిన పాలుచేపు రాకుండును. రెండు మూడు రోజులు రోజుకు ఒకటి రెండుసార్లు కట్టవలెను. చనుకుదుకు అగునని తోచినప్పుడు ఇట్లు చేయవలెను. బొడ్డుమల్లె పువ్వులకున్నూ పైగుణములు కలిగియుండును.

మసర పప్పు:—Lens esculenta. Eng. The lentil. సం॥ మసుర. హిం॥ మసూర్ దాల్. దీనిని సిరిసెనగపప్పు అనియు నందురు. ఇది మెరగను, రుచి గలిగియుండును; వేడిజేసి నీకుపెట్టును; పొట్టకు బలమిచ్చును; తేలిక, కాంతి, బలము, ఆయువు, దేహపుష్టి వీని నిచ్చును; జ్వరము, కఫము, పైత్యము, రక్తపైత్యము, గ్రహణి, అతిసారము, వాతము, మలబద్ధము మొదలగు

ప్రేగుల రోగములను హరించును; గొంతుక పట్టును విప్పును; గురుత్వము జేయును; కడుపు బిగబట్టును; నీరుడు బంధించును, దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పంచదార, 3 మాంసము, 4 కల్లు, 5 సిరకా. మరియు దీనిని ఉడికించి కట్టు ( Poultice ) కట్టిన స్ఫోటకములో పుట్టిన వ్రణములను, మానని మురికి వ్రణములను మాన్పును. దీనికట్టు కమ్మగ రుచిగ నుండును. ప్రమేహము, సంగ్రహణి, నీరసము, మూత్రకృచ్ఛ్రము, కఫపైత్యము వీని నణచును; దేహపుష్టి నిచ్చును; జ్వరమును పోగొట్టును.

మహామేద:—A medicinal plant. మేదచూడుడు.

మహిసాక్షి:—Balsamodendron mukul. B. Agallocha. Eng. Gum gugul. సం* మహిసాక్షి, గుగ్గులు, జటాయు. హిం* మహిసాక్షిగుగ్గుల్. వగరుగ, చేదుగనుండును; వేడిజేయును; అడ్డగర్రలు, ఆమవాతనొప్పులు, ఉబ్బు, గండమాలలు గ్రంధులు, మూలవ్యాధి, రక్తముపడు మూలవ్యాధి, క్రిమిరోగము, పొక్కులు, పురుగులు పట్టిన వ్రణములు, నెత్తురుగడ్డలు, మాంసపుకండల వాతపు, మేహవాతపు నొప్పులు, ప్రమేహపిటికలు (Carbuncles) మలుగు నొప్పి (Sciatica), కుష్టు, రక్తగ్రహణి, సెగరోగము, ఓడవాండ్రకు వచ్చు రోగము (Scurvy), భగందరము, అపస్మారము, (Hysteria). రక్తక్షయ, అజీర్ణము, అగ్నిమాంద్యము, దగ్గులు వీనిని హరించును; జఠరదీప్తిని, వీర్యవృద్ధిని, తేలికనిచ్చును; వాతము, శ్లేష్మము, ఆయాసము, మేతస్సు వీని నణచును; అతిసారము కట్టును. దీనిని యుడికించి గడ్డలు మొదలయిన వానిపైన పట్టువేసిన హరించును. విరేచనబద్ధముజేయును. లోపలికిచ్చునపుడు ఇతర వస్తువులతో నియ్యనగును. దీనిని సమ్మెటతో యెంత విస్తా

రముకొట్టిన దీని గుణమంత అధికమగును. మోతాదు 2-3 అణాల యెత్తు.

మాండూకబ్రహ్మి:—సరస్వతియాకు చూడుము.

మాండూరము:—Refuse of melt Iron (or dross Iron) Calx & reddened calx of. సం॥ మండూర, లోహకిట్ట. హిం॥. మండూర్. ఇది యినుపచిట్టము ఒక గ్రామ భూమిలో 100 సంవత్సరముల పై కాలము భూమిలో నున్నది శ్రేష్ఠము. క్రమముగ చేయబడిన దీని భస్మము లేక సింధూరము అనుపానయుక్తముగ నిచ్చిన రక్తమును శుభ్రపరచును. మంచిరక్తమును బుట్టించును. పాండువు, కామిల, ఉబ్బు, ఉదరరోగము, క్షయ, జ్వరము, క్రిమిరోగము, వాతము, పైత్యము, స్థూలత్వము, గ్రహణి, ప్రమేహము, కాస, శ్వాసలు, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, రక్తపైత్యము, కార్శ్యరోగము, ఆమవాతము, ఆమశూల, అరుచి వీనిని పోగొట్టును. ఆరోగ్యమును, ఆయుర్వృద్ధిని యిచ్చును; ప్రాత చిట్టమును ఎర్రగ కాల్చి 7 మార్లు గోమూత్రములోగాని, మేక మూత్రములో లోగాని వేసితీసి చూర్ణముచేసి తేనె మొదలగు అనుపానములతో నిచ్చిన పాండువు,ఉబ్బు మొదలగురోగములు హరించును. మోతాదు పూటకు ½ అణా మొదలు 1అణా యెత్తు చొప్పున దినమునకు రెండు పూటల నియ్యనగును. కరక్కాయ చూర్ణము 1-2అణాలయెత్తులో తేనెగలిపి 5-6 దినములు సేవించిన దోషయుక్త మాండూర సేవవలన గలిగిన వికారము నివృత్తించును. మఱియు దీనికి లోహభస్మముయొక్క గుణములు గలిగియుండును. దీని సేవయందును, లోహభస్మ సేవయందు జేయవలసిన పథ్యములు చేయవలయును. లోహభస్మ అనుపానములతో సేవించనగును.

మాంసము ఆకుకూరలు, లేక కాయగూరలతో వండినది:— Mutton cooked with vegetables. రుచిగ నుండును; బలము, తృప్తి, దేహపుష్టి వీనినిచ్చును; గురుత్వముగ నుండును; మరియు ఏయాకు లేక యేకాయ వేసివండిన ఆయాగుణములు గలదిగ నుండును.

కొయ్యతోటకూర వేసివండినది రుచిగ, మనోహరముగ నుండును; కాక జేయును; వాతము నణచును.

మెంతికూర వేసి వండినది రుచిగ, మనోహరముగ నుండును; గురుత్వము జేయును; ధాతువులకు సౌమ్యతను, బలమును ఇచ్చును; హృద్రోగము నణచును; త్రిదోషహరమై యుండును; వీర్యపుష్టి జేయును.

మామిడికాయ వేసి వండినది రుచిగ నుండును, వేడి జేయును, బలమిచ్చును; పైత్యశ్లేష్మ వికారముల నణచును, వాతమును, హృద్రోగమును శమింప జేయును.

వంకాయ వేసి వండినది అగ్నిదీప్తినిచ్చును; వాతమును, శ్లేష్మమును హరించును; జ్వరము, మూలవ్యాధి, వీనిని గలుగ జేయును.

మునగకాయ వేసి వండినది మిక్కిలి రుచిగనుండును; మేహశాంతి జేయును. జఠరదీప్తిని, వీర్యవృద్ధిని యిచ్చును; గురుత్వముగ నుండును.

చిక్కుడుకాయ వేసి వండినది రుచిగనుండును, గురుత్వము, పైత్యము, అగ్నిమాంద్యము జేయును.

మాంసము నిప్పులమీద కాల్చినది:— Roasted flesh or balls of minced meat. అనగా మాంసము ముక్కలుకోసిగాని, మెత్తగా నలియగొట్టిగాని, అల్లము, ఉప్పు చేర్చి పుల్లకుగాని, యినుపయూసకుగాని గ్రుచ్చి నిప్పుమీద కాల్చిన మాంసము రుచిగానుండును; శీఘ్రముగ జీర్ణమగును. వేడి జేయును; క్రొవ్వును

పెంచును; శ్లేష్మమును, మూత్రరోగమును గొట్టును; జఠరదీప్తి నిచ్చును; బలముజేయును; వాతశరీరులకు మిక్కిలి యనుకూలముగ నుండును; సులభముగ జీర్ణమగును.

మాంసము యెండించినది:—Dried Mutton. అనగా కొద్దిగ ఉప్పు అల్లము లేక కారము మసాళాలు నూరి మాంసమునకు పట్టించి యెండించినది. దీనిని పలచగ సాగగొట్టి నేతిలో వేయించి పుచ్చుకొనిన మిక్కిలి రుచిగా నుండును. పథ్యకరమైనది సమస్తరోగముల యందును పథ్యమైనది. దేహపుష్టి, బలము జేయును. శుక్రవృద్ధి, శరీరకాంతి, బుద్ధిబలము నిచ్చును. ఉబ్బరు తీసివైచును. మరియు మేకమాంసము గుణములు గలిగియుండును.

మాంసములు కూడనివి:—Flesh of animals unfit for consumption. వ్యాధిచేతను, విషప్రయోగముచేతను, నీళ్ళలో లేక పొగలోపడి చచ్చిపోవుటచేతను, మిక్కిలి కృశించుటచేతను, చచ్చిన జంతువుల మాంసము దినుటవలన వ్యాధి జనించును గాన వానిని వర్జింపవలెను.

మాంసము కొబ్బరికాయ వేసివండినది:—Mutton cooked with kernel of cocoanut. రుచిగ, మనోహరముగ నుండును; వీర్యవృద్ధిని, దేహపుష్టినిచ్చును; గురుత్వముగ నుండును; పైత్యము జేయును.

మాంసము దుంపలు వేసి వండినది:—Mutton cooked with edible roots. అనగా పెండలము, బంగాళదుంపలు మొదలగునవి వేసి వండినది రుచిగ, గురుత్వముగా నుండును; వాతము జేయును; వీర్యపుష్టిని, దేహపుష్టిని యిచ్చును.

మాంసము పెరుగువేసి వండినది:—Mutton cooked with curd.
మిక్కిలి రుచిగ, మేహశాంతిగ నుండును. బలము, దేహపుష్టి, వీర్యవృద్ధినిచ్చును. సులభముగ జీర్ణమగును. త్రిదోషహారముగ ఆరోగ్యముగ నుండును. వీర్యవృద్ధి నిచ్చును; రక్తపైత్యమును హరించును.

మాంసము వర్జింపవలసినవారు:—Those who should not eat mutton. నూతనముగ జ్వరము తగిలినవారును, ఉదరరోగులును, కుష్ఠురోగులును, ఆకలి మందముగలవారును, విశూచి రోగులును, అతిస్థూల శరీరులును, అజీర్ణము, కడుపుబ్బుగలవారును, గ్రహణి రోగులును, ఆమము, అతిసారము గలవారును మాంసజాతుల వర్జింపవలయును.

మాంసము వేపినది:—Fried or roasted mutton or flesh. నేతిలో వేయించినది కాక జేసి చలువజేయును; మంచియాహారము, శరీరమునకు బలమిచ్చును.

అల్లముగలిపి నేతిలో వేయించిన మాంసము తేలికగనుండును; బలము, ఆయుర్వృద్ధినిచ్చును. క్రిమిరోగము, కఫము వీనినణచును; వీర్యవృద్ధి నిచ్చును.

నూనెలోవేయించిన మాంసము గురుత్వముగ నుండును; పైత్యము, వీర్యమునకు వేడిచేయును.

కొబ్బరినూనెతో వేయించిన మాంసము రుచిగ నుండును; బలము, వీర్యవృద్ధిచేయును. కొద్దిగ అగ్నిమాంద్యము జేయును.

మాంసము సామాన్యగుణము:— Mutton or flesh generally. ఇది ఆహారపదార్థములలో మిక్కిలి యుపయోగకరమైనది. శరీరపుష్టిని, బలమును ఇచ్చును; సర్వేంద్రియములకు పుష్టిజేయును; మితముగ బుచ్చుకొనిన అమృత తుల్యముగ నుండి ఆరోగ్యము నిచ్చును. అమి

తముగా దినిన అజీర్ణము, అగ్నిమాంద్యము జేయును. దీనిని అల్లము, యేలక్కాయలు, లవంగములు, దాల్చినచెక్క, గసగసాలు మొదలగు ద్రవ్యములునూరినముద్ద మాంసమునకు పట్టించి, వుప్పుకారము కొద్దిగ, చేర్చి, ఉల్లిపాయ ముక్కలు, కొద్దిగ వెల్లుల్లి చేర్చి, పొయ్యిమీద వేసి అందులో వూరు నీరు ఇగిరినతరువాత, నెయ్యితో పోగిచి అప్పుడు పెరుగుగాని, నీరుగాని తగుమాత్రము వేసి వండినది శ్రేష్ఠము. నూనెతో వండుట అంత శ్రేష్ఠముకాదు. నల్లరంగు మేకమాంసము ఇతర రంగుల మేకలమాంసములకంటెను, కాలములోనున్నదాని మాంసము ముసలిదాని మాంసముకంటెను, బలములోనున్నదాని మాంసము నీరసముగనున్న దానిమాంసముకంటెను, తిరిగి మేసిన దానిమాంసము కట్టి మేపిన దానిమాంసముకంటెను, విచ్చులు తీసిన దానిమాంసము తీయనిదాని మాంసముకంటెను శ్రేష్ఠము. అన్నిటికంటెనుఒక సంవత్సరము ఈడుగల విచ్చులు తీసిన గొర్రెపోతు మాంసము శ్రేష్ఠము. మేకపోతుమాంసముకంటె ఆడు మేక మాంసము మంచిది. ఆడుగొర్రె మాంసముకంటె పొట్టేలు మాంసము శ్రేష్ఠము. అమితముగా బుచ్చుకొనుటవలన వచ్చిన మాంసముయొక్క అజీర్ణమునకు విరుగుళ్ళు 1 ఉప్పు, 2 సిరకా, 3 ఆవాలచూర్ణము, 4 మామిడిపప్పు, 5 వేడినీళ్ళు, 6 జాజికాయ.

మాంసరసము:—Soup. షేరువా. అనగా మేకయొక్క మాంసము నుండియు, యెముకలయొక్కయు, మూలుగులయొక్కయు, ప్రత్యేకము వెన్నెముకయొక్కయు రసములు. అనగా కొట్టముక్కలుజేసి నీరుచేర్చి బాగుగా వుడికించి దానియొక్కరసము వడియబోసి దానిలో సుగంధద్రవ్యములు, అల్లము (గరమసాలా) వేసి నేతితో పోగిచి పుచ్చుకొనవలయును. మరియు మనుష్యునకు యే యవయవమునకు జబ్బుగలిగిన మేకయొక్క ఆ అవయవము పచ్చిది

తెచ్చి చితుకగొట్టి రసముదీసి కొద్దిగా యాలుక్కాయల చూర్ణము గలిపి పుచ్చుకొనవచ్చును. నేత్రములకు చలువజేయును; మిక్కిలి దేహపుష్టిని, బలమును ఇచ్చును; వ్రణముల మాన్పును; వీర్యవృద్ధి జేయును; తృప్తినిచ్చును; స్త్రీలకు పాలుబడజేయును. వ్యాధిపీడితులై తేలి నీరసపడినవారికిని, క్షామ బాధచేత క్షీణించినవారికిని, మందాగ్నిగలవారికిని, జ్వరముపడి తేలి నీరసపడినవారికిని, క్షీణేంద్రియులకును తాపవ్యాధిచేత క్షీణించి శ్రమనొందినవారికిని, కాళ్ళు చేతులు మొదలగువాని ఎముకలు విరిగిపోయినవారికిని, దెబ్బలు, గాయములు తగిలినవారికిని, వాత రోగులకును, నిత్యము వ్యాయామము. స్త్రీ సాంగత్యము, మద్యపానము చేసెడివారికిని మాంస రసము మిక్కిలి పథ్యముగనుండి సౌఖ్యమిచ్చును.

మాంస రసము పుచ్చుకొనకూడనివారు:— Those who should not take soup. జ్వరము గలవారును, మేహరోగులును, అజీర్ణము, అతిసారము, కుష్ఠు, విషూచి ఈరోగములు గలవారును మాంసము పుచ్చుకొనగూడదు.

మాంసరోహిణి (రోహిణి):— Soymiba febrifiga. Eng. Red wood tree. సం॥ రోహిణీ, మాంసరోహిణీ. హిం॥ మాంస రోహిణీ. ఇది యొక గ్రంథిదినుసు. వగరు, కారము రుచిగలది. రక్తపైత్యము, అసృగ్దరమనెడు యోనిరోగము (కుసుమ), శూల, రక్తముపడెడు మూలవ్యాధి వీనిని బోగొట్టును. విరేచనబద్ధము జేయును. వ్రణహారి, వీర్యవృద్ధిజేయును.

మాచిపత్రి, మాసిపత్రి :— Artemisia indica. A. Vulgaris. Eng. worm wood. సం॥ స్థాణేయక, బర్హిచూడ, శుకచ్ఛద. హిం॥ ధునేర్. దీని ఆకులు, వెన్నులరసము లేక కషాయము, తేలిక కషాయము, వ్రణములు, దద్దుర్లు, కుష్ఠులు, వాతములు

వీనిని పోగొట్టును; మనసునకు వికాసమును గలుగ జేయును; పొట్టకు బలము జేయును; దేహములోని మలములను వెడలించును; సీరసముతోకూడిన ఈడ్పురోగములు,నరములరోగములు(Spasmodic and nervous affections) వీనిని పోగొట్టును; క్రిమిని హరించును; వరుసజ్వరము, అగ్నిమాంద్యము (Dyspepsia), మూర్ఛ, మరిడీజాడ్యము, అపస్మారము, వీనిలోని ఈడ్పులు (Spasms), ఋతుబద్ధము వీనిని నివారించును. దీని ఆకు వెచ్చ జేసి దానితో గాని, ఆకులు వెన్నులతో చేసిన తేలిక కషాయముతో గాని కాపడముపెట్టిన వ్రణములనాపును; నొప్పితీయును. దీనియాకు వేసికట్టిన తలనొప్పి, వాతపునొప్పులు హరించును. దీని యాకును నేతితో వెచ్చ జేసి కండ్లకు కట్టిన కండ్లయెరుపులు, పోటు, నొప్పి నిమ్మళించును. దీని రసముయొక్క మోతాదు పూటకు 1-2 తులముల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. తేలిక కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు.

మాచికాయ:—Quercus infectoria. Eng. Oak galls. సం॥ మాయాఫలం, మాయిక్. హిం॥ మాజూఫల్, మాఫల్. దీనికిమాసికాయఅనియు, మాఫలకాయ అనియు పేర్లు. ఇది చలువ జేసి ఆర్చును; వగరుగనుండును; గ్రహణిరోగములను కట్టును; నాలుక పూత, గళరోగము, వ్రణములు, గాయములు వీనిని మాన్పును; దంతములకు బలమునిచ్చును; నీళ్ళవిరేచనములను కట్టును; స్తనముల పగుళ్ళు, మూలశంక బాధ వీనిని మాన్పును; నోటనీరూరుట, పండ్ల వెంట రక్తముపడుట కట్టును. దీనిని నీళ్ళతోనూరి తీసిన రసమును చెవిలో పోసిన చెవినొప్పి, చీముకారడము వీనిని కట్టును. దీని చూర్ణము తైలముతో లోపలికిచ్చిన చర్మ రోగములను పోగొట్టును.

శుభ్రపరచును. నోటిపూత, కంఠములో రొంపు ( Irritation of the throat ) కొండనాలుక వాలుటను పోగొట్టును. చూర్ణవి మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు.

మాదీఫలపు దుంప:—చిరిగడము చూడుడు.

మాదీఫలము:—Citrus medica, Eng. citron. సం॥ మాతులుంగ, బీజపూర, హిం॥ విజోరానింబు. పుల్లగ, చిరిచేదుగ నుండును. జఠరదీప్తినిచ్చును. వాతము, శ్లేష్మము, పైత్యము, గుల్మము, ఉదరరోగము, వాతపైత్యము, కాస, శ్వాసలు మదాత్యయమను అతి మద్యపానమువలన గలిగెడు రోగము, ముఖము తిరగము, మూలవ్యాధి, చర్ది, అరుచి, సంగ్రహణిరోగము, కష్ట, శూల, మందాగ్ని వీనిని జయించును. విరేచనము గావించును. బలము జేయును. ఈ మాదీఫల రసముతో యితరపైత్యహార రసములు జేర్చి పంచదారతో పాకంబట్టినది మాదీఫల రసాయన మందగు. ఇది మిక్కిలి పైత్యహారమైనది. మరియు యిది అనేక పైవికారదోషములను హరించును.

మాదీఫల రసపానకము:—Sherbet of the juice of do. మాదీఫలరసము పంచదార కలిపి కాచి వడపోసి అందులో సుగంధ ద్రవ్యములు గలిపి పుచ్చుకొనిన పైత్యములు, వాతశ్లేష్మముల నణచును; రుచిబుట్టించును; దాహమును, శ్వాస, కాసలను అణచును.

మాధవి:— బండిగిలివింద చెట్టు చూడుడు.

మానుపసపు:— Berberis asiatica. B. Lycium. Eng. Indian barberry. సం॥ దారుహరిద్రా, దార్వీ. హిం॥ దారుహాలదీ. దీని కర్ర, వేరు చూర్ణము లేక కషాయము చేదుగ కారముగ నుండును; ఉష్ణవీర్యము, కటువిపాకముగలది. చెమట బుట్టించును. జ్వరము, మేహజ్వరము, ఐహికజ్వరము, దోషజ్వరములు, మేహ

వ్రణములు, కర్ణనేత్రరోగములు దీనియందు బుట్టెడు వ్రణములు, వాతము, సెగరోగము, మేహము, కుష్ఠు, నాసారోగము; శూల, తెలుపు, మెరుపు కుసుమరోగములు హరించును. దీనిని నేలవేము చేదుపొట్ల, తిప్పతీగ మొదలగు చేదువస్తువులతో కలిపియిచ్చిన చలి జ్వరము (మన్యపుజ్వరము) విడిచివిడిచివచ్చే జ్వరము, పురాణ జ్వరములు హరించును. కషాయపు మోతాదు పూటకు 3–4 తులముల యెత్తు. చూర్ణపు మోతాదు 1–2 అణాలయెత్తు ఇది స్త్రీల ఋతు దోషములను హరించి గర్భమును శుద్ధిపరచును. పసుపుయొక్క గుణములు దీనియందునూ కలవు. దీని సమూల కషాయముతో తయారుచేయబడినది రసాంజన మనబడును. రసాంజనము చూడుడు.

మానుప్పు:—Carbonate of potash-impure. ఇది అరటిసారుగు లేక కొబ్బరిఆకులు మొదలగు కొన్ని చెట్లను కాల్చి తీసిన క్షారము. దీనిని లోపలికిచ్చిన మూత్రమును గావించును; పుల్లితేనుపులు, అజీర్ణము, ఉదరము, శూలలు, ఉబ్బు, కుష్ఠు వీనిని పోగొట్టును. మూత్రకృచ్ఛ్రమును హరించును. పైనవేసిన గడ్డలను కరగించును. వ్రణముల మాన్పును; లోపలికిచ్చెడు మోతాదు ½ అణా మొదలు 1 అణా యెత్తువరకు. ఉబ్బు, ఉదరము, మూత్రకృచ్ఛ్రము వీనికి అంతకంటె అధిక మోతా దియ్యవచ్చును. ఈ ఉప్పుతో ద్రావకమును తీయుదురు. మేహశాంతికొరకు, మూత్రమును జారీచేయించడము మొదలగువానికి మోతాదు 3 అణాల యెత్తు. ఈ క్షారము నిమ్మపండ్లరసములో వేసి యియ్యనగును.

మాశేరి:—భూతాంకుశపుచెట్టు చూడుడు.

మామిడల్లము:—Curcuma amada. Eng. Mango ginger. సం॥ కర్పూరహారిద్ర. హిం॥ కర్పూర్ హల్దీ. దీని దుంపలను నూరి

అందులో సారాయిని (Spirits) కోడిగ్రుడ్డు తెల్లసొనను వేసి కల్కి తట్టువేసిన పురాణవాత మేహవాతపు నొప్పులు, కవుకు దెబ్బలు, గాయములు, నరుకులు, ఇరుకునొప్పులు హరించును. దీని దుంపలను తినిన శ్లేష్మము హరించును; మేహము, సెగరోగము, నీళ్ళవిరేచనములు వీనిని కట్టును. మోతాదు పూటకు 1-2 తులముల యెత్తు. ఇది అల్లమువలెనే యుండును. మామిడికాయ వాసనగలది. నిమ్మకాయ రసముచేర్చి పచ్చడిచేసిన మిక్కిలి రుచిగా, పైత్యహారముగ నుండి రుచిబుట్టించును.

మామిడిచెట్టు:—Mangnifera indica. Eng. Mango tree. సం॥ ఆమ్ర, రసాల. హిం॥ ఆమ్. పచ్చిమామిడాకు చుట్టచుట్టి చివర పంటితోకొరికి దానితో దంత ధావనము చేసిన నోరు శుభ్రముగ, మనోహరముగ నుండును; దంతములకు, చిగుళ్ళకు బలము జేయును. మామిడాకుల కషాయము పుక్కిలించిన దంతరోగములు, చిగుళ్ళ వాపు, నొప్పులు, నోటిపూత నిమ్మళించును. ఆకులు కాల్చిన పొగ పట్టిన కొన్ని గొంతుకరోగములు నివారణమగును ఆకుల మధ్య యీనెలు కాల్చిచేసిన మసి నీళ్ళలోగలిపి అంటించిన కంటిరెప్పల మీద అగు పులిపిరికాయలు హరించును.

మామిడాకువిస్తరి:—Platter of mango leaves. దీనిలోభోజనము సౌఖ్యము నిచ్చును, రుచిబుట్టించును; సమస్త దోషములను, పిత్తరోగములను హరించును; చలువ, విరేచనబద్ధము జేయును; మేహకారకపు మంటలను, రక్తాతిసారములను జయించును.

మామిడికాయ:—Green mango. లేతకాయ (టెంకకట్టినది)పుల్లగ రుచిగా నుండును; కాక జేయును; వాతపైత్యము గొట్టును; రక్తపైత్యమును, వాతమును, గ్రహణిరోగమును వృద్ధిజేయును; టెంక గట్టినది. పళ్ళునొప్పులుజేయును; కఫము బెంచును; విరేచనబద్ధము,

రక్తపైత్యమును గలుగజేయును; రుచిబుట్టించును. దోరపండు విరేచనబద్ధము జేయును; గురుత్వముగ నుండును. వాతమును గొట్టును; పైత్యము జేయును, జఠరదీప్తి నిచ్చును; అపథ్యమయినది. మామిడికాయకు విరుగుళ్ళు 1 చల్ల, 2 ఉప్పు. దీని జీడి అనగా చొనవంటిది మీదబడిన పొక్కును; నోటికి దగిలిన చిమచిమలాడి వికారముగ నుండును; దీనికి విరుగుళ్ళు 1 కొబ్బరియాకు రసము, 2 కొబ్బరిచిప్పల గంధము. వచ్చిమామిడికాయల ఊరగాయ (Pickle) పొట్టకు బలముజేయును; ఆకలి బుట్టించును. దీని వరుగు ఓడవాండ్రకు వచ్చెడు రోగము (Scurvy) ను పోగొట్టును; పచ్చిమామిడికాయ కుమ్ములో (వేడిబూడిద) నుడికించి రసముతీసి పంచదార కలిపిగాని కలుపకగాని 2-3 తులములయెత్తు వడగొట్టిన మనిషికి త్రాగించిన వడతీరును.

మామిడికాయ తినకూడనివారు:—Those who should not eat green mangoes. మూలవ్యాధి, విసర్పి, గ్రహణి, శ్వాస, కాస, నేత్రరోగము, పైత్యరోగము, వాతరోగము, రక్తపైత్యమును ఈ రోగములు గలవారును, రసమిశ్రమమైన యౌషధము సేవించినవారును మామిడికాయ, దీని పచ్చడి, ఊరగాయ మొదలగునవి వర్జింపవలయును.

మామిడి చిగుళ్ళు:—Young leaves of mango tree. వీని కషాయము వాతపైత్యములను శమింపజేయును మేహశాంతి, విరేచనబద్ధము జేయును. మోతాదు 2½-5 తులములయెత్తు. వీని వేడి కషాయమును పుక్కిలించిన పండ్లనొప్పులు, చిగుళ్ళవాపు శమించును.

మామిడిచెక్క:—Bark of mango tree. దీని మానుచెక్క లేక వేరుచెక్క వగరుగ నుండును; చలువజేయును. వీని రసము లేక నూరినముద్ద లేక చూర్ణము ఆమవాతము, గ్రహణి, సీళ్ళవిరేచన

ములు వీనిని కట్టును; పొట్టకు బలముచేయును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు నూరినముద్ద మోతాదు గచ్చకాయంత మొదలు కరక్కాయంతవరకు. చూర్ణపు మోతాదు 3-4 అణాల యెత్తువరకు. తెల్లదబ్బ (Lungs), గర్భాశయము (Utèrus), ప్రేగులు (Intestines) వీనినుండి పడు రక్తమును అద్భుతముగ కట్టును. వీనిని యిచ్చువిధము చెక్క సారము (Liquid extract) 10 చుక్కలు 120 చుక్కల నీళ్ళలో కలిపినది ఒక మోతాదు. ఈచొప్పున గంటకు లేక రెండుగంటల కొక మోతాదియ్యవలెను. లేదా పచ్చి చెక్కరసము 2-3 తులముల యెత్తుచొప్పున వట్టిదిగాని, అందులో కోడిగ్రుడ్డు తెల్లసొనగాని, యేదయిన జిగురుగలవస్తువు (Mucilage) యును కొద్దిగ నల్లమందును కలిపినదిగాని జామునకొకసారి లేక రెండు జాములకొకసారి యిచ్చినకట్టును. దీని తేలికకషాయము ఋతురక్తస్రావమును, కుసుమరోగమును పోగొట్టును. దీని రసము కోడిగ్రుడ్డు తెల్లసొన కలిపి అందులో కొద్దిగ నల్లమందు గలిపియిచ్చిన నీళ్ళవిరేచనములు, రక్తవిరేచనములు కట్టును. తేలికకషాయపు మోతాదు పూటకు 4 మొదలు 6 తులములయెత్తువరకు. మామిడిచెక్క రసము 2-3 తులములయెత్తు యిచ్చిన గ్రహణి, రక్తగ్రహణి, కుసుమరోగములు మానును. ఇతర ఔషధములకు అనుపానముగాకూడ వాడనగును.

మామిడిచెట్టునీడ:—Shade of do. చల్లగనుండి పంచేంద్రియములకు హితవుగ నుండును; దేహపుష్టి, వీర్యపుష్టి, వాతపైత్యములను, ఉష్ణమును శమింపజేయును; శ్రమను బోగొట్టును; తాపమునణచును.

మామిడి జిగురు:—Gum of do. దీనిని కాళ్ళపగుళ్ళకు వేసి కాచిన నయమగును; దీనిలో నిమ్మపండ్ల పులుసుగాని, నూనెగాని కలిపి పూసిన గజ్జి, చిడుము మొదలగు చర్మరోగములు నయమగును.

మామిడిటెంకలు:—Seeds of do. వీనిలోని పప్పు మార్ణము వగరుగ నుండును; చలువ జేయును; విరేచనబద్ధము జేయును; క్రిమిని హరించును; రక్తస్రావము, అమితబుతురక్తస్రావము, యోనిరక్తస్రావము, నీళ్ళవిరేచనములు వీనిని కట్టును; ఉబ్బసమును (Asthma) హరించును. మోతాదు పూటకు 2 అ॥ మొదలు 4 అణాల యెత్తువరకు. దీనికి సమముగ పంచదార కలిపి తినవచ్చును. పచ్చికాయలలోని పప్పుతీసి చూర్ణించి సమభాగపు పంచదారతో లేహ్యము వండి, మారి (Plague), వాంతిభేది (Cholera) యున్నప్పుడు దానిని తినుచు ఆటెంకల గంధము వంటికి పూసుకొనుచుండిన ఆ జాడ్యములు తగులవు. మామిడి టెంకల పిండి జావ నీళ్ళవిరేచనములను కట్టును.

మామిడితాండ్ర:—Dried juice or jelly of mangoes. సం॥ ఆమ్రావర్త. తియ్యగ, పుల్లగ రుచిగా నుండును; వీర్యవృద్ధి, దేహపుష్టి, బలము వీనినిచ్చును; పైత్యమును; అరుచిని, శ్రమను బోగొట్టును.

మామిడిపండు తియ్యనిది:—Mango sweet ఇది వేడిజేసియార్చును; బాగుగపండి సువాసనగలిగి పలుచని రసముగల తియ్యని మామిడి పండు రుచిగా, మనోహరముగ నుండును; వాతమును హరించును; విరేచనము జేయును; క్రొవ్వుబెంచును; వీర్యవృద్ధిని, వీర్యమునకు వేడిని యిచ్చును; అరుచిని బోగొట్టును; గురదాల (Kidneys) కు, ప్రాణమునకు, హృదయమునకు, మెదడికి, రొమ్మునకు, ప్రేగులకు, మూత్రపుసంచికి, పుంస్త్వమునకు బలము జేయును; శరీరమునకు కాంతి దెచ్చును; గుండెలలోని వికారమును, దగ్గును, తలనొప్పిని, బద్ధకమును పోగొట్టును; దేహపుష్టినిచ్చును; మూత్రముగావించును. పొట్టను మృదువుపరచును; అమితముగ దినిన కాళపైత్యము

జేయును; గురుత్వముగ నుండును, కడుపు బిగబట్టును, వుబ్బును, ఆమము, శ్లేష్మము వీనిని గలుగజేయును; వాత, శ్లేష్మతత్వముల్ల గలవారికి, ద్వంద్వరోగులకును అపథ్యమైనది. దీనికివిరుగుళ్ళు 1 నెయ్యి, 2 వరివేళ్ళ కషాయము, 3 పాలు, 4 శొంఠి లేక శొంఠిపిప్పలి, మిరియాలచూర్ణము, 5 ఉప్పు, 6 సైంధవలవణము, 7 చల్ల, 8 చల్లని నీళ్ళు. తియ్యగ పలచగనుండు మామిడిపండ్ల రసము, పంచదార, యాలుక్కాయలకు బలకర సుగంధద్రవ్యములతో చేసిన లేహ్యము పుచ్చుకొనిన మిక్కిలి రుచిగనుండును; దేహపుష్టి, బలము, వీర్య వృద్ధి, ఆరోగ్యముల నిచ్చును. ఈ పండ్లు అనేక రకములు గలవు. వీనిలో పలచని రసముగలవి, సులభముగ జీర్ణమగును. చిక్కని రసముగలవి ఆలస్యముగ జీర్ణమగును. గురుత్వముగ నుండును. మామిడిపండ్లలో అనేకరకములు గలవు అందులో మృదువుగ నుండునవి కఠినముగ నుండువానికంటె సులభముగ జీర్ణమగును. వీనితో లేహ్యములు, మురబ్బాలు చేసి వాడుదురు. బలము, దేహ పుష్టి, వీర్యవృద్ధి నిచ్చుటయేగాక ఆరోగ్యము నిచ్చును.

మామిడిపండు పుల్లనిది:—Mango sour. మిక్కిలి కాక, గురుత్వము జేయును. పైత్యమును, శీతపైత్యమును, ఆమవికారమును గలుగ జేయును. పాండువు, కామిలరోగములను బుట్టించును; అపథ్యమయి నది. దీనికి విరుగుళ్ళు మామిడిపండు తియ్యనిది చూడుడు.

మామిడిపండ్ల పానకము:— Sherbet of mangoes. పండిన తియ్యనిమామిడిపండ్ల రసములో కొంచెము ఇందుపగింజల గంధమును తేనెయును గలిపి అందులో ఏలకులు, లవంగాలు, ఆకుపత్రికము, నాగకేసరములు, ఇవి నీళ్ళతోనూరి వడకట్టి పైనజెప్పిన మామిడి పండ్లరసములో గలిపి అందులో లవంగపువ్వము, శొంఠి, మిరి

రయాలు, జీలకర్ర వీని చూర్ణమువేసి కలిపి పుచ్చుకొనిన బుద్ధికి, సమస్తేంద్రియములకు బలమును, సౌఖ్యమును యిచ్చును.

మామిడిపిందెలు ఎండినవి:—Dried very young fruits of mango tree. వీనిని వడపిందెలని యందురు. వీని చూర్ణము విరేచన బద్ధముజేయును; గ్రహణినికట్టును. అగ్నిదీప్తినిచ్చును; వీర్యమును గట్టిపడజేయును. చూర్ణపుమోతాదు పూటకు బేడయెత్తు మొదలు 4 అణాల యెత్తువరకు. ఈ చూర్ణమునకు నాలుగురెట్లు పంచదార గలిపి అనుదినము ఉదయపుపూటలను 15 లేక 20 లేక 30 దినములు సేవించిన ఇంద్రియనష్టము, శీఘ్రస్ఖలనము, మూత్రమువెంట ఇంద్రియము పడిపోవడము, అతిమూత్రమును కట్టును.

మామిడిపువ్వు:—Flowers of do. వగరు, తీపి రుచులు, సువాసన గలిగియుండును; పైత్యశాంతి, మేహశాంతిజేయును; విరేచనబద్ధము గావించును; వీనిపచ్చడికి, వీనిని వేసివండిన పప్పుకు పైగుణము లుండును. వీని కషాయము పుక్కిలించిన దంతరోగములు, చిగుళ్ళ వాపు, నొప్పి నయమగును. ఈ కషాయము లోనికి పుచ్చుకొనిన నీళ్ళవిరేచనములను, గ్రహణిని కట్టును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

మామెన:—Maghali root. సం* బ్రహ్మాంతీ౯. దీనిని అరవములో మఘాలీకమంగు అందురు. సుగంధివలె సువాసనగలిగియుండును. దీని కషాయము అరుచి, దాహము, రక్తపిత్తము, కఫము సమస్త మేహములను హరించును. మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులములయెత్తువరకు; దీని పచ్చిదుంపతో ఊరగాయ చేయుదురు.

మారేడుచెట్టు:— Aegle marmelos, Eng. Boel tree. Bengal quince. సం* బిల్వ, శ్రీఫల, మహాకపిత్థ. హిం* బేల్. దీని వేరు లేక అకురసము లేక కషాయము చలువ, మేహశాంతి, పైత్య

శాంతిచేయును; జఠరదీప్తినిచ్చును; శ్లేష్మవాతములు, అగ్నిమాంద్యము, ఆమశూల, విచారపుపిచ్చి, అజీర్ణపుపిచ్చి, తాపము, జ్వరము, మూత్రకృచ్ఛ్రము వీనిని హరించును; శరీరతత్వమును మంచికి మార్చును. వేరు కషాయము గుండెదడ (Palpitation of the heart), విరేచనబద్ధము వీనిని పోగొట్టును. వేరుగంధము సర్పవిషమును హరించును. ఆకు కషాయము ఉబ్బసమును, వమనమును అణచును. రసమునొక్క మోతాదు 2-3 తులములయెత్తు. కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. గంధపు మోతాదు 2-3 తులములయెత్తు. పువ్వులు నీళ్ళలో ఊరబెట్టి కాచితీసినఅరకు (సారాయివలెతీసినది) విషమును, కలరా మొదలగు అంటువ్యాధులను పోగొట్టును. పచ్చికాయ (లేతకాయ) గ్రహణి, రక్తగ్రహణి, నీళ్ళవిరేచనముల కట్టును; అగ్నిదీప్తి నిచ్చును. ఆ కాయను 6 గంటలవరకు కుమ్ములోనుంచి తీసినది చాల పనిచేయును. ఆకు కండ్లకు కట్టిన నేత్రరోగములు నిమ్మళించును. దీని లేత కాయలు ముక్కలుగకొట్టి యెండించినది బిల్వశొంఠియందురు. ఇది గ్రహణి, రక్తగ్రహణి, గ్రహశాంతిసారములను కట్టును. దీని వేరు దశమూలములలో నొకటి. ఇది జ్వరములు జ్వరాతిసారములు మొదలగు రోగములమీద పనిచేయును. దీని ఆకుతో తీయబడిన సారము (సారాయము) కూడ మిక్కిలి పనిజేయును.

మారేడుపండు:—Fruit of do. దీని పండు మిక్కిలి పండినది గాక దోరపండు శ్రేష్ఠము. దీనిగుంజు పంచదారతో కలిపి పుచ్చుకొనిన గ్రహణి, రక్తగ్రహణులకు మిక్కిలి మేలుజేయును. బలమిచ్చును. వాతశ్లేష్మములను హరించును. అగ్నిమాంద్యము(Dyspepsia) ను, శూలను అణచును. విరేచనబద్ధముజేయును. గ్రహణి, రక్తగ్రహణిని కట్టును. పండురసము లేక కషాయముతో పుండ్లను, వ్రణము

లను కడిగినవి శుభ్రపడి మానును. పండుగుంజు, చింతపండు, పంచ దారతో చేసిన పానకము చలువ, మేహశాంతి జేయును. దీనిని ఉదయపు పూటలను బుచ్చుకొనిన సాధారణపు అగ్నిమాంద్యము (Dyspepsia) కుదురును.

మాలకంకిణిచెట్టు, దీనివిత్తులు:— పెద్దమావేరు చూడుము.

మాలతితీగె దీని పుష్పములు:— Aganosma caryophyllata, Echites. C. సం॥ మాలతి. హిం॥ మాలతీ. యిది తీగ ప్రాకును. దీని ఆకులరసము లేక కషాయము కఫపైత్యమును హరించును. దీని పుష్పములరసము లేక కషాయము కఫపైత్యములు ముఖ రోగము, వ్రణము, క్రిమి, కుష్టమును హరించును. నేత్రములకు చలువజేయును. యీ పుష్పములు సువాసనగనుండును. ధరించు కొనిన మనస్సుకు సంతోషమును ఉత్సాహమును కలుగజేయును. రసపుమోతాదు 2-3 తులములు, కషాయపు మోతాదు 2½-5 తులముల యెత్తు.

మావేరు:— పెద్దమావేరు, పిన్నమావేరు చూడుడు.

మాసిపత్రి:—మాచిపత్రి చూడుడు.

మాసినచీర:—Dirty cloth. కట్టిమాపి విడిచినవస్త్రము ధరించుట వలన చర్మరోగములను బుట్టించును. చీరపేలుపుట్టును. అనారోగ్య కరముగను, అలక్ష్మిప్రదముగ నుండును.

మాక్షీకమను తేనె:—A sort of honey. ఇది మంచిగంధపు చెట్ల పుష్పములనుండి దీసిన తేనె. చేదు, వెగటు గలిగి స్వాదుగనుండును. నూనెవలె పలుచగ నుండును. వేడిజేయును. అగ్నిదీప్తి నిచ్చును, లఘువుగనుండును. వాతము, సర్వమేహములు, రాజయక్ష్మ, కుష్టు, నేత్రరోగములు, పాండువు, చర్ది, ఊపిరిగొట్టునొప్పి, విషదోషము వీనిని హరించును. వ్రణముల మాన్పును. మిక్కిలి శ్రేష్ఠమైనది.

మినుపకుడుము:—వాసినపోలి చూడుడు.

మినుపదోసెలు:—అట్లు చూడుడు.

మినుపపప్పు:—Split pulse of black gram. గురుత్వము, చలువ జేయును; బలమిచ్చును; మేహశాంతి, వీర్యవృద్ధి జేయును; శూలను మేహవాతమునణచును; విరేచనబద్ధము జేయును, కఫపైత్యములను బెంచును; గురదాల (Kidneys) కు బలము నిచ్చును; కడుపు కుట్ట జేయును. దీనికి విరుగుళ్ళు మినుములు చూడుడు. దీని కట్టు కొద్దిగ వేడి జేయును. వాతహారముగ నుండును. బలము జేయును.

మినుపపిండి:—Flour of do పొట్టుతీసిన పచ్చిమినుపపప్పు విసిరి పిండి జేసి ధానిని కొబ్బరికాయల (లేతవి) నీళ్ళతో 7 మార్లు భావన జేసి అనగా యెండించి తిరిగి నీళ్ళతో తడిపి యెండించి యీచొప్పున 7 పర్యాయములు భావన జేసిన మినుపపిండి పాలలో పంచదారకలిపి వండి తినిన మిక్కిలి ధాతుపుష్టి, వీర్యపుష్టి జేయును; పుంస్త్వమును హెచ్చించును.

మినుపపిండివంటలు:—Cakes made of black gram. మృదువుగా తేలికగా నుండును. వీర్యవృద్ధి జేయును; బలమిచ్చును. మేహవాతమును హరించును.

మినుపపులగము:—Rice boiled with split pulse of black gram. మాంసమును వృద్ధిబొందించును; వీర్యవృద్ధి జేయును; వాతమును హరించును; గురుత్వముగ నుండును. దీనికి విరుగుడు ఖండశర్కర.

మినుపసున్ని:—Flour of fried black gram mixed with sugar and ghee. మినపపప్పు వేయించి పిండిచేసి పంచదార, లేక బెల్లము నెయ్యివేసి కలిపి వేసినది బలము, వీర్యపుష్టి నిచ్చును. గురుత్వ

ముగ నుండును. ఆకలి నణచును. మేహావాతమును హరించును. విరేచనము జేయును.

మినుములు:— Phaseolus radiatus. P. Roxborghii. Eng. Black gram. సం* మాష. హిం* ఉడద్, యురిడ్. అనగా మిన పప్పులో చేయు గారెలు, కుడుము, (ఆవిరి) రొట్టె మొదలగువాని సామాన్యగుణములు. అర్చి నీరుపెట్టును; స్వాదుగనుండును; శాక పైత్యము జేయును; జిగురు, చమురు గలిగియుండును; దేహమునకు గురదాలకు బలముజేయును; వాతమును గొట్టును; వీర్యమునకు వేడిని, వృద్ధి నిచ్చును; విరేచనము చేయును; కడుపులో వాయువు బంధించును; ఆలస్యముగ జీర్ణమగును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 జీర్ణ ఔషధములు, 3 ఇంగువ, 4 అల్లము, 5 ఖండశర్కర. మిను ములను నీళ్ళతోనూరి లింగమునకు లేపనముజేసిన దానికి బలము జేయును. అలాగు నీళ్ళతోనూరి కొద్దిగ పలుచగ జేసి కుష్టురోగపు పుండ్లకు వేసిన అవి మానును.

మిరపకాయలు ఎండువి:—Capsicum annum &c. Frutescens. Eng. Spanish pepper or chillies-dried. సం* రక్తమిరిచ, కటువీర, అజడా. హిం* లాల్ మిరచ్. బాగుగ పండియెండిన మిరప కాయలు కారముగనుండును; శాక జేయును; వాతతత్వమున కను కూలముగనుండును; పాము విషమును హరించును; ఆహారమును జీర్ణము జేయును; తేలిక నిచ్చును; విరేచనము గావించును; నరము లకు సత్తువజేయును; పొట్టకు బలముజేయును. కీళ్ళలో సత్తువలేని ఆమవాతము (Rheumatism) పక్షవాతము, చెవిలోనిపుండు, అజీర్ణ ముతో నున్న అగ్నిమాంద్యము (Dyspepsia), ఉదర రోగము వీనిని హరించును. వ్రణములు, సవాయి మొదలగు వ్యాధులవలన చెడిపోయిన తత్వమును బాగుపరచును. దీని చూర్ణపు మోతాదు

½ అ॥ మొదలు 2 అణాల యెత్తువరకు. మాత్రలుగాచేసి యియ్య వచ్చును. దీని అరకు (Tincture) మోతాదు 1 మొదలు 2 డ్రాంలు (60 మొదలు 120 చుక్కల) వరకు ఒకగ్లాసు (సుమారు 8 తులములయెత్తు) నీళ్ళలోవేసి యియ్యవచ్చును. మిరపకాయలు ఆముదములోగాని, నేతిలోగాని వేయించినూరి పలాస్త్రీగా జేసి పట్టువేసినను లేదా మిరపకాయల చూర్ణమును పందిక్రొవ్వు లేక ఆముదములో గలిపి మర్దనజేసినను పక్షవాతము నివృత్తించును. క్రొత్తగ తగిలిన గాయముపైని మిరపకాయల గుండపోసి అందు పైన నూనెపోసిన అది నొప్పిచేయక శీఘ్రముగ మానును; వాత మును చేయనియ్యదు. వరహాయెత్తు మిరపకాయలును, బేడయెత్తు ఉప్పును ఇవిరెండు మెత్తగనూరిన ముద్దను పావుశేరు (20 తుల ముల యెత్తు) వేడినీళ్ళలో కలిపి చల్లారిన వెనుక అందులో 5 గ్రాములు సిరకాకలిపి పుక్కిలించిన అంగిటిలోని పుండ్లను శుభ్ర పరచి మాన్పును. ఎండు మిరపకాయలలోని గింజలు బేడెత్తు మొదలు అర్ధరూపాయ యెత్తువరకు నోటిలో వేసుకొని నీళ్ళతో మ్రింగిన శూలలు వెంటనే నిమ్మళించును. మిరపకాయలు మంగల ములో మాడ్చి అందులో నీళ్ళుపోసి ఆనీళ్ళు తేర్చి త్రాగించిన అజీర్ణము, మరిడిజాడ్యము (Cholera) నిమ్మళించును; కాక తత్వము గలవారికి నష్టముజేయును; పైత్యమును హెచ్చించును. మిక్కిలి తినిన వీర్యనష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి. 2 సిరకా, 3 పులుసు, 4 మిరియాలు. మిరపకాయలు చాలజాతులు గలవు. అందులో ఎర్రగ పొడవుగ నుండెడు మిరపపండ్లు శ్రేష్ఠము.

మిరపకాయలు పచ్చివి:— Green chillies. వీనిని కూరలలో వేసి వండిన రుచిగానుండును కాక, పైత్యము జేయును. మిక్కిలి దినిన వీర్యనష్టము జేయును. ఆకుకూరలు, కాయగూరలు వీని శీతల

గుణమును బోగొట్టును, కాకతత్వము గలవారికి నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పులుసు, 3 సిరకా.

మిరియాల అరఖు:—Distilled water of black pepper. అనగా బట్టీలో సారాయివలె మిరియాలతో తీసినది. శ్లేష్మపైత్యములను, వాతమును, గుల్మలను, జ్వరమును హరించును, జఠరదీప్తి నిచ్చును. మోతాదు పూటకు 2-3 తులములయెత్తు.

మిరియాలు:— Piper nigrum. Eng. Pepper black & white. సం॥ మరీచ, యవనప్రియ, వల్లిజ. హిం॥ కాలీమిరచ్. సాధారణముగ బజారు మిరియములను నల్లమిరియములనియు నీళ్ళలో నానబెట్టి పొట్టుతీసినవి తెల్లమిరియాలనియు వాడుదురు. వీని చూర్ణము, కషాయము లేక నీళ్ళతోనూరి తీసినరసము కారముగనుండును; కాకజేసి అర్చును; శ్లేష్మమును, కఫమును కరగించును; శరీరములోని నీటిని ఆర్చును. రక్తమును శుభ్రపరచును; శ్లేష్మము, వాతము, క్రిమి, మేహము, హృద్రోగము. కుష్టు, పురాణజ్వరము, అస్థిగతజ్వరము, అగ్నిమాంద్యము, కాస, శ్వాస, క్షయ, ఉబ్బురోగము, మూలవ్యాధి, విషము వీనిని జయించును; మూత్రమునందు బుట్టెడు సుద్దను పోగొట్టును; ఆహారమును జీర్ణముజేయును; వీర్యమునకు వేడిని, వృద్ధినిచ్చును; సమధాతువు జేయును; దేహములోని మలములను వెడలించును; మూత్రమును జారీచేయును; జ్ఞాపకశక్తికి బలమిచ్చును; నరముల రోగములకు (Nervous affections) మేలు జేయును. పొట్టకు వేడి పుట్టించును; బలముజేయును; జీర్ణశక్తి నిచ్చును; ఆకలి దెచ్చును. వీని తేలిక కషాయము గురుత్వ పదార్థములను త్వరగా జీర్ణింపజేయును; చెడురక్తమును శుభ్రపరచును, శర్కర, పాలతో కలిపి పుచ్చుకొనిన ధాతుపుష్టి చేయును. మిరియాలు నీళ్ళతో నూరినముద్ద గచ్చకాయలంతేసి యుండలు ఒకటిగాని,

రెండుగాని, మూడుగాని తినిన వాంతిభేది (Cholera) కట్టును. ఇండుపకాయలంతేసి యుండలు పూటకు, ఒకటిగాని, రెండుగాని. మ్రింగిన నీళ్ళవిరేచనములు కట్టును; మిరియాలు చితుకగొట్టి దానితో సమంవాముగాని, లవంగాలుగాని గరిటెలో వేసి మాడిపోయేటట్లు వేసి దానిలో నీళ్ళుపోసి వడియపోసి ఆ నీళ్ళు యిచ్చుచుండినగాని, తగిన ఔషధంయిచ్చు దానికి అనుపానముగా నిచ్చుచుండిన, అజీర్ణ విరేచనములు, నీళ్ళవిరేచనములు కట్టును. పొట్టకు బలముచేయును; కడుపులోని వాతమును వెడలించును; ఆమవాతము (Gout), పక్ష వాతములకు మేలుజేయును. వేపిన మిరియాల తేలిక కషాయమిచ్చి నను లేక మిరియాలను గరిటెలో బోసి వానిని మాడ వేయించి అందులో తగుమాత్రము నీళ్ళుపోసి దించి ఆనీళ్ళ నిచ్చినను విరేచన ములను, కలరా విరేచనములను వాంతిని కట్టును. వీని తేలిక కషా యము పుక్కిలించిన కొండనాలుక వాలడము నివృత్తించును. మిరి యాల చూర్ణమును తేనెతోగలిపి పుచ్చుకొనిన దగ్గు, గొంతుక నుసకట్టును. సుమారు పావుతులమెత్తు మిరియాలు చెక్క, ముక్క లుగాకొట్టి సుమారు తులమెత్తు బెల్లములో నీళ్ళుపోసి ముదురు పాకముపట్టి అందులో మిరియపు ముక్కలుపోసి కలిపి ఇండుపగింజ లంతేసి యుండలుచేసి యారాయుండ నొక్కొక్కటి అప్పుడప్పుడు నోటిలోనుంచుకొని ద్రవము మ్రింగుచుండిన దగ్గు, నుస కట్టును. మిరియాలు, బియ్యము, గవ్వపలుకు సాంబ్రాణి, మెత్తగానూరి గరి టెలో వుడికించి వేడివేడిగా కణతలకు, నొసలకు పట్టువేసిన పడిశె భారము తలనొప్పి, జలుబు, జ్వరము నయమగును. సుమారు అర తులమెత్తు బెల్లము పాకముబట్టి ముదురుపాకము వచ్చునపుడు అందులో సుమారు బేడెత్తు మిరియాలు చెక్కముక్కలుగా కొట్టి వేసి కొద్దిగ నెయ్యివేసి కలిపి వేడిగనుండునపుడు ఉదయపు పూటల

నిచ్చిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. 3-4 దినము లిట్లు చేయ వలెను. కొద్దిగ మిరియాలు చెక్కముక్కలుగా కొట్టి సుమారు తులమెత్తు నేతిలో బాగుగ వేయించి యానేతిని మిరియాలముక్కలు సహా ప్రథమ కబళముతో రెండుమూడు పూటలు పుచ్చుకొనిన గ్రహణి, ఆమవిరేచనములు, నీళ్ళవిరేచనములు కట్టును; 8 లేక 10 మిరియములు రాత్రి సుమారు రెండుతులముల యెత్తు ఆవుమజ్జిగలో నానవేసి ఉదయమున ఆమిరియములను ఆమజ్జిగతో నూరి అందులో గుంజెత్తు మొదలు 4 గుంజల యెత్తువరకు రససింధూరము చూర్ణించి కలిపి సుమారు వారము దినములు ఉదయపు పూటల నిచ్చిన పురాణ మేహాజ్వరములు, ఆహికజ్వరములు కట్టును. మిరియాలు 1 తు॥ సీమసోపు (Carraway seeds) 1½ తు॥ వీనిని మెత్తగ చూర్ణించి యేడున్నర తులముల మంచి తేనెలోవేసి చక్కగ మిశ్రమమగునటుల నూరియుంచి పూటకు సుమారు ½ తు॥ యెత్తు చొప్పున దినమునకు రెండు లేక మూడు పూటలను ఇచ్చిన వృద్ధులకు, బలహీనులకు నుండు మూలవ్యాధి కుదురును; మరియు దీనివలన గుదస్థానము బయటికి వెడలినది నయమగును; కొద్దిగ మిరియాలు (బేడయెత్తు) చిదుకగొట్టి తులమెత్తు ఆవునెయ్యిలో వేసి కాచి చల్లారనిచ్చి యానేతితో మర్దనజేసిన కాళ్ళు చేతులు మంటలు నయమగును. వీనితో చేసిన తైలములో మర్దనచేసిన వాత మేహావాతపు నొప్పులు మానును. వీనిని నానబెట్టి పైపొట్టు తీసివేసినవి తెల్లమిరియాలు అందురు. ఇవి పనిలో నల్లమిరియాల కంటె సౌమ్యముగ అనగా తక్కువ వేడితో పనిచేయునుగాని రెండు గుణములు సమానములే. మిరియాలు దేహమునకు తక్కువ రక్తము కలిగియున్నవారికి కనుపడిన యుబ్బుగలవారికిని, సెగ రోగము గలవారికిని, కాకతత్వము గలవారికిని తలనొప్పి దెచ్చును;

గొంతుకకు, గుండెలకు, కార్జము (Liver) కు నష్టము జేయును; దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 పులుసు, 3 తేనె, చూర్ణపుమోతాదు పూటకు 1 అ॥ మొదలు 3 అ॥ యెత్తువరకు. కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. తేలిక కషాయపు మోతాదు 4 మొదలు 8 తులముల యెత్తువరకు; రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు.

మిరియాలచారు:—Pepper water. మిరియాలు వేసి కాచినచారు రుచిగ నుండును; సమధాతువు జేయును; జఠరదీప్తి నిచ్చును; త్రిదోషములను శమింపజేయును; విరేచనము గావించును. పథ్యము ముగను ఆరోగ్యముగ నుండును.

మిళితమనుచల్ల:—A sort of butter milk. చల్ల చూడుడు.

మీగడిసామాన్యగుణము:—Cream generally. కమ్మగ, రుచిగ నుడును; చలువజేయును; మేహశాంతి, పొడిదగ్గును, ఎక్కిళ్ళను అణచును; గుండెలకు, దేహమునకు బలమిచ్చును; కార్శ్యరోగము హరించును; వీర్యవృద్ధి, బలముజేయును; పైత్యవాతములనణచును; రుచిబుట్టించును; రక్తపైత్యమును హరించును; ఆలస్యముగ జీర్ణమగును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 అల్లపుమురబ్బా. పాలమీద మీగడ, పెరుగుమీద మీగడ చూడుడు.

ముంగి.—Mungoose flesh of. సం* నకుల, సర్పవైరి. దీని మాంసము శ్వాస కాసలను, క్రిమిరోగమును జయించును; జఠరదీప్తినిచ్చును; వాతము నణచును; బలము జేయును; పైత్యమును, హెచ్చించును.

ముంజులు:—తాటిముంజులు చూడుడు.

ముంజదర్భ:—Saccharum munja. సం* ముంజ, స్థూలదర్భ, బ్రహ్మమేఖల. హిం* మూంజ్. దీని వేళ్ళు సమూలకషాయము

మేహశాంతి జేయును; మూత్రరోగము, విసర్పి, రక్తదోషము, నేత్ర రోగము వీనిని హరించును. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులములవరకు.

ముంత మామిడిచెట్టు, పండు:—జీడిమామిడిచెట్టు, పండు చూడుడు.

ముక్కుతుమ్మిడితీగ:—Centipeda orbicularis. Artemisia Sternutatoria Eng. Sneezwort. సం॥ ఛిక్కిక, క్షవకృత్; ఛిక్కిపత్రి. హిం॥ నక్ చికినీ. దీనిని నకచికిని యని యందురు. దీని ఆకు నలిపి వాసన చూచినను, గింజల చూర్ణము పీల్చినను అమిత ముగ తుమ్ములువచ్చును. పడిశము, తలనొప్పులు, పీనసరోగము నయమగును. దీని ఆకు మెత్తగానూరి ఉడికించి దవడకు పట్టువేసిన పన్నుపోటు, వాపు నయమగును. పార్శ్వపు తలనొప్పికి పట్టువేసిన తగ్గును. దీని సమూల కషాయము వేడిజేయును. వాతము, పక్షవాతము, కీళ్ళనొప్పులు, క్రిమి వీనిని హరించును. దీని తేలిక కషాయ ముతో కళ్ళు కడుగుచుండిన నేత్రరోగములు మానును.

ముక్తాది హారగుణము:—A necklace or string of pearls &c. ముత్యము, పగడము, వైడూర్యము, వజ్రము, స్ఫటికము మొదలగు వానితో నిర్మింపబడిన హారములు ధరించుటవలన మేహశాంతి జేయును. వీర్యమునకు బలమునిచ్చును. విషమునుగొట్టును. దృష్టికి బలమిచ్చును. ఆరోగ్యమును, సంతోషమును గలుగజేయును. లక్ష్మీ ప్రదముగ నుండును.

ముఖప్రక్షాళనము:—Washing of the face. చల్లని నీళ్ళతో ముఖముకడుగుకొనిన రక్తపైత్యము, శోష, మొటిమలు(పొక్కులు) వీనిని హరించును. కండ్లకు, మెదటికి మేలుజేయును. మనస్సుకు నిర్మలత్వము గలుగును. గోరువెచ్చని వేడినీళ్ళతో గూడ ముఖ

ప్రక్షాళనము చేయుటవలన మరింత ఆరోగ్యముగా నుండును. పళ్ళుపోటు, కుదుళ్ళువాపు, పుప్పిపళ్ళు వున్నవాళ్ళకు అనుకూలముగ నుండును.

ముచుకుందము:—**Pterospermum Suberifolium.** సం॥ ముచుకుంద, ఛత్రవృక్ష. హిం॥ ముచ్‌కుంద్, ముచుకుంద. అనగా లోలుగచెట్టు. దీనివేరు, చెక్క, ఆకు వీనికషాయము చేదుగ కారముగ నుండును. రక్తపైత్యము, ముఖరోగము, శిరోరోగము వీనిని హరించును. దీనిచెక్క నూరి వుడికించికట్టిన కీళ్ళనొప్పులు, వాపు, వుండగునవి మానును. దీనిచూర్ణము 1–2 అ॥ల యెత్తు 10–15 తులముల ఆవుపాలలోవేసి పుచ్చుకొనుచుండిన బలము జేయును; స్త్రీలకు పాలుబడజేయును. 3 అ॥ యెత్తుకంటె అధిక మోతాదిచ్చిన వమనము జేయును. కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. దీని ఆకులు పొడవుగా చివర చీల్లలుగలిగి యుండును. వీనితో విస్తరాకులు కట్టుదురు.

ముచుకుందపుష్పములు:—**Flowers of do.** అనగా లోలుగచెట్టు పువ్వులు. యీపుష్పములు పొడవుగా, గుండ్రముగా, గట్టిగా మిక్కిలి సువాసనగలిగి కారముగ, చేదుగ యుండును. వీని రసము, చూర్ణము లేక కషాయము శ్లేష్మము, దగ్గు, శోథ, వ్రణము, శాఖర, చర్మరోగము, శిరోరోగము, రక్తపిత్తము, పిత్తరక్తవికారము, విషము, త్రిదోషములను హరించును. కుసుమరోగములను నివారణజేయును. కంఠస్వరమును బాగుచేయును. రసపుమోతాదు 1, 2 తులములు; చూర్ణపుమోతాదు 2–3 అణాలయెత్తు; కషాయపుమోతాదు 2½–5 తులములయెత్తు. యీపుష్పములను కల్లితో నూరి పట్టువేసిన పార్శ్వపుతలనొప్పి నయమగును.

ముత్తువపులగము:—Pavonia odorata, Sida cordifolia. Eng. Country mallow. సం* బలా, వాట్యాలకా. హిం* ఖరైంటీ. యీ ముత్తువపులగములు నాలుగు జాతులు. బలా చతుష్టయ మందురు.

1. బల. సం* బలావాట్యాలక (Sida cordifolia)అనగా చిన్నముత్తువ ములగము– కోలగా కంగోరాలు గలిగి యుండును.

2. మహాబలా. సం* పీరపుష్పి, వర్షపుష్పి (Sida Asitica) అనగా పెద్దముత్తువములగం గుండ్రని ఆకులు కంగోరలు గలిగియుండును. యీ రెండూ ఒకే జాతిలోనివి.

3. నాగబలా. సం* గాంగేరుకీ. నాగబలా (Sida Alba) నిత్యమల్లి ఆకులులాగున యుండి నేలప్రాకును. యీ మూడింటి పుష్పములు ఒకేమోస్తరుగా యుండును. పై వాని గుణములు గలిగియుండును. నాగముత్తువపులగం చూడుడు.

4. అతిబలా, శీతపుష్పి (Sida rhombifolia mealya Rotandifolia) అనగా దువ్వెన చెట్టు. గుండ్రని పెద్దఆకులు పచ్చని పూవులు పూయును. దీనిని తుత్తురుబెండ యందురు. తుత్తురుబెండ చూడుడు. వీనిసమూలకషాయము లేక చూర్ణము మధురముగ సువాసనగ నుండును. దేహపుష్టి, బలము, వీర్యపుష్టి జేయును. ఇంద్రియ నష్టమును కట్టును. పుంస్త్వమును హెచ్చించును. మూత్రము వెంట ఇంద్రియము పోవుదానిని కట్టును. హృదయమునకు బలము జేయును, బలము, కాంతి నిచ్చును, రక్తాతిసారము, ఉబ్బు, వాతము, శూల, అరుచి వీనిని పోగొట్టును; మేహశాంతిజేయును. వాతరక్తము, రక్తపిత్తము, గుండెల హృద్రోగము, క్షయ వీనిని హరించును. దీని తేలిక కషాయముగర్భిణీ స్త్రీలజ్వరము, ఉబ్బు మొదలగు జబ్బులను దీసివైచును; జ్వరితుల

జీర్ణజ్వరితుల కిచ్చిన మేలుజేయును. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. లేలిక కషాయపు మోతాదు 4 మొదలు 8 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 1 అ॥ మొదలు 2 అ॥ యెత్తువరకు. బలా చతుష్టయ మనగా, బలా, అతిబలా, మహాబలా, నాగబలా యని 4 విధములు గలవు. ఇంచుమించుగ వీనికి గుణములు సమానమే.

ముత్యపుచిప్పల సున్నము:—Lime of pearl oysters shells. సం॥ శుక్తి, ముక్తాస్ఫోట. దీనిని తాంబూలములో వాడుక జేసిన కాక జేయును; విరేచనము గావించును; జఠరదీప్తిని, తేలికను యిచ్చును; గుల్మము, శూల, క్రిమిరోగము, అరుచి, కఫము, వాతము వీనిని జయించును.

ముత్యముల భస్మము లేక దీని సున్నము:— Calx or Lime of pearls. క్రమముగ చేయబడిన ముత్యముల భస్మము మేహశాంతి, పైత్యశాంతి జేయును; సర్వశూలలను, క్రిమిని, జ్వరమును, క్షయలను, కఫమును హరించును; వీర్యవృద్ధి, దేహపుష్టి, ఆయుర్వృద్ధి వీని నిచ్చును; ఆకలి బుట్టించును; అజీర్ణవిరేచనములు, గుండెలలో మంట (heart burning), కడుపులో పుండజ్వరము (Typhus fever) వీనిని బోగొట్టును. హృదయమునకు మేలుజేయును; ఉల్లాసము నిచ్చును. మోతాదు పూటకు 1 మొదలు 2 గుంజలెత్తువరకు. అపరిశుద్ధమైన ముత్యముల భస్మము లేక చూర్ణమువలన గలిగిన వికారము నెయ్యి, తేనె, కలకండ, ఆవుపాలు వీనిని సమముగ నేకముచేసిపుచ్చుకొనిన హరించును. దీనిసున్నము తాంబూలములో సేవించుచుండిన పైగుణముల నిచ్చుటయేగాక త్రిదోషములను, కుక్షిరోగములను హరించును. నేత్రములకు, ధాతువులకు, బుద్ధికి

బలమిచ్చును. వీర్యవృద్ధి నిచ్చును. తాపము, అతిసారము, మూర్ఛ, భ్రమ, విషము వీనిని హరించును, కాంతి నిచ్చును.

ముత్యములు:—Pearls its powder. సం॥ ముక్తా, శశిప్రభ, మాంగల్యదర్శన. హిం॥ మోతీ. యిది ముత్యములను ధరించుట వలన దేహకాంతి, బుద్ధిబలము, ఆరోగ్యమును, సంతోషమును గలుగ జేయును. గ్రహదోషముల శాంతింప జేయును. దీనిని పన్నీటితో నూరి యెండించిన చూర్ణమగును. నేత్రముల బలహీనము పోగొట్టును; దృష్టిని హెచ్చించును; గుండె అదురు (Palpitation of heart), నరముల జబ్బుచే కాళ్ళు చేతులవణుకు, పైత్యము వలన గలిగిన విచారము, రక్తస్రావము వీనిని బోగొట్టును. దీనికి ముత్యభస్మముయొక్క గుణములన్నియు గలిగియుండును. చూర్ణపు మోతాదు 1/2 మొదలు 1 గుంజలయెత్తువరకు.

ముద్రబెండ చెట్టు:—తుత్తురు బెండ చెట్టు చూడుడు.

మునగకాయ:—Green fruit of horse radish. మునగకాయ దీని కూర రుచిగ, కమ్మగ నుండును. వీర్యపుష్టిని, మిక్కిలి జఠరాగ్నిని యిచ్చును; మేహశాంతి జేయును; మూలవ్యాధిని పోగొట్టును; కఫపైత్యముల నణచును; శూల, కుష్ఠు, క్షయ, శ్వాస, గుల్మము వీనిని హరించును. లేతది కఫమును, వాతమును గొట్టును; వీర్యపుష్టి జేయును; పథ్యముగ నుండును. ముదురుకాయ శ్లేష్మము, వాతము జేయును. దీనికి విరుగుళ్ళు 1 బెల్లము, 2 నెయ్యి. మిక్కిలి లేతది వీర్యస్తంభన జేయును.

మునగ చెట్టు:—Moringa pterygosperma. Eng. horse radish tree. సం॥ శిగ్రు, తీక్ష్ణగంధా, శోభాంజన. హిం॥ సహింజన్, సైంజినా. దీని లేత ఆకుకూర వండి తినిన చిరిచేదుగ, స్వాదుగ

నుండును; శుక్రవృద్ధి నిచ్చును; విరేచనము జేయును; వంటిసీరసను దీయును; ప్రసవమైన స్త్రీలకు పాలుపడును; నేత్రరోగములను, వాత పైత్యములను, విషములను హరించును; దీనికి దీనిరసము లోపలి కిచ్చిన ఈడ్పులను (spasms)కట్టును; వాతమును హరించును. దీని రసములో కొద్దిగ ఉప్పుగలిపి యిచ్చిన బిడ్డల అజీర్ణము హరించును. దీనిరసములో కొద్దిగ మిరియాలునూరి కలిపి కండ్లపైన నుదుటను పట్టువేసిన తలదిమ్ము (vertigo) మానును. ఆకు నూరి కట్టిన గడ్డలు త్వరగ చీముపట్టి పగులును. మునగఆకు, వస, ఓమము నూరి నూనెలో ఉడికించి కట్టిన గాయములు, దెబ్బలు, కవుకు దెబ్బలు మానును; నొప్పితీయును. ఆకులను ఆముదముతో వెచ్చ జేసికట్టిన బుడ్డ .(Hydrocele) అణగును. ఆకునూరి కట్టిన వ్రణములు, నారికురుపులు మానును. ఆకురసములో నూనెకలిపి కాచి ఆనూనె చెవిలో బోయుచుండిన కర్ణరోగములు మానును. రసము లోపలికిచ్చు మోతాదు 1 మొదలు 2 తులముల యెత్తువరకు. యెర్రని పువ్వులును, కొద్దిగ యెరుపురంగుగ నుండుకాయలుగల చెట్లును గలవు. దీనికిని మామూలు మునగచెట్టు గుణములే గలిగి యుండును.

మునగచిగుళ్ళు:—Tender leaves of do. లేతమునగ చిగుళ్ళను ఉదయపు పూటలను పుచ్చుకొనిన వాతమును, పైత్యమును, క్రిమి రోగమును, మేదస్సును, కఫమును హరించును; నేత్రవాతమును పోగొట్టును; వీర్యమునకు వేడినిచ్చును. మోతాదు అరతులమెత్తు మొదలు తులమెత్తువరకు.

మునగజిగురు:—Gum of do. దీనిని పాలలో గలిపి కణతలకుపట్టించిన తలనొప్పి మానును. దీనిని పైనపట్టించిన అడ్డగర్రలు, సుఖ

వ్యాధి సంబంధమగు కాళ్ళు చేతుల నొప్పులు హరించును; గోరు చుట్టుకు పైనపట్టించిన అది హరించును.

మునగపువ్వు:—Flowers of do. వగరుగ నుండును; త్రిదోషహర మైనది, వీర్యపుష్టి చేయును; వాతపైత్యమును, క్రిమిరోగమును, నేత్రహతములను హరించును; తేజస్సు నిచ్చును; రుచిబుట్టించును. దీనితో లేహ్యము చేయుదురు; కూరవండి తిందురు. వీనిని నేతితో వేయించి పుచ్చుకొననగును. వీనిచూర్ణమును తేనెతో పుచ్చుకొన వచ్చును. మోతాదు పూటకు 1-2 అణాలయెత్తు. పచ్చిపువ్వులు వెచ్చజేసి నేత్రరోగములకు కట్టిన నవి బాగగును.

మునగవిత్తులు:—Seeds of do. వీనిచూర్ణము వేడిచేయును; వీర్య స్తంభన, వీర్యవృద్ధి చేయును, ముక్కు, కండ్లు వీనియందు బుట్టెడు రోగములు, రక్తపైత్యము, సుఖవ్యాధి, ఉదరము, శూల, ప్రమేహమును హరించును. మోతాదు 1-2 అణాలయెత్తు.

మునగవిత్తులతైలము:—Oil of seeds of do. కారముగ నుండును. వేడిజేయును. చర్మరోగములు, వ్రణములు, దురద, వాతము, కఫము, క్రిమి, ఉబ్బురోగము వీనిని హరించును. పైనపూసిన లేక మర్దన చేసిన వాత మేహవాతనొప్పులు; ఆమవాత (Rheumatism) నొప్పులు, కీళ్ళనొప్పులు, కాళ్ళు చేతుల నొప్పులు నివృత్తించును.

మునగవేరు:—Root of do. దీని చెక్క కారముగ నుండును; కాక జేయును; వాతము, క్రిమి, ఉబ్బు, ఉదరము, సన్నిపాతము, అభిఘాతజ్వరము, శ్లేష్మము, జలుబు వీనిని జయించును, అగ్నిదీప్తి నిచ్చును; పక్షవాతము, ఆహికజ్వరము, మూర్ఛ, అపస్మారము (Hysteria) వీనిని హరించును; ఈడ్పులు కట్టును. దీనిని యితర కాక మందులతో నూరి లోపలికిత్తురు. వేరుచెక్క లేక మాను చెక్క

రసము ఆహాలతో నూరి పట్టువేసిన వాతపునొప్పులు, పక్షవాతము, శ్వాస ఇవి హరించును; చర్మము ఎఱ్ఱబడును. వేరుచెక్క నూరిన ముద్ద పుప్పిపంటిలో బెట్టిన పంటినొప్పి హరించును. దీనిని బియ్యపు కడుగుతో జీలకఱ్ఱ వేసి నూరి పట్టించిన చిగుళ్ళవాపు, వానిపుండు, పన్నునొప్పి మానును. దీని తేలికకషాయముతో చేసిన పాకము (syrup) పుచ్చుకొనిన గొంతుక బొంగురు పారడము మానును. దీని చెక్క (వేరుచెక్క ప్రశస్తము) చితుకగొట్టి వెచ్చజేసి కట్టిన గండమాలలు. కఠినమైన గడ్డలు పగులజేయును.

ముసుగుతామర:—Mimosa pudica. Eng. sensitive plant. సం॥ లజ్జావతి, రక్తపాది, స్పర్శలజ్జా. హిం॥ లజ్జావంతీ, శర్మానీ. యిది ఎరుపు నలుపు కలసిన రంగుగల తీగె. నేలపైని ప్రాకును; జమ్మియాకులవంటి చిన్న ఆకులును మృదువైన కొద్దిపాటి ముండ్లును పచ్చని పువ్వులు పూయును. నిద్రగన్నివలెనె దీని యాకులను ముట్టుకొనిన ముడుచుకొని పోవును. దీనియాకుల కషాయము కారముగ నుండును; రక్తపైత్యము, అతిసారమును జయించును; మూలవ్యాధిని శమింపజేయును. దీని వేరుకషాయము మూత్రకృచ్ఛ్రమును పోగొట్టును. దీని వేరును, ఆకును మూలవ్యాధిని, భగందరమును పోనణచును; ఆకు చూర్ణముచేసి కొద్దిగ (5-6 తులములయెత్తు) పాలలో గలిపి నియ్యనగును. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణపుమోతాదు పూటకు 2-3 అ॥ యెత్తు. దీని వేరు గంధము భంగదరమునకు పూయనగును. దీని యాకు వెచ్చచేసి మూలవ్యాధికి గుదస్థానమున కట్టనగును.

ముయ్యాకుపొన్న:—Desmodium Gangeticum, Hedysarum G. సం॥ శాలిపర్ణీ. విదారిగంధా. హిం॥ సారివన్. దీని సమూలరసము కషాయము చేదుగ నుండును; ఇది దశమూల

ములలో నొకటి. వేడిజేయును త్రిదోషహరమైనది. శ్వాస కాసలను శమింపజేయును. పడిశము, జ్వరము, విదాహము, తాపము,విషమ జ్వరము, మేహము, ఉబ్బు, కఠినమగు వాతరోగము వీనిని బోనణ చును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

మురదారుసింగు:—Plumbi oxidum or Litharge. సం॥ నాగ సత్వ, మృదారుశృంగి, వ్రణఘ్న. హిం॥ ముర్దాసింగ్. దీనిని ఔషధములలో వేయుదురు. యిది ఖనిజకంకుష్టము దీనిని బోదారు శృంగి యందురు. గుజరాతు దేశము (Guzarat) న పర్వతముల యందు బుట్టును బరువుగా, పచ్చగ, తళుకు గలిగియుండును. రసబద్ధము జేయును. వెంట్రుకలకు కాంతిదెచ్చును, సుఖజాడ్యములు, వ్రణములు, పొక్కులు మొదలగు చర్మరోగములను బోగొట్టును. దీనిని వట్టిదే లోపలికి యియ్యరు. విరేచనబద్ధము జేయును. దీనిని సిరకాలో కలిపి పూసిన ముఖమునిూది బొటిమలు అణగిపోవును. అందమిచ్చును. దీనిని అల్లపురసముగాని, మాదీఫలరసముతో గాని రెండింటిలోగాని 3 దినములు భావనచేసిన శుద్ధియగును. దీనిని తీగ జిల్లేడుగాని, జిల్లేడుపాలలో నూరి పుటముబెట్టిన నల్లని భస్మమగును. దీనిని అనుపాన భేదములతో వాడిన శగ సవాయిలు చర్మరోగ ములయందు మిక్కిలి పనిజేయును. మోతాదు 1-2 గురిగింజల యెత్తు.

మురయను గ్రంథ్యము:—Murraya exotica. సం॥ మురా, గంధ వతీ, మురామాంశీ. హిం॥ మురా. ఏకాంగీ. ఇది చేదుగ, వగరుగ, తీపి రుచులు గలిగియుండును. వేడిజేయును. పైత్యము, శ్లేష్మము, విసర్పి, శరీరము సన్నగిల్లుట. గాయము, క్షయ, భ్రమ, కుష్ఠు, వాతము, రక్తదోషము వీనిని హరించును. చూర్ణపు మోతాదు

2 అణాలయెత్తు. కషాయపు మోతాదు 2 మొదలు 5 తులముల యెత్తువరకు.

మురుదొండచెట్టు:—ఆకాశగరుడ చూడుడు.

మురుపిబాలు:—Beestings. (అనగా ఆవుగాని, గేదెగాని యిచ్చు పాలు) దీనిలో మఱికొన్ని పాలు గలిపి బెల్లముగాని, పంచదారగాని గలిపి యాలుక్కాయలు మిరియాలుతో జున్నుగవండి పుచ్చుకొందురు. దోషయుక్తమై గురుత్వముగ నుండును. మలాత్రము గావించును. శరీరమునకు పుష్టిని, బలమును ఇచ్చును. ఆమము పెంచును. అపథ్యమైనది. దీనికివిరుగుడు పటికి పంచదార మిరియము.

ములకీ:—అనగా నేలములక, నేలములక చూడుడు.

ములుకశివింద:—కొండకశివింద చూడుడు.

ములుగోరింటతీగ:—Barleria prionitis-yellow variety. Barleria dichotoma - white variety. Barleria cristataree B. Caerulea సం॥ తెల్లపువ్వులది సైరేయక, పచ్చపువ్వులది కురంటక, ఎఱ్ఱపువ్వులది కురువక, నల్లపువ్వులది ఆర్తగళ. హిం॥ కాట్ సరైయా. దీనిని కోరింతతీగ యందురు. దీనికి ముండ్లు విస్తారముగ నుండును. గుత్తులు గుత్తులుగ పూవులు పూయును. దీనివేరు, ఆకు రసము లేక కషాయము చేదుగ, కారముగ నుండును. కాకజేయును; ఉబ్బు, విదాహము, తాపము, వాతరక్తము, కఫవాతము, కాస, జ్వరము, త్రిదోషములు వీనిని జయించును. బిడ్డల జ్వరము, దగ్గు, శ్లేష్మప్రకోపము వీనికి దీనియాకురసము తేనెతోగాని పంచదార పాకముతోగాని యిచ్చిన నివృత్తించును. ఆకురసములో పంచదార గలిపి అయినను నియ్యనగును. దీని ముదురుకాడలలోనుండి తీసిన చొనను చనుబాలలో గలిపి పట్టిన బిడ్డలకు వచ్చెడు గోరింతదగ్గు (Hooping cough) ను పోగొట్టును; రసమురొక్క మోతాదు

పూటకు 1-3 తులములమెత్తు చొప్పున, కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల మెత్తు చొప్పున దినమునకు రెండుపూటల నియ్యవలెను. దీని యాకును చిదుకగొట్టి ఉబ్బిన చిగురు (Gum) పైన బెట్టియుంచిన దానినొప్పి, వాపు హరించును. దీని ఆకును వెచ్చచేసి కట్టిన తలనొప్పులు, వాత మేహవాతనొప్పులు నయమగును. దీని నారను దీసి పసుపు వ్రాసి తాడువలెపేని మొదటి వారము 7 ముడులు, 2వ వారము 9 ముడులు, 3వ వారము 11 ముడులు వేసి ఆతాడు బిడ్డల కంఠమునకు గట్టిన కోరింతదగ్గు అనగా వుక్కిసదగ్గు Hooping cough ను బోగొట్టును. దీనిఆకుకూర వంటకతినిన చిరిచేదుగనుండును. వేడిచేయును. పైన జెప్పిన రోగములకు పథ్యముగనుండును. దీని సమూలము కాల్చి చేసిన భస్మము నీళ్ళలో గలిపి యిచ్చిన ఉబ్బు, ఉదరరోగము హరించును. దీనిని దగ్గులకు తేనెలో గలిపి నియ్యవలెను. భస్మపు మోతాదు పూటకు 1 మొదలు 3 చిన్నముల మెత్తువరకు.

ములుదోసకాయ:—Cucumis sativus. Eng. Prickly-cucumber. సం॥ త్రపుస, త్రపుకర్కటి. హిం॥ ఖరా. తీపిగ, స్వాదుగ, కొద్ది పులుపుగనుండి చలువజేయును. మూత్రమును జారీచేయును. మేధ్రి మాదు, మూత్రద్వారమందు బుట్టెడు మంటలు, రక్తపైత్యము, పైత్యము, దాహము, తాపము వీని నణచును. మూత్రకృఛ్రము ను హరించును. పొత్తికడుపును శుభ్రపరచును. తాపజ్వరమున కనుకూలించును. గురుత్వము, అగ్నిమాంద్యము జేయును. పడిసెము దెచ్చును. వాతముజేయును. దీనికి విరుగుళ్ళు 1 ఓమము, 2 ఉప్పు, 3 మిరియాలు.

ములుదోసఆకు:—Leaves of do. దీనియాకుపసరు వెగటుగ నుండును; పైత్యము, మూత్రకృఛ్రము, పాండురోగము, హృద్రోగము;

జ్వరము, విదాహము, తాపము వీని నణచును; ఆకలి బుట్టించును; జఠరదీప్తినిచ్చును; మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులములవెత్తువరకు. దీని ఆకుకూర, స్వాదుగ గురుత్వముగ నుండును; విరేచనబద్ధము జేయును; మూత్రము గావించును; చలువజేయును;

ములుదోసవిత్తులు:—Seeds of do. వీని చూర్ణము చలువజేయును; మూత్రము గావించును; చెడిపోయిన పైత్యమును మూత్రము గుండ వెడలించును, మూత్రము అగునపుడు గలుగు మంటను, చురుకును పోగొట్టును; నల్లగుండెలోని వాపును గరగించును; కాకవలన గలిగిన జ్వరమును హరించును; వాతశరీరులకు జబ్బు జేయును. దీనికి విరుగుడు సోపు. మోతాదు పూటకు అరతులము.

ములుపెండలము:—A sort of yam. పథ్యమైనది; రుచిగ నుండును; వీర్యవృద్ధి నిచ్చును; కొద్దిగ కఫము జేయును.

ములుమోదుగచెట్టు:—Andersonia rohitaka. Amoora R. సం॥ రోహితక, ప్లీహశత్రు. హిం॥ రోహిడా. దీని ఆకు లేక వేరు రసము లేక చెక్క కషాయము శరీరములో శీఘ్రముగ వ్యాపించును; గుల్మము, ప్లీహ, ఉదరము, నల్లదబ్బ, (Spleen), కార్జము (Liver) లో పుట్టినరోగములను హరించును. క్రిమి, వ్రణము, వాతము, మలబద్ధము, మేదోరోగము, శూల, అణగును. వీనిని నివృత్తించును. మోతాదు పూటకు 2-1/2 మొ॥ 5 తులముల యెత్తువరకు.

ములువెంపలిచెట్టు:— Tephrosia purpurea-variety of. సం॥ శరపుంఖా, ఖంతపుంఖా. హిం॥ శరపుంఖా. దీని కాయలకు నూగు యుండునది నూగువెంపలి యందురు. దీనియాకు లేక వేరురసము క్షారముగ నుండును; కాకజేయును; క్రిములు, శూలలు వీనిని హరించును. మోతాదు 2-1/2 మొదలు 5 తులముల యెత్తు

వరకు. దీనివేరు ఆవుపాలతో నూరి రసముదీసి యిచ్చుచుండిన పరి ణామశూల నయమగును.

ముల్లంగి:— Raphanus sativus. Eng. Garden radish. సం॥ మూలక, మహాకంద, దీర్ఘమూలక. హిం॥ మూలి. వెగటుగ, కారముగ నుండును. లేతది త్రిదోషహరముగ నుండును. లేపగలేచి పీచు తక్కువగనుండును. దుంప శ్లేష్మము. దీనిని ముక్కలుగాకోసి యెండించిన వరుగును నేతితో వేయించి వాడనగును. దీనిదుంప, ఆకు వేడిజేసి సీరు పెట్టును. త్రేనుపుదెచ్చును; శ్వాసకోశ క్షయరోగము, అజీర్ణమును బోగొట్టును; సెగరోగమును, మేహాపైత్యమును శాంతింపజేయును. తీవ్రమగు ఆమదోషము, త్రిదోషములు, మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ్రము, విషము, కఫము, రక్తముపడెడి కాస వీనిని హరించును; వీర్యమునకు చలువజేయును; మూత్రము గావించును. దీనివిత్తులు మృదువుపరచును; మూత్రబద్ధము, బొట్టు బొట్టుగపడు మూత్రము, మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ్రము వీనిని హరించును; మూత్రము జారీచేయును; దుంపరసముగాని నీళ్ళతో నూరిన గింజలరసముగాని వాడతగియుండును. మోతాదు 1 మొదలు 3 ఔన్సులు అప్పుడప్పుడు మూత్రము జారీఅగువరకు నియ్యవలెను; వట్టివిత్తనములను యియ్యనగును. మోతాదు 2 మొదలు 4 అణాలయెత్తువరకు. దీనిదుంప కడుపునొప్పిని, గళరోగము, అతిసంభాషణ, దద్దుర్లు, పీనస, శూల, మూలవ్యాధిని పోగొట్టును. వసంతఋతువులో దీనిఆకును నేతిలో వేయించి పుచ్చుకొనిన మేలుజేయును; నేత్రములకు, దంతములకు మంచిది; మూత్రపు సంచిలో రాళ్ళుపుట్టకుండ జేయును; భోజనాత్పరమందు దీనివిత్తనములను కొద్దిగతినిన జీర్ణముజేయును; పొట్టకు బలముజేయును; కడుపునొప్పి బుట్టించును, రక్తమును జెరచును; గొంతుకకు, తలకు

నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 జీలకఱ్ఱ, 3 ఆవాల చూర్ణము, 4 ఉప్పు. దీని కాయలకూర రుచిగ నుండును; వీర్యమునకు వేడిబుట్టించును; గుల్మము, కడుపులోబల్ల, నీరసదేహము ఇవి గలవారలకు అనుకూలముగ నుండును.

ముల్లంగిచిన్నది:—Do do small variety. దీని కూర త్రిదోషహరమైనది. అగ్నిమాంద్యమును, ఇంద్రియ నష్టమును హరించును. ముల్లంగి గుణములు గలిగియుండును.

ముళ్ళతోటకూర:—Amaranthus spinosus. ఇది రెండు మూడడుగుల యెత్తువరకు లేచును. ముండ్లుండును. తెలుపు ఎరుపు రెండు జాతులు. దీని యాకు కాడల కూర పైత్యశాంతి, మేహశాంతి జేయును; తత్వమును మృదువుపరచును. వీనిలోనెరయొక్క సమూలరసమయినను సర్పవిషమును హరించును. దీని వేరురసము కడుపు నొప్పిని, సెగరోగులకు స్రవించెడు చీము, రసి వీనిని కట్టును; స్త్రీల ఋతురక్తస్రావమును కట్టును. దీని ఆకులు నూరి ఆముదముతో వెచ్చజేసి కట్టిన మేహపుగడ్డలు, రక్తపుగడ్డలు త్వరగ చీముపట్టి పగులును; వ్రణములకు కట్టిన త్వరగ మానును. దీని యాకును పప్పువేసి వండి స్త్రీలకు పెట్టిన పాలుపడును. ఆకు పశువులకు తినిపించిన వానికి పాలుపడును. దీని వేరు నూరి యుడికించికట్టినను అడ్డగఱ్ఱలు, రక్తపుగడ్డలు త్వరగ చీముపట్టి పగులును. దీని వేరు కషాయమిచ్చిన సెగరోగము నివృత్తించును; చలువజేసి మూత్రమును జారీచేయును; దీని వేరు తేలికకషాయమిచ్చినను సెగరోగము అణగును; మూత్రద్వారపు మంట, నొప్పి శాంతించును; కడుపునొప్పి, తేలువిషము హరించును. రసముయొక్క మోతాదు పూటకు 2–3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. ఎరుపు జాతికంటె తెలుపుజాతి చెట్టు గుణమధికము.

దీనిని కాల్చి చేసిన క్షారము నిచ్చిన శూలలు, అజీర్ణములు, అగ్ని మాంద్యము, శ్లేష్మమును హరించును. మోతాదు 2 మొదలు 4 గురిగింజల యెత్తువరకు.

ముళ్ళముష్టిచెట్టు:—ఉస్తిచెట్టు చూడుడు.

ముషిణిగింజలు:—Strychnos nux vomica. Eng. The nux vomica or strychne seeds. సం॥ విషముష్టి, తిందుక. హిం॥ కుచ్చలా. ఇవి మిక్కిలి చేదుగనుండును; మనిషిని చంపగల బలమైన విషము. సుమారు 9 గోధుమగింజలయెత్తు. వీని చూర్ణము మనిషిని చంపును. అంతకు తక్కువ అయిన మతిచాంచల్యమునైన బుట్టించును. క్రమమైన మోతాదుగ దీని నిచ్చిన మెదటికి వేడి బుట్టింపకుండ వెన్నునరము లేక వెన్నుపాము (spinal cord) పైన పని చేయును; బలముజేయును; విరేచనమును కట్టును; వాతమేహా వాతపు నొప్పులు, కీళ్ళనొప్పులు, వాపులు, కుష్టు మొదలగు మొండి చర్మ రోగములు, నరములతో సంబంధించిన రోగములు (nervous affection), పక్షవాతము, పిచ్చి, ఆమవాతము (gout) సర్వాంగవాతము (general paralysis), సవాయి వ్యాధులు, మూర్ఛ, అపస్మారము (hysteria), కుసుమరోగము, వీర్యనష్టము, సర్పవిషము వీనిని బోగొట్టును. నిద్ర దెచ్చును. మమత బుట్టించును. వీనిసారము (extract) పూటకు 5-6 చుక్కలు చొప్పున దినమునకు రెండు పూటలను లేక మూడు పూటలనుగాని నియ్యవచ్చును. పక్షవాత వ్యాధులకు తరుణములో ప్రతిదాము కొకమారు ఇయ్యవచ్చును. వీని మృదువైన చూర్ణమును వేపనూనెలో గలిపి (20 తులములయెత్తు వేపనూనెలో సుమారు అరతులమెత్తు వీని చూర్ణము గలిపి) ఆనూనెను పూటకు పావుతులమెత్తు మొదలు తులమెత్తువరకు క్రమక్రమముగ హెచ్చించుచు దినమునకు రెండు

పూటలను పై వ్యాధుల కిచ్చిన వానిని పోగొట్టును. శుద్ధిజేసిన దీని చూర్ణము పై వ్యాధులకు పూటకు ఒక గోధుమగింజ యెత్తు చొప్పున యారంభించి క్రమక్రమముగ 5 గోధుమగింజల యెత్తు వరకు హెచ్చించుచు దినమునకు రెండుపూటల నియ్యనగును. కుష్ఠు మొదలగు కఠిన చర్మవ్యాధులకు, పక్షవాతము మొదలగు మొండి వ్యాధులకు 1-2 నెలలవరకు నియ్యతగియుండును. గాని దీని ప్రయోగమందు జాగరూకతగలిగి యుండవలెను. ఆయా తత్వ భేదములనుబట్టి మోతాదు అధికమైనచో మరణము సహితము గలుగును. గావున ప్రథమమందు అతిస్వల్పపు మోతాదుతో నారంభించి క్రమక్రమముగ వృద్ధి చేయుచుండవలెను. ఆలాగున యిచ్చునప్పుడు రోగికి నరముల వికలత లేక చురుకు దనము ( undue sensibility in the nervous system ), కాళ్ళు చేతుల నరములు పీకడము లేక పెనివేసుక పోవడము (nervous twisting of the limbs and hands), ఎగుపులు, ఈడ్పులు ( convulsive attacks), అధికమైన తత్తరపాటు ఉలికిపాటు (extreme excitement) మొదలగు లక్షణములు కనుపించినప్పుడు ఇచ్చుచూడు మోతాదు తగ్గించవలెను. లేదా దీని నిచ్చుట మానివేయవలెను. దీని విషమునకు విరుగుళ్ళు 1 వాంతులకు, విరేచనములకు ఇచ్చి జిగటగల వస్తువుల ( mucilaginous drinks ) ను నీళ్ళలో గలిపిగాని వండిగాని త్రాగించుట, 2 నేరేడు చెక్కరసము, 3 మొగలిచెక్కరసము, 4 వేపచెక్కరసము (ఈ 3 రసములలో నేదైనను అర్ధసేరు (12 తు॥) రసము వరకు త్రాగించవలెను), 5 నేరేడుగింజల చూర్ణము (సుమారు తులమెత్తు), 6 నెయ్యి, తేనె, పటికి పంచదార వీనిని సమముగ గలిపిపుచ్చుకొనడము. మరియు దీని చూర్ణమును కోడిగ్రుడ్డు తెల్లసొనలో గలిపి పూసిన

గడ్డలు హరించును. వీనినుండి తీసిన తైలములో ఆముదము గలిపి గాని, వీనిని ముక్కలుచేసి ఆముదములో వేసి కాచి ఆయాముదము నుగాని, మర్దనజేసిన కాళ్ళుచేతులు పడిపోవు చచ్చువాతము, పక్షవాతము బాగగును. నరములకు సత్తువ గలుగును.

ముషిణిచెట్టు:—Strychnos nux vomica. Eng. The nux vomica or strychne tree. దీనిని విషముష్టి చెట్టనియు అందురు. ముషిణి, నాగముషిణి అని రెండు జాతులు. దీని వేరు చెక్క, మానుచెక్క, దీని గంధము లేక చూర్ణము చేదుగ నుండును; పైత్యము, కాకజేయును; వాతము, క్రిమిరోగము, కుష్ఠు మొదలగు చర్మరోగములను, ఆహిక జ్వరమును పోగొట్టును. దీని వేరుచెక్క రసము లేక గంధము సర్పవిషమును హరించును; మానుచెక్క ధూపము పిశాచబాధను తొలగించును. దీని పండు గుంజుతో మర్దనచేసిన వాతపునొప్పులు, కాళ్ళుచేతుల కీళ్ళు పట్లు తప్పియుండడము వీనిని బోగొట్టును; నరములకు సత్తువనిచ్చును; పైనపూసిన పొక్కులు, తామర, చిడుము మొదలగు చర్మ రోగములు నివృత్తించును. ఆకులను కరక్కాయతో నూరి వేసిన దుష్టవ్రణములు మాన్పును. వేరు లేక మానుచెక్కయొక్క గంధపు మోతాదు పావుతులమెత్తు మొదలు అరతులమెత్తువరకు. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు. సర్పవిషమునకు గంధము 1/2 మొదలు 1 తులమెత్తువరకు. చూర్ణము 4 అణాల యెత్తువర కియ్యవచ్చును. ఇతరవ్యాధులకు వీనిని యిచ్చుటలో జాగ్రతతో కొద్దిమోతాదులతో నారంభించి క్రమక్రమముగ మోతాదును హెచ్చించుచు నుండవలెను. సర్పవిషమునకు నాగ ముషిణి చెట్టు ఎక్కువ బలముగ పనిజేయును. దీని బదినిక కుష్ఠు రోగము హరించును.

ముసాంబ్రమ:—Aloe indica. Eng. Dried juice of aloes. సం॥ ఏలీయక, కన్యాసార. హిం॥ ఏల్వా. ఇది కలబంద రసము ఎండించి చేయబడును; చేదుగ నుండును; మిక్కిలి కాక, పైత్యము జేయును; విరేచనము గావించును; మలబద్ధమును పోగొట్టును; పొత్తికడుపును శుభ్రపరచును; ఋతురక్తమును జారీచేయును; ఇంగువతో నిచ్చిన అగ్నిమాంద్యమును పోగొట్టును; పైన పట్టు వేసిన పురాణ నేత్రరోగములు, వాతపునొప్పులు, దెబ్బనలన గలిగిన నొప్పులు వీనిని పోగొట్టును. దీనిని లోపలికిచ్చి పైన పట్టువేసిన గుదస్థానమందలి పురాణపుపగుళ్ళు, పుండ్లు, వ్రణములు మానును. దీనిని పన్నీటిలో గలిపి కండ్లలో వేసిన నేత్రరోగములును, పసుపు లేక మానుపసుపు రసములో గలిపి పోసిన చెవిలోనుండి లేక ముక్కులోనుండి చిరకాలమునుండి కారు రసినీరు, చీమును కట్టును. రెండువంటల ఘాటుసారాయిలో గలిపి వెంద్రుకలకు పూసిన నలు పెక్కును; తలకు పూసిన వెంట్రుక లెదుగ జేయును. దీనిని వేడి నీళ్ళలో చిక్కగ గలిపి తమలపాకుకు పూసి కడుపుకు కట్టిన బిడ్డలకు విరేచనము చేయును. దీనిని పొత్తికడుపుకు పట్టువేసిన కడుపుబ్బు, విరేచనబద్ధము నివృత్తించును; నొప్పియున్న చోట పట్టువేసిన రొమ్ము నొప్పి, పార్శ్వశూల నయమగును. దీనిలో కొద్దిగ గంధకము గలిపి యిచ్చిన మూలవ్యాధి నయమగును. దీనిలో ఇంగువ గలిపి పట్టు వేసిన బిడ్డల కడుపునొప్పి, తెల్లదబ్బ (lungs) పుండు క్షయరోగము మానును. అయితే లోపలికి 1 గోధుమగింజయెత్తు ముసాంబ్రమును 1 గోధుమగింజయెత్తు పొంగించిన వెలిగారమును చనుపాలలో గలిపి పోయవలెను. దీనిలో శర్కర గలిపి తరుచు ఇచ్చిన సెగరోగము నయమగును. దీనిని పూటకు 1 అణా యెత్తు మోతాదులను నెయ్యిలో దినమునకు 2-3 మార్లు ఇచ్చిన అగ్నిమాంద్యము

(dyspepsia) వలన గలిగిన దగ్గును, పైప్రకారమే పైరోగాదులనే అన్నభేదితో నిచ్చిన కఫవిరేచనములను కట్టును; యోని, గుదద్వారమువెంట రక్తము స్రవించెడు రోగులకును, గర్భిణీ స్త్రీలకును దీనిని ఉపయోగింపగూడదు. సాధారణముగ బిడ్డలకును లోపలి కియ్యకూడదు; దీనిని ¼ మొదలు 1 అణా యెత్తువరకు నిచ్చిన విరేచనము జేయునుగాని వట్టిదే ఇయ్యకూడదు; పంచదారగాని, తేనెలోగాని కలిపి యివ్వవలెను. దీని వికారమునకు విరుగుళ్ళు 1 నిమ్మపండ్ల పులుసు, 2 నెయ్యిగలిపిన వేడినీళ్ళు.

మూడవ ఈత ఆవుపాలు:— Milk of a cow that calved third time. ఆవుపాలు చూడుము.

మూత్రసముదాయ గుణము:— Urine generally. ఆవు, గొఱ్ఱె, గేదె, ఏనుగు, గుఱ్ఱము, ఒంటె, గాడిద, మనిషి. వీని మూత్రము పైత్యము జేయును; మిక్కిలి వేడిబుట్టించును; ఉప్పుగ నుండును; క్రిమిరోగము, శోభ, శూల, అనాహము, ఉదరరోగము, కఫము, పాండువు, వాతము, గుల్మము, అరుచి, విషము, కుష్ఠు, మూలవ్యాధి, సమస్తజ్వరములు వీనిని పోగొట్టును; పైనజెప్పిన వానిలో పూర్వానుక్రమణిక నొకదానికంటె నొకటి శ్రేష్ఠము.

మూర్కొండ చెట్టు:— Acalypha indica. Eng. Indian acalypha. సం॥ రూపగంధా, హారితమంజరీ, విశ్వరూపి. హిం॥ కుపి. దీనిని కుప్పింటచెట్టని యందురు. అరవములో కుప్పామణి యని యందురు. యిది సాధారణముగా దొడ్లలోను, పొలములలోను ప్రతిసంవత్సరము లేచెడు చిన్నచెట్టు. యివి రెండు జాతులు ఒకటి ఆకులు గుండ్రముగాను, రెండవది ఆకుల చివర కోణము గలిగి యుండును. యివి రెండును సమానమైన గుణములు గలవి. దీని యాకులు 9, మిరియాలు 9, కొంచం హారతికర్పూరం కలిపి నూరి

శనగలవలె మాత్రలుగట్టి ఉదయం, సాయంకాలం నీళ్ళతో వేసుకుని పత్యముగ నుండి పాలు తీసుకుంటూయుండిన కామిలరోగము హరించును. దీనియాకు, వేరురసము లేక కషాయము లేక చూర్ణము కాక, పైత్యము జేయును; దుష్టరక్తమును బోగొట్టును; కాస, శ్వాస, మలమూత్రబద్ధము, శూల, గుల్మము, మూలవ్యాధి వీనినిహరించును. దీనియాకుపసరుబూసినచిడుము మొదలగుచర్మరోగములన్ను బోగొట్టును. పసరుదీసి గేదె వెన్నలో గలిపి లోపలికిచ్చిన మూర్ఛరోగమును బోగొట్టును. దీనివేరురసము వాతములను హరించును. దీని వేరుతో దంతధావనము జేసిన దంతరోగములు నశించును. దీనియాకుపసరు కండ్లలో లేక ముక్కులో పిండిన బాలపాపచిన్నెలు నివృత్తించును; చెవిలోపిండిన చెవిలోపోటు నిమ్మళించును. దీని వేరు చెక్క నూరి వది రోగబలమును బట్టిన్నీ, రోగిబలమును బట్టిన్నీ, 1. మొదలు 2 యిండుపగింజలంతముద్ద రెండుపూటలా 2తులముల తేనెతో పుచ్చుకొనుచుండిన పక్షవాతము, మూతి వంకరపోవడము హరించును. దీనివేరు చిదుకగొట్టి వేడినీళ్ళలో వేసియుంచి పిసికి వడియగట్టి ఆనీళ్ళు 5-6 తులములమెత్తుఇచ్చిన విరేచనమగును. దీని ఆకుల కషాయము 5-6 తు॥ ఇచ్చిన విరేచనమగును. దీని ఆకునూరి దానిలో సున్నముగాని ఉప్పుగానికలిపి నూరి పూసిన గజ్జి, చిడుము మానును. దీనిసమూల కషాయములో ఆముదము గలిపి యిచ్చిన ఆమవాతపునొప్పులు (gout) నిమ్మళించును. దీని ఆకుల కషాయమిచ్చిన చెవినొప్పి నయమగును. దీని ఆకులరసముగాని సమూల రసముగాని బిడ్డలకుగాని పెద్దవారికిగాని లోపలికిచ్చిన వాంతులు చేయును; విరేచనము గావించును. మోతాదు వయస్సునుబట్టి 1 మొదలు 2 డ్రాముల వరకు. బిడ్డలకు 30 చుక్కలు ఇచ్చిన చక్కగవమనము జేయును; శ్లేష్మమును వెడలించును; దగ్గు, వగర్పు

గల దగ్గు (Bronchitis) నిమ్మళించును. దగ్గు నిమ్మళించును. దీని ఆకునూరి కట్టిన సవాయి వ్రణములు మానును. ఆకునూరి కట్టిన చోట పట్టించిన జెర్రి, పురికొస, తేలు, కందిరీగ, తేనెటీగ మొదలగు విషపు పురుగులు కుట్టినందువలన గలిగెడు బాధ నివృత్తించును దీని ఆకును, వెల్లుల్లిపాయ, తమలపాకు నూరి కట్టిన వేళ్ళకణుపులను, సంధులను లేచెడు జవ్వలు, పుండ్లు, గోరుచుట్టు వీనిని పగిల్చి మాన్పును. దీనియాకు నలిపి పుప్పిపంటిలో నుంచిన బాధ అణగును. పిచ్చియెత్తిన ప్రథమదశలో దీని సమూలరసము 1 ఔన్సులో 6 గోధుమగింజల యెత్తు ఉప్పుగలిపి కరిగించి రెండు ముక్కురంధ్రములలో బోసి వెంటనే 1-2 కడవలనీళ్ళు (చల్లని నీళ్ళు) ధారలుగా పడునట్లు (shower bath) నెత్తిపైన పోయవలెను. ఈవరుసను మూడు ఉదయపు పూటలను విడవకుండ జేసిన వెర్రి నయమగును. పైనజెప్పిన రసము లోపలికిచ్చిన క్రిములు హరించును; దీని ఆకుల యొక్క లేక సమూలముయొక్క కషాయము కొద్దిగ ఉప్పుగలిపి యిచ్చిన విరేచనములగును ఆముదములోనిచ్చిన క్రిములు చచ్చిపడిపోవును. దీని ఆకునూరి గుదస్థానములోపలి కెక్కించిన బిడ్డలదారుణ మలబద్ధము నివృత్తించును. దీని ఆకురసములో సున్నము గలిపి పట్టించిన వాత మేహవాతపు నొప్పులు, తామర నివృత్తించును. దీనిరసములో గుడ్డతడిపి వత్తులవలెను చేసి రెండు ముక్కురంధ్రములలో ప్రయోగించిన నాసారంధ్రములనుండి రక్తము స్రవించి తలలోరక్తము గూడినందువలన గలిగెడు దారుణపు తలనొప్పి నిమ్మళించును. సమూల చూర్ణము పైనజల్లిన ప్రక్కపుండ్లు ( Bed sores), పురుగులుపట్టిన గాయములు, పుండ్లు నయమగును. పచ్చి ఆకు నూరికట్టినను పురుగులుపట్టిన పుండ్లు, వ్రణములు నయమగును. సమూలచూర్ణముగాని, కషాయముగాని లోపలికిచ్చిన

ఉబ్బుసదగ్గు, పగర్పుగలదగ్గు (Bronchitis) క్షయ, క్రిమిరోగము వీనిని పోగొట్టును; చూర్ణపు మోతాదు పూటకు 10 మొదలు 30 గోధుమగింజల యెత్తువరకు. కషాయపు మోతాదు 2 మొదలు 3 తులముల యెత్తువరకు. బిడ్డలకు ఇచ్చెడు చూర్ణపు మోతాదు 2 మొదలు 6 గోధుమగింజల యెత్తువరకు. కషాయపు మోతాదు ½ మొదలు 1 తులము యెత్తువరకు. బిడ్డలకు పెద్దలకు చూర్ణము ఇచ్చునపుడు దానిని పంచదార పాకము (Syrup) లో గాని, తేనెలోగాని గలిపి ఇయ్యవచ్చును.

మెంతికూర:—Fenugreek-leaves of. స్వాదుగ, చిరిచేదుగ నుండును; మృదువుపరచును; కరగించును, పక్వపరచును; రుచి బుట్టించును; పైత్యశాంతి, మేహశాంతి జేయును; త్రిదోషహరమైనది; దేహపుకాకను నిలిపి బలమిచ్చును; హృద్రోగము, గుల్మము, వాతశ్లేష్మము, విషము, సంగ్రహణి, కుష్టు, మూలవ్యాధి, మేహవ్రణములు, రక్తపైత్యము, శ్లేష్మము వీనిని హరించును. విదాహము నణచును; దేహకాంతి, వీర్యవృద్ధి, దేహపుష్టి వీని నిచ్చును; గుండెలకు, గొంతుకకు, నడుమునకు బలమిచ్చును. గర్భాశయములోని నొప్పిని బోగొట్టును. మూత్రమును, స్త్రీల బహిష్టురక్తమును జారీ చేయును; కాళ్ళుచేతులు ఉబ్బుగల రోగులకు మేలుజేయును. మూత్రపుసంచి (Bladder) యొక్క జలుబు హరించును. దీని యాకులను నూరి వెంద్రుకలకు కట్టిన వానికి మృదుత్వము దెచ్చును. దీని యాకులను ఆముదములో వెచ్చజేసి గడ్డలకు కట్టిన వానిని పక్వపరచి పగులజేయును. దీనికూర పథ్యమైనది గాని నిత్యమును బుచ్చుకొనినను, అమితముగ బుచ్చుకొనినను తలనొప్పి దెచ్చును. వికారమును బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పులుసు వస్తువులు, 2 సికంజబీను, 3 శాకతత్వము గలవారికి కాసిని ఆకు. దీనితో ఇతర

ఆకుకూరలు వేసి వండకుండ ప్రత్యేకము దీనియాకు కూరవండి పుచ్చు కొనిన మేలు జేయును.

మెంతులు:— Trigonella foenum graecum. Eng. Fenugreek seeds. సం* దీపనీ, మేథికా, మిశ్రా. హిం* మేథీ. మృదువు పర చును. పక్వపరచును. కరిగించును. మేహశాంతి జేయును. విరేచనము బంధించును. గ్రహణిని కట్టును. వీపునొప్పి, కార్జపు (Liver) నొప్పిని తీయును. ధాతువులకు బలము జేయును. స్త్రీల ఋతురక్త మును జారీచేయును. నల్లదబ్బ (Spleen) కు సత్తువ జేయును. దగ్గును, కఫమును హరించును. గుండెలను శుభ్రపరచును. శాక తత్వము గలవారు కాసిని యాకుతో కలిపి తినవలెను. వేయించిన మెంతుల తేలిక కషాయము పుచ్చుకొనినను, మెంతులు వెన్నలో గలిపి తినినను, మెంతుల అట్టు తినినను, రాత్రి పరుండు వేళను మెంతులు నీళ్ళతో తినినను రక్తగ్రహణి కట్టును. చిన్న నిమ్మకా యంత వెన్నలో ఒక యుల్లిపాయ (Onion) సన్నముగ కోసిన ముక్కలను, మెంతులను కలిపి రెండుపూటలను 2-3 దినములు తినిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. మెంతులు అచ్చముగ గాని వెన్న మొదలగు వానితో గలిపిగాని పుచ్చుకొనెడు మోతాదు జేడెత్తు మొదలు పావలా యెత్తువరకు. మెంతులను నమలకుండ మ్రింగవలెను. మెంతుల పిండిని నీళ్ళతో నుడికించి కట్టిన గడ్డలు త్వరగ చీముపట్టి పగులును. ముల్లు విరిగినచోట కట్టినది సులభముగ ఊడివచ్చును. గడ్డలకు వీనితో కాపడమిచ్చిన వానిని మృదువు పర చును. శీఘ్రముగ పగులజేయును. అమితముగ వీనిని తినిన పైత్య వికారము, తలనొప్పి బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పులుసు, 2 సికింజిబీను, 3 పుల్లదానిమ్మ.

మెట్టతామర:—Hibiscus Mutabilis. సం॥ స్థలపద్మినీ, పద్మచారిణీ. హిం॥ స్థలకమలినీ. దీని సమూలము లేక పుష్పములు శీతలముగ, చేదుగ, వగరుగనుండును. పైత్యము, కఫము, మూత్రాశ్మరి, మూత్రకృచ్ఛ్రము, వాతము, శూల, అతిసారము, వమనము, దాహము, మోహము, ప్రమేహము, రక్తవికారము, కాస, శ్వాస, అపస్మారము, విషము వీనిని హరించును. స్తనములను దృఢపరచును, అనగా గట్టిపడజేయును.

మెత్తళ్ళు:—నెత్తళ్ళు పచ్చివి, ఎండువి చూడుడు.

మేకకాళ్ళు:-Curry or soup of goat's legs. వీని మాంసము లేక షేరువా సమధాతువు జేయును; వేడిజేసి నీరుపెట్టును. శరీరమునకు, ఎముకలకు, నరములకు బలముజేయును. కొద్దిగ దేహపుష్టి జేయును. రొమ్మునకు, గొంతుకకు మేలుజేయును. శాకదగ్గు నణచును. గుండెలను, పొట్టకు మృదువుపరచును. దీనిలో గోధుమలు వేసి వండి తినడము శ్రేష్ఠము. త్వరగ జీర్ణమగును. ఆకలిని హెచ్చించును. దీనిలో సిరకాగాని లేక చింతపండుగాని వేసివండిన దీనిలోని వాతగుణము, జిగటగుణము అణగిపోవును; నాలుకపూతను, ప్రేగులు అరియుండడమును అణచును. రక్తమును బుట్టించును. విరేచనబద్ధము జేయును. ప్రేగులలో గాలి బంధించును. గురుత్వముగ నుండును. వాతము జేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 సిరకా, 3 చింతపండు పులుసు.

మేకఎరివి;—Dung of goats. ఎండినమేక పెంటికలు వాతరోగులకు దీనిసెగ (వేడి) చెమట పుట్టించును. శాకజేయును. మేకపెంటికలను మేకపంచితములో కలిపి శరీరమంతట పూయుచుండిన క్షయరోగులకు మేలుజేయును.

మేకకొమ్ము:—Goat's horn. దీనిని కాల్చి మసిచేసి నూనెలో గలిపి తలకు రాసిన తెల్లవెంట్రుకలు నల్లబడును.

మేక క్రొవ్వు:—Goat's fat. దీనితో పలాస్త్రి చేయుదురు. దీనిలో జాజికాయ, చలువ మిరియములు, సంగమరంపండు కలిపియిచ్చిన రక్తకాస, క్షయ నివారణమగును. దీనిని తీసినవెంటనే పచ్చిదిగాని కొంచెము వెచ్చజేసిగాని తినిన గుండెలకు బలము జేయును. ఉబ్బసపుదగ్గును, మూత్రపుమంటను అణచును.

మేకగురదాలు (వులవకాయ):— Goat's kidneys. గురదాలకు, నడుమునకు బలమిచ్చును. ఆలస్యముగ జీర్ణమగును.దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 నూనె, 3 ఉప్పు, 4 దాల్చినిచెక్క.

మేకచల్ల :—Butter milk of goat. సం॥ ఛాగీతక్ర. హిం॥ బక్రీకాతక్ర. తేలికగనుండును. త్రిదోషములను హరించును; జఠరదీప్తినిచ్చును; గుల్మము, మూలవ్యాధి, సంగ్రహణి, శోథ, పాండువు, మేహాపైత్యము, జలోదరము వీనిని హరించును.

మేక తలకాయ మాంసము:— Flesh of goat's head. కాకజేసి ముంతగుండెకు, పొట్టకు, మెదటికి బలమిచ్చును; దేహామునకు సమధాతువు దెచ్చును. మేకయొక్క మాంసములలో శ్లేష్మము.

మేక తెల్లదబ్బ:—Lungs of goats. చలువజేయును; గురుత్వము జేయును. మేకయొక్క అవయవముల మాంసములో యిది దుర్గుణములను గలుగజేయును. అపథ్యమైనది. దీనికి విరుగుడు సిరకా.

మేకనల్లదబ్బ:—Spleen of do. నాలుకపూతను పోగొట్టును; ఆలస్యముగ జీర్ణమగును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 గరమసాల.

మేక నాలుక:—Tongue of do. రుచిగనుండును; ధాతువుగనుండును; తాపము నణచును; వేగముగ జీర్ణమగును; కాక ఔషధములకు పథ్యముగనుండి వృద్ధిజేయును.

మేక నెయ్యి:—Ghee of do. సం॥ ఛాగీఘృత. హిం॥ బక్రీకాఘీ, తేలికగ నుండును; కండ్లకు రుచిగ నుండును; జఠరదీప్తి నిచ్చును; పాత్రికడుపును శుభ్రపరచును; బలము జేయును; మేలుజేయును, వాతము, కాస, శ్వాస, క్షయ, వాతపైత్యము, గుల్మశూల, మూలవ్యాధి, మందాగ్ని, అతిసార జ్వరము వీనిని జయించును; పథ్యమైనది.

మేక పంచితము:—Urine of goat. సం॥ ఛాగీమూత్ర. హిం॥ బక్రీకామూత్ర. త్రిదోషహరమైనది; మిక్కిలి కాక జేయును; దగ్గు, ఒగర్పు, కుష్ఠు, క్రిమి, గుల్మము, కడుపుబ్బు, హిద్మ అనగా ఊపిరిగొట్టునొప్పి, అండవృద్ధిరోగము, ఉదర రోగము, ఎక్కిళ్ళు, పాండురోగము, కుష్ఠు, చర్ది వీనిని బోగొట్టును. దీనిని చెవిలో పోసిన చెవిపోటు నయమగును. తక్కిన రోగములకు దీనిని లోపలి కియ్య నగును. మో:తాదు 5 మొదలు 20 తులముల యెత్తువరకు. ఉదయపు పూటల నియ్యనగును.

మేకపాలు:—Milk of do. సం॥ ఛాగీదుగ్ధా. హిం॥ బక్రీకాదూధ్. తియ్యగనుండును; వేడిజేయును; అన్నిపాలకంటెను శ్రేష్ఠమయినవి. జఠర పుష్టిని, శరీరమునకు బలమును ఇచ్చును; త్రిదోషహరమైనవి; వాతము, శూల, విషము, క్రిమిఃరోగము, దగ్గు, ఒగర్పు, క్షయ, జ్వరాతిసారము, ఉబ్బు, పాండువు, జ్వరము, రక్తపైత్యము వీనిని హరించును. బాలురకు, శిశువులకు మిక్కిలి యనుకూలముగ నుండును; పురాణజ్వరము, రక్తకాస, రొమ్ములో పుండు వీనికి మేలుజేయును; గర్భిణీ స్త్రీలకు, కార్శ్యపురోగులను తలనొప్పి గల వాండ్రకు నష్టము జేయును. దీనికి విరుగుళ్ళు 1 పంచదార, 2 నిమ్మ పండ్ల రసము, 3 పెసలుపోసి మరగబెట్టిన నీళ్ళు, చూర్నాటి మేక పాలు, తెల్లమేకపాలు చూడుడు,

మేక పెరుగు:—Curd of do. సం॥ ఛాగీదధి. హిం॥ బక్ రీకాదహీ., తేలికగ నుండును; త్రిదోషహారమయినది; కఫవాతములు, క్రిమి వ్యాధి, గుల్మము, క్షయ వీనిని హరించును; మూలవ్యాధి, శ్వాస, కాసలుగలవారికి మిక్కిలి పథ్యముగ నుండును, జఠరదీప్తి నిచ్చును గాని నీరసము జేయును; వీర్యమును క్షీణింపజేయును. దీనికి విరుగుళ్ళు పెరుగు చూడుడు

మేక ప్రేగులు:—Guts of do. దుష్టరక్తమును బుట్టించును. ఆలస్యముగ జీర్ణమగును. కడుపునొప్పి బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 రేగుబండు, 2 గులకండు.

క్రొవ్వుప్రేగు అనగా పెంటికలుండునది విరేచనబద్ధము జేయును; గ్రహణి రోగమునకు పథ్యముగ నుండును.

మేక పొట్ట:—Stomach of do. పైత్యమును హరించును. పులుసు వేసి వండిన అనుకూలముగ నుండును. కడుపునొప్పి దెచ్చును. దీనికి విరుగుడు జవారిష్. ఈపొట్టలోని వదరు (జీర్ణముకాని ఆకు వగయిరాలు) ఎండబెట్టిచేసిన చూర్ణము చురుకులమ్మ వ్యాధిని నివృత్తించును. మోతాదు సుమారు బేడెత్తు చొప్పున 3–4 పూటల నీళ్ళతో నియ్యవలెను.

మేక మాంసము:—Mutton of flesh of goat. సం॥ ఛాగీమాంస, హిం॥ బక్ రీకాఘోష్. చమురుగలిగి రుచిగ నుండును. దేహపుష్టి, బలము, కాంతి, వీర్యవృద్ధి వీనినిచ్చును. సులువుగ జీర్ణమగును. ధాతువులను సౌమ్యపరచును. ఒంటినీరుదీయును. శ్వాస, కాసలు, వాతము, ప్రదరమను యోనిరోగము (కుసుమ), శూల, రక్తవాతము, గుల్మము, మూలవ్యాధి, పైత్యము, క్షయ, ఉబ్బుసదగ్గు, కఫము వీనిని హరించును. అనేకదోషముల నణచును; తేలికను, రక్తపుష్టిని యిచ్చును. మరియు నేజంతువుయొక్క యేయవయవమును దినిన

మనుష్యుని ఆ యవయవమునకు బలముజేయును. మేకమాంసము నీళ్ళతో చిముడయుడక నిచ్చి యానీళ్ళుతీసుకొని అందులో కొద్దిగ సిరకా (Vinegar) యును తేనెయును గలిపి యనుదినము పుచ్చుకొనిన మిక్కిలి సత్తువజేయును. తలకు, హృదయమునకు బలముజేయును. ఎండిపోయిన శరీరము పుష్టిజేయును. పాము, తేలువిషమునకు మేకమాంసము కాల్చి కట్టినవిషము విరుగును. దీనిని కాల్చి సారాయిలోముంచి వెర్రికుక్క కాటుపైనవేసి కట్టిన దాని విషము విరుగును. ఆడుమేకమాంసము కాకతత్వముగలవారికి, వ్యాధిగ్రస్తలకు (కాయిలాపడినవారికి), కాకప్రదేశములలో నుండెడివారికి అనుకూలముగనుండును. మేకపోతు మాంసముకంటె ఆడుమేక మాంసము శ్లేష్మము. మేకపిల్లమాంసము సుఖవ్యాధులుగలవారికి, నరముల వ్యాధులు (Nervous affections) వలన చేతులుకాళ్ళు మోర్లు (Contraction of limbs) దిగినవాండ్రకు అనుకూలముగ నుండును; మేకమాంసము మేహావాతమును హెచ్చించును. రాత్రి వేళ అధికముగ అజీర్ణముజేయును. దీనికి విరుగుళ్ళు 1 సిరకా, 2 నిమ్మపండు పులుసు, 3 చింతపండు పులుసు (దీనితో వండడము), 4 కొబ్బరికాయ.

మేక ముంతగుండె:— **Heart of do.** ఇది కాకజేయును; ముంత గుండెకు బలముజేయును. పైత్యవికారము నణచును. గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 సిరకా.

మేకమూలుగ:— **Marrow of do.** కాళ్ళయెముకలలో నుండెడిది కాకజేసి చలువజేసి అర్చును. మృదువుపరచును. మిక్కిలి బలమును, ఆరోగ్యమును, దేహపుష్టిని, రక్తపుష్టిని వీర్యవృద్ధి నిచ్చును, మిక్కిలి దినిన పొట్టను, బుద్ధిబలిమిని జెరచును. దీనికి విరుగుళ్ళు 1 దాల్చినిచెక్క, 2 ఉప్పు, 3 జీలకర్ర, 4 పులుసు.

మేక మెదడు:—Brain of do. చలువ జేయును, రక్తపైత్యము వృద్ధి బొందించును; మెదటికి అనగా బుద్ధికి బలమును, దేహమునకు ఆరోగ్యమును ఇచ్చును; ఆలస్యముగ జీర్ణమగును; దీనికి విరుగుళ్ళు 1 పుదీనా, 2 సిరకా, 3 ఆవాలు.

మేక వెన్న:—Butter of do. సం॥ ఛాగీనవనీత. హిం॥ బకరీకా నొనీ. క్షయరోగము, దగ్గు, మేహము, ప్రమేహము, గుల్మము, శూల, ఉదరరోగము. మూలవ్యాధి, జ్వరము, దురదలు, పాండు రోగము, చర్ది మొదలగు ననేక దోషముల నణచును; అగ్నిమాంద్యే జేయును. దీనికి విరుగుళ్ళు వెన్నచూడుడు.

మేడలో నివాసము:— Living in a palace or upstair house నిర్మలమగు గాలి, అహ్లాదకరమగు చూపు మొదలగునవి కలుగును అనేక దోషముల నివర్తింపజేయును; దేహపుకాకను వృద్ధిజేయును; నేత్రరోగము, మూర్ఛ, భ్రమ, శోకము వీనిని బోగొట్టును, అయు ర్వృద్ధిని, ఆరోగ్యము నిచ్చును.

మేడికాయకూర:—Curry of country green figs. లేతకాయలు వగరుగనుండును; రుచిబుట్టించును; చలువజేయును; మూలవ్యాధి, పైత్యము, కఫము, చర్ది, వాతము, అతిసారము, దాహము, ప్రదరరోగము (కుసుమరోగము), ప్రమేహము వీనిని బోగొట్టును, ముదిరిన కాయలు వాతము, అగ్నిమాంద్యము, గురుత్వము జేయును. దీనికి విరుగుడు శొంఠిచూర్ణము గలిపిన నీళ్ళు.

మేడిచెట్టు:—Ficus racemosa, F. Glomerata. Eng. The gular fig or country fig tree. సం॥ ఉదుంబర, క్షీరవృక్ష, హేమ దుగ్ధ, హిం॥ గూలర్. దీనిని అత్తిచెట్టని యందురు. దీనిచెక్క- రసము లేక కషాయము లేకచూర్ణము వగరుగ నుండును. వ్రణము లను శోధించును; యోనిరోగము, సర్పి, ఉబ్బు, అతిసారము,

ప్రమేహము, విదాహము, తాపము, రక్తపైత్యము వీని నణచును; చలువజేయును; రక్తమూత్రమును, స్త్రీల రక్తస్రావమును, కుసుమ రోగమును కట్టును. చెక్క కషాయము అతిమూత్రమును, విరేచనములను కట్టును. ఈకషాయమును పుక్కిలించిన ఉబ్బి మెత్తబడిన చిగుళ్ళు గట్టిపడును. చెక్క చూర్ణమును నూనెలో గలిపి పూసిన వ్రణములు మానును. లేత యాకుల చూర్ణము తేనెతో బుచ్చుకొనిన పైత్యరోగము లణగును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తు చొప్పునను, చూర్ణపు మోతాదు బేడెత్తు మొదలు పావలా యెత్తువరకు దినమునకు రెండుపూటల నియ్యవగును. చూర్ణము పుచ్చుకొనునప్పుడు దానికి సమముగ చీనాపంచదారగాని పటికిపంచదారగాని కలిపి పుచ్చుకొనవచ్చును. మరియు భూమిలోనుండు దీనివేరును కోసి దానికి శుభ్రమగు కుండను (చిన్నకుండను) తగిలించి యాకుండలో మన్ను పడకుండ తగు జాగ్రతగ పనిచేసి యనుదినము ఆకుండలోనికి దిగుచుండెడి రసము నుదయపు పూటలను 15-20 లేక 30 దినములు పుచ్చుకొనిన ఆయుర్వృద్ధి, బలము, వీర్యపుష్టి జేయును; అతిమూత్రము, వీర్యనష్టము కట్టును; 100 ఏండ్లు జీవింతురు. దీనికి కల్ప మని పేరు. మోతాదు 5 మొదలు 15 తులముల యెత్తువంతు. దీనిమాను లేక కొమ్మపాలు కంతులు, గవదబిళ్ళలపైన దట్టముగపూసి పైన దూది అంటించిన నవి హరించును. ఇట్లు 2-3 మార్లు చేయవలెను. దీని ఆకుల విస్తరిలో భోజనము మేహశాంతి, కండ్లకు చలువజేయును. వీర్యవృద్ధి, క్రిమి, అతిసారము బోగొట్టును.

మేడిపండు:—Country fig. దీనిని అత్తిపండని యందురు. వగరుగ, తియ్యగనుండును; చలువజేయును; రక్తవృద్ధి, వీర్యవృద్ధి, వీర్య

స్తంభన జేయును; మేహము, రక్తపైత్యము, పైత్యము, క్షయ రోగము, అతిసారము, వీనిని జయించును, కండ్లకు చలువ జేయును; శ్లేష్మమును పెంచును; ఆలస్యముగ జీర్ణమగును. దీనికి విరుగుళ్ళు 1 పుదీనా, 2 జీలకఱ్ఱ. ఈ పండ్లను పిసికి గడ్డలకు కట్టిన త్వరగ చీముపట్టి పగులును. దేశవాళి మేడిపండుకంటె సీమ మేడిపండ్లలో అన్నివిధముల గుణమధికము.

మేదా, మహామేదా:—Grgymnema aurantiacum. సం॥ మేదా, శల్యాదా, శల్యపర్ణి. హిం॥ మేదా, మహామేదకు. సం॥ మహామేదా, త్రిదంతీ, మేదోద్భవ. హిం॥ మహామేదా. దీనిదుంప తెల్లగ, గుండ్రముగ పాలుగలిగి యుండును. వీని దుంపల రసము మధురముగ, స్వాదుగా నుండును; చలువజేయును; రక్తపైత్యము. రక్తవాతము, త్రిదోషములు, క్షయ, తాపము వీనిని పోగొట్టును; శుక్రవృద్ధి నిచ్చును; జ్వరమును హరించును. గర్భిణుల గర్భదోషములను హరించును. పిండమునకు బలము; ఆయుర్వృద్ధి నిచ్చును. మోతాదు పూటకు 2 మొదలు 4 అణాల యెత్తు.

మైనపుటిల్లు:—Living in a tent of wax cloth. మైనపు బట్టలతో నిర్మింపబడిన డేరా అహ్లాదమును గలుగజేయును; తీవ్రమగు గాలి పెట్టు నణచును; కఫమును హరించును; పైత్యమును వృద్ధిజేయును; వర్షకాలమందనుకూలించును; మేహవాతరోగములను నివారించును.

మైనము, దీనితైలము:—Cera alba. C. Flava. Eng. Wax. Wax oil. సం॥ మధూచ్ఛిష్ట, మధుజమ్, సిక్థ. హిం॥ మోమ్, పసుపుపచ్చగ, తెల్లగ, మృదువుగ, నుండు రెండురకములు. జిగటగ నుండును. చలువను, భూతబాధ, జ్వరమును పోగొట్టును; వ్రణములను, గాయములను మాన్పును; విరిగిన అవయవముల నతుకుకొన జేయును; సర్పవిషమును, విసర్పిని హరించును. దీని తైలములో

మర్దన జేసిన దుష్టనీరును దీసివైచును; నరములకు సత్తువనిచ్చును; మోకాళ్ళ కండల పురాణవాత మేహవాతపు నొప్పులను, కీళ్ళనొప్పులు, మోకాళ్ళనొప్పులు, వాపులు నివృత్తించును; పట్టుతప్పిన కాళ్ళు చేతులకు పట్లుగలుగును.

మైలతుత్తము:— మయిలతుత్తము చూడుడు.

మొక్క జీడి చెట్టు, పండు:— జీడిమామిడిచెట్టు, పండు చూడుడు.

మొక్కజొన్నపొత్తులు:— Zia maize. Eng. Indian corn. సం॥ మకాయ, మహాకాయ, సిఖలు. హిం॥ మక్కా, భుంటే. లేత మొక్కజొన్నపొత్తులు నిప్పులమీద కాల్చి తినిన రుచిగ, పుష్టికరముగ నుండును. ముదిరినవి కొద్దికాక జేసి అగ్నిమాంద్యము జేయును, బలము, ధాతుపుష్టి జేయును; ఆలస్యముగ జీర్ణమగును: ఈ మొక్కజొన్నలు దేహపరిశ్రమ జేయువారికి మంచి ఆహారము. దీని పిండితో రొట్టెలుచేసి వుపయోగింతురు. మిక్కిలి బలము, పుష్టి, వీర్యవృద్ధి చేయును.

మొక్కపుకాయ:— Schrebera swietenoides fruit of. రుచిగ నుండును; మూలవ్యాధి, మేహము, గుల్మరోగము, భగందరము, దారుణమగు కఫరోగము, సన్నిపాతము, పాండువు వీనిని జయించును; విరేచనము జేయును; మిక్కిలి అగ్నిదీప్తినిచ్చును. లేతకాయ కాంతినిచ్చును; పథ్యముగ నుండును; సమస్త కుక్షిరోగములను, అంగము వెంట రాళ్ళుపడెడు రోగమును పోగొట్టును; శుక్రమును క్షీణింప జేయును.

మొక్కపు చెట్టు:— Schrebera swietenoides. సం॥ ముష్కక, ఘోరశ్లేష్మ, ఘంటాపాటలి. హిం॥ మోఖా. మోఖా. దీనివేరు చెక్క, మానుచెక్క కారముగ, చేదుగ నుండును; జ్వరము హరించును; దేహములోని మలమును కొడలించును; కఫము, వాతము,

గుల్మము, విషము, మేదోరోగము, నులిపురుగులు, దురద వీనిని హరించును. దీని పువ్వులు కఫపిత్తములను బోగొట్టును; దీని జిగురు మిక్కిలి వీర్యవృద్ధి జేయును; శోష, పిత్తము, వాతము వీనిని నివారించును. దీని కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు.

మొగ పిచ్చుక:—పిచ్చుక మాంసము చూడుడు.

మొగభీర:—భూతాంకుశపు చెట్టు చూడుడు.

మొగలి పువ్వు:— Pandanus odoratissimus. Eng. Fragrant screw-pine, Caldera bush. సం॥ కేతకీ, శూచికాపుష్ప, స్థిర గంధా. హిం॥ కేవడా. దీనిని గేదంగి పువ్వు అందురు. సువాసనగ, మనోహరముగ నుండును; దీని కషాయము సమస్త వాతములను, శ్లేష్మమును హరించును; శాక, పైత్యము, కామ వికారము వీనిని కలుగజేయును; ముంత్రగుండెకు బలమిచ్చును. దీని రేకులు ఎండించి యుంచి ఉబ్బసదగ్గుచేత విస్తారముగా బాధగా నున్నప్పుడు (Asthmatic fit) చుట్టవలె చుట్టి కాల్చిన శ్లేష్మము వెంటనే పడి పోయి బాధ తగ్గిపోవును. మోతాదు ½ మొదలు 5 తులముల యెత్తువరకు. యీ రేకలను స్త్రీలు శిరస్సునయందు ధరింతురు. మిక్కిలి సువాసనగ, మనోహరముగ నుండును. కామోద్రేకమును గలిగించును. యీ రేకులను బట్టలలో వేసిన సువాసనగా నుండును. యీ రేకులనుండి అరకు తీయుదురు. సువాసనగలిగియుండును. పైన జెప్పిన రోగముయందుపయోగించిన మిక్కిలి పని జేయును.

మొగలి చన్నులు:— The drops that grow from the branches of do. అనగా మొగలిచెట్టున బుట్టెడు వేళ్ళవంటి ఊడలు. వీని రసము వగరుగనుండును; గుల్మము, శూల, మూలవ్యాధి, ఉదర

రోగము వీనిని పోగొట్టును. మోతాదు పూటకు 2-8 తులముల మెత్తువరకు.

ముగలియాకువిస్తరి:—Platter of leaves of do. దీనిలో భోజనము మనోహరముగ, మేహశాంతిగ నుండును; మూత్రకృచ్ఛ్రము, రక్తపైత్యము వీని వణచును; చలువ జేయును.

మొగలియాకు విసనకర్ర:—Fan of the leaves of do. మనోహరముగ నుండును; పైత్య, శ్లేష్మమును, చెమటను, రక్తపైత్యమును, మేహమును అణచును.

మొమ్మాయి:—Momia or The gummy substance that exunder from certain mountains of persia. సం* శిలాజతు, శైలధాతుజ, అశ్మలాతు. హిం* శిలాజీత్. ఇది హీరాని యిస్తబనాప్ మొదలగు పర్వతములలో బయలుదేరెడి రాతిమదము. దీనిని మోమియా యనియు మొమ్మాయి అనియు నందురు. ఇది కీలువలె నల్లగా కాంతిగలిగి మైనమువలె కొంచెము మెత్తగా నుండును, కాకజేసి యార్చును; మిక్కిలి కాకజేయును. దీని మోతాదు ఒక వడ్లగింజ మొదలుకొని రెండు గురిగింజల మెత్తు వరకు నియ్యవచ్చును. దీని బలము శరీరమందు 40 సంవత్సరముల వరకు నిలచియుండును. ఇది శీఘ్రముగ దేహమంతట వ్యాపించి వెంటనే గుణము గనుపించును.

దీని పరీక్ష.

అసలు మొమ్మాయి అయినయెడల కొంచెము నీళ్ళలో వేసిన నీళ్ళు యెర్రబడును. ఒక కోడికాలు విరుగగొట్టి కొంచెము నెయ్యి వెచ్చజేసి అందులో గసగసాగింజంత మోమియా కలిపి యా నేతిని కోడికి తినిపించి, ఆ నెయ్యి కొద్దిగా గాయముపైన పూసిన అసలు మోమియా అయినపక్షమున రెండు గంటలలో గాయము మాని

కోడి చక్కగ నడుచును; మోమియా కొంచెము జబ్బుదయిన యెడల యామరునాటికి బాగగును. అసలు మోమియా హీరానీ రాజుయొద్దనే గాని యితరులయొద్ద సాధారణముగ దొరకదు.

దీని గుణములు.

హృదయమునకు, ప్రాణమునకు బలమిచ్చును; మనస్సునకు సంతోషము కలుగజేయును; పొట్ట మొదలగు అవయవముల శుభ్రపరచును; సమస్త ధాతువులకు, అవయవములకు, నరములకు బలము జేయును; మిక్కిలి వీర్యవృద్ధిని, పుంస్త్వమును యిచ్చును; నరముల జబ్బును దీసివైచును; శ్లేష్మమును హరించును; విరిగిన యెముకలను వసిలిపోయిన కీళ్ళను బాగుచేయును; గాయముల మాన్పును; దెబ్బలుతగిలి లోపల గడ్డకట్టియున్న రక్తమును విరుచును; కాలిన పుండును, వ్రణములను శుభ్రపరచి మాన్పును; ఎక్కిళ్లు, కడుపులో మంట, గుండెలలో దడ, అజీర్ణము, పరిణామ మొదలగు శూలలు, జ్వరములు, జ్వరపు బిళ్ళలు, కీళ్ళనొప్పులు వీనిని హరించును; సర్ప వృశ్చిక విషములను, తక్కిన స్థావరజంగమ విషములను బోగొట్టును; పక్షఘాతము, పక్షవాతము, సర్వాంగవాతము, కంపవాతము మొదలగు సమస్త వాతములను, అతిమూత్రము, మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరి మొదలగు మూత్రరోగములను, ఉబ్బు, జబ్బులు, శ్వాసకాసలు, మతిచాంచల్యము, మూర్ఛ, రక్తవమనము, ముక్కుకు వాసన తెలియనిరోగము, ముక్కులోపలబుట్టెడివ్రణము, జీర్ణకోశము నంటియుండెడు ప్రేగు గట్టిపడెడురోగము, ఒకచెయ్యి యొక్క లేక ఒకకాలియొక్క కీళ్ళలోబుట్టి నిలిచియుండెడు నొప్పిని నివర్తింపజేయును. స్త్రీలు గర్భము ధరించెడు అవయవమునబుట్టెడు పురుగులను జంపివేయును; అనగా వంధ్యదోషమును బోగొట్టును; సుఖజాడ్యములు, కుష్టు, శ్వేతకుష్టు అనగా బొల్లి, దద్దుర్లు మొదలగు

చర్మరోగములు, ఏనుగుకాలు అనగా బూరకాలురోగము, నత్తి, నాలుక దళసరెక్కు వ్యాధి వీనిని హరించును.

అనుపానములు.

దవడలో బుట్టెడు నొప్పులు, నాలుకలో బుట్టెడు నొప్పులు వీనికి ఒకవడ్లగింజయెత్తు మొమ్మాయి నీళ్ళలో కలిపి ఆయా స్థలములలోను, పైభాగముమీదను పట్టించిన బాగగును.

ముక్కునొప్పికి, చెవినొప్పికి వడ్లగింజయెత్తు మొమ్మాయి తగుమాత్రము వేడినీళ్ళలోగాని పన్నీటిలోగాని గలిపి చెవిలోను, ముక్కులోను వేసిన నయమగును.

ప్రాతతలనొప్పులకు ఒకవడ్లగింజంత మొమ్మాయి సమభాగము కస్తూరి, పచ్చకర్పూరము వీనిని తమలపాకుల రసములోగలిపి పట్టించిన బాగగును.

మూతివంకరయగు పక్షవాతమునకు పదిచిన్నాల ప్రత్తిగింజలలోని పప్పు కిర్మానీజీరా అనగా షాజీరా ఈరెండువస్తువులు నీళ్ళలోవేసి కషాయముగాచి దానితోగాని, కిర్మానీఓమము, కిర్మాని జీలకర్ర యీ రెంటి కషాయములో గాని, వక వడ్లగింజ యెత్తు మొమ్మాయి కలిపి యిచ్చుచుండిన నివారణమగును.

చెవులో గుయ్యను ధ్వనియిచ్చుదానికి, చెవిలో పుండుకును వక చిన్నగుడ్డలో మొహమ్మాయి ముక్కయుంచి చుట్టి యాగుడ్డ చెవిలోనుంచిన నవి నివర్తించును.

పక్షవాతమునకు, పక్షఘాతమునకు వెల్లుల్లిపాయ, కిర్మానీ జీలకర్ర కషాయములో గురిగింజంతి మొమ్మాయి గలిపియిచ్చుచుండిన నిమ్మళించును; మరియు మరువపుఆకు రసములో వకగురిగింజ యెత్తు మొమ్మాయి గలిపి పైనచెప్పిన వ్యాధులకు నస్యము జేయవచ్చును.

నత్తికిని, నాలుక దళసరిబారిన రోగమునకును తేనెలో మొమ్మాయి గలిపి నాలుకకు పట్టించుచుండిన బాగగును.

మూర్ఛాపిన వచ్చు వగర్పుకు కొంచెము మొమ్మాయి ముక్కు బుగ్గను ఉంచుకొనిన నివర్తించును.

ఆరంభ దశయందుండు పిచ్చితనమునకు వడ్లగింజయెత్తు ముక్కు గాడిదపాలతో అరగదీసి యిచ్చిన బాగగును.

కొండనాలుక వాపుకును, గొంతుక వాపుకును వక గురిగింజ యెత్తు మొమ్మాయి యిప్పపువ్వు సారాయితోనైనను, శహతూతు (తూతిక) పండ్లరసముతో నైనను, మసరపప్పు కషాయముతో నైనను కలిపి అంగిటను బట్టించిన బాగుచేయును.

పొడిదగ్గుకు అడవిరేగు కాయల రసముతో నైనను, నీళ్ళు తేన గలిపి కాచి దానితో నైనను, పాలు, తేనెగలిపి కాచి దానితో నైనను పూటకు రెండు వడ్లగింజలయెత్తు చొప్పున మొమ్మాయి మూడు రోజులు ప్రొద్దుట, సాయంకాలము ఇచ్చిన నయమగును.

పైత్యము వలన బుట్టిన మతిచాంచల్యము, మూర్ఛ అనగా నడుచుచు హఠాత్తుగ స్మృతిలేక పడిపోవు జాడ్యము, అన్నకోశము యొక్క బలహీనము, కడుపులో గుర్రు గుర్రు మనడము, అపాన వాయువులు, కడుపులో చేరిన ఆమము, అన్నమజీర్ణముగాక బుట్టెడు జాడ్యములు, రొమ్మునొప్పి (గుండెనొప్పి) వీనికి కిర్మానిజీరా అనేజీలకర్ర తులము, ఓమము తులము ఈరెండును కషాయముగాది అందులో రెండు గురిగింజలయెత్తు మొమ్మాయి గలిపియిచ్చిన నయమగును.

ముంతగుండెలలో నొప్పి అనగా హృద్రోగమునకు రెండు దమ్మిడీలయెత్తు అర్మిని యనెడు చిన్నగులాబి పువ్వులయొక్క రస ముతోగాని కుంకుమపువ్వు నీళ్ళతో నూరి తీసిన రసముతోగాని కామాక్షి యాకు రసముతోగాని, రేలపండ్ల గుంజుతోగాని వక గురిగింజయెత్తు మొమ్మాయికలిపి యిచ్చిన పైనజెప్పిన రోగములు బాగగును.

శీతపైత్యజ్వరముచేత కడుపులో బల్లలు పెరిగిన దానికి ప్రత్తి విత్తుల కషాయముతోగాని, కిర్మానీజీలకఱ్ఱ కషాయముతోగాని వక వడ్లగింజ యెత్తు మొమ్మాయి కలిపి యిచ్చుచుండిన నయమగును. పైన చెప్పిన బల్లలు గొప్పగ బెంగియుండిన ధనియాల కషాయముతో కొన్నిరోజులు నిచ్చిన హరించును.

వాతసంబంధమగు మూలవ్యాధికి ఒకవడ్లగింజయెత్తు మొమ్మాయి ఆవునేతిలో గలిపియిచ్చిన మలద్వారమందు బుట్టెడు నొప్పి, చీము, రక్తము కట్టును.

మూలవ్యాధి వలన గలిగెడు బాధలు, అపానవాయువు వీనికి ఆవునేతిలో రెండు గురిగింజలయెత్తు మొమ్మాయి కలిపి వారమునకు ఒకపరియాయము పుచ్చుకొనిన నిమ్మళించును.

స్త్రీలు గర్భము ధరించెడు సంచిలో వాతముచేత నొప్పి పుట్టి స్పృహతప్పిపోయి సంధించెడు గుణమునకు ఆకుపత్రికము కషాయము రెండుతులములల్లో రెండువడ్లగింజలయెత్తు మొమ్మాయి కలిపి యిచ్చిన బాగగును.

మంటలో గూడిన మూత్రకృచ్ఛ్రమునకు ఒక వడ్లగింజ యెత్తు మొమ్మాయి గోధుమపిండితో కలిపి వత్తివలెజేసి మూత్రద్వారములో నుంచిన నయమగును.

ఆసనము వెలుపలికి జారివచ్చిన రోగమునకు వడ్లగింజ యెత్తు మొమ్మాయి కొబ్బరినూనెలో గలిపి రెండుమూడు రోజులు పట్టించిన నయమగును.

గుదస్థానములో నొప్పికిని, మేఢ్రముయొక్క తల లావై మొదలు సన్నమైన దానికిని చెంబేలీ పుష్పముల నూనెలో ఒకవరహా యెత్తు మొమ్మాయి గలిపి పట్టించిన నయమగును.

షండత్వమునకు సగముడికిన కోడిగ్రుడ్డులోనుండు పచ్చని చంద మామలో ఒక గురిగింజయెత్తు మొమ్మాయి కలిపి రోజుకు ఒకసారి

చొప్పున మూఁడురోజులు మాసము, రొట్టె పథ్యముతో బుచ్చు కొనినను పుంస్త్వము శీఘ్రముగ పుట్టును. కొబ్బరినూనెలో రెండు గురిగింజలయెత్తు మొమ్మాయి గలిపి శిశ్నమునకు, బీజములకు బూసి కొంచెము మర్దనజేసిన పుంస్త్వమును వృద్ధియగును. మరియు రాత్రి వేళ సెనగలు నానవేసి యుదయమున నీళ్ళువడపోసి దానిలోగాని లేదా కాగుచున్న నేతిలో కోడిగ్రుడ్డు చిదుకగొట్టివేసి పచ్చచొన అనగా చందమామ గట్టిపడకుండ నుండులాగున వెంటనేతీసి దానితోగాని ఒక గురిగింజయెత్తు మొమ్మాయి కలిపి పుచ్చుకొనిన మొగతనము వృద్ధియగును.

అతి సాంగత్యము వలన వీర్యము బొత్తిగా నశించిపోయిన వారికి రెండువడ్లగింజలయెత్తు మొమ్మాయి అరతులమెత్తు తేనెతో కలిపి పుచ్చుకొనుచుండిన శీఘ్రములోనే సంగమము చేయుటకు ఇచ్ఛ యును, వీర్యమును పుట్టును.

శీఘ్రముగ వీర్యవృద్ధి కావలసినందుకు స్త్రీ సంభోగము చేసిన తోడనే ఒక గోధుమగింజయెత్తు మొమ్మాయి వాతశరీరులు తెల్ల తేనెతోడను, కాక శరీరులు తియ్యని దానిమ్మపండ్ల పానకముతోడను బుచ్చుకొనిన వెంటనే వీర్యవృద్ధియయి సంభోగేచ్ఛ గలుగును.

కీళ్ళనొప్పులకును, వెన్ను పొడుగున ఉండు నొప్పికిని, చేతిలో నుండెడు నొప్పికిని, కోడిగ్రుడ్డుయొక్క చొనతో రెండు వడ్లగింజల యెత్తు మొమ్మాయి పట్టువేసి పన్నీటితోగాని, ఏలకుల కషాయ ముతోగాని, ఇప్పపువ్వు సారాయితోగాని, యిప్పనూనెతోగాని, నువ్వుల నూనెతోగాని ఒకవడ్లగింజయెత్తు మొమ్మాయిని లోపలి కిచ్చిన నయమగును.

వెర్రికుక్క కాటుకు తేలుకుట్టుకు తుమ్మపట్ట సారాయిలో ఒక వడ్లగింజయెత్తు మొమ్మాయి కలిపి గాయములకు పట్టించిన నయ మగును.

తేలు, పాము మొదలగు పురుగుల విషములకు గులాబి నూనె అనగా మంచినూనె సీసాలోబోసి అందులో విడుచుచు విడుచుచు నుండు గులాబిమొగ్గలువేసి 40 దినములు ఎండలో ఉంచి తరువాత ఆమొగ్గలు దీసివేసి వడియపోసిననూనె కొద్దిగాతీసి యందులో ఒక వడ్లగింజయెత్తు మొమ్మాయి కలిపి ఆనూనె లేక నేతితోగాని లోని కిచ్చిన నిమ్మళించును.

జలుబువలన వచ్చిన తలనొప్పులు, పార్శ్వపు నొప్పులు, తల త్రిప్పు, మూర్ఛ, పిల్లలకువచ్చు బాలపాప చిన్నెలు, తిమ్మెర్లు వీనికి దవనము, మరువము కషాయముగాచి దానిలో ఒక గురిగింజయెత్తు మొమ్మాయి గలిపియిచ్చినను, మరువపుఆకు రసములో ఒకగురిగింజ యెత్తు మొమ్మాయి కలిపి నస్యము జేసినను నయమగును.

ఎముకలు విరిగిన వాని నొప్పులకు, కొంకుదెబ్బలకు గుంజెత్తు మొమ్మాయి నేతిలోకాచి కొన్నిదినము లిచ్చిన నయమగును.

చాలకాలమునుండి యుండు తలనొప్పులకు గురిగింజయెత్తు హారతికర్పూరము, గురిగింజయెత్తుజున్ను. గురిగింజయెత్తుమొమ్మాయి ఇవి మూడు చూర్ణముజేసి నస్యముజేసిన మానును.

శిరోభారమునకు, చెవులలో బుట్టెడు ధ్వనికి పైచూర్ణములో తేనెగలిపి ముక్కులోను చెవిలోను బోసిన నిమ్మళించును.

పీనసజాడ్యమునకుయష్టిమధుకముయొక్కకషాయములో రెండు గురిగింజలయెత్తు మొమ్మాయి కలిపి యిచ్చిన నిమ్మళించును.

కడుపులో వికారము, గుండెలలో మంట, వెఱ్ఱిమాటలు, అజీర్ణము, కడుపుకుట్ర, కడుపుబ్బరము, కడుపులో గుడగుడధ్వని, గుండెలమీద తగిలినదెబ్బలు వీనికి ఖర్మానీ జీలకఱ్ఱ, సోపు ఈరెండు వస్తువుల కషాయములో రెండు గురిగింజలయెత్తు మొమ్మాయి కలిపి యిచ్చిన నిమ్మళించును.

ఉబ్బు రోగములకు జీలకఱ్ఱ కషాయముతో వడ్లగింజయెత్తు మొమ్మాయి కలిపి యిచ్చుచుండిన నయమగును.

సుఖజాడ్యమువలన మూత్రద్వారములో నగు పుండ్లు నొప్పులు మొదలయిన వానికి పచ్చి ఆవుపాలలో ఒక వడ్లగింజయెత్తు మొమ్మాయి కలిపి కొన్నిదినము లిచ్చిన నిమ్మళించును.

నోటివెంటఁబడు రక్తము అనగా రక్తవమనమునకు, ఒక గురిగింజయెత్తు మొమ్మాయి గాడిదపాలలో కలిపియిచ్చిన నిమ్మళించును.

గొంతుకవాచి ఊపిరి తిరుగకుండ నుండెడు రోగమునకు ఆరు వడ్లగింజలయెత్తు మొమ్మాయి సికింజబీనుతో నయినను, పుదీనాఆకు రసములో నయినను కలిపియిచ్చిన నయమగును.

ఎక్కిళ్ళకు అయిదు వడ్లగింజలయెత్తు కుంకుమపువ్వు, పది వడ్లగింజలయెత్తు ఆర్మినీఅనే చిన్నగులాబిపువ్వు రేకులు, ఆరు వడ్లగింజలయెత్తు మొమ్మాయి కలిపి కామాక్షీయాకు రసముతోగాని రేలగుజ్జుతోగాని కలిపి యిచ్చిన నిమ్మళించును.

నల్లగుండెకాయ లేక నల్లదబ్బయొక్క నొప్పికి కురంజీబీమము, ఖర్మానీజీలకఱ్ఱ యీరెండువస్తువులు కషాయముబెట్టి దానితో ఒక గురిగింజయెత్తు మొమ్మాయి కలిపి యిచ్చిన నిమ్మళించును.

నల్లగుండె ఉబ్బినరోగమునకు ధనియాల కషాయముతో నయినను తుమ్మవేరు కషాయముతో నయినను ఆరు వడ్లగింజల యెత్తు మొమ్మాయి యిచ్చిన నిమ్మళించును.

మూత్ర ద్వారములో పుట్టిన నొప్పి, పుండు, మూత్రపుకంచిలో పుట్టిన నొప్పి, పుండు వీనికి ఆవుపాలతోగాని, పటిక పంచదారతో గాని ఆరు వడ్లగింజలయెత్తు మొమ్మాయి యిచ్చిన నిమ్మళించును.

కీళ్ళనొప్పులు, కీళ్ళుతొలగిపోయి యుండుట, దేహములోపోటు పొడుచు నొప్పులు, కడ్డవరములలో పుట్టునొప్పులు, గాయములు, ఎముకలు విరిగిపోయియుండుట, దెబ్బలు మొదలయినవి తగులుట వీనికి గులాబీ పువ్వుల నూనెలో నయినను రెండు మూడు కోడి గ్రుడ్ల పచ్చసొనతో నయినను 1 గురిగింజయెత్తుగాని 1½ గురిగింజ యెత్తుగాని మొమ్మాయి కలిపి యిచ్చినను పై ప్రకారము మొమ్మాయికలిపి గులాబిపువ్వులనూనె మర్దన చేసినను నయమగును.

అంబుదెబ్బలు తగిలినవారికి ఒక గురిగింజయెత్తు మొమ్మాయి నేతిలోగాని పుచ్చుకొనినను, గాయముపైని పూసినను నయమగును.

జ్వరములకు, జ్వరహర కషాయములతో నిచ్చిన నిమ్మళించును.

బొల్లిఅనగా శ్వేతకుష్ఠమును, బోదకాళ్ళను రెండున్నర వడ్లగింజలయెత్తు మొమ్మాయి సీతమ్మవారి తీగెల (అప్రిమూన్) కషాయముతో నిచ్చిన నయమగును.

తేలు, పాము విషములకు ఆరు వడ్లగింజలయెత్తు మొమ్మాయి ఆవునేతిలో గలిపి ఇచ్చిన నయమగును.

నిమ్మగడ్డ కషాయములో 2 గురిగింజలంత మొమ్మాయి గలిపి నస్యము జేసినను, లోపలి కిచ్చినను కండ్లు మూతలుపడిన మాంద్య రోగము కుదురును.

మరియు అనుపాన విశేషములతో నిచ్చిన సమస్త రోగములను బోగొట్టును.

మొమ్మాయి చూర్ణములలో కలుపవలసివచ్చినప్పుడు పన్నీటిలో గలిపి యెండబెట్టి కలుపుకొనవలెను. లేహ్యములలో కలుపవలసి వచ్చినప్పుడు ఆవునేతిలో మొమ్మాయి కలిపి కాచి చల్లారనిచ్చి కలపవలెనుగాని ప్రత్యేకము మొమ్మాయి కలుపగూడదు.

మరియు శిలాజిత్తు అను మొమ్మాయి మనదేశమందు లూధియానా, లాహోరు ప్రాంతములందును, నెల్లూరు మొదలగు కొండలయందును దొరకునుగాని యీ శిలాజిత్తును బాగుగ పరిశుభ్రము (Purify) అనగా శుద్ధిచేసినది పైవ్రాసిన రోగములయందు, పని చేయునుగాని పెద్ద మోతాదులుగను, హెచ్చుదినములును పుచ్చుకొనవలయును.

మొరలి పండు:— Celtis orientalis & Buchanania latifolia- fruit of. సం* ప్రియాల, ఖరస్కంధ. రాజాదన. హిం* చిరోంజీకాఫల్. అనగా సారపప్పుచెట్టుపండు. తీపి, పులుపు రుచులు గలిగి శీతవీర్యముగలది. గురుత్వముగ, జిగటగ నుండును. వాతము, పైత్యము, తాపము, దప్పి, జ్వరము, రక్తవికారము, కాస, క్షయ వీనిని హరించును. వీర్యవృద్ధిజేయును. యీచెట్టు ఆకునకు వేరుకు ఇవేగుణములు. యీపండులోని పప్పు సారపప్పు అందురు. సారపప్పు చూడుడు.

మొరలిబంక:—అనగా మొరలిచెట్టు జిగురు. దీనిని కవుకుదెబ్బలు తగిలినవాళ్ళకును, చెట్లు మొదలగు వాట్లమీదనుండి పడినవాళ్ళకును ½ తులం మొదలు తులమెత్తువరకు మేకపాలలో గలిపి 3-4 దినము లిచ్చిన త్వరలో నయమగును. మొమ్మాయి గుణము గలిగియుండును. అవసరమైన మరినాలుగు దినము లివ్వవచ్చును. పథ్యముగ భోజనము చేయవలెను.

మొల్లలను పుష్పములు:— Jasminum pubescens. సం* కుంద, సదాపుష్ప, మనోహర. హిం* కుందేకాఫూల్. యీ పుష్పములు మధురముగ, వగరుగ నుండును. వీని తైలిక కషాయము దీపన పాచనములను గలిగించును. హృదయమునకు మేలుజేయును. పైత్యశ్లేష్మములను హరించును. రక్తమును శుభ్రపరచును, సువాసనగ,

మనోహరముగ నుండును. కండ్లకు, శిరస్సునకు చలువ జేయును, పేలను నశింపజేయును తలవెంట్రుకలను వృద్ధిపరచును.

మొసలి చేదుకట్టు:—Dried gall of crocodile. మిక్కిలి వేడి చేయును. వాతము, సన్నిపాతము, శూతిక వాతము, సర్వాంగ వాతము, జ్వరములు మొదలగు రోగములను హరించును. మోతాదు 1 మొదలు 2 గుంజల యెత్తువరకు. దీనిని యితర మందులలో వేసి మాత్రలుజేసి అనేక వాతసంబంధమైన రోగములకు వాడవచ్చును.

మొసలిమాంసము:—Flesh of do. చమురుగలిగి రుచిగ నుండును. పైత్యము వేడిజేయును. క్షీణదేహులకు బలము నిచ్చును. మిక్కిలి వీర్యవృద్ధినిచ్చును. ఉబ్బసమును బోగొట్టును. వాతరోగులకు మిక్కిలి అనుకూలముగ నుండును. బలముగేయును.

మోచన:—A medicinal plant. సం॥ శివమల్లీ, దీని వేరురసము వెగటుగ, కారముగ నుండును. కాకజేయును. వాతము, శ్లేష్మము, విషము, ఊపిరిగొట్టునొప్పి, గొప్ప ఉబ్బులు, పాండువులు వీనిని జయించును. మోతాదు పూటకు 3–4 తులముల యెత్తు.

మోదుగచెట్టు:— Butea frondosa. Eng. Bastard teak. సం॥ కింశుక, పలాశ, యాజ్ఞిక. హిం॥ ఢాక్, పలాశ్. దీనిచెక్క రసము, కషాయము వగరు, కారము, చేదుగ నుండును. క్రిమి, గ్రహణి, ప్లీహ, గుల్మము, మూలవ్యాధి, వాతము, శ్లేష్మము, యోనిరోగము వీనిని హరించును. దీని చెక్కను అల్లముతో నూరి యిచ్చిన సర్పవిషము హరించును. దీని జిగురు వీర్యవృద్ధి జేయును. వీర్యవృద్ధికర లేహ్యములలో చేర్చుదురు. దీనిచక్క కషాయములో కడుగుచుండిన పుండ్లును, వ్రణములను మాన్పును. మోదుగచెక్క కాల్చిన క్షారము, గుల్మము, మూలవ్యాధి, అజీర్ణము, కడుపుబ్బ

రము, ఉబ్బు, వాతశ్లేష్మములను హరించును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 3-4 తులములయెత్తు. క్షారముయొక్క మోతాదు 5 మొదలు 6 చిన్నముల యెత్తువరకు. మోదుగవేరు గంధమునుగాని, రసమును గాని కండ్లలో వేయుచుండిన మసకలు, రేజీకటి, పువ్వులు నయమగును.

మోదుగ పువ్వు:—Flowers of do. దీని రసము లేక కషాయము వగరు, కారము, చేదు గలిగియుండును; మేదోరోగము, శ్లేష్మము, క్రిమి, మూలవ్యాధి. మూత్రకృచ్ఛ్రము, శగరోగము, రక్తదోషము, పైత్యమును హరించును; మేహశాంతి, వీర్యస్తంభన జేయును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

మోదుగాకు విస్తరి:—Platter of leaves of do. దీనిలో భోజనము పరిశుభ్రముగ నుండును; పవిత్రమైనది; వాతము, శ్లేష్మహారముగ నుండును; గుల్మము, ఉదరము రక్తపిత్తము, పైత్యము వీని నణచును. జఠరదీప్తి నిచ్చును. విరేచనము గావించును. శ్రేష్ఠమైనది.

మోదుగమాడలు:—Seeds of do. సం॥ పలాశబీజ. హిం॥ పలాశపాప్డా, డాక్ కాబీంజ్. అనగా మోదుగచెట్టు విత్తులు. వీని రసము లేక కషాయము చేదుగనుండును; కాకజేసి విరేచనము జేయును; నాపాడము (Tape worm), క్రిమిరోగము, శ్లేష్మము, దగ్గు, ఒగర్పు వీనిని హరించును వీనిని నీళ్ళతో నూరి నిమ్మపండ్లరసము గలిపి పూసిన తామర మొదలగు చర్మరోగములను బోగొట్టును. రసముయొక్క మోతాదు 2-3 తులములయెత్తు; కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

దీనికషాయములో కొద్దిగ సూరేకారము కలిపి యిచ్చిన మూత్రము జారీచేయును, మూత్రకృచ్ఛ్రమును హరించును.

వృత్తిక:—Earth of soil. మెత్తని పొడిమన్ను వేసిన గాయము మానును; రక్తముకట్టును. ఎఱ్ఱమన్నును ఉడికించి వేసిన గడ్డలు, కంటిమీది కురుపులు హరించును. కుమ్మరిసానయొద్ద కుండలో మన్ను కంటిచుట్టు పట్టువేసిన కండ్లమెరుపులు, పోట్లు మానును. ఎండినమంటిగడ్డ పైనగాని మంటిగోడపైనగాని నీళ్ళుపోసి వాసన జూచిన వాంతికట్టును. జలదారివద్ద బురద మన్నులో ఉప్పు నూరి కలిపి కాలినచోట పూసిన మంట అణగును. మన్ను తినిన ఆకలి మందగించును; పాండురోగము పుట్టును దీనికి విరుగుడు గాడిదలద్దె రసము పూటకు 2–3 తులముల యెత్తు చొప్పున 5–6 దినములు పుచ్చుకొనవలెను. నదులలోని వండ్రుమట్టి గడ్డలమీద వేసికట్టి నీళ్ళతో తడుపుచుండిన యవి యణగిపోవును; లేక పగులజేయును.

మృదారుశృంగి:—మురదారుశింగు చూడుడు.

—*—

# య

యమునోదకము:—Water of the Jamuna river. రుచిగా నుండును, ఇంద్రనీల కాంతిగలిగి మనోహరమై యుండును; గ్రీష్మఋతువందు కోరతగినది, జఠరదీప్తి, మనోవికాసము, బుద్ధి, బలము, కాంతి వీనినిచ్చును; ఆయాసమును పోగొట్టును, ఆరోగ్యమునిచ్చును.

యవలు, దీనిపిండి:— Hordeum vulgare, H. Decorticatum. Eng. barley. సం* యవ, శితశూక, పవిత్రధాన్య. హిం* జౌ. గోధుమలవంటి ఒక ధాన్యపు గింజలు. ఉత్తరహిందూస్థానమున పండును, యూరపుదేశములనుండికూడ వచ్చును. వీనిని శాస్త్రీ గింజ

లందురు. కొద్ది తీపి. కొద్దివగరురుచి గలిగియుండును. వీనిలో కొన్నిరక ములు గలవు. తెల్లగా ముత్యములవలె నుండునవి శ్రేష్ఠము. యీ గింజలను చితుకగొట్టి నీళ్ళలోవేసి బాగా కాచి వడియపోసిన గంజి వేడిగా నున్నప్పుడు నుపయోగింతురు. దీని పిండినిగూడ నీళ్ళలో, వేసి కాచి వాడుదురు, పడిశము, గొంతునొప్పి, జ్వరము, దాహము, తాపము తగ్గించి శోష, బలహీనము వీనిని హరించును. మూత్ర కోశమునందుల మంటను పోగొట్టును. మూత్రము గావించును. జ్వరములో మిక్కిలి పుచ్చుకోతగిన లఘువైన ఆహారము. దీనిలో కొద్దిగ పంచదారగాని, గ్లూకోసు (Glucose) కలిపి యిచ్చిన మేలుజేయును. కొన్ని స్థితులలో కొద్దిగ నిమ్మపండురసముగూడ కలిపి యివ్వవచ్చును. జ్వరము తగ్గినవాళ్ళకు కొద్దిగ ఆవుపాలుకూడ కలిపి యివ్వవచ్చును. పాలు కలిపినప్పుడు నిమ్మపండురసము కలుప గూడదు. చంటిపిల్లలకు బార్లీ గంజిన్ని పాలున్ను సమభాగం కలిపి పంచదారకూడ చేర్చి యిచ్చిన మంచి ఆహారము. వట్టి బార్లీ గంజి యిచ్చినప్పుడు కొద్దిగ నుప్పుకలిపి యివ్వవచ్చును. బార్లీగంజిపుచ్చు కుని నిద్రపోయినను జబ్బుచేయదు. వీర్యమునకు పుష్టి, మేహశాంతి జేయును; గుల్మము, మూలవ్యాధి, పైత్యము, కఫము, పీనస, దగ్గు. ఒగర్పు, ఊరుస్తంభ వాతము, కంఠరోగము, చర్మరోగము, మేహము వీనిని జయించును; బలమునుజేయును; విరేచనము గావిం చును; కంఠస్వరమును బాగుచేయును. స్త్రీలకుపాలనువృద్ధిపరచును.

యవక్షారము:—Potassium carbonas. Impura Impura Eng. Carbonate of potash pearl ash (A kind of soda prepared from barley shoots). సం* యవక్షార, యవ శూకజ. హిం* జవాఖార్. యవధాన్యపు గడ్డినికాల్చి బూడిదచేసి నీళ్ళలో గలిపి గుడ్డను వడకట్టి, దీనిని కుండలోవేసి నీరు యిగురు

వరకు కాచిన యవక్షారమగును. మఱికొన్నివాటినుండికూడ యవక్షారము చేయుదురు. యిది తెల్లగ, దళసరిగ రసకర్పూరపుబిళ్ళవలె నుండును. ఉప్పగ, కారముగ, పుల్లగ నుండును. విరేచనము, మూత్రము గావించును. వాతము, కఫము, గుల్మము, ఆమము, ఆమవాతము ( Rheumatism ), శూల, కఫపైత్యములు, త్రిదోషములు, యకృత్ప్లీహారోగములు, మూత్రకృచ్ఛ్రము, మూలవ్యాధి, అగ్నిమాంద్యము, గ్రంధులు, అండవాతము వీనిని హరించును. మోతాదు 1 అణాయెత్తు మొదలు 2 అణాల యెత్తువరకు. కరక్కాయ, ములువోదుగచెక్క వీని కషాయముతో యవక్షారము కలిపి యిచ్చిన యకృత్ప్లీహారోగములు హరించును. యవక్షారమును పంచదారతో కలిపి యిచ్చిన గుల్మము, మూత్రబద్ధము, ఋతుశూల హరించును. యవక్షారము 1 అణాయెత్తు, అడ్డసరపాకు రసం 10 చుక్కలు, లవంగాలు చూర్ణము 1/2 అణాయెత్తు చొప్పున కలిపి తాంబూలముతోగాని, తమలపాకులతోగాని యిచ్చిన దగ్గు, వగర్పులమీద పనిచేయును. యవక్షారము, సైంధవలవణము, శొంఠి ఒక్కొక్క భాగము కరక్కాయ చూర్ణం 2 భాగములుగ కలిపిన చూర్ణము పూటకు 1 అణా ఎత్తు చొప్పున మజ్జిగ, కడుగు, వేడిగంజి, వేడిగాయున్న టీతోగాని యిచ్చిన మూలవ్యాధి, గ్రహణి, కడుపునొప్పి వీనిని శమింపజేయును. యవక్షారం 1/2 తులం, తెల్లతెగడ చూర్ణం 1-1/2 తులం, త్రిఫలములు 1-1/2 తులం, వాయువిళంగములు 1/2 తులం, మిరియాలు 1/2 తులం చొప్పున చేసినచూర్ణము పావలాఎత్తు మొదలు అవసరమైనంతవరకు పంచదారతోగాని, పాకముతోగాని యిచ్చిన విరేచనము లగును. క్రిమి నివారించును. అగ్నిదీప్తి నిచ్చును. వాత, శ్లేష్మ సంబంధమైన రోగములను శాంతింపజేయును. యవక్షారమును నీళ్ళతోగాని,

కలిపి రాసిన గజ్జి, చిడుము, కురుపులు మొదలగు చర్మరోగములు పోవును. ఆమవాతనొప్పులు, వాపులుకూడ నయమగును.

యష్టిమధుకము:— Glycerrhiza glabra. G. glandulifera Eng. Liquorice root. సం॥ యష్టిమధు, మధుయష్టికా. హిం॥ ముల్‌వాటీ, మిఠీలకడీ. దీనిని అతి మధురమనియు అందురు. దీనిచూర్ణము లేక కషాయము అతి తియ్యగ, కొద్ది చిరిచేదుగ నుండును. చలువ, మేహశాంతి జేయును. మృదువు పరచును. మూత్రమును జారీచేయును. కొద్ది విరేచనకారి. దగ్గు, పొడిదగ్గు, పైత్యశ్లేష్మము, రక్తపిత్తము, క్షయ, ఊపిరితిత్తుల గొట్టములు, ప్రేగులు, మూత్రనాళము వీనియందు పరుపు, వాపు (Irritation of inflamation) ఎఱ్ఱబడుటను మాన్పును. గొంతుకు బొంగురు బారుట (స్వరభంగుడు), ఉబ్బసము, మేహము, మేహపైత్యము వీనిని హరించును. ఉబ్బు, విషదోషములను పోగొట్టును. దాహము, కడుపులోమంట, పైత్యము, తలతిప్పు, తాపము, అరుచి, చర్ది, వాంతి వీనిని కట్టును. జ్వరము, పైత్యజ్వరము, జీర్ణజ్వరము, మేహజ్వరము, సన్నిపాత జ్వరములయందు మిక్కిలి పనిజేయును. వ్రణములను మాన్పును. హృద్రోగమును శాంతిపరచి హృదయమునకు బలముజేయును. శిరరోగమును శమింపజేయును. వీర్యవృద్ధి, బలముజేయును. రసాయనద్రవ్యము, కుసుమరోగములను హరించును. దీని చూర్ణమును పాలలో గలిపి సేవించుచుండిన ముసలితనమును ఆపును. ఆయుర్వృద్ధినిచ్చును. యష్టిమధుకము, నేల గుమ్మడి వీని కషాయము వాతరక్తమును హరించును. యష్టిమధుకము, మంచిగంధము వీని చూర్ణమును పాలలోకలిపి పుచ్చుకొనిన రక్తపిత్తము కట్టును. దెబ్బతగిలి రక్తముకారుచుండిన దీని చూర్ణము వేసి కట్టిన రక్తముకట్టును. త్వరలో పుండు మాన్పును. దీనిని

నమిలిన నీరూర జేయును. యష్టిమధుకము, సర్వాడుకము నీళ్ళలో వేసి కాచి ఆ నీళ్ళు కొద్ది కొద్దిగా యిచ్చుచుండిన జ్వరములలో దాహము కట్టును. దీని చూర్ణము పాలలోగలిపి పుచ్చుకొనుచుండిన స్త్రీలకు పాలను వృద్ధిపరచును. తాంబూలములో దీని చూర్ణము వేసిన రుచిగా ఆరోగ్యముగా నుండును. దీని సారము (Liquid extract) తీసి దానిని నూరి కణికలుగా తయారుచేయుదురు. దీనిని నోటిలో వేసుకుని చప్పరించుచుండిన దగ్గు, నుస, అరుచి, పైత్యము మొదలగు అనేక రోగములను హరించును. నేత్రరోగములకు మేలు జేయును. వెంట్రుకలను నల్లబడజేయును. వృద్ధిపరచును. మృదువు పరచును. చూర్ణపు మోతాదు 1 మొదలు 3 అణాల యెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

యాలకులు:—ఏలకులు చూడుడు.

యాలకుల అరకు:—ఏలకుల అరకు చూడుడు.

యూక్లిప్టసు ఆయిలు:—Eucliptus oil. యీ తైలమును మనదేశమందు నీలగిరి కొండలయందు యొక జాతిచెట్ల ఆకులనుండి దీయుదురు. ఘాటుగ, సువాసనగ, నుండును. దీనిని శరీరముపైన రాసిన కొద్దిగ చిముచిమ లాడును. దీనిని గుడ్డపైనవేసి వాసనజూచిన పడిశె భారము, ఊపిరితిత్తులయందు వరుపు ( Inflamation of the lungs ) ను, దగ్గును బోగొట్టును. దీనిని నొప్పిగలచోట రాసి వేడి నీళ్ళలో కొద్దిగ తైలమునువేసి ఆనీళ్ళతో వత్తడమిచ్చిన (Fomentation) నొప్పి, వాపు, శూల, హరించును. కణతలకు రాసిన తల నొప్పి, శిరోభారమును తగ్గించును. ఈ చెట్ల ఆకులను నీళ్ళలో వేసి కాచి ఆ నీళ్ళతో స్నానముచేసిన జ్వరము, వంటి నొప్పులు, పడిశము నిమ్మళించును. యీతైలమును మర్దనచేసిన వాత, మేహ

వాతపు నొప్పులు, కీళ్ళనొప్పులు, కీళ్ళవాపులు, పట్లు లేకపోవుట, నరముల నొప్పులు (Neuralgia), యిలుకునొప్పులు, పక్షవాతము హరించును. దీనిని లోపలికిచ్చిన దేహమునకు వెంటనే వ్యాపించి వేడిజేయును. దగ్గు, వగర్పు, వాతము, అపస్మారము, అజీర్ణశూల, అజీర్ణవిరేచనములు, జ్వరము, తలనొప్పి వీనిని హరించును. మోతాదు తగుమాత్రము పంచదారగెడ్డమీద 8 మొదలు 10 చుక్కలవరకువేసి నియ్యనగును. యిది దుర్గంధములేకుండ జేయును.

యిరుగుడుచెట్టు:—ఇరుగుడుచెట్టు చూడుడు.

—:o:—

# ర

రక్తచందనము:—Pterocarpus santalinus. Eng. Red sandal wood. సం॥ రక్తచందన, కుచందన. హిం॥ లాల్‌చందన్. దీనిని కుచందన మనియు చందనమనియు నందురు. దీని మాను యెఱ్ఱగ నుండును. దీనితో బొమ్మలు, భరిణెలు, గిన్నెలు, డబ్బీలు చేయు దురు. దీని చూర్ణము, గంధము, కషాయము తీపి, చేదు, వగరుగ నుండును. అనుకూలమైన చలువజేయును. కుష్టు, సర్పి, పైత్యము, రక్తపైత్యము, రక్తోద్రేకము, శ్వేతము విడువని జ్వరము, ఉన్మాదము, మదము, దాహము, అగ్నితప్తవేదన (మంట), శ్లేష్మము, అతిసారము, మూత్రకృచ్ఛ్రము, కాళ్ళు, చేతులు, కండ్లు వీనియందలి మంటలు, శూల, గుండెనొప్పి, వీనిని పోగొట్టును. చర్మమును శుభ్రపరచును. దీని గంధము దుప్పికొమ్ము, శొంఠి, తవ్వ గంధములు తీసి పట్టువేసిన మేహవాతపు నొప్పులు, వాపులు హరించును. కాలినపుండు, సర్పి మొదలగువానికి దీని గంధము పైన

పూయనగును. చూర్ణపు మోతాదు 4 అణాలయెత్తు మొదలు ½ తులమెత్తువరకు యియ్యనగును. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. గంధపుమోతాదు పూటకు అరతులము మొదలు తులము యెత్తువరకు. గుండెల నొప్పికి, శూల నొప్పులకు పాలలో గంధముగాని చూర్ణముగాని కలిపి నియ్యనగును.

రక్కసచెట్టు:—బలురక్కస చూడుడు.

రజితము:—Silver. సం॥ రౌప్య, తార. హిం॥ చాందీ, రూపా. అనగా వెండి, వగరు, పులుపు, తీపి రుచులుగలది. యీ పాత్రలలో భోజనము, పానముచేయుటవలన మిక్కిలి ఆరోగ్యమును కలుగజేయును. చలువజేయును. వయస్సును నిలుపును. బుద్ధివికాసత నిచ్చును. వాతపైత్యమును, వాతశ్లేష్మములను, మేహమును హరించును. వీర్యవృద్ధి, బలము, కాంతి నిచ్చును, శరీరమందు ధరించుటకూడ మంచి ఆరోగ్యము.

రజతభస్మము:—Calx of silver. క్రమముగ శుద్ధిచేసి చేయబడిన వెండిభస్మము అనుపాన విశేషముగ బుచ్చుకొనిన ఆయువు, కాంతి, బుద్ధి, స్మృతి, ఆరోగ్యము, కామము, ధాతుసామ్యత, దేహపుష్టి, బలము, వీర్యవృద్ధి వీనిని గలుగజేయును. త్రిదోషములు, జ్వరము, మేహము, కాస, శ్వాస, క్షయ, పాండురోగము, పైత్య కఫరోగములు, ఉదరరోగములు, మూలవ్యాధులు, శూల మొదలగు సమస్త రోగములను హరించును. యింద్రియము మూత్రములోపోవుట, నిద్రాస్ఖలితము మొదలగు యింద్రియ నష్టములను కట్టును. వయస్సును నిలుపును. హృదయమునకు బలముజేయును. విరేచనము జేయును. మేహశాంతి జేయును. ముదిమి, దోషయుక్త విషమరోగములు, దోషమలము, పిత్తవాతము, గుల్మము, శ్లేష్మము, శిరబాధ, ప్రమేహము, మధుమేహము. వాపు, ప్లీహ,

యకృత్తు అనగా కార్జము (Liver) యొక్క రోగము, వికారము, క్షీణత్వము, గాయము వీనిని బోగొట్టును. మోతాదు పూటకు 1 మొదలు 3 గురిగింజల యెత్తువరకు. ఆయారోగములకు అనుకూలమైన అనుపానములతోగాని, ఆవువెన్న మొదలగు అనుపానములతోగాని బుచ్చుకొనిన బాగుగ పనిజేయును.

రత్న పురుషు:—Viola suffruticosa. హిం॥ రతన్ పురుష్. దీనిని రతన్ పురుష అని నేలకొబ్బరి అని యందురు. దీనియాకు, కాడ జిగటగలిగి రుచిగ నుండును. దీని సమూలముయొక్క కషాయము లేక చూర్ణము లేక లేహ్యము మేహశాంతి, పైత్యశాంతి, మిక్కిలి వీర్యవృద్ధి, బలము జేయును; మూలవ్యాధిని బోగొట్టును; వీర్యనష్టమును కట్టును. దీని ఆకులు, కాడలు మృదువు పరచును. దీని వేరు తేలిక కషాయము మూత్రమును జారీచేయును; సెగరోగము నణచును; మూత్రావయవముల (urinary organs) రోగముల మాన్పును. దీని యాకులు, కాడలు నూరి కొబ్బరినూనెలోగాని, మంచినూనెలోగాని వేసి కాచి తీసిన తైలము తలకు రుద్దిన చలువజేయును; ఏనుగుకాలి రోగమునకు దీనిని నూరికట్టిన నయమగును. దీని సమూల చూర్ణమునకు సమముగ శర్కర గలిపినది పూటకు రెండు మొదలు నాలుగు అణాల యెత్తువరకు. దినమునకు రెండు పూటల సేవించనగును. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తుచొప్పున, లేహ్యముయొక్క మోతాదు పూటకు 6 మొదలు 8 అణాల యెత్తువరకు నియ్యనగును.

రమ్ముసారాయి:—Rum or jaggery liquor. అనగా బెల్లముతో చేసిన సారాయి. దీనిని గాడమని యందురు. మత్తుజేయును, ఆప్యాయత నిచ్చును. మలమూత్రములు గానీయదు. వాతమును హరించును. శాక జేయును; చెమట బుట్టించును; జీర్ణము జేయును;

అజీర్ణము, శూలలను హరించును; జఠరాగ్నిని వృద్ధిపరచును. బలము చేయును. గ్రాహ్యాదిగుణములు గలిగియుండును; శ్లేష్మరోగులకు మేలు చేయును. ఉష్ణశరీరమునకు నష్టము చేయును. దీనికి విరుగుళ్ళు మద్యమును చూడుడు.

రసంగిధాన్యము:—బసంగిధాన్యము చూడుడు.

రసకర్పూరము, రసభస్మము:—Hydrargyri subcloride or calx of the same. రసకర్పూరముగాని, క్రమముగ శుద్ధిచేసి చేసిన రసభస్మముగాని రోగబలము మొదలగువానిని గమనించి క్రమముగ వడిపించిన (ఇచ్చిన) 80 ఘాతములు, 18 కుష్ఠులు, 20 మేహములు, దుష్టవ్రణములు, దుష్టరక్తము, భగందరము, ఉదరము, గళరోగము, క్రిమిరోగము, సన్నిపాతము, అనాహము, హిక్క, శూల, క్షయ, పీనస, రక్తపైత్యము, విషములు వీనిని హరించును. విరేచనము చేయును; వ్రణములు, కొరుకు, సవాయి, అడ్డగర్రలు, చర్మవ్యాధులు, గండమాలలు, పొక్కులు, దురదలు, గుల్మలు, కాస, శ్వాస, దంతమూద వీనిని బోగొట్టును; దేహములోని మలముల వెడలించును; శరీరతత్వమును మంచికి మార్చును; వాత మేహ వాతపు నొప్పులు (Rheumatic pains) కార్జపు (liver) వ్యాధులు, కీళ్ళలో పుట్టెడు కంతులు, గడ్డలు మొదలగువానిని బోగొట్టును; పైత్యము చెడుట వలన గలిగినవ్యాధులు, అగ్నిమాంద్యము (dyspepsia), మూర్ఛ, బిడ్డలకువచ్చు కింకవాయువు (croup) బాలపాప చిన్నెలు (Convulsions) తలవాచివచ్చువ్యాధి(Hydrocephitis), పైత్యజ్వరము, పిచ్చి, విచారపుపిచ్చి, దారుణ గ్రహణి రోగము మొదలగు అనేక కఠిన వ్యాధులను హరించును; శ్లేష్మమును, కఫమును హరించును; పైత్యమును బాగుచేయును; కాంతి, బలము, అగ్నిదీప్తి కామోత్పత్తి, ఆయువు వీనిని గలుగజేయును. మోతాదు బిడ్డలకు

2 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు. బిడ్డలకైన పెద్దవారికైన కొన్ని దారుణ రోగములయందు చిన్నమెత్తు మొదలు అరతులము వరకుగాని ఒకసారిగ లేక 3, 4, 5, 6 పూటలలోగా ఆయధిక మోతాదుగ నుండు రసకర్పూరము లేక భస్మమును చిన్న చిన్న మాత్రలుగ జేసి పైనజెప్పిన 3, 4, 5, 6 పూటలలో ఆ మాత్రలను భాగించి రోగమునుబట్టి అనుపాన భేదముగను పథ్యభేదముగను ఇయ్యనగును. వ్రణములకు పైన వేయుటకు రసకర్పూరములో మరికొన్ని దినుసులుగలిపి పలాస్త్రిగాచేసి వేసిన మానును.

రసము:—పాదరసము చూడుడు.

రస సింధూరము:—Mercuric sulphide-red oxide of mercury

దీనిని ఆయా రోగయుక్తానుపానములతో నిచ్చిన జ్వరములు, జీర్ణ జ్వరములు, ఉడుకుజ్వరములు, అగ్నిమాంద్యము, రాజయక్ష్మ, క్షయ, పాండువు, శోష, ఉదరము, గుల్మము, ప్రమేహము, శూల, ప్లీహ, దుష్టవ్రణములు, అర్శస్సు (మూలవ్యాధి), గ్రహణి, భగందరము, వాంతి, త్రిదోషములు, శీతపైత్యము, కుష్టు, కంఠరోగము, వాతము, పైత్యము, మేహములు, కాస, శ్వాసలు మొదలగు అనేక రోగముల బోగొట్టును; మిగుల వీర్యపుష్టి, బలము, కాంతి, ఆయుస్సు వీని నిచ్చును. మోతాదు పూటకు 1 మొదలు 6 గుంజ లెత్తు చొప్పున దినమునకు రెండు పూటలనుగాని ఉదయపు పూటలనుమాత్రముగాని ఇయ్యనగును. శుద్ధిచేసిన (3 దినములు చను బాలలో రససింధూరమును నానబెట్టిన శుద్ధియగును. ప్రతిదినము వెనుకటిదినమున పోసిన పాలను తీసివేసి కడిగి క్రొత్తపాలను పోయుచుండవలెను) రససింధూరము, నల్లమందు సమముగ గూర్చి నూరి చిన్నలకు పెసరగింజలంతేసి, పెద్దలకు కందిగింజలంతేసి మాత్రలు చేసి దినమునకు రెండుపూటలనుగాని సాయంకాలపు

పూటలను మాత్రముగాని ఇచ్చిన కాళ్ళుతీత యణగిపోవును; ప్రేగులలోని బలహీనత కట్టును. విరేచనములు కట్టును. రాత్రికొద్దిగ ఆవుచల్లలో నానవేసిన మిర్యాలు 5-7 లేక 9 ఉదయమున అవి ఊరిన చల్లతో నూరి అందులో గుంజెత్తు మొదలు 4 గుంజలెత్తు వరకు రససింధూరము నూరి కలిపి 5-7 లేక 9 ఉదయపు పూటలను ఇచ్చిన చలిజ్వరము, పురాణజ్వరము కట్టును. మరియు 2-3 చిన్న ములమెత్తు మిరియాల పొడిలో గుమ్మపాలు పితికి అందులో గుంజెత్తు మొదలు 4 గుంజలెత్తు రససింధూరము చూర్ణముచేసి 10, 15, 20 లేక 40 దినములు ఉదయపుపూటల ననుదినముపుచ్చుకొనిన నిక్కాకలు, అస్థిగతజ్వరములు, మేహములు, పైత్యములు, మేహపైత్యములు, క్షయలు, దగ్గులు హరించును; దేహపుష్టి, వీర్యవృద్ధి గలుగును. మరియు తగు ననుపానయుక్తముగ దీనిని వాడిన యనేకరోగముల బోగొట్టును. శుద్ధిచేసిన రససింధూరము పాలు, నల్లమందు పాలు, కసింద వేరుచెక్క (బెరడు) పాలు, ఇవిమూడును కొద్దిగ నీళ్ళుపోసి 1 గంట మర్దనజేసి కందిగింజలవలె మాత్రలుచేసి పూటకొకటి చొప్పున యిచ్చిన ఇంద్రియనష్టమును కట్టును. ఈమాత్రల ననుపానవిశేషముతోనిచ్చిన మేహములు, అతిమూత్రము, దగ్గులు, ఉబ్బసము, కాళ్ళతీత మొదలగు రోగములను బోగొట్టును.

రసాంజనము:-**Extractum berberis. Extract of indian berbery.**

సం॥ రసాంజన, దార్వీక్వాదోద్భవ. హిం॥ రసోత్. అనగా మ్రానిపసుపును అష్టమాంశము కషాయముగాచి దానికి సమము మేకపాలు గలిపి ఘట్టిపడువరకు యినుపపాత్రలో కాచి ఎండించినది చేదు, కారము, వగరు రుచులుగలది; వేడిజేయును; కఫము, రక్తపైత్యము, వాతపైత్యము, విషము, ముఖరోగము, నాసికారోగము, శ్వాస, కాస, నేత్రరోగము, ఊపిరిగొట్టునొప్పి,

ఎక్కిళ్ళు, వాతము, కుసుమరోగము, ఛర్ది, అధిక ఋతురక్తస్రావము వీనిని జయించును. మోతాదు పూటకు 1/2 మొ॥లు 1 అణాయెత్తు. మరియొక రసాంజనము(White antimony)గలదు. యిది సీసపుముక్కవలె మెరుగుగ నుండును.దీనిని శుద్ధిచేసి సురమా చేసి నేత్రములకు బెట్టిన ననేక నేత్రరోగములు హరించును. మరియు కొన్ని ఔషధములలో వేయుదురు.

రాకాసిగడ్డ చెట్టు:—ఆకాశగరుడ చూడుడు.

రాకాసిమట్టలు:— Agava americana. Eng. American aloe, Carata. సం॥ కంటాల. హిం॥ రాకాస్‌పట్టా. దీనియాకులమధ్య గుంజు కండ్లకువేసి కట్టిన యెరుపులు, పోట్లు నిమ్మళించును. ఆగుంజును పంచదారతో నిచ్చిన సెగరోగము కుదురును. మోతాదు పూటకు 3–4 తులముల చొప్పున రెండుపూటల నియ్యవలెను. దీని వేళ్ళు మూత్రమును జారీచేయును; పురాణ సెగరోగమును పోగొట్టును.

రాగి:—తామ్రము చూడుడు.

రాగిపాత్రలో భోజనము:—తామ్రపాత్రలో భోజనము చూడుడు.

రాగులు:—చోళ్లు చూడుడు.

రాచయుసిరికాయ:—Averrhoea acida. Eng. Country goose berry. సం॥ రాజామలక, స్వర్ణామలక. హిం॥ చల్‌మిరి. పులుపు, తీపి, వగరు, రుచులు గలది మిక్కిలి చలువజేయును; రుచి బుట్టించును. పలలమేహమును శాంతిజేయును, సర్వమేహములను సర్వపైత్యములను, దప్పిని, తాపమును అణచును; దీని వేరురసము మూత్రమును జారీచేయును; మూత్రకృచ్ఛ్రమును హరించును. యీ కాయలను ఉప్పులో ఊరవేసి కారము గలిపి తిందురు; దీనివలన నోటియందు నీరూరును; దప్పితగ్గును, రుచిబుట్టించును; యీ కాయ

లను పప్పులోవేసి కూరవండుకొనిన రుచిగా నుండును. శ్లేష్మవృద్ధి చేయును; కఫమును బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 సర్జాక్షారము.

రాచబచ్చలి:—ఎఱ్ఱబచ్చలి చూడుడు.

రాజనాలు అనుధాన్యము:— A sort of paddy. దీని యన్నము చమురు గలిగి రుచిగ నుండును; బలము, వీర్యపుష్టి, కాంతి వీని నిచ్చును; వాతశ్లేష్మములను కొద్దిగ బెంచును; పైత్యమును, నేత్ర రోగమును అణచును; ఆకలిని బుట్టించును; మనోహరముగనుండును; బుద్ధికి బలమిచ్చును; దాహము నణచును; మూత్రము గావించును. మరియు ధాన్యములు చూడుడు.

రాజావర్తభస్మము:—Calx of a sort of lapis lazuli having lilactint. సం॥ రాజావర్త. హిం॥ రేఁటి. ఇదియొక రాయి. దీనిని క్రమముగ శుద్ధిచేసి చేసిన భస్మము శూలలు పైత్యములు, పాండువు, కఫము, మూలవ్యాధి, వాతములు వీనిని హరించును; జఠరదీప్తి, జీర్ణశక్తి, దేహకాంతి వీనినిచ్చును. మోతాదు పూటకు 1 మొదలు 2 చిన్నముల యెత్తు.

రాతిగువ్వ:—గువ్వ చూడుడు.

రాతిపువ్వు:—శిలాధాతువు చూడుడు.

రాతినార:—Stone hemp. An article like as asbestos. దీనిని అరవములో కల్‌నార్ అందురు. ఇది ఇంచుమించుగా నవాసాగర మును బోలియుండును. దీనిని దొండాకు పసరుతోగాని, కలబంద రసముతోగాని నూరి పుటము వేసిన భస్మమగును. యీ భస్మము మేహశాంతి జేయును; కుసుమరోగమును హరించును. తగిన అను పాన చూర్ణములతో గలిపి యిచ్చిన ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, శగరోగము, పొడిదగ్గు వీనిని హరించును. మోతాదు 1-2 చిన్నముల యెత్తు.

రాతియిల్లు:—**Living in a stone house**. దీనిలో నివసించుటవలన చలి, ఎండ వీని బాధలు నివర్తింపజేయును; మకోద్రేకమును, కఫమును అణచును; పైత్యమును జేయును; జఠరదీప్తి నిచ్చును; వాత రోగమును శాంతింపజేయును; నిశ్చలమగు బుద్ధినిచ్చును; స్త్రీసాంగత్యమువలన గలిగిన శ్రమను బోగొట్టును గాని సదా నివాస యోగ్యము గాదు.

రాత్రిఉష్ణోదకపానము:— **Drinking hot water at night.** రాత్రి పరుండబోవునపుడు వేడినీళ్ళు పుచ్చుకొనిన వాతమును, కఫమును, ఆమదోషమును, అరుచిని బోగొట్టును; అన్నముజీర్ణము గావించును; జఠరాగ్నిని వృద్ధిబొందించును.

రామఫలము:—**Annona reticulata. Eng. The netted custard apple or bullock's heart.** సం॥ రామఫల. రక్తత్వచ. హిం॥ లవనీఫల్, ఎనోనా. దీనికి రాంబాళఫలమని యందురు. ఇది మదము వాసనగలిగి రుచిగ నుండును; దప్పి, తాపము, శ్రమ, ఆకలి వీనిని జయించును. అగ్నిమాంద్యము, శూల, శిరోవాతము వీనిని బుట్టించును; చలువజేయును, గురుత్వముగ నుండును; కఫవాతములను బెంచును. పొట్టకు భారమును దెచ్చును; తలనొప్పిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 గులకందు, 2 కరక్కాయ మురబ్బా.

రామలు:—**A sort of red fish.** ఇవి సముద్ర ప్రాంతములలో దొరకు చేపలు. యెఱ్ఱగనుండును. రుచికరమైనవి. త్రిదోషములను శమింపజేయును. ముంతగుండె (**Heart**) కు, ధాతువులకు బలమిచ్చును. వీర్యవృద్ధిజేయును. పథ్యకరమైనవి. యెక్కువ తినిన గురుత్వము జేయును. దీనికి విరుగుడు చేపలు చూడుడు.

రావిచిగుళ్ళు :— **Tender leaves of pepaul tree.** వగటుగ నుండును; కఫపైత్యములను బోగొట్టును; విరేచనబద్ధము జేయును;

గ్రహణి, రక్తగ్రహణి, అతిసారము వీనిని కట్టును. వీనిని మాటిన ముద్ద గచ్చకాయంత లేక కరక్కాయంత లేక రసము 1-2 తులములమెత్తు పూటకు మోతాదు.

రావిచెట్టు:—Ficus religiosa. Eng. Pepaul tree. సం* అశ్వత్థ, గజాశన, పిప్పల. హిం* పీపల్ కావృక్షు. దీని చెక్క రసము లేక కషాయము వగరు, తీపి, చేదు రుచులు గలిగియుండును; జ్వరమును మేహమును, యోనిదోషము హరించును; నోటి రసపుపట్టును, నోటిపూతను శమింపజేయును. రసపుపట్టుకు, నోటిపూతకు దీనికషాయము పుక్కిలించతగియుండును. వ్రణములను, కురుపులను కడిగిన త్వరలో మానును. లోపలికిచ్చెదు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల మెత్తువరకు. విస్తరిగా దీనిఆకులు విస్తరాకులు కుట్టి దానిలో భోజనము జేసిన దంతములకు బలము,విరేచన బద్ధము జేయును. రావిచెక్క కాల్చిన బూడిదనుండి తీసిన క్షారము శూల, అగ్నిమాంద్యము, గుల్మము, బల్లలు హరించును.

రావిచెట్టు:—Shade of do. జువ్విచెట్టునీడ చూడుడు.

రావిపండ్లు:—Fruits of do. తియ్యగ నుండును; చలువ జేయును. పైత్యము, చర్ది, అరుచి వీనిని పోగొట్టును, ఆమవాతమును, గురుత్వమును జేయును. దీనికి విరుగుడు సర్వ్వచెట్టు ఆకు రసము లేక కషాయము. ఈపండ్లను ఎండించి చూర్ణముజేసి పూటకు మూడు చిన్నముల చొప్పున దినమునకు రెండుపూటలను పుచ్చుకొనిన ఉబ్బసరోగమును (asthma) నివారణమగును; రావిపండ్ల చూర్ణమును పంచదారగలిపి పాలతో పుచ్చుకొనుచుండిన స్త్రీల గర్భదోషమును పోగొట్టి సంతానయోగ్యత గలుగును. పురుషులకు వీర్యవృద్ధియు గలుగును,

రావి విత్తులు—Seeds of do. వీనిని వేయించిన చూర్ణముతో జేసిన లేహ్యమునుగాని, వీని చూర్ణమునుగాని పుచ్చుకొనిన దేహ తత్వమును మార్చును. వీర్యవృద్ధి, బలము, మేహశాంతి జేయును. లేహ్యపు మోతాదు పూటకు అరతులము చొప్పున, చూర్ణపు మోతాదు 2 అణాలయెత్తు చొప్పునను దినమునకు రెండుపూటల నియ్యనగును. చూర్ణమునకు సమముగ చీనాపంచదార గలిపి పుచ్చుకొనవచ్చును. లేహ్యము పంచదారపాకముతో చేయనగును.

రాసున్నము:—Stone lime. మిక్కిలి కారముగ నుండును. మేహ శాంతి జేయును. వాత పైత్యశూల, ఋతుశూల, శ్లేష్మము వీనిని హరించును. దంతదార్ఢ్యము నిచ్చును. తేనెతోగాని, బెల్లముతో గాని కలిపి పట్టువేసిన కవుకుదెబ్బలు, వాపులు మానును.

ఋతుభేదములనుబట్టి పుచ్చుకొనదగిన నీరు:—Water of a tank, well &c. to be drunk according to seasons. హిమంత ఋతువునందు తామర పువ్వులుగలిగిన కొలనునీరును, శిశిరఋతువు. నందు తామర, కలువ పువ్వులు గలిగిన కొలనునీరును, వసంత ఋతువునందు నూతినీరును, గ్రీష్మఋతువునందు కుండను పట్టి యుంచిన కొండకాలువనీరును, వర్ష శరదృతువులయందు చవిటి కాలువయొక్కయు, ఏటిప్రవాహములయొక్కయు, బొడ్డనబావుల (అనగా దిగుడుబావి) యొక్కయు నీరును మిక్కిలి యనుకూలముగ నుండి యారోగ్యము నిచ్చును.

ఋద్ధి (ఋద్ధి), వృద్ధి:—The medicinal plants. ఈ రెండును తీగె జాతిలోనివి. యించుమించుగ సమానముగ నుండును. గుణములు గూడ సమానమే. హిమాలయప్రాంతములందు దొరకును. ఋద్ధి కంటె వృద్ధియొక్క దుంపలు కొంచెము స్థూలముగను పొడవుగ నల్లగ సాలామిశ్రి దుంపవలెనుండునుగాని జిగురుమాత్ర ముండదు.

నోటిలోవేసుకొనిన నూకలవలె విడిపోవును. యీతీగెలకు ప్రత్తి కాయలవలె ధూమ్రవర్ణము (పొగరంగు) గల కాయలుండును. తీపి రుచి, శీతవీర్యముగలవి. త్రిదోషములను హరించును. మూర్ఛ, రక్తపిత్తము, జ్వరము, క్షతకాస, కఫవాతము, క్షయరోగము, తాపము వీనిని నశింపజేయును. వీర్యవృద్ధి, శరీరపుష్టి, బలము, కాంతి వీనిని గలుగజేయును. ప్రాణములను కాపాడును. గర్భదోషములను పోగొట్టి గర్భమును నిలుపును.

రుద్రజడచెట్టు:— **Ocimum Basilicum. O. Gratissimum. (sweet basil).** సం* రుద్రజట, విశ్వతులసి, జటావల్లీ, సుగంధా. హిం* సబ్జా, దీనిని తురకములో సబ్జాచెట్టని యందురు. ఇది మిక్కిలి సువాసనగల చిన్నచెట్టు. తులసివలె వెన్నులు వేయును. దానిలో గింజలుండును. వానిని సబ్జాగింజలందురు. నల్లగనుండును. దీనివేరు వీర్యస్తంభనజేయును. దీని విత్తనములు నీళ్ళలో నానవేసిన గుజ్జుగా, జిగురుగా, తెల్లగనుండును. దానిలో శర్కరగలిపి పుచ్చుకొనిన మేహశాంతి, పైత్యశాంతి, వీర్యవృద్ధి జేయును. నిక్కాకనణచును. వీనియొక్క తేలిక కషాయము సెగరోగము, మూత్రకృఛ్రము, నీరుచురుకు వీనిని పోగొట్టును. మోతాదు పూటకు 5 తులముల యెత్తుచొప్పున రెండుపూటల నియ్యవలెను. దీని వేరు, ఆకుపసరు చేదుగ, కారముగ నుండును. కర్ణరోగములను, తల నొప్పిని, తేలువిషమును నివారించును. స్త్రీలకు గర్భము నిలుపును.

రుద్రాక్షచెట్టు:—**Eloeocarpus ganitrus,** సం* రుద్రాక్ష. భూతనాశన. హిం* రుద్రాక్ష. యీచెట్లు విస్తారముగా ఉత్తరహిందూస్థానమున పెరుగును. యీ చెట్టు కాయలలోని గింజలు రుద్రాక్షలందురు. యివి కొన్ని చిన్నవిగాను, కొన్ని పెద్దవిగా నుండును. కొన్ని రెండుగింజలు కలసియుండును. యీ రుద్రాక్షలను తోలవేసి

మాలికలుగా గూర్చి ధరింతురు. యివి మిగుల పాపహారమైనవి. పవిత్రమైనవి. భూతబాధలను తొలగించును. శివప్రీతికరము. పండ్లు పులుపు, రుచి ఉష్ణవీర్యము గలవి. వాతశ్లేష్మమును హరించును. రుద్రాక్షలు నీళ్ళలో నానవేసి ఆనీళ్ళను యిచ్చుచుండిన మశూచిక ములను రాకుండజేయును. రుద్రాక్ష, పగడము, ముత్యము అక్కలకర్ర, చంగల్వకోష్టు, యష్టిమధుకము, సైంధవలవణము, కొండ కాయ కుమ్ములోబెట్టి రసముదీసి దానితో అరగదీసి నాలుకకు రాయుచు బంగారపు తీగెతో గీయుచుండిన సన్నిపాత రోగములలో జిహ్వాదోషము అనగా నాలుకగరి హరించును. పై వస్తువులు అల్లపు రసం, నిమ్మపండురసం కలిపిన రసముతో కూడ అరగదీసి రాయ వచ్చును.

రుబ్బేరేవండ్ లేక రుబ్బేరేవన్:–Extract Rheum Emodi. Extract rhubarb. అనగా రేవల్చిన్ని సత్వము లేక పాలు. యిది పసుపు పచ్చని రంగుగల కణికలు లాగున యుండును. దీనిని 2 మొదలు 4 గుంజల యెత్తువరకు ద్రాక్షపండుతో నూరిగాని యితర ఔషధవస్తువులతో నూరిగాని మంచినీళ్ళతో నిచ్చిన విరేచనములు బాగుగ నగును ఆమము, గుల్మము పడిపోవును. యుకృత్, ప్లీహ, శూలలను హరించును.

రుషభక మను మూలిక:—A medicinal plant. సం॥ వృషభ, విషాణి, ఇంద్రాక్ష. దీని కషాయము రక్తపైత్యము, వాతము, యక్ష్మరోగము, జ్వరము, తాపము వీనిని హరించును. శ్లేష్మమును, వీర్యమును వృద్ధిబొందించును.

రూమిమస్తకి:—Pistacia lentiscus. Eng. Mastiche. సం॥ ధూపజరా॥. ఇది యొక చెట్టుజిగురు. వేడిజేసి యార్చును. దీనిని నోటిలో నుంచుకొని నమలుటచేత మెదటిలో నుండు కఫమును, శీతల

మును పోగొట్టును. అరగదీసి వాసన చూచుటవలన జలుబు తలనొప్పి పోగొట్టును. ఇది యితర ఔషధములలో కలిపి పుచ్చుకొనిన పిచ్చితనమును, మతిచాంచల్యమును కుదుర్చును. ద్వంద్వరోగము నణచును. పన్నీటితో గుడ్డతడిపి యాగుడ్డకు దీని పొగబట్టి యది కండ్లపైన వేసిన సమస్త నేత్రరోగములును నయమగును. ఇది వట్టిది నమలుటవలనగాని, యితర వస్తువులలో కలిపి పండ్లకు పూయుటవలనగాని పండ్లు గట్టిపడును. వాని మాంసము జిగిపడును. నోటికి రుచిబుట్టించును. నోటి దుర్గంధమును పోగొట్టును. దంతరోగములను పోగొట్టును. దీనిని కుందురుమక్కిముతో కలిపి తినిన జ్ఞాపకశక్తి గలుగును. బుద్ధికి, హృదయమునకు బలమిచ్చును. వట్టిది తినడము వలన పొట్టకు, ప్రేగులకు, నల్లదబ్బకు, కార్జమునకు, గురదాలకు మేలుచేయును. తేజస్సు, బలము నిచ్చును. ఆకలి బుట్టించును. వాతము, అజీర్ణము, ఎక్కిళ్ళు, త్రేనుపులు, కడుపులో గుడగుడలాడుట వీని నణచును. కడుపు నొప్పికి మంచిది. సుగంధము గలది. పాలామిశ్రీతో తినిన చాలబలము, వీర్యపుష్టి జేయును. మూత్రమును జారీచేయును. విరేచనము కట్టును నమలి తినునప్పుడు వేడినీళ్ళతో తినవలెను. దీనిపొగ యాఘ్రాణించిన తెల్లదబ్బకు (Lungs) నష్టము జేయును. విషమగును. మోతాదు 2 మొదలు 8 గురిగింజ పూసల యెత్తువరకు.

రెండవమారీత ఆవుపాలు:—Milk of a cow that calved second time. ఆవుపాలు చూడుడు.

రెడ్డివారినానుబాలు అనుచెట్టు:—Euphorbia pilulifera, E. Hirta. Eng. Australian asthama weed; సం॥ దుగ్ధికా. హిం॥ దుగ్ధీ. ఇది పెద్దది చిన్నది అని రెండు జాతులు. ఈ రెంటిలో తెల్లనిది, ఎర్రనిది రెండు విధములు. దీనిని నాగార్జుని యందురు.

తీపి కారము, చేదు, రుచులు గలిగియుండును. దీనియాకురసము, చూర్ణము లేక కషాయము, పైత్యము, మేహము, క్రిమిరోగము, విషము, కంఠరోగము, నేత్రరోగము, సెగరోగము, కుష్ఠు మొదలగు ననేక మేహరోగములను హరించును. కొద్దిగ వాతముజేయును. చిన్నజాతిచెట్టు చూర్ణము బిడ్డల క్రిమిరోగమును హరించును. బిడ్డల జ్వరములు, విరేచనములు కట్టును. దీని రసములో మిరియాల చూర్ణము గలిపి స్త్రీలు బహిష్టు అయిన 3 దినములు ఉదయపు పూటలు యిచ్చిన ఋతుశూలల, రజోదోషము హరించి గర్భధారణ యోగ్యత గలిగించును. పథ్యముగ నుండవలెను. దీనిపాలు స్ఫోటకములో వచ్చిన కండ్లలోని పువ్వులు, పొరలు, చుక్కలు హరించును. రసపు మోతాదు 1-2 తులములయెత్తు. చూర్ణము 2 మొదలు 4 అణాలయెత్తువరకు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

రెల్లుగడ్డి:—Reed grass. సం* కాశ, సుకాండ. హిం* కాంస్. దీని వేళ్ళరసము లేక కషాయము తీపి, చేదు రుచిగనుండును. మూత్రకృఛ్రము, మూత్రాశ్మరి, తాపము, రక్తదోషము, పైత్యము, క్షయ వీనిని బోగొట్టును. చలువజేయును. రసము యొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

రేకుసంపెంగ:—Michulia chempaka- a sort of. యీ పుష్పములు అందముగను, మృదువైన సువాసనగలిగి యుండును. ధరించిన మనస్సుకు సంతోషమును ఆనందమును గలుగజేయును. మేహశాంతి, పైత్యశాంతి జేయును.

రేగటిదూలగొండ:—చిన్నదూలగొండ చూడుదు.

రేగుగింజలపప్పు:—Kernels of the seeds of zizyphus jujuba. దాహము, చర్ది, శ్వాస, కాస వీనిని బోగొట్టును.

రేగుచెట్టు:—Zizyphus jujuba. Eng: Jujuba tree. సం॥ బదరీ, ఫేనిల. హిం॥ బేర్. దీని చెక్కరసము లేక కషాయము వగరుగ నుండును. కాక జేయును. బలమిచ్చును. వాతము, అతిసారము, రక్తదోషము వీనిని హరించును. మోతాదు పూటకు 3–4 తులములయెత్తు. దీని జిగురు నాభికి బూసిన వీర్యస్తంభన గలుగును. దీని లేతయాకులు ఉదయమున ఏకోత్తరవృద్ధిగ 1–2 మిరియపుగింజలతో 15 లేక 20 దినములు పుచ్చుకొనిన వీర్యనష్టము కట్టును. దీనియాకును నీళ్ళతోగాని, కలితోగాని దంచి కవ్వముతో చిలికియందు వెడలెడి నురుగును పూసిన కాళ్ళుచేతుల మంటలు హరించును. దీని యాకులు నూరి తలరుద్దుకొని స్నానము జేయుచుండిన వెంట్రుక లెదుగును. మృదువుగనుండి పగులక యుండును. దీని యాకులు యష్టిమధుకము చితుకగొట్టి కషాయముకాచి అందు సైంధవలవణము గలిపి పుచ్చుకొనుచుండిన స్వరభంగము అనగా గొంతుక బొంగురుబారడమును మానును.

రేగుపండు:—Fruit of do. జిగురుగ, పుల్లగ, తియ్యగ నుండును. చలువజేసి యార్చును. బిగదీయును. వాతమును, మేహమును, మూలవ్యాధిని గొట్టును. శుభ్రమైన రక్తమును బుట్టించును. ప్రమేహమును, శ్రమను అణచును. కాంతిని, బలమును యిచ్చును. ఆలస్యముగ జీర్ణమగును. విరేచనబద్ధము జేయును. గొంతుకను బొంగురుపరచును. కఫము, పైత్యము, గురుత్వము జేయును. దీనికి విరుగుళ్ళు 1 అరటిపండు, 2 పంచదార, 3 ఉష్ణోదకము, 4 గులకందు.

రేగుపండువడియాలు:— Dried cakes made of the fruits of do. రుచిగ నుండును. శ్రమను బోగొట్టును. అగ్నిదీప్తిని, తేలికను యిచ్చును. రక్తవిరేచనములు కట్టును.

రేగుపండ్లుపుల్లనివి:—Fruit of do sour. చలువజేయును; వాతము నణచును; జీర్ణముగావించును; రొంప నెక్కువజేయును; పొట్టకు చలువజేయును; దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 పంచదార.

రేణుకలు:— Piper aurantiacum. సం* రేణుకా, హారేణుకా. హిం* రేణుకా. సంభాయీ కెబీజ్. ఇవి యించుమించుగ మిరియా లంత ఉరవుగ, చప్పనిరుచిగ, శీతపైత్యము, దాహము, దురద, కాస, కఫము, వాతము, అతిసారము, జ్వరము, ఉన్మాదము వీనిని జయించును. బుద్ధిని హెచ్చించును; అగ్నిదీప్తి నిచ్చును; గర్భస్రావ మును గలిగించును.

రేలచిగురు:— Tender leaves of cassia fistula. విరేచనము జేయును; కఫపైత్యమును హరించును. దీనిని పచ్చడిగాజేసి పుచ్చు కుందురు. విరేచనమగును. దీనిని చల్లతోనూరి శరీరమునకు రాసు కొనిన చర్మరోగములు మానును.

రేలచెట్టు:—Cassia fistula. Eng. Pudding pipe tree & purging cassia. స* ఆరగ్వథ, దీర్ఘఫల, స్వర్ణపుష్ప. హిం* అమల్ తాస్. దీనిపట్ట లేక ఆకురసము లేక కషాయము చేదుగ నుండును; మిక్కిలి వేడిజేయును; కుష్టు, క్రిమి, శూల, మేహము, ఉదరము, వ్రణములు, గుల్మము, జ్వరము, విషము వీనిని జయించును; విరేచ నము గావించును; మూత్రమును జారీచేయును. యీ చెక్క కషాయ మిచ్చుచుండిన (Black water fever) అనగా మన్యపు జ్వరముతో రక్తము మూత్రద్వారమునుండి పోయెడి రోగము తప్పక నివారణమగును. రసపు మోతాదు పూటకు 4-5 తులముల యెత్తు. కషాయపు మోతాదు పూటకు 8 మొదలు 6 తులముల యెత్తువరకు.

రేలపండుగుంజు:—Pulp of the fruit of do. దీనిలోని గుంజు తియ్యగ, రుచిగనుండును; విరేచనము జేయును; మలదోషమును పోగొట్టును. వాతపైత్యము, జ్వరము, విరేచనబద్ధము, ఆమ దోషము వీనిని హరించును. బలము జేయును. మోతాదు పూటకు 4 మొదలు 8 అణాల యెత్తువరకు.

రేలపువ్వు:—Flowers of do. దీనికూర పచ్చడి వగరుగ నుండును; రుచి బుట్టించును; జ్వరపడి లేచినవారికి మిక్కిలి పథ్యముగనుండును; మలదోషమును హరించును. దీనికషాయము కుష్ఠరోగముల బోగొట్టును; కష్ఠము, కఫము, మేదస్సును అణచును; విరేచనము గావించును; పైత్యమును బోగొట్టును; మూత్రమును జారీచేయును. కషాయపు మోతాదు పూటకు 1½ మొదలు 5 తులములయెత్తువరకు.

రేవలచిన్ని:—Rheum emodi, Garcima morella. Eng. Rhubarb. సం॥ రేవడ్చీనీ, పీతమూలీ. హిం॥ రేపట్చీనీ, రేవత్చీనీ. ఇదియొక చెట్టువేరు. చేదుగ, కారముగ నుండును; పైత్యము జేయును; మూత్రమును గావించును; సమశీతోష్ణము జేయును; వంటి జబ్బునీరును దీయును; క్రిమి, ఉబ్బు, సెగరోగము వీనిని బోగొట్టును; పొట్టకు బలము జేయును. మోతాదును బట్టి విరేచనము కట్టును; విరేచనము చేయును; అగ్నిమాంద్యమును, అజీర్ణమును పోగొట్టును. నీళ్ళవిరేచనముల కట్టును. మోతాదు 20 మొదలు 30 గోధుమగింజలయెత్తువరకు నిచ్చిన జాడించి విరేచనము జేయును; 1 మొదలు 2 అణాలయెత్తువరకు ఇచ్చిన పొట్టకు బలముచేసి బిడ్డలకు పండ్లు వచ్చునప్పుడు అగువిరేచనములను కట్టును. రేవలచిన్ని నీళ్ళతో అరగదీసి కొద్దిగ సూరేకారమును గలిపి పొత్తికడుపునకు పట్టువేసిన మూత్రమును జారీచేయును. దీనిపాలను రుబ్బే రేవడ్ అందురు. రుబ్బే రేవడ్ చూడుడు.

రొయ్యపిత:—Cyprinus rohita. Gall of rohita fish. సం॥ రోహితపిత్త. అనగా గండుమీను చేప చేదు. ఇది పైత్యము, కాక జేయును; వాతము, జ్వరము, విషజ్వరము, సన్నిపాతముచు హరించును; విరేచనము జేయును; శైత్యవిదాహము నణచును. దీనిని సన్నిపాతము, సూతికావాతము మొదలగు దారుణవాతరోగముల కిచ్చు మందులో చేర్చుదురు; వట్టిది యిచ్చినను పనిజేయును. మోతాదు 1 మొదలు 4 గుంజలయెత్తు తమలపాకులలో నుంచి నమలించి మ్రింగించనగును. 1-2 గుంజలయెత్తు నీళ్ళపైన వేసి త్రాగించిన శైత్యవిదాహము కట్టును.

రొయ్యలు పచ్చివి:—Prawns-fresh. వీని మాంసము మృదువుగ, రుచిగనుండును, జఠరదీప్తి నిచ్చును; రక్తవృద్ధి జేయును; బలము జేయును, శుక్రవృద్ధిని, బుద్ధికి బలమును ఇచ్చును; గ్రహణిరోగులకు పథ్యమైనది; గురదాలకు అనగా మూత్రము పుట్టెడు అవయవములకును, గర్భమునిలుచు స్థానములకును బలమిచ్చును, మూత్రము గావించును; విరేచనబద్ధము జేయును; గురదాల (kidneys) కు వేడినిచ్చును, అక్రోటుపప్పు, ఆవునెయ్యి, కొబ్బరినూనె, ఉల్లిపాయలు వేసి వండినవి గాని, కోడిగ్రుడ్లతో వండినవిగాని పుంస్త్వమును మిక్కిలి హెచ్చించును; ఆలస్యముగ జీర్ణమగును; వాతశ్లేష్మముల జేయును; ఉష్ణశరీరులకు దురద బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 పులుసు, 2 నెయ్యి, 3 కలి, 4 సిరకా, 5 పుల్లనిదానిమ్మగింజల రసము. వాతశ్లేష్మరోగులకు అపథ్యమైనవి.

—ల—

# ల

లంకలు:—Sattyrus sativus. Eng. Chickling vetch. సం॥ త్రిపుట, హిం॥ ఖేసారీ, కస్సా. యివి చిన్న బటాణీలవలె నుండును. బోడికంద లందురు. యీగింజలలో ఒకవిధమైన విషదోషముండును గనుక వేపినను, వుడకబెట్టినను ఆదోషము పోవును. తియ్యగా, కమ్మగా, కొద్ది వగరు, చేదుగూడ గలిగి రుచిగా నుండును. చలువ వాతము, విరేచనబద్ధము జేయును. కఫ, పైత్యములను హరించును. విస్తారము దినిన కీళ్ళవాతము, పక్షవాతము, శూల, పైత్యభ్రమ, ఉబ్బు, దాహము, మూలవ్యాధి, హృద్రోగమును బుట్టించును. వీనిని కూరలలో వేసి వండుకుతిందురు. బలమైన ఆహారము. బాతులకు ఎడ్లకు, గుఱ్ఱములకు వేసిన మంచి బలము జేయును.

లంఘనము:—Fasting. అనగా వాతపిత్తశ్లేష్మ ప్రకోపముల వలన గలుగు జ్వరాదిరోగములయందు ఆహారము బుచ్చుకొనక పోవుటయె లంఘన మనబడును. గాని వాతప్రకోపమున ఆహార మేమియు బుచ్చుకొనక పోవుటయు, పిత్తప్రకోపమున లఘువైన ఆహారము బుచ్చుకొనుటయు, శ్లేష్మప్రకోపమున ద్రవరూపమైన ఆహారము బుచ్చుకొనుటయు లంఘనమగును. లంఘనము జేయుటవలన సన్నిపాతాది రోగములయందు (Typhus & Typhoid fevers &c) పొట్టయందు, ప్రేగులు, ఊపిరితిత్తులు మొదలగు యవయవముల యందలి దోషములను హరించి త్వరలోరోగ నివృత్తిజేయును.

లంజముండ చెట్టు:—A large tree. దీనిని అరవములో లెచ్చికట్టిమరమని యందురు. దీనియాకులు పెద్దవిగ పొడవుగ నుండును, పాలుండును. దీని ముదురు ఆకులకు ఆముదముపూసి వెచ్చజేసికట్టిన కీళ్ళ పాతవాపు నొప్పులు మానును. లేత ఆకుల కూర రుచిగా

నుండును. వాతమును హరించును. కీళ్ళయందు, నడుమునందుండు నొప్పులు హరించును.

లంజసవరపుకాడ:—గొం తెమగోరచెట్టు చూడుడు.

లక్క:—Coccus lacca. Eng. Lac. సం॥ లాక్షా, కీటజ, రక్తమాత్రుక. హిం॥ లాఖ్, లాఖ్ హి. అనగా లక్కపట్టు ఎండించిన దానిని బియ్యాము, అందు దీనిచూర్ణము లేక కషాయము వగరు, చేదుగ నుండును. అధికముగ రజస్సు పోవుట, క్షయ, విసర్పి, చర్ది, ఎక్కిళ్ళు, నరుకులు, వ్రణములు, శ్లేష్మ, పైత్య, మేహజ్వరములు, పురాణ అంతర్గతజ్వరములు, పిశాచబాధ, అపస్మారము వీనిని బోగొట్టును. అతిసార విరేచనములను, పురాణ జ్వరములను కట్టును. జ్వరములలో పొట్టయందు, ప్రేగులయందు గలవరుపును (Irritation at the stomach & bowels) మాన్పును. లక్క నూనెలోవేసి కాచి తలకు పూసిన పురాణ జ్వరమువలన గలిగిన నీరసమును పోగొట్టును. చూర్ణపు మోతాదు పూటకు 2 మొదలు 5 చిన్నముల యెత్తువరకు. కషాయపు మోతాదు పూటకు 3-4 తులములయెత్తు. చూర్ణము పూటకు సుమారు బేడయెత్తు చొప్పున తేనెతో కలిపి పుచ్చుకొనిన గుండెలలో నొప్పి హరించును; 4-5 దినములు పుచ్చుకొనవలెను. లక్క పట్టిలోనుండు ద్రవపదార్థము దూదికి పట్టించిన దానిని లత్తుకక (దూది) అందురు. దీనితో రంగులు మిశ్రమముచేసి పాదములకు, పెదవులకు, కండ్లకు అందముకొరకు రంగు వేసికొందురు.

లక్ష్మీతులసి:—తులసి చూడుడు.

లత్తుక:—Cotton steeped in lac-liquid. లక్క చూడుడు.

లలితకూర:—A kind of ground herb. రుచిగనుండును, జిగటగ నుండి గురుత్వము, శ్లేష్మము, చలువ జేయును; రక్తపైత్యమును బోగొట్టును; వీర్యవృద్ధి నిచ్చును

లవంగపట్ట, లవంగపత్రి:—అనగా దాల్చినచెక్క, లవంగపత్రి అనగా ఆకు పత్రికము గనుక అవి చూడుడు.

లవంగపుష్పము:—అనగా లవంగమొగ్గలు; లవంగములు చూడుడు.

లవంగాలనూనె:—Oil of cloves. కారముగ నుండును; బలమును, ఇంద్రియపుష్టిని యిచ్చును; వాతపైత్యములను, శ్లేష్మములను, దగ్గును, క్షయను మాన్పును. అజీర్ణమును, కడుపునొప్పిని పోగొట్టును; పుప్పిపంటిలో బెట్టిన దాని బాధను పోగొట్టును. పళ్ళు ఘట్టిబడచేయును. పైన పూసిన చిగుళ్ళవాపును పోగొట్టును; మరియు లవంగముల గుణము గలిగియుండును. మోతాదు 3 మొదలు 12 చుక్కలవరకు నీళ్ళలోగాని, పాకము (syrup) లో గాని వేసి త్రాగింపవచ్చును. లేదా. పండుతమలపాకులమీద వేసి నమలించి మింగింపవచ్చును.

లవంగాలు:—Myrtus caryophyllus. Caryophyllus aromaticus. Eng. Cloves. సం॥ లవంగ, వరాంగా, దేవకుసుమ. హిం॥ లోంగ్. దీనిరసము, చూర్ణము లేక కషాయము కారముగ, చిరిచేదుగ నుండును. వేడిచేసి యార్చును; మనోహరముగనుండును; మేహశాంతి జేయును; పైత్యరోగమును, మధుమేహము, జ్వరము. చర్ది, అరుచి, ఆమవికారము, చలువ, శ్లేష్మము, కఫము, దగ్గు, విషవేగము, దురద, విదాహము, వాతము, క్షయ వీనిని బోగొట్టును; బలముజేయును. రక్తప్రవాహమునకు గలిగెడు యాటంకములను నివర్తింపజేయును; తలనొప్పిని, వికారమును శాంతిపరచును; ముంతగుండె (heart), గర్భోత్పత్తిస్థానము (uterus), మెదడు (brain), నల్లదబ్బ (spleen), కార్జము (liver), ప్రేగులు (intestines), గురదాల (kidneys), పొట్ట (stomach) వీనికి బలముజేయును; వీనిశక్తులను కాపాడును; నిస్త్రాణతో గూడిన అగ్నిమాంద్యము (atonic dyspepsia), అజీర్ణము, అజీర్ణవిరేచనములు

వాంతి, గర్భిణీ స్త్రీలకు గలిగెడు వాంతి, కడుపులో మంట, త్రేపులు, కడుపునొప్పి, దాహము వీనిని కట్టును; పొట్టలోని వాతమును వెడలించును; జీర్ణము గావించును. 5 అణాలయెత్తు లవంగాలు చితుకకొట్టి 15 తులముల యెత్తు మరుగునీళ్ళలోవేసి చేసిన తేలిక కషాయము నిచ్చిన బడలికను, నీరసమును, అగ్నిమాంద్యము (dyspepsia) ను పోగొట్టును. మోతాదు 5 తులములయెత్తు లవంగాలును, జాలపు (jalap) ను సమపాళ్ళుగా కలిపివుంచి 6 గోధుమగింజలయెత్తు మాత్రగచేసి యిచ్చిన విరేచనమగును. లవంగాలయొక్క, నేలవేమువొక్క తేలికకషాయములు సమపాళ్ళుగా గలిపియిచ్చిన నీరసము, ఆకలి లేకపోవడము మానును; జ్వరపడి లేచినవారికి మిక్కిలి యనుకూలముగ నుండును. దీని చమురు పైన పూసిన వాత, మేహవాతపు నొప్పులు, తలనొప్పి, పన్నునొప్పి, చిగురు వాపునొప్పి నయమగును; చిగుళ్ళను ఘట్టిపరచును; నోటికి సువాసన దెచ్చును; దీపనకారి (stimulant), జలుబున (cold) వచ్చిన యన్ని శిరోరోగములను, ద్వంద్వరోగములను, శిరోవరములతో సంబంధించిన రోగములను హరించును. వీనిని తినుటవలన,వీని చమురుగాని గంధముగాని పూయుటవలన, పొగబుచ్చుకొనుట వలన, నశ్యము చేయుటవలన పైనచెప్పిన శిరో ద్వంద్వరోగములు హరించును; వీనిని నమలుటవలన కండ్లనొప్పులు నిమ్మళించును; గొంతుక నుస తగ్గును, చిగుళ్ళకు సత్తువజేయును. వీనిని నీళ్ళలో నరగదీసి కండ్లకుపెట్టిన కాంతిగలుగును; జలుబుచేత కండ్లలోపుట్టు రోగములు హరించును, హృదయములోని భయమును, నీరసమును, ఉబ్బసమును పోగొట్టును; బుద్ధివికాసమును గలిగించును; ధాతుపుష్టి నిచ్చును; సూతికావాతము వణచును; ఎక్కిళ్ళు, త్రేనుపులు, నోటిదుర్గంధము, ఉబ్బురోగము, చలువచేతనగు అతిమూత్రము,

శ్లేష్మసంబంధమయిన రోగములు వీనిని పోగొట్టును. వీని చూర్ణ మను దినము (కొన్ని వారములు) ఆవుపాలలో వేసి పుచ్చుకొనిన ధాతుపుష్టి జేయును, స్త్రీలు ఋతుస్నానమైన వెనుక 1 డ్రాం లేక 5 అణాల యెత్తు వీనిచూర్ణము పుచ్చుకొనిన గర్భోత్పత్తియగును. వీనిలో మొగ మొగ్గను సాంగత్యము చేసినతోడనే స్త్రీతినివను, అనుదినము నను స్త్రీ యొక్కొక్క లవంగ మొగ్గ చొప్పున దినుచుండినను గర్భోత్పత్తి కాకుండును. మొగ లవంగ మొగ్గ పెద్దదిగను, రంగుతక్కువగను ఉండును. లవంగ మొగ్గలను దీపముమీదగాని, నిప్పుమీదగాని కాల్చి వానిని (2-3) నోటిలోనుంచుకొని నమలి ద్రవము మ్రింగుచుండిన దగ్గు, శ్లేష్మప్రకోపము అణగును; లవంగాలు అమితముగ తినుచుండిన ఇంద్రియమునకు వేడిపుట్టి యది నీరయి స్ఖలనగుణము పుట్టును; ప్రేగులను, గురదాలను (kidneys) నష్టము జేయును. దీనికి విరుగుడు గుమ్మజిగురు. లవంగాలు వైద్యమునకు చాలయుపయోగముగ నుండును. వీని తేలికకషాయము, చూర్ణము, నూనె ఉపయోగింపబడును. తేలికకషాయపు మోతాదు పూటకు 3 మొదలు 6 తులములయెత్తువరకు, కషాయపుమోతాదు 2½ మొదలు 5 తులములయెత్తువరకు. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు. నూనె 3 మొదలు 10 చుక్కలవరకుగాని యంతకు యధికపు మోతాదులుగగాని నియ్యతగియుండును. మహాలవంగాది చూర్ణము చాలా గొప్పపనిజేయును. అనేక ఔషధములు యీ చూర్ణముతో కలిపియిచ్చిన చాల గొప్పపని చేయును.

లవణత్రయము:—Compound of three salts. అనగా సైంధవ లవణము, సౌవర్చలవణము, బిడాలవణము వీనిసముదాయము అగ్నిమాంద్యము, గుల్మము, విద్రధి, వాతము వీనిని హరించును.

లక్ష్మణఫలము:—A sort of custard apple. దీని యాకు, పువ్వు శీతాఫలపుచెట్టు ఆకు, పువ్వువలె నుండును. దీనిపండును పనసకాయ

వలె ముండ్లుండనుకాని, మృదువుగనుండును. సీతాఫలములోని తొనలు, గుంజు, విత్తనములవలె దీనికిని యుండును; సీతాఫల, రామాఫలముల రుచులకంటె మంచి రుచిగలది; మేహశాంతి, పైత్య శాంతిజేయును, వీర్యవృద్ధి చేయును; గురుత్వముగ నుండును; చలువ జేయును.

లక్ష్మణపంజి:—Mandragora officinalis. M. Autumnalis. Eng. Mandrake. సం॥ లక్ష్మణా, పుత్రిదా, రక్తబిందుపత్రా. హిం॥ లక్ష్మనీ. దీని ఆకు, వేరుచెక్క రసము లేక కషాయము పైత్యమును హరించును; శ్లేష్మముజేయును; గర్భదోషములను బోగొట్టి గర్భమును నిలుపును. ప్రమేహమును జయించును; వీర్యవృద్ధి నిచ్చును. కుసుమరోగములను హరించును.

లక్ష్మిచారు:—Rice washings added with little cunjee acid. అనగా శుభ్రమైన కుండలో బియ్యపుకడుగులో కొద్దిగ గంజి చేర్చి పుల్లబెట్టినది. అనగా ప్రతిదినమున్నూ పైవిధముగ యుంచిన దానిలో కొంత తీసివేసి క్రొత్తది చేర్చుచుండవలెను. ఇట్లు తయారు చేసి పుల్లబెట్టిన దానిలో కొంత భాగము తీసికొని అందు రసవర్గము లున్నూ, లేతవంకాయ, మునక్కాయ, తోటకూరకాడలు, నల్లి ఆకులు వగయిరాలలో కొన్నిగాని, అన్నిగాని బాగుగా మరగబెట్టి పొంగించినది పుల్లగ, రుచిగ నుండును. శ్రమ, భ్రమ, దాహము, తాపము వీనిని శాంతింపజేయును. పైత్యశాంతి, మేహశాంతి జేయును. వేసవికాలమందు మిక్కిలి అనుకూలముగ నుండును. గురుత్వముగ నుండును. రోగులకు అపథ్యముగ నుండును.

లక్ష్మినారాయణచెట్టు:—నిమమంగలపుచెట్టు చూడుడు.

లావుకపిట్ట:—A sort of quail-flesh of. సం॥ లావ. దీనిని లాగ పిట్టయనికూడ యందురు. దీనిమాంసము రుచిగనుండును. సమ

ధాతువు నిచ్చును; తేలికగ జీర్ణమగును. శుభ్రమైన రక్తమును బుట్టించును; అగ్నిదీప్తినిచ్చును; వాతమును పోగొట్టును; మిక్కిలి బలము నిచ్చును; దేహతత్వమును సౌమ్యపరచును; పథ్యమైనది.

లింగదొండ:— Bryonia lacinosa. సం॥ లింగినీ, బహుపుత్రీ. హిం॥ లింగినీ. దీనిని శివలింగదుని యందురు. దీనియాకు లేక వేరు రసము కారముగ నుండును; వేడిజేయును; రసమును బంధించును; కుష్టును శాంతిపరచును. వశీకరణమునకు యుపయోగింతురు; ముది మివ్యాధిని పోగొట్టును; గర్భదోషమును పోగొట్టి సంతానము గలిగించును; ఆయురారోగ్యముల నిచ్చును; రసముయొక్క మోతాదు ౨-౩ తులములయెత్తు.

లింగపొట్లకాయ:—A sort of snake gourd-curry of. దీనికూర చేదుగ నుండును;వాతపైత్యములను హరించును; కాంతినిచ్చును; అరుచిని, ఉబ్బును పోగొట్టును; జఠరదీప్తి నిచ్చును.

లేగటియావుపాలు:—Milk of newly calved cow. ఆవుపాలు చూడుడు.

లేడిమాంసము:—Flesh of an antelope. రుచిగ, లఘువుగ నుండును; బలము, వీర్యవృద్ధినిచ్చును. త్రిదోషములను, జ్వరమును, ఉబ్బురోగమును, శోషను పోగొట్టును; రక్తమును బాగుజేయును; అరుచి, మలమూత్రబద్ధము, మూత్రకృచ్ఛ్రము వీనిని హరించును; పార్శ్వవాతములను హరించును;* పథ్యమైనది. దీని కొమ్ములను ముక్కలుక్రింద కొట్టి శుద్ధిజేసి పుటముబెట్టి భస్మముగను దీనిని అనుపాన భేదములుగా యిచ్చిన *మేహరోగములమీద పనిజేయును.

లొద్దుగచెట్టు:—Symplocos racemosa. Eng. The lodh tree-red and white. సం॥ లోధ్ర, రోధ్రా. హిం॥ లోధ్. ఇది తెలుపు, మెరుపు రెండుజాతులు గలవు. వీని చెక్కలరసము లేక కషా

యము వగరుగ నుండును. పైత్యము, కఫము, అరుచి, వమనము, దాహము, అతిసారము, గ్రహణి, విషదోషము, క్రిమిరోగము, యోనిరోగములు లేక కుసుమరోగములు వీనిని హరించును. ఋతు రక్తస్రావమును కట్టును దీని పుష్పములకు పైగుణములు గలిగి యుండును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. మరియు దీనితో లోధ్రారిష్టము తయారుచేయుదురు. స్త్రీల రోగములను నివారణ జేయును.

లొలుగు చెట్టు:—అనగా ముచుకుందము. ముచుకుందము చూడుడు.

లోహభస్మము, లోహసింధూరము:—Calx and reddened calx of iron or steel. సం* లోహం. ఉక్కును క్రమముగ శుద్ధిజేసి చేయబడిన లోహభస్మము లేక సింధూరము. చేదు, వగరు, తీపి రుచులు గలిగియుండును. క్షయరోగము, జ్వరము, క్రిమి, పాండువు, వాతము, పైత్య, స్థూలత్వము, మూలవ్యాధి, గ్రహణి, శ్లేష్మము, ఉబ్బు, ప్రమేహము, గుల్మము, కడుపులోని గడ్డలు, విషములు, కుష్ఠు, అగ్నిమాంద్యము, రక్తపైత్యము కాస, శ్వాస, కఫము, నేత్రరోగము, కామిల వాతక్షీణత్వము, పీనస, ఆమవాతము, భ్రమ, రక్తవికారము, అరుచి, బల్లలు, శ్వేతకుష్ఠు, సర్పవిషము వీనిని హరించును; దేహమునకు బలమును, కాంతి, రక్తవృద్ధి ఆరోగ్యమును, కామమును, ఆయుర్వృద్ధిని ఇచ్చును, మృత్యువును, వలీపలితములను పోగొట్టి సంభోగశక్తిని గలిగించును. మరియు దీనిని ఆయా రోగములకు దగిన అనుపానములతో పుచ్చుకొనిన మృత్యుసమానమగు ననేకరోగములు పోగొట్టును. లేహ్యములలోగూడ కలిపి సేవించ వచ్చును; అపరిశుద్ధ లోహభస్మ సింధూర సేవవలన హృద్రోగము, శూల, అశ్మరి, వాంతి, తాపము, అశక్తత, హృదయమున దారుణ

మైన పీడ మొదలగు ననేక రోగములు జనించుటయేకాక ఆయా రోగములను ప్రకోపింపజేయును; దీనికి విరుగుళ్ళు 1 సైంధవలవణము, తెల్లతెగడ వీనిని సమముగ చూర్ణించి ఉష్ణోదకముతో పుచ్చుకొనడము. వీనిలో దేనినైన కొన్నిదినములు సేవించిన యపరిశుద్ధలోహభస్మ సింధూరసేవ వలన గలిగిన వికారము నివృత్తించును. మొదటిదాని మోతాదు 2 అణాలయెత్తు మొదలు 4 అణాలయెత్తు వరకు. లోహభస్మ సింధూరముల మోతాదు పూటకు 1 మొదలు 4 గురిగింజలయెత్తువరకు. లోహభస్మ సింధూరముల సేవించుకాలమున నూనె, ఆవ, గుమ్మడి, మినుము, మద్యము, పులుసు, ఆకుగూరలు, అరటికాయ, కంద, తియ్యనికంద పుల్లనికలి, వాక్కాయ, వెదురు బొడును, కాకరకాయ, స్త్రీసాంగత్యము వీనిని వర్జింపవలయును. మఱియు చింత, కోపము, వ్యాయామము, మనోప్రయాస (mental labour). ఎండలో సంచారము వీనిని వర్జింపవలయును.

—౦—

# వ

వంక సన్నములను ధాన్యము:—A sort of paddy. వీని బియ్యము సన్నముగా నుండును. అన్నము రుచిగా నుండును. తేలికగ జీర్ణమగును. పైత్యము నణచును. మేహశాంతి, వీర్యవృద్ధి, బలము, పుష్టి నిచ్చును. విరేచనము జేయును. కొత్తబియ్యము వాతము జేయును.

వంకాయ, అల్లమువేసి చేసినపచ్చడి:—A sort of green sauce of brinjals. లేతవంకాయ కాల్చి, అల్లము, బెల్లము లేక శర్కర గలిపి చేసినది సువాసనగ రుచిగ నుండును; కొద్దిగ వాతమును, కఫ

మును జేయును; అరుచిని పోగొట్టును; పైత్యరోగులకును, గాయములు తగిలినవారికిని అనుకూలముగ నుండును.

వంకాయపండుది:—Curry of ripe Brinjal. దీని కూరరుచిగ నుండును; వాతమును హెచ్చించును; గురుత్వము జేయును; వీర్యమునకు చలువ జేయును; రసదోషమును విరుచును; వికారమును గలుగ జేయును; ప్రక్కయెముకలలో నొప్పిబుట్టించును. దీనికి విరుగుళ్ళు వంకాయ చూడుడు. వీని పచ్చడి రుచిగా నుండును. కఫమును వృద్ధిజేయును. అనుదినము పుచ్చుకొనిన గజ్జి; దద్దుర్లు, సర్పి వీనిని బుట్టించును. అపథ్యమైనది.

వంకాయమిక్కిలి లేతది:—Curry of quite young brinjals. వీని కూర రుచిబుట్టించును; తేలికగనుండును; పైత్యమును, వాతమును, శ్లేష్మమును అణచును; శుక్రవృద్ధి, జఠరదీప్తిని యిచ్చును; కఫవాతములను, నేత్రరోగములను జయించును, రక్తమును వృద్ధిబొందించును; పథ్యమయి యుండును; క్రిమిరోగమును బుట్టించును. దీనికి విరుగుళ్ళు వంకాయ చూడుడు.

వంకాయ ముదిరినది:—Curry of matured brinjals. వీనికూర వాతపిత్తశ్లేష్మములను వృద్ధిబొందించును; వీర్యమునకు చలువ జేయును; శీతపైత్యము జేయును; రసదోషమును విరుచును; దురదల గలుగ జేయును; అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు వంకాయచూడుడు.

వంకాయ వరుగు:—Dried slices of green brinjals. వీనికూర లేక పులుసు రుచిగా, గురుత్వముగ నుండును; పైత్యముజేయును; రసదోషమును విరుచును.

వంకాయ సామాన్యగుణము:—Solanum melongena. Eng. Brinjals. సం॥ వార్తాకీ, కంటపత్రికా, రాజకూష్మాండ. హిం॥ బైంగన్. వీనికూర రుచిగనుండును; అగ్నిదీప్తినిచ్చును; పొట్టను

మృదువుపరచును; కండ్లకు చలువజేయును; తేలికగనుండును; సుద్దను తీసివేయును; రసదోషమును విరుచును; శీతపైత్యము, శ్లేష్మము జేయును; దురదలను, క్రిమిరోగమును హెచ్చించును; ప్రక్క టెము కలలో నొప్పిబుట్టించును; వికారము గలుగజేయును; కార్జమును, నల్లదెబ్బ (spleen) ను, దేహవర్ణమును జెరచును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 మాంసము, 3 ఆవాలచూర్ణం, 4 తీపి, 5 అల్లము, 6 గరమసాలా వస్తువులు (spices).

వంగపండ్ల వడియాలు:—Cakes made of ripe brinjals. పండిన వంగపండ్లలో నువ్వులు, మిరియములు, జీలకర్ర, ఇంగువ, ఉప్పు దీనినిచేర్చి చేయబడినవి. కాక, పైత్యము జేయును; రుచిగ నుండును; నూనెలో వేయించినవి అగ్నిదీప్తి నిచ్చును; రుచి బుట్టించును; పైత్యము జేయును.

వంగపండ్ల వరుగు:—Dried slices of ripe brinjals. దీనిని వంగ వరుగందురు. పులుసులో వేసినను, చారులో వేసినను చాల రుచిగా నుండును. పైత్యము జేయునుగాని వాతమును హరించును; రస దోషమును విరుచును; రుచిబుట్టించును; బలము, శరీరపుష్టి జేయును; హృదయమునకు మేలుజేయును; గురుత్వముగ నుండును.

వంగభస్మము:—తగరభస్మము చూడుడు.

వజ్రభస్మము:—Calx of Diamonds. సం॥ హీరక, వజ్ర. హిం॥ హీరా. క్రమముగ శుద్ధిచేయబడిన వజ్రభస్మము తగిన అను పానములతో సేవించిన విరేచనము జేయును; శూల, గుల్మము, ఉదర రోగములు, శ్లేష్మరోగములు, కాస, శ్వాస, క్షయ మొదలగు ననేకరోగముల బోగొట్టును; మరియు ఆయువు, బలము, రూపము, శరీరసౌఖ్యము వీనిని గలుగజేయును. మోతాదు అరగుంజెత్తు మొదలు గుంజెత్తువరకు. అపరిశుద్ధ వజ్రభస్మ సేవవలన గలి

గిన వికారమునకు విరుగుడు నెయ్యి, తేనె, కలకండ వీనిని సమముగ గలిపి యావుపాలతో సేవింపవలయును.

వజ్రాభరణ ధారణ గుణము:—Wearing diamond jewels. సర్వ రోగములను బోగొట్టుచు; మనోహరముగ నుండును; సౌఖ్య మిచ్చును.

వట్టివేళ్ళ విసనకఱ్ఱ:— Cuss-cuss fan. సువాసనగనుండుచు చెమట నార్చును. చలువ జేయును దాహము, తాపము నణచును.

వట్టివేళ్ళు:— Andropogon muricatus. A. Iwarancusa. Eng. Roots cuss-cuss grass. సం॥ ఉశీర, దాహహారణ, లామజ్జక. హిం॥ ఖస్ మూల్, వీరణ్ మూల్. ఇది రెల్లుజాతి గడ్డివేళ్ళు. యెరుపు, తెలుపు రెండుజాతులు. తెలుపుజాతినే సీమవట్టివేళ్ళందురు. యివి కొంచము సన్నముగా నుండును. వట్టివేళ్ళు మిక్కిలి సువాసనగ, మనోహరముగ నుండును. చేదు, వగరు, తీపి రుచులు గలిగియుండును. దీనితో చేయబడిన తడికలు వేసవికాలమున ద్వారములకుకట్టి తడుపుచు వుపయోగింతురు. మిక్కిలి చల్లగాను, తాపహరముగాను సువాసనగను వుండును. దీని రసము లేక కషాయము లేక చూర్ణము చలువ జేయును. పైత్యోద్రేకము, అంతర్దాహము అనగా కడుపులోని మంటలు, తాపము, పైత్యపుమంటలు, వాంతి, పైత్యజ్వరమువలన పుట్టిన తాపము, విదాహము, అతిసారము, రక్తగ్రహణి, పిత్తము, రక్తవమనము, మూర్ఛ, భ్రమ, క్షయ, మేహము, కుసుమరోగములు, మేహజ్వరము వీని నణచును. చెమట బుట్టించును. ఋతురక్తస్రావమును కట్టును. మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తు. రసపు మోతాదు 2-3 తులములు. చూర్ణపు మోతాదు 1 మొదలు 2 అణాల యెత్తువరకు,

వడియగట్టిన పెరుగు:—Strained curd. బిడ్డుగ, గురుత్వముగ నుండును. వాతము, కఫము జేయును. దేహపుష్టినిచ్చును, పైత్యము నణచును. రుచిగనుండును.

వడగండ్ల నీరు:—Hail stone water. మిక్కిలి పైత్యము జేయును. దంతపటుత్వము బోగొట్టును. అగ్నిమాంద్యమును, త్రిదోషజనితమగు జ్వరములను, దారుణమగు శ్వాసకాసలను, అరుచిని, శ్లేష్మరోగమును, పైత్యమును గలుగజేయును, దీనికి విరుగుళ్ళు కాక ఔషధములు.

వడ్లయారాలు:—మాధవీలీగ చూడుడు.

వడ్లు:—ధాన్యములు చూడుడు.

వరగలు:- Paspalum scrobiculatum. Eng. Punctured paspalum. సం॥ వరక, కోద్రవ. హిం॥ కోదో. కాకను, అగ్నిమాంద్యమును జేయును. కఫపిత్తములను, విషమును హరించును. ధాతువులను శోషింపజేయును. మలబద్ధము గావించును. జ్వరాతిసారమును గట్టును. వ్రణరోగములకు పథ్యకారిగ నుండును.

వరగోగు:—Salvedora olevides.S. Persica Eng. The tooth brush tree. సం॥ పీలు, కరభవల్లభ. తీక్ష్ణవృక్ష. హిం॥ పీలు. దీనివేరు, చెక్కరసము లేక కషాయము మిక్కిలి వేడిజేయును. దారుణమగు వాతములు, శూలలు, సూతికరోగములు, సన్నిపాతము, లోజ్వరము వీనిని హరించును. ఋతుబద్ధమును విప్పును. బలముజేయును. దీపనము (Stimulant) గలిగించును. పొక్కు పొక్కజేయును. రసముయొక్క మోతాదు అరతులము మొదలు తులమెత్తువరకు. కషాయపు మోతాదు 2-8 తులములమెత్తు. పెద్దవరగోగుకుకూడా యివే గుణములు.

వరగోగుపండు:— Fruit of do- చేదుగలిపి స్వాదుగ నుండును; కాక, పైత్యము జేయును. విరేచనము గావించును. క్రిమిరోగము, గుల్మము, బల్ల, మూలవ్యాధి, కఫపైత్యము, త్రిదోషములు వీనిని హరించును.

వర్షపునీరు:—Rain water. సం॥ వృష్టిజల తేలికగ, నిర్మలముగ, రుచిగనుండును. తృప్తిని, అహ్లాదమును, బుద్ధిబలమును యిచ్చును. స్మృతిదెచ్చును కండ్లకు చలువ, వీర్యపుష్టి జేయును; కఫము, మేహము, పైత్యము, ముఖరోగము, విషము వీని నణచును. మిక్కిలి యపథ్యముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 నీరుల్లి, 2 సికి జబీను.

వరిఅన్నపుసారాయి:—కూటిసారాయి చూడుడు.

వరిగడ్డితో నేసినయిల్లు:—House thatched with straw. ఇందులో నివసించిన వాతమును హరించును. కాక జేయును. చలి, యెండ బాధలను బొందకుండ జేయును, అప్యాయత నిచ్చును.

వరిజావ:—బియ్యపునూకల జావ చూడుడు.

వరిపిండిరొట్టె:—బియ్యపురొట్టె చూడుడు.

వరిమళ్ళలోనినీరు:—Water in the paddy fields- రుచిగ నుండును; బలమిచ్చును; మిక్కిలి శ్లేష్మము, శీతపైత్యము జేసి గొప్ప దోషముల బుట్టించును. దీనికి విరుగుళ్ళు ఉదకము చూడుడు.

వర్తలోహము:—Compound of five metals. అనగా కంచు, రాగి, ఇత్తడి, యినుము, సీసము అనుపంచలోహములు కలసిన దానిని వర్తలోహమందురు. దీనిని శుద్ధిచేసిభస్మము సేవింపదగును. పులుపు, కారము, రుచి గలిగియుండును. జ్వరము, కఫము వీని వికారముల నణచును. పైత్యరోగముల బోగొట్టును. క్రిమిని హరించును, మలమును వెడలించును. మోతాదు 2 మొదలు 4 గుంజలయెత్తువరకు,

వల్లారిఆకు:—సరస్వతియాకు చూడుడు.

వలిసెనూనె:—Oil of niger seeds. కఫము, దగ్గు, పైత్యమును వృద్ధిజేయును; గాయమును, పుండును మాన్పును. వరిసెలు సన్నముగ నువ్వులవలెనుండును. నువ్వులలోగలిపి నూనె తీయుదురు.

వస:—Acorus calamus. Eng. Sweet flag. సం॥ వచా, ఉగ్రగంధా. హిం॥ బచ్. ఘాటైన వాసనగ, చేదుగ, కారముగనుండును. దీని చూర్ణము లేక కషాయము లేక తేలిక కషాయము కాక, పైత్యము జేయును. వాచాలత్వము, బుద్ధిబలము, దేహబలము వీనినిచ్చును, శ్లేష్మము, విషము, జ్వరము, మూలవ్యాధి, కంఠరోగము, క్రిమిరోగము, మలబద్ధము, కడుపుబ్బు, దగ్గు, ఒగర్పు, ఉబ్బసదగ్గు, శూల వీనిని హరించును. వ్రణములను దురదలను మాన్పును. శిశువుల అజీర్ణమును, కడుపునొప్పి, అగ్నిమాంద్యము, ముఖ్యముగ విరేచనములగుసట్టి యగ్నిమాంద్యము, నల్లదబ్బ(Spleen), కార్జము (Liver) వీనిరోగములు, వరుసజ్వరము అగ్నిమాంద్యము(Dyspepsia) వీనినిపోగొట్టును. దీపనమునిచ్చును. (Stimulant). కడుపులోని వాతమును వెడలించును. పొట్టకు బలముజేయును. ఆకలిబుట్టించును. వికారపెట్టి వాంతిజేయును. ఈడ్పుల (Spasms) ను కట్టును. బలమైన విరేచనములు చేయు ఔషధములలో దీనిని కలిపిన అనుకూలముగ పనిజేయును. పురాణపు దగ్గుల నణచును. దీనిచూర్ణము పంచదార పాకములోవేసి వండి లేహ్యముగ లేక బిళ్ళలు (Lozenges)గ జేసి మరిడిజాడ్యము (Cholera) మొదలగు అంటురోగములు వ్యాపించి యుండునపుడు తినుచుండిన వానిని రాకుండనాపును. అనేక విషములను విరుచును. రూమీమస్తకిలో కలిపి పుచ్చుకొనిన బుద్ధిబలముజేయును. పక్షవాతమును, నరముల బలహీనమును పోగొట్టును. చిన్నపిల్లల నాలుకకు దీనిగంధము పూసిన మాటలు శీఘ్రముగ వచ్చును.

పిల్లలకు దీనిని కొద్దికొద్దిగ తినుపించుచుండిన నాలుక పలుచబడును. వస, చంగల్వకోష్ట, మిరియాలు, పిప్పళ్ళు, పాతవేరు, తుంగముస్తలు వీనిని నీళ్ళతో గంధముతీసి నాలుకకు రాయుచుండిన నాలుకయందు, కంఠమునందు గలుగు రోగములను హరించును. దీనిగంధము నేత్రములకు బెట్టిన కండ్లనజ్జు హరించును; కాంతి యధికమగును. దీని పచ్చివేరురసము వృద్ధులకు సత్తువనిచ్చును; నరములు, మెదడు, పొట్ట, ముంతగుండె (heart) వీని శీతలము (జలుబును) హరించును; రక్తమును శుభ్రపరచును; మంచిపిత్తము (bile) ను పుట్టించును; గుండెనొప్పి, ప్రక్కనొప్పి కడుపునొప్పి వీని నణచును; శ్లేష్మపు దగ్గును నివారించును; వాతతత్వము గలవారి పొట్టకు కార్జము (liver) నకు చాల సత్తువచేయును; చలువచేత కొద్దికొద్దిగ వచ్చెడు మూత్రమును కట్టును; మూత్రములోని రాతిని కరగించును; గుర దాల (kidneys) కు వేడిపుట్టించును; పుంస్త్వమును హెచ్చించును; మూత్రముగావించును, ఋతురక్తమును జారీచేయును. దీని గంధము పూయుటవలన కఠినమగు ఉబ్బు, వాపు, నొప్పి వీనిని హరించును. తేలు, జెర్రి మొదలగు విషపు పురుగుల విషమును హరించును. వాత తత్వముగలవారికిని, వృద్ధులకును మేలుచేయును. దీని తేలిక కషాయముతో బిడ్డలకు స్నానము చేయించిన మూర్ఛరోగము (epilepsy) నివృత్తించును. లోజ్వరము (low fever) గలవారి కిచ్చిన దీపనము (stimulation) ను గలుగజేయును. చెమట బుట్టించును. ప్రాణమును నిస్సత్తువ చేయు పైత్యసంబంధమైన నీళ్ళవిరేచనములు కట్టును. దీనిచూర్ణమును జీడిమామిడిపండు సారాయిలోగాని, యితరసారాయిలోగాని కలిపి పూసిన పురాణ వాత, మేహవాతపు నొప్పులు, కవుకుదెబ్బ నొప్పులు హరించును. దీనిపొగ గుదస్థానమందు పట్టిన మూలవ్యాధి తీపు, నొప్పి నయ

మగును. ఇందుకు వస, గంజాయి, పసుపు సమభాగములుగ పొడుముచేసి పొగవేయవలెను. బిడ్డలరక్తగ్రహణి బాగుగకట్టును, ఒగర్పుగల దగ్గు (bronchitis) ను అణచును. శ్లేష్మమును వెడలించును. చిదుకగొట్టిన వస 1 ఔన్సు, 14 ఔన్సుల మరుగు నీళ్ళలోవేసి చేసిన తేలిక కషాయము పూటకు 4 తులములయెత్తు చొప్పున దినమునకు 3 పూటల నిచ్చిన అజీర్ణమును పోగొట్టి, పొట్టకు బలముజేయును. వసను నీళ్ళతోగాని, సారాయితోగాని గంధముతీసి బిడ్డల రొమ్ముకు పట్టించిన దగ్గు, శ్లేష్మము హరించును. దీనిని వేసి కాచిననీళ్ళతో రొమ్ముకడిగిన బాధకరమగు దగ్గు శమించును. దీనిని కొద్దిగకాల్చి నోటిలోనుంచుకొని నమలి ద్రవము మ్రింగుచుండిన నోట నీరూరును. నాలుకకు ద్రవము గలుగును. దాహమణగును. పొడిదగ్గు, గొంతుకపుండు, దగ్గు అణగును. వస, నేలవేము వీని కషాయ మిచ్చిన వరుసజ్వరము, రక్తగ్రహణి, అజీర్ణము, అగ్నిమాంద్యము (dyspepsia), నీరసము వీనిని పోగొట్టును. ఆకలి బుట్టించును. బలముజేయును. జ్వరపడి లేచినవారికి చాల మేలుజేయును. వస, అతిమధురము వీని కషాయమిచ్చిన దగ్గు, ఒగర్పుగల దగ్గు, ఇతర దగ్గులు శమించును. వస, శొంఠి వీనికషాయ మిచ్చిన పొట్టలోని వాతమును వెడలించును. అజీర్ణమునుపోగొట్టును. వట్టి వసకషాయ మిచ్చినను రక్తగ్రహణి కట్టును. మృదువైన దీని చూర్ణము 1 గోధుమగింజయెత్తు వేడి యావుపాలలోవేసి పుచ్చుకొనిన గొంతుకనుస, దగ్గు, గొంతుకపుండు నిర్మూలించును. ఈ చూర్ణము 30 గోధుమగింజలయెత్తు నిచ్చిన వమనముజేయును. 35 గోధుమగింజలయెత్తుకంటె అధిక మియ్యకూడదు. 40 గోధుమగింజలయెత్తు ఇచ్చిన దారుణ వమనముల జేయును. ఉబ్బసపు దగ్గుకు 15 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు లోపలకియ్యవలెను. ఆ

వెనుక 2-8 గంటల కొకమారు 10 గోధుమగింజల యెత్తుచొప్పున ఆయాసముతగ్గువరకియ్యవలెను, ఇది ఒగర్పుగలదగ్గు(bronchitis), అపస్మారము (Hysteria), నరములనొప్పి (Neuralgia) కొన్ని జాతుల యగ్నిమాంద్యము (dyspepsia) వీనిమీద యెక్కువగ పనిజేయును. దగ్గు, జ్వరము, కడుపునొప్పి లేక కడుపు ఉబ్బు; అజీర్ణము, నీళ్ళవిరేచనములు బిడ్డలకుగాని, మిక్కిలి చిన్నబిడ్డలకుగాని యున్నప్పుడు వసకొమ్ము కొద్దిగ దీపముమీద కాల్చి చనుపాలలో అరగదీసి పోసిన నయమగును. మరియు బిడ్డలకు దగ్గు ఉన్నప్పుడు దీనిని నీళ్ళతో గంధముతీసి రొమ్మునకు, కడుపుబ్బు, అజీర్ణము,కడుపు నొప్పి యున్నప్పుడు బొడ్డునకు, పొత్తికడుపునకు పూసిన వానిని హరించును; లేదా కాల్చి, మసిచేసి దానిని కొబ్బరినూనెలోగాని, ఆముదములోగాని కలిపి, బొడ్డునకు, పొత్తికడుపునకు పూసినను నయమగును. లేదా వసను కొద్దిగకాల్చి చూర్ణించి 2 మొదలు 10 గోధుమగింజల యెత్తుచొప్పున మోతాదుల నిచ్చినను నివ్మ ళించును. వస కాల్చి చేసిన మసిని 10 మొదలు 20 గోధుమగింజల యెత్తువరకు నీళ్ళతో గలిపి యిచ్చిన నేపాళవిషము, వికారము అణగును. వసగంధము కణతలకు, నొసటనుపట్టించిన తలనొప్పి నివ్మళించును. ముక్కుపైన పట్టించిన విషపు పడిసెము (influenza) యొక్క, ఒగర్పుగల దగ్గు (bronchitis) యొక్క యుద్రేకము నాపును. వస, ఓమము, పసుపు నీళ్ళతోనూరి నూనెలో ఉడికించి కట్టిన గాయములు, కవుకు దెబ్బలు వీని నొప్పి మాన్పును. పైకూట మిలో మునగాకుగాని, దుష్టపు వేరుగాని వేసినూరిన యెక్కువపని జేయును; మిడినల్లులు, నుసములు మొదలగు పురుగుల పట్టనియ్యదు. చేరనియ్యదు. వానిని చంపును. దీని తేలికకషాయముగాని పొడుము గాని చల్లిన పారిపోవును. ఉన్నిబట్టలలో వసకొమ్ము ముక్కల

నుంచిన వానిని పురుగు పట్టకుండును. దీని వాసన త్రాచుబాములు మత్తెక్క జేయును. గనుక దీని దరికి చేరదు. ఇందువలన యీ చెట్టును ఇండ్లలో వేసి పెంచుదురు; దీనిచూర్ణమును, తేలికకషాయముగ లేక కషాయముగ జేసి వాడనగును. చూర్ణపు మోతాదు పెద్దవారికి 20 మొదలు 35 గోధుమగింజల యెత్తువరకు. బిడ్డలకిచ్చు మోతాదు 3 మొదలు 12 గోధుమగింజల యెత్తువరకు. మిక్కిలి చిన్నబిడ్డలకిచ్చు మోతాదు 2-3 గోధుమగింజలఎత్తు. 1 ఔన్సుఎత్తు వస చితుకగొట్టి 10 ఔన్సుల మరుగు నీళ్ళలో వేసి చేసినది తేలికకషాయము. దీని మోతాదు 1 మొదలు 2 ఔన్సులవరకు. 20 ఔన్సుల నీళ్ళలో 2 ఔన్సులయెత్తు వస, ధనియాలు 1 డ్రాం (60 గోధుమగింజల యెత్తు), మిరియాలు అరడ్రాం (30 గోధుమగింజలయెత్తు) వేసి సుమారు సగమునీరు ఇగురువరకు కాచి చేసినది కషాయము. దీని మోతాదు పూటకు ఒక వయినుగ్లాసు నిండునంత దినమునకు 3 పూటల నియ్యనగును. బిడ్డలకిచ్చు మోతాదు 2 మొదలు 6 డ్రాములవరకు (one to three teaspoonfuls) దినమునకు రెండు లేక మూడుపూటల నియ్యనగును. ఈకషాయములో కొద్దిగ పంచదార కలిపి నియ్యనగును.

వసనాభి:—నాభి చూడుము.

వస్త్రములు కూడనివి:—Cloths which should not be worn. మిక్కిలి మెరుపు, మిక్కిలి నలుపు రంగులుగలవి; మాసినవి, ప్రాతగిలి వదలివేయబడినవి, అగ్ని, ఎలుక, కీటకములు, ముల్లు వీనివలన శిథిలపరచబడినవి, రెండు చీలి తిరుగ కుట్టబడినవి, అన్యాయార్జితముగ వచ్చినవి, విమస్పర్శగలిగినవి, దేవతార్పితములైనవి ఈవస్త్రములు విసర్జింపవలెను. ధరించిన అయాసమును, అనారోగ్యమును గలుగును.

వస్త్రములు(క్రొత్తవి):—New cloths. వీని ధారణవలన సంతోషము నిచ్చును. చలువజేయును; జ్వరము, శ్లేష్మము హెచ్చించును.

వస్త్రసామాన్యగుణము:—Cloths generally. అనగా బట్ట దేహమునకు అలంకారముగ నుండును. చెమటబుట్టించును. గాలి, యెండ, చలి వీని బాధ గలుగకుండజేయును. సౌఖ్యమును, ఆరోగ్యమును ఇచ్చును. దీనిపాగ ఎక్కిళ్ళను కట్టును. దీనిని మెత్తగ నలుగగొట్టి రక్తముకారు గాయమునకు పెట్టిన రక్తముకట్టును.

వాకచెట్టు:—Carissa carondas. Eng. Bengal currants. సం॥ కరమర్దక, కృష్ణపాకఫల కరామ్లు. హిం॥ కరోందా. దీని వేరును, గుర్రపుమూత్రము, నిమ్మకాయలరసము, హారతికర్పూరము వీనిని గలిపి నూరిపూసిన గజ్జి, చిడుము మానును. దీని వేరు గంధము పూసిన ఈగలువాలవు. వేరురసములో వ్రణమును కడిగిన పురుగులు చచ్చును. పుండుమానును.

వాకపండు:—Fruit of do. పుల్లగ, తియ్యగ నుండును. దాహము నణచును. పైత్యము, రక్తపిత్తము హరించును. దీనిపండ్లరసములో యాలుక్కాయల చూర్ణముకలిపి పంచదారవేసి పాకముబట్టి పుచ్చుకొనుచుండిన పైత్యమును అరుచిని పోగొట్టును.

వాక్కాయ:—Green fruit of do. పుల్లగ, వగరుగ నుండును. దాహమునణచును. రుచిబుట్టించును, వీర్యమునకు చలువజేయును. జఠరదీప్తినిచ్చును. పైత్యము, వాతము చేయును. ఆలస్యముగ జీర్ణమగును. గొంతుకకు నష్టముజేయును. దీనికి విరుగుళ్ళు 1 శొంఠి, 2 వేడిఔషధములు, 3 బెల్లము. దీని ఎరుగు రక్తపైత్యమును హెచ్చించును. అగ్నిదీప్తిని, కాంతిని యిచ్చును. నోటిని శుభ్రపరచును. వాక్కాయలను కందిపప్పులోవేసి వండుదురు. రుచిగా నుండును. వాక్కాయలు కొబ్బరికాయవేసి పచ్చడి చేయుదురు. పుల్లగ, రుచిగ నుండును. కొంచము వాతముజేయును.

వాకుడుకాయ, పండు:—Solanum Indicum. fruit & green fruit of. కారముగ, చేదుగ నుండును. త్రిదోషములు, శ్లేష్మ వాతము, క్షయ, దగ్గు వీనిని హరించును. గుల్మము,ప్లీహా,ఉదరము, మూలవ్యాధి, పొత్తికడుపులోనిశూల, ఉబ్బసదగ్గు వీనిని బోగొట్టును. శ్లేష్మమును వెడలించును. మూత్రమును జారీచేయును. జఠర దీప్తి నిచ్చును. కాక జేసి విరేచనము గావించును. జీర్ణము జేయును. తేలికగనుండును, వీనిరసము లోపలి కిచ్చిన గొంతుకపుండు రోగ మును పోగొట్టును. వీని గింజల పొగ బట్టిన పంటినొప్పి హరించును. వాకుడుకాయలు, పండ్లు కూరగ పులుసువేసి వండి పుచ్చుకొందురు. కాస, శ్వాస రోగులకు పథ్యముగనుండును. శ్లేష్మము హరించును. వీని కషాయము, లేహ్యము, వాడుదురు. కషాయపు మోతాదు పూటకు 3-4 తులములమెత్తు. లేహ్యము పూటకు అరతులము చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును.

వాకుడుచెట్టు:—Solanum Indicum. Eng. Indian night shade blue & white. సం॥ కంటకారి, వ్యాఘ్రీ, నిదిగ్ధికా. హిం॥ కటాయి ఇది నేలప్రాకును. చెట్టంతయు ముండ్లు కలిగియుండును. దీని పువ్వులు వూదారంగు (blue)గ యుండును. తెల్లపువ్వులు జాతి గూడ గలదు. ఇది శ్రేష్టము. దీని వేరు, సమూలము కారముగ, చేదుగ నుండును. వీని వేరు లేక సమూలరసము లేక కషాయము కాక జేయును, మూత్రమును జారీచేయును. ఉబ్బు, శ్వాసకాసలు, రక్తపైత్యము, అరుచి, జ్వరము, వాతము, శ్లేష్మము, క్షయ, ఉబ్బసపుదగ్గు, ఆమదోషము, తాపము, హృద్రోగము వీనిని జయించును. వీర్యవృద్ధి నిచ్చును. పొట్టలోని వాతమును వెడలించును. రసపు మోతాదు పూటకు 2—3 తులముల మెత్తు చొప్పున, కషాయపు మోతాదు 3—4 తులములమెత్తు చొప్పున

దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని సమూల కషాయము తోడను, మరికొన్ని మందు దినుసులతోడను చేసిన లేహ్యము సమస్త కాసశ్వాసలు, క్షయలు నివృత్తించును. లేహ్యపు మోతాదు పూటకు అరతులము చొప్పున నియ్యనగును. సమూలరసము పూసిన కాళ్ళపైన పొక్కులతోనున్న మంటలు నయమగును. దీని సమూలమును నీడను ఎండించి కాల్చిచేసిన భస్మమును తేనెతో గాని, గంటుభారంగి, అక్కలకర్ర, దుంపరాష్ట్రము, శొంఠి మొదలగు శ్లేష్మహారవస్తువుల చూర్ణము తేనెతోగాని యిచ్చిన సమస్త కాసశ్వాసలు, క్షయలు నివృత్తించును. భస్మపు మోతాదు పూటకు 1 మొదలు 8 చిన్నముల యెత్తువరకు.

వాడగన్నేరు:— తెల్లగన్నేరు చూడుడు.

వామ్మ లేక వామను, వామ్మపువ్వు— ఓమము, ఓమపువ్వు చూడుడు.

వాతనారాయణ చెట్టు:—A medicinal tree. దీనిని చిటికేశ్వరపు చెట్టందురు. దీని యాకులు సన్నముగ నుండును. దీనిపువ్వులు ఒక కొమ్మనే తెల్లనిపువ్వులు, పసుపు పచ్చని పువ్వులు పూయును. దీనియాకును ఆముదముతో వెచ్చజేసికట్టినను నొప్పిగలచోట ఆముదముపూసి అందుపైన దీని యాకులను దట్టముగ కట్టినను, గుండెనొప్పి, రెక్కగూడునొప్పి, వెన్నులోనొప్పి మొదలగు లోపలి నొప్పులు హరించును.

వానయొక్కగుణము:—Rain. చల్లగనుండును. చలువ, వాతము, మలబద్ధము జేయును. వీర్యముయొక్క వేడినణచును,

వామము:— లేక వామ్మ. ఓమము చూడుడు.

వాయువ్యదిక్కు గాలి గుణము:— అష్టదిక్కులగాలి గుణము చూడుడు.

వాయు విడంగములు:—Embelia ribes, E. Robusta berries of. సం॥ విడంగ, జంతుఘ్న, చిత్రతండుల. హిం॥ వాయువిడంగ్. వీని చూర్ణము నీళ్ళతోనూరి తీసినరసము లేక కషాయము కొద్దిచేదుగ, కారముగ నుండును. వేడిజేయును. పైత్యశాంతి జేయును. త్రిదోష ములను హరించును. విరేచనకారి, అన్ని క్రిములను చంపును. ఎక్కిళ్ళు, చర్ది, గుల్మము, హృద్రోగము, బల్లలు, శూలలు, శ్వాస, కాస, అగ్నిమాంద్యము, మూలవ్యాధి, ఉబ్బు, పాండువు వీనిని జయించును నేత్రములకు మేలుజేయును. మూత్రమును జారీ చేయును. సమస్త జ్వరములమీద పనిజేయును. చూర్ణపు మోతాదు పూటకు 1 మొదలు 3 అణాల యెత్తువరకు. రసపు మోతాదు 2-3 తులముల యెత్తు కషాయపు మోతాదు 1½ మొదలు 5 తులముల యెత్తువరకు,

వాయింటచెట్టు, పెద్దవాయింటచెట్టు:— Cleome pentaphylla. సం॥ అజగంధా, బర్బరే హిం॥ తిలవన్. దీనిని వావింటచెట్టనియు, వామింటచెట్టనియు అందురు. దీనియాకు లేక వేరురసము కారముగ నుండును కాక, పైత్యము జేయును. హృదయమునకు మేలు జేయును. అగ్నిదీప్తి నిచ్చును. వీర్యమునకు వేడిజేయును, శ్లేష్మము, వాతము, సమస్తకర్ణరోగములు, క్రిమిరోగము, వ్రణములు, మూల వ్యాధి, గుల్మరోగము వీనిని జయించును. దీనియాకు చితుకగొట్టి చర్మముపైన వేసిన చర్మము ఎర్రబడును. దుష్టజలమును లాగును. అనగా పొక్కు పలాస్త్రీ చేసిన పని చేయును. దీని విత్తనములను నీళ్ళతోనూరి లోపలి కిచ్చిన జ్వరము, పైత్యరోగములు నివృత్తిం చును. దీని యాకును ఉప్పుతోదంచి యారసమును చెవిలో పిండిన చెవినొప్పి, పోటు నిమ్మళించును. దీని సమూలమును నూరి నూనెలో నుడికించి పూసిన సర్పి మొదలగు పొక్కులు లేచెడు చర్మవ్యాధులు

మానును. దీని సమూలరసమును నూనెలో వేసి తైలపక్వముగ గాచి పూసినను చర్మరోగములు, కుష్ఠు మానును. దీనియాకు పిశికెకు నలిపి బిళ్ళగ జేసి మాడపట్టున వేసి కట్టుకట్టిన తలపోటు, నొప్పి, శిరోవాతము వీనిని హరించును. కట్టుకట్టిన కొంతసేపటికి యధికమగు వేడిపుట్టును; అప్పుడు కట్టువిప్పి ఆకుబిళ్ళను పిండిన తలనుండి పీల్చిన నీరు వెడలును, మరల నాయాకుబిళ్ళను తలకు కట్టవలెను. ఈవిధమున రెండుమూడుమార్లు చేయనగును. దీనియాకు నూరికట్టిన వ్రణములు మానును; దీనిఃత్తులు అగ్నిదీప్తి నిచ్చును, గాని దృష్టిమాంద్యము, వీర్యనష్టము గలిగించును. దీని యాకు, గింజల కషాయము ఈడ్పురోగముల (Convulsive affections) ను దోష జ్వరము (Typhus fever) ను నివారించును; రసముయొక్క మోతాదు పూటకు 1-2 తులములయెత్తు; కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. దీనియాకుకూర రుచిగనుండును, కాక జేయును; పైనజెప్పిన సుగుణముల జేయును.

వార్చినగంజి:—Rice cunjee. అనగా బియ్యపు అన్నము వార్చిన గంజి. దేహపుష్టి, చలువ జేయును; ఆకలిదప్పికల నణచును; పైత్యము నణచును, శ్రమవలన గలిగిన అజీర్తిని బోగొట్టును; జ్వరమును బలపరచును; కొద్దిగ వాతము, మలబద్ధము జేయును. దీనికి విరుగుళ్ళు 1 గులకందు, 2 పుదీనా.

వాలుగచేప:—A kind of fish. దీనిమాంసము చమురుగలిగి రుచిగనుండును. వీర్యపుష్టి, బలము జేయును; వాతమును, శ్లేష్మమును వృద్ధిబొందించును. అగ్నిమాంద్యము జేయును; ఉబ్బు రోగమును బుట్టించును; మూత్రముగావించును. అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు చేపలు చూడుడు.

వావిలిచెట్టు:—Vitex negundo. V. Paniculata. Eng. Five leaved chaste tree. సం॥ నిర్గుండీ, సింధువార. హిం॥ సంహాలు, నిర్గుండీ. దీని వేరుకషాయము చేదుగ, వగరుగనుండును. వరుస జ్వరము, దోషజ్వరము (Typhus fever), క్రిమిరోగము, ఉబ్బు రోగము వీనిని జయించును. దీని పచ్చియాకులను వెచ్చజేసి కట్టిన వాత మేహవాతపు నొప్పులు, ఇరుకునొప్పులు, కీళ్ళనొప్పులు, వాపు, సెగరోగము ఒంట జీర్ణించుటచే గలిగిన వృషణముల (testicles) వాపు, నొప్పి వీనిని హరించును; నొప్పి, వాపు తగ్గు వరకు దినమునకు 3-4 కట్లుకట్టవలెను. దీని యెండిన యాకుల పొగ బుచ్చుకొనిన దగ్గు, తలనొప్పి నిమ్మళించును. దీని యెండుకాయల చూర్ణముగాని, కషాయముగాని క్రిమినిజంపును. దీనియాకులు వేసి కాచిననీరు పురటాండ్రకు స్నానము చేయించుట వలన వాతము, జలుబును రాకుండజేసి ఆరోగ్యము నిచ్చును. దీనిఆకురసము చెవిలో బోసిన కర్ణరోగములు హరించును. దీని చెక్క లేక ఆకురసము లేక కషాయము శాకజేయును. వాతమును, శ్లేష్మమును హరించును; జఠరదీప్తి నిచ్చును; నులిపురుగుల జంపును. దీని లేతయాకు కూర వండి తినినను పైనజెప్పిన గుణములు కలిగియుండునుగాని యమిత ముగ దినిన నేత్రములకు జబ్బుజేయును. రసపు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తుల ములయెత్తువరకు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాలయెత్తు వరకు. దీనికంటె నల్లవావిలి శ్రేష్ఠము.

వాసెనపోలి:—Cakes boiled in steam. అనగా వాసెనమీద వండిన మినుపకుడుము. కొద్ది శాకజేయును; బలమునిచ్చును; వాత మును, మేహవాతమును, మేహాడుబ్బును, పరిణామశూలలను హరిం చును; వీర్యవృద్ధి, బలము చేయును.

విటముంగి చేకలు:—Rauwolfia serpentina.సం॥ నాకులీ, సర్ప గంధా. హిం॥ నకుల్ కంద్. దీని ఆకు చిక్కుడాకును బోలియు, దుంపలు తెల్లచిలగడదుంపలను బోలియుండును. దీనిలో సువాసన గల మరియొక జాతిగలదు.దీనిని గంధనాకులియందురు. యీరెండును చేదుగనుండును. త్రిదోషములను, విషహారముగ నుండును; కంఠ మున బయలుదేరు గ్రంథుల (Glands enlargement) కు దీనిని నూరి కట్టిన అవి హరించును.

విత్తు బోడతరము:—Juniperus communis. Eng. Juniper, సం॥ హాపుషా, ప్లీహనాశ. హిం॥ అరార్. దీని కాయలు, చెక్క, గింజలు సువాసనగ నుండును. వీనికషాయము వేడిజేయును; చమట బుట్టించును. మూత్రము గావించును. శూల, క్రిములు, గుల్మము, ప్లీహ, మూలవ్యాధి, శగరోగము, కసుమరోగములు, దగ్గు శ్లేష్మము, ఉబ్బు వీనిని హరించును. కాయలను నీళ్ళతో నూరి ఆమ వాత నొప్పులు (Rheumatic pains) వాపులను రాయుచుండిన నయమగును. యీ విత్తులలోనుండి తీసిన తైలము పైరోగములకు పనిజేయును. దీనిగింజలు వేయించి చూర్ణముజేసి కాఫీపొడుముకు బదులుగా వాడుదురు. కషాయం మోతాదు 2-4 తులములు, తైలము మోతాదు 1-2 చుక్కలు.

విభూతి:—Sacred white ashes. దీనిని శరీరమందు ధరించుకున్న యడల శరీరపీడ తీర్చును; శ్లేష్మము, వాతము, పైత్యము, చమట, శీతపైత్యము, తాపము, విదాహము, రక్తముయొక్క వేడి, చలి వీని వణచును.

విమలము, దీనిభస్మము:—Calx of a kind of stone. ఇది ఒక రాయి. మహారసములలో నొకటి. బంగారు వన్నెగలది. వెండిరంగు గలది.కంచువలెనుండునదని మూడువిధములు గలదు. పైరెండునూ

వాదవిద్యయం దుపయోగింతురు కంచువలె నుండుదానిని ఔషధముగా నుపయోగింతురు. ఇది గుండ్రమై మెరుగుగలిగి, అంచులు పలకలు గలిగియుండును. దీనిని వావిలాకు రసములో 1 జాము వండినను, దుష్టుపాకు, గలిజేరు, అడ్డరసపాకు వీనిలో దేనిరసముతోనైన శ్వేదనము జేసినను శుద్ధియగును. దీనితో సమభాగము గంధకము చేర్చి, నిమ్మపండ్లరసముతో నూరి, బిళ్ళజేసి ఆరనిచ్చి ప్రమ్మెదలో బెట్టి పుటముబెట్టితీసి దానిలో సగభాగం గంధకంచేర్చి నిమ్మపండ్ల రసముతో నూరి బిళ్ళజేసి పుటముబెట్టి దానిలో నాలుగవవంతు గంధకముచేర్చి నిమ్మపండ్లరసముతో నూరి, పుటముబెట్టిన భస్మమగును. దానిని నిమ్మపళ్ళ రసముతో నూరి 7 పుటములు వేసిన పరిశుద్ధముగా భస్మమగును. త్రిఫలచూర్ణము, త్రికటకచూర్ణములు కలిపి పూటకు 2 మొదలు 4 గుంజల ఎత్తువంతు సేవించుచుండిన పాండువు, పైత్యభ్రమ, ఉబ్బు, జ్వరము, క్షయ, వాతము, ప్రమేహము, కుష్టు వీనిని హరింపజేయును. బలమును గలిగించును.

విరజాజి పుష్పము:—Double jasmine. సం॥ నెపాలీ, శ్రీమతీ, వనమల్లికా, సన్నని మొగ్గలు, చిన్న పుష్పములు విస్తారముగాపూయును. సువాసనగ నుండును. వేడిజేయును; పైత్యమును హెచ్చించును; ధరించిన మనోహరముగ నుండును; వాతము, శ్లేష్మమును హరించును, కాంతినిచ్చును; మన్మథోద్రేకము గలుగజేయును. తల వెండ్రుకలకు బలమిచ్చును.

విరజాజి పుష్పాసవము:—Double jasmine wine. కొంచెము కాకజేయును; అగ్నిదీప్తిని, కాంతిని ఇచ్చును; ఆహారమును జీర్ణము జేయును.

విరిగి చెట్టు:—నక్కెర చెట్టు చూడుడు.

విలేపియను గంజి:—A kind of gruel or cunjee. ఒక భాగము బియ్యము, 4 భాగములు నీళ్ళుగలిపి మిగులమెతుకు లుండునటుల పాకము జేసినది విలేపి యనబడును. ఇది మనోహరముగ నుండును; వాతపిత్తశ్లేష్మములను, అనులోమ వాతమును హరించును; తృప్తి నిచ్చును; వ్రణములను, నేత్రరోగములను మాన్పును; నీరసులకు బలముగలుగ జేయును; ఆరోగ్యము నిచ్చును; ఆకలిని, జీర్ణశక్తిని గలుగ జేయును; గ్రహణీరోగము నణచును; చెమట బుట్టించును.

విళంబికాయలు:—Averrhoa carambola. A. Bilimba. సం॥ కర్మరంగ, కారుకా. హిం॥ కమరక్. వీనిని కమరక్ కాయలనియు బిలంబికాయలనియు అందురు. యీ కాయలు నాలుగుపలకలుగ కోణములుగలిగి మద్దికాయలకన్న చాలా పెద్దవిగ నుండును. కాయంతయు నీరుగలిగి పుల్లగనుండును. యీ కాయలను పప్పుల లోను కూరలలోను వేసుకొందురు; చలువజేసి అర్చును; పొట్టకు బలమిచ్చును; ఆకలిబుట్టించును; దీని పండ్లరసముతో పానకము (Syrup) జేసి జ్వరములో చల్లదనము జేయుటకు యిచ్చెదరు. యీపండ్లు దినిన జబ్బు జేయును; దగ్గు దెచ్చును. దీనికి విరుగుడు గసగసాలు.

విషకంటకాలు:—అడవి జీలకఱ్ఱ చూడుము.

విషబొద్ది:—దీనినే చిటిబొద్ది యని పాఠయని అందురు. కాకచెట్టు చూడుడు.

విషమంగలపుచెట్టు:—Crinum asiaticum. C. Deflexum Eng. Poison bulb. సం॥ విషమండల, సుదర్శన. హిం॥ చిందార్. దీనిని విషముంగలి యనియు లక్ష్మీనారాయణ చెట్టనియు కేసరీ చెట్టనియు నందురు. దీనియాకులు కోలగా మృదువుగా నుండును; కొద్ది చేదుగ నుండును, దీని పువ్వులు తెల్లగ నుండును. దీని ఆకు

రసము యిచ్చిన వాంతిజేయును. దీనియాకు నూరి కొద్దిగ అము దము గలిపి వెచ్చజేసి కట్టిన గోరుచుట్టు మొదలగు కాలి చేతివ్రేళ్ళ కొనలయం దయ్యెడు పుండ్లు, నొప్పి, కణుపుజెబ్బలు, మాదలు, రాచపుండ్లు వీనిని హరించును. ఆకురసము చెవిలో పోసిన చెవిలో పోటు, చీముకారుట, కురుపునొప్పి మానును. దీనివేరు నమలినను ఆకు పసరును మ్రింగినను బాగుగ వమనము లగును. యుద్ధమున బాణముల కొనల నంటించెడు విషమువలన గలిగెడు రోగమును పోగొట్టును. దీని యాకును మాడ్చి పుండుమీాద వేసి కట్టిన నది మానును.

విషముష్టిచెట్టు:—ముషిణిచెట్టు చూడుడు.

విష్ణుక్రాంతచెట్టు:—Evolvulus alsinoides. సం॥ విష్ణుక్రాంత. నీల పుష్పి, హిం॥ కోయల్. సన్నని ఆకులుగల నేలప్రాకెడు చిన్న తీగె. నీలవర్ణముగల చిన్నపుష్పములు పూయును. దీనిలో తెల్లపుష్ప ములుగల జాతికూడ గలదు. దీని కషాయము పైత్య కఫజ్వరము లను, పురాణ అంతర్గత జ్వరములను, ఉబ్బును బోగొట్టును. మూత్ర విరేచనములను జారీచేయును. మోతాదు పూటకు ౘ మొదలు ౫ తులముల యెత్తువరకు. దీని యెండించిన ఆకుల పొగ బుచ్చుకొనిన ఒగర్పుగలదగ్గు (Bronchitis) ఉబ్బసపుదగ్గు (Asthma) నిమ్మ ళించును.

విసిరినవాయువు:— Air or wind created by fanning. పంకా, విసనకర్ర మొదలగువానివలన గలిగిన వాయువు శ్రమ, శోష, చెమట, విదాహము, మూర్ఛ వీనినణచును; నిద్ర దెచ్చును; ప్రీతి, సుఖము గలుగజేయును; పైత్యము నణచును; వీర్యవృద్ధి జేయును.

విస్కీ:—Whisky. ఈసారాయి యూరోపు సారాయిల నన్నిటిలోను మంచిది; వేడిజేయును; వాతమును హరించును; మూత్రమును అధిక

పరచును; దగ్గును శమింపజేయును. మంచి జీర్ణశక్తిని గలుగజేయును. మరియు బ్రాందియొక్క గుణములు గలిగియుండును.

వుత్తరేణిచెట్టు:—ఉత్తరేణిచెట్టు చూడుడు.

వృద్ధదారు:—Lettsomia nervosa, Argyreia speciosa. Eng. Elephant creeper. సం॥ వృద్ధదారక, కోటరపుష్పి, దీర్ఘవల్లరీ. హిం॥ విధారా. ఇందు జీర్ణదారు అని మరియొక భేదము గలదు; దీనికి సం॥ జీర్ణదారు, అజరా. హిం॥ శాలావిధారా. వృద్ధదారు పెద్దఆకులుగలిగి ఆకుల అడుగున నూగుగలిగి తెల్లగ మొఖమల్ రంగుగల తీగె. యిది విస్తారముగ చెట్లకు ప్రాకియుండును; దీని పువ్వులు తెల్లగ గుత్తులుగుత్తులవలె నుండును. దీనిని సముద్రపాల తీగెయని, పాలసముద్రపుతీగెయని యందురు. దీని విత్తులను సముద్ర పాలవిత్తులని, కొక్కితవిత్తులని, వృద్ధదారువిత్తులని నిఘంటువులు పరిశీలనజేసి స్థిరపరచడమైనది. దీని ఆకులకు ఆముదమురాసి వెచ్చజేసి అడుగువైపున వేసిన గడ్డలను పగులజేయును; పైవైపున వేసిన మాన్పును. దీనివేరు కారము, చేదు, వగరు రుచులుగలిగియుండును. వేడిజేయును. దీనివేరు చూర్ణము పాలతోనిచ్చిన తత్వమును మంచికి మార్చును; ఉపదంశరోగములు (సవాయి రోగములు) హరించి బలముజేయును. దీనివేరు చూర్ణమును పిల్లితేగలరసముతో 7 పర్యాయములు భావనజేసి ఎండించి పూటకు 4 మొదలు 8 అణాలయెత్తు వరకు కరగించిన వెన్నతో 1 నెలదినములు సేవించిన వీర్యవృద్ధి, పుష్టి, బలము, కాంతి వీనిని గలుగజేయుటయేకాక వయస్సును నిలుపుచు మేధాశక్తిని వృద్ధిపరచును;కంఠస్వరమును బాగుజేయును. దీనివేరు కషాయము పుచ్చుకొనిన పాండువు, శోథ, ప్రమేహము, వాతము, కఫము, దగ్గు, జ్వరము వీనిని హరించును. కషాయపు మోతాదు 3 మొదలు 5 తులముల యెత్తువరకు. మరియు దీనివేరు

సమభాగముగల అజామోదాది చూర్ణము కలిపి పుచ్చుకొనుట వలన ఆమవాతము, పార్శ్వవాతము ( Hemiplegia ) లను హరించును. జీర్ణదారుణకు యివే గుణములుగాని దీనికన్న గుణము తక్కువగ పనిచేయును. దీనివిత్తుల సముద్రపాల విత్తులందురు. యీవిత్తులు నీళ్ళతో నూరి తీసిన రసముగాని, కషాయముగాని యిచ్చిన గ్రహణి, అతిసారవిరేచనములు కట్టును. మోతాదు ½ మొదలు తులమెత్తు వరకు.

వృద్ధి:—ఋద్ధి చూడుడు.

వెంట్రుక :—A kind of mungis called veverra ichneumon. దీనిని వెంట్రుక యనియు, భ్రువనియు నందురు. ఇది ముంగిసవలె నుండునుగాని పెద్దతోక గలిగియుండును. దీని మాంసము కార్శ్యరోగము, క్రిమిరోగము. వాతము వీనిని పోగొట్టును.

వెంట్రుక పావిలకూర:—A kind of sorrel. దీని రసము లేక కషాయము మిక్కిలి వేడిచేయును; వాతమును పోగొట్టును; పైత్యము చేయును; నీరసము తెచ్చును; చర్మదోషము, గుల్మము, వ్రణములు, శోష, కాస. ప్రమేహము, నేత్రరోగము వీనిని శాంతిపరచును. రసపుమోతాదు పూటకు 3-4 తులముల మెత్తు. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 6 తులముల మెత్తువరకు.

వెండి:—రజతము చూడుడు.

వెండిపళ్ళెము:— Taking food in a silver plate. దీనిలో భోజనము వాతపైత్యములను హరించును; చలువచేయును; ప్రమేహమును, రాళ్ళుపడెడు మూత్రరోగమును పోగొట్టును; సౌఖ్యకరముగ నుండును; కేశములకు బలమిచ్చును. ఆరోగ్యము నిచ్చును.

వెండి వరక:—Silver leaf. మేహశాంతి, వీర్యవృద్ధి, బలము, ధాతుపుష్టి చేయును; చలువచేసి యార్చును; మనస్సుకు బలము, సంతో

షము నిచ్చును. దోషములను హరించును. దగ్గును, వాపును శమింప జేయును. ప్రేగులకు నష్టము జేయును. దీనికి విరుగుడు కతీరా అనగా బాదము చెట్టు జిగురు. దీని లేహ్యములు పుచ్చుకొనినప్పుడు వాని మాత్ర (మోతాదు) ఔషధముపై నచుట్టి పుచ్చుకొననగును.

వెంపలిచెట్టు:—Galega purpurea & Tephrosia P. సం॥ శర పుంఖ, ప్లీహారి, కాండపుంఖ. హిం॥ సర్‌ఫోంకా. దీని సమూలకషాయము లేక వేరురసము కొద్ది కారము, వగరు, తీపిరుచి గలిగియుండును. వాతము, గుల్మము, క్రిమిరోగము, పరిణామశూల, ఉదర రోగమును హరించును. అగ్నిదీప్తి నిచ్చును. దీని వేరుకషాయము అజీర్ణవిరేచనములు, అగ్నిమాంద్యము, చెవిలో పుండు వీనిని హరించును. రసపు మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 5 తులముల యెత్తు. దీని వేరుతో దంతధావనము జేసిన దంతరోగములు హరించును. ఆరోగ్యముగా నుండును. తెల్లవెంపలి శ్రేష్ఠము.

వెక్కుడుకాయ:—అనగా పెద్ద లేక పిన్న మావేరుల చెట్టుకాయలు, పెద్దమావేరు చూడుడు.

వెగటుగుణము:—Acerbityr వెగటుగనుండు వస్తువులు కాంతి,జఠర దీప్తి, జీర్ణశక్తి, బలము వీని నిచ్చును. నీరసమును బోగొట్టును, రక్తమును శుభ్రపరచును; మూత్రమును తెలుపుజేయును.

వెణుతురుచెట్టు:— Capparis - aphylla plant. C. Spinosa & Mimosa cinerea. Eng. Caper. సం॥ కరీక, వెల్లతరు, హిం॥ కరిల్, కబ్‌రా. దీనిని వెలుతురుచెట్టు అనియు నందురు. దీనియాకు కూర కారముగ నుండును. శాక జేయును. దోషములను భేదించును; కఫవాతముల హరించును. ఆకు నూరి కట్టిన వ్రణము,

వాపు, విషదోషము వీనిని హరించును. దీని ఆకు లేక చెక్కరసము లేక కషాయము చేదు, వగరు, కారము రుచులు గలిగియుండును. మూత్రాశ్మరి, మలబద్ధము, మూత్రకృచ్ఛ్రము, మూత్రదోషము, రక్తవిరేచనములు వీనిని హరించును. దీని వేరుచెక్క చూర్ణం లేక కషాయము క్షయరోగము, హృద్రోగము, శూల, అగ్ని, ఆమ వాతము, వాతము, మేహవాతము, తిమ్మెరవాతము, పక్షవాతము, ఉబ్బు వీనిని హరించును. దీని కషాయముతో కురుపులను, వ్రణములను కడిగిన త్వరగా మానును. దీని ఆకుపసరు చెవిలో వేసిన పోటు, కురుపులు వీనిని మాన్పుటయేగాక పురుగులనుకూడ చంపును. చూర్ణము మోతాదు 2-3 అణాలయెత్తు. కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు. దీని పువ్వులు కఫపిత్తముల హరించును. దీని పండ్లు లేక కాయలు మలమును గట్టిపరచును; శ్లేష్మపైత్యము జేయును. దీని లేతయాకులు లేక చిగుళ్ళు చలువజేయును. వీనిని నలియగొట్టి కండ్లపైన వేసికట్టిన కండ్లకలకలు, ఎరుపులు నివృత్తించును. దీని యాకులు గుఱ్ఱమునకు పెట్టు దానాగింజలతో నప్పుడప్పుడు తరుచు పెట్టుచుండిన దాని కడుపులోను, ప్రేగులలోను క్రిములు పుట్టకుండును. గుఱ్ఱము బాగుగ నుండును.

వెదురు:—Bambusa arundinacea. Eng. Bamboo. సం॥ వంశ, వేణు, దీర్ఘగ్రంధి. హిం॥ వేన్, బాంస్. పచ్చివెదురుయొక్క లేక యాకులయొక్క కషాయము చేదు, వగరు, తీపి రుచులు గలిగియుండును. చలువజేయును. కఫము, వాపు, మూత్రకృచ్ఛ్రము, రక్తదోషము, తాపము, ప్రమేహము, మూలవ్యాధి, కుష్ఠు, గుల్మము, శూల, విదాహము, జ్వరము వీనిని పోగొట్టును. ఋతురక్తమును, ప్రసవస్త్రీల మయిలరక్తమును జారీచేయును; అగ్నిదీప్తి నిచ్చును; హృదయమునకు మేలుజేయును. మోతాదు పూటకు 3 మొదలు

6 తులముల యెత్తువరకు. వెదురాకు, మిరియాలు, ఇటుకముక్కలు కషాయముగాచి యిచ్చినను ప్రసవస్త్రీల మయిలరక్తమును వెడలించును. మోతాదు 10 తులముల యెత్తు. దీని లేతయాకులలో కొద్దిగ మిరియాలు, ఉప్పుచేర్చి దంచి తినిపించిన పశువుల విరేచన జాడ్యములు కట్టును.

వెదురుగొమ్ము లేక బోడు:—Young bamboo sprout curry of. లేత వెదురుబోడు తీపి, వగరు, చేదు గలిగియుండును. దీని కూర వీర్యమునకు వేడినిచ్చును; రుచి బుట్టించును, జఠరదీప్తి నిచ్చును; మలమూత్రములను గావించును; కఫమును, ప్రమేహమును, అణచును. వాతపైత్యములను, జ్వరమును, విదాహమును, నీరసమును, క్రిమిరోగమును, కడుపుబ్బును గలుగజేయును. అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు 1 ఆవాలచూర్ణము, 2 మోదుగక్షారము. వెదురుబోడు దంచి దానిరసము పురుగులుగల వ్రణముపైన పోసి ఆముద్దవేసి కట్టిన అందులోని పురుగులు చచ్చును.

వెదురు బియ్యము:— Bambusa arundinacea. Eng. Rice or seeds of bamboo tree. సం* వేణుయవ, వేణుబీజ. హిం* బాంస్ కేచావల్. దీని అన్నము తీపి, వగరు రుచిగ నుండును. కాక చేయును; వీర్యమునకు వేడినిచ్చును. దేహకాక నణచును. వాతము, పైత్యము, వాతపైత్యము, మేహము, క్రిమిరోగము, విషము వీనిని బోగొట్టును; కాంతి నిచ్చును.

వెన్నక్రొత్తది:—Fresh butter. తీపి, కొద్దిగవగరు, పులుపురుచులు గలిగియుండును. చలువజేయును. కాంతి, వీర్యవృద్ధి, బలము, జఠర పుష్టి వీని నిచ్చును; వాతపైత్యము, క్షయ, మూలశంక, గ్రహణి, సంగ్రహణిరోగము, రక్తపైత్యము, దగ్గు, వ్రణములు, గాయములు వీనిని మాన్పును. బాలురకు, వృద్ధులకు మంచిది; కన్నులకు చలువ

చేయును. యౌవనమును నిలుపును; వెన్నలో పంచదార కలిపి పుచ్చుకొనుచుండిన అధికమైన వీర్యవృద్ధి, బలము నిచ్చును. హృదయమునకు బలము జేయును. కఫము, అగ్నిమాంద్యము జేయును. ఆకలిని బోగొట్టును. దీనికి విరుగుళ్ళు వెన్న సామాన్య గుణము చూడుడు.

వెన్న పచ్చిపాలలో తీసినది:—Butter obtained from unboiled milk. సంగ్రహణి రోగము, రక్తపైత్యము, నేత్రరోగము వీనిని జయించును; కఫమును పెంచును. దీనికి విరుగుళ్ళు వెన్న సామాన్య గుణము చూడుడు.

వెన్న ప్రాతగిలినది:—Butter old ఉప్పు, వగరు, పులుపు రుచులు గలిగియుండును. చర్ది, మూలశంక వీనిని బుట్టించును. గురుత్వముగ నుండును. కండ్లకు మేలుజేయును, శిరస్సునకు బలమిచ్చును.

వెన్న పుచ్చుకొనెడు క్రమము:— Mode of eating butter in different seasons. ఆవు వెన్నను గ్రీష్మఋతువున శర్కరతోడను, వర్షఋతువున పంచకోలముల చూర్ణముతోడను, శరదృతువున యవల పేలపుపిండితోడను, హేమంతఋతువున సైంధవలవణముతోడను, శిశిరఋతువున పిప్పళ్ళచూర్ణముతోడను, వసంతఋతువున శొంఠి, గజపిప్పళ్ళ చూర్ణముతోడను ప్రాతఃకాలమున బుచ్చుకొనిన ఆయురారోగ్యవృద్ధిని, బలమును ఇచ్చును. వయస్సును నిలుపును.

వెన్న వర్జింపవలసినవారు:—Those who should not eat butter. కఫరోగము, కుష్ఠు, ఉదరరోగము, మూర్ఛ, వాంతి, శిరోవ్యాధి, ఉబ్బు, జ్వరము, పాండువు ఈ రోగములు గలవారు వెన్న బుచ్చుకొనగూడదు.

వెన్న వెదురు కూర:—A kind of ground herb. సం॥ చీరికా, భక్తికా, పూరీ. దీనిని నాగేటిచాలు కూరయని యందురు. దీనికూర

వందుకని తిందురు. రుచిగా నుండును. కఫమును, నేత్రరోగమును, క్రిమిరోగమును గొట్టును. మేహశాంతి, పైత్యశాంతి జేయును; పథ్యమైనది. దీని విత్తులు మేహశాంతి జేయును. వీర్యవృద్ధి, పుష్టి నిచ్చును.

వెన్న సామాన్యగుణము:— Butter generally. సం* నవనీత. హిం* నౌని. వేడిజేసి చలువజేయును; దేహతత్వమును సౌమ్యపరచును. నీరుపెట్టును; పొడిదగ్గు, గజ్జి వీనిని నూన్పును; బుద్ధికి బలమిచ్చును; శరీరము, రొమ్ము ఆరిపోయిన రోగులకు మేలుజేయును; గ్రహణిని బోగొట్టును; గుండెలకు బలముజేయును; దేహపుష్టి, వీర్యవృద్ధి, బలము, విరేచనబద్ధము జేయును, సర్వమును శుభ్రపరచును; కఠినవస్తువులను ప్రేగులనుండి తీసివేయును; పైన పూయుటవలన శరీరమునకు రంగుదెచ్చును; మృదువుపరచును; అమితముగ దినిన పొట్టను జెరచును; వాత తత్వములవారికి ఆకలి మందగింపజేయును. దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 చెరుకురసము, 3 అల్లపు మురబ్బా, 4 పంచదార, 5 ఉప్పు.

వెన్నెలగుణము;— Moonlight. మనోహరముగ, ఆనందముగ, సంతోషముగ నుండును; రక్తపైత్యమును, తాపమును శమింపజేయును; మలబద్ధము జేయును; నేత్రరోగములను బోగొట్టును. రాత్రివేళ చంద్రుని నిబ్బరముగ తరుచు చూచుచుండిన దృష్టి బలము తగ్గును; నేత్రములకు జబ్బుచేయును.

వెన్నెలపులుగు:—జీవంజీవకమను పక్షిమాంసము చూడుడు.

వెయిదంతాలమీను:–A kind of fish.దీనిని చారమీనని యందురు. దీని మాంసము రుచిగ నుండును; బలము జేయును; ఆమమును, త్రిదోషములను శీఘ్రముగ బోగొట్టును.

వెరడాపు ధాన్యము:—ఎరడాపు ధాన్యము చూడుడు.

వెర్రికుసుమ:—బలురక్కిస చెట్టు చూడుడు.

వెర్రిచాత రాశి:—Pharnaceum mollugo-wild sort. దీనియాకు రసము పొట్టకు బలముజేయును; విరేచనము గావించును; ఋతు రక్తమును జారీచేయును; దీని యాకు నూరి కట్టిన వ్రణములను మాన్పును. రసపుమోతాదు 8-4 తులముల యెత్తు.

వెర్రిచెరుకు:—wild sugar cane. కొంచెము ముప్పగా, చేదుగా, వగరుగ నుండును; కఫమునుగొట్టును; గర్భస్రావమును గలుగజేయును; వెర్రికుక్క విషమును బోగొట్టును.

వెర్రిపాల:—మనుబాల చూడుడు.

వెర్రిపుచ్చతీగె, కాయ:—Citrullus colocynthis. Eng. Indian colocynth or bitter apple. సం॥ ఇంద్రవారుణి, గజచిర్భిట. హిం॥ ఇంద్రాయన్. దీనిని ఏటిపుచ్చచెట్టనియు, చేదుపుచ్చచెట్టని, పెద్దపాపరనియు నందురు. దీని యాకు పసరు పైన పూయుటవలన వాతపునొప్పులు హరించును. దీనికాయలు ముక్కలుగకోసిఉప్పులో నూరవేసి ఎండించి చూర్ణించి లోని కిచ్చిన ఉదరములు, కడుపులో బల్లలు, కార్శము, ప్లీహము, సెగరోగము, గుల్మలు, శూలలు హరించును; విరేచనముజేయును. దీనివేరు చూర్ణముజేసి నస్యము జేసిన శిరోరోగములు హరించును; దీనికాయలోని గుంజు ఎండించి చేసిన చూర్ణము గాఢవిరేచనము చేయును; మూర్ఛ, విచారపు పిచ్చి, వ్రాలుమాలిక, ఉబ్బు, ఉదరము, క్రిమిరోగము వీనిని జయించును. మోతాదు 4 మొదలు 10 గోధుమగింజల యెత్తువరకు. దీని అరఖు (Tincture) ఆమవాతము (Gout), వాతపునొప్పులు, దారుణపు తలనొప్పి, పక్షవాతము వీనిని హరించును. మోతాదు పూటకు 15 చుక్కల చొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. దీని కాయ గర్భాశయము (Uterus), మీద పనిచేయును. అనగా దానికి వేడిపుట్టించును. దీని పొగబట్టిన ఋతురక్తమును జారీ

యగును. కాయకు సన్నని రంధ్రముచేసి దానిగుండ కొన్ని మిరియాలు కూర్చి, రంధ్రము మూసి దానికి చీలమన్ను ఇచ్చి పొయ్యి సమీపమున గొయ్యి త్రవ్వి యందులో కాయనుంచి వేసిబూడిద పైన పోయుచు కొన్నిదినములుంచి యా వెనుక నామిరియాలను దీసి శోధించి యుంచి వానిని విరేచనౌషధముగ వాడవచ్చును. ఈ గింజలు గర్భములోని వాతమును వెడలించును; విరేచనము జేయును. మిరియములకు మారుగ తేవల్చిన్ని దుంపను కాయలో నుంచి పై ప్రకారము చేసి పైనచెప్పిన పనులకు వాడవచ్చును. మూత్రము పుట్టనపుడును, మూత్రబద్ధమగుటను (In suppression and repression of urine) దీని కాయతొక్క, తేవల్చిన్ని సమపాళ్ళుగ తీసి చూర్ణించి వాడతగియుండును, మోతాదుగుంజా చూర్ణమువలెనే.

వెలగకాయ:—**Wood apple unripened.** వగరు, పులుపు, తీపి రుచులు గలది; నాలుక బెరడుకట్టును; చలువజేసి యార్చును; రుచి బుట్టించును; హృదయమునకు, పొట్టకు బలము జేయును; సంతోష మిచ్చును; దీని గుంజారసము పుక్కిలించిన పండ్లకు బలముజేయును, నోటిలోని చర్దిపొక్కులు, నోటిపూత మానును; తినిన ఆకలి బుట్టించును; దాహము తీర్చును; వాతపైత్యము, గ్రహణి, సంగ్రహణి, వీని వణచును; కడుపు బిగబట్టును; కంఠము బొంగురుబార జేయును; కఫరోగము దెచ్చును; క్రిమిరోగము బుట్టించును; మలబద్ధమును, త్రిదోషములను జేయును; దీనికి విరుగుళ్ళు 1 తేనె, 2 శాక పదార్థములు, 3 శాకౌషధములు.

వెలగచిగుళ్ళు:—**Tender leaves or wood apple tree.** వీనికషాయము లేక రసము సువాసనగ, చేదుగ, వగరుగ నుండును; విరేచనబద్ధము జేయును; కడుపుబ్బు, చర్ది, వాంతి, ఎక్కిళ్ళు వీనిని

హరించును. వెలగాకు రసములో తేనెగలిపి యిచ్చిన వాంతులు కట్టును. వికారము తగ్గును. మోతాదు పూటకు 2 మొదలు 3 తులములవరకు.

వెలగచెట్టు:—Feronia Elephantum. Eng. Wood apple tree. సం॥ కపిత్థ, గంధపత్ర. హిం॥ కైథ్. వెలగాకు రసము వాంతి, అతిసారము, ఎక్కిళ్ళు వీనిని కట్టును దీనిమాను లేక వేరు చెక్క లేక కాయచిప్పను కలితో గంధముతీసి కనురెప్పలపైన, కణతలపైన, నొసటిపైన పూసిన నిద్రపట్టనివారికి నిద్రపట్టును. దీని జిగురు గ్రహణిని కట్టును; తత్వమును మృదువుపరచును; దీనిని నీళ్ళలో గలిపి నియ్యనగును. ఆకురసము పొట్టకు సత్తువ జేయును; జీర్ణశక్తి నిచ్చును; పొట్టలోని వాతమును హరించును; బిడ్డల అజీర్ణమును పోగొట్టును; విరేచనముకట్టును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. ఆకును తలకువేసి కట్టిన తలనొప్పి, పోటు నయమగును; ఆకును ప్రక్కమీద ఒత్తుగపరచి అందుపైన రోగిని పరుండబెట్టిన జ్వరతాపమణగును; పైత్యమును హరించును; మంచి నిద్ర దెచ్చును.

వెలగచెట్టునీడ:—Shade of do. ఊపిరిగొట్టునొప్పి, అనాహమనగా మలమూత్ర ద్వారముల బుట్టెడు శూల వీనిని బోగొట్టును; బలమిచ్చును. విషమును, శ్లేష్మవాతములను హరించును.

వెలగపండు:—Fruit of do. పుల్లగ, తియ్యగ, కొద్ది వగరు గలిగి యుండును. త్రిదోషహరమయినది. కఫము, పైత్యరోగము, ఊపిరిగొట్టునొప్పి, గ్రహణి, చర్ది, ఎక్కిళ్ళు, శూల, అగ్నిమాంద్యము, వికారము, మూలవ్యాధి, శ్వాస, కాసలు. అరుచి, శ్రమ, అలసట వలన గలిగిన నీరసము, వమనము, విషము, దాహము వీని నణచును. రుచిబుట్టించును. మిక్కిలి మేహశాంతి, పైత్యశాంతి జేయును.

మిక్కిలి పథ్యమయినది. విత్తనములు దీసివైచి శర్కరకలిపి పుచ్చు కొనదగియుండును. దీని విత్తనములు ఆలస్యముగ జీర్ణమగును. గుండె లకు, గొంతుకకు నష్టముజేయును. శూలదెచ్చును. దీనికి విరుగుళ్ళు 1 శర్కర, 2 వేపగింజలు, 3 పెద్దసోపు. వెలగపండ్లలోని గింజలు ఎండించి చూర్ణముజేసి శర్కర గలిపి పుచ్చుకొనిన వీర్యవృద్ధి జేయును. యీపండు గుంజుతో తయారుచేసిన చారు మేహశాంతి, పైత్యశాంతి జేయును. పథ్యమయినది. యీ పండుగుంజు బెల్లము తగుమాత్రము గలిపి అందు కొద్దిగ యాలక్కాయల చూర్ణము గలిపిచేసిన పచ్చడి మిక్కిలి రుచిగనుండును. అరుచిని బోగొట్టును. త్రిదోషహరమైనది.

వెలగపండ్ల పానకము:—**Sherbet of fruit of do.** శొంఠి కషా యము కాచి, బెల్లము, పిల్లిపీచలవేళ్ళు, మిరియాలు ఇవి చల్లతో నూరి వడియపోసి యందులో శొంఠికషాయము కలిపి యివి యన్నియు వెలగపండ్ల పానకములో కలిపి కాచి కొద్దికొద్దిగ పుచ్చు కొనుచుండిన దాహము, కడుపుబ్బు, శ్వాస, కాస వీనిని హరిం చును. స్త్రీలకు పాలుపడును.

వెలమసంధి:—**Leca hirta.** సం* కాకజంఘా, పారావతపదీ హిం* కాకజంఘా, మసి. యిది ఏటాలేచెడు చిన్నచెట్టు. దీని ఆకులు ఒక దానికొకటి ఎదురుగా నాలుగువైపులా వేయును. ఆకుల మొదలున సన్నని మొగ్గలుండును. కొద్దిగ నూగుండును. దీని సమూలరసము లేక కషాయము చేదుగ, వగరుగ నుండును. శ్లేష్మపైత్యము, పైత్యము. విషమజ్వరము, విషము, క్రిమి, అజీర్ణము, రక్తపైత్యము, కఫము, జ్వరము వీనినిహరించును. క్షయరోగములకు మేలుజేయును. దీనిరసము చెవిలోబోసిన చెముడు తగ్గును. ఆకు నూరికట్టిన గాయ ములు, కురుపులు మానును. రసపు మోతాదు పూటకు 2-5

తులములయెత్తు. కషాయపు మోతాదు 2కి మొదలు 5 తులముల యెత్తువరకు.

వెలిగారము:—Sodi biboras. Eng. Borax or biborate of sodium. సం* టంకణక్షార, లోహద్రావీ. హిం* సుహాగా. దీనిని టంకణక్షారమనియు నందురు. అగ్నిదీప్తినిచ్చును; కఫము, శూల, జ్వరము,గుల్మము, వాతము, పైత్యము, అతిసారము, కాస, శ్వాస, అపస్మారము, తాపము వీనిని బోగొట్టును; మూత్రము గావించును; దేహములోని మలముల వెడలించును. ఉదరము, మూత్రకృచ్ఛ్రము వీనిని హరించును; శీఘ్రప్రసవము గావించును; నేత్ర రోగములను మాన్పును. దుష్టద్రవకూటమును కరగించును. నీరుజేయును; దీనిని పొంగించి వాడుదురు. మోతాదు పూటకు 1 మొదలు 5 చిన్నముల యెత్తువరకు. సుమారు వరహా యెత్తు పొంగించని వెలిగారమును సుమారు ఒక ఔన్సు తేనెతో చూర్ణముచేసి కలిపి వ్రేలితో దినమునకు రెండుమూడు మార్లు పూసిన బిడ్డకు నోటిలో నగు పొక్కులు, పుండు (aphthoe or thrush) నయమగును. క్షయ, జ్వరము మొదలగు వ్యాధులలో పెద్దవారికి నాలుకమీద నగు పగుళ్ళకు ఒక ఔన్సు తేనెలో రెండు వరహాలయెత్తు వెలిగారపు చూర్ణమును ఎనిమిది ఔన్సుల నీళ్ళలోగలిపి పుక్కిలించుచుండిన నోటిరసపుపట్టు పుండుమానును. ఒకఔన్సు నీళ్ళలో ఒకవరహాయెత్తు వెలిగారమును గలిపి బిడ్డకు పాలిచ్చిన వెనుకను, పాలియ్యక ముందును చనుమొనలకు పూయుచుండిన వానిపైనుండు పగుళ్ళు మానును. లేదా అరఔన్సు నేతితో వరహాయెత్తు వెలిగారపు చూర్ణము కలిపి పూయుచుండినను చనుమొనలపైని పగుళ్ళు నయమగును. ఆ నేతిని పుంపై నొప్పిగల మూలములకు పూసిన నది మానును. లింగము, యోని వీని మంట, తాపము, గుల వీనికి తులముపావు వెలిగార

మును ఎనిమిది ఔన్సుల నీళ్ళలోగలిపి ప్రయోగించిన నయమగును. పురుషులకు ఆనీళ్ళతో తడిపిన గుడ్డ లింగముపైన వేయవలెను; స్త్రీలకు యోనిలో పిచికారీ (injection) చేయవలెను; మంట, తాపము, గుల నయమగును. పొంగించిన వెలిగారమున్ను దాల్చిని చెక్క చూర్ణమున్ను సమభాగముగ గలిపి పూటకు బేడెత్తు చొప్పున వేడినీళ్ళతో స్త్రీలకు ఋతువు కాకముందు వారము దిన ములు ముందునుండి యిచ్చుచుండిన ఋతువు జారీ అయిపోవును. గర్భిణులు చాలసేపు ప్రసవము కాలేక నుండునపుడును (In prolonged or tedious labours). గర్భస్రావములో పిండము త్వరగా పడిపోకుండ నుండునపుడును అరవరహాయెత్తు వెలిగారపు చూర్ణమును 10 గోధుమగింజల యెత్తు దాల్చినిచెక్క చూర్ణమును కొద్దిగ వేడిగంజిలో గలిపి ప్రతిగంటకు లేక రెండుగంటల కొకసారి నిచ్చిన ప్రసవమగును; పిండము పడిపోవును. పైన జెప్పిన మోతా దులు 3 లేక 4 మార్లకంటె అధిక మియ్యకూడదు. పైన జెప్పినట్లు ప్రసవాయాసమును వచ్చు ఈడ్పువాతము, వణుకు (Convulsions attendant on labours) వీని కియ్యవచ్చును. 10 గోధుమ గింజల యెత్తు వెలిగారపు చూర్ణమును 10 గోధుమగింజల యెత్తు దాల్చిని చెక్క చూర్ణమును గలిపి దినమునకు మూడుసార్లు చొప్పున నిచ్చిన ఋతుబద్ధము, క్రమము తప్పి అగు ఋతురక్తస్రావము, పురాణ యోనిరోగములు నివారణమగును; వెలిగారము, గంధకము, కాచు వీని చూర్ణము ఒక్కొక్కటి వరహాయెత్తు, ఒక ఔన్సు పందిక్రొవ్వు లేక నేతిలో లేక వేసలైనులో గలిపి వ్రణములు, పుండ్లపైన పలాస్త్రివలె వేసిన శీఘ్రముగ నవి మానును. గజ్జి, చిడుముకుకూడ రాసిన నయమగును. ప్రసవకాలమురాని గర్భిణీస్త్రీలకు వెలిగారము లోపలి కియ్యకూడదు; ఇచ్చిన గర్భస్రావము గలుగును.

వెలిదామర:—White lotus. పుండరీకము చూడుడు.

వెలిసెపిట్ట మాంసము:—Francoline partridge Flesh of. దీని నేకవింజలం పిట్ట అని యందురు. దీని మాంసము రుచిగా నుండును. అగ్నిదీప్తి నిచ్చును. కాస, శ్వాస, క్షయ, జ్వరము, గాయము, వ్రణము లయందు పథ్యముగా నుండును.

వెలుగుబంటి:—ఎలుగుబంటి మాంసము చూడుడు.

వెలుతురు చెట్టు:—వెణుతురు చెట్టు చూడుడు.

వెల్లుల్లి:—Allium sativum. Eng. Garlic. సం॥ లశున, రసోన. హిం॥ లశున, లహసున్. దీని రసము కారముగ నుండును; కాక జేయును; అరుచును. దీనిని లోపలికి పుచ్చుకొనిన మిక్కిలి కాక జేయును; కఫము, శ్లేష్మము, వాతము, సూతికరోగము, సన్నిపాతము, దేహమంతయు చల్లబడెడు మహావాతము, పురాణజ్వరము, వాతపు నొప్పులు, కీళ్ళనొప్పులు, పక్షవాతము, ఊపిరిగొట్టునొప్పి, శూల, అగ్నిమాంద్యము, అజీర్ణము, అజీర్ణపు కడుపునొప్పి, ఉబ్బు, బల్ల, గుల్మము, మూలవ్యాధి, శ్వాస, కాస, క్రిమి, కుష్ఠు, క్షయ, అరుచి, హృద్రోగము, ఉబ్బసదగ్గు (Asthma), సర్వాంగవాతము (General paralysis), ఆమవాతము (Rheumatism), మలుగునొప్పి (Sciatica), పరాకు, తలనరముల రోగములు, వగర్పుగల దగ్గు (Bronchitis), నడుము మొదలు కాళ్ళవరకు నుండు నొప్పులు, దేహము పచ్చబారజేయు జ్వరము వీనిని పోగొట్టును; విరిగిన యవయవముల నతుకకొన జేయును; అగ్నిదీప్తిని, కాంతిని, బలమును, తెలికను ఇచ్చును; వీర్యవృద్ధి. ఆయుర్వృద్ధి వీని నిచ్చును; దీపనకారి (Stimulant), దుష్టరక్తమును, దష్టస్రవ కూటమును కరగించును; విడగొట్టును; పొట్టకు బలము జేయును; కడుపులోని వాతమును వెడలించును; మూత్రము, ఋతురక్తము,

చెమట వీనిని శుభ్రపరచును. మూత్రమును, ఋతురక్తమును జారీ చేయును. చెమట పుట్టించును. విరేచనకారి, శరీరతత్వమును మార్చును. నరముల రోగములను (Nervous affections) పోగొట్టును. చెడుగాలి, చెడునీరు వీని దుర్గుణములను విరుచును. కంఠస్వరమును బాగుచేయును దీనిని సిరకా (Venegar) లో ఊరబెట్టి తినిన మేలుజేయును. మాంసము కొద్దిగ దినెడువారి దేహమునకు బలము, ప్రాణమునకు సత్తువజేయును. గురుత్వ పదార్థములతో వండితినిన వానిని జీర్ణముజేయును. చేతులు కాళ్ళు ఛణకెడు రోగమును పోగొట్టును. మూత్రపుసంచి (Bladder) లో పుట్టురాతిని కరగించును. సర్పవిషము, వెర్రికుక్క విషము వీనిని విరుచును. సదా వీనిని తినుచుండిన వెంట్రుకలు తెల్లబడక యుండును. కూరలలో వేసి వండి తినిన స్త్రీలకు పాలు బడజేయును. అంజూరు, అక్రోటులతో తినిన విషమును విరుచును. వెల్లుల్లిపాయలను మేకపాలతో వండి నేతితో దోరగవేయించి తేనెతో లేహ్యముజేసిపుచ్చుకొనినమిక్కిలి ధాతుపుష్టి జేయును. వాతపు, మేహవాతపు నొప్పులను హరించును. వెల్లుల్లిపాయల రసముగాని, వెల్లుల్లిపాయలు వేసి కాచిన నూనె గాని చెవిలో బోసిన చెముడు, చెవినొప్పి మానును. వెల్లుల్లిపాయలలో పసుపువేసి నూరి దేహమునకుపూసిన పక్షవాతము, ఇతర వాతములు, దేహము చలువకమ్ముట నివృత్తించును. వెల్లుల్లిపాయలు నూరి కట్టిన గోరుచుట్టు, కణుపుజేష్ట, మడమశూల, గడ్డలు మొదలైనవి హరించును. విషమును పీల్చుటలో నిది చింతామణివంటిది. ఒంటిరేక వెల్లుల్లిపాయను రెండుముక్కలుగ కోసి ఒక ముక్కను పాముగరచినచోట నంటించిన విషమును హరించును. వెల్లుల్లిపాయలు నూరి పూసిన గుదస్థానమున బుట్టెడు దురద నివారణమగును. పచ్చి వెల్లుల్లిపాయలు తినిన బహుమూత్రము కట్టును,

మోతాదు పూటకు 1 రేక మొదలు 8 రేకలచొప్పున క్రమక్రమముగ వృద్ధిజేసి దినమునకు రెండుపూటలను పుచ్చుకొననగును. వెల్లుల్లిపాయలు నూరి వంటికిబూసిన యెండుచిడుము నివృత్తించును. వీనిని వేడిబూడిద (కుమ్ము)లో నుంచి యుడికించి తినిన మూలవ్యాధి మానును. వీనిని నమలిన నోటిదుర్గంధము హరించును. వీని పొట్టు (పొప్పర) కాల్చినమసిలో జయతూన్ నూనె (Olive oil)లో గలిపి తలకు పట్టించిన వెండ్రుకలు విస్తారముగ బుట్టును. వృద్ధియగును. వెండ్రుకలు వంకరగా (సుళ్ళుసుళ్ళుగా) నుండును. వీని తైలమును జ్వరము, వాతము మొదలగు రోగములు గలవారికిచ్చిన నవి హరించును. దీని రసము లోపలికిచ్చు మోతాదు పావుతులము మొదలు తులమువరకు. దీని రసము వంటిపైన బూసిన చర్మము ఎఱ్ఱబడును వెల్లుల్లిపాయలు నూరి పొత్తికడుపునకు పట్టించిన మూత్రకోశపు బలహీనమువలన గలిగిన మూత్రబద్ధము నివారణమగును. వీనిని నూరి సిరకా గలిపి పట్టువేసిన గొంతుకలో పుండగుటచే సడలిన గొంతుకను (Relaxed sore throat), సడలిన (వదులైన) మాటలాడుటలో కదులు గొంతుక నరములను బిగదీసి బాగుచేయును. వీని చమురు వెండ్రుకలకు పూయుచుండిన నెరియకుండును. చలికాలములో వీనిని తినుచుండిన వాత మేహవాతపునొప్పులు, నరములనొప్పులు (Neuralgia) రాకుండ నాపును. ఆవనూనెలో వెల్లుల్లిపాయలు వేసి కాచి యానూనెపూసిన గజ్జి, చిడుము మానును. వ్రణములలోని పురుగులు చచ్చును. వెల్లుల్లిరసము పూసిన లేక వెల్లుల్లిపాయలను ఉప్పుతో నూరి కట్టిన కవుకుదెబ్బలు, బొప్పి, గాయములు వీని నొప్పి తీయును, మానును. వెల్లుల్లిపాయలు నూరి కట్టిన వాత మేహ వాతనొప్పులు, నరముల నొప్పులు (Neuralgia), కీళ్ళనొప్పులు,

ఆమవాతపునొప్పి (Gout) వీనిని హరించును. వీనిదండ మెడలో కట్టిన బిడ్డల ఉక్కిసదగ్గు (Hooping cough) నయమగును. వీని రసమును వేడినీళ్ళలోవేసి త్రాగించిన ఉబ్బసదగ్గు నిమ్మళించును. వాతము, వాతపునొప్పులు, పక్షవాతము గలరోగులు వీనికూర వండిగాని, మరి యేవిధముననైన గాని తినుచుండిన మేలుజేయును. వీని రసము తలకుపూసిన పేలుచచ్చును. వీనిని నూరి కణతలకు పట్టువేసిన దారుణమైన తలనొప్పి, ఒంటి పార్శ్వపునొప్పి నయమగును. ఒంటిరేక వెల్లుల్లిపాయ పామును చంపును. దీని దగ్గరకు పాములు చేరవు. వెల్లుల్లియొక్క దుర్గుణములు మిక్కిలి కాక జేయును. రక్తపైత్యమును బుట్టించును. హెచ్చించును. పుంస్త్వమును పోగొట్టును. తలనొప్పి బుట్టించును. రక్తమును దహించును. కండ్లు, నల్లదబ్బ (Spleen) ప్రేగులు, గర్భిణీస్త్రీలయొక్క గర్భము వీనికి హానిజేయును. మూలవ్యాధి, గ్రహణి, రక్తవిరేచనములు, రక్తవమనము, రక్తకాస, పైత్యము వీనిని హెచ్చించును. రక్తపరివాహామునకు వేగము బుట్టించును. కాకతత్వము గలవారి దేహమును కృశింపజేయును. దాహము బుట్టించును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 దానిమ్మకాయరసము, 3 పులుసు, 4 పాలు, 5 బాదము మాను, 6 ఉప్పుతో నీళ్ళుపోసి వండుట.

వెల్లుల్లియాకుకూర:—Curry of leaves of do. పైత్యము, కాకజేయును. శూల నణచును. అగ్నిదీప్తి నిచ్చును శ్లేష్మమును హరించును. విరేచనబద్ధము జేయును.

వేగిసచెట్టు:— Pterocarpus marsupium. P. Indicus. Eng. The Indian king. సం॥ అసన, బీజక, పీతసాల. హిం॥ అసన్, దీనిని ఏగీసచెట్టనియందురు. కొండలమీదశేచెడు పెద్దవృక్షము. దీని జిగురు, మానుచెక్క కషాయము వగరుగ, చేదుగనుండును. పండ్ల

నొప్పులు మొదలగు దంతరోగముల పోగొట్టును. శీతపైత్యమును గొట్టును. అగ్నిదీప్తినిచ్చును. వ్రణముల మాన్పును. కుష్ఠు, విసర్పి, మేహము, జ్వరము, క్రిమి, శ్లేష్మము, రక్తపైత్యము, విరేచనములు, గ్రహణి వీనిని హరించును. చర్మమునకు, వెండ్రుకలకు బలము జేయును. రసముయొక్క మోతాదు పూటకు 3-4 తులములయెత్తు. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 6 తులముల యెత్తువరకు.

వేట:—Hunting. మృగయా, విహారము, శౌర్యము, ధైర్యము, దార్ఢ్యము వీనిని గలుగజేయును అలసట, నిద్ర దీనిని దెచ్చును. పైత్యమును హెచ్చించును. వాతము నణచును. బలమును, పుష్టిని యిచ్చును గాని పెద్దపులి, చిరుతపులి, తోడేలు మొదలగు దుష్టజంతువులను వేటాడిచంపుట మంచిదిగాని పక్షులను, యితరజంతువులను చంపుట చాలా పాపకార్యముగనుక దానివలన ఖర్మ సంభవించును. నేత్రములకు హాని కలుగును.

వేడినీళ్ళ కాపడము:—Fomentation with hot water. నీళ్ళు మిక్కిలి వేడిగగాచి గొంగలిగుడ్డగాని, ముతక నూలుగుడ్డగాని యందులో ముంచి గట్టిగా నీళ్ళుపిండివేసి యాగుడ్డతో వత్తటమిచ్చిన వాతము, మేహవాతము, దంతవాతము, శూల వీనివలన గలిగిన వేదనను, రక్తము, చీముతోగూడిన పెద్దవ్రణముల బాధను, పొత్తికడుపు మొదలగు వానియందు బుట్టినపోట్లు, నొప్పి వీనిని శమింపజేయును. కాచిననీళ్ళలో కొంచెము యూక్లిప్టసు ఆయిలుగాని పొంగించిన వెలిగారము (Boric acid) గాని వేసి వత్తడమిచ్చిన త్వరగా పనిచేయును.

వేడినీళ్ళస్నానము:—Hot or warm water bath. త్రిదోషశమనము, ధాతుసామ్యత, ఆరోగ్యము వీనిని గలుగజేయును. దేహమనో

ఫలముల నిచ్చును; శ్రమ, బడలిక, ఎండకొట్టు, మార్గాయాసము, దుస్వప్నములు వీనిని పోగొట్టును; వెండ్రుకలకు, నేత్రములకు బలము తగ్గును; దేహశుద్ధత, కాంతి, ఆహ్లాదకరము, ఆయుర్వృద్ధి వీనిని కలుగజేయును. అతి వేడినీళ్ళ స్నానమువలన రక్తము ఉడికి పైత్య ప్రకోపము చేయును; అసౌఖ్య మిచ్చును. స్నానవర్జనము చూడుడు.

వేడినీళ్లు పుచ్చుకొనకూడనివారు:—Those who should not drink hot water. పైత్యరోగులు, కుష్ఠు, లూతమనెడు కంటిలో బుట్టెడు వ్రణము, గండమాల, కామిల, నేత్రరోగము, మూలవ్యాధి, విషదోషము, గుదస్థానము పుండుపడెడురోగము, మేఢ్రము పుండయి యుండెడు రోగము, నోరుపుండయి యుండెడు రోగము ఈరోగములు కలవారును, బాలురును, వృద్ధులును, గర్భిణీస్త్రీలును, గ్రీష్మకాలమందును, మత్తుకలిగినప్పుడును విశేషముగ వేడినీళ్ళు పుచ్చుకొన కూడదు.

వేణుపాత్ర:—Taking food in the covering of a bamboo. వెదురు కణుపున చేసెడు పాత్రలో భోజనము మిక్కిలి సౌఖ్యముగను, ఇంపుగనుండును; వాతము నణచును; పైత్యము చేయును; బుద్ధికుశలత నిచ్చును.

వేపకల్లు:—Margosa toddy. వేపచెట్టు చూడుడు.

వేపచిగుళ్ళు:—Tender leaves of margosa tree. చేదుగ నుండును; జ్వరము, క్రిమి, పైత్యము, మేహము, ప్రమేహము, కుష్ఠు వీనిని హరించును. రుచి బుట్టించును. జఠరదీప్తి నిచ్చును. మూడు మొదలు అయిదువరకు మిరియములు వేసి వేపచిగురు టాకులు నూరిన ముద్ద గచ్చకాయంత మొదలు కరక్కాయంతవరకు ఉదయపు పూటలను కొన్నిమాసములవరకు పుచ్చుకొనిన దారుణ

మగు కుష్ఠురోగములను, బేడెత్తు మొదలు పావలాయెత్తువరకు వేప చిగుళ్ళు వాని కాడలు సహా 3 మొదలు 5 మిరియములతో కొన్ని వారములు ప్రొద్దుట పూటలను తినిన మేహములు, పురాణ వరుస జ్వరములు నివృత్తించును.

వేపచెట్టు:—Melia Azadirachta, Eng. Margosa tree or Indian lilac. సం॥ నింబ, పిచుమంద, హిం॥ నీమ్. దీని చెక్క రసము లేక కషాయము లేక చూర్ణము చేదుగనుండును దాహము, శ్లేష్మము, వికారము, వాంతి, రక్తపైత్యము, బలమగు పైత్యరోగములు, మేహము, చర్మరోగములు, క్రిమిరోగము, కుష్ఠు, దురద, వ్రణము, శీతపైత్యము వీనిని పోగొట్టును. విరేచనములను కట్టును. జఠరదీప్తి నిచ్చును. శీతపైత్య విషమజ్వరముల హరించును. శరీర తత్వమును మార్చును. పొట్టకు బలము జేయును. దేహమునకు సత్తువజేయును. వాతమేహవాతపు నొప్పులను బోగొట్టును. దీని గాఢకషాయము ఘంటకొకసారి యిచ్చిన విడిచివిడిచి వచ్చుజ్వరము (Remittent fever) హరించును. దీని తేలికకషాయము బలము జేయును. వరుసజ్వరము (Intermittent fever) కట్టును. జ్వరపడి లేచినవారికి ఇచ్చిన బలముజేయును. జ్వరము తిరిగిరాకుండ జేయును. దీనిచూర్ణము తరుచు ఇచ్చిన వరుసజ్వరము, క్రిమి వీనిని హరించును. బలముజేయును. కొయినా (quinine) సరిపడని సుకుమార తత్వము గలవారికిని పురాణజ్వరమున్నప్పుడును దానికి బదులుగ నియ్యనగును. దీని కషాయము నీళ్ళ విరేచనములు, అజీర్ణముతో గూడిన పురాణజ్వరము హరించును. వేపచక్క రసముతో తేనె గలిపి యిచ్చుచుండిన కామిలరోగము మానును. పూటకు 2-3 తులములయెత్తు. చెక్కబూడిద విస్తారము రసికారు విషపుపొక్కుల (eczema)కు వేసిన నయమగును. కషాయపు మోతాదు

8½ మొదలు 5 తులముల యెత్తువరకు; రసపుమోతాదు పూటకు 2 మొదలు 4 తులముల యెత్తువరకు; తేలికకషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల యెత్తువరకు; గాఢకషాయపు మోతాదు 2 మొదలు 4 తులముల యెత్తువరకు. వేపపుడకతో అనుదినము దంతధావనము జేయుచుండిన పైత్యము నణచును. నిరోగముగ నుండును. నోటిని శుభ్రపరచును. నోటిదుర్గంధమును హరించును.

ఒకానొక ముదురువేపచెట్టుమాను దానంతట యది పగిలి యందుండి చాలదినములవరకు కల్లువెడలును, దీనిని పుచ్చుకొనిన పొట్టకు బలముజేయును; జ్వరమును, పైత్యమును హరించును. శరీరతత్వమును మార్చును; బలముజేయును; రక్తమును శుభ్రపర చును. మోతాదు 6 మొదలు 20 తులముల యెత్తుచొప్పున ఉదయపు పూటలను పుచ్చుకొననగును. నూరుసంవత్సరముల ఈడు గల వేపచెట్టుమాను (trunk) లో 3-4 సేర్ల నీళ్ళుపట్టునంత తొల నిలువుగ వేటవాలుగ తొలచి అందులో సుమారు సేరుబియ్యము అన్నమువండి చల్లారకమునుపు వుంచి యావేపచెట్టు పచ్చికర్రతో నాతొలమూతికి సరిపడు బిరడాచేసి బిగించి యందుపైన ఆవుపేడ పూసి ఒక సంవత్సరము వుంచి యాకరుదినమున నాయన్నమును తీసిన యెర్రగనుండును. దానిని యెండించి పూటకు పావలాయెత్తు చొప్పున రెండుపూటలను 40 దినములు పుచ్చుకొనిన కుష్టురోగము నివృత్తించును.

వేప జిగురు:—Gum of margosa tree. చేదుగనుండును. పైత్య మును హరించును; గ్రహణిని, రక్తగ్రహణిని, అతిసారమును, అతి మూత్రమును గట్టును; కఫము నణచును. పావలయెత్తు వేపజిగురు చూర్ణమును దీనికి సమము పటికిపంచదార చూర్ణమును గలిపి 2 విరేచనములయిన వెనుక ఒకసారిచొప్పున యిచ్చిన రక్తగ్రహణి

కట్టును. స్ఫోటకము, పొంగు ఈవ్యాధులు తగిలిన బిడ్డలకు అయ్యేడు జిగటవిరేచనములు, రక్తవిరేచనములు వీనికి వేపచిగురుపాలు నల్లమందు పాతికపాలు నూరి మాత్రలుచేసి పూటకొకటి చొప్పున యిచ్చిన నయమగును. చిన్నబిడ్డలకిచ్చు ఒకమాత్రలో నల్లమందు చోడిగింజంతకంటె అధికముగ నుండకుండ కలుపవలెను. వయస్సును బట్టి నల్లమందుపాలు గలుపవలెను.

వేపపండు:—Fruit of do. చేదుగ, మధురముగ నుండును; రక్తపైత్యమును, రక్తవాతమును, నేత్రరోగమును, గాయములను మాన్పును. వీర్యమునకు చలువ జేయును; విరేచనముజేయును; మూత్రరోగమును, మూలశంకను శమింపజేయును. ప్రేగులలోని క్రిమిని హరించును.

వేపనూనె:—Margosa oil. వేపగింజలనుండి తీసిననూనె చేదుగ, దుర్వాసనగ నుండును; మిక్కిలి కాక జేయును; లోపలికిచ్చిన శరీరతిత్వమును మార్చును. కుష్ఠు, రసికారు విమపుపొక్కులు, గడ్డలు, దురదలు మొదలగు చర్మరోగములు, క్రిమిరోగము, శ్లేష్మము, వాతము, పాండురోగము, ఉబ్బసము (Asthma), ఈడ్పులు (Convulsions), మూర్ఛ (Fits) మొదలగువానిని పోగొట్టును. ఈనూనె లోపలికి పుచ్చుకొను మోతాదు పూటకు 20 మొదలు 60 చుక్కలవరకు. దీనిని పైన పూయుటవలన లేక మర్దన చేయుటవలన పైనజెప్పిన చర్మవ్యాధులును, వాతపు, మేహవాతపు నొప్పులును, ఎరుపులు ( Spasmodic affections ) ను హరించును; వ్రణములలోని క్రిములు చచ్చును; పురాణ వ్రణములు మానును; తలమీదిచుండ్రు, పొరపొరలు లేచుట హరించును, పేలు చచ్చును; రసికారు విమపుపొక్కులు మానును. పశువుల, గుర్రముల వ్రణములను శుభ్రపరచి మాన్పును. మిక్కిలి యొత్తుగ

స్ఫోటకపు పొక్కులు లేచినప్పుడు ఈనూనెను దేహమంతట బూయు చుండిన బహుతేలికగ ఆపొక్కులుమాని బాగగును;కుక్కకొరుజులు చచ్చును; దానిచిడుము బాగగును; జ్వరము, మరిడిజాడ్యములో హఠాత్తుగా ప్రాణశక్తులు క్షీణించుచున్నప్పుడు ఈనూనెను వంటికి పూసిన కాక జేసి ప్రాణమునకు సత్తువ గలుగజేయును. వానలో నుండుట చలిలోనుండుట లేక వానలో తడియుట తటస్థించుటకు పూర్వము ఈనూనెను కొద్దిగ లోపలికి పుచ్చుకొనిన జ్వరము, దగ్గు, పడిసెము మొదలగు జబ్బులు గలుగకుండ జేయును.

వేపపువ్వు:—Flowers of margosa tree. చేదుగ, రుచిగ నుండును; శ్లేష్మము, ప్రమేహము, క్రిమిరోగము, పైత్యములు, కుష్టు వీనిని బోగొట్టును; రుచిబుట్టించును; వాతము నణచును; నీరసము జేయును; మరిడిజాడ్యమును నివారించును. వేపపువ్వు నూనెతోగాని, నేతితో గాని వేయించి ఉప్పు, కారము గలిపి అన్నముతో పుచ్చుకొనిన చిరిచేదుగనుండును; పైత్యహారముగ నుండును; రుచిబుట్టించును; ఆరోగ్యమునిచ్చును.

వేపపువ్వు వడియాలు:—Cakes made of do. చిరిచేదుగ, స్వాదుగ నుండును; క్రిమిరోగము, పైత్యము, కఫము, పైత్యజ్వరములు, ముఖరోగము, అరుచి వీనిని బోగొట్టును.

వేపాకు, ఈనెలు, కాయలు:—Margosa leaves, stalks & green fruits. ఇవిచేదుగ, వెగటుగ నుండును; కుష్టు, క్రిమి, కఫము, పైత్యము, జ్వరములు వీనిని హరించును; నేత్రములకు బలమిచ్చును, బుద్ధిని హెచ్చించును; మేదస్సునణచును; రుచి బుట్టించును; పథ్యముగ నుండును; ఆకులు, ఈనెలు వీని రసము లేక కషాయము పొట్టకు బలము కలుగజేయును; పొట్టలోని వాతమును వెడలించును. జ్వరమును హరించును; మూత్రమును జారీచేయును;

అగట విరేచనముల కట్టును. ఆకుల కషాయము అపస్మారము (Hysteria) ను పోగొట్టును. ఆకులపసరులో కొద్దిగ ఉప్పు గలిపి యిచ్చిన క్రిములనుహరించును; తేనెగలిపియిచ్చిన పాండురోగమును, చర్మరోగములను హరించును. ఆకుపసరు పావుతులము, ఉసిరి కాయలరసము పావులమెత్తుకలిపి అందులో కొద్దిగ నెయ్యి గలిపి యిచ్చిన దురదపొక్కులు (Prurigs), గడ్డలు(Boils), సూదులతో పొడిచినట్టుఉండు పొక్కులు (Uricaria) నిమ్మళించును. ఆకులకు సమముగ నువ్వులువేసి నూరికట్టిన దుష్టవ్రణములు ( Unhealthy ulcerations) కుదురును. ఆకునూరి రొమ్ములకు పూసినను ఆకు రొమ్ములకు కట్టినను స్త్రీలకు పాలుహరించును. ఆకునూరి వ్రణము లకు కట్టిన కుళ్ళు పట్టనియ్యక మాన్పును. ఆకుపసరు కుష్ఠు మొదలగు చర్మరోగములకు నిచ్చిన శరీరతత్వమును మార్చి వానిని నివారణజేయును. వేపచెట్టు క్రింద 12 సంవత్సరములుండిన కుష్ఠు నివృత్తించును. ఆకు నేతిలో వేసి కాచి అందులో మైనముగలిపి పలాస్త్రీ (Plastor )గా చేసి వేసిన మానని వ్రణములు (Indolent ulcers) మానును. ఆకును వెచ్చజేసిగాని, నీళ్ళలోవేసి కాచిగాని వత్తడము (Fomentation) ఇచ్చిన మేహావాతపునొప్పులు, ఇలుకు నొప్పులు, మాంస గ్రంథులు, కాయలు, పీనివాపులు ( Glandular swellings) కుదురును. ఆకు నూరి కట్టిన నెత్తురుగడ్డలు, రాచ పుండ్లు హరించును; లేదా త్వరగ చీముపట్టి పగులజేయును. ఆకు కాల్చిన బూడిదలో నెయ్యిగలిపి పూసిన గజ్జి మొదలగు కురుపులు మానును. ఆకును పసుపుతో నూరి నూనెగలిపి యుడికించి పూసిన స్ఫోటకపుకురుపులు, ఇతర చర్మవ్యాధులు త్వరగ మానును. ఆకు కషాయములో వ్రణములు, పుండ్లు గలిగిన నయమగును. ఆకు పస రుకు సమముగ కొబ్బరినూనె గలిపి పస రిగురువరకు కాచి నూనె

దీసి దానితో మర్దనచేసిన వాత మేహవాతపు నొప్పులు, పూసిన చిడుము, దురదలు మానును. ఆకునూరి కట్టిన గాయములు మానును. పసరు మోతాదు పూటకు 2-3 తులములయెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చిగుళ్ళ మోతాదు పావలా యెత్తు మొదలు అర్ధరూపాయి యెత్తు వరకు.

వేపుడుగంజి:—బియ్యపునూకల జావ చూడుడు.

వేపుడుబియ్యపుపిండి:— Flour of fried rice. చులకనగ జీర్ణమగును; ఆకలి, దప్పి, శ్రమ, నేత్రరోగము, వ్రణము వీనిని హరించును; తృప్తినిచ్చును. వేడినీళ్ళలో కలిపిగాని, నీళ్ళలోవేసి కాచిగాని పుచ్చుకొనిన వెంటనే బలమిచ్చును.

వేయించినపచ్చిచేప:—Roasted fresh fish. లఘువుగ నుండును. బలముజేయును; నేత్రరోగములను, పైత్యమును పోగొట్టును. జఠరదీప్తినిచ్చును; చలువజేయును; గుదదాలకు బలమునిచ్చును;విరేచనమును క్రమపరచును.

వేరుపనసకాయ:—Unripe fruit of jack tree. దీనికూర రుచిగ నుండును. వీర్యవృద్ధిజేయును. పరిణామశూలను, త్రిదోషములను, శ్లేష్మమును హెచ్చించును; విరేచనబద్ధము జేయును; దీనికి విరుగుడు పనసకాయ చూడుడు.

వేరు పనసపండు:—A kind of jack tree. the fruit of which springs from the root. సం॥ మూలఫల, బహిర్గంధీ. దీని తొనలు మిక్కిలి రుచిగ నుండును; పనసతొనల గుణము కలిగి యుండును; వాతముజేయును; విదాహమును, మూలవ్యాధిని బుట్టించును. దీనికి విరుగుళ్ళు పనస పండు చూడుడు.

వేరుసెనగకాయ:—Arachis hypogeae. Eng. Groundnut. సం॥ మండపి, రక్తబీజ, భూచనక. హిం॥ మూంగ్‌ఫలీ. దీనిపప్పు మిక్కిలి రుచిగ గురుత్వముగ నుండును; మిక్కిలి పైత్యముజేయును; కఫవాతములను పెంచును; విరేచన బద్ధము జేయును; బలము నిచ్చును; వీర్యవృద్ధిజేయును. దీనినూనె విరేచనమును జారీచేయును; మృదువు పరచును;మూత్రకోశముయొక్క జలుబుచేత గలుగు అధిక మూత్రమును కట్టును. ప్రస్తుతకాలమున నువ్వులనూనెకు బదులు యీనూనెనే అన్ని విషయములకు వాడుక చేయుచున్నారు. కొంచ మెచ్చుతగ్గుగా అలాగే పనిచేయుచున్నదిగాని దాని గుణ ముండదు. ఈపప్పునే యాహారముగ పుచ్చుకొనుట యితర శాకా హారముల (Vegetable meal) కన్నిటికంటె శ్రేష్టమైనది. దీనికి విరుగుళ్ళు 1 బెల్లము, 2 పంచదార, 3 నేతిలో వేయించుట.

వైనుసారాయి:—Wine. ద్రాక్షాసవము చూడుడు.

వైక్రాంతభస్మము:—Calx of white crystals like diamonds. సం॥ వైక్రాంత. కువజ. హిం॥ వైక్రాంతమణి. క్రమముగ చేయ బడిన దీనిభస్మము యనుపాన విశేషముగా నిచ్చిన కాస, శ్వాస, క్షయ, అరుచి, ప్రమేహము, మేహరోగములు, త్రిదోషములను, విషదోషములను, కుష్టు, జ్వరములను హరించును; అగ్నిదీప్తిని, ఆయుర్వృద్ధిని, బలమును, ఆరోగ్యమును, వీర్యవృద్ధిని యిచ్చును.

వైఢూర్యము దీని భస్మము:—Lapis lazuli- cat's eye its case. సం॥ వైఢూర్య. కేతురత్న. హిం॥ వైఢూర్య, లహసునియ. యిది నవరత్నములలో నొకటి. దీని ధారణవలన అనేక దోషము లను పోగొట్టి ఆరోగ్యమునిచ్చును. క్రమముగా చేసిన దీని భస్మము వేడిజేయును. కఫవాతములను, గుల్మము, శూలలను హరించును. పైత్యరోగమును పాండుజ్వరమును, శాంతింపజేయును.

వ్యాఘ్ర నఖము:—నఖముచిప్పలు చూడుడు.

వ్యాయామము:—Walking exercise. ప్రొద్దుటగాని, సాయంకాలముగాని సంచారము చేయుటవలన అరుగని యన్నమును జీర్ణింపజేయును. అగ్నిదీప్తినిచ్చును; దుష్టజలమును, మేదస్సును, చర్మదోషము మొదలగు సమస్తదోషములను హరించును; దేహమునకు తేలిక, కాంతి, మిక్కిలి బలము, సౌఖ్యము, సుఖనిద్ర వీనిని గలుగ జేయును; బద్ధకమును, నీరసమును బోగొట్టును; ముదిమిని రాకుండ జేయును; ఆయుర్వృద్ధి నిచ్చును. గాన వ్యాయామ మను దినము తప్పక చేయతగినది.

వ్యాయామము చేయకూడనివారు :—Those who should not take walking exercise. జ్వరము, రక్తపైత్యము, ఉబ్బు, కాస, శ్వాస, గాయము, నేత్రరోగము, హృద్రోగము ఇవిగల వారును, మిక్కిలి నీరసపడినవారును, భోజనము చేసినతోడుతను, ఆకలిగొని యున్నప్పుడును వ్యాయామము వర్జింపవలయును.

—శ—

## శ

శంఖజీరకము:—Silicate of magnesia. soap stone. సం॥ శంఖజీర, శంకజీర. హిం॥ సంగ్ జరాహాల్. దీనిని సంగెజరాహాల్ అనియందురు. అరవములో బలపురాయి అందురు. ఇది భూమిలో పుట్టెడు తెల్లని మృదువైన పదార్థము. ఇది చేతికి అంటుకొనునంత నునుపుగ నుండును. విరిచిచూచిన వెండివలె మెరయుచుండును. మూత్రమును జారీచేయును. మేహశాంతి, పైత్యశాంతిజేయును. వేడిని తగ్గించును. దాల్చిని చెక్కరసముతో నిచ్చిన విరేచనములు,

గ్రహాణి విరేచనములను కట్టును. పాటిపంచదారతోగాని, వెన్నపం దారతోగాని యితర అనుపానములతోగాని యిచ్చిన స్త్రీల యెరుపు తెలుపు కుసుమరోగములు, శగరోగములు మానును. హృదయము నకు బలము జేయును. పైత్యశూలలు, వేడివలనవచ్చు దగ్గులకు మేలుజేయును. పైనచెప్పిన అనుపానములతోగాని, బ్రహ్మమేడి కాయల రసములో కొద్దిగ పంచదార కలిపి యిచ్చిన నోటివెంట, ముక్కువెంట, యోనివెంట, గుదస్థానమువెంట పడు రక్తము కట్టును. మోతాదు 1-2 అణాలయెత్తు. పైన నేతితోగాని, నూనెలో గాని కలిపిరాసిన వ్రణములు, వాపు, విసర్పి, మంటలు సవాయి పుండ్లు, వరుపులు మానును. ఇతర అనుపానములలోగాని యివ్వ నగును. దీనిని సీమరాతినార యనియు నందురు.

శంఖద్రావకము:—A medicinal acid called Sankhadravaka, అజీర్ణము, శూల, ఉదరము, వాతము, క్రిమిరోగము, సర్వగుల్మ ములు నివారించును. శీతజ్వరము, ఉబ్బు, మేహము, మూత్రకృచ్ఛ ములు హరించును. మోతాదు సూరేకార ద్రావకమువలె నుప యోగింప నగును.

శంఖ నఖము:—నఖము చిప్పలు చూడుడు.

శంఖపుష్పియను చెట్టు:—Xanthium strumarium, Canscora decussata, Pladera decussata, Eng. Broad leaved burweed. సం॥ శంఖపుష్పి, శంఖాహ్వా, కంబుపుష్పి. హిం॥ శంఖాహులి, కౌడియాలి. దీనివేరు, ఆకురసము లేక సమూల కషా యము చమటబుట్టించును. జీర్ణించిన మన్యపుజ్వరమును హరించును; కొద్దిగ మూత్రమును అధికపరచును. దగ్గును హరించును; వెర్రికుక్క విషసన్నిపాతము (Hydophobia) రాకుండ నాపును. అనగా దాని విషమును హరించును; కాక జేయును; స్మృతి దెచ్చును; శరీరమునకు

కాంతిని, బలమును ఇచ్చును. బుద్ధిని హెచ్చించును; ఆయురారోగ్యములనిచ్చును; గ్రహబాధను దొలగించును. స్వరమును బాగుజేయును. చూర్ణపు మోతాదు 5-6 గుంజలయెత్తు, కషాయపు మోతాదు 2-3 తులములయెత్తు.

శంఖభస్మము Calx of Conch. సం* వారిభవ, దీర్ఘనాద, కంబు. హిం* శంఖ్. క్రమముగ శుద్ధిచేసి చేయబడినది కారముగ, ఉప్పగనుండును. వేడిజేయును. శూల, వాతము, ఉబ్బు, జ్వరము, క్రిమిరోగము, పాండువు, కామిల, గుల్మము, శూలలు వీనిని హరించును. పుష్టి, బలమునిచ్చును, జఠరాగ్నిని వృద్ధిబొందించును. మోతాదు 1 మొదలు 2 చిన్నముల యెత్తువరకు.

శంఖ మాంసము:—Flesh of Conch shell. ఆలస్యముగ నుడుకును. గురుత్వము జేయును; పైత్యమును బోగొట్టును; మలమూత్రములను జారీచేయును. వీర్యమునకు వేడిజేయును. పరిణామ మొదలగు శూలలను, రక్తపైత్యమును అణచును. నేత్రములకు చలువజేయును.

శంబూకము:— Flesh of Trumpet or bivalve shell. అనగా సుళ్ళుసుళ్ళుగల పొడుగుగా నుండెడి నత్తగుల్ల. దీని మాంసము చమురు గలిగియుండును; వేడిజేయును. వాతమును హరించును. శ్లేష్మపైత్యములను వృద్ధిచేయును. బలమిచ్చును, గుల్మరోగమును పోగొట్టును. దేహపుష్టినిచ్చును.

శకటారోహణము:—Travelling in a cart. రెండెడ్లు కట్టిన మోటబండిలో ప్రయాణముచేయుట దాహమును పుట్టించును. దేహము, కీళ్ళు వీనినొప్పులు గలుగజేయును. వాతమును, శ్లేష్మమును బోగొట్టును. పైత్యమును హెచ్చించును. జఠరదీప్తినిచ్చును.

శనగచెట్టు :—Cicer arietinum. Eng. Chicken - pea, Begal gram plant. సం॥ చనక. హిం॥ చనా. దీని యాకుకూర పుల్లగ నుండును. పైత్యమును, కఫమును గొట్టును. వాతము జేయును. గురుత్వముగ నుండును. మూత్రపు సంచిలో రాళ్ళు పుట్టించును. దీని సమూలమువేసి కాచిన నీళ్ళయావిరి యోనికి పట్టించిన ఋతుబద్ధము నివారణమగును.

శనగలుపచ్చివి:— Raw bengal gram not dried. ఎండకుండ పచ్చివిగ నుండెడు శనగలు తేలికగ నుండును. కఫమును బుట్టించును దేహపుష్టి నిచ్చును. వాతము జేయును. మూత్రపుసంచిలో పుండు బుట్టించును. దీనికి విరుగుడు గసగసాలచూర్ణము.

శనగలు, చిరి శనగలు ఎ డినవి:—Cicerarietinum C. Lans. Eng. Bengal gram. సం॥ చణక, బాలభోజ్య, హరిమంథ. హిం॥ చనేకాబీజ్. వేయించని యెండు శనగలు వేడిజేసియార్చును. బలము, దేహపుష్టి జేయును. రక్తపైత్యమును శమింపజేయును. వాతము, చలువజేయును. కఫమును బోగొట్టును. తేలికగనుండును. మదము నణచును. స్త్రీలకు పాలు బడజేయును. తెల్లదబ్బ (Lungs) కు, నల్లదబ్బ (Spleen) కు బలమిచ్చును. శరీరపు సహజమైన కాకకు బలమిచ్చును. కార్జము (Liver), తెల్లదబ్బ (Lungs), మూత్రకాయలు ( Kidneys ) వీనిని శుభ్రపరచును. గడ్డలకు మేలు జేయును. పొట్టను మృదువుపరచును. మంచిరక్తమును బుట్టించును. ఆకలి బుట్టించును. ఇది మంచి యాహారము. శనగలు యొకరాత్రి నీరకాలో నానబెట్టి వానిని ప్రొద్దుట పుచ్చుకొని యాదినము మరి యేమియు పుచ్చుకొనకయుండిన కడుపులోని క్రిము లన్నియు చచ్చిపోవును. శనగలు నీళ్ళలో నానబెట్టి పచ్చివి దినవలెను. ఆ శనగలు నానబెట్టిన నీళ్ళలో తేనె కలుపుకొని త్రాగవలెను. ఇలా

గున 20 దినములు తినిన పోయిన పుంస్త్వము తిరిగివచ్చును. ఇటుల మేహశాకతత్వములు కలవారే చేయతగినది. పొట్టలో వాతము బుట్టించును. కడుపులో భారముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 శాకపదార్థములు, 2 ముల్లంగిదుంప, 3 తెల్లయుత్తరేణితారము, 4 గులకందు, 5 షాజీర, 6 గసగసాలు, 7 సికింజబీను. అప్పుడు వేయించిన శనగలు తినిన మంచిపైత్యమును బుట్టించును. వీర్యపుష్టి జేయును. బుతురక్తమును జారీచేయును. మూత్రబద్ధమును మాన్పును; భోజనాత్పరమందు వీనిని మితముగ బుచ్చుకొనిన అన్నమును చక్కగ జీర్ణముజేయును.

శనగపప్పు వండినది:—Boiled split pulse of do. కమ్మగ, రుచిగ నుండును; పైత్యము, మేహము, వాతము, శీతపైత్యముజేయును. శ్వాస బుట్టించును. కడుపుబ్బును, మిక్కిలి అపానవాయువును దెచ్చును. సర్వరోగములకు అపథ్యమైనది. దీనికి విరుగుళ్ళు శనగలు ఎండువి చూడుడు.

శనగపప్పు వేయించినది:—Fried of do. తినిన పడిసెభారమును తగ్గించును. వీర్యపుష్టిజేయును. దగ్గునణచును. దీనిని తినిన వెంటనే నీళ్ళు త్రాగకూడదు. త్రాగిన జీర్ణముగాక నీళ్ళవిరేచనములగావించును.

శనగపులుసు:— A strong acid extracted from the plant of bengal gram. అనగా శనగచెట్లమీద సన్న బట్ట పరచితీసిన మంచునీరు అతిపుల్లగ నుండును. వాతమును, పైత్యమును శమింపజేయును; అన్నముజీర్ణము గావించును; జఠరాగ్నిని వృద్ధి బొందించును; రక్తములోని వేడినణచును. కొన్ని ఔషధములకు అనుపానముగ నియ్యతగియుండును.

శనగవుండలు:— A kind of sweet meat. బెల్లము పాకముబట్టి వేయించిన పప్పువేసి చేసినవి. పైత్యమును, మేదస్సు నణచును. వీర్యవృద్ధిని, దేహపుష్టిని యిచ్చును.

శనగపిండి పచ్చిది, వేయించినది:— Flour of unfried & fried bengal gram. పచ్చిశనగపప్పు విసిరినపిండితో అనేక పిండివంటలు మిఠాయిలు, పకోడీలు, కారపుపూస, బూంది మొదలగునవి తయారుచేయుదురు. వేయించి విసిరిన సెనగలపిండి బలమిచ్చును. కడుపుఉబ్బు, అజీర్ణముచేయును. వేయించిన పప్పు మెత్తగా విసిరి దానిలో తగుమాత్రము ఉప్పు, కారము చేర్చి ఉంచుకొందురు.దీనిని అన్నములో వేసుకొని దానిలో నెయ్యిగాని, నూనెగాని వేసుకొని భోంచేయుచుండిన బలము, శరీరపుష్టి జేయును. క్రొవ్వును బెంచును. వీర్యవృద్ధి నిచ్చును.

శర్కర:— Sugar. చీనాపంచదార చూడుడు.

శర్కర వర్జింపవలసినవారు:—Those who should not eat sugar. పంచదార పుచ్చుకొన గూడనివారు చూడుడు.

శర్కరాసవము:—Liquor of do. స్వాదుగ, రుచిగ, తేలికగ, మనోహరముగ నుండును; మత్తు చెయ్యదు. బలము జేయును.

శాలువు:— Shawl. చలిని ఆపును. కాక జేయును. పైత్యమును హెచ్చించును. కఫమును, వాతమును హరించును. శిశిర, హేమంత ఋతువులయం దనుకూలముగ నుండును.

శిరివేరుచెట్టు:—Oldenlandia umbellata, Hedyotis U. H. Hispida. Eng. Chayroot plent or Indian medder సం॥ రాజన. దీనిని సిరివేరు అని, చిరివేరు అని యందురు. దీని ఆకు లేక సమూల రసము లేక కషాయము లేక చూర్ణము శ్లేష్మమును వెడలించును. ఉబ్బసపుదగ్గు, కాస, శ్వాస, క్షయలు హరించును. పాము మొద

లగువాని విషమును హరించును. చలువ, జలుబు. చర్మరోగములు వీనిని నివృత్తించును. ఎండిన యాకులు పిండిగొట్టి వరిపిండిలోగాని, గోధుమపిండిలోగాని కలిపి రొట్టెలుచేసి పెట్టిన క్షయదగ్గులు, ఉబ్బసపు దగ్గులు నివృత్తించును. దేహస్థితి, రుగ్మత బలము వీనిని యనుసరించి పిండికి యాకుచూర్ణము నాల్గవవంతుగాని, సగమువంతుగాని, సమముగగాని గలుపవలయును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు పూటకు 3 మొదలు 5 తులముల యెత్తు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు నియ్యనగును. దీని వేరుతో చిరివేరురంగని బట్టలకు వేయుదురు.

శిరివేరురంగుబట్ట:—Cloth dyed with colour of chay-root. శ్లేష్మమును, వాతమును అణచును. పైత్యము జేయును. శరీరమునకు వెచ్చదనమిచ్చును. హేమంత శిశిర ఋతువులయందును మేఘవరణమైన దినమందును అనుకూలముగ నుండును.

శిలాజిత్తు:—A gummy substance procured from stones of certain mountains or hills. ఇది కొన్ని పర్వతములయందు, కొండలయందు పుట్టెడు రాతిమదము. దీనిని మొమ్మాయి యందురు. మన దేశమందు దొరికె శిలాజిత్తునకు మొమ్మాయిలో జెప్పినగుణము లన్నియు జేయకపోయినను కొంతవరకు జేయును. గోమూత్రపు వాసన గలిగియుండును. శుద్ధిచేసిన శిలాజిత్తును లోపలి కిచ్చిన వాతములు, మేహములు, నొప్పులు, మేహవాతనొప్పులు, గాయములు, దద్దుర్లు, పొడలు, కురుపులు, జలుబు, పడిశభారము, బద్ధకము వీనిని హరించును. తేలిక నిచ్చును. నేతిలో దీనిని వేసి కాచి యా నేతిని గాయములకు నొప్పులకు పైన పూయనగును. త్రిఫల కషాయముతో దీనిని నానబెట్టి కొంచెము కాచి 2-3 పర్యా

యములు సన్నగుడ్డతో వడియగట్టి చిక్కబడువరకు ఎండించిన శుద్ధి యగును. మోతాదు పూటకు 1 మొదలు 4 గుంజల యెత్తువరకు. అపరిశుద్ధి శిలాజితు సేవవలన కొన్ని దుర్గుణములు పుట్టును. దీనికి మిరియముల చూర్ణమును నేతిలో కలిపి 7 దినములు తినిన దాని వికార మణగును.

శిలాధాతువు:—Parmelia perlata, Eng. Rounded lichen. సం* శైలేయ, శిలాపుష్ప. హిం* ఛరీలా, పత్తర్‌కాఫూల్, అనగా రాతిపువ్వు. చేదు, వగరు, కారముగనుండును. దీనిని శుద్ధి చేసి చూర్ణముజేసిగాని, భస్మముజేసిగాని వాడుదురు. చలువ జేయును. హృదయమునకు మేలుజేయును. జ్వరము, పాండువు, ప్రమేహము, మూత్రకృచ్ఛ్రము, గుల్మము, కడుపులోని బల్ల, అగ్ని మాంద్యము, మూలవ్యాధి, క్షయరోగము, పైత్యము, దురద, కుష్ఠు, వ్రణము, విపరక్తము వీనిని హరించును. మోతాదు పూటకు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు.

శిలారసము:—తురుష్కము చూడుడు.

శివంగి:—Flesh of hyena. దీనిమాంసము వాతము, హరము, బలము నిచ్చును. దీని పెంటికల ధూపము వాతమును, త్రిదోషము లను అణచును. శీత, కంప జ్వరములను పోగొట్టును.

శివనింబ:—Aspalathus Indica. దీని యాకులు చిన్నవిగ, కొద్దిగ తెలుపుగనుండును. ఎర్రని పువ్వులు పూయును. 4 అడుగుల యెత్తు పెరుగును. దీనియాకులు చలువజేయును. తత్వమును మంచికి మార్చును. మృదువు పరచును. దీని కషాయము కుష్టువ్యాధిని పోగొట్టును. మోతాదు పూటకు 4 మొదలు 10 తులముల యెత్తు వరకు. దీని వేరును బుగ్గలో నుంచుకొనిన పంటినొప్పి, నోటిపూత, నోటిలోని పొక్కులు మానును.

శివలింగి:—లింగదొండ చూడుడు.

శీకాయిచెట్టు:—సీకాయిచెట్టు చూడుడు.

శీతాఫలచెట్టు:— Anona squamosa. Eng. White custard apple tree. సం* సీతాఫల, గండగాత్రి, ఆతాపిఫల. హిం* షరీఫా, శీతాఫల్. దీనియాకు నూరి దానిలో ఉప్పుగలిపిగాని, కలుపకగాని కట్టిన గడ్డలు మొదలైనవి త్వరగ చీముపట్టి పగులును. దీనివిత్తులు, ఆకులు, పచ్చికాయ వీనిలో పురుగులను చంపుగుణము కలదు. పచ్చికాయ యెండించి చూర్ణముచేసి అందులో ఉలవపిండి గలిపి పురుగులనుచంపుట కుపయోగింపదగును ఆకుల తేలిక కషాయమిచ్చిన బిడ్డలప్రేగు లేక గూద బైటకువచ్చినది బాగగును. దీనివేరు గాఢవిరేచనకారి. కొద్దిమోతాదులుగ నిచ్చిన క్రొత్తగనగు జిగటనెత్తురు విరేచనములు కట్టును. ప్రాణ నిస్సత్తువను, వెన్నెముకయొక్క రోగమును నివారణచేయును. దీని విత్తులు నూరి పూసిన పేలు చచ్చును. ఈ విత్తులగంధము యోనిలో జొనిపినను గర్భస్రావము గలిగించును. దీనియాకు నూరికట్టిన నారికురుపులోని పురుగు బయటకు వచ్చును. ఆకులు నీళ్ళుపొయ్యకుండ నూరికట్టిన మురికివ్రణములు మానును. పురుగులు చచ్చును. దీని యాకులు పొగాకును కాల్చి యందులో నీళ్ళుపోయని సున్నమువేసి నూరి పశువులకు పురుగులుపడిన వ్రణములపైన వేసిన పురుగులు చచ్చి వ్రణములు మానును. పచ్చియాకు నూరికట్టినను పైపని చేయును. దీని మానుచెక్క లోపలికిచ్చిన ప్రాణముయొక్క నిస్సత్తువ, జ్వరము, ఉబ్బసదగ్గు మానును.

శీతాఫలము :— Anona Squamosa. White custard apple. సం* సీతాఫల, ఆతాపిఫల. హిం* సీతాఫల్, షరీఫా. కాకజేసి చలువజేయును. రక్తమును, ఇంద్రియమును వృద్ధిజేయును. మంశ

గుండెకు, మనస్సునకు బలమిచ్చుచు జీర్ణశక్తి నిచ్చును; క్రిమిని హరించును; మేహావాతము నణచును; శ్లేష్మమును బెంచును; కొద్దిగ పైత్యము జేయును; అగ్నిమాంద్యముగలవారికి జ్వరమును దెచ్చును. దీనికి విరుగుళ్ళు నీళ్ళు దాహాము పుచ్చుకొనుట. పండుగుంజు వేసి కట్టిన గడ్డలు మొదలగునవి శీఘ్రముగ పక్వమై పగులును.

శీతోదకము పుచ్చుకొనగూడనివారు:—Those who should not drink cold water. చల్లనినీళ్లు పుచ్చుకొనగూడనివారు చూడుడు.

శీతోదకము పుచ్చుకొనవలసినవారు:—Those who should drink cold water. చల్లని నీళ్ళు పుచ్చుకొనవలసినవారు చూడుడు.

శేవ్యం:—చెవ్యము చూడుడు.

శొంఠి:—Zingiber Officinale. Eng. Dry ginger. సం* శుంఠీ, మహౌషధీ, శుష్కార్ద్రి. హిం* శోంఠ్. దీని చూర్ణముగాని, నీళ్ళతో నూరి తీసినరసముగాని, కషాయముగాని కారముగ నుండును; కాక జేయును, రుచిబుట్టించును; జఠరదీప్తిని, బలమును, వీర్యవృద్ధిని, కాంతిని, మనోవికాసమును, కండ్లకు నిర్మలమును ఇచ్చును; గుండెల నొప్పి, ఊపిరిగొట్టునొప్పి, హృద్రోగము మానును. జీర్ణము గావించును; అరుచి, చర్ది, శ్లేష్మము, అగ్నిమాంద్యము, అజీర్ణము, వాతము, కఫరోగము, కఫవాతము, కడుపునొప్పి, జ్వరము, మలబద్ధము, కడుపుబ్బరము, పీనస, ఉదరము, శ్వాస, కాస, మూలవ్యాధి, అన్ని శిరోరోగములు, పాండువు, గ్రహాణి, కడుపులోనిబల్ల, శ్లీపదమను ఏనుగుకాలి రోగము, క్రిమి వీనిని హరించును. విరేచనము గావించును; ఆమవాతము (Rheumatism) రాకుండ నాపును. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 అణాల యెత్తువరకు. రసముయొక్క మోతాదు 2-3 తులముల యెత్తు. శొంఠిని సారాయిలో నూరి పట్టువేసిన పక్షవాతము, వాతపునొప్పులు, మేహావాతపు నొప్పులు

హరించును. శొంఠిని సైంధవలవణము లేక ఉప్పునీళ్ళలో అరగంట సేపు నాననిచ్చి యాశొంఠి నిప్పులపైన కొద్దిగ కాల్చి తీసి కాలిన దానిపై పొప్పర కత్తితో గీసివేసి నూరి మెత్తగ చూర్ణముచేసి దానిని 1 మొదలు 4 చిన్నముల యెత్తుచొప్పున దినమునకు 2-3-4 మార్లు తేనెతోగలిపి పుచ్చుకొనిన దగ్గు, శ్లేష్మము లేక కఫోద్రేక ములు, ఎక్కిళ్లు, గొంతుకనొప్పి వీనిని హరించును; జఠరదీప్తి నిచ్చును; కడుపులోని వాతమును వెడలించును లేక హరించును. శొంఠిని రాత్రి యావుమజ్జిగలో నానబెట్టి ఉదయమున ఆమజ్జిగతో నాశొంఠిని నూరి సుమారు కుంకుడు కాయలవలె మాత్రలుచేసి వానిని పూటకు 1-2 మాత్రల చొప్పున 2-3 దినములు పుచ్చు కొనినను వేడియన్నముమీద 4-5 చిన్నముల యెత్తు శొంఠిచూర్ణ మును వేసి యిందుపైన సుమారు తులమెత్తు బాగుగ మరిగిన నెయ్యివేసి వీనిని ప్రథమకబళముతో పుచ్చుకొనినను గ్రహణిని, రక్తగ్రహణిని కట్టును. శొంఠిగంధమును కణతలకు పట్టువేసిన తల నొప్పి, పార్శ్వపు తలనొప్పి నయమగును; శొంఠిగంధములో కొద్దిగ నల్లమందు గలిపి నొప్పిగలచోట దట్టముగ పట్టించి నిప్పుతో కాచిన చిగురువాపు, పిప్పిపంటినొప్పి, తలనొప్పి, పార్శ్వపు తలనొప్పి, వాతపు, మేహవాతపు నొప్పులు హరించును. శొంఠి, సోపు వేసు వేసుగ వానిని చూర్ణించి సమభాగములుగ గలిపి యాచూర్ణమును పూటకు బేడెత్తు మొదలు పావలాయెత్తు చొప్పున దినమునకు 2-3 పూటలను నీళ్ళతో పుచ్చుకొనినను, చిక్కగ దీసిన శొంఠిగంధ ములో తగుమాత్రము నల్లమందు గలిపి యాగంధమును ఇనుప గరి టెలో నుడికించి సెనగగింజలంత మాత్రలుచేసి యామాత్రలను పూట కొకటిచొప్పున బుచ్చుకొనినను నీళ్ళవిరేచనములు కట్టును. పైచూర్ణము వలన కడుపు కుట్ర, కడుపులోని వాతము

హరించును. శొంఠిని యావుపెరుగుతో నూరి పెరుగు గలుపుకొని త్రాగిన తుమ్మెదకాటు బాధ నివృత్తించును.

శృంగాటకము:—కొవిలదుంపలు చూడుడు.

శృంగిభస్మము:—Horn of spotted deer-calx of. అనగా దుప్పి కొమ్మును చిన్నచిన్న ముక్కలుగాజేసి బియ్యపుకడుగులో నానవేసి కడిగిన శుద్ధియగును. ఆవుపాలతోగాని, కలబంద రసముతోగాని నూరి బిళ్ళలుజేసి ఎండించి, మూకుడుయందుంచి, శీలమన్ను యిచ్చి 100 పిడకలతో పుటముబెట్టిన భస్మమగును. పూటకు చిన్నమెత్తు అనుపాన చూర్ణములతో గలిపి పొట్లములుగట్టి అనుపాన భేదములుగా నిచ్చిన మేహశాంతిజేయును. ఉదుసు, వేడి తగ్గించును. మేహశూలలు హరించును. గుండెనొప్పి, హృద్రోగము, వేడిదగ్గు, ఉబ్బసము, జీర్ణజ్వరము, కుసుమరోగములు వీనిని హరించును. శగరోగముసకుకూడ పనిజేయును. వెన్న, పంచదార, ఆవునెయ్యి మొదలగు అనుపానములతో నివ్వవలెను. వేడిచేయు రసములతో నూరి పుటముబెట్టిన వేడిజేయును. వాతహరముగ నుండును. మరియు కీళ్ళనొప్పులు, మేహవాతపునొప్పులుకూడా పనిజేయును.

శ్రీగంధము:—మంచిగంధము చూడుడు.

శ్రీచూర్ణము:—Powder for marking on the forehead. దీనిని ధరించుటవలన ముఖమునకు అందము వచ్చును. మనస్సునకు సంతుష్టి, సంతోషమును గలుగజేయును. తేజస్సును, బలమును ఇచ్చును. గాయమును మాన్పును.

శ్రీవేష్టకము:—అనగా గంధఫెరోజా. గంధఫెరోజా చూడుడు.

శ్వేతాభ్రక భస్మము:— Talc or mica white-calx of. నల్ల ఉమ్మెత్తయాకుల రసముతోగాని తెల్లఉమ్మెత్తయాకుల రసముతోగాని నూరి 10 గజపుటములు వేసి చేసినది కొద్దిశాకజేయును;వాత

మణచును; వీర్యపుష్టి, బలము జేయును ఉబ్బు, పాండువు, ప్రమేహము, ఇంద్రియనష్టము, పొడిదగ్గు, హృద్రోగము, గుండెలలో నొప్పి వీనిని హరించును. నల్లఉమ్మెత్తరసములో నూరుపుటములు వేసిన భస్మము సంజీవవలె సమస్తరోగములను పోగొట్టును; ఆయురారోగ్యముల నిచ్చును; వీర్యపుష్టి, స్మృతి, బుద్ధిబలము వీనిని గలుగజేయును. మోతాదు పూటకు 2 మొదలు 4 గురిగింజల యెత్తుచొప్పున దినమునకు రెండుపూటల నియ్యనగును. పండుతమలపాకులో నుంచి నమలి తినవచ్చును. మరియు నీభస్మమునకు శుద్ధ రజిత భస్మమునకు గలిగిన గుణములు గలిగియుండును.

స్రోతాంజనము:—A kind of antimony. ఇది ఒక జాతి సురమారాయి. క్రమముగ శుద్ధిచేయబడినది, వ్రణములు, వాతము, పైత్యములు, ముఖ, నేత్ర, నాశికారోగములు, ఎక్కిళ్ళు, శ్వాస, కాస, విషదోషములు వీనిని హరించును.

—స—

# ష

షడూషణములు:—పంచకోలములు చూడుడు.

షష్టిశాలు:—A kind of paddy. అనగా ఆరుమాసములకు పండెడు ధాన్యవిశేషము. దీని యన్నము చమురుగలిగి లఘువుగ, రుచిగ నుండును; విరేచనబద్ధము, చలువజేయును; త్రిదోషహరమైనది; జఠరపుష్టి నిచ్చును; సర్వదోషములను హరించును; పథ్యమైనది. దీని యజీర్ణమునకు విరుగుళ్ళు 1 తెల్లఉత్తరేణిక్షారము, 2 నువ్వులనూనె.

షాజీర:—Carum carmi. సం॥ కృష్ణజీరక. హిం॥ షా, జీరా. వేడిజేసి యార్చును; వేడి వణచును; శ్లేష్మమును హరించును; కర

గించును. శుభ్రపరచును. కొద్దిగ బిగపట్టును. దీనిచూర్ణము నశ్యము చేసిన ముక్కువెంట పడురక్తము (రక్తపైత్యము) కట్టును;సిరకాతో గాని, నీళ్ళతోగాని పుచ్చుకొనిన దగ్గును, ఉబ్బసదగ్గును అణచును, ముంతగుండె జలుబుచేత అదరుదానిని(Palpitation)బాగుచేయును. పొట్టకు, ప్రేగులకు, కార్జము (Liver) నకు, గురదాల (Kidneys) కు సత్తువజేయును; ఆకలి బుట్టించును; వాతము, త్రేనుపులను, ఎక్కిళ్ళను, కడుపులోని దుష్టనీరును హరించును; దీని ననుదినము బుచ్చుకొనిన దేహము ఎండిపోవుట, పచ్చబడుట వీనిని నివృత్తించును; కొద్దిగ నల్లదబ్బ (Spleen) కు నష్టముగేయును; దీనికి విరుగుడు బాదముజిగురు. మోతాదు పూటకు బేడయెత్తు మొదలు అర్ధరూపాయి యెత్తువరకు.

షేరువా:—Soup. మాంసరసము చూడుడు.

—౦—

## స

సంగ్‌జరాహత్ లేక సంగేడరాహత్·—శంఖకీరము చూడుడు.

సంద్రచెట్టు:—చంద్రచెట్టు చూడుడు.

సంతోషము:— Gladness or Joy. అనగా ఆనందము. సర్వేంద్రియములకు బలము నిచ్చును; ధాతువులను సౌమ్యపరచును; దేహపుష్టిని, బుద్ధిబలిమిని గలుగజేయును; కొన్నిరోగముల నాటంకపరచి మరికొన్ని రోగములను బోగొట్టును. ఆయుర్వృద్ధి నిచ్చును.

సందువాచేప:—Pomfret. దీనిమాంసము రుచిగ నుండును; త్వరగ జీర్ణమగును; బలము జేయును; వ్యాధిగ్రస్తుల కనుకూలముగ నుండును; రాత్రిపూట కూరగ బుచ్చుకొనదగియుండును. దేహారోగ్యము

గలవారును, స్త్రీ దేహప్రయాస పడువారును పగటిపూట కూరగను పుచ్చుకొనదగియుండును.

సంపెంగ చెట్టు:— Michelia chempaka. M. Muranticca. Eng. Gold flower tree. సం॥ చంపక, సుకుమార, హేమపుష్ప. హిం॥ చంపా. దీనిని సకలగుణ సంపెంగయని, చాంపేయమని, కాంచనవృక్షమని, స్వర్ణవృక్షమని, బంగారుచెట్టని యనేక పేర్లు గలవు. దీనిపువ్వులు పసుపుపచ్చగ సువాసనగలిగి యుండును. దీని చెక్కరసము కారముగ, చేదుగ నుండును; కఫపైత్యములను, విష దోషమును హరించును. దీని మానుచెక్క (యెండినది) గాని, వేరు చెక్కగాని నూరి పెరుగులో గలిపి పూసిన గడ్డలు హరించును. శుభ్రపరచును; త్వరగ చీముపట్టి పగులజేయును. దీనివేరు తేలిక కషాయము లేక చూర్ణము ఋతురక్తమును జారీచేయును; విరేచనము జేయును. మానుచెక్క జ్వరము హరించును. గొయాకం (Guaicum) అను సీమమూలికకు బదులుగ వాడతగియుండును; దీపనకారి (Stimulant); శ్లేష్మమును వెడలించును. బిగదీయును, (Astringent); బలముజేయును; మూత్రము గావించును. వరుస జ్వరమును కట్టును. ముప్పావుశేరు నీళ్ళలో 5-6 తులముల చెక్క వేసి సగము నీరిగురువరకు కాచి దించిన కషాయమగును. ముప్పావు సేరు నీళ్ళు బాగుగ మరగనిచ్చి అందులో 8-10 తులముల చెక్క వేసి మూతబెట్టి అరగంటవరకు నుంచి వడపోసిన తేలిక కషాయమగును. కషాయపు మోతాదు పూటకు 8 మొదలు 6 తులముల యెత్తువరకు. తేలిక కషాయపు మోతాదు 4 మొదలు 10 తులముల యెత్తువరకు నియ్యనగును. చూర్ణపు మోతాదు 2 మొదలు 6 చిన్నముల యెత్తువరకు. దీని యాకులకు నెయ్యిబూసి వానిపైన శీలకర్ర చూర్ణము జల్లి వానిని తలకు కట్టిన బాలింతలకు వచ్చు వెర్రి, సంధి, మతిచాంచల్యపు టుద్రేకము అణగును. ఆకులమీద

కత్తితో కోతలుకోసి నీళ్ళలో నానబెట్టి యానీళ్ళు కండ్లలోపోసిన దృష్టికి కాంతి, బలము కలుగును; ఆకుపసరు తేనెతో నిచ్చినకడుపు నొప్పి నిమ్మళించును; ఆకుపసరు నిచ్చిన క్రిమిహరించును. జ్వరమును కట్టును; బలముజేయును. ఆకుపసరు మోతాదు 3-4 తులముల యెత్తు, మరియు చెట్టుసంపెంగ, రేకుసంపెంగ చూడుడు.

పువ్వులు సుకుమారమైన సువాసన గలిగియుండును. ఎక్కువపని జేయును. చలువ, మేహశాంతి, వీర్యవృద్ధి. బలము జేయును; పొట్టకు బలమిచ్చును. పొట్టలోని వాతమును వెడలించును. అగ్నిమాంద్యము (Dyspepsia) ను, వికారమును, జ్వరమును, ఈడ్పులను (Spasms) హరించును. గురదాల (Kidneys) వ్యాధి, సెగ రోగము వీనిని శమింపజేయును. మూత్రము గావించును. దీపన మును గలుగజేయును. ఈపువ్వులయొక్క తేలిక కషాయము, కషాయము, అరఖు(Tincture) చేసి వాడనగును. పువ్వుల తేలిక కషాయము చేసెడు క్రమము సుమారు 60 తులములయెత్తు మరుగు నీళ్ళలో 7-8 తులములయెత్తు పువ్వులు వేసి యరగంటయుంచి నీళ్ళు వడపోసిన తేలిక కషాయమగును. పైప్రకారము పువ్వులు నీళ్ళలో వేసిసగమిగరకాచిన కషాయమగును. మోతాదు 4 మొదలు 8 తులముల యెత్తువరకు. అరఖు చేయుక్రమము 60 తులముల యెత్తు ఘాటుసారాయిలో 7-8 తులములయెత్తు పువ్వులు వేసి యూర నిచ్చిన యరఖు అగును. అరఖు మోతాదు 60 మొదలు 120 చుక్కలవరకు, కషాయములుగాని, యరఖుగాని దినమునకు 3-4 సార్లు ఇయ్యనగును. అరఖు యెక్కువ పనిజేయును. పువ్వుల చూర్ణ ములో నూనెగలిపి తలకుపూసిన తలదిమ్ము (Vertigo) నిమ్మళించును; పువ్వులను నూనెతో నూరి యానూనె ముక్కులో పోసిన దుర్గంధపు చీము, నీరుకారు పీనసరోగము మానును. పువ్వులలో

తేసిన నూనె సువాసనగ నుండును. తలకుపూసిన తలనొప్పి, నేత్ర రోగములు హరించును; మర్దనచేసిన ఆమవాతపు నొప్పులు (Rheumatism), వాతపు మేహవాతపు నొప్పులు కుదురును. పండు చేదుగ నుండును; చలువజేయును; అగ్నిమాంద్యము (Dyspepsia), వికారము, జ్వరము వీని నణచును; కాళ్ళ పగుళ్ళను మాన్పును. విత్తుల తైలమును పొత్తికడుపున పూసిన కడుపులో వాతమును, కడుపుబ్బరమును నివృత్తించును; కాళ్ళకు పూసిన కాళ్ళపగుళ్ళు మాన్పును. ఈ చెట్టు నీడ చల్లగ, మనోహరముగ నుండును; వాతపైత్యముల నణచును.

సంబరేణి:—A medical creeper growing plentifully in moist places. సం॥ సప్తలా, భూరిఫేనా. హిం॥ సాతల్. ఇది నీటివార నేలప్రాకెడు చిన్నయాకులుగల చెట్టు. దీని సమూలపు రసము లేక కషాయము మూత్రము గావించును; విరేచనము జేయును; మలమూత్రబద్ధమును విప్పును. రసపుమోతాదు 2-8 తులములమెత్తు. కషాయపు మోతాదు 3 మొదలు 6 తులముల మెత్తువరకు. దీని రసములో మట్టి తైలము గలిపి మర్దనచేసిన వాత, మేహవాతపు నొప్పులు హరించును. దీని సమూలమును నూరి కొద్దిగ యాముదము పూసి పగులని గడ్డలకు వేసి కట్టిన త్వరలో చీముపట్టి పగులును.

సగ్గుబియ్యము:—Sago. దీనితో కాచిన జావ లేక వండినయన్నము జిగటగ, తేలికగ నుండును; శీఘ్రముగ జీర్ణమగును; మృదువుగ నుండును; పొట్టకు బలమిచ్చును; గ్రహణిని కట్టును; కొద్ది కాక జేయును; మూత్రము గావించును; విరేచనము జేయును; జ్వరము తగిలినవారికి, గ్రహణి విరేచనములు గలవారికి సగ్గుబియ్యము నీళ్ళతోగాని, పాలతోగాని జావకాచి అందు ఉప్పుగాని, పంచదార

గాని కలిపియిచ్చిన అనుకూలముగ నుండును; సగ్గుబియ్యముతో పాయసముకాచి అందు ఏలకాయల చూర్ణము, కిసిమిసిపండ్లు, జీడిపప్పు కలిపినది రుచిగా, మనోహరముగా నుండును. సులభముగా జీర్ణమగును. వీర్యవృద్ధి, బలముచేయును. ఆరోగ్యముగా నుంచును. కాకకీటులకు నష్టముచేయును. దీనికి విరుగుడ్లు 1 నెయ్యి, 2 పులుసు.

సజ్జాక్షారము:—Soda carbons impure. Eng. Dhobis earth. సం॥ స్వర్జికా, సర్జిక్షారః, హిం॥ సజ్జీ. అనగా సజ్జాఖారము. దీనిని సేవించిన రక్తవాతము, క్రిమి, గుల్మము, ఉదరము, ఉబ్బు, హృద్రోగము, శ్వాస, కాస, అపస్మారము, బిళ్లలు వీనిని జయించును; జఠరదీప్తి నిచ్చును; కడుపులోని మంటను పోగొట్టును; దేహములోని మలములను వెడలించును; అగ్నిమాంద్యము (Dyspepsia), పుల్లత్రేపులు, గండమాలలు వీనిని పోగొట్టును; అరుచి, పైత్యము, పైత్యవమనము, పైత్యశూలలు, అజీర్ణము, పరిణామశూల వీని నణచును. మోతాదు 10 మొదలు 40 గోధుమగింజల యెత్తువరకుగాని, యుక్తకాల యుక్తిక మోతాదుగ గాని దినమునకు రెండు వేళ మహాసమాన్న వినియోగపడును. దీనిని నీళ్లతో కలిపిగాని నీళ్లతో కలిపి అందులో నిమ్మపండ్లరసము కలిపిగాని యితర అనుపానములతో గాని పుచ్చుకొనవలెను.

జసత్తు, దీనిభస్మము:—Zinc and its calx. సం॥ జసద. హిం॥ జస్త్, జస్తా. క్రమముగ శుద్ధిచేసి చేయబడిన దీని భస్మము వగరు, చేదుగ నుండును. పైత్యమును, సర్వకుష్ఠరోగములను, పైత్యశ్లేష్మములను, దగ్గులను హరించును. ఉత్తరేణి, తెల్లగురివిందాకుతో తిరగమాతచేసినది సుదాంగ్యోగములను నిర్మూలముతో తయారుచేసినది కండ్లలో రోగములనుచేసిన ఎఱుపు, దురద, పోట్లు, నీరుగారుట మొద

లగు నేత్రములకును ఇప్పనూనెతో తయారుచేసినది యకృత్ ప్లీహ రోగములకును సౌమ్యమైన మూలికలతో తయారుచేసినది మేహ శాంతి జేయును. కుసుమ రోగములు, వీర్యనష్టము, హృదయ రోగ ములమీదను బాగుగా పనిచేయును. అనుపాన భేదములుగా యుప యోగించవలెను. మోతాదు పూటకు 2 మొదలు 4 గురిగింజల యెత్తువరకు. సత్తుతో పాత్రలను తయారుచేయుదురు.

సత్తుపిండి:—Flour of fried rice &c. బియ్యము, గోధుమలు, పెసలు, సెనగలు మొదలగువానిని కొద్దిగ వేయించి విసిరిన మెత్తని పిండి స్వాదుగనుండును; చలువ జేయును; త్రిదోషములను హరిం చును; క్షుద్బాధను, మార్గాయాసమును బోగొట్టును.

సదాపచెట్టు:—Ruta graveolens. Peucedanum graveolens. Anethum sorva. Eng. The garden tree. సం* శతపుష్పా, మిసి. హిం* సతాఫ్. దీని పచ్చియాకురసము కారముగ, చేదుగ నుండును. గబ్బువాసన గలిగియుండును; శాక జేయును; కరగిం చును; పోగొట్టును; శ్లేష్మము, కఫము, పైత్యము, వాతము, జ్వరము, క్షయ, క్రిమి, విషము, మేహము, మూత్రకృఛ్రము, గుల్మము, వమనము, నేత్రరోగము, మేహవ్రణములు, కామిల, పాండువు, వాత, మేహవాతపు నొప్పులు వీనినన్నిటిని జయించును; బలము జేయును. దీని యాకుధూపమువలన భూతభయము నివర్తిం చును; శిశువులకు ఎక్కిలి మేలుజేయును; పొత్తికడుపులోని రోగ ములను పోనణచును; జఠరాగ్నిని వృద్ధిజేయును; నరములకు సత్తువ జేయును; మూత్రమును జారీచేయును; విరేచనము గావించును; యోనిరోగమును మాన్పును; ఎగుపులను (ఈడ్పులు) కట్టును.ఋతు రక్తమును జారీచేయును; మూర్ఛ, అపస్మారము (Hysteria) ను పోగొట్టును; అజీర్ణపు కడుపునొప్పిని పోగొట్టును; తేలు విషమును

హరించును; బుద్ధికి చురుకు బుట్టించును. ఆకును ఆముదముతో వెచ్చజేసి కట్టిన గడ్డలను హరించును. లేక పక్వపరచును. దీనిపచ్చి యాకుతోగాని, యెండుయాకుతోగాని తేలిక కషాయము కాచి యాసనము వెంట వస్తి (పిచ్చికారీ) చేసిన బిడ్డలకు అజీర్ణమువలన గలిగిన ఈడ్పుల (Convulsions)ను మాన్పును. పచ్చియాకు నూరి అరాకు (Arrack) సారాయి లేక బ్రాందీ లేక చిగురు సారాయిలో గలిపి పక్షవాతముయొక్క ప్రథమదశలో పూసిన లేక పట్టువేసిన ఆవ్యాధి కుదురును. ఎండినయాకులు పొగ వేసిన బిడ్డలదగ్గు నిర్మూలించును. దీని యాకులను నీడను ఎండించి చాతుర్జాతములతో గలిపియిచ్చిన అగ్నిమాంద్యము (Dyspepsia) కుదురును. ఎండిన యాకుల చూర్ణములో పచ్చకర్పూరము, తాటిబెల్లము, పటికిపంచదార గలిపి యిచ్చిన గర్భస్రావమును గలిగించును. ఆకుచూర్ణము లోపలి కిచ్చు మోతాదు పూటకు 10 మొదలు 30 గోధుమగింజల యెత్తుగాని కొంచె మెక్కువగాని యీ చొప్పున దినమునకు 2 సార్లుగాని, 3సార్లుగాని నియ్యవలెను. దీని యాకుతో చేసిన నూనెమోతాదు 1 మొదలు 4 చుక్కలవరకు. దీని పచ్చియాకు రసముయొక్క మోతాదు బిడ్డలకు 5 మొదలు 15 చుక్కలవరకు. పెద్దవాండ్రకు 10 మొదలు 40 చుక్కలవరకు నియ్యవలెను. దీనిరసము యెక్కువ పుచ్చుకొనిన, విషతుల్యముగ నుండునుగావున కొద్ది మోతాదులతో ప్రారంభించి నియ్యవలెను. రక్తపైత్యపురోగులకును, అధిక బలుపుచే అపస్మారములు పడువారికిని, తీవ్రము సన్నిహితముగ నున్నవారికిని దీని నిచ్చు నెడల మిక్కిలి జాగ్రతతో నుపయోగింప దగియుండును.

సదాపవిత్తులు:—Dill seeds. జ్వర తాపమును, శ్లేష్మమును గొట్టును. మరియు పిన్నసదాప చూడుడు.

సద్యోఘృతము:—Butter just clarified. అప్పుడు వెన్న గాచిన నెయ్యి మనోహరముగ, రుచిగ నుండును; విషమును హరించును; నేత్రములకు చలువచేయును; వీర్యవృద్ధి, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి, కాంతి, బుద్ధిబలిమి వీనినిచ్చును, కొద్దిగ వేడిజేయును; బాలురకు, వృద్ధులకు జఠరాగ్నిని వృద్ధిబొందించును; మిక్కిలి యనుకూలముగ నుండును.

సన్నజాజి:—Double jasmine variety of. విరజాజి పుష్పమువలె నుండును. ఆకు, పువ్వు కొద్ది భేదముగానుండును, విరజాజి గుణములు గలిగియుండును. విరజాజి చూడుము.

సన్నపాయిలకూర:—పాయిలకూర చూడుడు.

సన్నరాస్నము:—Vanda roxburghii, Cymbidium tessaloides, smaller variety of. Eng. Galangal lesser. సం* రాస్నా, గంధనాకులీ. హిం* రాస్నా, రహాసనీ. దీనిని సన్న దుంపరాష్ట్రిమనియు కళింగరాష్ట్రిమనియు నందురు. సువాసనగా, చేదుగ, కారముగ నుండును; కాకజేయును; శ్లేష్మము, వాతము, శ్వాస, కఫము, విషము వీనిని హరించును; అగ్నిమాంద్యము (Dyspepsia) ను పోగొట్టును; వాత మేహవాత, ఆమవాత నొప్పుల (Rheumatism) హరించును. నరముల రోగములను హరించి సత్తువజేయును. వీర్యపుష్టి జేయును. పొట్టకు బలమిచ్చును. అతిమూత్రరోగుల కిచ్చిన మూత్రమును తగ్గించును. నరములకు సత్తువజేయును. దీనిని నమలిన నోటి దుర్గంధమును, ద్రవముమింగిన గొంతుక నసను హరించును. బిడ్డలకు తినిపించిన త్వరగ మాట్లాడుదురు. దీని చూర్ణములో నూనెగాని, నీళ్ళుగాని పోసి కలిపి పూసిన మచ్చలు మానును. మరియు దీనికి దుంపరాష్ట్రిపు గుణములు గలవు. దాని వలెనే దీనియొక్క చూర్ణము, కషాయము, గంధము

వాడవచ్చును. దాని మోతాదుల ప్రకారము దీనిని గూడ నియ్య వచ్చును. దుంపరాష్ట్రిము చూడుడు.

సన్నసూదు లను ధాన్యము:—A sort of paddy. దీని యన్నము శూలలను హరించును; లఘువుగ జీర్ణమగును; వీర్యవృద్ధి, బలము, కొంచెము మత్తు జేయును.

సన్నాట్రగడాధాన్యము:—ఆట్రగడా ధాన్యము చూడుడు.

సన్నావాలు:—Brassica nigra & B. Campestris. Eng. Black mustard or mustard small sort. సం॥ రాజసర్షప, కృష్ణసర్షప. హిం॥ రాయిూ, చోటాసరసోం. వీనిని సరసావాలనియు నందురు. వీనిని నలియగొట్టకుండ నీళ్ళతో బుచ్చుకొనిన పైత్యము, కాక జేయును; వాతము నణచును; అగ్నిదీప్తి నిచ్చును; వీర్యమునకు వేడిపుట్టించును; దురదలు, విదాహము, కడుపుబ్బు వీని నణచును; రక్తపైత్యమును బుట్టించును. వీని నూనెలో హారతికర్పూరము గలిపి పూసిన లేక మర్దన జేసిన మాంసపు కండల వాతపు మేహవాతపు నొప్పులు, మెడనరములయొక్క బిగింపు (Stiff neck) మొదలగు నవి నివృత్తించును. వీని చమురు వంటికి బూసికొని స్నానము జేసిన చర్మమునకు బలముగలుగును; చల్లగ, సౌఖ్యముగ నుండును. నల్ల మందు దీనిలో గలిపిన దానివిషము యెక్కువయగును. కాళ్ళు చేతులు కీళ్ళునొప్పులుగల జ్వరము (Dengue fever) గలవారికి వంటికి బూసిన మేలుజేయును. దీనిని రొమ్మునకు బూసిన ముఖ్యముగ బిడ్డలరొమ్మునకు బూసిన వగర్పుగల దగ్గు (Bronchitis) నివ్మరించును. దీని (ఆవాల) పిండి నీళ్ళలో గలిపిగాని నీళ్ళతో నూరిగాని పట్టు (Poultice) నొప్పిగలచోట వేసిన నొప్పి హరించును. ఇవి పెద్దావాలకంటె బలముగ పనిజేయును. వీని దుర్గుణములు, విరుగుళ్ళు, మోతాదులను గురించి ఆవాలు చూడుడు.

సపోటాచెట్టుపండు:— Sapota. యీపండ్లు కోడిగ్రుడ్లవలె కోలగా గుండ్రముగా నుండును. గుండ్రముగా చిన్న వెలక్కాయలవలె నుండెడి మరియొకరకముగూడ గలదు. ఈపండ్లుపైచర్మముపలచగను, గరుకుగను, మట్టిపూసిన రంగుగలిగియుండును. లోపల 3 నల్లనిగింజ లుండును. చర్మము తీసివేసి లోపలిది తినిన మృదువుగ, తియ్యగ, రుచిగానుండును. మంచి రక్తవృద్ధి, వీర్యవృద్ధి జేయుటయేగాక సమస్తధాతువులకు బలము జేయును. వుష్ణతత్వములు గలవారికి మిక్కిలి అనుకూలముగ నుండును. రోగులు, ఆరోగ్యము గోరు ప్రతి వారును పుచ్చుకొనతగినవి. దినమునకు 5-6 పండ్లు సేవించవచ్చును. హెచ్చుగ దినిన అగ్నిమాంద్యము గలుగజేయును.

సఫేదా:— Plumbi carbonas. Eng. White oxide of lead. హిం* సఫేదా. దీనిని సీసముతో చేయుదురు. దీనితోచేసిన పలాస్త్రీ వేసిన కంతులు హరించును; వ్రణములు మానును; దీనిని కొబ్బరి నూనెలోగాని, వెన్నపూసలోగాని కలిపి రాయుచుండిన కురుపులు మానును. నొప్పియణగును. దీనితో తెల్లరంగు వేయుదురు. ఈరంగు వేయువారికి పక్షవాతము కనుపించును.

సబ్జాచెట్టు విత్తులు:—రుద్రజడచెట్టు విత్తులు చూడుడు.

సబ్బు:—Indian soap. సబ్బుతో శరీరము, ముఖము తోముకుని స్నానము జేయుచుండిన సువాసనగ నుండును. వంటిచమట, జిడ్డు పోయి శుభ్రమగును. ఆరోగ్యముగా నుండును. సబ్బు నీళ్ళలో గలిపి ఆనీళ్ళతో గుదస్థానమునుండి పిచికారీ (Enema) చేసిన విరేచనము బాగా యగును. పొట్టలోని మలమంతయు వెడలించును. వాతము, కడుపుబ్బరము పోవుటయేగాక రోగనివారణ మగును. దీనిని లోపలి కిచ్చిన గుల్మవాతము, మూత్రకృఛ్రము వీనిని హరించును; విరేచన కారి; పుండ్లకు పైనపూసి, కడిగిన శుభ్రపరచి త్వరగ మాన్పును;

దీనిని వేడినీళ్ళలో గలిపి యానీళ్ళతో చెవిలో పిచికారీ (Syringe) చేసిన చెవినొప్పి, పుండు, కర్ణవాతము హరించును.

సముద్రపు కొబ్బరికాయ:—**Lodoicea sechellarum. Eng. Sea cocoanut.** హిం* దరియాకానారియల్. దీనికొబ్బరి దోషజ్వరమును, సుఖరోగమును, ఓడవాండ్రకువచ్చు ఒక విధమైన పాండురోగమును నివారించును; విషము, సన్నిపాత జ్వరములలో నాలుక మీద గరి లేక ముండ్లలాగున యగు జిహ్వాదోషమునకు దొండకాయను కుమ్ములోబెట్టితీసిన రసములో సముద్రపు కొబ్బరి, అక్కలకర్ర, సైంధవలవణము, ముత్యము, పగడము అరుగదీసి దానిని నాలుకకు రాసి బంగారపుతీగెతో గీయుచుండిన ముండ్లు పూడిపోవును; జిహ్వాదోషమును హరించును. మోతాదు 2 అణాల యెత్తు. యీకొబ్బరి, దుప్పికొమ్ము, మిషిణివిత్తులును గంధముదీసి పట్టించుచుండిన మాంసపుగ్రంధులు (Enlarged glands) హరించును. యీకొబ్బరిగంధము యిచ్చుచుండిన అతి మూత్రము (Diabetes) లో పంచదార (Sugur) పోవుట తగ్గును.

సముద్రపుచేపలు:—**Sea fish.** వీనిమాంసము చమురుగలిగి రుచిగా గురుత్వముగ నుండును; పైత్యముజేయును; వాతము, మేహము, క్రిమి వీనిని హరించును; వీర్యపుష్టి జేయును; తేజస్సునిచ్చును; శ్లేష్మమును బెంచును. మూత్రమును గావించును; రక్తపైత్యము బుట్టించును.

సముద్రపాలతీగె విత్తులు:—వృద్ధదారుచూడుడు.

సముద్రపునురుగు:—**Sapia officinalis.** సం* సముద్రఫేన, ఉదధిమల, అబ్ధికఫ. హిం సముందర్ ఫేన్, సముందర్ ఝాగ్. యిది తెల్లగ ముద్దవలెనుండి అతితేలికగనుండును. కొద్దిగ వగరుగ, నుండును. నేత్రరోగులకుజేయు ఔషధములలో కలిపివాడిన కండ్లలో

పువ్వులు, దుర్మాంసములు మొదలగు నేత్రరోగములు హరించును, అనుపానభేదములుగా నిచ్చిన గుల్మము, బల్లలు, వాతము, కఫము, శూల, మూలవ్యాధి వీనిని జయించును. వాచాశక్త్యము నిచ్చును. మోతాదు ¼ మొదలు అణా యెత్తువరకు. దీనిని మాచ్కుండాకు రసములో గలిపి రాసిన దురదగల చర్మరోగములు మానును.

సముద్రోదకము:—Sea water. ఉప్పగ, చేదుగనుండును. తీవ్రమైన వేడిజేయును. వాతపిత్తశ్లేష్మములను హెచ్చించును. ఉబ్బు వణచును; వికారపెట్టును. వాంతిజేయును. పొట్టకు హానిజేయును. దీనికి విరుగుళ్ళు 1 నెయ్యి, 2 మాంసపు పేరువా, 3 చేపలు.

సముద్రలవణము:—ఉప్పు చూడుడు.

సరయూనది జలము:—Water of the river Sarayu. హృదయానందకరముగ నుండును. త్రిదోషహారమైనది; సువాసనగలిగి చల్లగ, మనోహరముగ నుండును మనస్సునకు శాంతి ఆనందము, బుద్ధిబలము నిచ్చును. జఠరదీప్తినిచ్చును.

సరస్వతియాకు:—Hydrocotyle asiatica, Herpestis monniera, Eng. Indian penney wort. సం* బ్రాహ్మి, మండూక పర్ణీ, మహౌషధీ. హిం* బ్రంహి, వరంభీ. ఇది నీటియొడ్డున లేచును. అకులు గుండ్రముగా 'ద' వంటి ఆకారముగా చుట్టును కంగోరాలు గలిగి కాడతో నుండును. దీనిని అరవంలో వల్లారి యాకందురు. దీని సమూలముగా యుపయోగించవచ్చును. తీపి, వగరు, చేదుగ నుండును. పైత్యము, ఉబ్బు. పాండువు, కామిల, జ్వరము, మేహపైత్యము, కుష్ఠు, దురదలు, వాతరక్తము, స్ఫోటకము మొదలగు చర్మరోగములు, వ్రణములు, క్రిములుగల వ్రణములు, బల్లలు, వాతము, కఫము, మాంద్యము, అపస్మారము, ఉన్మాదము, వెర్రి, పైత్యభ్రమ వీనిని జయించును. రక్తమును శుభ్రపరచును; విరేచ

నమును జారీచేయును; బుద్ధిని హెచ్చించును; జ్ఞాపకశక్తిని వృద్ధి పరచును;జఠరదీప్తిఆయుర్వృద్ధినిచ్చును;కంఠస్వరము బాగు జేయును, గొంతుకనొప్పి, బొంగురుపోవుట మొదలగు రోగములను హరించును, మరియు నిది చర్మవ్యాధులలో రక్తమును చక్కగ చర్మములో పారునటుల జేయును; రసిగారు పురాణపు పొక్కులు (Eczema) ను పోగొట్టును; కుష్టువ్యాధులమీద బలముగ పనిజేయును; సవాయి వ్యాధుల మాన్పును. పురాణపు మొండి గట్టివ్రణములను కంపుగల ముక్కులోపుండును, పీనస, బిడ్డల నీళ్ళవిరేచనములను, గండమాలను, గవదలు, గ్రంథులు పెద్దవికావడము (Enlargement of glands) ను, పురాణవాత, మేహవాతములను పోగొట్టును; మూత్రమును గావించును. గర్భదోషములను పోగొట్టును. ఋతురక్తమును జారీ చేయును. ఇది లోపలకిచ్చుటకు,పైనపూయుటకు నుపయోగించును. దీని ఆకుచూర్ణము పుండ్లకు, వ్రణములకు పైనజల్లవచ్చును. లేదా ఆకునూరి కట్టు (Poultice) కట్టవచ్చును; నొప్పులకు దీనితైలమును మర్దన చేయవచ్చును. ఆకుచూర్ణముగాని, సమూలచూర్ణముగాని లోపలికియ్యవచ్చును. ఆకులుగాని,సమూలముగాని నీడను యెండించి చూర్ణముజేసి వాడిన శ్రేష్ఠము. మోతాదు 5 మొదలు 10 గోధుమ గింజల యెత్తుచొప్పున దినమునకు మూడుసార్లు యియ్యవలెను; అన్నిరోగములకు ఈప్రకార మియ్యవలెను. కుష్టురోగులకు దీని సమూల చూర్ణము ఈదిగువ వ్రాసిన పద్ధతుల ప్రకార మియ్య వచ్చును. 20 మొదలు 40 లేక అంతకంటె యెక్కువ వయస్సు గలవారికి 20 గోధుమగింజల యెత్తుచొప్పున 20 యేండ్లకు తక్కువ వయస్సు గలవారికి వయసునకు దగినట్లు (Proportionately) తగ్గించి యియ్యవలయును. రెండువారములవరకు యిచ్చునది; ఆ వెనుక వారమునకు 5 గోధుమగింజల యెత్తుచొప్పున 60 గోధుమ

గింజలయెత్తు అగువరకు హెచ్చించి ఆచొప్పున నెలదినములు పుచ్చుకొనిన ఆవెనుక వారమునకు 5 గోధుమగింజల యెత్తుచొప్పున మోతాదు తగ్గించుచురాగా 10 గోధుమగింజలయెత్తు అయిన వెనుక ఆచొప్పున వారముదినములు పుచ్చుకొని యావెనుక నెలదినములు పుచ్చుకొనడము మానివేయవలెను; తిరిగి పైన వ్రాసిన ప్రకారము పుచ్చుకోవలెను. ఈచూర్ణపు మోతాదు 30 గోధుమగింజల యెత్తు అగువరకు రాత్రులయందు పరుండబోవునపుడు మాత్రము పుచ్చుకోవలెను. మోతాదు 30 గోధుమగింజలయెత్తు అయిన వెనుక అది మొదలు పుచ్చుకొను చూర్ణమును రెండు సమభాగములుచేసి ఒక భాగమును ఉదయముననను, రెండవభాగము సాయంకాలమందును పుచ్చుకొనవలెను. దీనికి అనుపానము సుమారు 8 తులముల యెత్తు వైనుసారాయిని వెచ్చజేసి అందులో బేడయెత్తుకు లోపుగ పంచదార గలిపి చూర్ణమునకు అనుపానముగ పుచ్చుకొనవలెను. వైను సారాయి దొరకనియెడల ద్రాక్షారిష్టతోను పుచ్చుకొనవచ్చును. ఈమూలిక మొదటిరోగములకు, వెర్రియెత్తినవారికి మిక్కిలి యుపయోగించును. ఇందుకు దీని సమూల కషాయములో వెన్న వేసి ఇగరబెట్టి వాడనగును. ఈమూలిక సుఖజాడ్యము, అన్నిజాతుల మొండి చర్మరోగములు గలవారికిచ్చిన శరీరతత్వమును మార్చి మేలుజేయును దీనిని నీళ్ళలోవేసి కాచి స్నానముజేసిన చర్మరోగములు మానును. మరియు దీనితో పాకము (Syrup), తైలము (Ointment), సారము (Fluid extract) కషాయముచేసి ఉపయోగింతురు. మఱియు దీని ఆకును వెచ్చజేసి మెంతులువేసి చేసిన తేలిక కషాయము బిడ్డల విరేచనములను, జ్వరమును కట్టును. కషాయపు మోతాదు పూటకు 2 మొదలు 5 తులముల యెత్తువరకు. దీని ఆకు నూరి వేసిన దెబ్బలు, గాయములు చీముపట్టకుండ

జేసి మాన్పును. నొప్పి హరించును. ఈ ఆకుతో తయారుచేసిన ఘృతముగాని, సమూల రసముగాని, చూర్ణముగాని పైనచెప్పిన మోతాదుల ప్రకారము పుచ్చుకొనిన స్వరభంగము హరించి మంచి కంఠస్వరమును గలిగించును.

సరస్వతీజలము:—Water of the river saraswati. చల్లగా, నిర్మలముగ, రుచిగనుండును. బలమిచ్చును; సర్వేంద్రియములకు నారోగ్యము గలుగజేయును. ఆయువునిచ్చును; పాపహరమైనది.

సరళదేవదారు:— Pinus longifolia. Eng. The long leaved pine. Himalayan cedar. సం॥ సరల, పీతదారు. హిం॥ సరల్. దీని కర్రమాను కషాయము లేక చూర్ణము చేదుగా నుండును. వేడిజేయును. వాతశ్లేష్మ రోగములు, ఆమవాతము, మేహవాత నొప్పులు, శరీరతాపము, మూర్ఛ, నోటివెంట నీరూరుట, స్వరభంగము, కంఠవ్రణములు వీనిని బోగొట్టును. విషదోషమును, ప్రమేహము, ప్రదరము, క్రిమిజ్వరము వీనిని హరించును. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు. చూర్ణపు మోతాదు 2 మొదలు 4 చిన్నముల యెత్తువరకు. దీని ఆకురసము చెవిలోబోసిన చెవిపోటు, చెవినుండి పురుగులు పడుట, చీము నయమగును. ఈచెట్టునుండి పుట్టెడు జిగురును గంధఫెరోజా యందురు. గంధఫెరోజా చూడుడు. దీనినుండి తీసిన తైలమునే టర్పెంటయిను (Turpentine) అందురు. టర్పెంటైను చూడుడు.

సర్జరసము:—Shorea robusta resin of. సం॥ సర్జరస, సాల నిర్యాస, రాళ. హిం॥ రాల్. ఇది ఏపిచెట్టు జిగురు. తెల్లగుగ్గిలపు ముక్కలువలె నుండును. విరచినగాజువలె మెరుగు (Transparent) గలిగియుండును. కరగించిన కరుగును. లక్కవలె సాగును, కొద్దిగ వగరుగనుండును. కొద్దిగ కాక జేయును. రక్తదోషము, జ్వరము, శూల,

అతిసారము, చెమట, వ్రణములు, విషము, విశూచి (Cholera) అరుచి, కాళ్ళపగుళ్లు వీనిని హరించును. కామవృద్ధి, వీర్యవృద్ధి, వీర్యస్థంభన జేయును. విరేచనబద్ధము గలిగించును. దీని ధూపము భూతజ్వరములు, గ్రహబాధ, సర్పి అనగా మంత్రపు కురుపులు నివారణ జేయును. దేవతాపూజకు, జబ్బుగా యున్నవారి గదుల లోను సువాసనకొరకు ధూపము వేయుదురు. దీనిని మలామాగా తయారుజేసి కవుకుదెబ్బలకు, గడ్డలకు పట్టీగా వేసిన నయమగును. దీనిని పూసిన కాలిన పుండ్లు మానును. దీనిని నూనెలో గలిపి పలాస్త్రీలు, మలామాలు (Ointments) తయారుచేయుదురు. దీనిని మెత్తగానూరి బ్రాంది, కోడిగ్రుడ్లు తెల్లసొన కలిపి నూరి పట్టు వేసిన వాత మేహవాతనొప్పులు (Rheumatic pains) బాధలు, వాపులు శమింపజేయును. యీ జిగురు అరగదీసి గూడపట్టున పట్టు వేసిన తలపోటు నయమగును. యీ జిగురు సైంధవలవణము, బెల్లము, మైనము, తేనె, గుగ్గిలము, గైరికము, వెన్న సమభాగముగా నూరి కాచిన మలామా (Ointment) అగును. దీనిని గుడ్డకురాసి కురుపులకు, గడ్డలకు, వ్రణములకు వేయుచుండిన మాని పోవును. దీనిని చూర్ణించి పంచదారతో నిచ్చిన జిగటవిరేచనములు, రక్తముపడెడు మూలవ్యాధి, పిల్లల గ్రహణివిరేచనములు కట్టును. మోతాదు 1/2 మొదలు 2 అణాల యెత్తువరకు. దీని చూర్ణము పూటకు 2 అణాల యెత్తుచొప్పున సోలెడు ఆవుపాలతో ఉదయపు పూటలు కలిపి పుచ్చుకొనుచుండిన వీర్యవృద్ధి, కామవృద్ధి గలుగును.

సర్జరసతైలము:—Oil of do. సర్జరసమునుండి తీయబడిన తైలము; విశూచి, అరుచి, చర్ది, స్ఫోటకము, పాండువు, శ్లేష్మవాతములు, కుష్టు, తామర, కురుపులు మొదలగు చర్మరోగములు మానును.

సర్జక్షారము:—సజ్జాక్షారము చూడుడు.

సర్పాక్షి పెద్ద సర్పాక్షి:— Ophiorrhiza mungos. Eng. The mongoose plant. సం* సర్పాక్షీ, సర్పగంధా. హిం* సరహాతి, దీని ఆకు, వేరు లేక సమూలరసము లేక కషాయము కారముగ, చేదుగనుండును. కాకజేయును. పాము, వెర్రికుక్క, తేలు, ఎలుక, పందికొక్కు, వీట్ల విషమును, క్రిమిరోగమును బోగొట్టును. ప్రదర మనెడు యోనిరోగము (కుసుమ) రక్తస్రావము వీనిని జయించును. కుష్ఠు, వ్రణములు, హృద్రోగములను మాన్పును. వీనిని శమింప జేయును. విరేచనము జేయును. రసపు మోతాదు 2–3 తులముల యెత్తు. కషాయపు మోతాదు 2-1/2 మొదలు 5 తులముల యెత్తువరకు.

సర్వీచెట్టు:—Casuarina tree. దీని యాకు కొమ్మలు కషాయము కాచి యిచ్చిన మూత్రబంధము విడుచును. దీనియాకు నూరి గాయ మునకు పెట్టిన మానును. దీని యెండిన పుల్లలు, ఆకులు కాల్చిన మసి కాలిన పుండ్లమీద, క్రొత్తగాయములమీద వేసిన మానును.

సవరపుతీగె:—గొంతెమగోరుచెట్టు చూడుడు.

సవీరము:—సౌవీరము చూడుడు.

సహదేవి:— Conyza cinerea, Vernonia cinerea. Eng. Ash-coloured flea-bane. సం* దండోత్పల, దేవగంధా, సహ దేవీ. హిం* సహదేయి. ఇది తెలుపు, ఎరుపు, పసుపు అను 3 భేద ములు గలవు. దీని వేరు, ఆకురసము లేక సమూల కషాయము విషమజ్వరము, రక్తపైత్యము, మేహపైత్యమును హరించును. మూత్రబద్ధమును పోగొట్టును. చెమట బుట్టించును. తేలిక నిచ్చును. వీర్యవృద్ధి జేయును. దీని కషాయముతో తేనెగాని, పంచదారగాని కలిపి యిచ్చిన గర్భిణీస్త్రీల జ్వరము గర్భవేదన నణచును. దీని

యాకు నూరి కట్టినను నూరినదానిలో కొద్దిగ ఆవునెయ్యి చేర్చి వెచ్చజేసి కట్టినను కండ్ల మెరుపులు, పోటు తగ్గును. దీని సమూలము టోపీవలె నల్లి తలకు బెట్టిన జ్వరముయొక్క యుద్రేకము తగ్గించును. దీనివేరు చితుకగొట్టి శిరస్సునకు కట్టిన జ్వరమును హరించును. నిద్రదెచ్చును. రసముయొక్క మోతాదు పూటకు 2-3 తులముల యెత్తు. కషాయపు మోతాదు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

సాంబ్రాణి అరఖు:—Oil of benzoin. అనగా సాంబ్రాణి తైలము. ఇది క్రిమిరోగములను, కుష్ఠురోగములను బోగొట్టును; రోమకూపముల వెంట దీని సువాసన వ్యాపించును. మరియు దీనికి సాంబ్రాణి గుణములు గలిగియుండును. మోతాదు 1-2 చుక్కల నీళ్ళలో వేసి గాని తములపాకుమీద వేసిగాని నియ్యనగును.

సాంబ్రాణి:—Styrax benzoin. Eng. Benzoin. హిం॥ ఊద్, లోభాన్. ఇది యొక చెట్టు జిగురు. పెనాంగు, సింగపూరునుండి వచ్చును. ధూపద్రవ్యము. మిక్కిలి సువాసనగ నుండును; త్రిదోషహరమైనది. మేహము, క్షయ, ఉబ్బసము, గ్రహణి, సంగ్రహణి, ఉబ్బు, క్రిమి వీనిని హరించును; వంటి నీరుదీయును. విరేచనబద్ధము జేయును; దంతబలము, వీర్యవృద్ధి వీని నిచ్చును. దీని ధూపము లేక పొగ శరీరమునకు, శిరస్సునకు పట్టుటవలన మనస్సునకు సంతోషమును ఆరోగ్యమును యిచ్చును. దేవతా ప్రీతికరము. గ్రహబాధ నివారణము. దీని ధూపమును రోగులు పరుండు గదులలో వేయుచుండిన ఆరోగ్యకరము. దీని ధూపమును వ్రణములకు, కురుపులకు వేయుచుండిన దానిలోనుండు క్రిములను జంపును. దుర్వాసన లేకుండ జేయును. సాంబ్రాణి, బియ్యము, మిరియాలు నూరి వుడికించి కణతలకు నొసలకు పట్టువేసిన పడిశభారము, జలుబువలన

వచ్చిన తలనొప్పులు నివారణమగును. లోపలి కిచ్చు మోతాదు 4 మొదలు 16 గోధుమగింజల యెత్తువరకు. గవ్వపలుకు సాంబ్రాణి ప్రశస్తము.

సాంబ్రాణి చెట్టు:—యీ చెట్టు సాంబ్రాణివచ్చెడు చెట్టుకాదు. ఇది చిన్న చెట్టుగ లేచును. పాలుండును. సాంబ్రాణి వాసనగల చిన్న యాకులుండును. దీని చెక్క, ఆకులు చేదుగ నుండును. వీని రసము లేక కషాయము మూత్రమును గావించును; విరేచనము జేయును; మలమూత్రబద్ధమును విప్పును; త్రిదోషములు, కడుపులో బల్లలు, గుల్మము, ఉబ్బు, ఉదరము, పాండువు, కఫపైత్యము వీనిని హరించును. ఆకులరసము మూత్రాశ్మరి, మధుమూత్రము వీని నణచును; నరములకు సత్తువజేయును; వెర్రి, మూర్ఛ, అపస్మారము, గొంతుక మూతపడుట (Hoarseness) వీనిని పోగొట్టును. ఆకులు నేతిలో వేయించి యిచ్చిన గొంతుక మూతపడుట మానును. దీని వేరు పాషాణవిషములు (Mineral poisons) ను విరుచును. ఆకులరసము బిడ్డలకిచ్చిన వాంతులు విరేచనములై దగ్గు, వగర్పు, ధ్వనిగల దగ్గు (Bronchitis) నివృత్తించును. మోతాదు అరతులము మొదలు తులమెత్తువరకు. ఆకులరసము అరతులములో 40 గోధుమ గింజలయెత్తు చంగల్వకోష్టు చూర్ణముగలిపి అందులో తగుమాత్రము తేనెగలిపి యిచ్చుచుండిన పిచ్చితనమును శాంతిపరచును.

సాంబ్రాణి పువ్వు:—Acid benzoic. అనగా సాంబ్రాణి యంత్రమున వండితీసినది. దీనినినశ్యముజేసిన వాతపైత్యములను,పడిశము, శిరోరోగములను హరించును; దేహమునకు సువాసన బుట్టించును. దీనిని తిములపాకు రసములో లవంగములు అరుగదీసి దానిలో 1 గుంజెత్తు సాంబ్రాణి పువ్వుకలిపి రోజుకు 2-3 పర్యాయములు యిచ్చిన కాస, శ్వాస, ఉబ్బసము, మేఘురంజి తగ్గును. సాంబ్రాణి

పువ్వు అరతులము, గోరోజనము పావుతులము, లవంగాలచూర్ణము బేడెత్తు కలిపి తములపాకురసముతో మెత్తగా నూరి గురిగింజపూసల వలె మాత్రలుకట్టి వుదయం సాయంకాలం రాత్రి పరుండబోవునపుడు వట్టిదిగాని తగిన అనుపానములతోగాని సేవించిన కాస, శ్వాసలు, ఉబ్బసము, క్షయ, మేహారంజి దగ్గులు, అజీర్ణవిరేచనములు నయ మగును. పిల్లలకుఁగూడ వాడవచ్చును.

సామలు:—Panicum frumentaceum. సం॥ శ్యామాకా. హిం॥ సామా, సావా. వీని అన్నము చమురుగలిగి మృదువుగ, తియ్యగ, వగరుగ, గురుత్వముగ నుండును; చలువ, వాతము జేయును; మల మును బంధించును; కఫము, పైత్యము, విషము వీనిని హరించును; వంటసేరార్చును; యీబియ్యముతో పరమాన్నముచేసి పుచ్చుకొనిన రుచిగా మనోహరముగా నుండును.

సాము చేసిన గుణము:—Practising atheltic exercises. దేహ దార్ఢ్యము, ఆరోగ్యము, శౌర్యము, ధైర్యము, భుజబలము, దేహ కాంతి వీని నిచ్చును, శ్రమకరమైనది; పైత్యమును హెచ్చించును.

సారకంద:—Dioscorea gloleosa. సం॥ గజకర్ణాలు, పిండాలు. తియ్యగ, రుచిగనుండును; బలమునిచ్చును; మూత్రము గావించును; చలువ జేయును; గురుత్వముగ నుండును; దీని కూర అపథ్యమైనది; దీనికి విరుగుళ్ళు 1 బెల్లము, 2 పులుసు.

సారపప్పు:— Kernels of the seeds of celtis orientalis. ఇది మొరలిచెట్టు పండులోని పప్పు. దీనిని చారపప్పనియు, చిరోంజి పప్పనియు నందురు. రుచిగ నుండును; వీర్యవృద్ధి, బలము నిచ్చును; పైత్యము జేయును. దీనికి విరుగుళ్ళు కరక్కాయ, కరక్కాయ పిందెల కషాయము లేక నీళ్ళలో నూరిన రసము.

సారసత్తులు:—జంతికలు చూడుడు.

సారస పక్షి:—బెగ్గురుపక్షి చూడుడు.

సారాయి:—Liquor. మద్యము చూడుడు.

సాలామిశ్రి:—Orchis mascula. O. latifolia. Eng. The salep orchid. సం॥ సథామూలీ, హిం॥ సాలమిస్రీ. యీ దుంపలు పెరిషియా, ఆఫగనిస్థానమందు విస్తారముగా దొరకును. అచ్చటినుండి బొంబాయికి ఎగుమతియగును. ఘట్టిగా, చిన్నవిగా కొద్దిగ తెల్లగ జిగురుగలిగి యుండును. వీనిని చూర్ణముజేసిగాని, పాలలోగలిపిగాని వాడుదురు. మిక్కిలి మేహశాంతి, వీర్యవృద్ధి జేయును, దేహపుష్టి, బలము నిచ్చును; వీర్యమును ఘట్టిపడజేయును; యింద్రియ నష్టము కట్టును. కామోద్దీపనమును గలిగించును. వయస్సును నిలుపును. దీని చూర్ణమును బలము, వీర్యవృద్ధి జేయును. ఔషధములు లేహ్యములలో శేర్చుదురు వీనిని పాలతో బుచ్చుకొనదగియుండును గాని పొట్టకు నష్టముజేయును. దీనికి విరుగుడు పంచదార. ఈదుంపలను ఆహారముగా వాడిన త్వరగ శీర్ణమై బలము నిచ్చును; క్షయ, రక్తగ్రహణి, మూత్రబద్ధము, లోపల పుండగుట (Internal inflammations) వీనిని పోగొట్టును. వీని జిగురు లేక గుంజును ఉప్పునీళ్ళలో గలిపిన మంచి నీళ్ళవును. వీనిని పలుచని రేకులుగ కోసి ఆవుపాలలో నాననిచ్చి యెండించి చూర్ణించి ఆచూర్ణము పాలలో వేసి పుచ్చుకొనుటకు వీలుగ నుండును. చూర్ణపు మోతాదు పావు తులము మొదలు తులమెత్తువరకు.

సింగాడిదుంపలు:—కోవిలదుంపలు చూడుడు.

సింధూరము:—రససింధూరము, గంగసింధూరము చూడుడు.

సింహము:—Lion-flesh of. సం॥ కేసరీ, పంచానన, మృగరాజ. దీని మాంసము ఉబ్బు, మలమూత్రబద్ధము, మూలవ్యాధి, గ్రహణిరోగము వీనికి పథ్యముగ నుండును. వాతము, కుష్టు, దురద,

వ్రణము, స్థూలత్వము, గళరోగము వీనిని పోగొట్టును. దీనిచర్మము యొక్క ధూపము మూర్ఛరోగమును పోగొట్టును.

సిరకా:—Vinegar. కల్లుపులుసు చూడుడు.

సీకాయచెట్టు సీకాయ:— Mimosa abstergens. Acacia concinna-pods of. దీనిని షీకాయ చెట్టనియు నందురు. దీని కాయల పులుసుతో తలరుద్దుకొనిన తలలో వేడితగ్గును. మేహశాంతి జేయును. వెండ్రుకలకు మృదుత్వమును, బలమును ఇచ్చును. సీకాయిపొడుము నీళ్ళలోవేసి పిసికినదానితోగాని, నీళ్ళతో నూరినదానితోగాని వళ్ళుతోముకొనిన శుభ్రపడును. మృదువుపరచును. కాంతినిచ్చును. ఆరోగ్యముగనుండును. దీని చిగుళ్ళుపచ్చడి లేక ఆకులచారు లేక కషాయము పైత్యమును, అరుచిని పోగొట్టును; జఠరదీప్తినిచ్చును; విరేచనముజేయును. సీకాయ గుంజు లేక చూర్ణముతో చేసిన లేహ్యము పుచ్చుకొనిన దేహములోని మలములను వెడలించును; శుభ్రపరచును; శ్లేష్మమును వెడలించును, పాండురోగము, పైత్య రోగములు వీనిని హరించును. మోతాదు పూటకు బండిగురివింద గింజంత చొప్పున దినమునకు రెండుపూటలను 3 దినములు పుచ్చుకొనవలెను.

సీతమ్మ నూలుపోగులు:—పాచితీగె చూడుడు.

సీమ అవిసివిత్తులు:— Linum usitatissimum. Eng. Linseed. variety of. సం॥ మసీనా. అతసీ. హిం॥ అలసీ, తిసీ. దీని చెట్టు ఆవాల చెట్టును బోలియుండును. కాయలు గుండ్రముగా నెల్లి కాయలవలెనుండి కాయలోని గింజలు బల్లపరుపుగా మెరుగుకలిగి చిన్నవిగానుండును. యీగింజలను పండించెదరు. దీనినుండి నూనె తీయుదురు. వేడిజేయును. దీని ఆకు కషాయము లేక చూర్ణము శ్వాస, దగ్గు, వాతమును హరించును. యీవిత్తుల కషాయము

వాతము, కఫము, వాపు, వ్రణము, కడుపునొప్పి, పిత్తము, కష్ట, వాతరక్తము వీనిని హరించును. యీ విత్తులు మెత్తగ చితుకగొట్టి చూర్ణించి నీళ్ళతో నుడకబెట్టి కట్టిన గడ్డలు, వ్రణములు, వాపులు శరీరములోని లోపలి అవయవముల వాపులను హరించును. రెండేసి గంటల కొకసారి కట్టువిప్పి మరల కట్టు కట్టవలెను. యీపిండి వుడికించినది (Poultice) కట్టిన ఆమవాతపు వాపులు (Rheumatic swellings), మేహవాతపు నొప్పులు, వాపులు హరించును. దీని పిండి నీళ్ళలో నానవేసి వడియపోసి ఆనీళ్ళు కండ్లలో వేసిన కండ్ల వాపులు, ఎరుపులు నయమగును. దీని నూనె సున్నపునీరు సమభాగము బాగాకలిపినది కాలినపుండ్లకు రాసిన నయమగును. యీ గింజల కషాయములో పాలు పంచదార కలిపిగాని, కలుపకగాని పుచ్చుకొనిన శ్వాసకోశములయందుగల వాపులు, ఆనాళములవాపు (Inflammation) లను హరించును. శగ జీర్ణించుటవలన గలిగిన మూత్రకోశము, మూత్రనాళము, వీని వాపులు, మూత్రకృచ్ఛ్రము, మూత్రబద్ధము నివారణజేయును. దీని తేలికకషాయము రక్తవిరేచనములను కట్టును. ఋతురక్తమును జారీచేయును. దీని నూనెను 1/2 మొదలు 1 ఔన్సు మోతాదులుగ నిచ్చిన మూలవ్యాధి శాంతించును. దీని నూనెను నొప్పిగలచోట మర్దనచేసి కాపడము (వేడినీళ్ళతో) పెట్టిన, లేక వేడినీళ్ళతో కడిగిన, వాపులు, వాత మేహవాత నొప్పులు నయమగును. మరియు యీనూనెను రంగులు వేయుటలో నుపయోగింతురు.

సీమకర్పూరపుఆకు:—**Merlandra strobilifera - leaves of.** ఇది హారతికర్పూరపు వాసనగలిగి యుండును. దీని యెండిన యాకులతో చేసిన తేలిక కషాయము (Tea) గాని, యెండిన యాకుల చూర్ణముగాని స్వాదుగ నుండును, జ్వరమును నీరసమును పోగొ

ట్టును. దేహమునకు, పొట్టకు బలమిచ్చును. కడుపులోని వాతమును హరించును. కొద్దిగ విరేచనబద్ధము జేయును. అతిచెమటను కట్టును. దీని కషాయముగాని, కషాయములో కొద్దిగ తేనెయు, సిరకాను కలిపినదిగాని పుక్కిలించిన గొంతుకపుండు నివృత్తించును. చూర్ణపు మోతాదు పూటకు 1 మొదలు 2 అణాల యెత్తుచొప్పున నియ్యనగును. తేలిక కషాయము ప్రతి 8 గంటల కొకసారి 2 ఔన్సులియ్యనగును. ఒకపైంటు (Pint) వేడినీళ్ళలో 1 ఔన్సు యెండిన యాకువేసి చేసినది తేలిక కషాయ మగును. దీని పచ్చియాకుల రసమును 5 లేక 6 దినములు ప్రొద్దుట పూటల నిచ్చిన దినము విడిచి దినము వచ్చెడు జ్వరము నివృత్తించును. మోతాదు పూటకు 2-4 తులముల యెత్తు.

సీమగోరింట విత్తులు:—Peganum harmala. Eng. Syrian rue. హిం॥ హార్ మల్. వీనిలో గంజాయనిషావంటి నిషాయున్నది. వీని చెట్టుయొక్క అన్ని భాగములలో విత్తనములు యెక్కువపని జేయును; తత్వమును మంచికి మార్చును; శుభ్రపరచును; వీర్యవృద్ధి జేయును; స్త్రీలకు పాలుబడ జేయును; చెడుపైత్యమువలన బుట్టిన వికారపు పిచ్చి మొదలగు రోగములు, పక్షవాతము, నడుమునొప్పి వీనిని హరించును. వీనికషాయములో మంచినూనె, తేనె గలిపిగాని, వైను సారాయిలో వీనిని చితుకగొట్టివేసి కాచిగాని యియ్యవచ్చును. ఈ విత్తుల మసి బిడ్డల బొడ్డుకోత పుండును, ఇతర గాయములను మాన్పును. వీనిచెట్టు ఆకుల కషాయము వాతపు, మేహవాతపు నొప్పులను హరించును. వీనిచెట్టువేరు చూర్ణమును ఆవనూనెలోగలిపి తలవెంట్రుకలకు పూసిన పేలు చచ్చును; ఇతర పురుగులను జంపును; ఈవిత్తుల తేలిక కషాయముగాని, అరఖు (Tincture) గాని యిచ్చిన సౌమ్యముగ ఋతురక్తమును జారీచేయును. వీని అరఖు

(Tincture) ను అరడ్రాము మోతాదుగ నిచ్చిన ఋతుబద్ధమును విప్పును; ఋతురక్తమును ధారాళముగ జారీచేయును; గర్భిణిస్త్రీల కిచ్చిన గర్భస్రావమును గలిగించును; కడుపులోని క్రిములను జంపును. ఈవిత్తులు ఈడ్పులకట్టును; నిద్రదెచ్చును; నొప్పిని శమింప జేయును; వికారపెట్టును, వమనముజేయును; జ్వరము, కడుపునొప్పి ఉబ్బసదగ్గు, ఎక్కిళ్ళు, అపస్మారము (Hysteria), వాతపు, మేహ వాతపు నొప్పులు వీనిని హరించును; మూత్రపుసంచిలోను, పేదు కట్టసంచి (Gall bladder) లోను పుట్టెడు రాతిని కరగించును; శూల,పాండురోగము,రజోశూల, నరములసంబంధమయిన నొప్పులు (Neuralgia) వీనిని పోగొట్టును. వీని చూర్ణమును ఘట్టిబిరడా లేక కార్కుగల సీసాలోపోసియుంచి వాడవచ్చును. నొప్పి శమించుటకై యిచ్చు మోతాదు అరడ్రాము (30 గోధుమగింజలయెత్తు) మొదలు 2 డ్రాములవరకు. రెండుడ్రాములు యిచ్చిన వికారము పెట్టును; నీరసపెట్టును. ఈవిత్తులపొగ పిశాచబాధను, దృష్టిదోషమును పోగొట్టును. వ్రణముల కుళ్ళునాపును. వీని తేలికకషాయము ఉబ్బసపు దగ్గు నణచును. వీని చెట్లను విస్తారముగ దెచ్చి కాల్చి పొగ లేవజేసిన అచ్చోటనుండి మరిడిజాడ్యము తొలగునని కొన్ని దేశములలో నమ్మి యట్లుచేయుదురు. ఈవిత్తుల పొగబట్టిన సవాయిపుండ్ల బాధ యణ గును; నిద్రదెచ్చును. వీనిని వేసి కాచినమూనె పుండ్లకు పూసిన దుర్గంధమును హరించును. గాయములకు పొగబట్టిన వానికి మేలు జేయును. కాయిలామనుష్యులు, ముఖ్యముగ గాయములు తగిలిన వారు వుండుగదులలో వీని పొగ వేయుచుండిన దుర్వాసన లేకుండ జేయును.

సీహచిత్రమూలము:—A medicinal shrub. ఈ చెట్టు కాడలవలె 3-4 అడుగుల యెత్తు లేచును. కట్టవలకు వేయుదురు. ఆకులు దళ

సరిగా నుంకును, దీనికి పాలుండును. పుష్పాలు ఎఱ్ఱగ నుండును; కాయలుండవు. దీని ఆకునూరి కట్టిన వ్రణములు మానును. పాము మొదలగు విషములను హరించును. దీని పాలు కీళ్ళనొప్పులకు రాసిన నయమగును. ఈపాలు బొడ్డుకు పట్టించి పసుపు అద్దిన విరేచనములు కట్టును. దీని కాడలు కుమ్ములోబెట్టి దీసిన రసము వాతమును, శ్లేష్మమును హరించును. వాతశ్లేష్మములకు యిచ్చు ఔషధములు దిని రసములో గలిపియిచ్చిన వెంటనే పనిజేయును. రసపు మోతాదు ½ తులము మొదలు 1 తులమెత్తువరకు.

సీమ తెగడ:—తెల్ల తెగడ చూడుడు.

సీమ నేలతంగేడు:—సునాముఖి చూడుడు.

సీమ నేల వేము:—యిది అరబ్బీదేశమునుండి వచ్చును. మామూలు నేల వేమువలె నుండక నీటిగొబ్బి ఆకును బోలియుండును. తులసి వెన్నువలె వెన్ను వేయును. నేలవేముకన్న మిక్కిలి చేదుగలిగి యుండును. గుణములకు నేలవేము చూడుడు. దీనిని యూనానీ వైద్యులు విస్తారము వాడుదురు.

సీమనేపాళము:— Country croton shrub-small variety. దీని చెట్టు పెద్దనేపాళపు చెట్టుకంటె చిన్నది. ఎఱ్ఱని కాడలుగల యాకులుగలది. విస్తారముగా లేచునది. దీనికి కొన్ని పెద్దనేపాళపు గుణములు గలిగియుంకును. దీనిపాలు వాతమేహ వాపునొప్పులకు మర్దనచేసిన నయమగును. దీని ఆకు దంచి ఆముదము వెచ్చజేసి కట్టిన వాతపునొప్పులు, వాపులు హరించును.

సీమపెన్నేరు:— Physalis Flexuosa-smaller variety. యీ పెన్నేరు నాగూరుదేశమునుండి వచ్చును. పెన్నేరుకన్న సన్నముగా నుండును. దీనిని అస్‌గంధ్ నాగూరీ యందురు. యూనానీవైద్యులు

విస్తారముగా వాడుదురు. పెన్నేరుతో సమానమైన గుణములు కలిగియుండును. పెన్నేరు చూడుడు.

సీమమిరపకాయ:— Very small sort of chillies. ఇవి మిక్కిలి చిన్నవిగా, విస్తారము కారముగా నుండును; పైత్యము, కాక జేయును; వాతపుశూలల నణచును. పచ్చికాయలుగాని పండినవానిని గాని నూరి ఇండుపకాయంత ముద్ద గొంతుకలో వేసి మ్రింగించిన దారుణమైన శూల వెంటనే నిమ్మళించును. దీని ఎండినకాయలు అప్పడముచేయు పిండిలో వేసి విసిరి అప్పడములు జేయుదురు. చాల రుచిగా నుండును.

సీమమెట్టతామరచెట్టు:—Cassia alata. Eng. Ringworm tree. సం॥ దద్రుఘ్న. హిం॥ డాడ్‌మర్దన్. దీనిని మెట్టతామర యని యందురు. గాని తామరకు దీనికి ఏమిసంబంధము లేదు. ఇది పెద్ద చెట్టగును. దీనిఆకు రాసిన తామర పోవుటవలన మెట్టతామర అనుచున్నారు.దీనిచక్క ఆకురసము లేక కషాయము వెగటుగానుండును. శ్లేష్మమును వెడలించును. త్రిదోషహరమైనది. రక్తకాస, అరుచి, వాతము, అడ్డగర్రలు, యితర సుఖవ్యాధులు, వ్రణములు వీనిని హరించును. దీనియాకు నలిపి రాసిన తామర మొదలగు చర్మరోగములను పోగొట్టును. విషజంతువుల విషమును విరుచును. దీనియాకు రసములో నిమ్మపండ్లరసము గలిపి పూసినను, ఆకునూరి అందులో ఉప్పుగలిపి పూసినను, ఆకు, ఉప్పు గలిపి రుద్దినను, వేరును పొంగించిన వెలిగారమును నూరి పూసినను, దీని పువ్వులు నూరి యుడికించి పూసినను లేక కట్టినను తామర, చర్మరోగములు మానును. పైన జెప్పినవానిలో దేనినైనను 10 దినములు పూయనగును. మానిన వెనుక కొన్నిదినములు తామరయుండుచోట ఆకుతో రుద్దుచుండిన తామర తిరిగిలేవదు. దీని యాకురసముగాని,కషాయముగాని పుక్కి

ళించిన నోటిపూత, పుండు ( Stomatitis) మానును. దీని ఎండిన యాకుల కషాయము సునాముఖి కషాయమువలె విరేచనము గావించును.

సీనువంకాయ:— Physalis ackekenji. Eng. Strawlerry. Tomato or love apple. వీనిని టొమేటొ యని యందురు. దీని పండ్లు పులుపు, తీపి రుచులు గలిగియుండును. దీని కాయలు పుల్లగ రుచిగ నుండును. అనేకవిధములుగ కూరలుగా, పప్పులుకూడా వేసి వండుకుందురు. మేహశాంతి, చలువజేయును; అగ్నిదీప్తి నిచ్చును; కాస, శ్వాస, క్షయల నణచును; సెగరోగమును శమింపజేయును. వీర్యవృద్ధి, రక్తవృద్ధి. బలము, దేహపుష్టి, ఆరోగ్యమును యిచ్చును. వీని వనేక దేశములలో పండించుచున్నారు. పైనుండికూడా వచ్చును. వీనిని పడమట దేశములో రాములక్కాయ లందురు.

సీమసాంబ్రాణి:—కుందురుష్కము చూడుడు.

సీమసున్నము:— Chalk. ఇది వగరుగ నుండును; విరేచనబద్ధము జేయును; గ్రహణిరోగమును కట్టును; కడుపులోని మంటను నివారించును; దీనిని తరుచుగ నితర మందుదినుసులతో గలిపి వాడుదురు. కడుపులోని మంటలకు వట్టిదే నియ్యవచ్చును. మోతాదు 5 మొదలు 10 చిన్నములయెత్తు నీళ్ళలో గలిపి నియ్యనగును.

సీరమీను:—Small kind of fish. చిన్నమీను చూడుడు.

సీసము:—Lead and its calx. సం॥ నాగ, సీసక, భుజంగ. దీనిని బిళ్ళలుగచేసి కట్టిన కంతులు, బిళ్ళలు హరించును. క్రమముగ శుద్ధిచేసి చేసిన సీసభస్మము అనుపాన భేదముతో సేవించిన కాస, భగందరము, పాండువు, క్రిమిరోగము, క్షయ, గుల్మము, కఫము, మూలవ్యాధి వాతము, శూల, ప్రమేహము వీనిని బోగొట్టును; వీర్యవృద్ధి. బలము జేయును; ఆయురారోగ్యముల నిచ్చును;

మోతాదు పూటకు ¼ మొదలు 1 గురిగింజ యెత్తువరకు; క్రమముగ శుద్ధి, భస్మముకాని సీసభస్మ సేవవలన కుష్టు, గుల్మము, పాండువు, అరుచి,క్షయ, కఫము, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అశ్మరి, శూల, పక్షవాతము, వాతము వీనిని బుట్టించును. ఇందుకు విరుగుడు వస, కరక్కాయ, కలకండ ఒక్కొక్కటి సుమారు బేడెత్తుచొప్పున నీళ్ళతో నూరి 10-12 దినములు ఉదయపు పూటలను పుచ్చుకొనిన దోషము నివృత్తించును.

సుగంధలేపనము:—Smearing of sandal and their fragrant pastes. అనగా మంచిగంధములో సుగంధద్రవ్యములు చేర్చి శరీరమునకు పూసుకొనుట. మదము, మూర్ఛ, భ్రమ వీనిని హరించును. తేజస్సు, బలము, సంతోషము, ఆరోగ్యము, వీనిని వృద్ధి పొందించును. చెమట, దుర్గంధము, శ్రమ వీనిని పోగొట్టును.

సుగంధిపాల:—పాలసుగంధి చూడుడు.

సుద్ద:—White clay. సం॥ ఖటికా, పాకశుక్ల, ఖడీ. హిం॥ ఖడియా, గౌర్ ఖడీ. ఇది తెల్లనిమన్ను. దీనిని గనులలో త్రవ్వి తీయుదురు. యీసుద్ద తెలుపు, గౌరవర్ణము గల్గిన రెండు విధములు. గోడలకు వెల్లవేయుదురు. తడిపిన వెన్నవలె మృదువుగ నుండును. ఇది మధురతిక్తరసములు, గురుగుణము, శీతవీర్యము, మధురవిపాకము గలది. దీనిని దొండాకు పసరులో గలిపి రాసిన గజ్జి, చిడుము, కురుపులు, సర్పి వీనిని మాన్పును. కాలినపుండ్లకు రాసిన మంట, తాపము శాంతించును. నేత్రములకు చుట్టు పట్టువేసిన కండ్ల ఎరుపులు వేడిమి శమించును. దీనిని బొడ్డుకు పట్టువేసిన చలువజేసి మూత్రమును గావించును. కడుపు శగపోవడము, మూత్రపు మంట నయమగును. దీనిని లోపలికి దినిన పాండురోగమును గలుగజేయును. గర్భిణులును, మరికొన్ని తత్వములు గలవారును మాన్పుటకు ఎంత

ప్రయత్నము జేసినను రహస్యముగా తినుచుందురు. దీనిని నీళ్ళతో తడిపి వడియబోసి నామము కణికెలు చేయుదురు. ఈ నామము ధరించిన నేత్రములకు చలువ, బుద్ధికి స్థిరత్వమును గలుగజేయును.

సున్నపు కాయ:—**Properties of chunam applied to betel leaves according to the metal of which the chunam box is made.** తాంబూలములో నుపయోగించెడు సున్నము ఇనుపపాత్రలో నుంచిన చలువజేయును; పైత్యము నణచును; పథ్యమైనది. వెండిపాత్రలో నుంచిన సున్నము కఫమును హరించును. బంగారపు పాత్రలో నుంచిన సున్నము త్రిదోషములు, అరుచి, కుష్ఠు, మేహము, గళరోగము, కడుపులో బల్ల వీనిని హరించును. కంచు పాత్రలో నుంచిన సున్నము తాపము బుట్టించును; పైత్యమును ప్రకోపింపజేయును. రాగి, యిత్తడి పాత్రలలో నుంచిన సున్నము పైత్యము, చర్ది మొదలగు దోషములను బుట్టించును.

సున్నము:—**Quick lime.** సున్నము వడకట్టబడి పదిదినములు నీళ్ళలో నానినది శ్లేష్మము; చలువజేసి యారార్చును. సున్నము బట్టకు చమిరి యందుమీాద కోడిగ్రుడ్డులోని తెల్లసొనపూసి చుట్టుజుట్టి ముక్కులో నుంచిన ముక్కువెంట రక్తముపడుట కట్టును. సున్నములో ఆముదమువేసి కలిపి గజ్జికురుపులకు పట్టించిన శీఘ్రముగ పగిలి నయమగును. గడ్డలకు, గాయములకు, నొప్పులకు, తలనొప్పికి, వాపుకు, కవుకుదెబ్బలకు పైనపూసిన నవి నిమ్మళించును. సున్నములో తేనె గలిపి పట్టువేసిన రొమ్ము నొప్పులు, మేహవాతపు నొప్పులు నిమ్మళించును. సున్నము బెల్లముగాని, సున్నము చింతపండుగాని కలిపి పట్టువేసిన కవుకుదెబ్బలు, నొప్పులు నయమగును. సున్నము వడ కట్టిన పెరుగులో కలిపి పట్టువేసిన నడుము నొప్పి,

మోకాళ్ళనొప్పులు, మేహవాతపు నొప్పులు హరించును. సున్నపు నీళ్ళలో కొద్దిగ మంచినూనెగాని, కొబ్బరినూనెగాని వేసి చేతితో కొట్టిన వెన్నవలె బయలుదేరును. దానిని ఆరారగ పూసిన కాలిన పుండ్లు మానును. 20 తులముల సున్నము 12 పయింట్ల మరగ బెట్టిన మంచినీళ్ళలోవేసి కలిపి తేరబెట్టిన నీళ్ళలో కొద్దిగ నూనెయును, శర్కరయును గలిపి లోపలికిచ్చిన కఠినమయిన సెగసంకటము నివృత్తించును; మోతాదు 2 ఔన్సులు మొదలు అరపైంటు వరకు ఈకూటమిలో కొద్దిగ పాలుకూడ కలిపి యియ్యవచ్చును. పైనవ్రాసిన సున్నపు నీళ్ళు లోపలికిచ్చిన నీళ్ళవిరేచనములు, ఆమవిరేచనములు, అతిమూత్రము, కుసుమ రోగము, వాతపైత్య శూల ఇవి నివృత్తించును; చెమట బుట్టించును; మోతాదు పూటకు 2 ఔన్సులు మొదలు 6 ఔన్సుల వరకు. ఇండుపు కాయంత రాతి సున్నము చిన్న ఉసిరికాయంత వెన్నలోగాని, చింతపండులోగాని, బెల్లములోగాని పొదిగి (ఉంచి) స్త్రీలు బహిష్ఠయి యుండు నాలుగు దినములును ప్రొద్దుటిపూటల నిచ్చిన ఋతుశూలలు నిమ్మళించును. సున్నము, కొట్టుపసుపు సమముగ నీళ్ళతో గలిపి ఇండుపకాయలంతేసి మాత్రలుచేసి పూటకు ఒక్కొక మాత్ర చొప్పున 3 లేక 6 దినము లిచ్చిన చలిజ్వరము, వరుసజ్వరము నిమ్మళించును. ఇండుపకాయంత సున్నములో అరచుక్క లేక ఒకచుక్క జీడిగింజలోని చమురు గలిపి యిచ్చిన నీళ్ళవిరేచనములు, కలరా (Cholera) నిమ్మళించును. సున్నము, పసుపు గలిపి పైనకట్టి తడియారకుండ నీళ్ళతో తడుపుచుండిన గోరుచుట్టు, కణుపుజేష్మ, మడమశూల హరించును. సున్నము తినిన నోరు పొక్కును; అధికముగా దినిన చంపును. తములపాకులతో సున్నము అమితముగ వాడుక చేసిన విరేచన ద్వారమందు నొప్పిని బుట్టించును; నోరు పొక్కును; ఇంద్రి

యమును నీరు జేయును; సున్నమునకు విరుగుళ్ళు 1 తిప్పతీగె, 2 పసుపు, 3 చంద్రనార కషాయము, 4 గురివింద ఆకురసము, 5 కొబ్బరి, 6 కొబ్బరినూనె, 7 నువ్వులనూనె, 8 నెయ్యి. కంటిలో సున్నము పడినందుకు విరుగుళ్ళు 1 గురుమిడాకుపసరు, 2 నువ్వుల నూనె; తాంబూలములో సున్న మెక్కువయినందున విరుగుళ్ళు తాంబూల సేవాక్రమము చూడుడు. రాతిసున్నము, గుల్లసున్నము రెండువిధములు. ఇందులో మొదటిది మిక్కిలి మేహశాంతి జేయును; లోపలికిచ్చుట మిక్కిలి యనుకూలముగ నుండును.

సునాముఖ:— Cassia lanceolata. C. Angustifolia. Eng. Tinnevelly senna. Indian senna. సం॥ స్వర్ణముఖీ, రేచికా. హిం॥ సున్నాముక్కి, సన్నాకాపత్తా. ఇది సీమనేల తంగేడుఆకు. దీని చూర్ణముగాని, కషాయముగాని లోపలికి పుచ్చుకొనిన శైత్యము, కాక జేయును; వాతము నణచును; మలబద్ధమును బోగొట్టును. విరేచనము గావించును. మలదోషమును బోగొట్టును. వరహా యెత్తు సునాముఖ తేనెతో పుచ్చుకొనిన ధాతుపుష్టి జేయును. పంచదారతో బుచ్చుకొనిన వాతము హరించును; బెల్లముతో బుచ్చుకొనిన శరీరము బాగుపడును; ప్రాతబెల్లముతో బుచ్చుకొనిన జలుబును పోగొట్టును; నేతితో బుచ్చుకొనిన దేహములోని రుగ్మతలనన్నిటిని నివారించును; వెన్నతో బుచ్చుకొనిన మెదడుమెత్తబడును; పెరుగుతో బుచ్చుకొనిన విషమెక్కనియ్యదు; మేకపాలతో బుచ్చుకొనిన బలము జేయును; ఇంద్రియవృద్ధి గలుగును; ఆవుపాలతో బుచ్చుకొనిన శరీరమునకు కళకాంతులు వచ్చును; వేడిపాలతో బుచ్చుకొనిన మిక్కిలి బలము కలుగును; చనుబాలతో బుచ్చుకొనిన యౌవనము తగ్గక యుండును; జాజికాయతో బుచ్చుకొనిన

నోటిదుర్గంధము నివారణమగును. రాత్రియుంచిన నీళ్ళతో బుచ్చు కొనిన గజ్జిమానును. ఖర్జూరపుకాయతో బుచ్చుకొనిన ప్రేగుల లోని దుర్వాసన నివారణ మగును; తాజానీళ్ళతో బుచ్చుకొనిన గుండెలనొప్పి నివారణమగును; గుంటకలగరాకు రసముతో బుచ్చు కొనిన తెల్లవెండ్రుకలు నల్లబడును; ద్రాక్షపండ్ల రసముతో బుచ్చు కొనిన కండ్లకు తేజస్సు గలుగును; ఉసిరికాయల రసముతో బుచ్చు కొనిన అనేక రుగ్మతలు నివారణమగును; అల్లపు రసముతో బుచ్చు కొనిన పైత్యము హరించును, నిమ్మకాయ రసముతో బుచ్చుకొనిన కడుపునొప్పి నిమ్మళించును; భంగు నీళ్ళతో బుచ్చుకొనిన జలు బును పోగొట్టును. మరియు సునాముఖి చూర్ణమునకు సమముగ చీనాపంచదారగాని, పటికిపంచదారగాని గలిపి పూటకు బేడెత్తు మొదలు అరతుల మెత్తువరకు రెండు పూటలను కొన్ని దినములు పుచ్చుకొనిన తలనొప్పి, క్షయ, దగ్గు, వాతపు మేహావాతపు నొప్పులు మొదలగువానికి మేలుజేయును; అయినను ప్రేగుల జబ్బు (Irritation) అనగా గ్రహణి, రక్తగ్రహణి యున్నప్పుడు గర్భిణీ స్త్రీలకు సునాముఖి నియ్యగూడదు.

సురపొన్న పువ్వు:— Calophyllum longifolium-flower of. సువాసనగ, మనోహరముగ నుండును; చలువ, వీర్యవృద్ధి జేయును; వాతపైత్యమును, కేశరోగమును బోగొట్టును.

సురుగుడి చెట్టు ఎఱ్ఱసురుగుడు:—Vayambadam tree. దీని మాను చెక్క చూర్ణము మంచినూనెలో గలిపిపూసిన సర్పి, గజ్జి, చిడుము, పొక్కులు మొదలగు చర్మరోగములు నివృత్తించును. ఎఱ్ఱసురుగుడు నీళ్ళతో గంధముతీసి సర్పిలకు, మంత్రపొక్కులకు రాయుచుండిన నయమగును.

సువర్ణమాల:— Wearing gold necklace. సువర్ణ ఆభరణములు మాల ధారణవలన కాంతిని, సంతోషమును, ఆయుస్సును, దార్ఢ్యమును యిచ్చును. భూతగ్రహబాధలు తొలగును. వాతపైత్యములను పోగొట్టును. ఆరోగ్యము నిచ్చును.

సూరేకారము:— Potassium nitras. Eng. Saltpetre or Nitre. సం॥ సూర్యక్షార, అగ్నిక్షారా. హిం॥ సోరా, సూర్యాఖార్. దీనిని పెట్లుప్పు అనియు నందురు. దీనిని లోపలికిచ్చినను, పైన వేసినను చలువ చేయును. మూత్రబద్ధము, మూత్రకృచ్ఛ్రము వీనిని నివారించును. దేహమునకు ఎక్కియున్న అతివేడి నణచును. 10 లేక 12 గోధుమగింజల యెత్తు మాటిమాటి కిచ్చుచుండిన అతికాకను తగ్గించును. దాహమణచును రక్తప్రవాహ వేగమును తగ్గించును. రేవల్చిన్ని (Rhubarb) ని నీళ్ళతో గంధముదీసి యందులో సూరేకారము కలిపి యాగంధము పొత్తికడుపుపైన పట్టువేసిన మూత్రబద్ధము విడును. సూరేకారమును నీళ్ళతో కలిపిన నీళ్ళకు చలువ యెక్కును. ఆనీళ్ళతో గుడ్డతడిపి మెదడు పుండయిన (Inflammation of the brain) తలగొరిగించి యాగుడ్డను తలమీద వేసి యానీళ్ళతో తడుపుచుండిన దానిని బాగుచేయును. తలనొప్పికి ఒక పెద్దబుడ్డి (ముప్పావుసేరు) నీళ్ళలో 2 ఔన్సుల సూరేకారము, 2 ఔన్సుల నవాసారము కలిపి పైన వ్రాసిన ప్రకారము గుడ్డలు తడిపి నెత్తిమీద వేయుచుండిన నయమగును. విదాహముగల తీవ్రజ్వరమునకు పెద్దబుడ్డి (Quart bottle) అన్నము వార్చిన గంజిలో రెండు డ్రాముల సూరేకారము కలిపి యాబుడ్డి నీళ్ళు సమాన భాగములుగ విభజించి ఒకదినములో నిచ్చిన నయమగును. పైనజెప్పిన బుడ్డినీళ్ళలో రుచికొరకు తేనెగాని, పంచదారగాని కలుపవచ్చును. చెమటను బుట్టించును. దాహము నణచును,

రక్తములోని యతివేడిననణచును. మూత్రమును అధికపరచును. పైన జెప్పిన గంజి పై ప్రకారమిచ్చిన విషపుపడిసెమున (Influenza) కు, స్ఫోటకమునకు, పొంగుకు మేలుజేయును. పైనజెప్పిన గంజి బిడ్డలకును ఇయ్యవచ్చునుగాని సూరేకారపు మోతాదులో సగముగాని, యంతకధికముగాని తగ్గించి గంజిలో గలిపి నియ్యవలెను. గొంతుక పుండు ఆరంభదశలో కొద్దిగ సూరేకారపు ముక్కను నోటిలో నుంచుకొని కరగించుచుండిన నది నయమగును. ఊపిరితిత్తులు (Lungs), పొట్ట (Stomach), గర్భాశయము (Uterus) మొదలగు లోపలి యేయవయవమునుండినైనను రక్తముపడుచుండునప్పుడును, జ్వరము కలిగియుండునప్పుడును 10 మొదలు 15 గోధుమగింజలయెత్తు సూరేకారమును 3 ఔన్సుల నీళ్ళలోగాని, గంజిలోగాని కలిపి రోజుకు 4-5 మార్లు ఇచ్చిన నయమగునుగాని, రోగిని నెమ్మదిగ చల్లని ప్రదేశమందుంచవలెను. ఉబ్బసదగ్గుకు అరపైంటు నీళ్ళలో 4 ఔన్సులు సూరేకారము గలిపి యందులో అద్దుకాగితము (Blotting paper) దడిపి నిప్పుసెగనుగాని, గాలిలోగాని ఆరబెట్టి నాలుగంగుళముల ముక్కలు చేసియుంచి ఉబ్బసపు చిహ్నములు కనుపించిన వెంటనే ఆముక్కలలో నొకటిగాని, రెండుగాని నిప్పులమీదవేసి కాల్చి పొగపీల్చిన ఉబ్బస మణగును. ఆ పొగ ముక్కుకు దగ్గరగ వేయకూడదు. సెగరోగమునకు ఒక డ్రాం సూరేకారమును ఒక పైంటు అన్నపుగంజిలో గాని 2 బెండకాయలు వేసి కాచిన కషాయములోగాని కలిపి వానిని త్రాగించిన మూత్రము చల్లగ వెడలి శాంతించును. సూరేకారము 10 గోధుమగింజల యెత్తు, పటిక 5 గోధుమగింజలయెత్తు నీళ్ళలో గలిపి రోజునకు 3 పూటలను ఇచ్చిన యెడల కుసుమరోగము మానును. పైనజెప్పిన కూటమిని మునగ

చెక్క తేలిక కషాయములో నిచ్చిన బాగుగ పనిజేయును. ఉబ్బు (Dropsy) రోగపు ప్రథమదశలో సూరేకారమును పూటకు 10 మొదలు 30 గోధుమగింజల యెత్తుచొప్పున ఉత్తరేణి సమూల కషాయములో నిచ్చిన మూత్ర మధికముగ వెడలించి ఉబ్బును పోగొట్టును. వాతపు మేహవాతపు నొప్పుల ప్రారంభమందు 40 మొదలు 120 గోధుమగింజల యెత్తుచొప్పున క్రమక్రమముగ వృద్ధి జేసి దినమునకు రెండుపూటల నిచ్చిన నయమగును. పైనజెప్పిన మోతాదుల సూరేకారము అరపైంటు ఉడుకు అన్నపు గంజిలో గలిపి యియ్యవలెను. నొప్పులు తగ్గినకొలది సూరేకారపు మోతాదు తగ్గించుచు రావలెను. ఒక పైంటు నీళ్ళలో 8 ఔన్సుల సూరేకారము గలిపి ఆనీళ్ళలో గుడ్డతడిపి నొప్పులు, వాపులు గల కీళ్ళపైనవేసి యానీళ్ళతో తడుపుచుండిన కీళ్ళనొప్పులు, వాపులు హరించును.

సూరేకారపు ద్రావకము:—Nitric acid. దీనిని పెట్లుప్పు ద్రావక మందురు. నీళ్ళుకలుపనిది దేహముపైన బడిన పొక్కి పుండగును, లోపలికి పుచ్చుకొనిన చంపును. గావున దీనిలో 17 వంతులు నీళ్ళు గలిపి వాడనగును. అలాగు నీళ్ళు గలిపినదానిని లవంగాలు, నారింజ పండు తొక్కలు మొదలగు చేదువస్తువుల తేలిక కషాయములో కలిపి లోపలి కిచ్చిన మూత్రమును జారీచేయును. బలము జేయును. పురాణజ్వరములను పోగొట్టును. వ్రణముల కుళ్ళు నాపును. మరియు గంధకధృతి గుణములు గలిగియుండును. లోపలి కిచ్చు మోతాదు నీళ్లుగలపనిది 1 మొదలు 5 చుక్కలవరకు. నీళ్ళలో కలిపినది 8 మొదలు 30 చుక్కల వరకు లేక 40 చుక్కల వరకు యియ్య వచ్చును. ఈపైన వ్రాసినవి బలముకొరకును, కుళ్ళు నాపుటకును ఇచ్చు మోతాదులు. కార్జపు సంబంధమయిన జ్వరములకు రొమ్ము

పైన పూయుదురు. మూత్రకృచ్ఛ్రమునకు బాగుగ నీళ్ళుకలిపినది మూత్రద్వారమునుండి లోనికి పిచికారీ కొట్టిన రాతిని హరించును.

సెలయేటినీరు:—Water of a mountain torrent. కొండ కాలువ నీరు రుచిగా నుండును. మిక్కిలి చలువజేయును; శ్లేష్మవాతములను వృద్ధిబొందించును; పైత్యము నణచును; శీతపైత్యము జేయును; వాసన, జిడ్డు గలిగించును. దీనికి విరుగుళ్ళు ఉదకము చూడుడు.

సేమియా లేక సేక్ లు:— A kind of pudding. గోధుమపిండితో జేసిన భక్ష్యవిశేషము. కొద్దిగ జిగటగలిగి రుచిగానుండును. పాలలో వేసి వండుదురు. వాతపైత్యమును హరించును. దేహపుష్టి, బలము నిచ్చును. రక్తపైత్యము నణచును.

సైంధవలవణము:— Sodium chloride-impure. Rock salt. సం॥ శింధూద్భవ, లవణోత్తమ. హిం॥ సోందానమ్మక్, సోందా నోన్. దీనిని సింధుదేశమునందు గనులనుండి త్రవ్వి తీయుదురు. తెల్లగా గోధుమరంగుకలసిన రంగుగాను, గడ్డలుగడ్డలుగా, పటికి పంచదారవలె మెరుగుగలిగి, పలకలుగలిగి యుండును. దీనిని వుత్తర దేశస్థులు వుప్పుకుబదులుగా వాడుదురు. ఇది అన్ని లవణములలో వుత్తమమైనది. రుచిగలది. ఇది వర్షఋతువునందు నీరగును. దీని ఇందుప్పు అనియు నందురు. ఉప్పగా, చెమ్మగా, మనోహరమైన రుచిగలిగి యుండును; తేలికయైన వేడిజేయును, నేత్రరోగముల నణచును; జఠరదీప్తి, వీర్యపుష్టి జేయును; త్రిదోషములను హరించును; వ్రణములను శోధించి మాన్పును. విదాహము నణచును. విరేచనము గావించును. శ్లేష్మమును నీరుజేయును. పాలలో కలిపి పుచ్చుకొనిన ననుకూలముగ నుండును. దీనికిని ఉప్పుయొక్క గుణములు గలిగియుండును. గాని ఉప్పుకన్న ననేకవిధముల మంచిగుణములు

గలిగియుండును. దీనిని అమితముగ బుచ్చుకొనిన పైత్యము జేయును. అతిసారమును బుట్టించును. దీనికి విరుగుడు మొగలి చన్నుల రసము. మోతాదు 8 మొదలు 6 చిన్నముల వరకు. సైంధవలవణము, చంగల్వకోష్టు, అక్కలకఱ్ఱ, యష్టిమధుకము నీళ్ళతో గంధముతీసి నాలుకకు వ్రాయుచుండిన జిహ్వాదోషము అనగా నాలుక రోగమును హరించును.

సొజ్జపాయసము:—A kind of wheat pudding. గోధుమపిండి లేక నూకతో వండిన పాయసము. వాతపిత్తములను హరించును. వీర్య పుష్టిని, బలమును ఇచ్చును. మూత్రమును జారీచేయును.

సొరకాయ:—ఆనబకాయ చూడుడు.

సొరపియ్య:— Shark fish-dung. అనగా సొరచేప మలము. సముద్రతీరములకు కొట్టుకువచ్చును. యివి విస్తారముగా దొరకును. 1 మొదలు 8 అంగుళముల వెడల్పు. 5 మొదలు 10 అంగుళముల వరకు పొడవు గలిగి, అడుగున బల్లపరుపుగా పైన కొద్ది గోళాకార ముగా, తెల్లగా, తేలికగా నుండును. దీనితో అద్దములు తోమిన శుభ్రమగును. మరికొన్నివాటిని పరిశుభ్రము చేయుటకు వాడుదురు. దీనిని సముద్రపు నురుగు (సముద్రఫేనము) అని తప్పుగా వాడుదురు, గాని అటుల వాడుట తప్పు. దీని చూర్ణమును శంఖభస్మమును కొబ్బరినూనె కాచి వడియగట్టి చెవిలోబోసిన చెవిపోటు, చీము కారుట మానును.

సొరచేప:— Squalus carcharius. Eng. Shark-flesh oil. ఇందులో నల్లసొర, తెల్లసొర యని రెండు విధములు. తెల్లసొరను పాలసొర యందురు. దీని మాంసము కాక జేయును. వాతమును, పైత్యమును బోగొట్టును. మూత్రరోగములను బుట్టించును. బుద్ధి మాంద్యమును గలుగజేయును. పాలసొర బాలింతలకు పాలుబడ

జేయును. వాతపునొప్పులు, నడుమునొప్పులు హరించును. పథ్యమైనది. వీని కార్జమునుండి తీసిన తైలమును (Sharkliver of oil) అందురు. కాడ్ లివరాయిలుతో సమాన గుణము గలిగియుండును. దానికి బదులు దీనిని వాడతగియుండును.

సోపు:— Pimpinella anisum. Foeniculam vulgare. Eng. Anise. సం॥ మధురికా. హిం॥ సోంఫ్. ఇది పెద్దజీలకఱ్ఱవలె నుండును. కాక జేసి ఆర్చును; పొట్టకు, గుండెలకు, కండ్లకు బల మిచ్చును; వాతమును హరించును; గుండెలలో (Chest) విశార మును, నొప్పిని, ప్రక్కటెముకలలోని నొప్పిని, కడుపుబ్బును, అగ్నిమాంద్యమును బోగొట్టును; దేహసౌఖ్యమును, మనస్సుకు సౌమ్య మును ఇచ్చును; రొమ్ము (Chest), కార్జము (Liver), గురదాలు (Kidneys), నల్లదబ్బ (Spleen), మూత్రపు సంచి (Bladder) వీనిని శుభ్రపరచును; వీనినొప్పి నణచును; దేహములోని చెడ్డవస్తువులను తీసివేయును; వాని దుర్గుణములను హరించును. మలమూత్ర బద్ధమును విప్పును; బిడ్డల కడుపుబ్బును హరించును. స్త్రీలకు పాలు బుట్టించును. బుతురక్తమును జారీచేయును; విషమును విరుచును. కొంచెము బిగదీయును ఎద్దునాలుక చెట్టుయొక్క పువ్వులతో కషాయము పెట్టియిచ్చిన మంతగుండెయొక్క జబ్బు, దానిఅదురు, స్మారకము లేకపోవుట వీనిని బాగుజేయును; దగ్గును, ఉబ్బసమునకు ఇచ్చు ఔషధములకు అనుపానముగ నిచ్చిన చాల మేలుచేయును. ఔషధముయొక్క సత్తువను త్వరగ దేహమున వ్యాపింపజేయును. విరేచనరోగములకు, విశారమునకు మంచిది; తేనెతో కలుపుకొని తినిన జ్వరము నణచును. ఇది చూర్ణముజేసి 1 డ్రం యెత్తును దానికి సమము పంచదారయును కలిపి, వేసవి దినములలో ఉదయపుపూటలను పుచ్చుకొనిన ఆసంవత్సర మేవ్యాధియును రాదు. కొంతియు

సోపును వేరు వేరుగా నేతిలో వేయించి సన్నపాటి గుడ్డతో తుడిచి వేరు వేరుగా చూర్ణము చేసి సమభాగములుగ కలిపి మూడు వ్రేళ్ళకు వచ్చినంత చూర్ణము నోటిలో వేసికొని కొద్దిగ వేడినీళ్ళు పుచ్చుకొనిన నీళ్ళవిరేచనములు, కఫుపుతుర్ర కట్టును. సోపు, శొంఠి నీళ్ళతో నూరి రసముతీసి కొంచెము తేనె, పటికిపంచదార వేసి పుచ్చుకొనిన గుండెల నొప్పి నిమ్మళించును. సోపు, శొంఠి నీళ్ళతోనూరి రసముతీసి సన్నమంటను ఉడికించి ఘట్టిపడునప్పుడు కొంచెము నెయ్యియు, పటికి పంచదారయు వేసి ఉక్కిరిచేసి పూటకు పెద్ద గచ్చకాయంత చొప్పున దినమునకు మూడుసార్లు పుచ్చుకొనిన గ్రహణి, రక్తగ్రహణి కట్టును. సోపు, పసుపునీళ్ళతో నూరి రసము తీసి త్రాగిన తుమ్మెదకాటు, వికారము మణగును. దీని అరుసము కండ్లలో వేసిన నేత్రరోగములను హరించును దీని వేరును తేనెతో గంధము తీసి యిచ్చిన వెర్రికుక్క విషము విరుగును, కాకలిత్వము గలవారికి కొద్దిగ జబ్బుచేయును. సోపునుండి తీసిన నూనెకు సోపు యొక్క సుగుణములు గలిగియుండును. సోపుఅరకు (Distilled wate,) కును సోపు గుణములు గలవు. సోపు దుర్గుణమునకు విరుగుళ్ళు మంచిగంధము, 2 శికంజబీను. సోపునీళ్ళతో నూరితీసిన రసము యొక్క మోతాదు 1 మొదలు 4 తులముల యెత్తు. బట్టిలోనుండి తీసిన సోపునీళ్ళ మోతాదు 3-4 తులములయెత్తు. ఘాటుసారాయిలో సోపునూనెవేసి చేసినదాని మోతాదు 30 మొదలు 60 చుక్కల వరకు. సోపునూనె మోతాదు 1 మొదలు 4 చుక్కల వరకు నీళ్ళ మీద వేసిగాని, తములపాకుమీద వేసిగాని నియ్యనగును. నీళ్ళు 2-3 తులములయెత్తు వుండవచ్చును. రసము దీయుటకుపయోగించుటకు సోపు బేడెత్తు మొదలు తులమెత్తువరకు నుంచవచ్చును.

సోమరాజము:—అనగా బావంచాలు; బావంచాలు చూడుడు.

సోమలత:—Asclepias acida. Eng. Moon plant. సం॥ సోమలతా, చంద్రవల్లరీ, మహాగుల్మా. హిం॥ సోమలతా. దీని యాకులు శుక్లపక్షమున రోజునకు ఒక యాకుచొప్పున హెచ్చి, కృష్ణపక్షమున ఒక ఆకు చొప్పున పడిపోవును. ఇది హిమవత్పర్వత సమీపప్రదేశములయందు దొరకెడు చెట్టు. దీని రసము కారముగ, చేదుగ నుండును. త్రిదోషములను బోగొట్టును. పూర్ణవయస్సును, ఆయురారోగ్యవృద్ధిని, అధికమయిన పుంస్త్వమును యిచ్చును; కాయసిద్ధి గలిగించును.

సోమింతచెట్టు నల్లపువ్వులది:—Coronilla picta. దీని యాకులను ఆముదములో వెచ్చజేసి కట్టిన గడ్డలు త్వరగా చీముపట్టి పగులును. రొమ్ము, రెక్కగూడు, మోకాళ్ళు వీనిలోని నొప్పులు మానును. పచ్చపువ్వులసోమింత చెట్టుకును పై గుణములు గలిగియుండును,

సోమింతకూర:—Curry of the leaves of do. సోమింత యాకు కూర చేదుగ, వెగటుగ, రుచిగనుండును. వేడిజేయును; క్రిమిరోగమును, కఫమును, వాతమును బోగొట్టును.

సోయికూర:—Aurthum graveoelus. సతాహ్వా, శతపుష్ప. హిం॥ సోయా, యీ కూరవండుకుని తిందురు. యితరకూరలలోను వేయుదురు. చిరిచేదుగ, కారముగా, లఘువుగా, అగ్నిదీపనకారిగా నుండును. వేడిజేయును. వాతము, జ్వరము, యోనిశూల, కడుపుబ్బు, నేత్రరోగము, వ్రణము, క్రిమి వీనిని హరించును. పైత్యమును, మేదస్సును వృద్ధిపరచును.

సౌవర్చలవణము:—Sochal salt or alkali. సం॥ సౌవర్చల. హిం॥ కాలానోన్, ఇది బూడిదవర్ణముగా, గడ్డలుగడ్డలుగా యుండును. దీనికి మెరుగేమియూ నుండదు. కొద్దిగ వాసనగలిగి యుండును.

వీర్యమునకు వేడి, పుష్టి జేయును; గుల్మము, శూల, మలబద్ధము, కఫము వీనిని గొట్టును. జఠరాగ్నిని వృద్ధిబొందించును. కాక జేయును. దీనికి విరుగుడు ముగలిచన్నుల రసము. మోతాదు 3 మొదలు 5 చిన్నముల యెత్తువరకు.

సౌవీరాంజనము:—Sulphate of antimony black. అనగా నీలాంజనము. నీలాంజనము చూడుడు.

సౌవీరము:—Hydrargyri perchloridum. mercuric chloride. దీనిని సవ్వీరమనియు నందురు. దీనిని యితర మందు దినుసులలో గలిపిగాని సవ్వీర మైనముగా చేసిగాని వాడుదురు. మిక్కిలి కాక జేయును; సమస్తవాతములను, శ్లేష్మవాతములను, సవాయిరోగములను, జ్వరములను, సన్నిపాతజ్వరములను హరించును. విరేచనము జేయును; మోతాదు ఒక గోధుమగింజలో 32 వ వంతు (1/32) మొదలు 16 వ వంతు (1/16) వరకు. అమితముగను, శుద్ధిజేయకను బుచ్చుకొనిన విషతుల్యముగ నుండును. దీనికి విరుగుళ్ళు 1 కొబ్బరికాయ నీళ్ళుగాచి దానిలో నిమ్మకాయరసము పిండి నియ్యవలెను. 2 మేక పంచితము, 3 గాడిద పంచితము, 4 చంటిపిల్లలమూత్రము. సవ్వీరము ఒక గోధుమగింజయెత్తు 2 ఔన్సుల నీటిలో కరగించిన నీరు 30 మొదలు 60 చుక్కలవరకు పుచ్చుకొనిన సమస్తవిధములైన అంటుజాడ్యములను గలుగజేయు క్రిములను కొన్ని నిముషములలో జంపును. యీనీటితో కుళ్ళువ్రణములను, మేహవ్రణములను కడుగుట కుపయోగించును. పై మోతాదు ప్రకారము పుచ్చుకొనుచుండిన సవాయి మేహము వలన గలిగిన కొరుకుపుండ్లు, కీళ్ళలో పట్లు, పోట్లు నివారణమగును. మరియు యీనీటిని నేలవేము కషాయముతో పుచ్చుకొనిన శ్లేష్మము. యీమందును పరగడుపున పుచ్చుకొన గూడదు. భోజనమైన ఒక ఘంట తర్వాత

పుచ్చుకొనవలెను. సవాయి జీర్ణించి రొమ్ముమీద, మోకాలియెముక మీద, నుదుటిమీద, చిన్న బిళ్ళలువలె లేచి కురుపువలె సలుపుచు విపరీత బాధ గలుగజేయుచున్న స్థితిలో పై మోతాదు ఒకటి, 5 మొదలు 10 గోధుమగింజల యెత్తువరకు పొటాశియం అయొడయిడు ( Potassium Iodide ) కలిపి యిచ్చిన అద్భుతముగ పనిజేసి బాధ నివారణమగును. జీర్ణించిన సవాయిలకు పుచ్చుకొనెడు యోగము: నేలవేము కషాయము 1 ఔన్సు, సర్వీరపు సీరు 45 చుక్కలు, పొటాశియం అయొడయిడు 10 గోధుమగింజలయెత్తు కలిపి ఒక మోతాదుగా పుచ్చుకొనవలెను; రెండు పూటలా భోజనానంతర మొక ఘంటకు పుచ్చుకొనవలెను. యీవిధముగ 2 మాసములు పుచ్చుకుంటూ నెలకు ఒకవారము దినములు పుచ్చుకొనుట మానుచుండవలెను.

స్నానము:— Bathing. దేహమును శుభ్రపరచును; జఠరదీప్తి, వీర్యవృద్ధి, ఆరోగ్యము, ఆయుర్వృద్ధి, బలము, మనోవికాసము వీనిని గలుగజేయును; దురద, శ్రమ, అలసట, తంద్ర, విదాహము, తాపము వీనిని బోగొట్టును; కండ్లకు మంచిది; ఎండపెట్టువలన గలిగిన ఆయాసమును, విపార్తిని హరించును; మేధస్సు నణచును, చన్నీళ్ళస్నానము చూడుడు.

స్నానము వర్జింపవలసినకాలములు:— Times or occasions at which bathing should be avoided. భోజనానంతర మందును, భోజనానంతరమందైనయెడల భుజించిన యాహారము చక్కగ జీర్ణముగాక ముందును, గాలివానకలిగిన దినముందును, దట్టముగ మబ్బు, మంచుగలిగియున్నప్పుడును, సూర్యాస్తమయకాలమందును, రాత్రియందును, అభ్యంగనము, శిరస్నానము వర్జింపవలయును.

స్నానము వర్జింపవలసినవారు:— Those who should avoid bathing. అజీర్ణము, కడుపుబ్బరము, గ్రహణి, అతిసారము, కడుపునొప్పి, నీళ్ళవిరేచనములు, వ్రణము, మూర్ఛ, క్షయ, పీనస, నేత్ర, కర్ణ, వక్త్ర, శిరోరోగములు, వాతరోగములు, ఒడలు (దేహము) నొప్పులు, నీరసము, బద్ధకము, జ్వరము, శ్లేష్మోద్రేకము, ఉబ్బురోగము ఈరోగములు గలవారు అభ్యంగనము, శిరస్నానము మానవలయును. వార్ధిక్య దశయందు తరచుగ అభ్యంగన, శిర స్నానములు చేయగూడదు.

స్పంజి:—Spongia officinalis. Eng. Spunge. ఇది సముద్రము లోనుండు రాళ్ళనుబట్టి లేచును. ఇదినీళ్ళలో ముంచి, వ్రణము లను, పుండ్లను కడుగుట కుపయోగముగ నుండును; మరియు దీనిని కాల్చిచేసిన మసి లేక భస్మము లోపలికిచ్చిన కడుపులోమంట, పులి త్రేనుపుల నణచును; దేహమునకు బలముజేయును. దేహములో నుండు మలముల వెడలించును. గండమాల, గొంతుకమీద లేచు కంతి (Goitre), సర్పి మొదలగు పొక్కులు, తామర వీనిని మాన్పును. గడ్డకట్టిన వృషణముల బాగుచేయును. మోతాదు లేహ్య ముగ జేసినది 1 మొదలు 3 డ్రాములవరకు.

స్పృక్క మొగ్గలు:— Trigonella carniculata. Buds of. సం॥ స్పృక్కా, కోటివర్షా, మరున్మాలా. హిం॥ అస్పరక్ పురి. ఇవి పిక్క చెట్టుయొక్క , మొగ్గలు. చేదు, తీపి, వగరు రుచులుగలిగి యుండును; విదాహము, తాపము, వాతజ్వరము, ఉబ్బురోగము, గుల్మరోగము, విద్రధి యనగా నాభిలోబుట్టెడు పుండు వీనిని హరిం చును. వీనిని నీళ్ళతో నూరి తీసిన రసము లేక కషాయము లేక చూర్ణము వాడదగియుండును. రసపుమోతాదు పూటకు 2-3 తుల ములయెత్తు, కషాయపు మోతాదు 4-5 తులములయెత్తు, చూర్ణపు మోతాదు 2 చిన్నములయెత్తువరకు,

స్త్రీచనుబాల పెరుగు:— Curd of woman's milk. త్రిదోషములను, నేత్రరోగములను హరించును. తృప్తి, బలము, అగ్నిదీప్తి వీని నిచ్చును.

స్త్రీచనుబాలలో తీసిన వెన్న, నెయ్యి:— Butter and clarified butter of do. నేత్రరోగములను, సర్వరోగములను హరించును. అగ్నిదీప్తినిచ్చును, చలువగ నుండును. పైత్యముజేయును.

స్వర్ణజీవంతి:—Dregia volubilis. సం॥ స్వర్ణజీవంతికా. హేమవల్లి. హిం॥ పీలీజీవంతి, సఫన్ హరిజీవంతీ. యీ జీవంతులు 6 విధములు. 1 జీవంతి (మనుబాల), 2 స్వర్ణజీవంతి, 3 చోటీజీవంతి, 4 తిక్తజీవంతి, 5 అర్కపుష్పి అను జీవంతి, 6 బృహజ్జీవంతి, స్వర్ణజీవంతిబంగారుఛాయయు పచ్చనిపాలుకలిగియుండును. దీనిసమూలము నుపయోగించవగును. దీనికషాయము, చూర్ణము తీపిరుచి కలిగి చలువ జేయును; రక్తపిత్తము, ఘాతరక్తము,శరీరపుమంటలు వీటిని హరించును; నేత్రములకు మేలుజేయును; వీర్యవృద్ధిని, బలమును గలుగ జేయును. దీని కషాయము 2½-5 తులములు. దీని చూర్ణము 3 మొదలు 5 గురిగింజల యెత్తువరకు.

స్వర్ణభస్మము:—Calx of gold. మేలిమి బంగారమును క్రమముగ శుద్ధిచేసి చేయబడిన భస్మము చేదు, ఒగరు రుచులుగలిగి యుండును. దీనిని సేవించుటవలన శరీరకాంతి, బుద్ధిబలము, వీర్యపుష్టి, ఆయుర్వృద్ధి, ఆరోగ్యము, కామము, స్మృతి,వాచాలత్వము వీనిని గలుగ జేయును; జ్వరము. మేహము, రాజయక్ష్మ, ముదిమి,శ్వాస, కాసలు వాతము, శుక్లనష్టము, పైత్యము, ప్రమేహము, సంగ్రహణి, అతిసారము, కుష్ఠు, విషము, ఉన్మాదము వీనినిబోగొట్టును; సర్వరోగములు గలుగు విషపురుగులను జంపెడి మహత్తర శక్తి (Antidote for all diseases) దీనికి గలదు. జీవశక్తిని కలుగ జేయును. వయస్సును నిలుపును. హృదయమునకు బలము

జేయును. హృద్రోగమునుకూడ నివారణజేయును. సంతోష మిచ్చును; సర్వేంద్రియములకు, నరములకు సత్తువను, శరీరసౌఖ్యమును గలుగజేయును; మేలిమి బంగారముకాని బంగారభస్మము సేవించిన రోగప్రాబల్యమును, అసౌఖ్యమును, బలవీర్య నాశంబును గలిగించును. దీనికి విరుగుళ్ళు 1 శుద్ధిజేసిన కరక్కాయల చూర్ణమును ఖండశర్కరయు సమపాళ్ళుగ గలిపి పూటకు బేడెత్తు చొప్పున రెండుపూటలను వారము దినములు పుచ్చుకొనుటయు, 2 జటామాంసి కషాయము పూటకు 4-5 తులములచొప్పున 10 దినములు పుచ్చుకొనుటయు, మోతాదు ¼ మొదలు 2 గుంజల యెత్తువరకు. లవంగాది, మహాలవంగాదిచూర్ణము, ద్రాక్షాది చూర్ణము మొదలగు చూర్ణములతో పొట్లములు గట్టి ఆయా రోగములకు తగిన అనుపానములతో సేవించిన సర్వరోగములను నివారణజేయుటయేగాక అపుత్రునకు పుత్రసంతానము సంతానం లేని స్త్రీకి సంతానప్రాప్తి కలుగును.

స్వాతివర్షము:— Rain that falls in Swati (about October) గంగానది యుదకమువలె నిర్మలముగను, సమస్తప్రాణులకు హితవుగ నుండును. ఆరోగ్యము నిచ్చును.

—౦—

## హ

హంస:—Swan-flesh of. సం* శ్వేత. ధార్తరాష్ట్ర), మనోరమ. దీని మాంసము వాతమును బోగొట్టును; కాంతిని, దేహపుష్టిని, వీర్యమునకు వేడిని, వృద్ధిని యిచ్చును; సుస్వరమును గలుగజేయును.

హంసతూలికపాన్పు:— Swan's down bed or couch. చలువ జేయును; అత్యంతమృదువునై, త్రిదోషహారమై యుండును; వీర్య వృద్ధి, బలము నిచ్చును; కాంతి, నేత్రములకు చలువ జేయును.

హంసపాది:—Vits Pedata, Cissus pedatus. సం॥ హంసపాది, గోధాపాదీ, విశ్వగ్రంధి. హిం॥ హంసపాదీ. దీని సమూలరసము లేక కషాయము చేదుగ, కారముగ నుండును; శీతపైత్యమును హరించును. రక్తపైత్యమును హరించును;వీర్యమునకు వేడిజేయును; పుండ్లను మాన్పును; అనేకరోగములను బోగొట్టును; రసముయొక్క మోతాదు 2 మొదలు 8 తులముల యెత్తువరకు, దీని ఆకు నూరి రాయుచుండిన కురుపులు వ్రణములు మానును. దీనిఆకు కొంచం కవిరి మిరియాలు నేస్తలైన వుండలు అర్రికర్పూరం కలిపి నూరి రాసినను గజ్జికురుపులు పుర్రెమాదలు, వ్రణములు మొదలగున వన్నియు మాని పోవును.

హంసోదకము :–Water of a tank or pond exposed to sun's & moon's rays. సం॥ హంశోదక. హిం॥ బోదల్ వఘలకాదులు చెప్పబడక పగలు సూర్యకిరణములచేత గాగి రాత్రి చంద్రకిరణముల చేత చలువకెక్కిన తటాకాదుల యుదకమునకు హంసోదకమందురు. ఈ నీరు త్రిదోషములను గొట్టును; రుచిగలిగి మనోహరముగను, తేలికగను చలువ నిచ్చునదిగ నుండును; బలము కాంతినిచ్చును. విషమును, హరించును; ఔషధతుల్యముగ నుండును. ఆరోగ్యము నిచ్చును.

హరిదళము దీనిభస్మము:—yellow orpiment & its calx. సం॥ హరితాళ, నటమండన. హిం॥ హరితాళ. అనగా పిండతాళ కము క్రమముగ శుద్ధిచేయుబడిన హరిదళము లేక దీని భస్మము

శ్లేష్మమును, రక్తవాతమును, కుష్ఠు, విషము, విషమజ్వరము, ఎనుబదివాతములు, కఫ, పిత్తరోగములు, ప్రమేహము, మూల వ్యాధి మొదలగు రోగములను హరించును; భూతముల పోగొట్టును, గర్భస్రావము గలిగించును; మోతాదు పూటకు ½ మొదలు రెండు గురిగింజలయెత్తు. భస్మమును 1–2 అణాల ఎత్తు పటికిపంచదార చూర్ణములో గలిపి సేవింపవలయును. అపరిశుద్ధ హారిదళము లేక అపరిశుద్ధ అపక్వహారిదళ భస్మము యొక్క సేవ వలన వాత రోగములు, పైత్యరోగములు, పంగుత్వము, కుష్ఠు వీనిని గలుగ జేయును. పీతధూమవర్ణములదెచ్చును; నాశనము జేయును. దీనికి విరుగుళ్ళు 1 బియ్యపుకడుగు, 2 సర్పాక్షీరసములో సమముగ శర్కర గలిపిపుచ్చుకొనుట, 3 జీలకర్ర, శర్కర వీనిని సమ ముగ నేకముజేసి పుచ్చుకొనుట, 4 దానిమ్మ పండ్లరసము, 5 వాకుడువేళ్ళు నేలవేము వీనిని సమముగ గ్రహించిన కషాయము వీనిలో దేనినైనను 5, 6 దినములు రెండుపూటలు పుచ్చుకొన వలెను.

హారతికర్పూరము:—కర్పూరము చూడుడు.

హింగుపత్రము:—Ferula Alliacea-leaves of. Eng. Leaves of Assafoetida tree. సం॥ హింగుపత్రీ. త్వక్‌పత్రీ. హిం॥ హింగు పత్రి. అనగా ఇంగువచెట్టుఆకు. దీనిచూర్ణము లేక కషాయము కారము; చేదు రుచులు గలది; కాకజేయును; త్రిదోషములు కడుపులోనిబల్ల, ఉదరము, గుల్మము, మూలవ్యాధి, ఆమము, క్రిమి, మలబద్ధము వీనిని హరించును; రుచిబుట్టించును; అగ్నిదీప్తి నిచ్చును; జీర్ణముగావించును; చూర్ణపు మోతాదు పూటకు 1 మొదలు 2 అణాలయెత్తు. కషాయపు మోతాదు పూటకు 2½ మొదలు 5 తులముల యెత్తువరకు.

హేమసాగర:—బీజపత్రము చెట్టుచూడుడు.

హేమమాక్షికము, తారమాక్షికము:—Iron pyrites. స॥ స్వర్ణమాక్షిక, రజతోపమ. హిం॥ సోనామాఖీ, రూపామాఖీ, (తారామఖీ) హేమమాక్షికము పసుపువన్నె బంగారమువలె పలకలుగ, ఘట్టిగాను; తారమాక్షికము పసుపువన్నె వెండిరూపముగ, పలకలుగలిగి ఘట్టిగానుండును. క్రమముగ శుద్ధిచేసి చేయబడిన వీని భస్మములు త్రిదోషహరములై యుండును. మూలవ్యాధి, క్రిమిరోగము, కుష్ఠు, సన్నిపాతము, జ్వరము, ఉబ్బు, కఫపైత్యములు, వ్రణములు, రాజయక్ష్మ, మేహము, నేత్రరోగము, భ్రమ, శ్వాస కాస, పాండువు, చర్ది, ఉపిరిగొట్టుకొప్పి వీనిని పోగొట్టును. వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి వీని నిచ్చును. తేలు, జెర్రి, పాము విషములను పోగొట్టును. ఉలిమిరాల రసముతో యివ్వవలెను. దోషయుక్త హేమమాక్షిక సేవవలన గలిగిన వికారము ఉలవకట్టునైనను, దానిమ్మకాయల రసమునైనను త్రాగిన నివృత్తించును. మోతాదు 2 మొదలు 4 గుంజల యెత్తువరకు.

హ్రస్వపంచ మూలములు:—* విష్టపంచ మూలములు చూడుడు.

—క—

# క్ష

క్షారద్వయము, క్షారత్రయము, క్షారపంచకము, క్షారషట్కము, క్షారసప్తకము, క్షారాష్టకము, క్షారదశకము:—Compound of ashes of 2, 3, 5, 6, 7, 8, & 10 drugs.

క్షారద్వయమనగా సజ్జాక్షారము, యవక్షారము.

క్షారత్రయమనగా సజ్జాక్షారము, యవక్షారము, టంకణక్షారము.

క్షారపంచకమనగా యవక్షారము, సజ్జాక్షారము, మొక్కపుచెట్టు, మోదుగ, నువ్వుచెట్టు వీని క్షారములు.

క్షారషడ్కమనగా నువ్వుచెట్టు, మోదుగ, వస, ఉత్తరేణి, కొడిశపాల, మొక్కపుచెట్టు వీనిక్షారములు.

క్షారసప్తమనగా సజ్జాక్షారము, యవక్షారము, టంకణ (వెలిగార) క్షారము, సౌవర్చలవణము, మోదుగ, సూరేకారము, ఉత్తరేణి వీని క్షారసముదాయము.

క్షారాష్టమనగా మోదుగ, మునగ, ఉత్తరేణి, చింతచెట్టు, జిల్లేడు, నువ్వుచెట్టు, యవాక్షారము, సజ్జాక్షారము వీనిక్షారసముదాయము.

క్షారదశకమనగా మునగ, ముల్లంగి, మోదుగ, చుక్కకూర, చిత్రమూలము, అల్లము, వేము, చెరుకు, అరటి, ఉత్తరేణి వీనిక్షారములు. పైనవివరించిన ఏ సముదాయమునైనను సేవించిన సమస్త శూలలు, గుల్మరోగములు, ఉదరము, ఆమము, వాతము, అజీర్ణములను హరించును. విరేచనముజేయును. జఠరాగ్నిని వృద్ధిపరచును.

క్షీరకంచుకి:—కాంచనక్షీరి చూడుడు.

క్షీరకాకోళి:—Gymnema lactiferum. Eng. cylon cow plant. సం॥ క్షీరకాకోళి, వయస్థ. హిం॥ క్షీరకాకోళి. దీనిదుంప పాలు గలిగియుండును. ఇది సిలోను దేశములో దొరకును. దీనిని బాలకు బదులుగా వాడుదురు. దీని ఆకులను కూర వండుకు తిందురు. దీని దుంప స్త్రీల గర్భదోషముల హరించి, పిండమునకు బలము, ఆయువునిచ్చును. స్త్రీలకు పాలు వృద్ధిచేయును. దీని కషాయము లేక చూర్ణము కఫపైత్యములు, క్షయ, హృద్రోగము, శ్వాస, కాస, జ్వరము, తాపము వీనిని పోగొట్టును. వయస్సును నిలుపును; వీర్యవృద్ధి, కాంతి నిచ్చును. కషాయపు

మోతాదు 2-3 తులముల యెత్తువరకు, చూర్ణపు మోతాదు 1 అణా మొదలు 2 అణాల యెత్తువరకు.

క్షీరమిత్రములు:—Articles compatible with milk. సైంధవ లవణము, శొంఠి, పొట్లకాయ, చెంచలికూర, గోధుమలు, మినుములతో నెయ్యి, శర్కర కలిపి చేసినపదార్థములును, నెయ్యి, శర్కర, పెద్దఉసిరికాయ, ద్రాక్షపండ్లు, అరటిపండ్లు, అల్లము, మిరియము, వెన్న, గంజి, తియ్యనిపండ్లు ఇవి పాల కనుకూలించును. వీనిలో సైంధవలవణము, శొంఠి, శర్కర, మిరియములు పాలలో గలిపి పుచ్చుకొన దగియుండును. తక్కినవి పుచ్చుకొనినప్పుడాపాలు గాని, పాలుపుచ్చుకొనినప్పుడా వస్తువులనుగాని పుచ్చుకొనిన ఆరోగ్యముగను, సౌఖ్యముగనుండును.

క్షీరమిత్రమాంసములు :—Flesh of birds and animals compatible with milk. నెమలి, కౌజు, గువ్వ, పావురము మొదలగు అడవిపక్షులు, మేక, దుప్పి, కణుజు, లేడి మొదలగు వన్య మృగముల మాంసములు పాల కనుకూలించును. ఈమాంసమును పుచ్చుకొనునప్పుడు నేత్రశిరోరోగులుతప్ప తక్కినవారు పాలు పుచ్చుకొన వచ్చును. అందరును బలమును, కాలమును, దేశమును ఎరిగి పుచ్చుకొనవలెను.

క్షీరవిరుద్ధములు:— Articles incomatible with milk. పాలలో ఉప్పుగాని, బెల్లముగాని కలిపి త్రాగిన కుష్ఠురోగమునైనను, మేహరోగమునైనను, మూత్రకృచ్ఛ్రరోగమునైనను కలుగజేయును. చేపలు, కోడిగ్రుడ్లు, క్రొవ్వుగల పదార్థములు, మాంసము, బెల్లము, మినుములు, దుంపలు ఇవి పాలు పుచ్చుకొనినప్పుడు పుచ్చుకొనిన కుష్ఠురోగమును బుట్టించును. పాలుత్రావి కూరగాయలు, నేరేడుపండ్లు, కల్లు, సారాయి పుచ్చుకొనిన సర్పవిషమువలె హానిజేయును.

మరియు చి.తపండు, నిమ్మపండు, తెలకపిండి, ఉలవలు, వెదురు దవ్వ, పెరుగు, చల్ల ఇవి పాలకు విరోధులు. పాలుద్రావినతోడనే తాంబూలము వేయకూడదు.

క్షీరవిశేషగుణములు :— Properties of milk of different Animals. గొర్రెపాలు వాతమును, గేదెపాలు పైత్యమును, ఆవు పాలు వాతమును, పైత్యమును, మేకపాలు త్రిదోషములను బోగొట్టును. మేకపాలు శిశువులకును, ఆవుపాలు వృద్ధులకును, గేదెపాలు గాయములుతగిలినవారికిని, ధాతుక్షయమైన వారికిని మిక్కిలి పథ్యముగ నుండును.

క్షీరాన్నము:—Rice or sago or wheat grits boiled in with sugar. పాలు అధికముగను, బియ్యము లేక గోధుమనూక లేక సగ్గుబియ్యము తక్కువగను వేసి చేయబడినది రుచిగా మనోహరముగ నుండును; దాహమును బుట్టించును. బలము జేయును. వాతము, శ్లేష్మము, వాతపైత్యము, పరిణామశూల వీనిని బోగొట్టును; వీర్యవృద్ధినిచ్చును; బాలురకు, వృద్ధులకు ననుకూలముగ నుండును; కొద్దికాక, పైత్యము జేయును. దీనికి విరుగుడు పెసరపప్పు; మరియు పాలు చూడుడు.

స ం పూ ర్ణ ము.



# ఈగ్రంథము ననుసరించి యేయే వస్తువులు యేయే వ్యాధుల కుపయోగించునో వానిని కనుపరచు వర్గువారి పట్టిక.

# CLASSIFICATION OF ARTICLES ACCORDING TO THEIR THERAPETIC ACTION

## అ

అండవృద్ధి, అంతర్వృద్ధిహరములు:—Articles indicated for Hydrocle & Hernia. ఆముదము, ఏడాకులపొన్న, కత్తిమందు, కొబ్బరికాయచెట్టు, గచ్చకాయ, జీడిమామిడిపండు, తూటికూర, నిద్రగన్నిక, పుగాకు, పెద్దమాలగొండుచెట్టు, గొండచెట్టు, బొప్పాయి కాయి. బోడతరము, మేకపంచితము, యవక్షారము, వామిచెట్టు,

అంతర్గతజ్వరహరములు:—Do for internal fever. ఇకుము, ఉక్కు గుంటకలగర, జాపత్రి, తిప్పతీగె, మంగచెట్టు, రససింధూరము, లక్క, వరగోగు, వస, విష్ణుక్రాంతము.

అగ్నిదీప్తికరములు అనగా ఆకలిని బుట్టించునవి:—Articles that stimulate appetite or appetisers. అంబాళము, అజామోద చెట్టు, అజామోదవిత్తులు, అడవిజీలకర్ర, అడవికంద, అడవితులసి, అడవి నువ్వులు, అడవిపసుపు, అడవిమాదీఫలము, అతివస, అన్న భేది, అభ్రకభస్మము, అమ్రూద్ పండు, అంమ్లవిశేషము, అల్లము, అష్టగుణమండము, ఆవాలపిండి, అవాలు, అవిసిచెట్టు, ఆకుపత్రికము, ఆగాకరకాయలు, ఆముదము, అంమ్లవేతనము, ఆవునెయ్యి, ఆవు పాలు, ఆవువెన్న, ఆక్షీకమద్యము, ఇంగిలీకము, ఇంగిలీకభస్మము, ఇంగువ, ఇనుము, ఇనుపభస్మము, దీని సింధూరము, ఉక్కు, ఉక్కుభస్మము, దీని సింధూరము, ఉప్పు, ఉలవలు, ఉలిమిడిచెట్టు ఉస్తికాయలు, ఉసిరికచెట్టు, ఉసిరికాయలు, ఉడుముమాంసము, ఉప్పుద్రావకము, ఊరపిచ్చుక, ఊడుగపండు, ఏడాకులపొన్న,

ఏలకులఅరకు ఓమము, ఓమపునూనె, కంద, కరక్కాయ, కంపిల్ల కము, కరివేపాకుచెట్టు, కల్లు, కర్పూరతైలము, కాకరాకు, కాచ లవణము, కాండేగుపండ్లు, కుందేలు, కుక్కవావింట, కోడిసెల పాలచెట్టు, కొత్తిమిరి, కామంచిచెట్టు, కాకిమాంసము, కలినీళ్ళు, కొర్రలు, కొబ్బరికాయనీళ్ళు, కొబ్బరికల్లు, కృష్ణతులసి, గంధకము, గంధకధృతి, గజపిప్పళ్ళు, గలిజేరు, గజనిమ్మకాయ, గురజకాయ, గుర్రపుపాలు, గాడము, గంజాయి, గేదెసుగంధి, గోమూత్రము, ఘృతిమరీచి, చండ్రచెట్టు, చనుబాలు, చపలభస్మము, చాతుర్జా తము, చేమంతిచెట్టు, చేమంతిపువ్వు, చించలము, చిన్నపల్లేరు, చింతచెట్టు, చింతపువ్వు, చిత్రమూలము, చిరికూరచెట్టు, చిలుక కూర, చిలుకతోటకూరచెట్టు, చేతిపొట్ల, చెవ్యము, జాపత్రి, జీడి మామిడిపండు, జీలకర్ర, టెక్కోలపుట్లు, తగరభస్మము, తముల పాకులు, తాటికల్లు, తాడికాయ, తామ్రభస్మము, తాళిసపత్రి, తిప్పతీగె, తుమ్మికూర, త్రికటుకము, త్రిజాతము, త్రిసమము, తుంగముస్తలు, తుంబురులు, తులసి, తెల్లావాలు, తేయాకు, దింతెన, దానిమ్మచెట్టు, ధనియాలు, ధారోష్ణాలు, దుందిలపుకాయ, దుష్టపుచెట్టు, ద్రాక్షాసవము, నల్లమందు, నల్లములక, నిమ్మపండు, నీరుల్లిపాయ, నీలభస్మము, నువ్వులు, నువ్వులనూనె, నేరేడుపండు, నేలతంగేడుచెట్టు, నేలతాడి, నేలవేము, నల్లేరు, నేలములక, పంచ సుగంధములు, పంచకాంచనము, పటికిపంచదార, పసపు, పాదరసము, పిన్నసదాప, పిప్పళ్ళు, పిన్నపాపర, పిప్పలిమూలము, పులిచెంచలి, పుల్లబచ్చలి, పుష్యరాగభస్మము, పుదీనా, పెద్దజీలకర్ర, పెద్దపల్లేరు, పెన్నేరు, పేలాలు, బాలింతబోలు, బిడాలవణము, బుడమకాయ, భూతులసి, బెల్లము, మద్యము, మహిసాక్షి, మారేడు, మాధీ ఫలము, మామిడిపిందెలు, మిరియాలు, ముత్యపుచిప్పల సున్నము,

మునగవేరు, ముత్యముల భస్మము, ములుదోసచెట్టు, మేకనెయ్యి, మొక్కపుకాయ, యవక్షారము, రమ్మసారాయి, రసకర్పూరము, రసభస్మము, రాజావర్తభస్మము, రూమీమస్తకి, రేణుకలు, లవంగాలు, వాయింటచెట్టు, వస, వాకుడుకాయ, వాసిలిచెట్టు, వెంపలిచెట్టు, వెదురు, వెలిగారము, వెల్లుల్లి, వేగిసచెట్టు, వేపచిగుళ్ళు, సెనగలు, సెనగపులుసు, శంఖభస్మము, శొంఠి, షాజీర, సర్జక్షారము, సదాపచెట్టు, సన్నావాలు, సముద్రలవణములు, సరస్వతీయాకు, సీమవంకాయ, సైంధవలవణము, సీకాయచెట్టు, సౌవర్చలవణము, హింగుపత్రము, బిడ్డల అగ్నిదీప్తికరములు చూడుడు.

అగ్నిమాంద్యహరములు:—Articles indicated for dyspepsia, అక్కలకర్ర, అడవిఅల్లము, అన్నభేది, అయస్కాంతభస్మము, అరటికాయ, అల్లము, ఆవాలు, ఇంగువ, ఇండుపగింజలు, ఇనుము, ఉక్కు, ఉప్పిచెట్టు, ఉసిరికాయ, ఉసికాయలు, ఉలిమిచెట్టు, ఎర్రగన్నేరు, ఓమపునూనె, కర్కాటకశృంగి, కర్పూరశిలాజిత్తు, కవిరి, కస్తూరి, కాకిదొండచెట్టు, కానుగచెట్టు, కుశదర్భగడ్డి, కూతురుబుడమ, గచ్చచెట్టు, గంధకచోరము, గురుగుకాయ, గంజాయి, గవ్వభస్మము, గోరోజనము, చక్రవర్తికూర, చనుబాలు, చనుబాల విత్తులు, చలువమిరియాలు, చేమంతిపువ్వు, చేమంతిపువ్వులఅరకు, చిత్రమూలము, చిన్నపల్లేరు, చిన్ని చెట్టు, చీనాపంచదార, చెముడు చెట్టు, చెవ్యము, చేదుఆనబచెట్టు, చేదుపొట్ల, జాజికాయ అరకు, జాజికాయ, జాజిచెట్టు, జిల్లేడుపువ్వు, జీలకర్ర, తిక్కాడచెట్టు, తెల్లగన్నేరు, దింతెన, దాల్చినిఅరకు, దుంపరాష్ట్రము, నాగకేసరములు, నారింజపండుతొక్కలు, నిద్రగన్నిక, నీలిచెట్టు, నీరుల్లిపాయ, నెల్లిచెట్టు, నేలములక, పగడభస్మము, పసుగడుగు, పంచకోలములు, పంచమూలములు (గురు), పిన్నదూలగుండ, పిప్పలిమూలము,

పుదీనా, పులిచెంచలి, పెద్దగజ్జేరు, పొత్తిదుంప, పుగాకు, బూడిద గుమ్మడికాయ, బొగ్గు, మాండూరము, మాదీఫలము, మదనానబ చెట్టు, మదనానబపండు, మారేడుపండు, మారేడుచెట్టు, మహిసాక్షీ, మిరపకాయలు ఎండువి, మిరియాలు, మాసిపత్రి, ముసాంబ్రము, మేకనెయ్యి. యవక్షారము, రసకర్పూరము, రసభస్మము, రససింధూరము, రేవల్చిన్ని, లవంగాలు, లోహభస్మము, వస, వాయువిడంగములు, వెంపలిచెట్టు, వెణుతురుచెట్టు, వెల్లుల్లి. శిలాధాతువు, శొంఠి, సదాపచెట్టు, సంపెంగచెట్టు, సర్జక్షారము, సన్నరాష్నము, సోపు.

అజీర్ణవిరేచనములను కట్టునవి:—Articles indicated for diarrhoea from indigestion. అగరు, అడవి, అల్లము, అల్లము, ఓమము, కర్పూరతైలము, కొండచీపురుగడ్డి, తాబేలుచేదుకట్టు, తొగరుచెట్టు, ధనియాలు, నరమామిడిచెట్టు, పతంగిచెట్టు, మిరియాలు, ముత్యములభస్మము, యూకలిప్టసు అను ఆయిలు, వెంపలిచెట్టు, శొంఠి.

అజీర్ణశూలహరములు:—Do. for colic from indigestion. ఆవాలు, ఇంగువ, ఓమము, కామంచిపూరి, కాజీపుట్ తైలము, చేమంతిపువ్వు, టర్పెన్టైన్ తైలము, యూకలిప్టసు ఆయిలు, శంఖభస్మము, శొంఠి, సదాపచెట్టు, వెల్లుల్లి. బిడ్డల అజీర్ణశూలహరములు చూడుడు.

అజీర్ణహరములు:—Do. for indigestion. అంజీరుపండు, అరటికాయ, అల్లము, అడవిఅల్లము, ఆవాలు, ఆమ్లవేతసము, ఇంగువ, ఉత్తరేణిచెట్టు, ఏదుబంది, ఏలకుల అరకు, ఓమము, ఓమపునూనె, కస్తూరి, కాసినగింజలు, కామంచిపూరి, కురంజీవామము, కొండచీపురుగడ్డి, గంధఫెరోజా, చంద్రచెట్టు, చనుబాలవిత్తులు, చింత

పండు (పైత్యఅజీర్ణహారము), జాజికాయ అరఖు, జీలకఱ్ఱ, జటా మాంసి, టర్ పెన్ టయిను తైలము, తములపాకులు, తాంబేలు చేదుకట్టె, తేయాకు, దాల్చినిఅరఖుచెక్క, ధనియాలు, నల్లజీలకఱ్ఱ, నల్లేరు, నువ్వుచెట్టు, నీరుల్లిపాయ, నేరేడుచెట్టు, పంచమూలములు (గురు), పుదీనా, పేరి టచెట్టు, బ్రహ్మదండిచెట్టు, దీని క్షారము, బ్రాంది, మఱ్ఱిచెట్టు, మానుపసు, మారపకాయ (ఎండుది), మహి సాక్షి, ముల్లంగి, మొమ్మాయి, రమ్మపారాయి, రూమిమస్తకి, రేవల్చిన్ని, లవంగాలు, లవంగాలనూనె, వెల్లుల్లి, శొంఠి, వస, సర్జక్షారము. బిడ్డల అజీర్ణహారములు చూడుడు.

అడ్డగఱ్ఱలుహరించునవి:— Articles indicated for buboes. ఉసిరిపాల, గంధఫెరోజా, గచ్చకాయ, చేమచెట్టు, చిత్రమూలము, మహిసాక్షి, ముండ్లతోటకూర, మునగజిగురు, సీమవెట్టతామర చెట్టు, రసకర్పూరము, రసభస్మము.

అతిబలుపు హారములు:— మేదోరోగహారములు చూడుడు.

అతిమూత్రమును కట్టునవి:— Articles indicated for diabetes. అడవిపొన్న. ఆదొండచెట్టు, అన్నభేది, అభ్రకభస్మము, ఉలిమిడి చెట్టు, ఎలుకచెవికూర, కసివిందచెట్టు, కానుగచెట్టు, కాసినిగింజలు, కిక్కసగడ్డి, కూతురుబుడమ, కృష్ణతులసి, గబ్బిలము, గొలిమిచెట్టు, తంగేడుపువ్వు, తంగేడుబంక, తంగేడుచెట్టు, తిప్పతీగ, తేనె, దోస గింజలు, ద్రాక్షపండ్లు, నల్లమందు, నేరేడుచెట్టు, వీని విత్తులు, నేల యుసిరికచెట్టు, నేలతంగేడు, పగడభస్మము, పటిక, పచ్చకర్పూ రము, పాలగుండ, పిండికొండచెట్టు, బూడిదగుమ్మడికాయ, బూరుగ చెట్టు, బొడ్డిచెట్టు, మంజిష్ఠ, మనుబాల, మఱ్ఱిచెట్టు, మామిడిపిం దెలు, మేడిచెట్టు, మొమ్మాయి, రత్నపురుష, రససింధూరము, లవంగాలు, వెల్లుల్లి, వేపపండు, వేపజిగురు, శంగపావిలకూర, సన్న రాష్నము, సున్నము.

అతిసారహారములు:—Do. Profuse diarrhoea or involuntary motions. అంతరతామర, అందుగుచెట్టు, అంబాళము, అరటిచెట్టు, అరటికాయ, అరటిపువ్వు, ఆకుపత్రికము, ఇంగిలీకము, దీనిభస్మము, ఉసిరికచెట్టు, ఎర్రకలువదుంపలు, ఏడాకులపొన్న, ఓమము, కందులు, కరక్కాయ, కరివేపాకుచెట్టు, కర్కాటకశృంగి, కర్పూరము(హారతి) కురువేరు, కోడిసెపాలవిత్తులు, కృష్ణాగరు, ఖర్జూరపుకాయలు, గజపిప్పళ్ళు, గెంజాయి, గైరికము, గ్రంథితగరము, చనుబాలు, చెవ్యము, జీలకర్ర, జటామాంసి, జాజికాయ, జాపత్రి, తవాక్షీరి, తామ్రభస్మము, తుంగముస్తలు, తేనె, దానిమ్మచెట్టు, దుందిలపుచెట్టు, నల్లమందు, నేరేడుచెట్టు, తపసిచెట్టు, ధాతకీకుసుమము, పంచపల్లవములు, పసగడుగు, పాఠచెట్టు, పిల్లిపీచర, పేలాలు, ప్రేంఖణపుచెట్టు, బలుసుచెట్టు, బూరుగబంక, భద్రముస్తలు, భూతపిల్లిగడ్డ, మంగుస్తానుకాయ, మంచిగంధం, మర్రిచెట్టు, ముత్యముల సున్నము, మయూరశిఖ, మహిసాక్షి, మామిడిచెట్టు, మేడిచెట్టు, మునుగుదామర, మెట్టదామర, రేగుచెట్టు, రేణుకలు, రక్తచందనము, రావిచిగుళ్ళు, లక్క, లొద్దుగచెట్టు, వట్టివేళ్ళు, విమబొద్ది, వెలగచెట్టు, వెలిగారము, వేపజిగురు, సముద్రపాలవిత్తులు, సర్జరసము, స్వర్ణభస్మము, చీనాపంచదార, పెద్దదూలగొండిచెట్టు, ఈరెండును మేహాతిసారహారములు. రక్తాతిసారహారములు చూడుడు.

అపస్మారహారములు:- Do. for Hysteria or unconsciousness. అంబరు, ఓమము, కత్తిమందుచెట్టు, కర్పూరము (హారతి), కాకిదొండచెట్టు, కాజీపుట్ తైలము, కుంకుమపువ్వు, కారుబా, గంధఫెరోజా, గంజాయి, గాడిదమూత్రము, చిన్నదూలగొండి, జటామాంసి, జిల్లేడుపువ్వు, టర్పెన్టైను తైలము, తములపాకులు, తురకవేపచెట్టు, తువరిమన్ను, నరమూత్రము, నవాసాగరము, పద్మ

పూతిక, పసపు, పెద్దదవనము, ప్రాతనెయ్యి. పుదీనా, బోడసరము, మంచిగంధం, మట్టితైలము, మహిసాక్షి, మాసిపత్రి, మునగవేరు, ముషిణిగింజలు, మెట్టతామర, యూక్లిప్టసుఆయిలు, వస, వెలిగారము, వేపఆకు, సర్జక్షారము, సదాపచెట్టు, సరస్వతియాకు, సాంబ్రాణిచెట్టు, సీమగోరింటవిత్తులు.

అభిఘాతజ్వరహరములు:— Do. for fever resulting from cuts and injuries or fatigue & exhaustion. అడవిజీలకర్ర, తెల్లజిల్లేడు, చనుబాలు, కాకిదొండచెట్టు, చింతపండు, జిల్లేడుచెట్టు, తిప్పతీగె, మునగవేరు.

అమితత్రేనుపులను కట్టునవి:— Do. for excessive belches or eructations. ఉలిమిచెట్టు, ఓమము, కామంచిపూరి, కొబ్బరిచెట్టు, పుదీనా, రూమిమస్తకి, లవంగాలు, షాజీరా. త్రేనుపులను తెచ్చునవి చూడుడు.

అరచేతుల, కాళ్ళపారలను హరించునవి:— Do. for scaly eruptions on the palms or soles of feet. అల్లము, నీటిబ్రబ్బలిచెట్టు, వేపనూనె.

అరుచిహరములు:— Do. for tastelessness or disiclination to take food. అక్కలకర్ర, అజామోదచెట్టు, అడ్డసరము, అతివస, అల్లము, అయస్కాంతభస్మము, అవిసిచెట్టు. ఉస్తికాయ, ఆలుబఖారా, ఉస్తిచెట్టు, వాయిలి, ఎర్రావడచెట్టు, ఏలకుల అరకు, ఏలకులు, కరక్కాయ, కర్కాటకశృంగి, కర్పూరతైలము, కలిగొట్టుచెట్టు, కురువేరు, కూతురుబుడమ, చనుబాలు, చేమంతిపువ్వు, చేమంతిపువ్వులఅరకు, చేదుపొట్ల, జాజికాయ, తక్కోలములు, తవాక్షీరి, తాళీశపత్రి, త్రిజాతకము, తెల్లగలిజేరు, దశమూలములు, దానిమ్మచెట్టు, దుందిలము, దుందిలపుకాయ, దేవదాళితీగె, ద్రాక్షపండు, ధనియాలు, నల్లవాయిలి, నిమ్మపండు, పచ్చకర్పూరము, పాల

సుగంధి, పుష్కరమూలము, పెగ్గుమ్ముడు, బిడాలవణము, మంచి గంధము, మాండూరము, మాదీఫలము, ముత్తువపులగము, ముత్యపుచిప్పల సున్నము, యష్టిమధుకము, లవంగాలు, లొద్దుగ చెట్టు, లోహాభస్మము, వాకుడుచెట్టు, వెల్లుల్లి, వైక్రాంతభస్మము, రససింధూరము, శొంఠి, సర్జరసము, సర్జక్షారము, సీకాయచెట్టు.

—౧—

## అ

ఆకలిదప్పికల నణచునవి:—Articles that satiate appetite and thirst. అంబలి, చనుబాలు, నేలతంగేడుచెట్టు, బియ్యపునూకల జావ, బోడతరము, పచ్చకర్పూరము, పానకము,

ఆకలి బుట్టించునవి:—అగ్నిదీప్తికరములు చూడుడు.

ఆనికాయలను హరించునవి:— Articles indicated for corns. ఏనుగులద్ది, ఈడిమామిడిపండు, మనుష్యుడు.

అప్యాయము నిచ్చునవి:— Articles that produce wholesomeness. కృష్ణతులసి, పటికిపంచదార, పానకము, పుగాకు, మందారపుష్పము, మద్యము.

ఆమవాతపునొప్పులు హరించునవి:—Articles indicated for gout i. e., antarthritics. అగరు, అయస్కాంతభస్మము, ఈశ్వరి చెట్టు, ఉక్కుభస్మము, దీనిసింధూరము, కర్పూరము (హారతి), కస్తూరి, కాంగ్రేగుచెట్టు, కొడిసపాలచెట్టు, కృష్ణాగరు, గంధకము, చంద్రచెట్టు, జిల్లేడుచెట్టు, తగిరిశచెట్టు, తిప్పతీగె, తెల్లమద్దిచెట్టు, సరళదేవదారు, నేలవేము, పిన్నదూలగొండ, పిప్పలిమూలము, పిప్పళ్ళు, భూతాంకుశపుచెట్టు, మహిసాక్షిగుగ్గిలము, మామిడిచెక్క, మిరియాలు, మిరపకాయ (ఎండుది), మునగతైలము, ముషిణిగింజలు, మార్కండచెట్టు, మాండూరము, యవక్షారము, వెణుతురుచెట్టు,

వృద్ధదారు, వెర్రిపుచ్చచెట్టు, వెల్లుల్లి, శొంఠి, సంపెంగచెట్టు, సన్నరాష్ట్రము.

ఆమవికారహరములు:—Do. for excess of mucus in the bowels. అడవితులసి, ఆరుగండ్లకచోరము, ఉస్తికాయ, ఉస్తిచెట్టు, ఎలుకచెవికూరచెట్టు, ఓమము, కరిపిల్లము, కురంజివామము, చంద్రచెట్టు. చనుబాలు, చక్రవర్తికూర, తెల్లదింతెన, తెల్లములక, తెల్లావాలు, దుందిలపుకాయ, దేవదారుచెట్టు, నీలిచెట్టు, పాచితీగె, పాలచెట్టు, పాదరసము, బిడాలవణము, ముల్లంగి, మొమ్మాయి, లవంగాలు, రుబ్బేరేవన్, రేలికాయగుంజు, వావుడుచెట్టు, హింగుపత్రము.

ఆమశూలహరములు:—Do. for colic by collection of mucus or bad secretions in the bowels. కాయఫలచెక్క, పిన్నపాపర, మాండూరము, శంఖభస్మము.

ఆయుర్వృద్ధికరములు:— Articles conducive to longevity. అంతరతామర, అక్రోటు, అభ్రకభస్మము, అడవియుల్లి, అయస్కాంతభస్మము, ఆవుపాలు, ఆవువెన్న, ఆవునెయ్యి, ఇంగిలీకము పీనిభస్మము, ఇనుము, ఉక్కు, ఉక్కుభస్మము, దీని సింధూరము, ఉసిరికాయ, కరక్కాయ, కర్పూరశిలాజిత్తు, కాకిమాంసము, కామంచిచెట్టు, కుంకుమపువ్వు, కోలపాలకూర, గంధకము, గుంటకలగర, గుమ్ముడుచెట్టు, గోమూత్రము, గెద్దమాంసము, తగరభస్మము, తిలకపుచెట్టు, తిప్పతీగె, తెల్లగల్జేరు, తెల్లమిరియాలు, నల్లేరు, నిమ్మపండు, నెమలిమాంసము, నేలగుమ్మడి, నేలతాడి, పాదరసము, పుష్యరాగభస్మము, పిల్లిపీచర, బంగారపువరకు,బంగారపురాపిడి, మద్యము, మర్రిచెట్టు, మాండూరము, ముత్యములభస్మము, మనుబాల, మేడిచెట్టు, రజతభస్మము, రససింధూరము,

రసకర్పూరము, లోహభస్మము, దీని సింధూరము. వజ్రభస్మము, వైక్రాంతభస్మము, సరస్వతియాకు, వెల్లుల్లి, శంఖపుష్పి, శ్వేతాభ్రకము, సోమలత, స్వర్ణభస్మము, హేమమాక్షికము.

ఆరోగ్యకరములు:— Articles conducive to health అంబలి, అభ్రకభస్మము, అయస్కాంతభస్మము, అవిసిచెట్టు, కర్బూజాపండు, కస్తూరి, కామంచిచెట్టు, కృష్ణాగరు, గంజాయి, చెపలభస్మము, జాపత్రి, తమలపాకులు, తామ్రభస్మము, తిలకపుచెట్టు, తుమలి మన్ను, తెల్లగలిజేరు, దవనము, ద్రాక్షాసవము, ద్రాక్షపళ్ళు, నీరుల్లిపాయ, నేలతంగేడుచెట్టు, నేలతాడి, పాదరసము, పిక్కచెట్టు, పిల్లిపీచర, బంగారపువరకు, బావంచాలు, మద్యము, మాండూరము రజతభస్మము, లోహభస్మము, వజ్రభస్మము, వేగిసచెట్టు, వేప చెట్టు, శంఖపుష్పి, శ్వేతాభ్రకభస్మము, సునాముఖి, సోపు, సోమ లత, స్వర్ణభస్మము.

ఆహికజ్వరహారములుఅనగావిడిచివిడిచివచ్చుజ్వరహారములు-Articles indicated for intermittent fever or antiperiodics. అడ్డస రము, అతివస, ఈశ్వరిచెట్టు, ఉత్తరేణిచెట్టు, ఉలిమిడిచెట్టు, ఏనుగు చెవి చామచెట్టు, కామంచిపూరి, కృష్ణతులసి, గచ్చకాయ, గాడిద గడపాకు, గుంటకలగర, చేమంతిపుష్పము, జిల్లేడిచెట్టు, జిల్లేడిపాలు, తిప్పతీగె, తుత్తనాగము, తెల్లజిల్లేడు, దుష్టపుచెట్టు, నీరువావిలిచెట్టు, నేలయుసిరికచెట్టు, నేలవేము, పాలచెట్టు, పారిజాతపుచెట్టు, పాషా ణము, పత్తిదుంప, భూతాంకుశపుచెట్టు, మానుపసపు, మాసిపత్రి, మిరియాలు, మునగవేరు, ముషిణిచెట్టు, రససింధూరము, వస, వావిలిచెట్టు, వేపచెట్టు, సంపెంగచెట్టు, సున్నము, సీమకర్పూరపు ఆకు, సౌవీరాంజనము, అవిసిపువ్వు, ధనియాలు, మనుష్యుడు ఈ మూడును, చాతుర్థిక జ్వరహారములు.

—౯—

## ఇ

ఇంద్రలుప్తహారములు (అనగా పేనుకొరకడము)-:Articles Indicated for Pedeculosis ఏనుగుదంతము, కృష్ణాగరు, గురివిందచెట్టు, నేలములక, మందారపుష్పము, మదనానబచెట్టు, చేదుపొట్ల.

ఇంద్రియ నష్టమును కట్టునవి లేక యింద్రియమును ఘట్టిపడజేయునవి:- Do for Spermatorrhoea. Aphrodisiacs. ఇండుపగింజలు, కన్నెకోమలి, కర్పూరశిలాజిత్తు, గొబ్బిగింజలు, గోరింతచెట్టు, చింతగింజలు, చిన్నపల్లేరు, చిన్నముల్లంగి, తంగేడుచెట్టు, తగరభస్మము, తుత్తునాగము, తుమ్మజిగురు, తిప్పతీగె, తెల్లపురుగుడు, నిద్రగన్నిక, నేలతాడి, నేలగుమ్మడి, పులుగుడుచెట్టు, పెద్దమాలగొండచెట్టు, పెద్దపల్లేరు, పెద్దపిల్లిపీచర, బంగారపువరకు, మోదుగచెట్టు,బోడతరము, మర్రిపాలు, ముషిణిగింజలు, మేడిచెట్టు, మొయ్యాయి, మనుశాల, ముత్తువపుటగము, మామిడిపిందెలు, రజితభస్మము, రత్నపురుష, రేగుచెట్టు, రససింధూరము, శ్వేతాభ్రకభస్మము, సత్తుభస్మము. స్వర్ణభస్మము, సాలామిస్రి, హారతికర్పూరము.

ఇలికు నొప్పులు హారించునవి:— Do for sprain. ఆముదము, ఏపిబంక, ఒద్దిచెట్టు, కర్పూరతైలము, కామంచిపూరి, కిరసనాయిలు, జిల్లేడుపాలు, టర్పెన్టయిను తైలము, నీరువావిలిచెట్టు, బీజపత్రిము, మద్యము, పసుపు, యూక్లిప్టసు ఆయిలు, మామిడల్లము, వావిలిచెట్టు, వేపఆకులు.

ఈడ్పురోగ హారములు, ఎగుపులను కట్టునవి:— Antiphasmodics. అంబరు, అడవికంద, అడ్డసరపుపువ్వు, అటుకమామిడి, అడ్డసరము, ఇంగిలీకము, దీనిభస్మము, ఇంగువ, కస్తూరి, కాజీపుట్ తైలము, కుంకుమపువ్వు, కురాసానివామము, కామంచిపూరి, గంధఫెరోజా, గచ్చకాయ, చిట్టాముదము, జటామాంసి, జిల్లేడుచెట్టు, టర్పెన్టయిను తైలము, నల్లమందు, నవాసారము, నీరువావిలిచెట్టు,

పుదీనా, పునుగు, పుగాకు, మాసిపత్రి, మంగకాయ, మునగకూర, మేకనెయ్యి, వస, వేపనూనె, వాయింటచెట్టు, సదాపచెట్టు, సంపెంగ చెట్టు, సీమగోరింటవిత్తులు.

—ః—

ఉ

ఉదరరోగహరద్రవ్యములు:—**Articles indicated for abdominal dropsy and ascitic.** అటుకమామిడి, అక్కలకర్ర, అడవిమామిడి కల మద్యము, అడ్డసరము, ఆకుచెముడు, ఆముదము, ఆవాలు, ఇంగువ, ఉలవకట్టు, ఉత్తరేణిచెట్టు, ఊడుగచెట్టు, ఎలుకచెవిచెట్టు, ఓమపునూనె, కంపిల్లము, కటుకరోహిణి, కల్లిచెట్టు, కత్తిమందు చెట్టు, కరక్కాయ, కల్లు, కాచలవణము, కాజిపుట్ తైలము, కాటుకగింజలు, కోలచెముడు, గుంటకలగర, గంధకధ్రితి, గేదె మూత్రము, గొర్రెమూత్రము, చంద్రచెట్టు, చిత్రమూలము, చెముడుచెట్టు, చాదలాసికూర, చేతిపుచ్చతీగె, జాజికాయ, జిల్లేడు పాలు, జిల్లేడుచెట్టు, తక్కోలపుట్లు, తామ్రభస్మము, తుంబురులు, తురుష్కము, తెల్లగలేరు, తెల్లజిల్లేడు, తెల్లతెగడ, దింతిని, దుంప రాష్ట్రిము, నవాసారము, నీరుగొబ్బిచెట్టు, నీరుల్లిపాయ, నేపాళపు చెట్టు, నేలయుసిరికచెట్టు, నులిదడచెట్టు, పంచకోలములు, పసుపు పచ్చజిగురు, పాషాణము, పిన్నపాపర, పుగాకు, పెద్దమామేరు, ప్రబ్బలిచెట్టు, బలురక్కసచెట్టు, బెల్లము, భూక్కినాకు, భూచంపక, మంజిష్ట, మాదీఫలము, మాంఢూరము, మానుప్పు, మిరపకాయ, (ఎండుది), మునగవిత్తులు, ములుమోదుగ

చెట్టు, మునగవేరు, మేకపంచితము, మొక్కపుకాయ, మొగలి చన్నులు, ములవోసగింజలు, రజతభస్మము, రసకర్పూరము, వాకుడు కాయ, విత్తులోడతరము, వెలిగారము, వృద్ధదారు, శొంఠి, సర్జ క్షారము, సాంబ్రాణిచెట్టు, హింగుపత్రము, క్షారసముదాయములు.

ఉదావర్తహారిద్రవ్యములు(పొత్తికడుపుశూల):— Articles indicated for pain resulting from intestinal obstruction, పొత్తికడుపులోని శూలహారములు చూడుడు.

ఉన్మాదహారములు, అనగా పిచ్చి లేక వెర్రిని పోగొట్టునవి:—Articles indicated for insanity అంకుడచెట్టు, ఆవునెయ్యి. కరక్కాయ, కల్యాణగచెట్టు, కాకిమారేడు, కారింగువ, కాసినిగింజలు, కోల చెముడు, కురాసానిఓమము, కొబ్బరిసారాయి, కటుకరోహిణి,కటుక రోహిణి (తెల్లనిది), కలిగొట్టుచెట్టు, కోతిపాలు, గాడిదపాలు, గాడిద మూత్రము, గుగ్గిలము, గ్రంథితగరము, చీనాపంచదార, జీలకర్ర, దుయ్యచెట్టు, నరమూత్రము,నల్లచంద్ర,నల్లయుమ్మెత్త,నిమ్మపండు, పచ్చకర్పూరము, పటికిపంచదార, పాతనెయ్యి, పిరంగిసాంబ్రాణి, మార్కండచెట్టు,బోడతరము,బదానిక,మంచిగంధం,ముషిణిగింజలు, మొమ్మాయి,మనుష్యుడు,రక్తచందనము,రసకర్పూరము,రసభస్మము, రూమిమస్తకి మారేడుచెట్టు, రేణుకలు, లవంగాలు, వదనిక, సూరే కారము,సంపెంగచెట్టు,సాంబ్రాణిచెట్టు,స్వర్ణభస్మము,సరస్వతియాకు.

ఉబ్బసపుదగ్గు హారములు:—Do. for Asthma. అంతరతామర, అడవికంద, అటుకమామిడి, అడ్డసరము, ఇంగువ, ఉత్తరేణిచెట్టు, ఉప్పిచెట్టు, ఉమ్మెత్తచెట్టు, ఎర్రగన్నేరు, కాఫీ, కుంకుడుచెట్టు,కుప్పింట చెట్టు, కురాసానిఓమము, ఖర్జూరపుకాయ, కర్కాటకశృంగి,కర్పూ రము, గచ్చకాయ, గవ్వభస్మము, గాడిదపాలు, గంజాయి,జాపత్రి, జిల్లేడుపువ్వు. టర్పెన్టైనుతైలము, తెల్లగన్నేరు, దుష్టపుచెట్టు,

నేపాళము, నేలతాడి, నల్లయుమ్మెత్త, నీలిచెట్టు, పుష్కరమూలము, పెన్నేరు, బదినిక, బాలింతబోలు, బొద్దిచెట్టు, మామిడిటెంక, మాధవితీగ, మారేడుచెట్టు, మొగలిపువ్వు, రససింధూరము, రావిపళ్ళు, లవంగాలు, వాకుడుచెట్టు, వాకుడుకాయ, విష్ణుక్రాంతము, వెల్లుల్లి, వేపనూనె, వస, షాజీరా, సాంబ్రాణి, సీమగోరింటవిత్తులు, సోపు, సూరేకారము, సిరివేరుచెట్టు.

ఉబ్బువ్యాధిహారములు: — Do. for generalised odema or anasarca. అక్కలకర్ర, అడవిమూలికల మద్యము, అటుక మామిడి, అడవిగగ్గెర, అడవియుల్లి, అడ్డసరము, అయస్కాంత భస్మము, అల్లము, అవిసికూర, ఆకుజెముడు, ఆకుపత్రిక, ఆరెపువ్వు, ఆవుపాలు, అయిలారము, అతికమద్యము, ఇనుపచిట్టము, దీని భస్మము, ఇనుపభస్మము, దీని సింధూరము, ఈశ్వరిచెట్టు, ఉక్కు భస్మము, దీని సింధూరము, ఉత్తరేణి, ఉప్పిచెట్టు, ఊడుగచెట్టు, ఎర్రావడచెట్టు, ఏనుగుమూత్రము, ఒద్దిచెట్టు, ఒంటె మూత్రము, ఓమము, కచ్చోరము, కల్లిచెట్టు, కరక్కాయ, కటుకరోహిణి, కసివిందచెట్టు, కస్తూరి, కాచలవణము, కారింగువ, కారుమునగచెట్టు, కాజిపుట్ తైలము, కాసరచెట్టు, కాకిమారేడు, కలిగొట్టుచెట్టు, కానుగచెక్కభస్మము, కాయఫలచెక్క, కురాసానిఓమము, కొండ పిసినిచెట్టు, గాజరగడ్డలు, గుంటకలగర, గురజకాయ, గంగపావిల కూర, గంజాయి, గేదెమూత్రము, గొంతెమగోరుచెట్టు, గుమ్ముడు చెట్టు, గంటుభారంగి. గోమూత్రము, గొబ్బిచెట్టు, చంద్రచెట్టు, చించలము, చిన్నపల్లేరు, చింతబెరడుభస్మము, చనుబాలు, చేమంతి చెట్టు, చెముడుచెట్టు, చిత్రమూలము, చెవ్యము, చేదుఆనబచెట్టు, చేదుదొండ, చేదుబీర, చేదుపొట్ల, చెవులపిల్లితీగ, జనపచెట్టు, జాజి కాయ, జిల్లేడుపాలు, జీడిమామిడిపండు, తాడికాయ, తెల్లగలిజేరు,

తెల్లతెగడ, తేయాకు, తేలుమణిచెట్టు, తుంగముస్తలు, తారమాక్షి కము, దశమూలకములు, దాల్చినిచెక్క, దింతెన, దుంపరాష్ట్రము, దుష్టపుచెట్టు, దేవతాళితీగె, దొండచెట్టు, దర్భ, నరమూత్రము, నల్లవావిలి, నల్లేరుకాడలభస్మము, నవాసాగరము, నెరసి, నీరుగొబ్బి చెట్టు, నీరుపిప్పలి, నీరుల్లిపాయ, నులిదడచెట్టు, నేలయుసిరికచెట్టు, నెల్లిచెట్టు, నేలతాడి, పొత్తికుంప, పచ్చలభస్మము, పసుపు, పిండి కొండచెట్టు, పిప్పలిమూలము, పెద్దమావేరు, పుగాకు, పుష్కర మూలము, పెద్దదూలగొండ, పేలాలు, బలురక్కసచెట్టు, బూరుగచెట్టు, బ్రహ్మమేడిచెట్టు, భూచంపక, మంగచెట్టు, మత్తిచెట్టు, మహిసాక్షి, మాందూరము, మానుపస్పు, మారేడు, మిరియాలు, ముచుకుంద పుష్పములు, ముత్తువపులగము, ముయ్యాకుపొన్న, మట్టితైలము, ములుగోరింటచెట్టు, మోతికూర, మునగవేరు, మేడిచెట్టు, మొమ్మాయి, మోచన, యష్టిమధుకము, రేవల్చిన్ని, లవంగాలు, లోహభస్మము, వస, వాయువిడంగములు, విష్ణుక్రాంతము, వృద్ధదారు, వెర్రిపుచ్చ, వావిలిచెట్టు, వెణుతురుచెట్టు, వెల్లుల్లి, శంఖభస్మము, శంఖద్రావ కము, శ్రీవేష్టకము, శ్వేతాభ్రకభస్మము, సరస్వతీయాకు, సర్జ క్షారము, సాంబ్రాణి, సంబరేణి, సాంబ్రాణిచెట్టు, స్పృక్క మొగ్గలు, సూరేకారము, హేమమాక్షికము. మేహ (శాక) ఉబ్బు హారములు చూడుడు.

ఊపిరిగొట్టునొప్పి హారములు:— Do for stitching pain in the chest or lungs. అజామోదపుచెట్టు, అజామోద విత్తులు, ఆము దము, ఉలవలు, ఎర్రావడచెట్టు, గాజుబాన్, తేనె, దేవతాళితీగె, ద్రాక్షాసవము, పచ్చిపోక, పుష్పాంజనము, మోచన, మేకపంచి తము, రసాంజనము, వెల్లుల్లి, శొంఠి, హేమమాక్షికము.

ఊపిరితిత్తులలోని రోగములను, అనగా శ్లేష్మముకూడియున్న చెడురక్తమును, చీమును తీసివేయునవి:— Articles that remove coagulated blood or pus in the lungs. అడాలు, గుగ్గిలము, నలిదొండచెట్టు.

ఊపిరితిత్తులలోని భారమును, శ్లేష్మమును హరించునవి:— Articles indicated for phlegm, or heavyness in the lungs. కృష్ణాగరు. తమలపాకులు, పిప్పళ్ళు, పిప్పలిమూలము, నేలతంగేడు.

—౦—

## ఎ

ఎక్కిళ్ళు కట్టునవి:— Articles indicated for hiccoughs. అజామోదవిత్తులు. అడవిపసుపు, అడవిఉలవలు, ఆకుపత్రికము, ఆగాకరకాయ, అమ్లవేతనము, ఉస్తిచెట్టు, ఉస్తికాయ, ఉలవలు, ఏలకులు, కృష్ణాగరు, కంచుభస్మము, కంపిల్లము, కర్కాటకశృంగి, కలిగొట్టచెట్టు, కలిగొట్టుపువ్వు, కొబ్బరిపాలు, గంజాయి, గైరికము, గొర్రెపాలు, చాతురాతకములు, చీనాపంచదార, జీలకర్ర, జామిపండు, టర్పెంటయినుతైలము, తామ్రభస్మము, తెల్లకలిగొట్టుచెట్టు, తేనె, తృణపంచమూలములు, దాల్చినిఅరఖు, ధనియాలు, నల్లేరు, నిమ్మపండు, పిన్నసదాప, పిప్పలిమూలము, పిప్పళ్ళు, పీతలు (వీనిరంధ్రములలోని నీళ్ళు), పుష్కరమూలము, పుష్పాంజనము, పేలాలు, బట్ట, మంచిగంధము, మొమ్మాయి, మేకపంచితము, రసాంజనము, రూమిమస్తకి, లక్క, లవంగాలు, వెలగాకురసము, వాయువిడంగము, వెలగచిగుళ్ళు, శొంఠి, షాజీరా, సౌవీరాంజనము, సీమగోరింటవిత్తులు.

ఎగుపులను హరించునవి:—ఈడ్పురోగహరములు చూడుడు.

ఎలుకవిష హారములు:—Antidotes for rat bites. ఊడుగచెట్టు, ఎర్రావడచెట్టు, ఎలుకచెవికూర, కటుకరోహిణి, గొడ్డుగాకరచెట్టు, చాదలాసికూర, దిరిశనచెట్టు, పుష్పాంజనము, మనుష్యుడు, సర్పాక్షిచెట్టు.

ఏనుగుకాలిరోగ హారములు:— Do. for Elephantiasis. అల్లము, అశ్వమూత్రము, కానుగచెట్టు, గసగసాలు, గుంటకలగర, జిల్లేడుచెట్టు, తెల్లజిల్లేడు, తిగమొషిణిచెట్టు, త్రికటుకము, పసుపు, పాషాణము, పెద్దదూలగొండ, బోడతరము, మదనానబచెట్టు, మొమ్మాయి, రత్నపురుష, శొంఠి.

—:—

ఒ

ఒగర్పును కట్టునవి:—Articles indicated for hard breathing i. e. dyspnoea. అంజీరుపండు (ఎండుది), అడవిమల్లె, అడవిసెనగచెట్టు, ఇంగువ, ఉక్కుభస్మము, దీనిసింధూరము, ఉసిరికాయ, ఎలుకచెవిచెట్టు, కరక్కాయ, కర్పూరము, కృష్ణతులసి, కర్కాటకశృంగి, కామంచిపూరి, కెంపుభస్మము, గజపిప్పళ్ళు, గరికవేళ్ళు, గవ్వభస్మము, గుర్రపుపాలు, గొర్రెపాలు, చేమంతిచెట్టు, చేమంతిపువ్వులఅరఖు, చీనాపంచదార, చెముడుచెట్టు, జమ్మిచెట్టు, జాపత్రి, జిల్లేడుచెట్టు, తగరభస్మము, తాడికాయ, తామ్రభస్మము, తెల్లజిల్లేడు, తెల్లములక, తెల్లగన్నేరు, తేనె, ద్రాక్షపండు, నల్లమందు, నిమ్మపండు, నీలాంజనము, పన్నీరు, పటికపంచదార, పిప్పళ్ళు, పెద్దదూలగుండ, పెద్దపావిలికూర, బుడమచెట్టు, మంగచెట్టు, మద్యము, ములగవేరు, మేకపంచితము, మొమ్మాయి, మోదుగమూడలు, యూకలిప్టసుఆయిలు, లవంగములు, వస, విషబొద్దిచెట్టు, సీమవంకాయ, క్షీరకాకోలి.

ఒగర్పుగల దగ్గును కట్టునవి:—Do. for Bronchitis. అక్కలకర్ర, అడవిమల్లె, అటుకమామిడి, అడవిఉలవలు, అడ్డసరము, ఇంగువ, కచ్చోరము, కురాసానిఓమము, కోడిగ్రుడ్లు, కృష్ణతులసి, టర్పెన్ టైనుతైలము, నీరుల్లిపాయ, నీలిచెట్టు, నీలిమందు, పసుపు, మనుబాల, మూర్కండచెట్టు, విష్ణుక్రాంత, వెల్లుల్లి, సన్నావాలు, వస, సూరేకారము ఈరెండును విషపడిసెపు ఒగర్పుగల దగ్గును హరించును. బిడ్డల ఒగర్పుగలదగ్గు హరములు చూడుడు.

—౦—

## క

కంఠములోపుట్టు రోగహరములు:—Articles indicated for the diseases of the throat. అల్లము, ఆదొండకాయ, కర్పూరము (హారతి), కరక్కాయ, కాసీసము, కుంకుమపువ్వు, గజపిప్పళ్ళు, ఘృతమరీచి, తువరిమన్ను, తాడికాయ, త్రికటుకము, నిమ్మపండు, నేలఆవబచెట్టు, నేలనేరేడుచెట్టు, పుష్పకాసీసము, పచ్చిపోక, పటికి, బోడతరము, మామిడాకు, మాచికాయ, రెడ్డివారినానుబాలచెట్టు, రసకర్పూరము, రససింధూరము, రసభస్మము, వస, సరళదేవదారు. గొంతుకలో పుండయిన రోగహరములు చూడుడు.

కంఠస్వరమును బాగుచేయునవి:—(స్వరభంగము):—Articles that improve the voice & remove hoarseness. అంజీరు పండు (ఎండుది), కచోరము, కరక్కాయ, కామంచిచెట్టు, కోడిగ్రుడ్లు, కిసిమిసిపండు, గంధఫెరోజా, చీనాపంచదార, తమలపాకులు, దానిమ్మపండు తియ్యనిది, నువ్వులు, పచ్చిపోక, బాదముపప్పు, మనుబాల, ముచుకుంద పుష్పములు, రేగుచెట్టు, వృద్ధదారు, వెన్న, వెల్లుల్లి, శంఖపుష్పి, సరస్వతియాకు, "జాజికాయ" యీదియొకటియు కంఠమునకు బలమిచ్చును.

కండ్లకలకలను పోగొట్టునవి:—Do for ophthalmia or sore eyes. తెల్లగలిజేరు, ఇండుపగింజలు, తెల్లపురుగుడు, నందివర్ధనము, నర మా్రతము, నీరుల్లిపాయ, నక్కపుట్టచెట్టు, నల్లతుమ్మచెట్టు, పటిక, పయిడిప్రత్తిచెట్టు, పుగాకు, పురుగుడుచెట్టు, పసుపు, బుడ్డకాకర చెట్టు, బలురక్కసచెట్టు, మనుష్యుడు, మల్లిచెట్టు, మృత్తిక, వెను తురుచెట్టు, సహాదేవి.

కండ్లకుకాంతినిచ్చునవి:—Articles that give brightness to the eyes or sight. అడవిద్రాక్ష, దాల్చినచెక్క దింతెన, నలిదడ చెట్టు, నీరుల్లిపాయ, నువ్వులనూనె, నేలతంగేడుచెట్టు, పగడపులీగె చెట్టు, పసుపు, పాదరసము, వస, సునాముఖి, సౌవీరాంజనము.

కండ్లకు చలువజేయునవి:-Articles that cool the eyes. ఇనుము, ఉసిరికాయ, ఎర్రకలవదుంప, కర్పూరము, (హారతి) కలినీళ్ళు, కుం దేలు, కలబంద, గంధకము, గుంటకలగర, గంజాయి, గైరికము, చేమంతిపువ్వు, చిర్రికూర, తెల్లకలువ, తెల్లతామర, దేవదారుచెట్టు, ద్రాక్షపండ్లు, నందివర్ధనము, పన్నీరు, బాదమునూనె, మంచిగంధము, యష్టిమధుకము, వాయువిడంగములు, విరిగిచెట్టు, సౌవీరాంజనము.

కండ్లనొప్పిని హరించునవి:—Articles indicated for pain in the eyes. కురాసానిఓమము, గురివిందచెట్టు, జాజికాయ, తమల పాకులు, నల్లతుమ్మచెట్టు, పసుపు, మాసపత్రి, మృత్తిక, రాకాసి మట్టలు మరియు భూతులసి కంటిలో నలుసును తీసివేయును.

కండ్లమంటలను హరించునవి:—Do. for burning or smarting sensation in the eyes. చనుబాలు, ధారోష్ణాలు, పచ్చకర్పూ రము, మనుబాల, రక్తచందనము.

కండ్లమసకలు మబ్బులు హరించునవి:-Do. for dimness of sight. అవిసిపువ్వు, కోడిగ్రుడ్లు, పచ్చకర్పూరము, పులిచెంచలి, మను బాల, మోదుగువేరుగంధము.

కండ్ల యెరుపును పోగొట్టునవి:—Articles that remove the redness of the eyes. అంకొళపుకాయ, కలబంద, కలుగోటివిత్తులు, పసివింద చెట్టు, కుంకుమపువ్వు, పటిక, పైడిప్రత్తిచెట్టు, పసపు, బుడ్డ కాకర చెట్టు, మల్లి చెట్టు, మాసపత్రి, మృత్తిక, రాకాసిమట్టలు, వెలుతురు చెట్టు, సహదేవి.

కండ్ల రెప్పల పుండును హరించునవి:—Articles indicated for sore eyelids. తేలుమణి చెట్టు, తుమ్మెదగూటిమన్ను, నేలగురుగుడు చెట్టు, పసపు, మృత్తిక, మామిడాకు.

కండ్లలోని పువ్వులను హరించునవి:—Articles indicated for leucoma or white opaque spots in the eye. తెల్లగన్నేరు, పుగాకు, మోదుగవేరు, సముద్రపునురుగు, రెడ్డివారునానుబాలచెట్టు.

కండ్లలో పొరలు, కూనలు, దుర్మాంసములు హరించునవి:—Do. for granular eyelids and other complaints of. అల్లి చెట్టు, నిద్రగన్నిక, పాటలగన్ని, పులిచెంచలి, సముద్రపు నురుగు.

కండ్ల వెంట నీరుకారు నేత్రరోగహరములు:—Articles that stop water running from the eyes-lacimation. ఎర్రగన్నేరు, కలుగోటివిత్తులు, కుంకుమపువ్వు, తెల్లగన్నేరు, తెల్లగలిజేరు, దర్భ, నల్లతుమ్మ చెట్టు, నీరుడివిత్తులు, నీరుల్లిపాయ, పుగాకు, పుష్పాంజనము.

కంతులు హరించునవి:—Articles indicated for Tumours. ఎర్రగన్నేరు, కొబ్బరినూనె, గుగ్గిలము, గంధఫిరోజా, గన్నేరుచెట్టు, గోరింత చెట్టు, జీడిమామిడి చెట్టు, తెల్లగన్నేరు, పాషాణము, పాము, బాలింతబోలు, రసకర్పూరము, వాడగన్నేరు, సఫేదా, సీసము, స్పంజి, గ్రంధిరోగహారములు చూడుడు.

కందిరీగ విషహరములు:—Antidotes for wasp or hornet sting చామ చెట్టు, ఉత్తరేణి చెట్టు, దిరిశన చెట్టు, మూర్కుండు చెట్టు.

కంపవాత హారములు:—వణుకురోగహారములు చూడుడు.

కడుపునొప్పిహారములు:— Articles indicated for colic or stomach ache. అజామోదవిత్తులు, అరటిచెట్టు, అకుపత్రము, ఇంగువ, ఉలవలు, ఊడుగచెట్టు, ఏలకులు, ఓమము, ఓమపునూనె, కంపిల్లము, కాసినిగింజలు, కురాసానిఓమము, కోడిశెపాలచెట్టు, కామంచిపూరి, కోడిపుంజుమాంసము, కోడిమాంసము, గాజరగడ్డలు, గచ్చకాయ, గాడిదగడపాకు, గెంజాయి గుమ్మడుచెట్టు, చేమంతిపువ్వు, చీనాపంచదార, జీలకర్ర, టర్పెన్ టైనుతైలము, తెల్లగజ్జేరు, తేనె, నీరుల్లిపాయ, నువ్వుచెట్టు, నల్లిచెట్టు, నేలతంగేడుచెట్టు, నేలతాడి, నీలిమందు, పాటలగన్ని, పుగాకు, పుదీనా, ప్రొద్దుతిరుగుడుచెట్టు, బలురక్కసచెట్టు, బొక్కెనచెట్టు, బొద్దిచెట్టు, మదనానభచెట్టు, మనుష్యుడు, ముల్లంగి, ముండ్లతోటకూర, యవక్షారము, రూమిమస్తకి, లవంగాలు, లవంగాలనూనె, వస, శొంఠి, సంపెంగచెట్టు, సీమగోరింటవిత్తులు, సునాముఖి, శూలహారములు చూడుడు.

కడుపుబ్బుహారములు:— Articles indicated for Flatulence, i. e., Tympanites. అజామోదచెట్టు, అగ్నికాపడము, అడవిజీలకర్ర, ఎలుకచెవిచెట్టు, ఏనుగుబీర, ఓమము, ఓమపునూనె, కాజీపుట్ తైలము, కుక్కవావిలి, కంపిల్లము, కర్కాటకశృంగి, కోలచెముడు, కానుగచెట్టు, గుగ్గిలము, చనుపాలవిత్తులు, జీలకర్ర, తుంబురులు, దాల్చినీయరకు, నీలిమందు, ఏలాలు, పొత్తిదుంప, పచ్చకర్పూరము, బిడాలవణము, ముసాంబ్రము, మేకపంచితము, మొమ్మాయి, రసకర్పూరము, రసభస్మము, వస, వాము్మపువ్వు, వెలగచిగుళ్ళు, శొంఠి, సన్నావాలు, సోపు, బిడ్డల కడుపుబ్బుహారములు చూడుడు.

కడుపులోని గడ్డలను, వాపులను హరించునవి:— Do. internal tumours, abscesses in the abdomen. అయస్కాంత భస్మము,

కొబ్బరికాయ, తుంగముస్తెలు, లోహభస్మము, సత్తుభస్మము, సాలామిశ్రి.

కడుపులోని చెడునస్తువులను తీసివేయునవి:—Articles that remove excess of various secretions from the stomach and intestines. అల్లము, గుగ్గిలము, నేలతంగేడు, పాపరచెట్టు, వెర్రిపుచ్చకాయ, పాశీరా.

కడుపులోనిత్రిప్పులను హరించునవి:-వికారహరద్రవ్యములు చూడుడు.

కడుపులోని బల్లలు హరించునవి (యకృత్ ప్లీహములు):—Do. for enlargement of spleen and liver. అల్లము, ఆకుచెముడు ఆకులు, అయస్కాంతభస్మము, అడవిమాలికలమద్యము, ఆముదము, ఆమ్లవేతసము, ఇత్తడిభస్మము, ఉక్కుభస్మము, దీని సింధూరము, కత్తిమందుచెట్టు, కంకుష్టము, కంద, కానుగచెట్టు, కరక్కాయ, కలబంద, కారింగువ, కారుమునగచెట్టు, కామంచిపూరి, కోలచెముడు, గంధకచూర్ణము, గుంటకలగర, గిరిగిచ్చచెట్టు, గాలిమిడిచెట్టు, గోరింతచెట్టు, గోలుగుచెట్టు, చనుబాలు, చిత్రమూలము, చిలుకకూరచెట్టు, చెముడుచెట్టు, చేదుబీర, తాడికాయ, తీగదురుముడిచెట్టు, తామ్రభస్మము, తుంబురులు, తెల్లతెగడ, తురకవేపచెట్టు, దుందిలపుకాయ, నీరుల్లిపాయ, నేపాళము, నేరేడుచెట్టు, పంచకోలము, పిండికొండచెట్టు, పెద్దపల్లేరు, పుగాకు, పిన్నపాపర, బుడమకాయ, ములుమోదుగచెట్టు, మోదుగచెట్టు, మదనానబచెట్టు, మనుష్యాను, మొమ్మాయి, రజితభస్మము, రససింధూరము, రావిచరక్షారము, లోహభస్మము, దీనిసింధూరము, వాకుడుకాయ, వాయువిడంగములు, విత్తుబోడసరము, వెల్లుల్లి, వెర్రిపుచ్చకాయ, శిలాజిత్తు, శిలాధాతువు, శొంఠి, సత్తుభస్మము, సముద్రపునురుగు, సర్జక్షారము, సరస్వతియాకు, సాంబ్రాణిచెట్టు, హింగుపత్రము, గచ్చకాయ, జ్వరపుబల్లనుహరించును,

కడుపులోని మంటను, తాపమును హరించునవి:—Do. for acidity or burning sensation in the stomach. అరటిచెట్టు, కాసిని గింజలు, కొత్తిమిరి, గాజుబాన్, ధనియాలు, ధారోష్ణాలు, నవాసారము, నిమ్మపండు, ప్రత్తిగింజలు, పుల్లబచ్చలి, మొమ్మాయి, యష్టి మధుకము, లవంగాలు, వట్టివేళ్ళు, సర్జక్షారము, సీమసున్నము, స్పంజి.

కడుపు లేక పొట్టలోని రోగహరములు:—Do. for diseases of the belly or stomach. ఇంగువ, కసివిందచెట్టు, కాఫీ, కొండకసివింద చెట్టు, చెముడుచెట్టు, చేదుపొట్ల, జీలకర్ర, నల్లిదడచెట్టు, పులిచెంచలి, బలురక్కసచెట్టు, బొక్కెనచెట్టు, భూతాంకుశపుచెట్టు, ముత్యముల సున్నము, మొక్కపుకాయ, రేలపువ్వు, లక్క. బిడ్డల కడుపులోని రోగహరములు చూడుడు.

కడుపు లేక పొట్టలోని వాతమును, జలుబును వెడలించునవి:—Carminatives, i.e., articles that remove cold or wind from the stomach or belly. అక్కలకర్ర, అక్రోటు, అడవికంద, అనాసపువ్వు, అల్లము, ఆసుపత్రికము, ఆవాలు, ఏలకులు, ఓమము, కచోరము, కరక్కాయ, కరివేపాకుచెట్టు, కుక్కవావిట, కురాసాని ఓమము, కాజీపుట్ తైలము, కాఫీ, కామంచిపూరి, కారటు దుంప, కృష్ణతులసి, కొండకసివిందచెట్టు, కొత్తిమిరి, గులాబీపువ్వు, గొంజాయి, చలువమిరియాలు, చేమంతిపువ్వు, చీనాపంచదార, జీలకర్ర, తములపాకులు, ధనియాలు, దాల్చినిచెక్క, నారింజపండు తొక్కలు, నీరుల్లిపాయ, నేరేడుచెట్టు, పగడభస్మము, పుదీనా, పులిచెంచలి, పెద్దజీలకర్ర, పిప్పలిమూలము. పోకలు, మిరియాలు, మూర్కుండచెట్టు, మొమ్మాయి, రూమిమస్తకి, రేలపువ్వు, లవంగాలు, వస, వెల్లుల్లి, వాకుడుచెట్టు, వెర్రిపుచ్చచెట్టు, వెలగచెట్టు, వేపాకు, శొంఠి, సీమకర్పూరపుఆకు, సంపెంగచెట్టు, సోపు.

ఫలము, అడవిఉలవలు, అన్నభేది, అశోకవృక్షము, అశ్వమూత్రము, ఆకుచెముడు, ఆగాకరదుంప, ఆవనూనె, ఆళ్ళు, ఆక్షీకమద్యము, ఆవాలు, అగ్నికాపడము, అయస్కాంతభస్మము, అవిసిచెట్టు, ఇంగువ, ఇంగిలీకభస్మము, ఇండుపగింజలు, ఇత్తడిభస్మము, ఇనుపభస్మము, దీనిసింధూరము, ఇనుము, ఇనుము లేక ఉక్కురాపొడి, ఈతకల్లు, ఉక్కుభస్మము, దీనిసింధూరము, ఉత్తరేణిచెట్టు, ఉలిమిచెట్టు, ఉసిరికాయలు, ఉస్తికాయలు, ఊడుగచెట్టు, ఊడుగనూనె, ఊసరవెల్లి లేక తొండ, ఉడుముమాంసము, ఉలవలు, ఎలుకచెవిచెట్టు, ఎలుకమాంసము, ఏపిచెట్టు, ఏలకులు, ఓమము, కంపిల్లము, కందులు, కచోరము, కఫరి, కరివేపాకుచెట్టు, కలబంద, కస్తూరి, కణపకసువు, కరక్కాయ, కలిగొట్టు, కల్లుపులుసు, కాంచనవృక్షము, కాచలవణము, కారింగువ, కానుగచెట్టు, కాకిమేడి, కాకిమాంసము, కానుగచెక్కభస్మము, కారుగచ్చచెట్టు, కాసరిచెట్టు, కిక్కసగడ్డి, కుంకుమపువ్వు, కుందురుమ్కము, కురువేరు, కుశదర్భగడ్డి, కుందేలు, కుక్కపుగాకు, కృష్ణతులసి, కెంపుభస్మము, కోడిసెపాల, కొబ్బరికాయ, కోరింతచెట్టు, కొర్రలు, కోలచెముడు, గరికవేళ్లు, గవ్వభస్మము, గంటుభారంగి, గజనిమ్మకాయ, గాజరగడ్డలు, గుంటకలగర, గుగ్గిలము, గుమ్మడుచెట్టు, గులాబిపువ్వు, గెంజాయి, గొలిమిడిచెట్టు, గొలుగుచెట్టు, గోమూత్రము, గ్రంథితగరము, గాజుబాన్, చంద్రచెట్టు, చలవమిరియాలు, చెముడుచెట్టు, చెవ్యము, చేదుదొండ, జనపచెట్టు, జమ్మిచెట్టు, జాజికాయ, జాజిచెట్టు, జిల్లేడుపువ్వు, జీడిగింజలు, జీడిపండు, చేమంతిచెట్టు, చింతచెట్టు, చింతగింజలు, చిత్రమూలము, జీడిమామిడిపండు, జీలకర్ర, తగరభస్మము, తగిరిసచెట్టు, తగిరిసవిత్తులు, తడచెట్టు, తమాలవృక్షము, తవాక్షీరి, తాటికల్లు, తిలకపుచెట్టు, తుంగముస్తలు, తుంబురులు, తుమ్మికూర

చెట్టు, తులసి, తెల్లగన్నేరు, తెల్లతామర, తెల్లమద్దిచెట్టు, తెల్లములక తెల్లావాలు, తేనె, తొగరుచెట్టు, త్రికటుకము, త్రిఫలములు, త్రిస మగుు, దవనము, దాసిమ్మచెట్టు, దాల్చినిచెక్క, దింతెన, దుంది లపుకాయ, ధాతకీకుసుమము, నఖముదిప్పలు, నల్లమందు, నల్ల వావిలి, నల్లయుమ్మెత్త, నిమ్మపండ్లు, నీరుపిప్పలి, నీరుల్లిపాయ, నీలి చెట్టు, నేలగుముగు చెట్టు, నేలతంగేడుచెట్టు, నేలతాడి, నేలనేరేడుచెట్టు, నేలములక, నేలయుసిరికచెట్టు, పంచమూలములు,(లఘు), పచ్చకర్పూ రము, పచ్చలభస్మము, పచ్చాకు, పటికపంచదార, పతంగిచెట్టు, పద్మ కాష్ఠము, పసుపు, పాపరచెట్టు, పిన్ననేరేడు, పిన్నిపాలచెట్టు, పుగాకు, పుదీనా, పునుగు, పుష్కరమూలము, పుష్పాంజనము, పెద్దపల్లేరు, పిల్లిపీచర, పెద్దమావేరు, పెదువేపచెట్టు, పెన్నేరు, పొత్తిదుంప, పోకలు, బాంచాలు, బూడిదగుమ్మడికాయ, బొద్దిచెట్టు, బోడ తరము, భద్రముస్తలు, మంకెనచెట్టు, మంచిగంధము, మాజిష్ఠ, మణిశిల, మద్యము, మనుశాల, మారేడుచెట్టు, మిరియాలు, ముత్యపుచిప్పలసున్నము, ముత్యభస్మము, మునగచిగుళ్ళు, మునగ విత్తులతైలము, ముల్లంగి, మెంతులు, మెట్టతామర, మేకనెయ్యి, మొక్కపుచెట్టు, యవక్షారము, రజితభస్మము, రసకర్పూరము, రసాంజనము, రాజావర్తభస్మము, రావిచిగుళ్ళు, రేలపువ్వు, లవం గాలు, లొద్దుగచెట్టు, లోహభస్మము, వెలుతురుచెట్టు, వెదురు, వెలమసంధి, వెలిగారము, వెల్లుల్లి, వృద్ధదారు, వేపజిగురు, వేపాకు, వ్యాఘ్రనఖము, శొంఠి, సంపెంగచెట్టు, సదాపచెట్టు, సన్నరాస్నము, సముద్రపునురుగు, సరస్వతియాకు, సెనగచెట్టు, సెనగలు, సౌవర్చ లవణము, హరిదళము, హిమాహ్లికము, క్షీరకాకోలి.

కరపాణిసురుపులను హరించునవి:— **Articles indicated for sores or eruptions on arms or legs (rash).** గాడిదగరపాకు, గాడిదపాలు, తారు, నక్కపెంటికచెట్టు, నరమూత్రము.

కర్ణరోగవ్రణములు అనగా చెవిలోపోటు, పుండును, నొప్పిని, చీము, రసికారుటను పోగొట్టునవి:— Do. for abscesses and other diseases of the ear. అంబాళపుకాయ, అడవిచెమ్మ, అడవిద్రాక్ష, ఆరచెట్టు, ఆవనూనె, ఇంగువ, ఉవిరి, ఉత్తరేశిచెట్టు, ఉలిమిడిచెట్టు, ఓమము, కర్పూరతైలము, కాకిదొండకాయలు, కుక్కవావింటచెట్టు, కృష్ణాగరు, గెంజాయి, చారనాగముట్టలు, చామచెట్టు, చాదలాసికూర, చెముడుచెట్టు, జాజికాయ, జిల్లేడుచెట్టు, తాడికాయ, తెల్లతామర, తెల్లబారింక, తెల్లమద్దిచెట్టు, దేవదారుతైలము, నల్లవావిలి, నులిదడచెట్టు, నీరుల్లిపాయ, పాయిడిప్రత్తిచెట్టు, పసుపు, ప్రాతనెయ్యి, పుగాకు, బాడిదచెట్టు, బ్రాంది, భుజపత్రిచెట్టు, మాచికాయ, మానుపసుపు, మిరపకాయ (ఎండుది), మునగచెట్టు, ముసాంబ్రము, మూర్కుండచెట్టు, మేకపంచితము, రుద్రజడచెట్టు, వాపలిచెట్టు, వెణుతురుచెట్టు, వావింటచెట్టు, విషమంగలపుచెట్టు, వెల్లుల్లి, సబ్బు. గెంజాయి చెవిలో పురుగులను హరించును. ముమ్మాయి చెవిలో ధ్వనిని హరించును.

కలరారోగహరములు:—మరిడిజాడ్య హరములు చూడుడు.

కాంతినిచ్చునవి (దేహకాంతి):— Articles that improve the complexion of the body. అల్లము, అష్టవర్గు, ఆణ్యాలు, ఆవువెన్న, ఉక్కుభస్మము, దీనిసింధూరము, ఎర్రగురివిందచెట్టు, ఓమము, కరివేపాకుచెట్టు, కర్పూరతైలము, కర్పూరము, కలిగొట్టుపువ్వు, కల్లు, కస్తూరి, కుంకుమపువ్వు, కుందేలు, గిలిగిచ్చ, గడ్డిదవనము, గుగ్గిలము, గురివిందచెట్టు, గోగోజనము, చింతపువ్వు, చిలుకకూరచెట్టు, జాజికాయ, తంగేడుపువ్వు, తగిరిసచెట్టు, తగిరిసవిత్తులు, తేయాకు, తుంగముస్తలు; దానిమ్మపండు తియ్యనిది, దుందిలపుకాయ, నఖముచిప్పలు, నల్లేరు, నిమ్మపండు, నీరుల్లిపాయ, నేలతంగేడు,

నేలతాడి, పన్నీరు, పాదరసము, పాపరచెట్టు, పునుగు, పుష్యరాగ భస్మము, పెన్నేరు, పొగడపువ్వులు, ప్రేంఖణపుచెట్టు, పెద్దపల్లేరు, బంగారపువరకు, బంగారపురావడి, మంచిగంధము, మద్యము, ముత్యముఃలసున్నము, మునగపువ్వు, మెంతికూర, మొక్కపుకాయ, రజితభస్మము, రసకర్పూరము, రససిందూరము, రాజావర్తభస్మము, రూమిమాస్తకి, వజ్రభస్మము, వృద్ధదారు, వెన్న, వెల్లుల్లి, శంఖ పుష్పి, శంఖభస్మము, శొంఠి, సునాముఖి, స్వర్ణభస్మము, క్షీర కాకోళి.

శాకజేయునవి:— Articles that increase heat in the system.

అంబరు, అక్కలకర్ర, అగరు, అగరుతైలము, అడవికంద, అగరు శొంఠి, అకుచెముడు, అవపిండి, ఆముదము, ఆవాలు, అంకుడుచెట్టు, అడవిజీలకర్ర, అడవితులసి, అడవిపసుపు, అడవిపావురపుమాంసము, అడవివావింట, అడవిఓమము, అల్లపుగడ్డి, అవిసిచెట్టు, అశ్వ మూత్రము, ఆవనూనె, ఇరుగుడిచెట్టు, ఇనుము, ఈశ్వరిచెట్టు, ఉక్కు, ఉప్పిచెట్టు, ఉలవలు, ఉస్తికాయ, ఉప్పు, ఉక్కుభస్మము, దీనిసింధూరము, ఉలిమిడిచెట్టు, ఉమ్మెత్తచెట్టు, గురివిందచెట్టు, ఏదు బంది, ఒంటెమూత్రము, ఓమపునూనె, కస్తూరి, కంపిల్లము, కస్తూరి పసుపు, కాకరాకు, కచోరము, కారుమునగచెట్టు, కానుగచెట్టు, కుసుంబాచెట్టు, కోలచెముడు, కోలపొన్న, కత్తిమందుచెట్టు, కన్నె లేడిపిట్ట, కర్బూజాపండు, కసివిందచెట్టు, కాకిమాంసము, కాజీపుట్ తైలము, కలిగొట్టుచెట్టు, కానుగనూనె, కాసీసము, కుందేలు, కృష్ణతులసి,ఖర్జూరపుకాయ, గంగరావిచెట్టు,గంధకము,గజపిప్పళ్ళు, గోరోజనము, గేదెమూత్రము, గుంటకలగర, గరళము, గజ్జేరు, గాడిదగడపాకు, గాడిదమూత్రము, గుల్లసున్నము, గుగ్గిలము, గంటుభారంగి, గొర్రెమూత్రము, చంద్రచెట్టు, చన్నచెర్లగడ్డ,

చింతచెట్టు, చెప్పుతట్టగాను, చెముకుచెట్టు, చేమబీర, చేదుపుచ్చచెట్టు, చెంగల్వకోష్టు, చాగచెట్టు, చావరాసికూర, జవ్వాది, జిల్లేడుచెట్టు, జమ్మిచెట్టు, జీడిగింజలు, జీడిమాను, జున్ను, జీడిపండు, జీడిమామిడి పండు, జీనకము, టర్పెన్ టైను తైలము, తుమ్మికూరచెట్టు, తిప్ప తీగ, తిలకపుచెట్టు, తులసి, తక్కెడచెట్టు, తెల్లజిల్లేడు, తెల్లతెగడ, తెల్లయుప్పు, తెల్లావాలు, త్రికటుకము, దింతెన, దిరిసెనచెట్టు, దుంప రాష్ట్రిము, దుష్టపుచెట్టు, దేవదారుతైలము, నఖముచిప్పలు, నంది వృక్షము, నల్లమందు, నల్లవావిలి, నల్లేరు, నీలభస్మము, నీలిచెట్టు, నువ్వుచెట్టు, నువ్వులు, నెమలడుగుచెట్టు, నేలతప్పటచెట్టు, నెల్లి చెట్టు, నేపాళము, నేలఆముదపుచెట్టు, నేలఆనబచెట్టు, నేలగురు గుడుచెట్టు, నేలతంగేడుచెట్టు, పచ్చాకు, పర్పాటకము, పద్మపూతిక, పొగడపువ్వు, పాలచెట్టు, పావుదార, ఫిరంగిచెక్క, పులిచెంచలి, పుష్కరమూలము, పిప్పలిమూలము, పిప్పళ్ళు, పెద్దమావేరు, పెద్ద వరగోగు, పిన్నసదాప, పొడపత్రిఆకు, పొత్తిదుంప, ప్రబ్బలిచెట్టు, పిన్నపాసర, బాలింతబోలు, బిడాలవణము, బ్రాంది, బొద్దిచెట్టు, బొక్కెనచెట్టు, మహిసాక్షి, మంచిగంధము, మంజిష్ట, ముక్క తుమ్మడితీగె, మునగవేరు, మునగవిత్తులతైలము, ముయ్యాకుపొన్న, మణిశిల, మదువము, మిరపకాయలు (ఎండువి), ముత్యముచిప్పల సున్నము, మేకనెయ్యి, మేకపంచితము, మునగవిత్తులు, మట్టితైలము, ములుగోరింటచెట్టు, ముషిణిచెట్టు, మోదుగమాడలు, ముసాం బ్రము, మోచన, మార్కండచెట్టు, ములువెంపలిచెట్టు, రసాంజ నము, రేగుచెట్టు, రేలచెట్టు, రొయ్యపీత, లక్క, లవంగములు, వర గోగు, వస, వాకుడుచెట్టు, వావిలిచెట్టు, వావింటచెట్టు, విషబొద్ది, వెణుతురుచెట్టు, వెల్లుల్లి, వెంట్రుకపాయలకూర, వేపమాను, వృద్ధ దారు, శంఖభస్మచూర్ణము, శొంఠి, సర్జరసము, సదాపచెట్టు, సన్న

వెంట్రుకల నలుపెక్కించునవి:—Articles that blacken the hair. కుసుంబాపువ్వు, కొబ్బరినూనె, గుంటకలగర, జీడినూనె, మునాంబ్రము, యష్టిమధుకము, సునాముఖ.

వెంట్రుకలనూడజేయునవి:— Articles that make the hair fall off. చామచెట్టు, జమ్మిచెట్టు.

వెంట్రుకలు నెరియుడమును ఆపునవి:—Articles that prevent hair from turning grey. కోలపాలకూర జంగిలిహల్దా, తాచుపాము, తెల్లబోడతరము, నల్లగుంటకలగర, నేలతంగేడు, వెల్లుల్లి.

వెన్నునొప్పి హారములు:—Articles indicated for pain in the back. గొబ్బిచెట్టు, వాతనారాయణచెట్టు, సీతాఫలచెట్టు, మెంతులు, మొమ్మాయి.

వెర్రిని పోగొట్టునవి:—ఉన్మాదహారములు చూడుడు.

వెర్రికుక్క,నక్కవిషహారములు:—Antidotes for poison of mad dog or jackal. అంగారవల్లి, ఉత్తరేణిచెట్టు, కాకరాకు, కానుగచెట్టు, చెప్పుతట్టాకు, తేలుమణిచెట్టు, నీరుల్లిపాయ, నల్లయుమ్మెత్త, పాటలగన్ని, పాషాణము, మనుష్యుడు, మొమ్మాయి, మేకమాంసము, వెల్లుల్లి, వెర్రిచెఱకు, శంఖపుష్పి, సోపు, సర్పాక్షి.

వెర్రికుక్క విషసంధి హారములు:—Articles indicated for Hydrophobia. ఉత్తరేణిచెట్టు, కస్తూరి, కుక్కగులాబిచెట్టు, నల్లమందు, నేలతాడి, పాటలగన్ని, పాషాణము.

వేడిచేతబుట్టిన విదాహ హారములు:—కాకనుబుట్టిన దాహ హారములు చూడుడు.

వేడిజేయునవి:—కాకజేయునవి చూడుడు.

వ్రణములలో, గాయములలో, పుండ్లలోపడిన పురుగులను జంపి వానిని మాన్పునవి:—Articles indicated for ulcers or wounds

**Infested with maggots.** కర్పూరము, (హారతి), కానుగచెట్టు, కృష్ణతులసి, కుక్కపుగాకు, గాడిదగడపాకు, జువ్విచెట్టుపాలు, తురకవేపచెట్టు, గోరింటవిత్తులు, తెల్లగన్నేరు, ఎర్రగన్నేరు, పుగాకు, పసుపు, బదినిక, మర్రిపాలు, మహిసాక్షి, మాధవితీగె, మూర్కుండ చెట్టు, వస, వాకచెట్టు, వెల్లుల్లి, వేపనూనె, వృద్ధదారు, సరస్వతి యాకు, సీతాఫలచెట్టు, సీమగోరింటవిత్తులు.

వ్రణహారములు:—**Do. for ulcers** అందుగచెట్టు, అన్నము, అతివస, అన్నభేది, అవిసినూనె, అశోకవృక్షము, ఆగాకరదుంప, ఆరెచెట్టు, ఆవనూనె, ఇసుక, ఇప్పనూనె, ఇరుగుడిచెట్టు, ఇనుపగోలువిత్తులు, ఉమ్మెత్తచెట్టు, ఊసరవెల్లి, ఈశ్వరచెట్టు, ఉత్తరేణిచెట్టు, ఊడుగచెట్టు, ఊరబంది, ఏడాకులపొన్న, ఏలకులు, ఏనుగబీర, ఒడ్డిచెట్టు, ఓమము, కక్కపాల, కచోరము, కత్తిమందుచెట్టు, కడిమిచెట్టు, కసివిందచెట్టు, కలబంద, కంపిల్లము, కాంచనవృక్షము, కాచలవణము, కానుగచెట్టు, కాసరిచెట్టు, కుంకుమపువ్వు, కుందురుష్కము, కుక్కవాయింట, కురువిందచెట్టు, కుసుంబాచెట్టు, కూతురుబుడమ, కవిరి, కొండగోగు, కొత్తిమీర, కోలచెముడు, కృష్ణాగరు, కానుగనూనె, కుందేలు, కోలపాలకూర, గెంజాయి, గంగరావిచెట్టు, గంధకధృతి, గంగసింధూరము, గంధఫెరోజా, గుగ్గిలము, గురివిందచెట్టు, గొడ్డుగాకరచెట్టు, గోరింతిచెట్టు, చంద్రచెట్టు, చెన్నచెర్లగడ్డ, చాగచెట్టు, చించలము, చింతచెట్టు, చిత్రమూలము, చేదుపొట్ల, జంగాలిపచ్చ, జాజిపువ్వులతీగె, జిల్లేడుచెట్టు, జామిచెట్టు, జీడిమామిడిచెట్టు, జువ్విపాలు, తాంబేలుచిప్పభస్మము, తామ్రభస్మము, తాళకభస్మము, దీనిసింధూరము, తుత్తురుబెండచెట్టు, తువరిమన్ను, తెల్లగన్నేరు, తెల్లజిల్లేడు, తెల్లమద్దిచెట్టు, తెల్లగోరింక, తుత్తనాగము, తేనెతెట్టు, తెనె, తొగరుచెట్టు, తగిరిసచెట్టు, తిప్ప

తీగె, తీగెముషిణిచెట్టు, దింతెన, దిరిసెనచెట్టు, దుష్టపుచెట్టు, దొండ చెట్టు, ధూపదవృక్షము, నఖముచిప్పలు, నల్లతుమ్మచెట్టు, నల్లమందు, నల్లయుమ్మెత్త, నవాసాగరము, నీటిప్రబ్బలిచెట్టు, నీరుపిప్పలి, నీలిమందు, నలిదిడచెట్టు, నువ్వులు, నెమలడుగుచెట్టు, నేరేడుచెట్టు, నాగజెముడు, నేలయుసిరికచెట్టు, నేలవేము, నిద్రగన్నిక, పచ్చకాంచనము, పటికి, పసుపు, పాచితీగె, పాదరసము, పాలచెట్టు, పాతనెయ్యి, పాపరచెట్టు, పాషాణము, పిండికొండచెట్టు, పుండరీకము, పుగాకు, పునుగు, పెద్దదూలగొండ, పిన్ననేరేడు, పెన్నేరు, పిన్నమావేరు, పేలాలు, పెరుగుతోటకూర, పొత్తిదుంప, బదినిక, బల్లి, బలురక్కిసచెట్టు, బాలింతబోలు, బాడిదపుచెట్టు, బీజపత్రపుచెట్టు, బుడ్డకాకరచెట్టు, బోడతరము, భీర, మహాభీర, బ్రహ్మమేడిచెట్టు, బుడమకాయ, మంగచెట్టు, మంజిష్ట, మద్యము, మట్టితైలము, మైలతుత్థము, మాచిపత్రి, మాచికాయ, మానుపసుపు, మానుప్పు, మిరపకాయలు (ఎండువి), మిరియాలు, ముచుకుందపుష్పము, మురదారుసింగు, ముండ్లతోటకూర, ముషిణిచెట్టు, మెంతికూర, మునగకూర, మునగవిత్తులతైలము, మేడిచెట్టు, మారేడు, మైనము, మొమ్మాయి, యష్టిమధుకము, రసకర్పూరము, రసభస్మము, రససింధూరము, రాతిపువ్వు, రావిచెట్టు, రేలచెట్టు, వెంట్రుకపాయిలకూర, వస, విషబొద్దిచెట్టు, వాయింటచెట్టు, వెణుతురుచెట్టు, వెలిగారము, వెలమసంధి, వేగిసచెట్టు, వేపచెట్టు, వేపనూనె, వ్యాఘ్రనఖము, శంఖజీరకము, సీతాఫలచెట్టు, శ్రీవేష్టకము, సర్జరసము, సదాపచెట్టు, సరస్వతియాకు, సముద్రపాల, సరళదేవదారు, సర్పాక్షి, సీమబెట్టతామర, సీమఅవిసిగింజలు, సైంధవలవణము, సోమరాజము, సౌవీరాంజనము, స్పంజి, హంసపాది, హేమాక్షికము, తారమాక్షికము, మరియు, అశ్వమూత్రము మిరియాలు ఇవి అస్థిగతవ్రణ

ములను, కురాసానిఓమము పోటుగల వ్రణములను, పుగాకు చీము పట్టిన వ్రణములను, ప్రపౌండరీకము శిరోవ్రణములను హరించును. కుళ్ళువ్రణహరములు, దుష్టవ్రణహరములు, మాదహరములు, పుట్ట వ్రణహరములు, మానని మొండివ్రణములు మురికివ్రణహర ములు, విషవ్రణహరములు, సర్పవిషవ్రణహరములు చూడుడు.

శరీరస్థైర్యకరములు:—దేహమును ఘట్టిపడజేయునవి చూడుడు.

శిరోక్రిమిహరములు:—**Articles indicated for worms in the head.** ఆవాలు, నవాసాగరము, నీలిచెట్టు.

శిరోవాత, శిరోరోగ హరములు అనగా తలపోటు, మంట, వేడిమి, వికారము మొదలైనవి హరించునవి:—**Do for diseases of the head.** అక్కలకర్ర, ఆకుపత్రికము, ఆముదము, ఉసిరికాయ, ఏలకులు, కరక్కాయ, కలువదుంప, కలబంద, కల్లుపులుసు, కస్తూరి, కాకిదొండకాయలు, కాటుకగింజలు, కుంకుడుచెట్టు, కుంకుమపువ్వు, కుక్కవాయింట, కొబ్బరిసారాయి, గంగరావిచెట్టు, గంధ ఫిరోజా, గులాబిపువ్వు, గొడ్డుగాకరచెట్టు, చిట్టాముదపుచెట్టు, చేతిపుచ్చచెట్టు, చేతిబీర, జాజిచెట్టు, జాజికాయ, తామ్రభస్మము, తిప్పతీగె, తాళికపత్రి, తక్కెడచెట్టు, త్రిఫలములు, దశమూలములు, దాల్చినిచెక్క, నందివర్ధనము, నఖముచిప్పలు, నవాసాగరము, పచ్చకర్పూరము, పాతనెయ్యి, పుదీనా, పెద్దమావేరు, పెద్దపావిలకూర, పేరింటచెట్టు, పొగడపువ్వులు, బచ్చలి, బాదమునూనె, బాదముపప్పు, భూతపిల్లిగడ్డ, మంగచెట్టు, ముచుకుందము, దీనిపువ్వు ములు,లవంగాలు, వాయింటచెట్టు, శొంఠి, శ్రీవేష్టకము. మరియు నేలతంగేడుచెట్టు పురాణశిరోరోగహరమును, పిప్పలిమూలము తలలోని శ్లేష్మమును, జలుబును, రసకర్పూరము, రసభస్మము ఇవి రెండును తలవాచివచ్చు వ్యాధిని హరించును.

శీఘ్రప్రసవకారులు:—సుఖప్రసవకారులు చూడుడు.

శీతపైత్యజ్వరహరములు:—Articles indicated for fever from cold & bile. ఒద్దిచెట్టు, కటుకరోహిణి, కాకరాకు, చనుబాలు, చేదుపొట్ల, తీగెదురుముడిచెట్టు, తిప్పతీగె, తేలుమణిచెట్టు, దేవదారుచెట్టు, నిమ్మపండు, నేలవేము, పాషాణము, పెనువేపచెట్టు, బండారుచెట్టు, బొమ్మాయి, వేపచెట్టు.

శీతపైత్యహరములు:—వాతపైత్యహరములు చూడుడు.

శీతలహరములు:—జలుబును హరించునవి చూడుడు.

శుక్రవాతశుక్రదోషహరములు:—Do. for unhealthiness of the semen. ఆవనూనె, ఆవాలు, పచ్చలభస్మము, కన్నెకోమలి, కానుగనూనె, గంటుభారంగి, పిండికొండచెట్టు.

శుక్రనష్టమును హరించునవి:—ఇంద్రియనష్టమును కట్టునవి చూడుడు.

శుక్రవృద్ధికరములు:—వీర్యవృద్ధికరములు చూడుడు.

శూలహరములు:— Do. for spasmodic colic. అల్లము, అగ్నివేంద్రపుచెట్టు, అజామోదిచెట్టు, అజామోదవిత్తులు, అగ్నికాపడము, అకుచెముడు, ఆకుపత్రికము, ఆముదము, ఆముదపుచెట్టు, ఆరెచెట్టు, అమ్లవేతసము, ఆవనూనె, ఇంగువ, ఇనుపభస్మము, దీనిసింధూరము, ఉత్తరేణిచెట్టు, ఉడుముమాంసము, ఉప్పు, ఉలవకట్టు, ఉలిమిడిచెట్టు, ఎర్రచిరతలి, ఎలుకచెవిచెట్టు, ఏడాకులపొన్న, ఏలకులు, ఏలకులఅరకు, ఓమము, ఓమపునూనె, కంకుష్ఠము, కంపిల్లము, కరక్కాయ, కవిరి, కారింగువ, కారుమునగచెట్టు, కురంజివామము, కొండచీపురుగడ్డి, కొబ్బరిపాలు, కోడిసెపాలచెట్టు, కోడిమాంసము, కోలచెముడు, గంధకద్రుతి, గంధకము, గచ్చకాయ, గచ్చకొనలు, గచ్చచెట్టు, గవ్వభస్మము, గుమ్ముడుచెట్టు, గురిజకాయ, గజనిమ్మకాయ, గుర్రపులద్ది, గోదమూత్రము, గోదసుగంధి,

గొర్రెమూత్రము, గోమూత్రము, చనుబాలు, చన్నచర్లగడ్డ, చేమంతిపువ్వు, చింతచెట్టు, చిట్టాముదము, చిత్రమూలము, చీనా పంచదార, చెముడుచెట్టు, చెవ్యము, చేతిపుచ్చచెట్టు, చిన్నపల్లేరు, జాపత్రి, జాజికాయ, జీడిగింజలు, జీలకర్ర, జిల్లేడుపువ్వు, తగర భస్మము, తామ్రభస్మము, తాళకభస్మము, దీనిసింధూరము, తిరు గుడిచెముడు, తుంబురులు, గజ్జేరు, తెగడ, తెల్లములక, తోరమల్లి భస్మము, దశమూలములు, దానిమ్మచెట్టు, దాల్చినిఅరకు, దాల్చిని చెక్క, దింతిన, నఖముచిప్పలు, నిమ్మపండు, నేలగురుగుడుచెట్టు, నేలవేము, నీలిచెట్టు, పంచకోలములు, పాలసుగంధి,పిండికొండచెట్టు, పిన్నపాపర, పుష్కరమూలము, పిప్పలిమూలము, పెద్దపల్లేరు, పెద్ద వాయింటచెట్టు, ప్రబ్బలిచెట్టు, బలపపురాయి, బాలింతబోలు, బిడాలవణము, బుడమకాయ, బోడతరము, బెల్లము, బ్రహ్మదండి చెట్టు, దీనిక్షారము, మట్టితైలము, మైనతుత్థము, మాదీఫలము, మానుపసుపు, మానుప్పు, మిరపకాయలు (ఎండువి), ముత్తువపుల గము, మారేడుచెట్టు, మేకనెయ్యి, ముత్యములసున్నము, మునగ విత్తులు, ములుగోరింటచెట్టు, మయూర్కొండచెట్టు, మారేడుపండు, మొగలిచన్నులు, ములువెంపలిచెట్టు, మెట్టతామర, మొమ్మాయి, ముత్యపుచిప్పలసున్నము, యవక్షారము, రజితభస్మము, రసకర్పూ రము, రసభస్మము, రక్తచందనము, రససింధూరము, రాజావర్త భస్మము. రావిచక్కక్షారము,రాసున్నము, రేలచెట్టు,వజ్రభస్మము, వరగోగు, వస, వాయువిడంగములు, విరిగిచెట్టు, విమబొద్ది, వెదురు, వెలిగారము, వెల్లుల్లి, వ్యాఘ్రనఖము, శంఖభస్మము, శంఖజీరకము, సముద్రపునురుగు, సర్జరసము, సీసభస్మము, సున్నము, సోమ రాజము, సీమగోరింటవిత్తులు, సౌవర్చలవణము, సీమమిరపకాయలు, క్షారసముదాయము. మరియు పెన్నేరు రక్తశూల నణచును;

ముత్యములసున్నము, శృంగిభస్మము, సజ్జాక్షారము ఇవి పైత్య శూలలను హరించును. కడుపునొప్పిహరములు చూడుడు.

శోభహరములు:—ఉబ్బరోగహరములు చూడుడు.

శోషహరములు:— Articles indicated for fainting from starvation or exhaustion. అజామోదవిత్తులు, అల్లము, అనుములు, ఎర్రావడచెట్టు, ఓమము, కరక్కాయ, కుంకుమపువ్వు, కొబ్బరికాయ, కిసిమిసిపండు, కృష్ణాగరు, గంధకము, చీనాపంచదార, చిన్నపల్లేరు, చింతపండు, త్రికొండచెట్టు, ద్రాక్షపండు, నవాసాగరము, పెద్దమావేరు, పెద్దపల్లేరు, బార్లీగంజి, బియ్యపునూకజావ, రససింధూరము, పొట్టుకపాయిలకూర.

శ్రమనుహరించునవి:—బడలికను పోగొట్టునవి చూడుడు.

శ్లేష్మజ్వర హరములు:— Do. for fever from excessive phlegm. అడ్డసరము, ఉత్తరేణిచెట్టు, గంటుభారంగి, కర్కాటకశృంగి, చంగల్వకోష్టు, చనుబాలు, చేదుపొట్ల. జటామాంశి, దుంపరాష్ట్రము, నేలములక, పద్మకము, పర్పాటకము, పిప్పలిమూలము, పుష్కరమూలము, లక్క, లవంగాలు.

శ్లేష్మపైత్యహరములు:—Do. for bile combined with phlegm. అడ్డసరము, కర్కాటకశృంగి, గొరిమాత్రము, చాదరాసికూర, జటామాంశి, పంచమూలములు (లఘు), పాచితీగె, ముత్యములసున్నము, యష్టిమధుకము, సత్తుభస్మము.

శ్లేష్మమును నీరుజేయునవి:—Articles that melt phlegm. అక్కలకర్ర, సైంధవలవణము.

శ్లేష్మమును వెడలించునవి:— Articles that expell phlegm or expectorents. అడ్డసరము, అక్కలకర్ర, కచ్చూరములు, కోదాడికాయలు, కర్కాటకశృంగి.

శ్లేష్మవాత హారములు:-Do. for cold combined with phlegm.
ఉప్పుకరక్కాయ, గంటుభారంగి, చింతపండు, తగిరిసచెట్టు, దేవదారుచెట్టు, దురదకంద, దుంపరాష్ట్రిము, ద్రాక్షపండు, నఖము చిప్పలు, పచ్చకర్పూరము, పచ్చలభస్మము, పుష్కరమూలము, మెంతికూర, వాకుడుకాయ, సర్జరసతైలము, సీమచిత్రమూలము, సౌవీరము.

శ్లేష్మహారములు:—Articles that absorb or check phlegm.
అంజీరుపండు, అంబరు, అగరుశొంఠి, అందుగచెట్టు, అగ్నివేంద్రపు చెట్టు, అడవికంద, ఆటుకమామిడి. అడ్డసరము, దీనిపువ్వు, అడవి జీలకఱ్ఱ, అడవితులసి, అడవివుల్లి, అడవిశనగచెట్టు, అయిలారము, అతివస, అకుచెముడు, ఆముదము, ఆరెచెట్టు, ఆవాలపిండి, ఆదొండ చెట్టు, ఆరుకణుపులకానుగ, అడవిమల్లె, అయస్కాంతభస్మము, అమ్లవిశేషము, ఉస్తికాయలు, ఇరుగుడుతైలము, ఉప్పు,ఉప్పిచెట్టు, ఉలవలు, ఉసిరికాయ, ఏడాకులపొన్న, ఏపిచెట్టు. ఓమము, కంచు భస్మము, కంపిల్లము, కరక్కాయ, కర్పూరతైలము, కాకరాకు, కారుగచ్చచెట్టు, కాసరచెట్టు, కుంకుడుచెట్టు, కురంజిచెట్టు, కురువేరు, కూతురుబుడమ, కవిరి, కొత్తిమీరి, కొంకిపిసిలిచెట్టు, కృష్ణాగరు, కొండగోగు, కోదాడికాయ, కృష్ణతులసి, ఖర్జూరపుకాయ, గంధఫెరోజా, గంధకము, గచ్చకొనలు,గజపిప్పళ్ళు,గుల్లసున్నము, గుగ్గిలము, గోరెమూత్రము, గంజాయి, గాడము, గంటుభారంగి, చాతుర్జాతకము, చేమంతిపువ్వు, చేదుపొట్ల, చింతపువ్వు, చిట్టాముదపుచెట్టు, చిప్పగడ్డి, జటామాంసి, జిల్లేడుపాలు, తగరభస్మము, తములపాకులు, తాటికలకండ, తామ్రభస్మము, తాళకభస్మము,దీని సింధూరము, తేనె, తుమ్మికూరచెట్టు, తులసి, తెగడ,తక్కెడచెట్టు, త్రిజాతములు, దర్భ, దాల్చినిఅరకు, దుందిలపు చెట్టు,

దుందిలపుకాయ, దుంపరాష్ట్రిము, దుయ్యచెట్టు, నందివృక్షము, నల్లేరు, నిర్విష, నీటిప్రబ్బలిచెట్టు, నీరుల్లిపాయ, నులిదడచెట్టు, నెల్లిచెట్టు, నెమ్మిచెట్టు, నేలతంగేడుచెట్టు, నేలవేము, నల్లవావిలి, పగడభస్మము, పటికిపంచదార, పచ్చకర్పూరము, పచ్చిపోకలు, పసుపు, పర్పాటకము, పాలసుగంధి, పారిజాతపుచెట్టు, పిప్పలిమూలము, పిన్నసదాప, పిప్పళ్ళు, పుగాకు, పుత్రజీవిచెట్టు, పిన్నమావేరు, ప్రబ్బలిచెట్టు, బాలింతబోలు, బూరుగచెట్టు, భూతపిల్లిగడ్డ, మంగచెట్టు, మంచిగంధము, మంగకాయ, మద్యము, మయూరశిఖ, మదనగడ్డి, మరువము, మల్లిపువ్వులు, మహిసాక్షి, మాదీఫలము, మామిడల్లము, మారేడు, మిరియాలు, ముచుకుందపుష్పములు, మునగవేరు, మునగతైలము, మురయనుగ్రంధ్యము, మూర్కుండచెట్టు, మెంతికూర, మొమ్మాయి, మోదుగచెట్టు, మోచన, మోదుగపువ్వు, మోదుగమాడలు, మెట్టతామర, రాసున్నము, రసకర్పూరము, రక్తచందనము, రజితభస్మము, లవంగాలు, లవంగాలనూనె, లోహభస్మము, దీనిసింధూరము, వస, వజ్రభస్మము, వాయింటచెట్టు, వావిలిచెట్టు, విత్తుబోడతరము, విమబొద్ది, వేగిసచెట్టు, వేపచెట్టు వేపనూనె, వాకుడుకాయలు, వాకుడుచెట్టు, వెల్లుల్లి, చిరివేపచెట్టు, శొంఠి, షాజీరా, సదాపచెట్టు, సన్నరాస్నము, సరళదేవదారు, సంపెంగచెట్టు, సీమచిత్రమూలము, సైంధవలవణము, సత్తుభస్మము, సీకాయచెట్టు, హరిదళము, హరిదళభస్మము, మరియు ఎర్రగల్జేరు, తెల్లగలిజేరు ఇవి చెడిపోయిన శ్లేష్మమును బాగుజేయును; తరుబూజాపండు శ్లేష్మమును పలుచనజేయును.

శ్వాసకాసలను హరించునవి:—**Articles indicated for cough and hard breathing.** అంకుడుచెట్టు, అంజీరుపండు, అడవిగర్గర, అడవిజీలకర్ర, అడవిపసుపు, అడవిపులవలు, అడవిశనగచెట్టు, అడ్డ

సరము, దీనిపుష్వ, అభ్రకభస్మము, అల్లము, అకుపత్రికము, ఆవు పాలు, ఆగాకరకాయ, అమ్లవేతనము, అయస్కాంతభస్మము, ఇంగువ, ఇత్తడిభస్మము, ఉక్కుభస్మము, దీనిసింధూరము, ఉస్తి చెట్టు, ఉస్తికాయ, ఉలవలు, ఉలవకట్టు, ఎర్రావడచెట్టు, ఏడకుల పొన్న, ఏదుబంది, ఏలకులు, కటుకరోహిణి, కప్ప, కరకాకాయ, కర్కాటకశృంగి, కాకిదొండకాయలు, కారుమునగ చెట్టు, కామంచి పూరి, కొబ్బరిపాలు, కోలపొన్న, కంపిల్లము, కాకినూంసము, గలి జేరు, గొంతెమగోరుచెట్టు, గోమూత్రము, గైరికము, గంజాయి, గుర్రపులద్దె, చిత్రమూలము, చిన్నదూలగుండ, చేదుఆనబచెట్టు, చేదుబీర, తాడికాయ, తామ్రభస్మము, తాళకభస్మము, దీనిసింధూ రము, తాళిశపత్రి, తృణపంచమూలములు, తెల్లగజ్జేరు, తేనె, త్రికటుకములు, దశమూలములు, దిరిసెనచెట్టు, దుందిలపుచెట్టు, దుంపరాష్ట్రము, దేశతాళవృక్షము, దుందిలపుకాయ, నల్లమందు, నల్లఉమ్మెత్త, నీలిచెట్టు, నేలములక, పంచమూలములు (గురు), పటికిపంచదార, పాలగుండ, పిప్పలిమూలము, పిప్పళ్ళు, పిన్నపాపర, పుష్పాంజనము, పుష్కరమూలము, పెద్దదూలగుండచెట్టు, పేలాలు, పోకలు, ప్రత్తిగింజలు, బిడాలవణము, మెట్టతామర, మైలతుత్థము, మాండూరము, మాదీఫలము, మంచిగంధము, మిరియాలు, ముయ్యాకుపొన్న, మద్యము, ములుగోరింటచెట్టు, మూరొకొండ చెట్టు, మొమ్మాయి, మోదుగమాడలు, మేకనెయ్యి, యవక్షారము, యూక్లిప్టసుఆయిలు, రజితభస్మము, రసకర్పూరము, రసభస్మము, రససింధూరము, రసాంజనము, లోహభస్మము, లోహసింధూరము, వజ్రభస్మము, వాకుడుచెట్టు, వాయువిడంగము, వెలిగారము, వెల్లుల్లి, వైక్రాంతభస్మము, శిరివేరు, శొంఠి, సజ్జాక్షారము, సన్న రాష్ట్రము, సముద్రలవణము, సౌవీరాంజనము, స్వర్ణభస్మము, సీస భస్మము, హేమమాక్షికము, తారమాక్షికము, క్షీరకాకోళి.

శ్వాసకోశములకు బలమిచ్చునవి:—తెల్లదబ్బకు బలమిచ్చునవిచూడుడు.

శ్వాసను అణచునవి:—ఒగర్పు హారములు చూడుడు.

శ్వేతకుష్ఠహారములు:—Articles Indicated for Leucoderma. అంజీరుపండు, అయస్కాంతభస్మము, ఈశ్వరిచెట్టు, ఉక్కుభస్మము, దీనిసిందూరము, ఏనుగచర్మము, కంపిల్లము, కాసీసము, కుంకుమపువ్వు, కవిరి, చంద్రచెట్టు, తెల్లదింతెన, దిరిసెనచెట్టు, నందివృక్షము, పసుపు, బావంచాలు, మొమ్మాయి, మనుష్యుడు, రక్తచందనము, లోహభస్మము, దీనిసింధూరము.

సంతోషమును గలుగజేయునవి:—Articles that give pleasure i. e. cordials. అంజీరుపండు, అక్రోటు, అరటిపండు, ఆకుపత్రికము, ఉసిరికాయ, ఎర్రకలువదుంప, ఏలకులు, ఏలకులఅరకు, కల్లు, కురువిందచెట్టు, కుంకుమపువ్వు, గులకందు, గెంజాయి, గోబ్బివిత్తులు, గులాబీపువ్వు, జామిపండు, జాజికాయ, దీనిఅరకు, జాపత్రి, తమలపాకులు, తవాక్షీరి, తాటికల్లు, తేయాకు, . ధనియాలు, దాల్చినిచెక్క, ద్రాక్షాసవము, నల్లమందు, నేలతంగేడుచెట్టు, పాలపండు, పుష్పధారణము, పోకలు, పొగడపువ్వులు, బంగారపువరకు, బాలింతబోలు, బ్రాంది, మద్యము, ముత్యములభస్మము, మొమ్మాయి, లవంగాలు, వెండివరకు, స్వర్ణభస్మము.

సన్నిపాతజ్వరహారములు (సంధి):— Articles Indicated for Sannipata or Typhoid &c fevers. అంబరు, అక్కలకర్ర, అడవిజీలకర్ర, అన్నము, అల్లము, ఉప్పిచెట్టు, కచోరము, కనిష్టపంచమూలములు, కలిగొట్టుచెట్టు, కసివిందచెట్టు, కురాసానిఓమము, కర్పూరము, కస్తూరి, కాసినిగింజలు, కొండకసివిందచెట్టు, గరళము, గాజుబాన్, చంగల్వకోష్టు, గ్రంథితగరము, చెప్పుతట్టాకు, చనుబాలు, చాదరాసికూర, చిన్నదూలగుండ, చేదుబీర, జిల్లేడుచెట్టు,

అన్ను, ఆంబేలుచేదుకట్టె, తెల్లజిల్లేడు, తేన, దశమూలములు, దుంపరాష్ట్రము, నరమూత్రము, నేలానబచెట్టు, నేలతాడి, నేల వేము, నేలములక, నాభి, నేలతప్పెటచెట్టు,పంచకోలములు, పచ్చల భస్మము, పావుదార, పెద్దదూలగుండ, పాషాణము, పుష్కర మూలము, పెన్నేరు, పాలపండు, బొక్కెనచెట్టు, మునగవేరు, మొక్కపుకాయ్మ, మొసలిచేదుకట్టు, యష్టిమధుకము, రసకర్పూ రము, రసభస్మము, రౌయ్యపీత, వెల్లుల్లి, సంపెంగచెట్టు, సౌవీరము, సూరేకారము, హేమాక్షికభస్మము, మరియు కత్తిమందుచెట్టు, సన్నిపాత అంధత్వమును, మాంద్యమును హరించును; పర్పాటకము సన్నిపాత ప్రలాపమును హరించును.

సమశీతోష్ణ ద్రవ్యములు:— Articles that equilibrate the cold and heat in the system. అష్టగుణమండనము, కర్పూజాపండు, కోడిగ్రుడ్డు, గులాబీపువ్వు, చేమంతిపువ్వు, చిన్నపల్లేరు, తముల పాకులు, పెద్దపల్లేరు, బాదముపప్పు, మిరియాలు, రేవల్చిన్ని.

సమస్తేంద్రియ బలకారులు:—Articles that give strength to all organs. అంజీరుపండు, అక్రోటు, అడవిపోక, కరక్కాయ, ధారోష్ణాలు, పటికిపంచదార, బాదముపప్పు, మొమ్మాయి, రజిత భస్మము, స్వర్ణభస్మము.

సర్పవిష వ్రణహరములు:—Articles indicated for ulcers from snake bite. కూతురుబుడమ, కృష్ణతులసి, చిరువేరుచెట్టు, జిల్లేడు చెట్టు, ముషిణిచెట్టు, హేమాక్షికభస్మము.

సర్పవిష హరములు:— Antidotes for snake poison. ఆకాశ గరుడ, ఆరుద్రపురుగు, అమరశిలగంధము, అయస్కాంతభస్మము, అవిసిచెట్టు, ఇసుపగోలుగింజలు, ఈశ్వరిచెట్టు, ఊడుగచెట్టు, ఉత్త

కేణిచెట్టు, ఎఱ్ఱావశచెట్టు, కస్తూరి, పసపు, కాకిదొండచెట్టు, కుంకుడు చెట్టు, కోడిగ్రుడ్డు, కాంద్రేగుచెట్టు, గాడిదగడపాకు, గొడ్డుకాకర చెట్టు, గొలుగుచెట్టు, గోరోజనము, గైరికము, చిలుకతోటకూర, చేదుబీర, చిరువేరుచెట్టు, చిన్నపల్లేరు, చుంచుకూసము, జిల్లేడుచెట్టు, తిప్పతీగె, తేలుమణిరాయి, తెల్లజిల్లేడు, తెల్లవాలు, తీగెముషిణి చెట్టు, తుమ్మికూర, దింతెన, దుష్టపుచెట్టు, దిరిశెనచెట్టు, దేవతాళ వృక్షము, నాగదొండ, నెరసి, నీలిచెట్టు, నాగమల్లిచెట్టు, నీరుల్లి పాయ, నేలవేము, పానకము, పాటలగన్ని, పాలసుగంధి. పిప్పళ్ళు, పెద్దపల్లేరు, పుల్లబచ్చలి, పేరింటచెట్టు, బొక్కెనచెట్టు, మనుష్యుడు, మారేడుచెట్టు, మైనము, మొమ్మాయి, మిరపకాయలు, ముండ్ల తోటకూర, మోదుగచెట్టు, ముషిణిగింజలు, ముషిణిచెట్టు, మేక మాంసము, రసకర్పూరము, లోహభస్మము, దీనిసింధూరము, విషబొద్ది, వెల్లుల్లి, సర్పాక్షి. మరియు కూతురుబుడమ, నల్లతుమ్మ చెట్టు ఇవి రక్తపొడ విషహారములు.

సర్పిరోగహారములు అనగా విసర్పిరోగహారములు:—**Articles indicated for herpes.** అమరశిలగంధకము, ఆరెపువ్వు, ఆవాలు, ఆవునెయ్యి, ఈశ్వరిచెట్టు. ఎఱ్ఱకలువదుంప, కరక్కాయ, కానుగ నూనె, కిక్కిసగడ్డి, కురువేరు, కోష్టు, కృష్ణాగరు, గరికవేళ్ళు, గిలి గిచ్చచెట్టు, గైరికము, గొంతెమగోరుచెట్టు, చంద్రచెట్టు, గంగ సిందూరము, తామరపువ్వు, తుంగముస్తలు, తువరిమన్ను, తొగరు చెట్టు, తేనెతెట్టె, నల్లజీలకర్ర, నాగమల్లిచెట్టు, నల్లయుమ్మెత్తచెట్టు, నేపాళపుచెట్టు, పద్మకాష్టము, పాలసుగంధి, పెద్దమావేరు, పిన్నమా వేరు, పెద్దదవనము, పెన్నేరు, బూరుగచెట్టు, మంచిగంధము, ముంజ దర్భ, మురయసుగ్రంధ్యము, మేడిచెట్టు, మైనము, రక్తచందనము, లక్క, వాయింటచెట్టు, వేగిసచెట్టు, శంఖజీరకము, సర్జరసము, సుద్ధ, సురుగుడుచెట్టు, స్పంజి.

సర్వరోగ హరములు :— Do. for all diseases. అయస్కాంత భస్మము, అభ్రక భస్మము, ఇంగిలీకము, చేమంతిపువ్వులు, తుత్తురుబెండ చెట్టు, త్రిఫలములు, నల్లగుంటకలగర, నాగకేసరములు, నేలతంగేడు, పాదరసము, మొమ్మాయి, రజితభస్మము, లోహ భస్మము, శ్వేతాభ్రకము, సునాముఖి, స్వర్ణభస్మము.

సవాయిరోగహరములు:— Articles indicated for syphilis. ఇంగిలీకము, దీవిభస్మము, ఊడుగ చెట్టు, ఉత్తరేణి చెట్టు, గంధకము, గుమ్ముడు చెట్టు, చల్లగుమ్ముడు, జిల్లేడు చెట్టు, జిల్లేడుపాలు, జిల్లేడు పువ్వు, తెల్ల జిల్లేడు, దర్భ, నల్లయుమ్మెత్త, నల్లి చెట్టు, పాలసుగంధి, పాదరసము, ఫిరంగిచెక్క, బాడిద చెట్టు, బూడిదగుమ్మడికాయ, బలురక్కెస చెట్టు, బోడతరము, మహార్కుండి చెట్టు, మునగజిగురు, ముషిణిగింజలు, రసకర్పూరము, రసభస్మము, వృద్ధదారు, సత్తు భస్మము, సరస్వతియాకు, సౌవీరము. మరియు పుగాకు పురాణ సవాయివ్యాధిని హరించును.

సుఖప్రసవకారులు (శీఘ్రప్రసవకారులు):— Articles that cause easy or safe delivery in child birth. ఆకుపత్రికము, గంధకి రోజా, గుగ్గిలము, గాజరగడ్డలు, గాడిదగడపాకు, దాల్చినిచెక్క, పాటలగన్ని, పసుపు, పొత్తిదుంప, వెలిగారము.

సుఖవ్యాధిహరములు:–Articles indicated or venerial diseases. ఆకాశగరుడ, ఇంగిలీకము, ఉడుముమాంసము, ఎలుకచెవిచెట్టు, కురువింద చెట్టు, కిపిగింజలు, తురకవేప చెట్టు, తిప్పతీగె, ఉప్పి చెట్టు, పగడపుతీగె చెట్టు, పాలసుగంధి, ఫిరంగిచెక్క, పెద్దమూలగుండె చెట్టు, బల్లిబాడిద చెట్టు, బోడసరము, మిరపకాయలు (ఎండువి), మొమ్మాయి, మెట్టతామర, మురదారసింగు, మునగవిత్తులు, సము

ద్రపుకొబ్బరికాయ, సరస్వతియాకు, సీమమెట్టతామర, సౌవీరము, మరియు ఫిరంగిచెక్క పురాణసుఖవ్యాధులను హరించును.

సూతికావాతహరములు:— Articles Indicated for puerperal sepsis. ఇంగిలీకము, దినిభస్మము, ఇంగువ, ఉప్పిచెట్టు, ఏదుబంది, కస్తూరి, కొండకసివింద, గాడిదలద్ది, జున్ను, తాంబేలుచేదుకట్టు, నేలతప్పెటచెట్టు, పిప్పలికట్టె, పిప్పళ్ళు, పెన్నేరు, మొసలిచేదుకట్టు, రొయ్యపీత, లవంగాలు, వసగోగు, వాయింటచెట్టు, వెల్లుల్లి, సంపెంగచెట్టు.

సెగరోగహరములు:— Do. for gonorrhoea. అటుకమామిడి, అరటికాయ, అరటిచెట్టు, ఇసుపగోలుగింజలు, ఉసిరికచెట్టు, ఎలుకచెవికూర, కలబంద, కక్కుపాల, కర్పూరము, క్రనూన, కానుగచెట్టు, కవిరి, గంధఫోజా, గుమ్ముడుచెట్టు, చందినిఅత్తరు, చలువమిరియాలు, చల్లగుమ్మకు, చిన్నపల్లేరు, జిల్లేడుపువ్వు, తగరభస్మము, తుంగముస్తలు, తుత్తనాగము, తుత్తురుబెండ, దూసరిచెట్టు, నాగజెముడు, నేలతంగేడు, నేలతాడి, నేలయుసిరికచెట్టు, ఫిరంగిసాంబ్రాణి, పెద్దపిల్లిపీచర, పాత్రిదుంప, పెద్దపల్లేరు, బేదానాగింజలు, బోడతరము, మంచిగంధము, మర్రిపాలు, మానుపసుపు, మామిడల్లము, మనుబాల, మహిసాక్షి, మూసాంబ్రము, ముల్లంగి, ముండ్లతోటకూర, మోదుగపువ్వు, యష్టిమధుకము, రాతినార, రుద్రజడచెట్టు, రెడ్డివారినానుబాలచెట్టు, రాకాసిమట్టలు, రేవల్చిన్ని, రత్నపురుష, వావిలిచెట్టు, శంఖజీరకము, సంపెంగచెట్టు, సీమఅవిసిగింజలు, సున్నము, సూరేకారము, సీమవంకాయ. ప్రమేహహరములు చూడుడు.

సెలలుకేయు వ్రణహరములు:— పుట్టవ్రణహరములు చూడుడు.

స్త్రీలఋతుమతులజేయునవి:—Articles that make girls attain puberty. కొబ్బరికాయనీళ్ళు, మందారపుష్పము, మసాంబ్రము, వరగోరు, వెలిగారము.

స్త్రీలకు పాలవృద్ధిపరచునవి:-Articles that promote the secretion of breast milk i. e., Lactagogues. అనపకట్టు, ఆకుపత్రికము, అనుములు, ఆవుపాలు, ఓమము, కదంబవృక్షము, కాసినిగింజలు, కర్బూజాపండు, కోలపాలకూర, గుగ్గిలము, గుమ్మడుచెట్టు, చిట్టాముదము, చేపలు, చెరుకువేళ్ళు, జీలకర్ర, తామరతూండ్లు, తెలకపిండి, దుందిలపువేరు, నేలగుమ్మడి, పెద్దపిల్లిపీచర, పిల్లిపీచర, ప్రత్తిగింజలు, బార్లీగింజలు, బొబ్బర్లు, మదనానబచెట్టు, మాంసరసము, ముండ్లతోటకూర, ముచుకుందము, మునగకూర, వెల్లుల్లి, శవగలు, సోపు, సీమగోరింటవిత్తులు, క్షీరకాకోళి.

స్త్రీలపాలు హరించునవి:—Articles that check the secretion of breast milk. తమలపాకులు, తుంగముస్తలు, నల్లయుమ్మెత్త, మల్లిపువ్వులు, వేపఆకు.

స్త్రీసాంగత్యదోషగుణహరములు:—దోషగుణహరములు చూడుడు.

స్ఫోటక హరములు:—Articles indicated for small pox. అరటిచెట్టు, కాసినిగింజలు, కుంకుమపువ్వు, కస్తూరిపసుపు, కాఫీ, గుర్రపుపాలు, చల్లగడ్డలు, తమాలవృక్షము, దవనము, నల్లమందు, నేలతాడి, పద్మకాష్టము, పుండరీకము, పిండికుండచెట్టు, పిన్నమాచేరు, వేపమాను, శేపాకు, సరస్వతియాకు, సర్జరసతైలము. మరియు గోరింటచెట్టు కండ్లలో స్ఫోటకము తగులనివ్వదు; సూరేకారము పొంగును హరించును.

స్వరభంగహారములు:—కంఠధ్వనిని బాగుచేయునవి చూడుడు.

స్మృతికరములు:— Articles that restore or increase the retentive power of the brain stimulants. అక్రోటు, అభ్రక భస్మము, ఇంగువ, చీనాపంచదార, టర్పెన్ పైనుతైలము, నవాసాగరము, పాదరసము, పాలపండు, రజితభస్మము, శంఖపుష్పి, సోపు, స్వర్ణభస్మము, శ్వేతాభ్రకము,జ్ఞాపకశక్తినిచ్చునవిచూడుడు.

హృదయబలకారులు:— Articles that give strength to the heart. అంజీరుపండు, అంబరు, అక్రోటు, అజామోదవిత్తులు, అమృతఫలము, ఆదొండవరుగు, ఉసిరికాయ, ఏలకులు, కర్పూరము, (హారతి), కస్తూరి, కస్తూరిబెండ, కారూబా, కిసిమిసిపండు, కుంకుమ పువ్వు, కురువేరు, కొబ్బరికాయ, కొబ్బరిసారాయి, కామంచిచెట్టు, కోడిగ్రుడ్డు, క్రొత్తవెన్న, గులాబీపువ్వు, గాజుబాన్, చలవమిరి యాలు, చింతపండు, చీతపొట్టు, జటామాంసి, జాజికాయ, తమల పాకులు, తవాక్షీరి, తుమ్మజిగురు, తేనె, దాల్చినిచెక్క, ద్రాక్ష పండు, ద్రాక్షాసవము, ద్రాక్షరసము, దానిమ్మపండు తియ్యనిది, నిమ్మచెట్టుపండ్లు, నేలతాడి, పగడభస్మము, పసపు, పిస్నసదాప, ఫిరంగిసాంబ్రాణి, పాలపండు, పోకలు, బంగారపువరకు, బాదం కాయలు, బాదమునూనె, బాలింతబోలు, బోడతరము, ముత్తువ పులగము, ముత్యములభస్మము, మొమ్మాయి, మందారపువ్వము, మొల్లలనుపువ్వములు, యష్టిమధుకము, రూమీమస్తకి, రజిత భస్మము, లవంగాలు, వస, వెదురు, వాయింటచెట్టు, శంఖజీరకము, శిలాధాతువు, శొప్పశొంఠి, స్వర్ణభస్మము.

హృద్రోగహరములు:—Articles indicated for the disease of heart. అంజీరుపండు, అడవిగోధుమలు, అతివస, అకుపత్రికము, అగాకరదుంప, అముదము, అమ్లవేతసము, ఇంగువ, ఉలిమిడిచెట్టు, కలుకానుగు, కామంచిపూరి, కాసినిగింజలు, కుంకుమపువ్వు,

కూతురుబుడమ, కొండచీపురుగడ్డి, కరక్కాయ, గాజరగడ్డలు, గోధుమపిండి, గాజుబాన్, చాగచెట్టు, చెవ్యము, చింతచెట్టు, చిట్టాముదము, చిన్నపల్లేరు, చిప్పగడ్డి, జాజికాయ, తుంగముస్తలు, తెల్లగలిజేరు, తెల్లమద్దిచెట్టు, తేయాకు, దశమూలములు, ధనియాలు, నాగకేసరములు, నేరేడుపండు, నేలములక, పిండికొండ చెట్టు, పిన్నపాలచెట్టు, పిప్పలిమూలము, పుల్లబచ్చలి, పుష్కరమూలము, పెద్దపల్లేరు, బలపపురాయి, బిడాలవణము, బూరుగ చెట్టు, మదనానబచెట్టు, మీనిపండు, మంగచెట్టు, మొమ్మాయి, మిరియాలు, మెంతికూర, ముత్తువపులగము, మాలుదోసచెట్టు, యష్టిమధుకము, వస, వాకుడుచెట్టు, వాయింటచెట్టు, వాయువిడంగములు, వెణుతురుచెట్టు, వెదురు, వెల్లుల్లి, శృంగిభస్మము, శ్వేతాభ్రకభస్మము, సంబరేణి, స్వర్ణభస్మము, సజ్జాక్షారము, సత్తుభస్మము, సర్పాక్షి, సోపు, క్షీరకాకోలి.

క్షయరోగహారములు:—Do. for consumption. అంజీరుపండు, అడవిశనగచెట్టు, అడవిసదాప, అడ్డసరము, అన్నభేది, అన్నము, అల్లము, అయస్కాంతభస్మము, అడవిపందిమాంసము, అయిలారము, అడవిపావురమాంసము, ఆవుపాలు, ఆవువెన్న, ఇసుపగోలుగింజలు, ఇనుపచిట్టము, దీనిభస్మము, ఉడుముమాంసము, ఉప్పిచెట్టు, ఉలవకట్టు, ఊడుగపండు, ఊరబిచ్చుక, ఉస్త్రికాయలు, ఉస్త్రిచెట్టు, కప్ప, కర్కాటకశృంగి, కర్పూరశిలాజిత్తు, కల్లు, కూతురుబుడమ, కొబ్బరినూనె, కొబ్బరికురిడి, కొళంబువేరు, కాబేజీకూర, కాకిమాంసము, కాకోలి, కఫరి, కిసమిసిపండు,, గాజరగడ్డలు, కెంపుభస్మము, ఖర్జూరపుకాయ, గంటుభారంగి, గొబ్బిచెట్టు, గంధకము, గ్రద్దమాంసము, గసగసాలు, గుమ్ముడుచెట్టు, గెంజాయి, చాగచెట్టు, చిరివేరుచెట్టు, చీనాపంచదార, చేదుదొండ, చేపనెయ్యి,

జనపచెట్టు, జాపత్రి, జీవకము, జిల్లేడుచెట్టు, జిల్లేడుపువ్వు, తక్కోలములు, తవాక్షీరి, తగరభస్మము, తామ్రభస్మము, తాళీశపత్రి, తెల్లగలిజేరు, తెల్లజిల్లేడు, దొండచెట్టు. నల్లమందు, నీలభస్మము, నీలాంజనము, నేలగుమ్మడి, నేలతాడి, పగడభస్మము, పచ్చకర్పూరము, పచ్చలభస్మము, పటికిపంచదార, పాలగుండ, పిప్పళ్ళు, పుల్లబచ్చలి, పెద్దపిల్లిపీచర, పిల్లిపీచర, పెన్నేరు, ప్రొద్దుతిరుగుడుచెట్టు, బంగారపువరకు, బదినిక, బాదమునూనె, బాదముపప్పు, బూడిదగుమ్మడికాయ, బాలింతబోలు, బుడ్డకాకరచెట్టు, బూరుగచెట్టు, బొద్దిచెట్టు, బోడతరము, మంచిగంధము, మాండూరము, మయూరశిఖ, మరువము, మైలతుత్థము, ముత్తువపులగము, ముత్యములభస్మము, మురయను గ్రంధ్యము, ముల్లంగి, మారేడుచెట్టు, మేద, మహామేద, మేకనెయ్యి, యష్టిమధుకము, రజితభస్మము, రసకర్పూరము, రసభస్మము, రససింధూరము, రెల్లుగడ్డి. లక్క, లవంగములు, లవంగాలనూనె, లోహభస్మము, దీనిసింధూరము, వజ్రభస్మము, వట్టివేళ్ళు, వెణుతురుచెట్టు, వెలమసంధి, వైక్రాంతభస్మము, వాకుడుకాయలు, వాకుడుచెట్టు, విమలభస్మము, వృద్ధదారు, వెల్లుల్లి, శిలాధాతువు, సదాపచెట్టు, సన్నబోడతరము, సాంబ్రాణి, నాలామిస్రి, సీసభస్మము, సునాముఖి, స్వర్ణభస్మము, సీమఅవిసిగింజలు, సీమవంకాయ, హేమమాక్షికము, తారమాక్షికము, క్షీరకాకోలి. మరియు మహిసాక్షి పురాణక్షయను, జిల్లేడుపువ్వు, జీవకము, మహిసాక్షి ఇవి రక్తక్షయను హరించును.

శ్రీ. శ్రీ. శ్రీ.

—(౦)—

శ్రీ ర స్తు.

# పథ్యాపథ్యములు.

# DIETETICS & NON-DIETETICS

## పథ్యములు. Dietetics.

అండవృద్ధి:—For hydrocle. ప్రాంతమంచిబియ్యము, ప్రాతజొన్న బియ్యము, మేకమాంసము, అడవిమృగ, పక్షిమాంసములు, బీర కాయ, పొట్లకాయ, పొట్టికాకరకాయ, గలిజేరుఆకుకూర, లేత పెరుగుతోటకూర, పొన్నగంటికూర, పల్లేరాకుకూర, నెల్లికూర, మునగఆకుకూర, పలచని చారు, కందికట్టు, పెసరకట్టు, బొప్పాయి కాయకూర, వెల్లుల్లి, నీరుల్లి, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ, తేనె, ఉష్ణో దకము, స్త్రీ సంగమము, తాంబూలము.

## అపథ్యములు. Non-Dietetics.

పులుసు, పెరుగు, క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, గోంగూర, బచ్చలికూర, ఆనబకాయ, దోసకాయ, చేపలు, నీటి పిట్టల మాంసములు, మినుములు, గురకరపదార్థములు, మలమూత్ర వేగ నిరోధము, ఉపవాసము, అమితభోజనము, అమితస్త్రీసంగమము, మార్గగమనము, గుఱ్ఱము, బైసికిలు మొదలగువాని నెక్కడము, శ్రమపడడము.

## పథ్యములు. Dietetics.

అజీర్ణ, అగ్నిమాంద్యములకు :- For Indigestion & dyspepsia.
మంచి తేలికయిన ప్రాతబియ్యము, పేని వేపుడుమూకలజావ, బార్లీ

జావ, పెసలు, పేలాలు, పెసరకట్టు, మేక, జింక, నెమలి, కుందేలు, లావుకము, పూరేడు, చిన్నచేపలు వీని మాంసములు, అల్లము, ఉప్పు, కొద్దిగ కారము, గరమమసాలాలునూరి రాసి ఎండించిన మేక మాంసము నేతిలో వేయించినది, లేతముల్లంగి, వెల్లుల్లి, నీరుల్లి, లేత అరటికాయలు, లేతమునగకాయలు, పొట్లకాయ, బీరకాయ, లేత వంకాయ, నక్కదోసకాయ, కాకరకాయ, అల్లము,చుక్కలకూర, లేత పెరుగుతోటకూర, పొన్నగంటికూర, మెంతికూర, చెంచలి కూర, అత్త్రప త్తికూర, ఉసిరికాయ, దానిమ్మపండ్లు, నారింజపండు, బత్తాయిపండు, ఆవుమజ్జిగ, పలచని మిరియాలచారు, తాంబూలము, వేడినీళ్ళు, తేనె, కారము, నూనె, చేదు, వగరు పదార్థములు, సారాయి, వ్యాయామము.

### అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యము, గురుత్వమగుబియ్యము, చేపలు, బచ్చలికూర, అమితజలపానము, గురుకర, మలబద్ధకరపదార్థములు, కంద, పెండలము, చామ, ఆలుదుంపలు,(ఉర్లగడ్డలు) మొదలగుదుంపలు, నేరేడు పండ్లు, గోధుమలు, పిండివంటలు, గురుకరమాంసము, పాలు, పాలతో వండినపదార్థములు, చారపప్పు, జీడిపప్పు, చమురుగలపదార్థములు వండనిపదార్థములు, పుడకనిఅన్నము, వెంటవెంటనేభోజనము, అమిత భోజనము, నిద్రమేలుకొనుట, మలమూత్రనిరోధము,

### పథ్యములు. Dietetics.

అతిమూత్రమునకు:—Diabetes. ప్రాతమంచిబియ్యము, పచ్చపెసర పప్పు, దీనికట్టు, ప్రాతకందిపప్పు, దీనికట్టు, చిరిశెనగపప్పుకట్టు,శెనగ పప్పుకట్టు, లేతకోడి, మేక, దుప్పి, లేడి మొదలగు అడవిమృగముల పక్షిమాంసములు, మాంసరసము, పొట్లకాయ, బీరకాయ, కొండకాయ, అత్తికాయ, అరటిదూట, అరటిపువ్వు, లేతఅరటికాయ,

అరటిపండు, లేతమునగకూర, లేతమునగకాయలు, ఎలుకచెవికూర, మెంతికూర, పులిచెంచలికూర, తంగేటిపువ్వుకూర, తెలగపిండిలో వేసి వండిన తంగేడుపువ్వు కూర, పొన్నగంటికూర, మీగడతీసివేసిన ఆవుపాలు, ఆవుచల్ల, ఆవునెయ్యి, నేతిపొట్ల, చింతకాయ, నిమ్మకాయ, ఉసిరికాయ, దీనిపచ్చడి, నేరేడుపండ్లు, నిమ్మపండ్లు, అరటిపండ్లు, వెలగపండ్లు, పాతవియగు ద్రాక్ష మొదలగువానిని (Wines) సారములు, గుఱ్ఱము, ఏనుగులనెక్కుట, నడచుట మొదలగు వ్యాయామము, సాయంకాలము గోధుమఅన్నము, గోధుమపిండితో గాని, బార్లీపిండితోగాని చేసిన రొట్టెలు. రోగము హెచ్చుగా నున్నపుడు ఉదయమునకూడ గోధుమరొట్టె, గోధుమఅన్నము సేవించుట మంచిది. కాగిచల్లారిననీళ్ళు పుచ్చుకొనవలెను. ఇట్టినీళ్ళతోనే శిరస్నానము, కంఠస్నానము చేయవలెను.

## అపథ్యములు. Non-Dietetics.

ఆలస్యముగా జీర్ణమగు పదార్థములు, శ్లేష్మవృద్ధికర పదార్థములు, నీటిరొడ్డున నివసించు మృగపక్షిమాంసములు, ఎండు, పచ్చి చేపలు, కల్లు, సారాయి, బెల్లము, పంచదార, గేదె, మేక వీని పెరుగు, పాలు, నెయ్యి, పులుసు, ఇంగువ, వెల్లుల్లి, నువ్వులు, మూనె, ఆవ, గుమ్మడికాయ, పిండివంటలు, ఆకుకూరలు, విస్తారము కారము, ఉప్పు, మైత్యము, కాకచేయుపదార్థములు, పనసపండు, కంద మొదలగు దుంపలు, విస్తారము నీరుత్రాగుట, పగటినిద్ర, రాత్రులయందు మేల్కొనుట, అతినిద్ర, స్త్రీసంభోగము, సోమరితనము, ఎండ, విస్తారమునడక, ఆకలినాపుట.

## పథ్యములు. Dietetics.

అతిసారమునకు:— Fluxes or involuntary motions. ప్రాతదైలిక యగు బియ్యము, పేలాలు, బార్లీగింజలగంజి, పెరుగుమీది తేట, కందిపప్పు, పెసరపప్పు, వీనికట్లు, కుందేలు, లావుకపక్షి, జింక, కపింజలపక్షి, వీనిమాంసరసములు, చిన్నచేపలు, రొయ్యలు, మూనె,

గేదె, మేక, ఆవు వీని నెయ్యి, పాలు, పెరుగు, మజ్జిగ, ఆవువెన్న, అరటిపిందెలు, అరటిపువ్వు, తేనె, నేతిలోవేసిన శొంఠిచూర్ణము, నేతిలోవేయించిన గసగసాలపొడి, ధనియాలపొడి, అరటికాయపొడి కుమ్ములో కుక్కిచేసినపొడి, కానరేగుపండు, వెలగపండు, రేగు పండు, నేరేడుపండు, పొట్లకాయ, అరటికాయ, పులిచెంచలి, మెంతి కూర, ఆవనూనె, మారేడుకాయ, పుల్లని తియ్యని దానిమ్మపండ్లు, మర్రిపండ్లు, చుక్కకూర, వగరుపదార్థములు, లఘువుగను, దీపన కరములుగనుండు అన్నపానములు, నిద్ర.

అపథ్యములు. Non-Dietetics

పులిహోరము, చలిఅన్నము, నెయ్యి, క్రొవ్వు, మాంసమిశ్రమ మైన అన్నము, క్రొత్తబియ్యపుఅన్నము, అత్యుష్ణాన్నము, చమురుగల, గురుత్వముగల పదార్థములు, మిక్కిలికారము, పులుసు, ఉప్పుగల పదార్థములు, పిండివంటలు, బెల్లము, చెఱకురసము, మద్యము, అనుములు, గోధుమలు, మినుములు, పెసలు, శనగలు, మామిడి పండు, కొబ్బరికాయ, మునగకాయ, గుమ్మడికాయ, దోసకాయ, అనబకాయ, అగాకరకాయ, కంద, అలు మొదలగు దుంపలు, వెల్లుల్లి, పాచినీరు, బచ్చలి మొదలగు ఆకుకూరలు, మాంసము, నువ్వులు, శీతలవస్తువులు, తాంబూలము, సంచారము, అగ్నికాప డము, శరీరప్రయాస, మైథునము, చింత, జాగరణము, అభ్యం గనము, పొగత్రాగుట, స్నానము, చలినీళ్ళలో మునిగి స్నానము చేయుట.

పథ్యములు. Dietetics.

అపస్మారమునకు:— **Hysteria.** పాతముంచి బియ్యము, కందులు, పెసలు, చీనిపప్పులు కట్లు, గోధుమలు, మినుములు, ఆవు పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి, పాలు, బీరకాయ, పొట్లకాయ, శేతమునగ కాయ, పెరుగుతోటకూర, పొన్నగంటికూర, అరటిపువ్వు, అరటి

దూట, తియ్యనిదానిమ్మపండు, ద్రాక్షపండు, ఉసిరికాయ, పాలసా పండ్లు, మామిడిపండు, శీతాఫలము, బత్తాయి, నారింజ, అరటి పండు, వెలగపండు, ప్రాతనెయ్యి, మేకమాంసము, ఎండిన మాంసము, నేతిలోవేసినది, తాంబేలు మాంసము, పాత చింత పండుతో పలచనిచారు, చింతపొట్టుచారు, ఆలుబఖారాపండ్లచారు, నిమ్మపండ్లచారు, వెలగపండుచారు.

## అపథ్యములు. Non-Dietetics.

మద్యము, చేపలు, విరుద్ధాన్నములు, విస్తారముగా కారము, వేడిచేయునవి, అజీర్ణకరపదార్థములు, ఆకుకూరలు, దొండకాయ, చింత, శోకము, భయము, క్రోధము, అద్భుతపదార్థదర్శనము, అతిమైథునము, ఆయాసము, దప్పి, నిద్ర, మూత్రపురీష, ఆకలి వీనినిరోధము.

## పథ్యములు. Dietetics.

అరుచికి:— **Tastelessness or disinclination to take food.**

ప్రాతమంచిబియ్యము, గోధుమలు, పెసలు, కందులు, మేక, పంది, జింక, కుందేలు, వీనిమాంసములు, మేకమాంసము, అల్లము, ఉప్పు వగయిరాలు నూరి రాసి ఎండించినది, నేతిలో వేయించినది, వేపిన మాంసము, చేపశన, మట్టగిడసలు, బేడిసలు, ఇసుకదొందులు, రొయ్యలు, చేదుపరిగెలు, ఇట్టిమత్స్యములు, గుమ్మడికాయ, దోస కాయ, లేతముల్లంగి, లేతఉత్తిఆకు, పొన్నగంటికూర, చాదరాసి కూర, చిర్రికూర, పుదీనా, పులిచెంచలి, సీకాయిచిగుళ్ళు, కొత్తిమిరి, కంద, లేతవంకాయ, లేతమునగకాయ, లేతఅరటికాయ, దానిమ్మపండ్లు, వెలగపండ్లు, నిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు, మామిడిపండ్లు, రేగుపండ్లు, లేతతాటిముంజలు, వెల్లుల్లి, పులిగడుగు, పాలు, పెరుగు, మజ్జిగ, మెంతిపెరుగు, నెయ్యి, తేనె, అల్లము, ఖర్జూరము, చారపప్పు,

శర్కర, తీపి, పులుసు, చేదు, ఈరసములు, ప్రాతఉసిరిక, చింత, నిమ్మ, దబ్బకాయపచ్చళ్ళు, స్నానము, అభ్యంగనము.

అపథ్యములు. Non-Dietetics.

పైత్యముచేసెడు పదార్థములు, అయిష్టమగు అన్నపానములు, దుర్గంధము, వికార పదార్థములను చూచుట, మనోవైకల్యము, క్రోధము, శోకము, దప్పి, వాంతి, ఆకలి వీనిని ఆపుట.

అర్శోరోగమునకు:—మూలవ్యాధి పథ్యాపథ్యములు చూడుడు.

అశ్మరీరోగమునకు:—మూత్రకృచ్ఛ్ర పథ్యాపథ్యములు చూడుడు.

పథ్యములు. Dietetics.

అమ్లపైత్యమునకు:—Bile and acidity or burning sensation in the stomach or chest. ప్రాత మంచి బియ్యము, ఎఱ్ఱ బియ్యము, యవలు, గోధుమలు, పెసరపప్పు, కందిపప్పు, వీనికట్టు, కాచి చల్లార్చినసీళ్ళు, శర్కర, తేనె, పేలపిండి, నక్కదోసకాయ, అల్లము, కాకరపొట్టి, కాకరకాయ, అరటిపువ్వు, చక్రవర్తికూర, పొన్నగంటికూర, కాసరకూర, వెదురుమొలకలు, ముదురుగుమ్మడి కాయ, పొట్లకాయ, బీరకాయ, లేతమునగకాయ, వేపపువ్వు, ఉస్తికాయ, ఉస్తిచిగురు, బుడమచిగురు, ఆవుచల్ల, మేకమాంసము, వేయించిన మాంసము, ఎండించినమాంసము, నేతిలో వేపినది.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యము, ఉలవలు, గొఱ్ఱెపాలు, పులిగడుగు, పులుసు, కారము, గురుకరమగుఅన్నము, పెరుగు, మద్యము, చేపలు, నూనె.

పథ్యములు. Dietetics.

ఉదరరోగమునకు:- Abdominal dropsy or ascitics. ప్రాతమంచి బియ్యము, ఎఱ్ఱబియ్యము, యవలు, ఉలవలు, కందులు, పెసలు, అడవిమృగములు, పక్షులు, మేక, ఒంటె వీనిమాంసములు వేయిం

చినమాంసము, ఎండించిన మాంసము, నేతిలో వేయించినది, తేనె, సారాయి, కందికట్టు, ఉల్లిగడ్డలు, అల్లము, బీరకాయ, పొట్లకాయ, వాకుడుకాయ, నేలములక్కాయ, తాంబూలము, మేక, ఒంటె, ఆవు, వీనిపాలు, ఆవుమజ్జిగ, కారముగనుండు పదార్థములు, లఘు పదార్థములు, అగ్నిదీప్తికర పదార్థములు.

## అపథ్యములు. Non-Dietetics.

పిండివంటలు, మత్స్యములు, సీటిపక్షులమాంసము, ఆకుకూరలు, నువ్వులు, క్షీరాన్నము, పప్పులు, మలబద్ధకర, గురుత్వవిరుద్ధ, విదాహకరాన్నములు, మలమూత్ర వేగనిరోధము, వంటికిచమురుపూయుట, అతిజలపానము, మార్గగమనము, పగటినిద్ర, వ్యాయామము.

## పథ్యములు. Dietetics.

ఉన్మాదమునకు:— Insanity or madness. ప్రాతమంచిబియ్యము, ఎఱ్ఱబియ్యము, గోధుమలు, పెసరపప్పు, దీనికట్టు, ధారోష్ణములు (గుమ్మపాలు) నూరుమార్లు కడిగిననెయ్యి, అప్పుడు కాచిననెయ్యి, ప్రాతనెయ్యి, తాంబేలు మాంసము, పెసరపప్పు, కందిపప్పు ఈ రెండును సమముగా కలిపి వండినపప్పు, దీనికట్టు, ఉసిరికాయ, పొట్లకాయ, ముదురుగుమ్మడికాయ, చంచలికూర, చిర్రికూర, చక్రవర్తికూర, సరస్వతియాకుకూర, వెలగపండు, దానిమ్మపండు, ద్రాక్షపండు, పనసపండు, పిత్తహరద్రవ్యములు, లఘుకరపదార్థములు, తెల్లవారుజామున సూర్యోదయమునకు పూర్వము ఆవునెయ్యిగాని, ఆముదముగాని, నిమ్మకాయరసము కలిపిగాని, తలకు మర్దనచేసి, ధారగా శిరస్సున పడేటట్టు చన్నీళ్ళస్నానము, ఆవునెయ్యితో పగటి భోజనము, ఆభోజనమైనతోడనే శయనించుట, పాతచింతపండుచారు, వెలగపండ్లచారు, చింతపొట్టుచారు, నిమ్మపండ్లచారు, పాతచింతకాయ, నిమ్మకాయ, పుల్లదబ్బకాయ, ఉసిరికాయపచ్చళ్ళు పుచ్చుకొనవచ్చును.

## అపథ్యములు. Non-Dietetics.

విరుద్ధాన్నములు, కాక, పైత్యముచేయు వస్తువులు, చేదువస్తువులు, కారపు వస్తువులు, సారాయి, కల్లు, గెంజాయి మొదలగు మత్తుద్రవ్యములు, నిద్ర, ఆకలి, తుమ్ములు, మలమూత్రములు, దప్పి వీని నిరోధము, అతిసంభాషణము, ఆవ, గుమ్మడి, బచ్చలి, చేపలు, చిక్కని పులుసు.

## పథ్యములు, Dietetics.

ఉపదంశము:—Syphilitic sore. సవాయిరోగమునకు చూడుడు,

ఉబ్బసరోగము:—Asthama. కాసరోగము చూడుడు.

## పథ్యములు, Dietetics.

ఉబ్బురోగమునకు:—Genaralised odema or anasarca. ప్రాత బియ్యము, యవలు, గోధుమరొట్టె, అవిసికూర, పొట్లకాయ, కాకర కాయ, ముల్లంగి, చిర్రికూర, ఉచ్చింతకూర, కారుపప్పులు, వాకుడు కాయలు, చిలుకకూర, గలిజేరుకూర, ఎలుకజెవికూర, చాదరాసి కూర, గొబ్బికూర, కాసరకూర, కొయ్యతోటకూర, పొన్నగంటి కూర, తెలగపిండికూర, తెలగపిండి, పొన్నగంటిఆకుకూర, కంది పప్పు, కందికట్టు, ఆవుపాలు, మేకపాలు, ప్రాతనెయ్యి, కాల్చిన, వేచిన లేక వండిన మేకమాంసము, జాంగల పక్షిమృగ మాంస ములు, వేడినీళ్ళు, తేనె, మద్యము. మేహఉబ్బులకు వాసినమీద వండిన మినపకుడుము, ఆవుపాలు.

## అపథ్యములు, Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చిమిడిఅన్నము, చలిఅన్నము, చల్ల, పెరుగు, చేపలు, తరవాణిచారు, పులుసుకూరలు, గోరుచిక్కుడు కాయ, వంకాయ, చిక్కుడుకాయ, పెసరపప్పు, మినుములు, అనుములు,

బొబ్బర్లు, విస్తారముగా కారము, పులుసు, కల్లు, విదాహకరవస్తువులు, నువ్వులు, జలుబువస్తువులు, పిండివంటలు, పథ్యములలో జెప్పినవితప్ప తక్కిన ఆకుకూరలు, దుంపకూరలు, చింతచిగురు, నిమ్మకాయ, దబ్బకాయ, మామిడికాయ, దోసకాయ, పంపర పనాస, నారింజ మొదలగు జలుబుచేసెడు ఫలములు, పంచదార, స్త్రీసంగమము, గాలిలోపరుండుట, మిక్కిలి ఉదకపానము, అభ్యంగనము, స్నానము, చల్లనిగాలిలోనుండుట, తిరుగుట, నూనె, ఆవ, గుమ్మడి, బచ్చలి.

## పథ్యములు. Dietetics.

ఎక్కిళ్ళకు:—Hiccough. మంచిప్రాతబియ్యము, వేడినీళ్ళు, గోధుమలు, యవలు, పెసలు, ఉలవలు, పొట్లకాయ, ఉస్తికాయ, వాకుడుకాయ, తేనె, మాదీఫలము, వెలగపండు, జాంగల పక్షి మృగమాంసములు, నిద్ర, ఆవుమజ్జిగ.

## అపథ్యములు Non-Dietetics.

మద్యము, విదాహకరవస్తువులు, కారపుపదార్థములు, పైత్య శ్లేష్మ మలబద్ధకరద్రవ్యములు, అనుములు, మినుములు, మత్స్యములు, ఆవాలు, పులుసు, ఆనబకాయ, దుంపలు, మట్టుబచ్చలికూర, మానెతో చేయబడినవంటలు, నూనె, తెలకపిండి, చల్లనినీళ్ళు, చల్లారినఅన్నము, పుల్లతో పండ్లుతోముట.

## పథ్యములు. Dietetics.

కర్ణరోగములకు:—Diseases of the ear. ప్రాతబియ్యము, గోధుమలు, కందులు, పెసలు, యవలు, నెయ్యి, జింక, లావుకపిట్ట, నెమలి, తిత్తిరిపక్షి, అడవికోడి, మేక వీనిమాంసములు, పొట్లకాయ, లేతమునగకాయ, వంకాయ, చెంచలికూర, కాకరకాయ, ఆవుమజ్జిగ, ఆవుపాలు, నెయ్యి.

## అపథ్యములు. Non-Dietetics.

శిరస్స్నానము, చలిఅన్నము, సంచారము, గాలి, మంచు, వెన్నెల వీనిలోనుండుట, తిరుగుట, బిగ్గరగమాటలాడుట, పుల్లతో పండ్లుదోముట.

## పథ్యములు. Dietetics.

కాస, శ్వాస (దగ్గు, ఒగర్పు) ఉబ్బసము రోగమునకు:— Cough, Hard breathing & Asthama. ప్రాతబియ్యపు అన్నము, వేపిన బియ్యపునూకలజావ, గోధుమరొట్టెజావ, బార్లీగంజి, కందిపప్పు, దీనికట్టు, ఆవుపాలు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, మేకపాలు, మేక నెయ్యి, మేకమాంసము, అడవిమృగపక్షిమాంసములు, అల్లము, ఉప్పు వగయిరాలురాసి ఎండించిన మాంసము నేతిలో వేయించినది, వేపినమాంసము, చింతపొట్టుచారు, కూతురుబుడమ, ఆకుకూర, కసివింద ఆకుకూర, పొన్నగంటికూర, చక్రవర్తికూర, చిర్రికూర, వరిపేలాలు, అప్పుడు వేయించిన శనగపప్పు, పటికిపంచదార, ఉష్ణోదకము, తేనె, వాకుడుకాయ, ఉస్తికాయలు, బీరకాయ, నల్లఅనబకాయ, పొట్లకాయ, నేలములంకాయ, వాకుడుకాయలు వరుగు, లేతముల్లంగి, నీరుల్లి, ద్రాక్షపండు, కిసిమిసిపండు, జీడిపండు, పాత చింతకాయ, ఉసిరికాయ, వెలగపండు, పచ్చళ్ళు, సీకాయాకుపచ్చడి.

## అపథ్యములు. Non-Dietetics.

కొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నముపెసరపప్పు, అనుములు, మినుములు, గేదెపాలు, పెరుగు, పిష్టాన్నము, చముకుగలపదార్థములు, కరుబూజాపండు, పంపరపనాస, నారింజ మొదలగు శీతల, శ్లేష్మకర ఫలములు, పాయసము, మైథునము, చల్లని నీళ్ళతో స్నానము, అభ్యంగనము, మంచులో, గాలిలో పరుండుట, తిరుగుట, చేపలు, కంద మొదలగు దుంపలు, ఆవ, గుమ్మడి, బచ్చలి.

### పథ్యములు. Dietetics.

కుష్ఠురోగమునకు:—Leprosy. ప్రాతబియ్యము, ప్రాతనెయ్యి, ప్రాత యవలు, గోధుమలు, యవలు, చామలు, కొర్రలు, పచ్చపెసర పప్పు, మసరపప్పు, కంది పప్పు, వీనికట్లు, మేకమాంసము, అడవి మృగపక్షీ మాంసములు, బీరకాయ, పొట్లకాయ, అనబకాయ, దోసకాయ, ఉస్తికాయ, వేపపువ్వు, కాసరాకు, కాసరకాయలు, నేలములగకాయలు, వాకుడుకాయలు, పెరుగుతోటకూర, పొన్నగంటికూర, మెంతికూర, తెల్లగలిజేరుకూర, తగిరిసె (తంటెపు)కూర, ఉస్తికూర, ఉస్తికాయలు, ఆవుచల్ల, ఆవునెయ్యి, తేనె, నీరుల్లి, ఈత పండు, చందనము, పాతనిమ్మకాయ, దబ్బకాయ, చింతకాయ, ఉసిరికాయ పచ్చళ్ళు.

### అపథ్యములు. Non-Dietetics.

చిక్కనిపులుసు, విస్తారముగా కారము, ఆవ, గుమ్మడి, దుంపలు, వెల్లుల్లి, పెరుగు, పాలు, బెల్లము, కల్లు, సారాయి, నువ్వులు, మినుములు, చెరుకురసము, పానకము, చేపలు, నీటిపక్షులు, కోడి, పావురము వీనిమాంసములు, స్త్రీసంగమము, వ్యాయామము.

### పథ్యములు. Dietetics.

కుసుమరోగమునకు:— Leucorrhaea. ప్రాతబియ్యము, ప్రాతచోడి పిట్టు, కందిపప్పు, పెసరపప్పు, మసరపప్పు, ఆవుమజ్జిగ, గేదెమజ్జిగ, ఆవునెయ్యి, గేదెనెయ్యి, పొట్లకాయ, బీరకాయ, అనబకాయ, లేతఅరటికాయ, బెండకాయ, టొమెటో, కేరెటు, కేబేజి, చిక్కుడు, ముల్లంగి, పచ్చిబటాణీ, నక్కదోసకాయ, మేడికాయ, పొన్నగంటి కూర, చిర్రికూర, పెరుగుతోటకూర, మెంతికూర, అరటిపువ్వు, బూడిదగుమ్మడికాయ, మేకమాంసము, ఎండించినమాంసము, మేపిన మాంసము, ఖర్జూరపుకాయ, నేరేడుపండు, పంచదార,. తేనె. జీర్ణ శక్తి సరిగానున్న యెడల గోధుమలు, వీని రొట్టె, జావలు పుచ్చు

కొనవచ్చును. పాతచింతపండుయొక్క పలచని చారు, చింతపొట్టు చారు, ఆలుబఖారాపండ్ల చారు, వెలగపండ్ల చారు, ద్రాక్ష, దానిమ్మ, బత్తాయి, నారింజ, అరటిపండ్లు, పాతచింతకాయ, నిమ్మకాయ, వుసిరికాయ, వెలగపండు వీని పచ్చళ్ళు, కూరలలో నిమ్మపండు వేసుకొనుట, తరువాణిచారు, మజ్జిగచారు వేసుకొనవచ్చును.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యము, శనగలు, ఉలవపప్పు, ఉలవకట్టు, పెరుగు, కోడిమాంసము, వంకాయ, మునగకాయ, గోరుచిక్కుడుకాయ, చేపలు, ఎండుచేపలు, నూనె, పిండివంటలు, శాకపైత్యము, గురుత్వముచేయు పదార్థములు, ఆవ, గుమ్మడి, బచ్చలి

## పథ్యములు, Dietetics.

క్రిమిరోగమునకు:— Worms. ప్రాతబియ్యము, వెదురుబియ్యము, ఎర్రవడ్లబియ్యము, గోధుమజావ, సగ్గుజావ, బార్లీజావ, లేతఅరటికాయ, నేలములకకాయలు, వాకుడుకాయలు, ఉచ్చింతకాయలు కూర, వేపపువ్వు, నువ్వులు, ఆవాలు, వీనినూనె, పులిగడుగు, కలి, వెల్లుల్లి, నీరుల్లి, నెయ్యి, పాలు, ఇంగువ, తేనె, జీడిమామిడిపండు, తాంబూలము, కల్లు, మద్యము, నిమ్మపండ్లపులుసు, దీనిచారు, పలచని చింతపండుచారు, కందిపప్పు, పెసరపప్పు వీనికట్లు, చేదు,వగరు, కారముగల పదార్థములు, వెదురుమొలకలు, ఎలుకచెవికూర, చక్రవర్తికూర, పొన్నగంటికూర, బీరకాయ, పొట్లకాయ, ఆనబకాయ, నక్కదోసకాయ, మేకమాంసము.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యము, అజీర్ణముజేయు పదార్థములు, మినుములు, పెరుగు, చిక్కనిపులుసు, బెల్లము, తీపివస్తువులు, పైనజెప్పినవిగాక తక్కిన ఆకుకూరలు, పగటినిద్ర, రాత్రిమేలుకొనుట.

## పథ్యములు. Dietetics.

గర్భిణీస్త్రీలకు:—Pregnant woman. ప్రాతబియ్యము, గోధుమలు, గోధుమనూక జావ, రొట్టెలు, సగ్గుబియ్యము, బార్లీజావలు, జీర్ణ శక్తి ననుసరించి బీరకాయ, పొట్లకాయ, అనబకాయ. లేత వంకాయ, నక్కదోసకాయ, అరటికాయ, తోటకూర, మెంతి కూర, చుక్కకూర, దొండకాయ, బెండకాయ, బంగాళదుంపలు, కేబేజీకూర, లేతమునగకాయ, పొన్నగంటికూర, కందిపప్పు, పెసర పప్పు, పీనికట్లు, కూరలలో వేసుకొనుట, నిమ్మపండురసం కూర లలో పిండుకొనుట, మినపప్పు, పాలు, నెయ్యి, మజ్జిగలు వాడు కొనుట, వరిపేలాలపిండి, జావ, వెన్న, నెయ్యి, పాలు, మద్రస ములు, ఎండుకొబ్బరి, బెల్లము, శర్కర, తేనె, పనసపండు, మామిడిపండ్లు, శీతాఫలములు, అరటిపండు, ఉసిరికాయ, వేయిం చిన జీడిమామిడిపప్పు, వేరుశనగపప్పు, శనగపప్పు, నువ్వులపప్పు, సారపప్పు, ద్రాక్ష, అంజూర, ఆలుబఖారాపండ్లు, తియ్యదానిమ్మ పండు, పచ్చిద్రాక్షపండ్లు, అమృతఫలములు (Apples), వెలగ పండ్లు, బత్తాయినారింజపండ్లు, నారింజపండ్లు, సపోటాపండ్లు, మొద లగు రుచిగల ఫలములు, లేతచింతకాయ, చింతచిగురు, అంబాళపు కాయ, మొదలగు పులుపువస్తువులు, ప్రాతవియగు చింతకాయ, నిమ్మకాయ, ఉసిరికాయ, పుల్లదబ్బకాయ, నారదబ్బకాయపచ్చళ్లు, పలచని చింతపండు చారు, సువాసనగల పుష్పములు, వెన్నెల, స్నానము, అభ్యంగనము, చందనము, పచ్చకర్పూరము బూసు కొనుట, పుష్పమాలికలు ధరించుట, మృదుశయ్య, చల్లనిగాలి, ఇంద్రియములకు తృప్తికరములగు వస్తువులు, ప్రియమైన ఆహార విహారాదులు.

## అపథ్యములు. Non-Dietetics

అయిష్టపదార్థములు, మిక్కిలి కాకజేసెడు పదార్థములు, ఎగుడు దిగుడుగా కూర్చుండుట, కఠినశయ్య, చింత, భయము, ఆందోళనము, నిచ్చెనపై నెక్కడము, తరుచు మేడ యెక్కుట, దిగుట, విస్తారము సోపానములు గలిగిగాని లేకగాని యుండు, కొండ మొదలగు ఉన్నత ప్రదేశముపైన నెక్కడము, ఆకలి దప్పికల నాపడము, కల్లు, సారాయి మొదలగు మత్తుద్రవ్యములను పుచ్చుకొనడము, శక్తికి మించిన దేహప్రయాస, ప్రథమరజస్వల అయిన స్త్రీని సమీపించడము, స్పృశించడము, గర్భధారణమైన ఆరుమాసములు మించిన వెనుక మైథునము, వీనిని గర్భిణిస్త్రీలు వర్జింపవలయును.

## పథ్యములు. Dietetics.

గాయములకు, బలమగు కవుకు దెబ్బలకు:— Wounds and severe contusions. మంచిపాతబియ్యము, గోధుమరొట్టె, కందిపప్పుకట్టు, మేకమాంసము, ఎండించిన, వేపిన మాంసములు, లేతకోడిమాంసము, వీటిరసములు, సారాయి, పొట్లకాయ, బీరకాయ, కంద, కొయ్యతోటకూర, మునగఆకుకూర, నెయ్యి, పాలు, కాఫీ, రొట్టె.

## అపథ్యములు. Non-Dietetics

కొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, శనగపప్పు, పెసరపప్పు మొదలగు చీముపట్టుపదార్థములు, కర్బూజాపండు, దోసపండు, చల్ల, దబ్బపండు, పెరుగు, కలి, పులిగడుగు, పులుసు మొదలగు శీతలపదార్థములు, సంచారము, గాలి, మంచు, వెన్నెల వీనిలో నుండడము, తిరుగడము, కోపము, క్రోధము, స్త్రీసంభోగము, స్నానము, అభ్యంగనము.

## పథ్యములు. Dietetics.

గుల్మరోగములకు :— Abdominal & other internal tumours. గోధుమలు, రొట్టె, జావ, ప్రాతబియ్యము, మెరబియ్యము, కంది

షప్పు, కందికట్టు, ఉలవపప్పు, ఉలవకట్టుచారు, మేకమాంసము, లేత కోడిమాంసము, అడవిజంతు, పక్షి మాంసములు, వేపిన, ఎండించిన మాంసములు, మద్యము, ఆవు, మేక వీనిపాలు, మజ్జిగ, నెయ్యి, ద్రాక్ష, పాలసా, ఖర్జూరము, దానిమ్మ, ఉసిరిక, నారింజ వీనిపండ్లు, నీరుల్లి, వెల్లుల్లి, లేతముల్లంగి, బీరకాయ, పొట్లకాయ, పొన్నగంటి కూర, చక్రవర్తికూర, లేతమునగకాయ, ఖండశర్కర.

## అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపుఅన్నము, చల్దిఅన్నము, చేపలు, యెండుచేపలు, పెరుగు, కంద, పెండలము, చేమ మొదలగు దుంపలు, మధుర పదార్థములు, మినుములు, శనగలు, మలబద్ధకర, గురుకర, వాత కర పదార్థములు, మలమూత్ర నిరోధము, అతిజలపానము.

## పథ్యములు. Dietetics.

గ్రహణి, సంగ్రహణికి:— Dysentery & Iinteric Dysentery.

ప్రాత తేలికయైన బియ్యము, వరిపేలాలగంజి, సగ్గుబియ్యపుజావ, బార్లీగింజలజావ, కంది, పెసర, మసర వీని పప్పులు, కట్లు, గేదె, ఆవు, మేక, గొర్రె వీని పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి, నువ్వుల నూనె, మద్యము, తేనె, ఖండశర్కర, ద్రాక్షపండు, తుమికిపండు, నేరేడుపండు, వెలగపండు, మారేడుపండు, మంజిస్తానుకాయ, పొగడ పండు, తీపి, పులుపు దానిమ్మపండ్లు, వీనిపిందెలు, అరటిపువ్వు, అరటికాయ లేతది, బలుసుకూర, మెంతికూర, వెలగకాయ, నీరుల్లి పాయ, కొడిసెకాయ, బూడిదగుమ్మడికాయ, కుందేలు, జింక, కోకిలపక్షి, తిత్తిరిపక్షి వీని మాంసములు, చిన్నచేపలు, పీతలు, పచ్చిరొయ్యలు, మేకక్రొవ్వుప్రేగు, వగరుగల పదార్థములు, ఉష్ణోదకము, నిద్ర, పచ్చివెలక్కాయ కాల్చి పెరుగువేసి చేసిన పచ్చడి, గసగసాలపొడి, లేతఅరటికాయ కుమ్ము వుడికించి నేతితో పొగిచి

నదిగాని, పెరుగువేసి చేసిన పచ్చడి, వెలగపండు పచ్చడి, నేతి మినపగారి.

అపథ్యములు. Non-Dietetics

క్రొ_త్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, వరగోగు, గోధుమలు, అనుములు, బఠాణీలు, అలచందలు, మునగకాయ, అనబకాయ, చింతపండు, పులుసుకూరలు, కంద, ఆలుదుంపలు, పెండలము, చామ, తాంబూలము, చెఱుకు, రేగుపండు, మామిడిపండు, తాటి పండు, నారింజపండు, బెంకాయ, దోసకాయ, పులిగడుగు, పాలు, బెల్లము, నేలములకకాయలు, పథ్యములో జెప్పినవిగాక తక్కిన ఆకుకూరలు, శీతోదకపానము, జాగరణము, స్నానము, స్త్రీ సంభోగము, ధూమపానము.

పథ్యములు. Dietetics.

ఛర్దిరోగమునకు:— Retching, vomiting & disinclination to eat anything. ప్రాతబియ్యపుఅన్నము, పేలాలగంజి, పేలాల పిండి, పంచదారగలిపినది, గోధుమలు, యవలు (Barley), వీని జావ, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, పెసరపప్పు, పెసరకట్టు, మేక మాంసము, కుందేలు, నెమలి, తి_త్తిరి, లావుకము మొదలగు అడవి మృగ, పక్షి మాంసములు. శర్కర, ఖండశర్కర, తేనె, వెదురు మొలకలు, లేతబెంకాయ, నిమ్మపండు, ఉసిరికాయ, దానిమ్మ, రేగు, ద్రాక్ష, వెలగ వీనిపండ్లు, మినుములు, హితకరపదార్థములు, మంచుగడ్డ నోటిలో వుంచుకొనుట, చల్లనినీళ్ళు నోటిలో ఉంచు కొని పుక్కిలించడము, వెన్నెల, గంధము, స్నానము, బీరకాయ, పొట్లకాయ, నల్లఅనబకాయ, నక్కదోసకాయ, పులిచెంచలికూర, మెంతికూర.

## అపథ్యములు. Non-Dietetics

వేడిఅన్నము, అయిష్టమైన అన్నము, ముల్లంగికాయ, అవాలు, కాళపైత్యము చేసెడు పదార్థములు, పుల్లతో పండ్లతోమదము, కోపము, భయము, వ్యాయామము.

## పథ్యములు. Dietetics.

జ్వరమునకు:—Fever. జ్వరము తగ్గేవరకు బార్లీగింజలజావ, ఆరోరూటుపిండిజావ, దానిలో గ్లూకోసు అను పంచదారకలిపి యివ్వవలెను. జ్వరము తగ్గినతరువాత బార్లీజావలో ఆవుపాలు, పంచదార కలిపి గోధుమనూకగాని, బియ్యపునూకగాని వేసి పలచని జావగాని యివ్వవచ్చును. జ్వరము తగ్గినతరువాత గోధుమరొట్టె(పావులోనిది) కాఫీతో వాడవచ్చును. ప్రాతబియ్యపు అన్నము, ప్రాతబియ్యము వేయించి వార్చినయన్నము, పొట్లకాయ, బీరకాయ, నక్కదోసకాయ, పొట్టికాకరకాయ, ఉస్త్రికాయ, వేపపువ్వు, చిర్రికూర, పెరుగుతోటకూర, కొయ్యతోటకూర, పొనగంటికూర, కరివేపాకు, లేతముల్లంగి, చక్రవర్తికూర, ఉస్త్రిఆకుకూర, చెంచలికూర, కందిపప్పు, పెసరపప్పు, మసరపప్పు, ఉలవలు, అడవిపెసలు, పీనిపప్పులు లేక కల్లు, మేకమాంసము, జింక, దుప్పి, కుందేలు. పావురము, గువ్వ, పూరేడు, నెమలి, పిచ్చుక, లావుకపిట్ట, చకోరము, కాటుకపిట్ట మొదలగు అడవిమృగపక్షిమాంసములు, ఎండవేసినమాంసము, నేతిలోవేచినది, మాంసరసములు అనగా శేరువా, వేచినమాంసము, ప్రాతవియగు చింతకాయ, నిమ్మకాయ, పుల్లదబ్బకాయ, ఉసిరికాయ, పచ్చళ్ళు, వెలగపండు, శీకాయచిగురు, కరివేపాకు, కొత్తిమిరి, పుదీనా, పచ్చళ్ళు, పచ్చిద్రాక్ష, పుల్లదానిమ్మ, తియ్యదానిమ్మ, అలుబఖారా, బత్తాయి, నారింజ, అమృతఫలము(పవిలు), సపోటా మొదలగు పండ్లు సేవించవచ్చును. ఆవునెయ్యి, గేద

నెయ్యి, స్వల్పముగా వాడవచ్చును. కూరలు, పోపులకున్నూ, వాడవలెను. నిమ్మపండురసం కూరలలో వేయవచ్చును. అవుమజ్జిగ ఒక్కపూట యియ్యవచ్చును. మరియు వాత విషమసన్నిపాత జ్వరములకు లంఘనము అనుకూలముగ నుండును; అభిఘాతజ్వరము (అమితశ్రమ, మార్గాయాసము, దెబ్బలుతగులడము మొదలగు వాని చేగలిగిన జ్వరము) నకు నెయ్యి, అభ్యంగనము, మద్యపానము, మాంసయుక్తమగు భోజనము, దివానిద్ర, ఇవి అనుకూలముగ నుండును. జ్వరము పూర్తిగా తగ్గినతరువాత వేడి నీళ్లతో కంఠస్నానము చేయుచుండవలెను.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, పాలు, నెయ్యి, పులుసు, పథ్యములలో జెప్పినవిగాక తక్కిన ఆకుకూరలు, మాంసములు, చేపలు, చలికూరలు, చల్ల, పెరుగు, నూనె, మద్యము, పాచినీళ్ళు, చల్లనినీళ్ళు, తాంబూలము, దోసకాయ, కర్బూజాపండు, పనసపండు, శీతలకరఫలములు, తెలకపిండి, పిండివంటలు, పుష్టికర, శీతలకర, విదాహకర, గురుత్వపదార్థములు, కోపము, క్రోధము, మరియు శ్రమకరమగుపని, స్త్రీసంగమము, అభ్యంగనము, గాలిలోను, మంచులోను ఉండడము, తిరుగడము, భోజనానంతరమున పగటినిద్ర, వ్యాయామము, ఇవి జ్వరము వదలినను శక్తికలుగునంతవరకు చేయకూడదు. తరుణజ్వరమునందు అనగా జ్వరారంభదశలో విరేచనౌషధము, మాంసము, మధుర పదార్థముల నియ్యకూడదు. ఆగంతుక పైత్యసేహ, జీర్ణజ్వరములకు లంఘనముకూడదు.

తాపరోగమునకు:—దాహరోగమునకు చూడుడు.

## పథ్యములు. Dietetics.

తృష్ణారోగమునకు:—Inordinate thirst. ప్రాతబియ్యపు అన్నము, అల్పు, పేలాలపిండి, విలేపి అను (అనగా బియ్యమునకు 4 పాళ్లు అధికముగ నీళ్ళుపోసి వండినయన్నము), జావ, గంజిఅన్నము, శర్కర, తేనె, తియ్యని పెరుగు ఇవి మూడును గలిపి వడియగట్టి తీసినరసము, మేకమాంసము, అడవి మృగపక్షిమాంసములు, వీని రసములు, వేయించిన పెసలు, కుసరలు, వీనిపప్పులు, కట్లు, అరటి పువ్వు, బీరకాయ, చల్ల, ద్రాక్ష, వెలగ, రేగు, వీనిపండ్లు, ఖర్జూరము, దానిమ్మపండు, ఉసిరికపండ్లు, నిమ్మపండు, నక్కదోసకాయ, ములుదోసకాయ, పారెడునీళ్ళు, కరివేపపండు, ఆవుపాలు, చేదు, మధురసములు, తాటిముంజలనీళ్ళు, చల్లనినీళ్ళు, పానకము, పాలు, సరస్సునీళ్ళు, వెన్నెల, చల్లనిగాలి, నదీస్నానము, నిద్ర, స్నానము.

## అపథ్యములు. Non-Dietetics

చలిఅన్నము, పులుసు, ఉష్ణోదకము, విస్తారము కారముగల పదార్థములు, వ్యాయామము,ఎండ,నడక, పుల్లతో దంతధావనము.

## పథ్యములు. Dietetics.

దంతరోగములకు :— Diseases of the teeth. ప్రాత బియ్యపు అన్నము,జావ,వేడిపాలు,వేడినీళ్ళు కందులు,ఉలవలు,వీనిపప్పులు, లేక కట్లు, వెల్లుల్లి మొదలగు శాకపదార్థములు, వేయించిన లేక కాల్చిన మేకమాంసము, గోధుమరొట్టె, గోధుమజావ, బీరకాయ, పొట్లకాయ, సారాయము, మునగకూర, వేడినీళ్ళతో స్నానము, ముఖప్రక్షాళనము, ఘాటు సారాయమును నోటిలోనుంచి పుక్కిలించుట.

## అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, బిరుసైనఅన్నము, పుల్లనిఫలములు, చల్ల,పెరుగు, కఠినపదార్థములు, ముల్లంగిదుంపలు,

అలుదుంపలు, పెండలము మొదలగు వాతకర పదార్థములు, చేపలు పచ్చిగి, ఎండువి, ఉప్పుచేప, పులుసుకూరలు, కర్బూజా, నారింజపండు మొదలగు శీతలపదార్థములు, మినుములు పెసలు, శనగలు, కల్లు, దోసకాయ, వంకాయ, గుమ్మడికాయ, ఆనబకాయ, మునగకాయ, కోడి మాంసము, చల్లనినీళ్ళుత్రాగుట, చలినీళ్ళస్నానము, ముఖప్రక్షాళనము, పుల్లతో పండ్లుతోమడము.

## పథ్యములు. Dietetics.

దాహరోగమునకు (అనగా శరీరమందు మంటలు, తాపము):— Excessive heat or burning sensation all over the body.

సన్నబియ్యము, పెసలు, శనగలు, యవలు, పేలాలపిండి, అల్లము, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, పంచదార, నూరుమార్లు కడిగిన నెయ్యి, పొట్లకాయ, ధొండకాయ, ఆనబకాయ, పాలు, పచ్చిపాలనుండి తీసిన వెన్న, బూడిదగుమ్మడికాయ, నక్క-దోసకాయ, అరటికాయ, అరటిపండు, దానిమ్మపండు, ఉసిరికపండ్లు, ద్రాక్షపండు, పెద్ద, చిన్న యీతపండ్లు, ఖర్జూరపుపండ్లు, లేతతాటిముంజలు, కొబ్బరికాయనీళ్ళు, సారపప్పు, సింగాడిదుంపలు, మేకమాంసము, అడవిమృగ, పక్షి మాంసములు, పేలాలు, జావ, సగ్గుజావ, చేదుపదార్థములు, కంది పప్పు, పెసరపప్పు, మీనికట్లు, ఆవునెయ్యి, మజ్జిగ, అభ్యంగనము, చల్లనితోటలో తిరగడము, వట్టివేరు, విసనకర్రగాలి, చందనాది లేపనములు, వెన్నెల, చల్లనిగాలి, స్త్రీలను స్పృసించుట, ఆలింగనము, ధారాగృహము, నేలమాళిగ, నదీతీర సంచారము.

## అపథ్యములు. Non-Dietetics.

క్షీరమత్స్యాది విరుద్ధాన్నపానములు, మలమూత్రవేగనిరోధము, కడుపుబ్బుచేయు పదార్థములు, పిత్తకర, విదాహకర పదార్థములు,

ఉష్ణకరపదార్థములు, తాంబూలము, తేనె, ఇంగువ, క్రోధము, శ్రమ, ఎండ, మైథునము, వ్యాయామము.

### పథ్యములు. Dietetics

నాసారోగములకు :— Diseases of the nose. ప్రాత యవలు (Barley), ప్రాతవరిబియ్యము, లేతవంకాయ, లేతమునగకాయ, పొట్లకాయ, బీరకాయ, లేతముల్లంగి, నీరుల్లి, వెల్లుల్లి, ఉష్ణోదకము, సారాయము, కారము, పులుసు, ఉప్పు, ఉలవపప్పు, కంది పప్పు, పెసరపప్పు, పేనకట్లు, మేకమాంసము, కోడిమాంసము, వీని శేరువాలు (అనగా రసములు), అడవిమృగ, పక్షి మాంసములు, ఆవుచల్ల, ఆవునెయ్యి, వేడిగల లఘుకర భోజనము.

### అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, చేపలు, పెరుగు, నూనె, బచ్చలి, అనబకాయ, దోసకాయ, నారింజపండు మొదలగు ద్రవ పదార్థములు, నేలపరుండడము, పగటినిద్ర, స్నానము, క్రోధము, పగటియందు నిదురించుట, అభ్యంగనము, మలమూత్రవేగనిరోధము.

### పథ్యములు. Dietetics.

నేత్రరోగములకు:— Diseases of the eyes. ప్రాతవరిబియ్యము, కందిపప్పు, పెసరపప్పు, పేనికట్లు, గోధుమలు, సైంధవలవణము, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ, పంచదార, తేనె, గుంటకలగర ఆకుకూర, చాదరాసికూర, గలిజేరుకూర, చిర్రికూర, పొన్నగంటి కూర, తోటకూర, పెరుగుతోటకూర, మెంతికూర, చుక్కకూర, బీరకాయ, అనబకాయ, దోసకాయ, నేతితో వేయించిన కూరలు, అలుబుఖారపండ్లచారు, చింతపొట్టుచారు, పాతచింతకాయ, నిమ్మ కాయ, పుల్లదబ్బకాయ, ఉసిరికాయ పచ్చళ్ళు, వెలగపండు పచ్చడి, ఒక్రాయి, నారింజ, అరటి, ద్రాక్షపండ్లు, తలకు బాదము నూనె

రాసుకొనుట,ఆముదము తలకు మర్దనచేసుకొని సీకాయతోగాని, పెసరపప్పునూరిన ముద్దతోగాని రుద్దుకొని స్నానముచేయుట; వేడి చేయు పదార్థములు, విస్తారము కారము, రాత్రి నిద్రమేల్కొనుట మానివేయవలెను.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, పులిహారము, కల్లు, పెరుగు, ఇంగువ, తెలగపిండి, పిండివంటకములు. మినుములు, అధిక ఉదకపానము, తాంబూలము, వరుగులు, మాంసములు, చేపలు, నువ్వులు, సంచారము, కోపము, ప్రయాణము వెళ్ళడము,స్నానము, స్త్రీసాంగత్యము, అగ్నిజ్వాలను, సూర్యుని, చంద్రుని విశేషముగ చూడడము, వేడిచేయు పదార్థములు, విస్తారము కారము, నిద్ర మేల్కొనుట.

## పథ్యములు. Dietetics.

పాండువు, కామిలరోగములకు:— Anaemia & Jaundice. ప్రాత మంచి బియ్యము, యవలు, గోధుమలు, కందిపప్పు, పెసర పప్పు, శనగపప్పు, మీనికట్లు, అడవిమృగపక్షిమాంసములు, మేక మాంసము, లేక మీనిరసములు, వేపినమాంసము, మాంసమున అల్లము, ఉప్పు, కొద్దిగ కారము, గరమసాలావస్తువులు నూరిరాసి ఎండించి, ఆముక్కలను పలచగ సాగగొట్టి నేతితో వేయించినది, అల్లము, ఉప్పునూరి, మాంసమునకురాసి, వెదురుపుల్లకుగాని, యినుపవూసకుగాని గ్రుచ్చి నిప్పులమీద కాల్చినమాంసము, చెరుకు రసము, పొట్లకాయ, బీరకాయ,బూడిదగుమ్మడికాయ, లేతఅరటి కాయ, పాలకూర, పొన్నగంటికూర, చిర్రికూర,తెల్లగలిజేరుకూర, తుమ్మికూర, పులిచంచలికూర, వెల్లుల్లి,నీరుల్లి, ఉసిరికాయ, మజ్జిగ, నెయ్యి, నూనె, పులిగడుగు, ఉష్ణోదకము, వెన్న, వగరుపదార్థ

ములు, పాతఉసిరికాయ. నిమ్మకాయపచ్చళ్ళు, పుదీనా, కొత్తిమిరి వాడుట, బత్తాయి, నారింజపళ్ళు, మామిడిపండ్లు.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, మినుములు, ఆవాలు, తెలగపిండి, పులుపువస్తువులు, సారాయము, కల్లు, చేపలు, గురుత్వ విదాహకర పదార్థములు, మలమూత్రవేగనిరోధము, మైథునము, అమితఉదకపానము, తాంబూలము.

పథ్యములు. Dietetics.

పీనసరోగమునకు:—Polypus of the nose. ప్రాతబియ్యము, వేడి యన్నము, గోధుమజావ, సముద్రలవణము, బీరకాయ, పొట్లకాయ, పొన్నగంటికూర, మెంతికూర, కొయ్యతోటకూర, పులిచెంచలికూర, అల్లము, బెల్లము, పాలు, కందిపప్పు, శనగలు, ఉలవకట్టు, పెసరకట్టు, మేక, ఊరబిచ్చుక, వీని మాంసములు, లేతముల్లంగి, ఆవునెయ్యి, నిమ్మకాయ, ఉసిరికాయ పచ్చళ్ళు, పుదీనా పచ్చడి, కొత్తిమీరిపచ్చడి, కూరలలో వేయుట.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, గురుకరాన్నము, చల్ల, పెరుగు, కల్లు, చేపలు, వంకాయ, ఆనబకాయ, మునగకాయ, దోసకాయ మొదలగు వాతము, శీతలము చేసెడు పదార్థములు, చలని నీటితో స్నానము.

పైత్యరోగములకు:— Bilious complaints. ప్రాతబియ్యము, ప్రాత ఎర్రబియ్యము, గోధుమజావ, బార్లీజావ, పచ్చిపెసరపప్పు లేక కట్టు, బీరకాయ, పొట్లకాయ, నక్కదోసకాయ, చిర్రికూర, చుక్కకూర, పెరుగుతోటకూర, అవిసికూర, మెంతికూర, కూతురు

బుడమఆకుకూర, పొన్నగంటికూర, చాదరాసికూర, ఉస్తిఆకుకూర, పులిచెంచలికూర, చింతచిగురు, వేపపువ్వు, ఉస్తివరుగు, వక్కదోస వరుగు, బుడమవరుగు, పొట్టికాకరవరుగు, ద్రాక్షపండు, ఆలుబఖారా పండ్లు, నేరేడుపండ్లు, పుల్లని, తియ్యని దానిమ్మపండ్లు, వెలగపండ్లు, బత్తాయినారింజ, నారింజపళ్ళు, పండిన అరటిపండు, ఏపిలుపండు, ద్రాక్షపండ్లు పచ్చివి, అల్లము, కరివేపాకు, కొత్తిమిరి, పుదీనా, ప్రాతనిమ్మకాయ, ఉసిరికాయ, నిమ్మకాయ, పుల్లదబ్బకాయ. నారదబ్బకాయ, చింతకాయ వీనిపచ్చళ్ళు, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ, పులికడుగు, కలి, సిరకా, తేనె, పంచదార, మేకమాంసము.

అపథ్యములు. **Non-Dietetics.**

పెరుగు, పాలు, బెల్లము, ఎండ, సంచారము, కోపము, నిప్పుకాక, కందులు, ఉలవలు, మినుములు, గోధుమలు, వేరుశనగపప్పు, శనగపప్పు, జీడిమామిడిపప్పు, బటాణీలు, కల్లు, సారాయి, ఇతరమత్తుపదార్థములు, ఎండురొయ్యలు, ఉప్పుచేపలు, కోడి, పంది వీనిమాంసములు, ప్రొద్దుటియెండ, గురుత్వము, కాక, పైత్యముజేయు పదార్థములు.

పథ్యములు. **Dietetics.**

ప్రసవస్త్రీలకు:— **Lying-in-women.** మిక్కిలి ప్రాతబియ్యపు అన్నము, ధనియాలపొడి, శొంఠిపొడి, కందికట్టు, చేదు, ఎండు చేపలు, కాల్చినమాంసము, నేతిలో లేక నూనెలో వేపినమాంసము, ఎండబెట్టిన మేక, అడవిజంతువుల మాంసములు, మాంసమునకు అల్లము, ఉప్పు, కొద్దిగ కారము, గరమసాలా రాసి ఎండించి, కావలసిన ముక్కలను పలచగకొట్టి, నేతిలోగాని, నూనెలోగాని వేయించినవి, నూనె, తెలగపిండి, మదనానబకాయ, మునగకూర, వెల్లుల్లిపాయలు, ఇంగువ, ప్రాతబెల్లము, ఎండుమెత్తళ్ళు, ఇనుపమేకుకాల్చి ముంచిన వేడినీళ్ళు, 15 లేక 21 దినములవరకు వంటి

పూట అన్నము భుజించడము, కాయలు తినుట, రొట్టె, కాఫీ పుచ్చుకొనవచ్చును.

### అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, పచ్చిచేపలు, పులుసు, మజ్జిగ, పెరుగు మొదలగు శీతలపదార్థములు, గాలిలో నుండడము, తడిప్రదేశమున తిరగడము, చల్లనినీళ్ళను అంటడము, త్రాగడము, వానితో స్నానము చేయడము, పనిచేయడము.

బహుమూత్రమునకు:— అతిమూత్రపు పథ్యాపథ్యములు చూడుడు.

### పథ్యములు. Dietetics.

భగందర వ్రణములకు:—Fistula-in-ano. ప్రాత మంచి బియ్యము, కందిపప్పు, పెసరపప్పు, వీనికట్లు, పొన్నగంటికూర, తోటకూర, మెంతికూర, ఆనబకాయ, పొట్లకాయ, బీరకాయ, మునగకాయ, వగరుగనుండు పదార్థములు, తేనె, లేతముల్లంగి, ఆవుచల్ల, పాలు, నెయ్యి, మేకమాంసము, అడవిమృగపక్షిమాంసములు, రసములు, నువ్వులనూనె, ఆవనూనె, పుదీనా, వెలగకాయ, పాతనిమ్మకాయ, చింతకాయ, ఉసిరికాయ పచ్చళ్లు, కూరలలో కొత్తిమిరి వేసుకోవచ్చును. బత్తాయి, నారింజపళ్ళు.

### అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపు అన్నము, ఉలవలు, మినుములు, శనగలు వీని పప్పులు, పెరుగు, కోడిమాంసము, చేపలు, ఎండువుప్పు చేపలు, పులుసుకూరలు, వంగ, మునగ, గుమ్మడి, దోస వీనికాయలకూరలు, గురుకర పదార్థములు, వ్యాయామము, గుఱ్ఱము మొదలగువాని నెక్కడము, మైథునము, కోపము.

### పథ్యములు. Dietetics.

మదాత్యయ రోగమునకు:—Diseases produced by excessive drink. ప్రాతబియ్యపు అన్నము, యవలు, పెసలు, మినుములు,

గోధుమలు, ప్రియమైన మద్యము, పాలు, పంచదార, చిరికూర, పొట్లకాయ. మాదీఫలము, పాలసాపండు, ఖర్జూరము, నారింజ, నిమ్మ, దాడిమ, పీనిపండ్లు, ఉసిరికాయ, కొబ్బరికాయ, ద్రాక్ష పండు, ప్రాతనెయ్యి, స్నానము, మేకమాంసము, లావుకపిట్ట, తిత్తిరి పక్షి మొదలగువాని మాంసములు, పులగము, ఆవుచల్ల, ధారా గృహము, వెన్నెల, శీతోదకము, శీతోదకస్నానము, చందనము, నదీతీరవాసము, స్త్రీసంభోగము, నిద్ర, వ్యాయామము, చల్లనిగాలి.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, కందులు, ఉలవలు, పీనికట్లు, పప్పులు, కోడిమాంసము. నూనె, ఆవ. వెల్లుల్లి మొదలగు కాకపైత్య వస్తువులు, ధూమపానము, తాంబూలము, పుల్లతో పండ్లుతోమడము.

## పథ్యములు. Dietetics.

మసూరికా రోగమునకు:— Small-pox. ప్రాతమంచి బియ్యము, ఎఱ్ఱబియ్యము, యవలు (Barley), శనగలు, పెసలు, మసరపప్పు, యవలు, పావురము, పిచ్చుక, కోయిల పీనిమాంసములు, బీరకాయ, పొట్లకాయ, దోసకాయ, అరటికాయ, మునగకాయ, ద్రాక్ష, దాడిమపండ్లు, పుష్టికరములగు అన్నపానములు, రేగుపండు, పెసరకట్టు, నెయ్యి, నూనె, తెలగపిండి, మేకమాంసము, మాంసరసము, అడవిప్రదేశపు మృగపక్షి మాంసములు, సాంబ్రాణి, గుగ్గిలపుపొగ,

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యము, గోధుమలు, కందులు, కారము, పులుసు, చల్ల, పెరుగు, కోడి, నెమలి పీనిమాంసములు, శీతలపదార్థములు, ఎండ, మలమూత్రవేగనిరోధము, శ్రమ, క్రోధము, గాలి.

## పథ్యములు. Dietetics.

ముఖరోగమునకు:- Diseases of the mouth. పాతసన్న బియ్యము, వెదురుబియ్యము, యవలు (Barley), పెసలు, ఉలవలు, పొట్ల కాయ, బీరకాయ, అరటికాయ, ఉచ్చింతకాయలు, వాకుడు కాయలు, కాకరకాయ, వేడినీళ్ళు, లేతముల్లంగి, తాంబూలము, వగరు, కారము, చేదుగల పదార్థములు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, మేకమాంసము, అడవిమృగ పక్షిమాంసములు.

## అపథ్యములు. Non-Dietetics

పులుసు, పెరుగు, పాలు, బెల్లము, నువ్వులు, మినుములు, బిరుసైనఅన్నము, చలిఅన్నము, పిండివంటలు, నీటిప్రదేశపు మృగపక్షి మాంసములు, చేపలు, పుల్లతో పండ్లు తోమడము, పగటినిద్ర, బోరగిల పరుండడము.

## పథ్యములు. Dietetics.

మూత్రకృచ్ఛ్రము, మూత్రాశ్మరికి:— Stranguary, drysuria or gravel in the bladder. ప్రాత మంచిబియ్యము, ఎఱ్ఱబియ్యము, యవలు, గోధుమలు, యవలు(Barley), ఉలవలు, పెసలు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, ఆవుపాలు, పెసరకట్టు. ఉలవకట్టు, అల్లము, తియ్యనికల్లు, చక్కెర, ముదురుగుమ్మడికాయ, బూడిదగుమ్మడికాయ, పొట్లకాయ, కొండపిండిఆకుకూర, పల్లేరుకూర, చిర్రికూర, పెరుగుతోటకూర, ములు దోసకాయ, ఖర్జూరము, వెదురుమొలకలు, టెంకాయ, తాటి ముంజలు, నక్కదోసకాయ, శీతలములగు అన్నపానములు, నిర్జల ప్రదేశపు మృగపక్షిమాంస రసములు, మేకమాంసము, నదీజల పానము, అభ్యంగనము, స్నానము.

## అపథ్యములు. Non-Dietetics

మలబద్ధకరఅన్నము, చలిఅన్నము, బిరుసైనఅన్నము, తాంబూలము, విస్తారముఉప్పు, నూనె, నూనెపిండివంటలు, తెలగపిండి, పులుసు,

ఇంగువ, నువ్వులు, ఆవాలు, మినుములు, మామిడికాయ, వెల్లుల్లి, మొదలగు వుష్ణకర విదాహకర మలబద్ధకర వస్తువులు, కోడి మాంసము, పందిమాంసము, చేపలు, సారాయము, మైథునము, శ్రమ, ఏనుగ, గుఱ్ఱము వీనినెక్కడము, మూత్రశుక్ర వేగ నిరోధము, దానినడక, వ్యాయామము.

## పథ్యములు. Dietetics

మూర్ఛరోగమునకు:—Epilepsy. ప్రాతమంచిబియ్యము, లఘువుగ నుండు అన్నము, ప్రాత నెయ్యి, కుండలో మాగిన నెయ్యి, పేలాల గంజి, యవలు, కందులు,, పెసలు, బటాణీలు, వీని పప్పు, కట్లు, ఆవుపాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి, చక్కెర, సైంధవ లవ ణము, గుమ్మడిపండు, బీరకాయ, పొట్లకాయ, లేతఅరటికాయ, పువ్వు, తూట, కాకరకాయ, వెలగపండు, దానిమ్మపండు, చిర్రి కూర, పొన్నగంటికూర, కలిసీళ్ళు, మేకమాంసము, జముడుకాకి మాంసము, అడవి మృగపక్షి మాంసములు, పలుమారు చందనలేప నము, చల్లనిగాలి, మనోహరమగు కథలు, వింతవస్తువులను చూడ డము, వెలగపండుచారు, ఆలుబఖారాపండ్లచారు, చింతపొట్టుచారు, చందనము, పచ్చకర్పూరము, రమ్యమైన గానమును, వాయిద్య ములు వినుట, దేహపరిశ్రమ.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, చమురులోగూడిన అన్నము, చిర్రికూర, పొన్నగంటికూరతప్ప తక్కినఆకుకూరలు, ఎండ, విరుద్ధాన్నపానములు, మైథునము, చింత, శోకము, భయము, క్రోధము, మద్యపానము, మత్స్యములు, నూనె, వంకాయ, మిక్కిలి కారముగల పదార్థములు, దొండకాయ, గేదెమజ్జిగ, మినుములు,

మలమూత్రవేగనిరోధము, ఆకలి, దప్పి, నిద్ర వీటిని ఆపడము, నీళ్ళలో దిగి స్నానముచేయడము.

పథ్యములు. Dietetics.

మూలవ్యాధికి:—Piles. ప్రాతమంచిబియ్యము, యఱ్ఱవడ్లబియ్యము, యవలు, ఉలవలు, పొట్లకాయ, ఉసిరికాయ, కంద, చిర్రికూర, గలిజేరుఆకుకూర, పెరుగుతోటకూర, చిలుకతోటకూర, చక్రవర్తి కూర, మనుబాలకూర, చాదరాసికూర, మద్యము, ఆవుమజ్జిగ, ఆవు నెయ్యి, ఆవువెన్న, ఇంగువ, సైంధవలవణము, నేలములకకాయ, లేతమామిడిపిందెలు, వేడినీళ్ళు, పెసరపప్పు, వీనికట్లు, కాంజకము, కడుగునీళ్ళు, వెలగపండు, నిమ్మ, ఉసిరికాయ, పుల్లదబ్బకాయ, చింతకాయపచ్చళ్ళు, నారింజ, బత్తాయిపండ్లు, వీని రసము, అడవి మృగ పక్షి మాంసములు.

అపథ్యములు. Non-Dietetics.

చారకంద, మినుములు, తెలగపిండి, పెరుగు, చేపలు, మిగుల చలువపదార్థములు, ఆనబకాయ, వంకాయ, పిండివంటలు, బచ్చలి కూర, చల్లనినీళ్ళు, కందిపప్పు, మాంసములు, ఆవ, ఆవకూరలు, కఠినపదార్థములు, గొంతుక కూర్చుండడము, గుఱ్ఱము మొదలగు వాని నెక్కడము.

పథ్యములు. Dietetics.

మేదోరోగమునకు:— Corpulency ar Obesity. ప్రాత మంచి బియ్యము, వెదురుబియ్యము, ఆళ్ళు, చామలు, కొఱ్ఱలు, జొన్నలు, యవలు, ఉలవలు, పెసలు, కందులు, మసరపప్పు, తేనె, పేలాలు, కారము, చేదు, వగరు యివిగల రసములు, మద్యము, మజ్జిగ, చేదుపరిగెలు, చేపలు, వేయించిన లేక నిప్పులమీద కాల్చినవంకాయ, ఆవనూనె, నువ్వులనూనె, పాయసము, ఆకుకూరలు, ఉష్ణోదకము,

ఎండ, ఏనుగ, గుఱ్ఱము పీనిసవారి, చింత, శ్రమ, జాగరణము, స్త్రీ సంగమము, నలుగుపెట్టుకొని స్నానముచేయడము.

అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపుఅన్నము, చిమిడిన అన్నము, మధురాన్నము, గోధుమలు, పాలు, చెరుకురసముతో చేయబడిన అన్నము మొదలయినవి, బెల్లము, చక్కెర, మినుములు, తృప్తికర భోజనము, మాంసములు, దేహపుష్టికర పదార్థములు, సుఖము, దివానిద్ర.

పథ్యములు. Dietetics.

మేహరోగములకు:— Cachexia. Including diabetes &c.

ప్రాతమంచిబియ్యము, గోధుమలు, మేకమాంసము, అడవిమృగపక్షి మాంసములు, మాంసమునకు అల్లము, ఉప్పు, కొద్దిగ కారము, గరమసాలా నూరి రాసి ఎండించి కావలసినన్ని ముక్కలు పలచగ చితుకగొట్టి నేతిలో వేయించిన మాంసము, వేపిన మాంసము, ఆవు గేదెపెరుగు, చల్ల, వెన్న, నెయ్యి, శర్కర, కందిపప్పు, పెసరపప్పు, పీనికట్లు, ప్రాతవియగు చింత, నిమ్మ, పుల్లదబ్బ, నారదబ్బ, ఉసిరి కాయ పచ్చళ్ళు, వెలగపండుపచ్చడి, వెలగపండ్లచారు, ఆలుబఖారా పండ్లచారు, పాతచింతపండు పలచనిచారు, తేనె, బచ్చలికూర, చుక్కకూర, ఎలుకచెవికూర, పెరుగుతోటకూర, చాదరాసికూర, పులిచెంచలికూర, లేతమునగకూర, మెంతికూర, ఉసిరికాయ, పొట్ల కాయ, బీరకాయ, ఆనబకాయ, నక్కదోసకాయ, దొండకాయ, బెండకాయ, పొన్నగంటికూర, కేబేజీకూర, టామేటోకూర, మేడి కాయ, లేతఅరటికాయ, కాకరకాయ, అరటిపువ్వు, వెలగపండు, చేదుగలపదార్థములు, మేహశాంతిచేసెడు పదార్థములు, అభ్యంగనము, స్నానము, వ్యాయామము, దానిమ్మ, బత్తాయి, నారింజ, సపోటా, ఏపిలు, ద్రాక్ష, మొదలగు ఫలములు పుచ్చకొన

వచ్చును. మరియు బహుమూత్ర మేహమునకు పథ్యాపథ్యములు చూడుడు.

### అపథ్యములు. Non-Dietetics.

పెరుగు, కల్లు, సారాయి, బెల్లము, గేదె, మేక, వీని నెయ్యి, పాలు, చిక్కని పులుసు, ఇంగువ, వెలుల్లి, నువ్వులనూనె, పచ్చి, యెండుచేపలు, అవాలు, పిండివంటలు, ములకకాయలు, పైత్యము కాక చేసెడు పదార్థములు, కోడిమాంసము, పనసపండు, కంద మొదలగు దుంపలు, పగటినిద్ర, స్త్రీసంగమము, జాగరణము, యెండ, నడక, ఆకలిని ఆపడము.

### పథ్యములు. Dietetics.

మేహవాతమునకు:—Rheumatism. ప్రాతబియ్యము, మసర, పెసర, కంది వీనిపప్పులు, కట్లు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, మినప కుడుము (వాసెనమీద వండినది), బీరకాయ, పొట్లకాయ, నక్కదోసకాయ, లేతముల్లంగిదుంపలు, టొమేటో, పెరుగుతోటకూర, మెంతికూర, పొన్నగంటికూర.

### అపథ్యములు. Non-Dietetics.

మాంసము, చేపలు, ఎండుచేపలు, వుప్పువేసినచేపలు, పెరుగు, ఉలవలు, శనగలు, పులుసుకూరలు, ఆవ, గుమ్మడికాయ, బచ్చలి, వంకాయ, మునగకాయ, నూనె, నూనెపిండివంటలు, నువ్వులు, ఆవాలు మొదలగు శాకపదార్థములు.

### పథ్యములు, Dietetics.

రసతాపమునకు:— Excessive heat or burning sensation produced by the abuse of mercury. చల్లారిన అన్నము, తియ్యపెరుగు, బొంకాయనీరు, ఆవుమజ్జిగ, పాలు, దానిమ్మపండు, ద్రాక్షపండు, అరటిపండు, చెరుకురసము, పంచదార మొదలగు

శీతలమధురపదార్థములు, శీతోదకస్నానము, శ్రీగంధములేపనము, చల్లనిగాలి.

పథ్యములు. Dietetics

రసౌషధములకు.—Medicines prepared with mercury. గోధుమలు, యవలు, ప్రాతబియ్యపు అన్నము, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుమజ్జిగ, పొట్లకాయ, బీరకాయ, అనపకాయ, కందిపప్పు, కందికట్టు, పెసరపప్పు, కొయ్యతోటకూర, చిర్రికూర, పొన్నగంటికూర, సైంధవలవణము, అడవిమృగపక్షిమాంసములు, మేకమాంసము.

అపథ్యములు. Non-Dietetics

గుమ్మడికాయ, వంకాయ, వెదురుమొలకలు, కాకరకాయ, మినుములు, శనగలు, అనుములు, ఉలవలు, ఆవాలు, నువ్వులు, మునగకాయ, కోడిమాంసము, కల్లు, సారాయి, కలి, గురుకర, ఉష్ణకర, మలబద్ధకర పదార్థములు, మిక్కిలి కారముగనుండు వస్తువులు, ఆవ, ఆవకాయ మొదలగునవి, అరటిఆకులో భోజనము, లంఘనము, శరీరమర్దన, స్నానము, చేపలు, పగటినిద్ర, స్త్రీసంగమము.

పథ్యములు. Dietetics.

వాతరోగములకు:— Atrabilis or cold. ప్రాతబియ్యము, గోధుమరొట్టె, గోధుమజావ, బార్లీజావ, మేకమాంసము, పొట్టేలుమాంసము, దుప్పి, మొసలి, ఉడుము, దొండకాయ (పిందెలు), గండుమీను, పండుగొప్ప, కొర్రమీను, యిసుకదొందులు, చేదుపరిగెలు మొదలగు పథ్యముచేపలు, ఊరబిచ్చుక, తీతువ, నెమలి, కోడి, పూరేడు, పావురము, అడవిమృగ, పక్షిమాంసములు, మాంసరసములు, వేపినమాంసము, మేకమాంసమునకు ఉప్పు, అల్లము, కొద్దిగ కారము మారి రాసి ఎండించినది పలచగకొట్టి నేతిలో వేయించినది, కంది

పప్పు, కందికట్టు, బీరకాయ, పొట్లకాయ, లేతవంకాయ, లేతమునగకాయ, లేతఆముదపుకాయ, వెల్లుల్లి, పుల్లిపాయ, తొయ్యతోటకూర, గలిజేరుకూర, తంటెపుకూర, మునగఆకుకూర, చిర్రికూర, కసిందాకుకూర, పొన్నగంటికూర, అత్తిప్రత్తిఆకుకూర, నల్లేరు, ఉచ్చింత, వాకుడు, నేలములక, వీనికూరలు, వడుగులు, తియ్యదానిమ్మ, పుల్లదానిమ్మ, తియ్యమామిడిపండ్లు, రేగుపండ్లు, చిట్టీతపండ్లు, ఇప్పపండ్లు, నారింజపండ్లు, నిమ్మపండ్లు, ద్రాక్షపండ్లు. ఖర్జూరపుపండు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, ఖండశర్కర, ప్రాతబెల్లము, తేనె, అంగమర్దన, పాతచింతకాయ, ఉసిరికాయ పచ్చళ్ళు.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, జొన్నన్నము, మొక్కజొన్నలు, అలచందలు, పెసలు, మినుములు, శనగలు, బచ్చలికూర, చుక్కకూర, పెరుగు, పెరుగుమీఁది మీఁగడ, సామధాన్యము, పిండివంటలు. నూనె, కల్లు, కలి, కోడిమాంసము, ఏటినీరు, వెదురుమొలకలు, నేరేడుపండు, అరటిపండు, తామరతూండ్లు, అరటిబుర్రగుంజు, కాకరకాయ, మామిడిపండ్లు, మామిడికాయలు, పేముపండ్లు, చేపలు, పులిగడుగు, చల్లనినీళ్ళు, శీతలపదార్థములు, మిగులకారము, చేదుగల పదార్థములు, మైథునము, ఏనుగ, గుఱ్ఱము వీని నెక్కడము, మిగుల తిరుగడము, వెంటవెంటనే భోజనము చేయడము, శీతోదకస్నానము, చింత, నిద్రమేల్కొనుట, పగటినిద్ర, మలమూత్ర నిరోధము, వమనౌషధసేవ, ఉపవాసము, మిక్కిలి శ్రమపడడము, చల్లనిగాలి, వెన్నెల, మంచు, తడిప్రదేశమున పరుండడము, తిరుగడము.

## పథ్యములు. Dietetics.

విద్రధికి:—Internal tumours or ulcers. ప్రాతబియ్యము, ప్రాతచామలు, గోధుమలు, ఉలవలు, వెల్లుల్లి, అనుములు, కాకరకాయ,

లేతమునగకాయ, తెల్లగలిజేరుకూర, నెల్లికూర, పొన్నగంటికూర, మెంతికూర, కొయ్యతోటకూర, బీరకాయ, పొట్లకాయ, అనబకాయ, నక్కదోసకాయ, లేతముల్లంగి, టొమేటో, తేనె, ప్రాతయెఱ్ఱబియ్యము, నెయ్యి, నూనె, పెసరగంజి, చెఱుకు, అల్లము, అరటికాయ, కాచి చల్లార్చిననీళ్ళు, నిర్జలప్రదేశజంతుమాంసములు.

అపథ్యములు. Non-Dietetics.

వ్రణములకు అపథ్యములు విద్రధియందును అపథ్యములుగాన వాటిని గమనించనగును.

పథ్యములు. Dietetics.

విసర్పిరోగమునకు:—Herpes. ప్రాతమంచిబియ్యము, యవలు, గోధుమలు, కొఱ్ఱలు, పెసలు, మసరపప్పు, శనగలు, కందులు, అడవిమృగముల మాంసము, వెన్న, నెయ్యి, ద్రాక్షపండ్లు, దానిమ్మపండు, కాకరకాయ, వెదురుమొలకలు, తుమ్మికూర, ఉసిరికపచ్చడి, నువ్వులు, చందనము.

అపథ్యములు, Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, వెల్లుల్లి, మినుములు, ఉలవలు, నువ్వులు, చేపలు, కోడి, బాతు, వీని మాంసములు, విదాహకర ద్రవ్యములు, ఉప్పు, పులుసు, కారము, మద్యము, ఎండ, గాలి, మలమూత్రవమన నిరోధము, సంచారము, పగటినిద్ర, మైథునము, దుఃఖము, క్రోధము.

పథ్యములు, Dietetics.

విస్ఫోటకమునకు:— Eruptions. మంచి ప్రాత బియ్యము, యవలు, పెసలు, కందులు, శనగలు, చిరుశనగలు, అడవిపెసలు, వీనిపప్పులు, కట్లు, బీరకాయ, పొట్లకాయ, కాకరకాయ, వెదురుమొలకలు, జాంగలమృగమాంసములు, నూనె, నెయ్యి, పొన్నగంటికూర, చిర్రికూర, చెంచలికూర, ఆవుచల్ల, చందనము, పచ్చకర్పూర లేపనములు,

### అపథ్యములు, Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము. ఉలవలు, మినుములు, ఉప్పు, పులుసు, కారము, విదాహకరపదార్థము, చేపలు, పెరుగు, వంకాయ, మునగకాయ.

### పథ్యములు. Dietetics.

వ్రణములకు:—Ulcers or tumours. ప్రాతబియ్యము, గోధుమలు, యవలు, (Barley), కందులు, పెసిపప్పులు, కట్లు, తేనె, చక్కెర, పేలాలజావ, నెయ్యి, నూనె, పొట్లకాయ, వెదురుమొలకలు, బీరకాయ, కాకరకాయ, ములుదోసకాయ, అనబకాయ, చిర్రికూర, పొన్నగంటికూర, పెరుగుతోటకూర, నక్కదోసకాయ, లేతముల్లంగి, అడవిమృగ పక్షిమాంసములు, మేకమాంసము, ఆవుచల్ల, చందనము, పచ్చకర్పూరములను పూయుట.

### అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చలియన్నము, పెరుగు, పాలు, కారము, పులుసు, శీతలము, ఉప్పు యివిగలరసములు, బిగ్గరగా మాటలాడడము, దివానిద్ర, రాత్రులయందు జాగరణము, అత్యుదకపానము, తాంబూలము, శోకము, అతిసంచారం, స్త్రీసంభోగం, శ్రమపడడము.

### పథ్యములు. Dietetics.

శిరోరోగమునకు :— Diseases of the head. ప్రాత బియ్యము, ప్రాతనెయ్యి, ఆవునెయ్యి, కందిపప్పు, పెసరపప్పు, ఆవుమజ్జిగ, ఆవుపాలు, మేకమాంసము, అడవిమృగముల మాంసములు, పొట్లకాయ, బీరకాయ, లేతమునగకాయ, పొన్నగంటికూర, ఉచ్చింతఆకుకూర, చక్రవర్తికూర, కాకరకాయ, ద్రాక్షపండు, దాడిమకాయ, ఉసిరికాయ, నూనె, కలి, బెంకాయ, వెన్నెల, చందనము, ఆముదముతో తలంటుకుని స్నానముచేయుట, చందనము, పచ్చ

కర్పూరము, వట్టివేళ్ళు, తుంగదుంపలు, వీనిని నూరి పట్టువేసు కొనుట హితకరము.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపు అన్నము, చలిఅన్నము, మోటుబియ్యము, పెరుగు, వెన్న, చేపలు, ఉలవలు, మినుములు, అవాలు, చల్లనీళ్ళలో స్నానము, రాత్రిజాగరణము, దివానిద్ర, తుమ్ములు, అపులింత మల మూత్రములు, కన్నీరు, నిద్రవీనివేగనిరోధము, పుల్లతో పండ్లుతోముట.

పథ్యములు. Dietetics.

శీతపైత్యమునకు:— Bile combined with cold. మంచి ప్రాత బియ్యపుఅన్నము, కందులు, పెసలు, వీనిపప్పులు, కట్టీ, ఉస్తి కాయ, బీరకాయ, పొట్లకాయ, పొట్టికాకరకాయ, వేపపువ్వు, పుదీనా, కొత్తిమిరి, బచ్చలికూర, వెదురుమొలకలు, వేడినీళ్ళు, ఆవుచల్ల, నెయ్యి. మేకమాంసము.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యము, మోటుబియ్యము, పాలు, పెరుగు, పులుసు, ఎండ, నూనె, చేపలు, ఆవాలు, గుమ్మడికాయ, స్నానము.

పథ్యములు. Dietetics.

శూలరోగమునకు:—Intestinal colic. ప్రాతమంచిబియ్యము, జావ బార్లీజావ, కాచినపాలు, మేకమాంసము, అడవిమృగపక్షి మాంస ములు, పొట్లకాయ, బీరకాయ, కాకరకాయ, ఆకుకూరలు, చక్ర వర్తికూర, నీరుల్లిపాయలు, ఆవుమజ్జిగ, ఆవునెయ్యి, ఉప్పు, సైంధవలవణము, ఇంగువ, వెల్లుల్లి, నిమ్మపండ్లరసము, వెలగపండు, ద్రాక్షపండ్లు, లంఘనము, నిద్ర.

అపథ్యములు. Non-Dietetics

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, గురుత్వవిరుద్ధఅన్నపాన ములు, చేదు, వగరు, శీతల గుణత్వపదార్థములు, పెరుగు, మద్యము,

పప్పువస్తువులు, పిండివంటలు, మలమూత్రనిరోధము, దుఃఖము, క్రోధము, మైథునము, వ్యాయామము, నిద్రలేమి.
శోథలకు:—ఉబ్బురోగపథ్యాపథ్యములు చూడుడు.

పథ్యములు. Dietetics.

శ్లీపదమునకు (ఏనుగుకాలిరోగము):—Elephantiasis or filariasis.
ప్రాతమంచిబియ్యపుఅన్నము, యవలు, ఉలవలు, ఉల్లిపాయలు, పొట్లకాయ, బీరకాయ, మునగకాయ, కాకరకాయ, తెల్లగలిజేరు ఆకుకూర, లేతముల్లంగి, బచ్చలికూర, పొన్నగంటికూర, కొత్తిమీరి, పుదీనా, పెరుగుతోటకూర, కొద్దికారము, ఆవునెయ్యి, ఆవుచల్ల, దీపనకరపదార్థములు, అడవిమృగపక్షిమాంసములు.

అపథ్యములు. Non-Dietetics.

పిష్టాన్నము (పిట్టు, ఉప్పుడుపిండి), పిండితోను లేక పాలతోను చేయబడిన పదార్థములు, బెల్లము, జలప్రాంత్య జంతుపక్షిమాంసములు, గురుత్వపదార్థములు, జలుబు లేక దేహపుష్టి జేసెడు పదార్థములు.
శ్వాసరోగమునకు:-పథ్యములు, అపథ్యములు, కాసరోగము చూడుడు.

పథ్యములు. Dietetics.

శ్లేష్మప్రకోపమునకు:—Phlegm Diseases. ప్రాతబియ్యము రాజనములు, అరువదినాళ్ళకుపండు సాంబాబియ్యము, నివాలుధాన్యములు, తృణధాన్యములు, సెనగలు, పెసలు, ఉలవలు, యవలు, తౌరములు, వేడినీళ్ళు, జాంగలమృగపక్షిమాంసములు, ఎండించిన మాంసము నేతిలో వేసినది, పొట్లకాయ, కాకరకాయ, మేడికాయలు, నక్కదోసకాయలు, ఉచ్చింతకాయలు, వాకుడుకాయలు, నేలములక్కాయలు, వీనికూరలు, వరుగులు, బుడమవరుగు, నీరుల్లి, అరటిపువ్వు, కంద, లేతముల్లంగి, తేనె, తాంబూలము, పేలారిన, వేయించిన

బియ్యపుఅన్నము, విసిరిన నూకలజావ, గోధుమనూకజావ, సుఖోష్ణ మైనగృహము, కారము, చేదుగానుండు పదార్థములు.

అపథ్యములు. Non-Dietetics

పగటియందు నిదురించుట, స్నానము, పరస్పరవిరుద్ధములగు పదార్థములను భుజించుట, మినుములు, క్రొత్తబియ్యము, చేపలు, మాంసము, పెరుగు, పాలతో చేయబడిన పదార్థములు, బచ్చలికూర, పనసక్కాయకూర, ఖర్జూరపుపండు, కొబ్బరికాయనీళ్ళు, పాలు, పరమాన్నము, మధుర, ఆమ్ల, లవణరసములుగల పదార్థములు, అజీర్ణకరపదార్థములు, చల్లనినీళ్ళు పుచ్చుకొనుట.

పథ్యములు. Dietetics.

సవాయి,కొరుకురోగములను అనగా వుపదంశరోగములు:—Syphilis. ప్రాతమంచిబియ్యము, యవలు, గోధుమలు, కందిపప్పు, కందికట్టు, బీరకాయ, పొట్లకాయ, లేతమునగకాయ, లేతఅరటికాయ, అరటిపువ్వు, లేతముల్లంగి, పొన్నగంటికూర, కాకరకాయ, మేకమాంసము, అడవిపక్షి, మృగమాంసములు, మేకపాలు, ఆవుపాలు. ఆవుమజ్జిగ, నెయ్యి, కాచిచల్లార్చిననీళ్ళు, పాతచింతపండుచారు, చింతపొట్టుచారు, దానిమ్మపండు, వెలగపండు, బత్తాయిపండు, నారింజపండు, పాతచింత, నిమ్మ, దబ్బ, వుసిరికాయపచ్చళ్ళు, కాచిననీళ్ళు పుచ్చుకొనవలయును.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, ఉలవలు, పులుసు, చేపలు, పెరుగు, బాతు, కోడి, పందిపీనిమాంసములు, నూనె, అవాలు, గుమ్మడికాయ, బచ్చలికూర, మామిడికాయ, స్త్రీసంభోగము, గాలిలో పరుండడము, చల్లనినీళ్ళతో స్నానము, చల్లనినీళ్ళు త్రాగడము.

పథ్యములు. Dietetics.

సెగరోగమునకు:—Gonorrhoea. ప్రాతమంచిబియ్యము, యవలు, గోధుమలు, పేలాలు, కందిపప్పు, పెసరపప్పు, పీనికట్లు ఆవు, గేదె,

పీనిచల్ల, నెయ్యి, పెరుగుతోటకూర, పొన్నగంటికూర, బీరకాయ, పొట్లకాయ, అనబకాయ, నక్కదోసకాయ, బూడిదగుమ్మడికాయ, సొరపుల్లిపాయ, పీనిఆకులు, ముల్లంగిదుంపలు, పీనిఆకులు, లేతమునగ కాయ, చేదుపొట్ల, నేలములకకాయలు, మేసికాయలు, లేతఅరటి కాయ, పల్లేరుఆకు, ఎలుకచెవికూర, శర్కర, కలకండ, కాటికల కండ, కాటిలేతముంజులు, కాటిబెల్లము, మేకమాంసము, జాంగల పక్షిమృగమాంసములు, వెలగపండ్లు, తుమ్మిపండ్లు, పుచ్చపండు, నేరేడుపండ్లు, బత్తాయి, నారింజ, పచ్చిద్రాక్షపండ్లు.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, ఉలవలు, కోయ్యతోటకూర, ఆవ నూనె, గుమ్మడికాయ, బాతు, కోడి, పంది పీనిమాంసములు, మామిడి కాయ, కాకరకాయ, మాతినీళ్ళు, పైత్యము, కాకజేసెడు అన్ని పదార్థములు.

పథ్యములు. Dietetics.

స్వర భేదమునకు:— Hoarseness of the voice. ప్రాత మంచి బియ్యము, మొర్రబియ్యము, యవలు (Barley), అడవికోడి, నెమలి, పీనిమాంసములు, సరస్వతియాకు, పల్లేరుఆకు, కాసరాకు పీనికూరలు, పాలకూర, పొన్నగంటికూర, లేతముల్లంగి, ద్రాక్ష, వెల్లుల్లి, ఉప్పు, అల్లము, తాంబూలము, తేనె, కందిపప్పు, కందికట్టు, ఆవునెయ్యి, ఉష్ణోదకము.

అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, పెసరపప్పు, మజ్జిగ, పెరుగు, పులిగడుగు, కలినీళ్ళు, చల్లనినీళ్లు, మామిడిపండు, పొగడ పండు, వెలగపండు, నారింజపండు, నేరేడుపండు, పగటినిద్ర, విశేష ముగ మాటలాడుట, గాలిలోను, మంచులోను తిరగడము.

## పథ్యములు. Dietetics.

స్వర్ణ భక్షణ సేయుచుండువారికి:— Persons taking gold leave or gold calx. ప్రాతమంచిబియ్యపుఅన్నము, అడవిమృగ, పక్షి మాంసములు. మాంసము వేసి వండినఅన్నము, శర్కరపొంగలి,ఆవు నెయ్యి, శర్కరగలిపిన ఆవుపాలు, ఆవుపెరుగు, బీరకాయ, పొట్ల కాయ, కంద, కందిపప్పు, పెసరపప్పు,పొన్నగంటికూర,పులిచంచలి కూర, కేబేజీ, టొమేటో, బంగాళదుంపలు, మేకమాంసము, మాంసరసము (Soup), లేతకోడిమాంసము, వేపిన మాంసము, మాంసమునకు అల్లము, ఉప్పు, కొద్దిగకారము. యాలక్కాయ, లవంగములు, దాల్చినిచెక్క నూరి, రాసి ఎండించి, కావలసినన్ని ముక్కలు పలచగకొట్టి, నేతిలో వేయించినది, పాతచింతకాయ, నిమ్మకాయ, పుల్లదబ్బకాయ, వెలగపండు పచ్చళ్ళు, అలుబఖారా పళ్ళచారు, నిమ్మపండుచారు, శీకాయఆకుచారు, బత్తాయి, నారింజ రసములలో పంచదారకలిపినది, అరటిపండు, దానిమ్మ, ద్రాక్ష, ఏపిలు మొదలగు పండ్లు.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, ముదురైన బియ్యపుఅన్నము, చలి అన్నము, పులుసు, మత్స్యములు,ఆవ,నూనె,ఆకుకూరలు,వంకాయ, పులిగసుగు, పులిహోరము.

## పథ్యములు, Dietetics.

హృద్రోగమునకు:—Heart disease. ప్రాతమంచిబియ్యము, ఎఱ్ఱ బియ్యము, మేకమాంసము, అడివిమృగపక్షిమాంసములు, వీనిరస ములు, మాంసమునకు అల్లము, ఉప్పు, కొద్దిగకారము, కొద్దిగ ఏలక్కాయలు, లవంగములు, దాల్చినిచెక్క నూరి రాసి ఎండించి,

కావలసినన్ని ముక్కలు పలచగకొట్టి నేతిలో వేయించినది, కందులు, పెసలు, ఉలవలు, వీనికట్లు, బీరకాయ, కేబేజీకూర, టొమాటో, పొట్లకాయ, లేతఅరటికాయ, పొన్నగంటికూర, పెరుగుతోటకూర, మెంతికూర, ఆనబ, దోసకాయలు, ప్రాతగుమ్మడికాయ, మామిడి పండ్లు, దానిమ్మపండు, బత్తాయిపండ్లరసం పంచదార కలిపినది, నారింజపండ్లరసము. కేలఆకుపచ్చడి, లేతముల్లంగి, ద్రాక్షపండ్లు, కాకరకాయలు, మేక, గేదె, గొర్రె వీనిమజ్జిగ, ఆవుపాలు, ఆవు నెయ్యి, ఆవుమజ్జిగలు, ప్రాతబెల్లము, వెల్లుల్లి, అల్లము, పులి గడుగు, మంచితేనె, ద్రాక్షారిష్టము, అర్జునారిష్టము.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, మేకపాలు, పులుసు, పెరుగు, దప్పి, వాంతి, మలమూత్రములు, అపానవాయువు, దగ్గు, త్రేనుపు, వీని నిరోధము, పుల్లతో పండ్లుతోమడము, పొగత్రాగడము, మద్యము, తాంబూలము, ఆవకాయ, ఆకుకూరలు.

## పథ్యములు. Dietetics.

క్షయలకు:—Consumption i. e., Pulmonary Tuberculosis.

పాతమంచిబియ్యము, గోధుమలు, కందులు, పెసలు, శనగలు, వీని పప్పులు, కట్లు, చోడిజావ, మేకమాంసము, మేకవెన్న, నెయ్యి, పాలు, ఆవుపాలు, నెయ్యి, పెరుగు, వెన్న, అడవిమృగపక్షి మాంస ములు, వేసినమాంసము ఎండించి నేతిలోవేసినది, మాంసరసములు. (Soups), మాంసముదిను మృగపక్షిమాంసములు, బీరకాయ, పొట్లకాయ. అరటికాయ, నక్కదోసకాయ, ఆనబకాయ, టొమేటో పండినది, లేతముల్లంగి, పొన్నగంటికూర, పెరుగు తోటకూర, మెంతికూర, పులిచంచలికూర, ఉచ్చింతఆకుకూర, ఉచ్చింత, వాకుడు, నేలములక, దీనికాయలు, కేబేజి, కేరటు

మొదలగు కూరలు, పాత చింతకాయ, నిమ్మకాయ, పుల్లదబ్బకాయ, ఉసిరికాయ, వెలగపండు, వీని పచ్చళ్లు, కొత్తిమీరి, పుదీనా, ఆలుబఖారాపళ్ళచారు, కాయఆకుచారు, వెలగపండ్లు గుంజచారు, ద్రాక్షరసము, అరిష్టములు, ఏపిలు, బత్తాయి, దానిమ్మ, తియ్యనారింజ, మొదలగు పండ్ల మధురరసములు, ద్రాక్షాసవము, ద్రాక్షారిష్టము, అరటి, పనస, మామిడి, ఉసిరిక, ఖర్జూరము, తియ్యదానిమ్మ, ద్రాక్ష, సపోటా, ఏపిలు, బత్తాయి, వీని పండ్లు, సారపప్పు, కొంకాయి, పోగడపండు, పచ్చిద్రాక్షపండు, ఆవు లేక మేకనెయ్యి, ఖండశర్కర, ద్రాక్షాసవము, ఎల్లప్పుడు మేకలమధ్య నివసించుట, మేకమూత్రము, వంటికి బూసుకొనుట, కస్తూరి, పచ్చకర్పూరము, తెల్లనిచందనము, వీని లేపనము సేవించుట, అభ్యంగనము, సుగంధధూపము, పరిమళగంధమును పూసుకొనుట, పరిమళముతో గూడిన స్థలముల (అనగా పుష్పవనము) యందు విహరించుట, పరిమళయుక్తమగు గృహమున నివసించుట, సరస్సులు మున్నగువానియందు స్నానము చేయుట, మేడలయందు నివసించుట, పుష్పమాలికలు ధరించుట, మెల్లగావీచు పరిశుద్ధమైనగాలి, శీతోపచారములు, నాట్యము, వీణాగానమువినుట, వెన్నెలయందు విహరించుట మొదలగునవి.

## అపథ్యములు. Non-Dietetics.

క్రొత్తబియ్యపుఅన్నము, చలిఅన్నము, కర్బుజా, పంపరపనాస, నారింజ మొదలగు శీతలకర పదార్థములు, గొర్రెమాంసము, వెల్లుల్లి, వెదురు మొలకలు, చిక్కనిపులుసు, విస్తారం కారము, ఆవవేసినకూరలు, ఆవకాయ, పెరుగు, దొండకాయ, బెండకాయ, అమితభోజనము, మలమూత్రవేగ నిరోధము, జాగరణము, శ్రమ, తాంబూలము.

**Nota bene.** గమనియ్యాంశములు:— పైన వ్రాయబడినవి ఆయారోగములకు సాధారణపథ్యాపథ్యములయియున్నవి. అయినను

రోగియొక్క బలాబలము, తత్వము, జీర్ణశక్తి, కాలము, రోగికిచ్చుచుండు ఔషధము, మొదలగువాని ననుసరించి పథ్యములు చేయించవలసియుండును, ఎట్లనిన అండవృద్ధిరోగమునకు మేకమాంసము, పెసరకట్టు, మజ్జిగ, స్త్రీసంభోగము మొదలగునవి పథ్యములని వ్రాయబడియున్నవి. అట్లున్నను అట్టిరోగికి జీర్ణశక్తితక్కువగ నున్నయెడల మాంసమిప్పించ కూడదు. జీర్ణశక్తిసాధారణముగ నున్నను రాత్రికాలము వాతము హెచ్చుగనుండుకాల మగుటచే రాత్రిపూట ఆహారముతో మాంస మిప్పింపజనదు. శ్లేష్మము వృద్ధిగ లేక ఉద్రేకముగ నున్నయెడల పెసరకట్టు, మజ్జిగ మొదలగు శ్లేష్మకరపదార్థముల నియ్యగూడదు. బలహీనముగ నున్నయెడల స్త్రీసంభోగము నిషేధించవలయును.

మరియు కుష్ఠు, సెగ, సవాయి, వ్రణము మొదలగు రోగములకు ఉప్పు, పప్పు, మాంసము మొదలగు పదార్థములు పథ్యములుగ నున్నను ఉబ్బువ్యాధికి చల్ల మొదలగునవి అపథ్యములుగనున్నను జ్వరమునకు శీతోదక, నారికేళోదకపానము, స్నానము మొదలగు శైత్యోపచారములు మిక్కిలి అపథ్యములుగనున్నను, ఆయా రోగముల కిచ్చు ఔషధముల ననుసరించి కుష్ఠు, సెగ, సవాయి, వ్రణము మొదలగు రోగములకు ఉప్పులేనిగంజి, ఉప్పులేనిఅన్నము, ఉప్పులేని చల్లఅన్నము, ఉబ్బువ్యాధికి చల్లఅన్నము, జ్వరమునకు శీతోదక నారికేళోదక పానము, స్నానము మొదలగు శైత్యోపచారములు పథ్యములుగ నున్నయెడల నట్టి విశేషపథ్యములనే చేయించవలసి యుండును. అట్లు చేయక యున్నయడల బాధించును.

మరియు నేరోగికైనను ఇత్తడి మొదలగు లోహపాత్రలో వండిన యన్నము మిక్కిలి గురుత్వముగను దోషసహితముగను యుండును గావున దానిని వర్జించుట ఉత్తమోత్తమము.

శ్రీ. శ్రీ. శ్రీ.

—§—

శ్రీ ర స్తు.

# DESCRIPTIONS AND EXPLANATIONS OF DIFFERENT TECHNICAL NAMES OF DISEASES &c., USED IN "VASTUGUNADEEPIKA"



## ఈ గ్రంథమున ఉపయోగింపబడిన వ్యాధులు మొదలగు వాని నామములకుండు గూఢపద వివరము



అంగూరుసిరకా:—**Vine vinegar.** ద్రాక్షపండ్లతో తీసెడుపులుసు.

అండవాతము, అండవృద్ధి:— **Hydrocele or swelling of the testicles.** వృషణములలో నొకటిగాని, రెండుగాని, వాపుగలిగి, పోటు, సలుపుగలిగియుండెడురోగము. మరియు వాతప్రకోపము చేత పొత్తికడుపులో చెడునీరుబుట్టి అది క్రమముగ వృషణముల లోనికి దిగి పెరిగెడు రోగము.

అంతర్దాహము:—**A kind of burning sensation and restlessness.** గర్భములోగలిగెడు వేదన, తాపము.

అంతర్వృద్ధి:—**Hernia.** వాతమును ప్రకోపింపజేయు పదార్థములను భుజించుట, మలమూత్ర వేగమును నిరోధించుట, భారము మోయుట మొదలగు కారణములవలన వాతము ప్రకోపంబై సన్నప్రేగు లలో నొకభాగమును సంకోచింపజేసి తమ నెలవునుండి క్రిందికి వెడలించి గజ్జయందు జేరి గ్రంథిరూపంబైన వాపును గలిగించు రోగము.

అగ్నిమాంద్యము :— **Dyspepsia or want of appetite.** జఠరాగ్ని మందమై ఆకలిలేక యుండుట.

అతిమూత్రము:—**Diabetes.** అనగా బహుమూత్రము. మేహాధిక ముచే మూత్రము విస్తారముగ పొయ్యెడురోగము.

అతిసారము:— Profuse diarrhoea or involuntary motions. అమితముగాను, వికృతిగాను, విరేచనములయ్యెడురోగము.

అనాహము:—Intestinal and other kinds of obstructions (Anaha):—మూత్రపురీషబద్ధమై కడుపుపొంగెడురోగము.

అపస్మారము:— Hysteria or unconsciousness. స్మృతి లేక నోట నురుగు పడుట మొదలగు చిహ్నములుగలరోగము. మరియు స్త్రీలకువచ్చెడు ఒకవిధమైన శాకినోమాల యను మూర్ఛరోగము.

అభిఘాతజ్వరము:—Fever from fatigue or exhaustion from excessive walking or over working, & c. కర్రలు, రాళ్ళు వీటిదెబ్బలు తగులుటచేతగాని, అమితదూరము నడచుట మొదలగు విశేషదేహాప్రయాసకరమగు పనులవలనగాని జనించెడు జ్వరము.

అశ్మరీరోగము:—మూత్రకోశమునందు రాళ్ళుబుట్టుటవలన మూత్రము జాలకష్టముగ వెడలుట.

అస్థిగతజ్వరము:—Simple continued fever. వంటను జీర్ణించి దేహమును క్షీణింపజేయుచుండెడి పురాణజ్వరము.

అసృగ్దము:—Leucorrhoea. కుసుమరోగము ,అనగా యోనివెంట తెల్లగానైనను, ఎర్రగానైనను, పచ్చగానైనను, నల్లగానైనను జిగట గలనీరు స్రవించెడురోగము.

ఆమము:— Collection of mucus of the bowels. భుజించెడు పదార్థములు జీర్ణముగాని కారణంబున గర్భమున జిగురుగలిగి తెల్లగా, బిళ్ళలుగా, ఘనీభవించెడు దుష్టజలము.

ఆమాతిసారము:—Dysentery. ఆమమే విరేచనమయ్యెడు రోగము. దీనినే జిగటవిరేచనము లనియు, ఆమవిరేచనము లనియునందురు.

అర్శరోగము:— Piles. మూలవ్యాధి, అనగా గుదస్థానమున లోపల గాని, వెలుపలగాని మాంసపుమొలకలుజనించి, రక్తము స్రవించుచు గాని, స్రవించకగాని వేదన కలిగించురోగము.

ఆహ్నిక జ్వరము:— Intermittent fever. దినమువిడిచి దినము, మూడుదినముల కొకసారి గాని, నాలుగుదినముల కొకసారిగాని, అప్పుడప్పుడుగాని, కనిపించెడు శీతపైత్యజ్వరము. దీనినే చలిజ్వర మనికూడ నందురు.

ఉదరరోగము:— Abdominal dropsy or Ascites. శరీరము కృశించుట, తెల్లబారుట, కడుపులో దుష్టమైన నీరుచేరి ఉదరము పెరుగుట మొదలగు చిహ్నములుగల రోగము.

ఉదావర్తము:— Intestinal and other kinds of obstructions. మూత్రపురీషము లతికఠినముగ వెడలుట, పొత్తికడుపు, శిశ్నము పీట్లయందు పోట్లుగలిగి యుండుట మొదలగు చిహ్నములుగల రోగము. ఈరోగమున మలము తద్వారమున వెడలుట వీలు లేకున్న నోటివెంట వెలువడగలదు.

ఉన్మాదము:—Insanity or Madness. మతిభ్రమ, అనగాపిచ్చి.

ఉపదంశము:—A syphilitic sore ulceration on the penis. మర్మావయవములయందుగల కొరుకువ్యాధి.

ఉబ్బసదగ్గు:—Asthma. ఇదియు నొకవిధమైన శ్వాసరోగము.

ఊపిరిగొట్టునొప్పి:—Stitching or Catching pain. ఉశ్వాసము విడిచినప్పుడు గుండెలలో నొకప్రక్కను పోటుపొడచినట్లు లేచెడి నొప్పి.

ఎరుగువాతము:—A wind born disease attended with shivering limbs or body. కాళ్ళు చేతులు మొదలగు అవ

యవములుగాని, దేహమంతయుగాని ఎరుగుచుండెడి యొకవిధమగు వాతరోగము.

కంపవాతము:—ఎరుగువాతము చూడుడు.

కరపాణికురుపులు:—Sores or eruptions on arms or legs of children (Rash). బిడ్డలకు కాళ్ళమీదను, చేతులమీదను దట్టముగానయ్యెడు కురుపులు.

కార్జము:—Liver. చాతి (యెదురొమ్ము) యొక్క కుడివైపు ప్రక్కటెముకలకు క్రిందిభాగమున మిక్కిలి మృదువుగా నలుపు, ఎరుపు, మిశ్రవర్ణముగానుండెడి యొకమాంసఖండము; దీనినంటి పిత్తకోశముండును.

కామిలరోగము, కామిర్లు:—A disease characterised by the yellowness of the eyes etc.(jaundice). కండ్లు, శరీరము, ఆకుపచ్చ లేక పసుపుపచ్చ వర్ణముగలిగి తంద్ర, అగ్నిమాంద్యము, దాహము, నీరసము మొదలగు లక్షణములు గలిగినది.

కాయసిద్ధి:—Corporeal perfection. దేహమునకు ముసలితనము రాక దృఢముగా నుండుట.

కార్శ్యరోగము:—Emaciation. దేహమునందుండెడి రక్తమాంసములు క్రమక్రమముగ క్షీణించుచుండెడి యొకరోగము. దీనినే ఎండురోగమందురు.

కాస:—Cough. దగ్గు.

కుసుమరోగము:—అస్రుగ్దరము చూడుడు.

క్రిమిరోగము:—Intestinal worms. గర్భమున క్రిములు జనించెడి రోగము.

గండమాల:—Goitre or Scrofula. మెడ, పెడతలనరము మెడ తొంకులు వీనియందు గ్రంథులుగా బయలువెడలి క్రమముగ పక్వమయి చీము, రసి, స్రవించెడి వ్రణములు.

గర్భస్రావము:—Miscarriage. స్త్రీలు గర్భిణులుగా నున్నప్పుడు హఠాత్తుగా కొన్ని కారణములచే గర్భమువిచ్ఛిత్తగుట.

గర్భాశయము:—Uterus. పిండకోశము.

గ్రంథులు:—Wens. కంతులు లేక గడ్డలు.

గళగ్రహము:—Pharyngitis, in which hoarseness of voice and difficulty in swallowing is felt. స్వరహీనంబై ఆహారాది పదార్థములను సులభముగ కంఠము దిగనివ్వకయుండెడి యొక శ్లేష్మరోగము. దీనినే గళరోగమని యందురు.

గ్రహణి:—Dysentery. కడుపునొప్పి, ఆసనము తీపుగలిగి చీము లేక చీమురక్తము మిశ్రమమై విరేచనములయ్యెడు అతిసారరోగము.

గాయపుసంధి:—Tetanus. కాలి బొటనవ్రేలికిగాని, చేతి బొటనవ్రేలికిగాని గాయముతగిలినప్పుడును, శస్త్ర చికిత్సలయందు దుష్టక్రిమిప్రవేశించుటచేతను మెడకొంకులు కుంచుకునిపోవుట మొదలగు లక్షణములుగల ఒకవిధమైన సంధి.

గాలిబిళ్ళలు:—Mumps. చెవులకు క్రిందుగా వాపు, పోటుతోను లేచెడు బిళ్ళలు.

గురదాలు, గుండెకాయ:—Kidneys. వీటిని ఉలవకాయలని అందురు. ఇవి నడుమునకు సమముగ లోపల వెన్నునంటియుండెడు మాంసగ్రంథులు. వీనివలన మూత్రముజనించును.

గుల్మము:—Abdominal or other internal tumours. వాత పిత్త శ్లేష్మముల దుష్టస్థితివలన గర్భమున జనించెడు ద్రవకూటమి.

గుల్మోదరము :— A kind of abdominal dropsy. గుల్మము పెరుగుటవలన గలిగెడు ఉదరరోగము.

ఛర్దిరోగము:-Vomitting or tendency to vomit. వమనరోగము.

చర్మరోగము:—Skin disease. గజ్జి, చిడుము, పొక్కులు, తామర, కుష్ఠు మొదలగు రోగములు.

చిట్లఫిరంగి:— A severe kind of Syphilis. దేహమున నల్లగ, స్ఫోటకపు పొక్కులవలె బయలుదేరెడి సవాయిరోగము.

చిత్తభ్రమ:—ఉన్మాదము చూడుడు.

జంగమవిషము:—స్థావరజంగమ విషములు చూడుడు.

జఠరదీప్తి:— Good appetite with proper digestion. ఆకలి, జీర్ణశక్తి కలిగియుండుట.

జఠరాగ్ని:—Digestive fire. భుజించిన పదార్థములను జీర్ణింపజేసి ఆకలిని బుట్టించెడురసము. ఇది పిత్తకోశమున జనించును.

జలోదరము:—Abdominal dropsy or Ascitis. గర్భమునఅమితముగ విషపునీరు పెరిగెడు రోగము.

జ్వరాతిసారము:—Fever with diarrhoea. జ్వరముతో గూడిన అతిసారరోగము.

జిహ్వాదోషము:—Tongue disease. నాలుక ద్రవహీనమైన ముండ్ల వలె గరుకుగలిగియున్నందున యేవస్తువును రుచింపకుండుట.

తెల్లపబ్బ:—Lungs. శ్వాసకోశము లేక ఊపిరితిత్తులు. ఇవి హృదయ కోశమునుండి వీపువైపున రెక్కగూండ్లకు క్రిందిభాగమునందును.

తృతీయకజ్వరము:—Tertian fever. మూడుదినముల కొకసారి కనుపించెడి చలిజ్వరము.

త్రిదోషములు:—The three faults (wind, bile and phlegm). వాత, పిత్త, శ్లేష్మముల అసామ్యస్థితి.

ధారాగృహము:—A house containing artificial springs or jets of water. వర్షధారలుగా నీటిని పడునట్లు చేసెడు యంత్రముగల యిల్లు.

నల్లదబ్బ:—Spleen. ఎడమప్రక్క పెముకల క్రింది భాగమున నుండు నల్లని అవయవము.

నాడీవ్రణము:—Guinea worm. నారికురుపులు. వీనినుండి తెల్లని ధారమువలె నారి బయలువెడలెడి యొకవిధమైన కురుపు.

పరిణామశూల :— Gastritis i.e. colic that comes at the time of digestion. ఆహారము జీర్ణమునకు వచ్చెడు తరుణమందు జనించెడు శూల.

పలలమేహము:—A urinary disease in which the urine contains particles of fleshy matter, &c. ఛిద్రమయిన మాంసమువలె మూత్రము వెంట పడెడురోగము.

పక్షవాతము:—Paralysis. శరీరముయొక్క యొకభాగము అనగా నొకవైపు చెయ్యి, కాలు, వీనికివ్యాపించి వీనినరముల సత్తువ లేకుండ జేయు రోగము.

పాండురోగము:— Anaemia. దేహమున రక్తముతక్కువయి తెల్లబారి, ముఖము, కనురెప్పలు, పాదములు, గుహ్యస్థలము వీనియందు వాపుగలిగి యుండెడురోగము.

పిటికామేహము:—A kind of syphilis. దేహమంతట మట్టిపొక్కులుగా లేచెడి మేహరోగము.

పీనస:—Ozoena. ముక్కువెంట దుర్గంధముతో చీము, రక్తము వెడలెడి యొకవిధముగురోగము.

ప్లీహరోగము,—Enlargement of spleen. కడుపులోనిబల్ల పెరిగెడు రోగము,

పుట్టవ్రణము:—Cancer. సెలలువేసెడు మానని మొండివ్రణము.

పురాణజ్వరము;—Chronic fever. చిరకాలముగ నుండి దేహమున జీర్ణించి కనిపించుచుండెడి జ్వరము.

పొట్ట:—Stomach. ఆహారకోశము.

ప్రదరము:—Leucorrhoea. కుసుమయనెడి యోనిరోగము.

ప్రమేహము:—Gonorrhoea సెగరోగము.

బాలపాపచిన్నెలు:—Convulsions of children. శిశువులకు, 12 సంవత్సరములకు లోపున అకస్మాత్తుగ మూర్ఛవలె కనిపించెడి వాతశ్లేష్మరోగము అనగా ఆక్షేపక వాతము.

బృహత్తు:—Hydrocele. బుడ్డ; అండవృద్ధి చూడుడు.

భగందరము:—Fistula-in-ano. అండత్రయములకు దిగువను, గుదస్థానమునకు పైన చిన్నకురుపువలె లేచి అదిపగిలి అందువెంట రసి, చీము, రక్తము స్రవించెడురోగము.

మండలకుష్ఠు:—A kind of leprosy. పొడలు పొడలుగా లేచెడు కుష్ఠురోగము.

మదాత్యయము:—The disease caused by over drinking. అతిమద్యపానమువలన జనించెడు రోగము.

మహోదరము:—A severe kind of abdominal dropsy or severe ascitis.మిక్కిలి దుష్టస్థితినుండెడి ఉదరరోగము.

మధుమేహము:—The diabetes in which the urine would be like honey or sugar complaint. మూత్రము కొంచెము చిక్కని తేనెవలె వెడలెడు మేహరోగము.అనగా మూత్రమునందు పంచదారవంటి పదార్థముపోవుట, ఈమూత్రమునకు చీమలు పట్టును.

మరిడీజాడ్యము:—Cholera. కలరా లేక వాంతిభేది.

ముంతగుండె:—Heart. హృదయము. రక్తము జనించెడి స్థానము, ఇదియె సమస్త రక్తనాడులకును మూలము.

ముఖరోగములు:—Diseases of the mouth. నోటియందు బుట్టెడి రోగములు,

మూత్రాశ్మరి:— Calculi or gravel in the bladder. మూత్రపు సంచిలో రాళ్ళుపుట్టెడు రోగము.

మూత్రఘాతము:—Retention of urine. Drysuria అనగా మూత్రము బంధించుట మలమూత్ర శుక్లములు, వికృతినిబొంది పొత్తికడుపున చేరియుండుటవలన మూత్రనిరోధముకలిగి అందు వలన మూత్రం బతికష్టంబుగ బయలు వెడలెడు మేహరోగము.

మూత్రకృచ్ఛ్రము:—Stranguary. మూత్రము బొట్టు బొట్టుగ, వ్యధతోఁగూడిపడెడు రోగము. ఈరోగికి శుక్లము, మూత్రముతో పడిపోవును.

మూలవ్యాధి:—Piles. అర్శరోగము చూడుడు.

మేఘరంజి:—A kind of asthma. నీటితోఁగూడిన మేఘము ఆకాశమునగప్పినప్పుడు లేచెడు కఠినమగు శ్వాసతోఁగూడినఉబ్బసరోగము

మేదస్సు:—Fat. క్రొవ్వు.

యక్ష్మరోగము:—Consumption. క్షయరోగము. ఈరోగమునకు ముఖ్యముగ కాస, శ్వాసలు, కఫము, జ్వరము, దేహము శుష్కించుట, నీరసము, అరుచి, అగ్నిమాంద్యము గలిగియుండును.

రక్తపైత్యము:—Haemorrhage or flowing of blood from nostrils, Mouth &c. ముక్కువెంటగాని, నోటివెంటగాని, అకస్మాత్తుగ రక్తము ప్రవహించెడురోగము.

రక్తవాతము:—Reddish scabs or patches on the skin. అనగా వాతరక్తము, రక్తము సహజముగ ప్రవహింపక దేహమునయేభాగమందయినకూడి వాపు, యెఱుపు, పోటుగలిగియుండుట మొదలగు బాధలుగల యొకవిధమగురోగము.

రక్తాతిసారము:— Dysentery or blood motions. రక్తవిరేచనములు.

రాజయక్ష్మ:—Consumption. క్షయరోగము.

రుధ్రవాతము:—Apoplexy. అధాత్తుగా మూర్ఛరోగమువలె స్మారకములేక పడిపోవుట, నోటివెంటనురుగువెడలుట, అంగవైకల్యము ఇట్టి లక్షణములుగలిగిన దారుణమగు వాతరోగము.

రేచనపాచనదీపనకారులు:- Purging, digestive and appetising articles. విరేచనమును, జీర్ణమును, ఆకలిని గలిగించునవి.

రేజీకటి:-Night blindness. రాత్రివేళ దృష్టి తక్కువయ్యెడి రోగము.

లాతము:— An obstinate ulcer that rises close to the eye. కంటికొలికిదగ్గర పుట్టెడు వ్రణము.

వంధ్యాదోషము :— Sterility or barrenness. గొడ్రాలితనము.

వలీఫలితము :—Wrinkles in the skin and gray hair in young age. బాల్యయౌవనములయందే శరీరము ముడతలుపడుట, వెండ్రుకలు నెరయుట.

విదాహము:—Inordinate thirst. అతిదాహము.

విద్రధి:—Internal tumour or abscess. గర్భములోబుట్టి నాభిలోవెడలెడి యొకవ్రణము.

విషజ్వరము:—Malignant fever. ఒకప్పు డుష్ణమధికముగ నుండి మరియొకప్పు డుష్ణములేకుండ కాలనియమములేక వికృతిగ గనుపించెడి జ్వరము.

విషూచి:—Cholera. మరిడిజాడ్యము లేక వాంతిభేది.

విసర్పి:—Herpes. ఎర్రగగాని, తెల్లగగాని పొక్కులు ఒకచోట గుంపుగ లేచి వ్యథతోగూడిన చర్మరోగము. దీనిని నేసర్పియనియందురు.

శ్వాస:—Difficulty of breathing. ఊపిరి అతికష్టముగ యెక్కువ విడుచుట అనగా వగర్పు.

శిల్పకుష్టు:—A kind of Leprosy. రాళ్ళవలె గరుకుగా గ్రంథులు లేచెడి కుష్ఠురోగము.

శ్లీపదము:—Elephantiasis. ఏనుగకాలురోగము.

శుక్ల వాతము :— Unhealthy condition of semen. శుక్లముపడిపోయి క్షీణించెడిరోగము.

శూల:—Spasmodic colic. కడుపులోగాని, ప్రక్కలోగాని అథాత్తుగావచ్చెడు కఠినమైననొప్పి.

శ్వేతము, శ్వేతకుష్టు:—Leucoderma. తెల్లనిమచ్చలు బయలుదేరి వ్యాపించెడు కుష్ఠురోగము. దీనినే బొల్లియందురు.

శోష:— Fainting from starvation or exhaustion. ఆహారము పుచ్చుకొనకుండుటచేగాని, దేహమును అధికముగ ఆయాస పెట్టుటచేగాని సొమ్మసిల్లుట.

సంగ్రహణి:—Severe dysentery- విషమస్థితినున్న గ్రహణిరోగము.

సన్నిపాతము:— Fever attended with delirium. జ్వరము కలిగియున్నప్పుడు వాతపిత్తశ్లేష్మముల ప్రకోపమువలన కలిగెడు వికృతస్థితి. దీనినే జన్నిరోగమని, సంధిరోగమని యందురు.

సర్పి:—Herpes. విసర్పి చూడుడు.

స్వరభంగ రోగము:— Hoarseness of voice. స్వరము క్షీణించిపోయెడు రోగము లేక గొంతు బొంగురుబారి స్వరము పలకని రోగము.

స్థావర, జంగమవిషములు:—Poisons of Minerals, Vegetables, reptile, dog, fox &c. పాషాణము, మణిశిల, హైలతుత్థము, గంధకము మొదలగు ఖనిజములును, నాభి, పొత్తిదుంప, గన్నేరు

పప్పు, వేరు మొదలగు మూలికలను, స్థావరవిషము లనియు; పాము, తేలు, నక్క, కుక్క మొదలగు క్రూరజంతువుల విషములు, జంగమవిషములనియు చెప్పబడును.

సిరకా:—Vinegar. కల్లు ఊరబెట్టి తీసెడు పులుసు.

స్మృతి:—Consciousness. తెలివి, స్పృహ.

హలీమకము:—An obstinate kind of jaundice. దారుణమగు కామిలరోగము.

హిక్మ:—Stitching or catching pain. ఊపిరిగొట్టునొప్పి చూడుడు.

హృచ్ఛూల:—Heart pain. ముంతగుండెలో పోటు.

హృద్రోగము:— Heart disease. ముంతగుండె యందు పుట్టెడి రోగము

క్షయరోగము:— Consumption. యక్ష్మరోగము చూడుడు.



శ్రీరస్తు.

# PRESCRIPTIONS OF DIGESTIVE MEDICINES.

## జీర్ణౌషధములు.



1. పిప్పళ్ళజవారిషు:—పిప్పళ్ళచూర్ణము 1 తులమెత్తు, 6 తులముల యెత్తు పంచదార పాకముబట్టి అందులో పిప్పళ్ళచూర్ణము వేసి కలిపి దింపి, పూటకు అరతులమెత్తు పుచ్చుకొనిన వాతమును అణచును; అన్నమును జీర్ణముజేయును; పొట్టకును, ధాతువులకును బలమిచ్చును; పొట్టలోని శీతలమును పోగొట్టును.

2. శొంఠిజవారిషు:—శొంఠి నిమ్మపండ్లరసములో మూడురోజులునాన బెట్టి యెండించినదిగాని, సాదాశొంఠిగాని చూర్ణముజేసినది 1తులము, 6 తులములయెత్తు పంచదార పాకముబట్టి అందులో పైచూర్ణ మును గలిపి దింపి పూటకు అరతులమెత్తు పుచ్చుకొనిన వాతమును, వాతపునొప్పులను హరించును; అన్నము జీర్ణముజేయును.

3. అల్లపుజవారిషు:—3 తులములయెత్తు అల్లమును మెత్తగా నూరి 6 తులములయెత్తు పంచదార పాకముబట్టి అందులోగలిపి పూటకు ½ తులము చొప్పున పుచ్చుకొనిన వాతమును, వాతపునొప్పులను హరించును; అన్నమును జీర్ణముజేయును; పరాకుగుణమును పోగొట్టును; పొట్టయొక్కయు, శార్జముయొక్కయు శీతలమును గొట్టును.

4. సాంబ్రాణిజవారిషు:—గవ్వపలుకు సాంబ్రాణి అరతుల మెత్తు చూర్ణముజేసి 5 తులములయెత్తు పంచదార పాకముబట్టి అందులో గలిపి దింపి పూటకు ½ తులము చొప్పున పుచ్చుకొనిన పొట్టకు బలమిచ్చును; జీర్ణముజేయును. పులుపుగా నుండగోరిన తగు మాత్రము నిమ్మపండ్లరసము చేర్చుకొనవచ్చును.

5. సీమసోపుజవారిషు:—సీమసోపు సిరకాలో నానబెట్టి నీడను ఎండించి కొద్దిగా వేసి చూర్ణము చేసినది 2 తులములు, 12 తులముల యెత్తు తేనె పాకముబట్టి అందులో గలిపి దింపి పూటకు 1 లేక 2 తుల ములు పుచ్చుకొనిన పొట్టకు బలమిచ్చును; జీర్ణము జేయును; ఆకలి బుట్టించును; జిగటవిరేచనములను కట్టును; కడుపునొప్పి, కడుపుబ్బు, వాతము వీనిని హరించును.

6. అల్లపు సికింజబీను:—అల్లపురసము అర్ధసేరు, చీనాపంచదార అర్ధ సేరు, తేనె అర్ధసేరు, అంగూరుసిరకా పావుసేరు, పన్నీరు పావుసేరు కలిపి తేనె పాకమువలె పాకము వచ్చువరకు కాచి దించునది. దీని గుణములు అన్నమును జీర్ణము జేయును; ఆకలిని బుట్టించును; పైత్య మునణచును; జఠరాగ్నిని వృద్ధిబొందించును; గుండెలలోని మంట నణచును. మఱియు నీయౌషధములో తిప్పసత్తు రెండు తులములు కలిపి వండిన పైత్యజ్వరమును హరించును. మోతాదు పావుతులము మొదలు తులమువఱకు నియ్యవచ్చును.

7. అగ్నికుమారరసము:-శుద్ధిచేసిన నాభి, వెలిగారము, వంగభస్మము, శంఖభస్మము, త్రికటుకములు, ఇవి సమభాగములుగ గూర్చి ఖల్వముననుంచి తమలపాకుల రసముతో నొకరోజు మర్దించి గుంజ ప్రమాణముగా మాత్రలు చేసి భోజనమైన తరువాత అవసరము కొలది నొకటి లేక రెండు మాత్రలు పుచ్చుకొనిన సర్వాజీర్ణములు మానును.

8. భుక్తపాకవటుకలు;—లవంగాలు, కాయఫలచెక్క, కోష్టు, ఏలకులు, జాజికాయ, త్రికటుకములు, దాల్చినిచెక్క, ఆకుపత్రికము, రస సింధూరము, యష్టిమధుకము, అభ్రకము, ఇవి సమభాగములుగ గూర్చి తమలపాకుల రసముతో నొకదినము మర్దించి గుంజప్రమా ణముగ మాత్రలుచేసి భోజనమైనతరువాత లవంగముల చూర్ణము తోగాని, కషాయముతోగాని, వేడినీళ్ళతోగాని నొకటి లేక

రెండు మాత్రలుగాని పుచ్చుకొనిన సమస్త అజీర్ణములు మానును.

9. మహాభుక్తపాకము:—శుద్ధిచేసిన హేమమాక్షికము, పాదరసము, గంధకము, మణిశిల, తెల్లతెగడ, కరక్కాయలు, చిత్రమూలము, నేలదింతిన, యవక్షారము, ఇంగువ, తాళకము, పిప్పళ్ళు, మిరియాలు, అజామోదము, జాజికాయ, కటుకరోహిణి, నల్లజీలకర్ర, కణపచెట్టు వేరుచెక్క లేక మానుచెక్క, ఓమము, సైంధవలవణము, ఇవి యొక్కొక్కవంతు, శొంఠి యెనిమిదివంతులు ఇవి ఖల్వములో వేసి అల్లపురసముతోను, వావిలాకు రసముతో, సూర్యకాంత (ప్రొద్దుదిరుగుడుచెట్టు) ఆకురసముతోను వేరువేరుగా రెండేసి జాములు మర్దించి గుంజప్రమాణము మాత్రలుచేసి లవంగాల చూర్ణముతోగాని, కషాయముతోగాని, వేడినీళ్ళతోగాని యొక మాత్ర పుచ్చుకొనిన సర్వాజీర్ణములు మానును.

10. అజీర్ణకంటకము:—శుద్ధిజేసిన పాదరసము, గంధకము, లోహము, త్రికటుకములు, చిత్రమూలము, నాభి, త్రిఫలములు, చెవ్యము, పిప్పలిదుంప, ఇంగువ, వాకుడుగింజలు, గవ్వభస్మము, ఇవి సమభాగములు చూర్ణముచేసి ఖల్వములోనుంచి వేపాకురసముతో మూడుదినములు, అల్లపురసముతో నొకదినము, చిత్రమూల కషాయముతో నొకదినము, వెలిగారపునీళ్ళతో నొకదినము, ఇంగువ నీళ్ళతో నొకదినము మర్దించి మిరియప్రమాణముగ మాత్రలుచేసి ఒకమాత్ర పుచ్చుకొనిన సమస్త అజీర్ణములు మానును.

11. ద్రాక్షలేహ్యము:—కిసిమిసి లేక ద్రాక్షపండ్లు, పంచదార, తేనె, ఇవి సమభాగములు గలిపి పుచ్చుకొనిన సమస్త అజీర్ణములు హరించును.

12. మహాశంఖవటి:—శుద్ధిచేసిననాభి 1 భాగము, వెలిగారము (పొంగించినది) 3 భాగములు, మిరియాలు 12 భాగములు వీని

కన్నిటిని చూర్ణించిన చూర్ణముగాని లేక తములపాకురసములో రెండుఝాములు మర్దించి గుంజప్రమాణము మాత్రలుజేసి నీడను ఆరబెట్టి వేడినీళ్ళతోగాని ఓమపురసముతోగాని పూటకు రెండు మాత్రలచొప్పున సేవించిన అగ్నిదీప్తి నిచ్చుటయేగాక కఫవాతములను హరింపజేయును; సమస్తఅజీర్ణములను పోగొట్టును. చూర్ణపు మోతాదు 1-2 అణాలయెత్తు.

13. అజీర్ణకంటకరసము:—శుద్ధిచేసిన పాదరసము, నాభి, గంధకము, ఇవి సమభాగములు, ఈమూటికి సమము మిరియాలచూర్ణము చేర్చి నేలములక పండ్లరసముచే 21 మార్లు భావనలుచేసి బండిగురివింద గింజలవలె మాత్రలుచేసి వేడినీళ్ళతో 1 మాత్రపుచ్చుకొనిన అజీర్ణము, వాతము వీనిని హరించును; వెంటనే ఆకలి బుట్టించును.

14. అజీర్ణహర చూర్ణము:—కరక్కాయలు, పిప్పళ్ళు, సౌవర్చలవణము, ఇవి సమభాగములుగ చూర్ణముచేసి పెరుగుమీది నీళ్ళతోగాని వేడినీళ్ళతోగాని పుచ్చుకొనిన అజీర్ణము, అరుచి, కడుపుబ్బు, వాతగుల్మము, శూల, మందాగ్ని మానును.

15. భుక్తపాకచూర్ణము:—సైంధవలవణము, కరక్కాయ, పిప్పళ్ళు, ఓమము, శొంఠి, యివి సమభాగములుగ చూర్ణముజేసి వేడినీళ్ళతో పుచ్చుకొనిన అజీర్ణము, అగ్నిమాంద్యము నశించును. నెయ్యి, మాంసములతో కలిసిన ఆహారమునుగాని పిండివంటలనుగాని యెక్కువగ పుచ్చుకొనిన అతిశీఘ్రముగ జీర్ణముజేయును.

16. మహాగ్నిముఖ చూర్ణము:—చిత్రమూలము, అతివస, చంగల్వకోష్టు, ఇంగువ, (పొంగించినది), సౌవర్చలవణము, వస, పిప్పళ్ళు, కాయఫలచెక్క, గంటుభారంగి, ఓమము, శొంఠి, మిరియాలు, యవక్షారము, పిప్పలికట్టె, వాయువిడంగములు, ఇవి సమభాగములు, వీనియన్నిటికిని సమము కరక్కాయచూర్ణము చేర్చి రోగియొక్క బలమునుబట్టి, 1-2 అణాలయెత్తువరకు పుచ్చుకొనవచ్చును. శొంఠి

రసముతోగాని, కషాయముతోగాని, వేడినీళ్ళతోగాని, గంజితో గాని, చిట్టుకుకునీళ్ళతోగాని, పుచ్చుకొనిన అజీర్ణము, అనాహము, ఉదావర్తము, మూలవ్యాధి, గ్రహణీదోషము, హిక్క, శ్వాస, కాస, పాండురోగము, హృదయము, నేత్రములు, కడుపు వీని యందు బుట్టిన మహాదోషములు, నాభిశూల, కుక్షిశూల ఇవి మానును. మరియు మిక్కిలి జఠరదీప్తి కలుగును. గురుత్వపదార్థ ములు, చమురుగలిగిన పదార్థములు, క్రొవ్వుగల పదార్థములు, అపరిశుద్ధపదార్థములు వీనిని విశేషముగా పుచ్చుకొనినప్పుడుగాని, అనేకపదార్థములు ఏకకాలమందు పుచ్చుకొనుట సంభవించినగాని, అమితభోజనముచేయుట తటస్థించినగాని యీచూర్ణము పైనచెప్పిన విధమున పుచ్చుకొనినతోడనే జీర్ణమగును. మరిడిజాడ్యము (Cholera) లో మిక్కిలి పనిచేయును.

17. రామబాణరసము:-రసము, గంధకము, నాభి, లవంగములు ఇవి ఒక్కొక్కభాగము, మిరియాలు రెండుభాగములు, జాజికాయ అర భాగము వీనిని చింతపండు పులుసుతో బాగుగమర్దించి శనగగింజల వలె మాత్రలుజేసి తగినఅనుపానములతో సేవించిన అగ్నిమాం మాంద్యము, అజీర్ణమును హరించుటయేగాక గ్రహణి,ఆమవాతము కఫము, ఉబ్బసము, దగ్గు, వాంతి వీనిని నివారణ జేయును.

18. మరియు క్రవ్యాది, మహాక్రవ్యాది యీరెండు ఔషధములును సమస్త అజీర్ణములను హరించును.

సంపూర్ణము.

# INDEX

## OF THE SANSKRIT NAMES GIVEN TO THE DRUGS, MEDICINAL PLANTS &c., WITH THEIR TELUGU EQUIVALENTS,

## ఈ గ్రంథములోని మందుదినుసులు, మూలికలు మొదలగు వాని కియ్యబడిన సంస్కృత నామములును, వానికి సరియైన తెలుగు నామములును దెలుపు సూచిక.

సం=సంస్కృతము. తె=తెలుగు. పు=పుట.

# INDEX

INDEX

66]

# INDEX

# INDEX

## OF THE HINDI NAMES GIVEN TO THE DRUGS, MEDICINAL PLANTS &c, WITH THEIR TELUGU EQUIVALENTS.

---

ఈ గ్రంథములోని మందుదినుసులు, మూలికలు మొదలగు వానికియ్యబడిన హిందీనామములును, వానికిసరియైన తెనుగు నామములును తెలుపు సూచిక.

హిం=హిందీ, తె=తెనుగు, పు=పుట.

INDEX

# INDEX